శ్రీమతే రామానుజాయ నమః.

## కృతిప్రశంస.

శ్లో॥ (౧) అస్తి విచిత్రం వస్తు బ్రహ్మాఖ్యం భక్తవిజయసచ్ఛాస్త్రే ।
తదవేత్త్యభక్తవర్గ్యో । ధనాలయకులజాతదేవరాజసుధీః ॥

(౨) మృదువ్యాఖ్యానీయ గిరా తత్ । సంవిరచయ్య ప్రకృష్టపద్యానాం ।
మితయాంధ్రభాషయా భువి చకార విశదం సతాం ప్రీత్యై ॥

(3) వితథఫలం విలోక్య । ద్రావిడరామానుజార్యతనుజోఽహమ్ ।
శ్రీరాజమన్నారుకుడివాసీ । శేషవచో లిఖామి మిలితమ్ ॥

(౪) భువి బహుభేదం శాస్త్రం । విస్మయజనకం తథాపి సచ్ఛ్రుతైః ।
సద్గేయైస్త్రిస్థైస్సత్త్వం తోషార్థమురచయిత్వాను ॥

(౫) అష్టద్రావిడసంస్కృత । భాషాసమ్మితసుశాస్త్రబోధచణః ।
అనుపమశమదమగుణగణనిలయస్సుష్ఠుకోదిదం గ్రంథమ్ ॥

(౬) జగతి పరే ప్రకాశితమపి ముద్రాముద్రితం బుధప్రీత్యై ।
ఏతత్తద్వ్యసనస్త సంప్రేష్యాత్యక్తముత్సరాస్సరసాః ॥

(౭) తేషాం హృదయే స్ఫురతి ప్రఫుల్లపద్మస్థమనుసమం సూనమ్ ।
ఇతి మన్నారుకుడివాసీ । తాపిత వేష్యాస్వామియాచార్యః ॥

(౮) తద్భువిలోకే ప్రథితం ముద్రణకరణాయ వోచయామి ముదా ।
ఇహమాచంద్రాదిత్యం । భువి బుధహృదయేషు భాసతాం శుభదమ్ ॥

భక్తవిజయగ్రంథ అవతారికాయాం కోయిల్ ధనాల-దేవరాజదాసవర్యేణ సదాచార్యకృపాలబ్ధజ్ఞానేన సకలజనానాం అద్వేషాభిముఖ్యతయా తత్తద్దేవతా గురుమంత్రానుసంధానేన కృతార్థతాం కర్తుం పరమవ్యామనోపాసనభూతాయాం సకలవేదవేదాంతస్మృతిపురాణేతిహాసానాం అవిరోధత్వేనస్థితేః సంశయాభావేన ఆసేతుహిమాచలాంతర్వర్తి సకలార్య పరిగృహీతత్వాద్విద్వజ్జనాహ్లాదకరత్వేపి పురోభాగిపక్షాంగతమకవిజన నిందితయా సదోషపదాభాసత్వేపి సారాసార వివేకచతురైః క్షీరనీరవిభాగచణమరాళప్రాయైః సుక్షైస్సర్వక్షైర్వ్యాప్తమైః అత్యాదరణభూతేన పరిగృహీతాయాం సత్యాం పరబ్రహ్మణః ॥ నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా, తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః । సబ్రహ్మా సశివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్ ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా, ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోర్నమః, అంతశ్చరతి భూతేషు । గుహాయాం విశ్వమూర్తిషు । త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మ త్వం ప్రజాపతిః ॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే, సహస్రపాదాక్షిశిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే। సహస్రకోటీయుగధారిణే నమః ॥ ఇత్యాదిప్రమాణశతైః నామరూపానేకత్వేపి తత్తదుపాసకానాం తత్తన్నామరూపేషు యథారుచ్యా ఉపాసితుం యోగ్యతాసిద్ధ్యతీత్యేతస్యాం ముఖ్యాభిప్రాయః ॥ అస్మిన్నర్థే బౌత్తరీయగోదావరీసామీప్యవర్తి - కొరుట్లాఖ్యగ్రామనివాసినాం కలకుంట్ల - నృసింహాచార్యాణాం సమ్మతిః.

# OPINIONS.

TRICHINOPOLY HERALD,

The lives of the devotees contained in the Baktavijayam are noteworthy and at the same time interesting and lively to the readers. An Avathrika (*i. e.* Introduction) is published along with the book by the author, Kovil Devaraja Daser, of Madras, now residing at Streerungum. In this paper are embodied all the objects and reasons and genuine authorities relating to uniting the various opinions cherished by these believing in the existence of God. Many religious teachers spoke much of their own opinions and condemned those of others. As every disciple has acted up to the advice of his Guru it appears to be the fashion of the modern theists to speak ill of each other. Consequently the fraternal feelings relating to man appear to have been naturally forgotten. The endeavour that has from time to time been made generally, having failed to discover the communing principle of all, even some of those who understand this matter, were obliged to keep quiet. Others expressed their views only to a few of confidendial character. But the author has deemed it proper to express his views publicly in the form of a pamphlet "containing Much in little." So the learned are expected to set aside their private quarrels about the religious principles discussed here. They will, we believe, have no doubt to pronounce the sentiments thus expressed to be nothing but truth.

We have to draw the attention of the rich and the educated gentlemen of the country to freely make known their opinions on the pamphlet by holding public meetings and by widely circulating their views through the public press, and, if possible to arrange for translating the same in some other language or languages such as the English, the Hindustani, the Persian, the Chinese &c., with the wiew of proving themselves highly useful to the world at large. As for the style of the author, it may be mentioned that it is neat, elegant, simple, and

at the same time being pregnant with deep meanings. We wish that the treatise may prosper keeping up the name of the author together with those already written and published by him.

---

Bakthavijayam appears to be a remarkable book. The accounts given in it regarding those who aimed at the saint's path, bear relationship to the great laws of occult philosophy and illustrate each and every one of the hidden truths throwing light upon the fundamental doctrine of Universal Brotherhood, based upon the comprehensive subject of Jeevakaruniam (Love of all souls) in which Rishis of old appeared to take great interest. The Avatharikai by Davarajathaser of Srirangam is to be viewed as a valuable ornament prefaced to the work. Its peculiar character seems to be forming a sort of key to understand the mystic expressions of Paratvam ascribed to Vishnu and Siva in Puranic and other treatises. Occulists will feel great pleasure in reading the Avatharikai agreeing with what the sages have said that Vedic truths will never contradict each other.

H. M. WINFRED,
TRICHINOPOLY. *Dy. Inspector of Girls' Schools,*
*Central Range.*

---

It is excellent. It represents my views and contains more which escaped my perception. I am writing a pamphlet in Tamil prose which must be taken as a continuation of Sreeman Devaraja Daser's. He handles the subject decently and liberally as he is more advanced in Spirituality. In support of Sri Devaraja Daser's views, I want to point out some quotations from திருவாய்மொழி &c., (Sacred Hymns) and to discuss the subject in my own way to satisfy the mass and the educated Vishnuvites in my pamphlet.

OOTY. PUNDIT, T. VENKATARAMA IYENGAR,

---

The book is very instructive and interesting reading and will, it is hoped, do much towards the amelioration of the people who have not had a thought on their future. To those who

have no faith in the other world, the book will serve, at least, as a spiritual novel. The Avatharikai is a most fitting preface to the book and a very able production tending to promote toleration of religion. The matter is very admirably discussed and the reasons adduced are so cogent that the conclusions arrived at cannot but be accepted by all religionists. Its birth is a happy incident in the order of the day, and there is reason to believe that the pamphlet will, in the end, be found a strong auxiliary to the efforts already made towards the unity of the Indian Nation. Considering its importance I would interchange the prices of the two.

S. PANCHAPAGESA AIYAR, B. A.,
STREERUNGUM. *Manager, District Board Office,*
*Trichinopoly.*

---

The publication of Baktha Vijayam marks an epoch in the literature. The selection of pieces has been very judiciously made and well adapted to enliven the minds of all Hindus.

In the Avatharikai which forms a valuable preface to the work, a very noble effort is made by the learned author to disabuse the Hindu mind of sectarian views and inculcate the doctrine of *Universal Brotherhood.* It behoves, therefore, every intelligent and right thinking patriot of India, especially in this age of religious revival, to encourage the publication and dissemination of the work.

D. J. WINFRED, B. A.,
*Asst. Lecturer, College, Kumbaconum.*

The Avatharikai is a neatly got up Pamphlet expressing the solution of a grand subject in a small space. The author has put an interpretation well based where all sectarians can meet and shake hands without prejudices. It will stand a monument of the real knowledge possessed by its worthy author and an effective antide (అజ్ఞానాంధకారమునకు) for the ignorant blind.

A. K. PATTABHIRAMA CHETTY,
TIRUPATHI. *Sub-Registrar.*



శ్రీమతే రామానుజాయ నమః.

# సత్యప్రకాశిక.

పురాణసముచ్చయే.

శ్లో॥ అధీత్యాపి చతుర్వేదం । సర్వశాస్త్రాణ్యనేకశః ।
బ్రహ్మతత్త్వం న జానాతి । దర్వీ పాకరసం యథా ॥

నాలుగు వేదములను అధ్యయనము చేసినవాఁడైనను సమస్తశాస్త్రములను సమగ్రముగ చదివినవాఁడైనను, పాకస్థానమునయుండు పాకరసము నెఱుఁగని యుబకవలె పరబ్రహ్మయాథార్థ్యము నెఱుఁగఁడు-అనఁగా పరబ్రహ్మయాథార్థ్యజ్ఞానము భగవత్కృపైక సాధ్యమేకాని వేదాధ్యయన శాస్త్రాభ్యాసములచే సాధ్యము కాదని తాత్పర్యము.

శ్రీభగవద్గీతాయాం-శ్రీభగవానువాచ.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు । కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం । కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

వేవురు మనుష్యులలో నొకానొకఁడు జ్ఞానసిద్ధికై యత్నము చేయుచున్నాఁడు. అట్లు యత్నించినవారలలో నొకానొకఁడు నన్ను నిజముగ నెఱుఁగుచున్నాఁడు. అని శ్రీకృష్ణుఁడు చెప్పెను.

శ్రీవిష్ణుపురాణే ప్రహ్లాదః.

బ్రహ్మత్వే సృజతే సర్వం । స్థితౌ పాలయతే పునః ।
రుద్రరూపాయ కల్పాంతే । నమస్తుభ్యం త్రిమూర్తయే ॥

సర్వమును బ్రహ్మరూపముచే సృజించి మరల స్థితికాలమున పాలించి కల్పాంతమున రుద్రరూపివై యుండు త్రిమూర్తిస్వరూపుఁడగు నీకొఱకు నమస్కరించెదను. అని ప్రహ్లాదుఁడు భగవంతుని స్తుతించెను.

శ్రీవిష్ణుపురాణే-అక్రూరః.

బ్రహ్మవిష్ణుశివాఖ్యాభిః । కల్పనాభిరుదీరిత ।
అనాఖ్యేయస్వరూపాత్మ । న్ననాఖ్యేయప్రయోజన ॥
అనాఖ్యేయాభిధానం త్వాం । నతోస్మి పరమేశ్వర ।
న యత్ర నాథ విద్యంతే । నామజాత్యాదికల్పనాః ।
తద్బ్రహ్మ పరమం నిత్య । మవికారి భవానజః ॥

బ్రహ్మవిష్ణుశివాఖ్యకల్పనలచే చెప్పఁబడితివి. వచింపనలవిగాని స్వభావముతోఁగూడినవాఁడవు. వచింపనలవిగాని ప్రయోజనముతోఁగూడినవాఁడవు. ఓపరమేశ్వరా! వచింపనలవిగాని నామముతోఁగూడిననిన్నుఁ గూర్చి నమస్కరించెద. (అనఁగా అనామియు అనంతనామియునని భావము.) ఏవస్తువునందు నామజాత్యాదికల్పనలు లేవో యట్టినీవు బ్రహ్మమై, పరమమై, నిత్యమై, యవికారియై యజుఁడైయున్నాఁడవు. అనియక్రూరుఁడు భగవంతుని నుతించెను.

శురరటి పరునిత్తై విణ్ణవర్ ముఱ్ఱుపడుం।
వరన్ ముద లాయనై ముఱ్ఱుసుంస పరపరన్।
పుర మెరిద మూన్రైటి త్తిసురర్కు మటివియాన్।
అర నయ నెనవుల గళిత్తమై త్తుళనే॥

పలపలవే యాభరణం పేరుం పలపలవే।
పలపలవే శోది వడివు పణ్బెణ్ణిల్।
పలపల కండుండు కేట్టుఱ్ఱు మోన్దిన్బం।
పలపలవే ఞానముం పాంబణైమే లార్కేయో॥

ఆణల్లన్ పెణ్ణల్లన్ అల్లా అలియుమల్లన్।
కాణలుమాగా నుళనల్లన్ ఇల్లైయల్లన్।
పేణుంకాల్ పేణు ముఱువాగు మల్లనుమాం।
కోణై పెరిదుడైత్తెం పెమ్మానై క్కూఱువదే॥

ఒళిమణివణ్ణనెన్గో ఒరువనెన్రేత్తనిన్ర।
నళిర్మదిచ్చడైయనెన్గో నాన్ముగక్కడవుళెన్గో।
అళిమగిళ్న్దులగమెల్లాం పడైత్తవైయేత్తనిన్ర।
కళిమలర్త్తుళవనెమ్మాన్ కణ్ణనై మాయనైయే॥

యావైయు మెవరుంతానా యవరవర్ సమయంతోఱుం।
తోయ్విలన్ పులనైందుక్కుం శొలప్పాన్ ఉణర్విన్ మూర్త్తి।
ఆవిశేర్ ఉయిరినుళ్ళాల్ ఆదుమోర్ పఱ్ఱిలాద।
పావనై యదనైక్కూడి లవనైయుం కూడలామే॥

మావరాగియ మూర్త్తియై మున్ మాఱుపక్కం ముదల్ వన్ తిరునైఙ్గ।
శాపముళ్ళిన నీక్కువానై త్తిసంకరర్ కిడందాన్ తిరునైఙ్గ।
దేవదేవనై తెన్నిలంగై యెరియెళచ్చెఱ్ఱ విల్లిఱై।
పావనాశనై పంగయత్తడం కణ్ణనై ప్పరవుమినూ॥

తిరుమాల్ నాన్ముగన్ శెంశడైయా నెన్రివర్గళెం।
పెరుమాన్ తన్మైయై యారఱిగిఱ్పార్ పేశమే।
ఒరుమా ముదల్వా ఊళిప్పిరా నెన్నై యాళుడై।
కరుమా మేనియ నెన్బ నెన్ కాదల్ కలక్కవే॥

యానుంతానా యొళిందానై యాదుం యవర్క్కుం మున్నోనై।
తానుం శివనుం పిరమనుమాగి పణైత్త తనిముదలై।
తేనుం పాలుం కన్నలు మముదుమాగి త్తిత్తిప్పన్।
ఊని లుయిరి లుణర్విల్ నిన్ఱ ఒన్రై యుణర్న్దేనే॥

ముడివిల్ తనక్కోన్ఱరుగిరేనెన్నుం మావులగాళ్వేయెన్నుం।
కడికమళ్ కొన్రైచ్చడైయనేయెన్నుం నాన్ముగక్కడవుళేయెన్నుం।
వడివుడై వానోర్ తలైవనేయెన్నుం వణ్ తిరువరంగనేయెన్నుం।
అడియడైయాదాళ్ పోలివళణుగి యడైందనళ్ ముగిల్వణ్ణనడియే॥

మునియే నాన్ముఖనే ముక్కణ్ణ ప్పాయెణ్ పొల్లా।
క్కనివాయ్ త్తామరై క్కణ్ కరుమాణిక్క మేయెణ్ కళ్వా।
తనియే నారుయిరేయెణ్ తలైమిశై యాయ్ వంది।
ట్టనినాణ్ పోగలొట్టేణ్ ఒన్దుంమాయం శెయ్యేలెన్నైయే॥
అవావఱచ్చూళ్ అరియై యయనై యరనై యల్ర్త్తి।
అవావఱ్ఱు వీడుపెఱ్ఱ కురుగూర్ శఠకోపణ్ శొన్న।
అవావి లందాదిగళా లివై యాయిరము ముడిండ।
అవావి లందాది యిప్పత్తఱిందార్ పిఱందా ఱుయర్న్దే॥

తిరుమంగై యాళ్వార్.

పోరురువిల్ నీ రెరికాల్ విశుంబుమాగి । పల్వేఱుసమయముమాయ్ పరందునిన్ఱ।
ఏరురువిల్ మూవరుమేయెననిన్ఱ । యిమైయవర్ తందిరువురువే ఱెణ్ణుంబోదు।
ఓరురువంపొన్నురువ మొన్ఱు శెండీ । యొన్ఱుమాకడలురువమొత్తునిన్ఱ।
మూవురువుంకండపోదొన్ఱాంశోది । ముగిలురువ మెమ్మడిగళురువందానే॥

పొయ్ గై యాళ్వార్.

అరణ్ నారణణ్ నామమ్ ఆన్విడై పుళ్లూర్ది।
వురై నూల్ మఱై యుఱైయుంకోయిల్ ...వరై నీర్
కరుమమ్ అళిప్పళిప్ప క్కైయదువేల్ నేమి।
ఉరువమెరి కార్మేనియొన్ఱు॥

తమరుగంద దెవ్వురువ మవ్వురువందానే।
తమరుగంద దెప్పేర్ మఱ్ఱప్పేర్ ...తమరుగంద
దెవ్వణ్ణంశిందిత్తిమైయాదిరుప్పరే।
అవ్వణ్ణమాళియానామ్॥

ఏఱ్ఱాన్ పుళ్లూర్న్దాన్ నెయిలెరిత్తాణ్ మార్విడన్దాణ్।
నీఱ్ఱాన్ నిళల్ మణివణ్ణత్తాణ్ ...కూఱ్ఱొరు పాల్
మంగైయాణ్ పూమగళాణ్ వార్శడైయాణ్ నీణ్ముడియాణ్।
గంగైయాణ్ నీళ్కళలాణ్ కాప్పు॥

పేయాళ్వార్.

తాళ్శడైయుం నీణ్ముడియుం ఒణ్మళువుంశక్కరముం।
శూళరవుం పొన్నాణుం తోన్దుమాల్ ...శూళుమ్
తిరండరువి పాయుం తిరుమలై మేలెన్దైక్కు।
ఇరండురువుమొన్ఱా యిశైన్దు॥

అనంతనామరూపాయనమః.

——००☙००——



శ్రీమతేరామానుజాయనమః.

# సారసంగ్రహము.

భక్తవిజయావతారికయందలి సారాంశమేమనఁగా:—

౧. జగత్కారణవస్తువగు పరమాత్మయొకఁడే.

౨. పరమాత్మ రూపాదిరహితమైనది.

౩. చేతనునికి కర్మానుగుణముగ శరీరపరిగ్రహము కలిగినట్లు పరమాత్మకు ఇచ్ఛచే దివ్యశరీర పరిగ్రహముకలిగియున్నది.

౪. పరమాత్మకు నామరూపము లనంతములై యున్నవి.

౫. పరమాత్మ పరిగృహీతమగు నామరూపములలో వారివారికిష్టమగు నామరూపములచే పరమాత్మనుపాసింపఁదగును.

భక్తవిజయావతారికయందు జగదీశుఁడు నాకంతర్యామియై స్ఫురింపఁజేసిన యర్థమును వ్రాసితినేగాని ఖ్యాతిలాభపూజలనపేక్షించి మత్సరగ్రస్తుఁడనై వ్రాసినవాఁడనుగాను. (ఏకస్స్వాదునభుంజీత) అనురీతిని భగవంతుని పరమకృపచే నాబుద్ధికిగోచరించినయర్థమునెల్లరు ననుభవించి యానందింపవలయునని యిట్టిప్రారంభము చేసితిని. భక్తవిజయమునఁ బ్రస్తావింపఁబడియుండుభక్తులు ఈఛాయననుసరించినవారుగాన నాకీయవతారిక వ్రాయవలసిననిర్బంధమును బ్రసక్తించెను. సారాసారవివేకచతురులగు సాధుజనులు ఈయవతారికను ఆమూలాగ్రముగను, సావధానముగను అవలోకించి యీ సారసంగ్రహమున వ్యక్తమైయుండు అయిదు అంశములే అవతారికయందలి ముఖ్యాంశములనియు దీనికుపోద్బలముగఁ దక్కినయంశములు వ్రాయఁబడియున్నవనియు గ్రహించి యీయైదు అంశము లుచితములగునేని సంతోషించి నాయధ్యవసాయము వ్యవసాయాత్మికమై పరిపక్వమగునట్లు మంగళాశాసనము చేయవలయుననియు ఈయైదంశములలో నెద్దియైనను అసంగతమై యుండెనేని అట్టిదానిని సవరించి నాకు సుబోధముగ ననుగ్రహింపవలయుననియు సవినయముగఁ బ్రార్థించెదను.

ఇట్లు,

పరమసాధుజనుల శ్రీపాదరేణువై

తత్కృపైకపాత్రమగు

☞ కోయిల్ - ధనాల - దేవరాజదాసుఁడు.



అగ్రేకృత్వాకమపిచరణంజానునైకేనతిష్ఠన్ ।
పశ్చాత్పార్థంవిపలిసజుషాచక్షుషాప్రేక్ష్యమాణః ।
సవ్యేతోత్రంకరసరసిజేదక్షిణేజ్ఞానముద్రాం ।
ఆబిభ్రాణోరథమధివసన్పాతునస్సూతవేషః ॥





    

శ్రీమతే రామానుజాయనమః.

శ్రీ పాండురంగపరబ్రహ్మణేనమః.

# భక్తవిజయము.

## అవతారిక.

శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ। నిర్గుణాయగుణాత్మనే।
సమస్తజగదాధార। మూర్తయేబ్రహ్మణేనమః॥

ఉయర్వఱవుయర్నలముడైయవన్ యవనవన్
మయర్వఱమదినలమరుళినన్ యవనవన్।
అయర్వఱుమమర్కళధిపతియవనవన్।
తుయరఱుశుడరడితొழుదెழెన్మననే॥

నిత్యసూరులతో సమమగు ప్రాప్తితమకుఁగలిగియుండ దానినెఱుఁగక అనాదికాలముగ దేహమే ఆత్మయనియు, శబ్దాదివిషయములే భోగ్యములనియు ఆపేక్షించి తిరుగుచుండు బద్ధసంసారులగుకొందఱికి శ్రియఃపతియైనసర్వేశ్వరుఁడు నిర్హేతుకకటాక్షముచేత తనస్వరూపరూపగుణవిభూతులకు వాచకమగునామప్రభావమును చూపఁగా చూచినభక్తులు తాము అనుభవించి అనుభవాపేక్షులను అనుభవింపింప సమర్థులై శ్రీవల్లభుని సంతోషింపఁజేసెదరు.

ఐహికమున పుణ్యపాపరూపములగుకర్మములనార్జించియు ఆముష్మికమున స్వర్గనరకములయందు తత్ఫలమననుభవించియు ఇట్లు గతాగతము చేసి తిరుగువారలు సంసారులనఁబడుదురు.

పుణ్యపాపరూపములగుకర్మములను స్వర్గనరకములయందనుభవించి కర్మశేషముతోఁడ భూమియందు గర్భవాసముచేయుటకు వచ్చుమార్గమున ఈయాత్మ అనుభవించు దుఃఖము. వేదాంతమున పంచాగ్నివిద్యయనుప్రదేశమునందు చెప్పఁబడియున్నది.

యాతనాశరీరముతో నరకానుభవముచేసి ఆశరీరమును అచటవిడిచి అనంతరము శరీరమును పరిగ్రహించి స్వర్గానుభవముచేసి ఆశరీరమును అచటవిడిచి సూక్ష్మశరీర

ముతోడ ఆకాశమున వర్తించును. సూర్యుఁడు తనకిరణములచే జలాకర్షణము చేయునపుడు ఆకాశముననుండెడియీయాత్మను ఆకర్షించి మేఘమున ప్రవేశింపించును. ఆజలము వర్షరూపమై పరిణమించుపర్యంతము అచటనుండి వర్షధారలతోడ భూమియందుఁబడును. ఆవర్షజలము సస్యమునకు ధారకమగునపుడు తద్ద్వారా సస్యమునందు ప్రవేశించును. ఆసస్యము పరిపక్వమై అన్నరూపముగ పరిణమించువఱకు అచటనుండి అన్నము పురుషశరీరమునందు ప్రవేశించి శుక్లమై పరిణమించువఱకు అచటవసియించి స్త్రీపురుషసంయోగముచే శుక్లముద్వారా స్త్రీశరీరమునందు ప్రవేశించి గర్భమై పరిణమించును. గర్భవాసము చేయునపుడు ( అత్యమ్లకటుతీక్ష్ణోష్ణలవణైర్మాతృభోజనైః । అతితాపిభిరత్యర్థం । వర్ధమానాతివేదనః ) అనురీతిని మాతృభోజనమున అంతర్భూతములగుక్రూరపదార్థములచే వేదనను జెంది తపించుచుండును. ఇట్టిక్లేశములతోడ జరాయువునందు కట్టువడి అవయవములను కదలింపశక్తిలేక ( క్లేశాన్నిష్క్రాంతిమాప్నోతి । జఠరాన్మాతురాతురః ) అనురీతిని క్లేశముతోడ జనించి బాల్యదశయందు అశుచిప్రస్రవములయందుఁబడియుండి (కండూయనేపి చాశక్తః । పరివర్తేప్యనీశ్వరః । స్నానపానాది చాహార । మవాప్నోతి పరేచ్ఛయా) అనురీతిని నవకలిగిన గీఱుకొనుటకును, కఱచు జంతువులను తోలికొనుటకును శక్తిలేక ధారకాదులు పరాధీనములై యిట్లు క్లేశముతోడ అతిశైశవకాలమును కడపి తానేయొకకార్యముచేయుటకు శక్తుఁడైనంతట (తస్మాద్బాల్యే వివేకాత్మా । యతేత శ్రేయసే సదా) అనురీతిని భగవత్ప్రవణుఁడు కాఁదగియుండ అట్లుచేయక (బాల్యే క్రీడనకాసక్తః) అనురీతిని లీలతోడ కాలమును పోఁగొట్టి యౌవనావస్థయందు నరకహేతువులగువిషయాంతరములతోడ కాలముపుచ్చి వార్ధక్యమును జెంది అశక్తితోడ కాలమునుగడపి అచింతితముగ మరణము ప్రాప్తమైనంతట (క్లేశాదుత్క్రాంతిమాప్నోతి । యామ్యకింకరపీడితః) అనురీతిని ఉత్క్రమణదశయందు క్లేశమననుభవించి అనంతరము మృత్యుపరవశుఁడగును.

ఇట్టిసంసారులయనర్థపరంపరలనుజూచి (సుహృదంసర్వభూతానాం) అనురీతిని పరమసుహృత్తగుసర్వేశ్వరుఁడు వీనియుజ్జీవనార్థము (మానంప్రదీపమివకారుణికో దదాతి) అనురీతిని శాస్త్రప్రదానముచేసెను. ఎట్లనిన వేదమున చిదచిదీశ్వరతత్త్వములను విభజించి చూపి అంతర్యామిబ్రాహ్మణముచే అంధునికి దృష్టియిచ్చినట్లును చీకటియింట దీపమునుంచినట్లును చేతనాచేతనములకును ఈశ్వరునికిని గలశరీరశరీరిసంబంధమును జూపి చేతనునికి అచిత్సంబంధము కర్మోపాధికమని చెప్పి ఔపాధికమగు అచిత్సంసర్గమును విడిచి నిత్యవిభూతియందు నిత్యసూరిభోగ్యమగుభోగమునను భవించుట స్వరూపానురూపమగుపురుషార్థమని చెప్పి ఇట్లీశ్వరుఁడుపకరించియు పాపప్రాచుర్యముచే చేతనులీయుపదేశమునంగీకరింపక వేదబాహ్యులై కొందఱును, వేదమార్గమునఁబ్రవేశించి (తత్రైవకేపి చపలాశ్శలభీభవంతి) అనురీతిని దీపమున శలభములునశించునట్లు వేదతాత్పర్యములనెఱుఁగక నశించువారు కొందఱునై, తానుజేసినవేదప్రదానము వ్యర్థమైనందున ఆజ్ఞచెల్లనిచోట దండెత్తురాజులవలె సంసారిసజాతీయుఁడైయవతరింపఁగా శిశుపాలాదులవలె నిందించి కొందఱును, రావణాదులవలె నెదిరించి కొందఱును నశించి అవతారమును కార్యకరము కాక పోయినను ఈశ్వరుఁడగుతాను నిజధనమగునాత్మకోటిని విడువఁజాలని చాపల్య

ముచే వీరలయానుకూల్యమును నిరీక్షించుచుండ చేతనులయందు యాదృచ్ఛికసుకృతము గలుగ అదియేవ్యాజముగా విశేషకటాక్షముచేసి అద్వేషాభిముఖ్యములను గలిగించి యానంతరము శాస్త్రవాసనచేతను, ఆచార్యోపదేశముచేతను ఈశ్వరుఁడు నిరుపాధికశేషియనియు, ఈయాత్మవానికి అనన్యార్హశేషమనియు, యథాజ్ఞానము జనియించి అనంతరము స్వరూపానురూపమగుపురుషార్థమున రుచిగలుగునట్లు విశేషకటాక్షముచే స్థిరీకరించిపుడు పురుషార్థలాభమునకు ఉపాయమేదియోయని అపేక్షకలిగినంతట శాస్త్రసిద్ధమగు కర్మయోగాద్యుపాయములను జూపి ఇవి దుష్కరములనియు, విలంబ్యఫలప్రదములనియు, వీనిచే ప్రమాదసంభావన కలదనియు ఇందుఁబ్రవేశింప శంకించువారలకు వేదాంతమున ఈశ్వరుఁడే ఉపాయమని చెప్పియుండుటను చూపఁగా కర్మజ్ఞానభక్తియోగములయొక్క దుష్కరతవలె ప్రపత్తినిష్ఠాహేతువగుమహావిశ్వాసము సయితము కొందఱికిదుర్లభము. కాన ఇందును ప్రవేశింపశంకించినవారలకు సర్వాధికారమగుభగవన్నామసంకీర్తనమే చేతనులపాపములను బోఁగొట్టి సుకృతానుకూలమగు కర్మయోగాదులయందు ప్రవేశింపించుటయును, ప్రపత్తియందు ప్రవేశింపించుటయును, విరోధినిబోఁగొట్టి ప్రాప్యమునిచ్చుటయును, నిర్వాహకమగు వైభవముతోఁగూడినదని భగవంతుఁడను గ్రహించినందున భక్తులందఱును భగవన్నామ సంకీర్తనపరులై యుండిరి.

ఈభక్తులు భగవన్నామసంకీర్తనపరులగుటకు కారణము శ్రీవిష్ణుధర్మము. ఆగ్రంథముకలిగిన విధమెట్టిదనిన — పాండవవంశమున అర్జునపౌత్రుఁడగు శ్రీపరిక్షిత్తుయొక్క ప్రథమపుత్రుఁడగుజనమేజయునికుమారుఁడగుశతానీకుఁడనురాజు పరమయోగియగుయాజ్ఞవల్క్యులవలన వేదమును, కృపాచార్యులవలన ధనుర్వేదమును జెంది క్రూరములగుశస్త్రాదివిషయములయందు విరక్తుఁడై అభిషిక్తుఁడైనదిమొదలు బలవంతులచే దుర్బలులకు బాధలేక లోకములను రక్షించి ఆముష్మికహేతువుగ ఈప్రజలకునేఁజేయఁదగిన సహాయమేదియనిచింతించి శ్రీశౌనకులచెంతఁజేరి దేహపోషణపరులై కుమార్గవర్తులగుసంసారులకు ఉజ్జీవనోపాయమునను గ్రహింపవలయునని ప్రార్థింప శ్రీశౌనకులు శతానీకునిఁజూచి కాలముకలికాలముగానున్నది. పాపప్రాచుర్యముచే వేఱొకటి కధికారులులేరు. సర్వాధికారమగు భగవన్నామసంకీర్తనమే ఆత్మలకు ఉజ్జీవనోపాయమై యున్నదని ఆనతిచ్చిరి. ఇట్టి నామసంకీర్తనవైభవము శ్రీమత్పాండురంగ పాదపద్మప్రవణైకచిత్తులగుపరమభక్తులచేఁ బ్రకటింపఁబడెను.



ఈభక్తవిజయమున ప్రస్తావింపఁబడియుండు భక్తులువిష్ణుభక్తులైనను కొన్నిస్థలములయందు శివభజనమును జేసియున్నారు. ఈతీరుననే వసిష్ఠవ్యాసనారదాది మహాత్ములు హరిభక్తిచేసిరని వైష్ణవపురాణములయందును, శివభక్తిచేసిరని శైవపురాణములయందును చెప్పఁబడియున్నది.

వైష్ణవసిద్ధాంతమున విష్ణువుపరమాత్మయనియు, బ్రహ్మశివేంద్రాదిదేవతలు జీవాత్మలనియు, వీరలుపూర్వజన్మములయందు విష్ణువును ఉపాసించి తమతమపదములను జెందిరనియు ఇప్పటికిని విష్ణుభక్తులై తదుపాసనము చేయుచున్నారనియు, అంతమున విష్ణుకటా

నియు, మనస్సునకచింత్యుఁడనియు, వికారరహితుఁడనియు, భగవద్గీతయందుఁ జెప్పఁబడియున్నది. జీవాత్మకేనామరూపములు లేవనిన పరమాత్మకెట్లుకలుగును. కర్మసంబంధముచే జీవాత్మకు శరీరపరిగ్రహము కలిగి తద్వారా నామరూపములు గలిగినట్లు పరమాత్మకు స్వేచ్ఛచే దివ్యశరీరపరిగ్రహముగలిగి తద్వారా నామరూపములుఁగలిగెను. (బహూని మే వ్యతీతాని । జన్మాని తవ చార్జున) అనురీతిని ఓయర్జునా నాకు నునీకును ఇదివఱకనేకజన్మము లైనవనియు, (అజోఽపిసన్నవ్యయాత్మా । భూతానామీశ్వరోఽపిసన్ । ప్రకృతిం స్వామధిష్ఠాయ । సంభవామ్యాత్మమాయయా) అనఁగా నేను జన్మములేనివాఁడను. వికారరహితుఁడను. సమస్తప్రాణులకీశ్వరుఁడను. అయినను స్వకీయమగు ప్రకృతి నవలంబించి నామాయచేనవతరించుచున్నాను. అనియు భగవద్గీతయందు భగవంతుఁడు తానే వక్కాణించెను. ఈసమాధానముచే పరమాత్మకు అనంతశరీరపరిగ్రహమైయుండుటవలన నామరూపములనంతములని వేఱుగాఁజెప్పవలసినదిలేదు.

ఇకను నిత్యవిభూతివిషయమై యోచింపఁగా శ్రీవైకుంఠదివ్యలోకమున శ్రీవైకుంఠదివ్యజనపదమున శ్రీవైకుంఠదివ్యనగరమున శ్రీవైకుంఠదివ్యవిమానమున ఆనందమంటపమున పర్యంకవిద్యయందుఁజెప్పఁబడియుండు ధ్యానప్రకారము సర్వేశ్వరుఁడు సన్నిధిచేసియున్నాఁడని ప్రమాణములు చెప్పుచున్నవి. ఇందుచే త్రిపాద్విభూతియందు జనపదములును, నగరములును, విమానములును, మంటపములును, అచ్చటచ్చట సన్నిధిచేసియుండు భగవన్మూర్తులును, అనంతములని వ్యక్తమగుచున్నదిగదా. నిత్యవిభూతియందు అయోధ్యయను దేశవిశేషముగలదనియు, అందుభగవంతుఁడు రామరూపియైయున్నాఁడనియు, రామతాపనీయమునందును, నిత్యవిభూతియందు గోలోకమను స్థలవిశేషమున్నదనియు, అందుభగవంతుఁడుగోపాలరూపియైయున్నాఁడనియు గోపాలతాపనీయమునందును చెప్పఁబడియున్నది. ఈతీరుననే శైవసిద్ధాంతమున నిత్యవిభూతియందు మహాకైలాసమున్నదనియు, అందుపరమాత్మ ప్రమథగణసేవితుఁడై శివరూపియైయున్నాఁడనియు చెప్పఁబడియున్నది. శివపరములగునుపనిషత్తులు ఆసిద్ధాంతమునకు ప్రమాణములైయున్నవి.

శ్రీవిష్ణుపురాణమున రెండవయంశమున నాలుగవయధ్యాయమున భగవంతుఁడు ప్లక్షద్వీపమున సోమరూపియై, శాల్మలీద్వీపమున వాయురూపియై, కుశద్వీపమున చతుర్ముఖరూపియై, క్రౌంచద్వీపమున శివరూపియై, శాకద్వీపమున సూర్యరూపియై, ఆయాద్వీపవాసులచే ఆరాధింపఁబడుచున్నాఁడని చెప్పఁబడియున్నది. శ్రీభాగవతమున పంచమస్కంధమున భగవంతుఁడు శివరూపియై, ఇళావృతవర్షమునకును, హయగ్రీవరూపియై భద్రాశ్వవర్షమునకును, నృసింహరూపియై హరివర్షమునకును, మన్మథరూపియై కేతుమాలవర్షమునకును, కూర్మరూపియై హిరణ్మయవర్షమునకును, రామరూపియై కింపురుషవర్షమునకును, బదరీనారాయణరూపియై భారతవర్షమునకును, అధిపతియైయున్నాఁడనియు ఆయావర్షవాసులు తత్తన్మూర్తివిషయమగు మంత్రజపధ్యానాదులచే భగవంతునుపాసించి యైహికాముష్మికఫలములను బొందెదరనియు, చెప్పఁబడియున్నది. శైవపురాణములయందును ఈతీరుననే చెప్పఁబడియున్నది. ఈపురాణములలో పరస్పరము కొంతభేదము కలిగిననది కల్పభేదములచేఁ గలిగిన భేదమని అంగీకరింపవలయును.

వైష్ణవులకు ముఖ్యప్రబంధమగు తిరువాయ్మొళ్రిలో (పలపలవేయాభగణం పేరుం పలపలవే। పలపలవేళోదివడివుపళ్ఫెణ్ణిల్) అనఁగా సర్వేశ్వరునికి నామరూపాదులనంతములనియు, ముదల్ తిరువందాదిలో (తమరుగంద దెవ్వురువ మవ్వురువందానే। తమరుగంద దెప్పేర్మత్తప్పేర్) అనఁగా ఆశ్రితులపేక్షించు నామరూపములతో భగవంతుఁడుపాస్యుఁడగుననియు చెప్పఁబడియున్నది. ఈతీరుననే శైవప్రబంధములును జెప్పుచున్నవి.

లోకమున నొకశిశువుజనించిన ఆశిశువునకు తల్లిదండ్రులరూపమైన పితామహతత్పత్నులరూపమైన మాతామహతత్పత్నులరూపమైన లేక యుభయకులములో కొంతదూరమునసుండినవారిరూపమైనకలుఁగుట వాడుకగానున్నది. కొన్నిశిశువులకు ముక్కు తండ్రిముక్కువలె, కాళ్లుతాతకాళ్లవలె, మరికొన్నియవయవములు మరికొందఱియవయవములవలె నున్నవనిచెప్పుదురు. దోహదమున సమర్థులగువారు రెండువిధములగు చెట్లనుజేర్చి మూడవవిధమగు చెట్లనుగలుగఁజేయుచున్నారు. అపుడామూడవచెట్టునందు దానికికారణమగు రెండుచెట్లరూపములును కలసియున్నవి. తుదకుకార్యవర్గములగు చేతనాచేతనములకు కారణవర్గములరూపములుఁగలుగుచున్నవి. ఇందుసర్వమునకు ప్రథమకారణమగు సర్వేశ్వరునికి బ్రహ్మాదిపిపీలికాంతమగుకార్యవర్గములయొక్క సమస్తరూపములును గలవనియు అందుచేతనే కార్యవర్గములకు ఆరూపములు గలిగెననియు చెప్పుటయుపపన్నమైయున్నది. ఒక్కొకరూపమును ఒక్కొకనామముతోఁ గూడియేయుండును. అట్లు ఒక్కొకనామమును ఒక్కొకరూపముతోఁ గూడియేయుండును. శశవిషాణము. (కుందేటికొమ్ము) అనునామమున్నది, దీనికి రూపముగలదాఅని యాక్షేపముగలుగునేని శశముఅనియు, విషాణముఅనియు రెండుపదములుచేరి యేకపదమయ్యెను. శశమనుపదమునకును, విషాణముఅనుపదమునకును ప్రత్యేకముగ రూపములుఁగలవుకదా. ఈరెండుపదములనుజేర్చినట్లు కుందేటికి కొమ్మునతికించి రెండురూపములనుజేర్చిన శశవిషాణమనుపదార్థము సిద్ధించుచున్నది. కేశవాది ద్వాదశనామములకు ద్వాదశరూపములుఁగలవుగదా. అట్లు సహస్రనామములకు సహస్రరూపములుగలవు. విష్ణుసహస్రనామమున (సర్వశ్శర్వశ్శివస్థాణుః) అని శివనామములు చేర్పఁబడియున్నవి. (నమోస్త్వనంతాయసహస్రమూర్తయే।సహస్రపాదాక్షిశిరోరుబాహవే। సహస్రనామ్నేపురుషాయశాశ్వతే। సహస్రకోటీయుగధారిణేనమః) అనఁగా భగవంతునికి సహస్రరూపములును సహస్రనామములునుగలవని బ్రహ్మస్తుతియందున్నది. (అనంతరూపోనంతశ్రీః) అనఁగా భగవంతుఁడు అనంతరూపగుణములు గలవాఁడనియు (ఏకోనైకః) అనఁగాభగవంతుఁడు ఒక్కఁడైపెక్కండ్రై) యుండుననియు విష్ణుసహస్రనామమేచెప్పుచున్నది. ఈరీతిని శైవసిద్ధాంతమునందును జూచుకొనవలయును. ఇట్లుండ సర్వేశ్వరుని నామరూపములకు పరిమితికలదనియు సర్వాస్తికమతస్థులచే నుపాసింపఁబడు సమస్తనామరూపములు పరబ్రహ్మమునకు లేవనియు వాదించువారలవాదముపక్షపాతవాదమేకాని సత్యవాదముకాదు. అసత్యముపలుకఁగూడదని వేదముపలుకుచున్నది గదా. కావున బుద్ధిమంతులు పక్షపాతవాదమునుమాని సత్యమును ఊనియుండుటయుచితము.

ఈసమాధానములచే నిత్యవిభూతియందును లీలావిభూతియందును స్థలవిశేషములును ఆయాస్థలములయందలి భగవన్మూర్తివిశేషములును ఆయామూర్తులయొక్క నామరూపాదు

లును అనంతములని యేర్పడుచున్నది. కావున బహువిధనామరూపములతో బహుసిద్ధాంతములయందు బహుజనులచే ఆరాధింపఁబడు పరమాత్మ ఒకటియైయున్నది.

ఇట్లుండ వైష్ణవగ్రంథములయందు శివుఁడు జీవాత్మయనియు శైవగ్రంథములయందు విష్ణువుజీవాత్మయనియు చెప్పఁబడియుండుటకు కారణమేమనఁగా—వైష్ణవసిద్ధాంతప్రకారము విష్ణురూపియగుపరమాత్మచే సృజింపఁబడినజీవకోటిలో శివుఁడు ఒకజీవుఁడనియు, ఇతఁడువిష్ణుకటాక్షముచే శివపదమును జెందెననియు ఆవిష్ణుకటాక్షముచేతనేయిఁకను మోక్షముచెందుననియు ఈశివునికి మోక్షప్రదానమున శక్తిలేదనియుచెప్పఁబడియున్నది. శైవసిద్ధాంతప్రకారము శివరూపియగుపరమాత్మచే సృజింపఁబడినజీవకోటిలో విష్ణువొకయాత్మయనియు ఇతఁడు శివకటాక్షముచే విష్ణుపదమును జెందెననియు ఆశివకటాక్షముచేతనే యికను మోక్షముచెందుననియు ఈవిష్ణువునకు మోక్షప్రదానమున శక్తిలేదనియు చెప్పఁబడియున్నది. శైవసిద్ధాంతమున విష్ణువు శివునిసహస్రకమలములచే సహస్రనామార్చనముచేయుచు నొకపుష్పముతక్కువపడినందున తనకంటినిపెఱికి అర్చించెననియు, శివుఁడగ్నిస్తంభమైనప్పుడు విష్ణువువరాహమై అతనిపాదమును వెదకెననియు, శివుఁడు నాట్యమాడినపుడు విష్ణువుమద్దెలను వాయించెననియు, బ్రహ్మహత్యాదోషశాంతికై రాముఁడు లింగార్చనముచేసెననియు, మఱియుపెక్కుచోట్ల విష్ణువు శివునిచే పెక్కుపరిభవములను జెందెననియు చెప్పఁబడియున్నదని వైష్ణవులు అసూయపడుటయు ఆగ్రంథములను దూషించుటయు ఈకథలబద్ధములనుటయు న్యాయముకాదు. ఆకథలన్నియు సత్యములే. శివునిచేసృజింపఁబడినయొక జీవాత్మవిష్ణువు ఇట్లంతయు చేసెనని శైవపురాణములు చెప్పుచున్నవేకాని వైష్ణవులారాధించుపరమాత్మవిష్ణువునుగుఱించి శైవగ్రంథములేమియు చెప్పలేదు. ఈతీరుననే శివునికివిష్ణువుచేబహువిధపరిభవములు కలిగినట్లు వైష్ణవగ్రంథములు చెప్పుటకు శైవులుఅసూయాక్రాంతులై వైష్ణవగ్రంథములను నిందింపఁబనిలేదు. వైష్ణవగ్రంథములు చెప్పునదియు సత్యమే. విష్ణువుచే సృజింపఁబడిన యొకజీవాత్మశివుఁడు విష్ణువుచేపరిభవముచెందెనని వైష్ణవగ్రంథములు చెప్పుచున్నవేగాని శైవులారాధించుపరమాత్మశివునిగుఱించి వైష్ణవగ్రంథములేమియు చెప్పలేదు.

ఇందుకొకనిదర్శనము వక్కాణించెదను.—ఒకయింట దేవదత్తుఁడు యజమానుఁడై యజ్ఞదత్తుఁడు సేవకుఁడైయున్నాఁడు. మరియొకయింటయజ్ఞదత్తుఁడుయజమానుఁడై దేవదత్తుఁడు సేవకుఁడైయున్నాఁడు. ఈయజ్ఞదత్త దేవదత్తులు మునుపటియింటి సేవకయజమానులుకారు. ఇట్లుండ దేవదత్తునియింట సేవకుఁడగుయజ్ఞదత్తుఁడు శిక్షింపఁబడినయెడల యజ్ఞదత్తునియింటివారికి పరిభవములేదు. అదేరీతిని యజ్ఞదత్తునియింట దేవదత్తుఁడనుసేవకుఁడు శిక్షింపఁబడిన దేవదత్తునియింటివారికి అవమానములేదు. ఈచందమున పరమాత్మశివుని విషయమగు శైవగ్రంథములయందలి జీవాత్మవిష్ణుపరిభవమునకు వైష్ణవులు శోకింపఁబనిలేదు. పరమాత్మవిష్ణువిషయమగు వైష్ణవగ్రంథములయందలిజీవాత్మశివపరిభవమునకు శైవులుశోకింపఁబనిలేదు. ఇఁకనుసంగ్రహించిచెప్పెదను. సర్వసిద్ధాంతములయందును ముముక్షుజనులు బహువిధనామరూపములచే ఆరాధించు పరమాత్మయొకటియై ఆయాసిద్ధాంతములయందు నికర్షముగఁ జెప్పఁబడియుండుదేవతలు జీవాత్మలైయున్నారు. కాన బుద్ధిమంతులు నామరూపవిషయమున అంతగా ఊనియుండవలసినది లేదు. వారివారికిష్టమగు నామరూపములతో పరమాత్మను

యత్నము చేయుచున్నాఁడు. అని భగవంతుఁడు భగవద్గీతయందుఁ జెప్పియుండు రీతిని భవరోగవైద్యుఁడగు భగవంతుఁడు ఈభవరోగపీడితుల పూర్వజన్మవాసనయను నాడిని పరీక్షించి అనుపానపథ్యములను విధించెను. అందు వైష్ణవునికి ఈశ్వరోపాసనమను ఔషధమును విష్ణునామరూపములను అనుపానముతోఁ జేర్చి స్వీకరింపవలయుననియు, దీనికి పథ్యము ఊర్ధ్వపుండ్ర శంఖచక్రధారణాదులనియు, అపథ్యము త్రిపుండ్రరుద్రాక్షధారణాదులనియు విధించెను. శైవునికి ఈశ్వరోపాసనమను ఔషధమును శివనామరూపములను అనుపానముతోఁ జేర్చి స్వీకరింపవలెననియు, ఇందుకు పథ్యము త్రిపుండ్రరుద్రాక్షధారణాదులనియు అపథ్యము ఊర్ధ్వపుండ్రతప్తచక్రాంకనాదులనియు విధించెను. కాన విష్ణుభక్తులకు వైష్ణవచిహ్నములు ఉపాదేయములనియు, శైవచిహ్నములు త్యాజ్యములనియు, శివభక్తులకు శైవచిహ్నములు ఉపాదేయములనియు వైష్ణవచిహ్నములు త్యాజ్యములనియు నిర్ణీతమయ్యెను.

అఖండజ్ఞానవంతులు పరబ్రహ్మమును నానాభావములచే నుపాసింతురు. ఆయా యుపాసనకుఁ దగిన చిహ్నములను ఉపాసనకాలములయందు పరిగ్రహింతురు. మఱికొందఱు వీతరాగాది ఆంతరవేషములనే గౌరవించి బాహ్యచిహ్నములు లేకయుండుదురు. (వైష్ణవం ద్వివిధం ప్రోక్తం। బాహ్యమాభ్యంతరం తథా। బాహ్యం తు శంఖచక్రాది। హ్యాంతరం వీతరాగతా) అనఁగా ఆంతరమనియు బాహ్యమనియు వైష్ణవము ద్వివిధము. ఇందు శంఖచక్రాదిధారణము బాహ్యవైష్ణవము, వైరాగ్యము ఆంతరవైష్ణవము. ఈరెంటియందు ఆంతరవైష్ణవమే ముఖ్యము. దీనినే సర్వేశ్వరుఁడును సాధువులును మిగుల గౌరవింతురు. శ్రీవిష్ణుపురాణమున యమకింకరసంవాదమున వైష్ణవులెట్టివారని యడిగిన యమకింకరులకు యముఁడు ఆంతరవేషమునే విస్తరించి చెప్పెను గాని బాహ్యవేషము నొకటినైనను జెప్పలేదు. ఇతరసిద్ధాంతములయందును ఇదేరీతిని ఆంతరవేషమే మిగుల గౌరవింపఁబడియున్నది. (చక్రాదిధారణం పుంసాం। పరసంబంధవేదనం। పతివ్రతానిమిత్తం హి। వలయాదివిభూషణం) అనురీతిని పతివ్రతకు వలయాది బాహ్యవేషమువలె వైష్ణవునికి చక్రాదిధారణము విష్ణుసంబంధప్రకాశకమాత్రమే కాని ఆంతరవేషమువలె ముఖ్యము గాదు. (న జాతిభేదం న కులం। న లింగం న గుణక్రియాః। న దేశకాలౌ నావస్థాం। యోగో హ్యాయమపేక్షతే) అనఁగా ప్రపత్తియోగము జాతిభేదమును, కులమును, చిహ్నమును, గుణక్రియలను, దేశకాలావస్థలను అపేక్షింపదని భారద్వాజసంహితయందుఁ జెప్పఁబడియున్నది. కొన్నిస్థలములయందు బాహ్యవేషములు కొనియాడఁబడియుండినను అది ప్రశంసాపరమని బుద్ధిమంతులూహింపవలయును. పరాశరస్మృతియందు (అగ్నితప్తేన చక్రేణ। బాహుమూలే తు లాంఛితాః। తే యాంతి పరమం స్థానం। పునరావృత్తివర్జితం) అనఁగా బాహుమూలమున తప్తచక్రాంకనముగలవారు పునరావృత్తిరహితమగు పరమపదమును జెందుదురని చెప్పియున్నది. ఈరీతిని మఱికొన్నిస్థలములయందు శంఖచక్రోర్ధ్వపుండ్ర తులసీనలినాక్షమాలాధారణములను మిగుల గౌరవించి చెప్పియున్నది. శైవసిద్ధాంతమునందును బాహ్యచిహ్నములను గౌరవించి కొన్నిస్థలములయందుఁ జెప్పియున్నది. ఈవచనములను ప్రశంసాపరమని యంగీకరింపక నిజమని చెప్పిన బహుప్రమాదములకు ఆస్పదమగుచున్నది. ఎట్లనిన బాహ్యచిహ్నములను గౌరవించి కొన్నిప్రమాణములును అవి ముఖ్యములు కావని కొన్నిప్రమాణములును చెప్పుటచే ఈవాక్యములకు పరస్పరవిరోధము లేక యర్థము నిర్వహింప

వేశించి వీనియభీష్టమును నెఱవేర్చెను. కానపరమాత్మ భావముచే ఏపదార్థమును ఆశ్రయించినను సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వవిశిష్టుఁడగుజగన్నాథుఁడు వీనిభావమునెఱిఁగి వీఁడాశ్రయించినవస్తువునందావేశించి వీనిమనోరథమును నెఱవేర్చుటకు సందేహములేదు.

మఱియు అండమునందుఁగలయన్నియు పిండమునందునుగలవనియు మనుష్యశరీరమున ననంతాత్మలున్నవనియు ఈమనుష్యశరీరమున శిరస్సుసత్యలోకమనియు, నాభిప్రదేశము భూలోకమనియు, పాదములు పాతాళలోకమనియు, వీనిమధ్య తక్కినలోకములున్నవనియు ఈసమాధానముచే మనుష్యశరీరము ఒకచతుర్దశభువనాత్మకమగుఅండమగుననియు, బ్రహ్మాండముననుండుదేవతలందఱు ఈపిండాండంబుననున్నారనియు, గరుడపురాణమున భగవంతుఁడుచెప్పియున్నాఁడు. భగవద్గీతయందు (యథాకాశస్థితోనిత్యం। వాయుస్సర్వత్రగోమహాన్। తథాసర్వాణిభూతాని। మత్స్థానీత్యుపధారయ) అనఁగా అంతటనువ్యాపించియుండువాయువు ఆకాశముననణఁగియుండునట్లు సమస్తభూతప్రపంచములు నాయందణఁగియున్నవి. అని భగవంతుఁడు చెప్పియున్నాఁడు. కాన ఒక్కొకపదార్థమునందును తత్త్వత్రయము మిశ్రమైయున్నది. ఉసిరికకాయయందలి పులుసుచేవాయువును, వగరుచే శ్లేష్మమును, మధురముచే పిత్తమును నశించునుగాన ఈమూడు విధములగు నారోగ్యములనుగోరువారు ఆయుసిరికకాయను పరిగ్రహించునట్లు తత్త్వత్రయమిశ్రమగునొక్కొకపదార్థమునందును వారివారికోరికప్రకారము ఏతత్త్వమునైన గౌరవింపవచ్చును. ఎట్లనిన విష్ణ్వాలయమునందలి విష్ణుబింబమును వైష్ణవుఁడు పరమాత్మయనియు, శైవుఁడు జీవాత్మయనియు, పరబ్రహ్మమునామరూపరహితమైనదనునభిప్రాయముగలవాఁడు అచిత్తనియు అధ్యవసించెదరు. శివాలయమునందలి శివబింబమును శైవుఁడు పరమాత్మయనియు, వైష్ణవుఁడు జీవాత్మయనియు నామరూపరహితపరమాత్మోపాసకుఁడు అచిత్తనియు అధ్యవసించెదరు. సర్వపదార్థములు తత్త్వత్రయాత్మకమగుటచే ఒక్కొకరియధ్యవసాయమును ఉచితమైయున్నది. ఒకపురుషుఁడు తనతాతకుమనుమఁడై, తండ్రికికుమారుఁడై, అన్నకుఁదమ్ముఁడై, తమ్మునికి అన్నయై, భార్యకుభర్తయై, కుమారునికితండ్రియై, మనుమనికితాతయై, యజమానునికిసేవకుఁడై, సేవకునికియజమానుఁడై, మిత్రునికిమిత్రుఁడై, శత్రువునకుశత్రువై, దాతకుపరిగృహీతయై, పరిగృహీతకు దాతయైయున్నాఁడు. ఇన్నిధర్మములొకనియందుండుటచే ఒకఁడేయందఱకు నన్నివిధములనున్నాఁడు. తత్త్వమునువిచారించిన ఆపురుషునికి వారివారియధ్యవసాయానుగుణముగ ఆయాపేరుతగియున్నదేగాని మనమఁడు, కుమారుఁడు, తమ్ముఁడు, అన్న, భర్త, తండ్రి, తాత, సేవకుఁడు, యజమానుఁడు, మిత్రుఁడు, శత్రువు, పరిగృహీత, దాతఅనునీపేళ్లలో నొకటియైనను ఆపురుషునికి రూఢినామముకాదు. అట్లు ఒక్కొకపదార్థమునందును తత్త్వత్రయము కలసియుండుటచే ఈమూడుతత్త్వములయొక్క ధర్మములతోఁగూడియుండు నొకపదార్థమును వారివారియధ్యవసాయప్రకారము ఆయాపేరిచేవ్యవహరించుటయుచితము. తుదకు ఆపదార్థము కేవలపరమాత్మయు కేవలజీవాత్మయు కేవలము అచిత్తునుగాదు. మూటియొక్కమిశ్రమగుటచే వారివారికి వారివారిచే అధ్యవసింపఁబడు తత్త్వధర్మము ఆపదార్థమున ప్రకాశించుచుండును. అఖండజ్ఞానపరిపూర్ణులు అంతట నన్నియుఁగలవని అధ్యవసించెదరు.

(నాహంవిప్రోనచనరపతిర్నాపివైశ్యోనశూద్రః । నోవావర్ణీనచగృహపతిర్నోవనస్థోయతిర్వా ॥ కింతుశ్రీమద్భువనభవనస్థిత్యపాయైకహేతోః । లక్ష్మీభర్తుర్నరహరితనోర్దాసదాసస్యదాసః) అనఁగా నేనుబ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలోను, బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసులలోను ఒకఁడనుగాను. సకలభువనసృష్టిస్థితిసంహారహేతువై లక్ష్మీభర్తయై నృసింహరూపియగు భగవంతుని దాసదాసదాసుఁడను. అని భగవదంతరంగ భక్తుఁడగు ప్రహ్లాదుఁడు చెప్పెను. ఈమూఁడుశ్లోకములచే దేవతిర్యఙ్మనుష్యస్థావరములు, బ్రాహ్మణ,క్షత్రియ,వైశ్య,శూద్రులు,బ్రహ్మచారి, గృహస్థ,వానప్రస్థ,సన్న్యాసులు అను భేదములు జీవాత్మలకు కర్మానుగుణముగఁగలిగియుండుకవచరూపశరీరములకేగాని ఆత్మకులేవనియు, ఈయాత్మజ్ఞానానంద స్వరూపమై సత్త్వాదిసుగుణసంపత్తిని భగవద్భాగవత శేషత్వమును ముఖ్యనిరూపకములుగ గలిగియుండునని తాత్పర్యము. శ్రీవిదురుని నిర్యాణకాలమున అతనిశరీరమునకగ్నిసంస్కారముచేయనుద్యుక్తుఁడగు ధర్మపుత్రునుద్దేశించి అశరీరియగు భగవంతుఁడు (భోభోరాజన్ నదగ్ధవ్యం । ఏతద్విదురసంజ్ఞికం । కళేబరమిహైతత్తే । నైషధర్మస్సనాతనః। లోకవైలక్షణోనామ । భవిష్యత్యస్యపార్థివ । యతిధర్మమవాప్తోసౌ । నశోచభరతర్షభ) ఓ రాజా ఈవిదురునిశరీరమును దహింపకుము. యతిధర్మముతోఁగూడియుండిన యితనివిషయమున లోకవిలక్షణముగ జరుపవలయును. ఇట్టిపరమహంసయొక్క శరీరమును దహించుట సనాతనధర్మముకాదు. శోకింపకుము అనిచెప్పెను. (కశ్చిద్ద్విజాతిప్రవరో । వేదాధ్యాయీతపోధనః । తపస్వీధర్మశీలశ్చ । కౌశికోనామభారత । సాంగోపనిషదాన్ వేదాన్ । అధీతేద్విజసత్తమః) అనురీతిని బ్రాహ్మణశ్రేష్ఠుఁడై వేదాధ్యాయియై తపోధనుఁడై, తపస్వియై ధర్మశీలుఁడై సాంగమగునుపనిషత్తులను అధ్యయనముచేసినవాఁడైయుండినకౌశికుఁడను ఋషి ధర్మవ్యాధుఁడనుకిరాతుననువర్తించి ధర్మసందేహములను దీర్చుకొనెనని శ్రీమహాభారతమున అరణ్యపర్వమునచెప్పఁబడియున్నది. నైమిశారణ్యవాసులగు మహర్షులు తాముచేయుదీర్ఘసత్రయాగమున ప్రతిలోమజాతుఁడగు రోమహర్షణునికి బ్రహ్మాసనమునిచ్చిరని శ్రీభాగవత దశమస్కంధమునఁ జెప్పఁబడియున్నది. పంచమయోనిజాతుఁడగు నొకభాగవతోత్తముఁడు బ్రాహ్మణునికి యాగమున క్రియాలోపముగలిగి శూలదోషముచేసిద్ధించిన బ్రహ్మరక్షస్త్వమును తాను భగవంతుని స్తుతించిన కైశికమనుగీతఫలమునిచ్చి నివర్తింపించెనని వరాహపురాణమున భగవంతుఁడు భూదేవికిఁజెప్పెను. శ్రీమహాభారతమున (మద్భక్తంశూద్రసామాన్యా । దవమన్యన్తియేనరాః । నరకేష్వవతిష్ఠంతి । వర్షకోటీర్నరాధమాః । చండాలమపిమద్భక్తం । నావమన్యేతబుద్ధిమాన్ । అవమానాత్పతత్యేవ । రౌరవేనరకేచసః) అనఁగానాభక్తునిని శూద్రసామాన్యముగఁదలఁచి యవమానించు నరాధములు కోటివర్షములు నరకమునఁబడి యుందురనియు, నాభక్తుఁడు చండాలుఁడైనను వానినిబుద్ధిమంతుఁడు అవమానింపఁగూడదు. అట్లవమానించువాఁడు రౌరవనరకమునఁబడును అనియు (నశూద్రాభగవద్భక్తా । విప్రాభాగవతాస్మృతాః । సర్వవర్ణేషుతేశూద్రా । యేహ్యభక్తాజనార్దనే) అనఁగా భగవద్భక్తుఁడు శూద్రుఁడు కాఁడనియు వానినివిప్రునిగను బ్రాహ్మణునిగను తలఁపవలయుననియు, సర్వజాతులయందును భగవద్భక్తులుకానివారు శూద్రులనియు (భక్తిరష్టవిధాహ్యేషా । యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతే । సవిప్రేంద్రోమునిశ్శ్రీమాన్ । సయతిస్సచపండితః । తస్మైదేయంతతోగ్రాహ్యం । సచ

తోఁగూడి కాలమునుగడపుచు అట్టిసహవాసము సిద్ధింపనియపుడు విజనస్థలమున వసించి భగవధ్యానముచేయుచు అముముక్షువులకు మోక్షకారణమగుజ్ఞానమునుపదేశించుచు ఆచారహీనులకు తమయుపదేశానుష్ఠానములచే ఆనృశంస్యాదిసదాచారములను కలుగఁజేయుచు ఫలింపనియెడల అనుతాపయుక్తులై భగవంతునిని ప్రార్థించుచు సర్వప్రాణులకును సాధ్యమైనవఱకు మేలుచేయుచు తమకుఁగీడుచేయువారిని ద్వేషింపక మనకర్మానుగుణముగ భగవంతుఁడు వీరలచేనిట్లు చేయించెనని తలఁచుచు శాంతచిత్తులై జితేంద్రియులై మితాహారులై యథాలాభసంతుష్టులై వర్తింతురేని భగవంతునికి అత్యంతాభిమతవిషయమగుదురు.

ఈభక్తవిజయమునందు ప్రస్తావింపఁబడియుండు భక్తులు ఇట్టినిష్ఠతోఁగూడి భక్తిక్రీతుఁడగు శ్రీపాండురంగని తమకుస్వాధీనునిగ చేసికొనివానితోఁగలసి పరమానందము ననుభవించి తమజ్ఞానానుష్ఠానములచే పెక్కండ్రను తమవలె జీవన్ముక్తులనుజేసిరి. కావున అట్టిపరమభక్తుల చరిత్రమును భక్తియుక్తులైపఠించువారివిషయమున శ్రీపాండురంగనాథుఁడు పరమకృపాళుఁడై దూడనుబోఁగొట్టుకొన్న ధేనువు ఆదూడచర్మముచే మూయఁబడినయాకారమునుజూచి తనదూడనుస్మరించుకొని పాలిచ్చునట్లు జయదేవ, జ్ఞానదేవ, నామదేవాదులవంటి పూర్ణభక్తులులేనియీకాలమున వారిచరిత్రమునుప్రేమతోఁడఁబఠించువారినిజూచినంతట ఆభక్తులనుస్మరించి వారికిచేసినకటాక్షమును వీరలయందును జేయుననుటకు సందియములేదు.

అవరవర్ తమతమదఱివఱివకై వకై ।
అవరవరిఱైయవరెనవడియడైవర్ కళ్ ।
అవరవరిఱైయవర్ కుఱైవిలరిఱైయవర్ ।
అవరవర్ విధివళియడైయనిన్ఱనరే ॥

కం॥ తమతమనేర్చువిధంబులఁ ।
దమతమకిష్టమగుదేవతలఁగొల్చెదరునా ।
యమలులకన్నివిధంబుల ।
నమరనుపాస్యుఁడయియీశుఁడభినందించున్ ॥

గీ॥ ఎందఱెన్నివిధంబులనీశుఁగొల్తు ।
రందఱికినన్నివిధములనధిపుఁడుండు ।
దేనిఁగోరినవారికిదానినొసఁగు ।
నైదియుఁగోరనిసుజ్ఞానికిచ్చుముక్తి॥

అవతారికసంపూర్ణము.

శ్రీపాండురంగపరబ్రహ్మణేనమః॥



## ( भ )



    

శ్రీ

అస్మద్గురుభ్యోనమః.

శ్రీమతేరామానుజాయనమః.

శ్రీపాండురంగపరబ్రహ్మణేనమః.

# భక్తవిజయము.

## మొదటిభాగము.

### మొదటియధ్యాయము.

॥శ్లో॥ శ్రీవత్సవంశాంబుధిపూర్ణచంద్రం ।
శ్రీవేంకటాచార్యసుతంమమేశం ।
వాత్సల్యసౌశీల్యగుణాంబురాశిం ।
శ్రీమన్నృసింహార్యమహంనమామి ॥

॥శ్లో॥ నమామితం వేంకటతాతదేశికం ।
నమామిరామానుజయోగిపుంగవం ।
నమామిరంగేశ్వరవల్లభాంతాం ।
నమామిరంగేశయమస్మదీశమ్ ॥

॥శ్లో॥ శ్రీదేవరాజపతిపూర్ణకృపైకపాత్రం ।
శ్రీరంగనాథమహనీయగుణార్ణవాబ్ధిం ।
శ్రీమత్సమస్తగుణాకరమార్యభోగ్యం ।
శ్రీవేంకటాద్రిగురుపుంగవమాశ్రయామః॥

॥శ్లో॥ విష్వక్సేనకులోద్భూతం ।
దేవేశానందవర్ధనం ।
యతిరాజప్రియంవందే ।
మద్గురుంభక్తవత్సలం ॥

॥గీ॥ తల్లిదండ్రులసిరియుమాధవుఁడునసుచు ।
భువినచంచలభక్తినిబూజచేసి ।

వాసుదేవునపేక్షించిరన్నికెక్క ।
నాయశోనిధిపుండరీకాక్షుఁదలఁతు ॥

॥గీ॥ అవనినతిథులహారరూపమనుచునసమ ।
భక్తిఁబూజించిశాశ్వతపదముఁగనిన ।
రంతిదేవునుదర్శనుసంతతంబు ।
వినుతిఁజేసెదఁగుతుకితవేవిధముల ॥

॥గీ॥ అన్యమెఱుఁగకగురువులయంఘ్రియుగముఁ ।
గరమునర్చించితన్నియోగమునదాశ ।
రథికినాతిథ్యమొనరించిబుధులవలన ।
వినుతిఁగాంచినశబరినివినుతిసేతు ॥

॥గీ॥ దైవతములనిభర్తలధరణిఁగొలిచి ।
యశముఁగాంచినయనసూయనలయురుంధ ।
తినిఁబతివ్రతనాళాయనినిదలంచి ।
స్తుతియొనర్చెదసావిత్రినతులభక్తి ॥

॥సీ॥ కర్మయోగముచేతఁగమలాక్షుఁగొల్చినజనకాదులనుభక్తివినుతిచేసి ।
జ్ఞానయోగముచేతఁజక్రిఁజేరినభరతాదియోగులభక్తిఁగొలిచి ।
భక్తియోగముచేతభక్తవత్సలుఁగన్నప్రహ్లాదముఖులసద్భక్తిఁదలఁచి ।
శుద్ధప్రపన్నులైయిద్ధరవేదమార్గప్రవర్తకులైనఘనులమునుల ।
నలవసిష్ఠునినారదుయాజ్ఞవల్క్య ।
శక్తిహారీతశుకుఁబరాశరునిగార్గ్య ।
సత్యవతిసూనుశౌనకుసంతతంబు ।
నుతియొనర్చుచునలగొనినతియొనర్తు ॥

॥గీ॥ విష్ణుభక్తికినిధులనివినుతిగనిన ।
వకుళభూషణముఖయోగివరులబుధుల ।
నాథయామునమునియతినాథగురుల ।
నతులభక్తినిఁబూజించినుతియొనర్తు ॥

॥కం॥ శ్రీపాండురంగనాథుని । శ్రీపాదాబ్జములకెఱఁగిచెందినవేడ్కన్ ।
శ్రీపతికరుణలిఖించెదఁ । బాపాటవికగ్నియైనభక్తవిజయమున్ ॥

॥కం॥ వనజద్వయమైమతియును । వనజద్వయమైమనోజ్ఞవామనవిభుఁడై ।
తనరగరామత్రయమై । మనుపవెమహిఁగృష్ణకల్కిమంజులవేషా ॥

॥కం॥ ధరభగవద్గీతనుసుర । నరులకుమోక్షైకసాధనంబనికుంతీ ।
వరసుతునికానతిచ్చిన । పరమదయాసింధువైనపండరినాథా ॥

అవధరింపుము.

శ్రియఃపతియై, అఖిలహేయప్రత్యనీకుఁడై, సమస్తకల్యాణగుణాత్మకుఁడైన సర్వేశ్వరుఁడు భూభారావతరణవ్యాజముచే శ్రీకృష్ణుఁడైయవతరించి సకలమనుజనయన విషయభూ

తుఁడై పండితపామరసాధారణముగ నెల్లరును స్వవిషయమున నాసక్తులు కాఁదగిన గుణచేష్టితములను బ్రకటించి పూతనాశకటయమళార్జునారిష్టధేనుకకాళియకేశికువలయాపీడ చాణూరకంసాదిదుష్టులనిగ్రహించి అనవధికదయాసౌహార్దానురాగ గర్భమగునవలోకనాలాపామృతముచే విశ్వమునురక్షించి నిరతిశయసౌందర్య సౌశీల్యాదిగుణగణముచే అక్రూరమాలాకారాదులను పరమభాగవతులుగఁజేసి యర్జునునికి యుద్ధప్రోత్సాహమును కలుగఁజేయు వ్యాజముచే సర్వోపనిషత్తులను గోవులుగను అర్జునునివత్సముగనుజేసి గోపాలనందనుఁడగు తాను దోగ్ధయై భోక్తలగుసాధువులకు గీతామృతమగుదుగ్ధమునొసఁగి తద్ద్వారాపరమపురుషార్థలక్షణమోక్షసాధనముగ వేదాంతోక్తంబగు కర్మజ్ఞానాంగకభక్తియోగమును ప్రకటించి నిజలోకమునుజెందినపిదప లోకము కలికలుషాంధకారావృతమయ్యెను.

ఇట్టిక్రూరకాలమున వర్ణాశ్రమాచారములనడువడివిపరీతమయ్యెను. అదిలేనందునవేదోక్తములగు యాగాదిసత్క్రియలు లేవయ్యెను. ధర్మమైన వివాహములు జరుగవయ్యె. గురుశిష్యక్రమముతప్పిపోయె. దంపతులనడువడియొప్పదయ్యె. దేవయజ్ఞాదులునులోపించె. బలవంతుఁడే కులవంతుఁడై జననాథుఁడయ్యె. శిలవిద్యలు నిష్ప్రయోజనములై ధనవంతుఁడే కన్యాదానార్హుఁడయ్యె. బ్రాహ్మణులయందు శాస్త్రోక్తవిధిదీక్షలు లేవయ్యె. శాస్త్రోక్తప్రాయశ్చిత్తములు అనంగీకారములయ్యె. ప్రియవచనములెల్ల శాస్త్రవచనములయ్యె. సర్వాశ్రమంబులును సర్వాధికారమయ్యె. స్వల్పద్రవ్యముచేతనే (ఈశ్వరోహమహంభోగీ) అను దురభిమానము జనించెను. స్త్రీలు ధనహీనులగు స్వభర్తలనుపేక్షించి ధనవంతులగు పరపురుషులయందనురాగయుక్తలైరి. ఆత్మజ్ఞానము నలక్ష్యముచేసి ధనార్జనమునే జనులు బుద్ధిఫలముగాకైకొనిరి. యాగాదులనుపేక్షించి ఆద్రవ్యమును గృహనిర్మాణాదులకుపయోగించిరి. అగ్రహాదులను అతిథులకుపయోగింపక స్వభోగమునకేయుపయోగించిరి. పురుషులన్యాయముగధనార్జనముచేయువారలయందు అత్యంతప్రీతియుక్తులైయుండిరి. కాలమున వర్షములేక క్షుద్బాధముచే మనుజులుఆకాశమందేదృష్టిగలవారైరి. అగ్నిపూజ, దేవపూజ, అతిథిపూజ, పిండోదకదానరూప పితృపూజ వీనినివర్జించి స్నానముచేయకయే భుజించి మనుజులు కాలముకడపువారైరి. స్త్రీలు అత్యాశయు, హ్రస్వదేహమునుగలవారై యధికముగభుజించుచు పెక్కండ్రు బిడ్డలనుగని ద్రవ్యహీనలై కష్టపడువారైరి. మఱియు రెండుచేతులతో తలనుగోకికొనుచు భర్త, మామమొదలగువారియాజ్ఞను మిగులననాదరముతోడ తిరస్కరించుచు దేహశుద్ధిలేకహీనమగు తలంపుగలవారై కఠినాక్షరములుగ అసత్యమాడసాగిరి. కులస్త్రీలుదురాచారవతులై యట్టివారలతో స్నేహించి స్వభర్తలకు బహువిధములగు చెడుగులను జేయువారైరి. బ్రహ్మచారులు వ్రతానుష్ఠానరహితులై వేదాధ్యయనముచేయువారైరి. గృహస్థులు కొంచెమైనను హోమాదులనుజేయక ఉచితవిషయమున ధనవ్యయమును జేయనివారైరి. వానప్రస్థులు గ్రామ్యవస్తువులను భుజించువారైరి. సన్న్యాసులు దారాపుత్రాదులయందు ప్రీతియుక్తులైరి. రాజులుజనపరిపాలనముముఖ్యధర్మమనియెంచక యధికముగపన్నులు విధించికాపులద్రవ్యము నపహరించువారైరి. ఇట్లు వర్ణాశ్రమధర్మములు నశించి వేదమార్గము అదృశ్యమైజనులు అధర్మప్రవర్తకులైనందున ఆయువుక్షీణించె. స్త్రీలు అతిబాల్యముననే పుత్రవతులైరి. పురుషులు బాల్యావస్థయందే పుత్రోత్పాదనమునకు శక్తులైరి. జనులు అన్నవిక్రయులైరి.

విప్రులు వేదవిక్రయులైరి. గురువులు హితోపదేశమును మాని శిష్యవిత్తాపహారులైరి. ఇట్లు సకలజనులును కలిచే పీడితులై దుఃఖసాగరమగ్నులైయుండుటను శ్రీమన్నారాయణుండు కటాక్షించి సదాతనపాదసేవసేయుచు అన్యవిముఖులైయుండు నంతరంగ భక్తులను బిలచి నేను రామకృష్ణాద్యవతారములు చేసి లోకమును రక్షించినట్లు మీరు శ్రీపండరిపురము మొదలగు పుణ్యక్షేత్రములయందు జనించి భగవన్నామసంకీర్తనపరులై లోకులనుజ్జీవింపఁజేయుఁడు. నేను మీయందావేశించి మీపూనికను నిర్విఘ్నముగఁగొనసాగించెదననియనుగ్రహింపఁగా ఆభక్తులందఱు దేవదేవునిదివ్యాజ్ఞను శిరసావహించి శ్రీపండరిపురము మొదలగు దివ్యక్షేత్రములయందవతరించి తమజ్ఞానానుష్ఠానములచే సంసారులకు భగవద్విషయమున భక్తిని, సంసారమున విరక్తినిగలుగఁజేసియుజ్జీవింపించిరి.

శ్రీకృష్ణాయపరబ్రహ్మణేనమః.

రెండవయధ్యాయము.

## శ్రీ జయ దేవ చ రి త్ర ము.

శ్రీభగవదాజ్ఞచే శ్రీజగన్నాథక్షేత్రమునకు సమీపమందుండు తిందుబిల్వమను గ్రామమున శ్రీకృష్ణద్వైపాయనాంశముచే శ్రీజయదేవులు బ్రాహ్మణకులమున నవతరించిరి. తల్లిదండ్రులు వీరికుపనయనాదులనుజేసి విద్యాభ్యాసము చేయింపకయుండఁగా భగవత్కటాక్షముచేత తనంతటసకలశాస్త్రములను నధికరించి నక్షత్రములలో చంద్రునివలె ప్రకాశించిరి. పూర్వము వేదవ్యాసులు శ్రీకృష్ణగుణచేష్టితములందు మిగులనీసుపడినచందమున వ్యాసాంశజులగు నీజయదేవులును శ్రీకృష్ణగుణానుభవపరులై గీతగోవిందమను నొకప్రబంధమును జేసి సకలలోకులకును జ్ఞానమార్గమును కల్పించిరి. అపుడు శ్రీజగన్నాథక్షేత్రవాసియగు సాత్యకియను రాజు శ్రీజయదేవుల గ్రంథమువలె తానును నొకగ్రంథమును జేసి ఇదిదానివలె ప్రకాశింపవలయునను నపేక్షచే సకలజనులును దీనిని పఠింపవలయుననియాజ్ఞాపించెను. అపుడు సకలవిద్వజ్జనులును గూడి రాజునాజ్ఞ ననాదరించి యోరాజా నీగ్రంథము శ్రీజయదేవుల గ్రంథమునకు సాటియగునే. సర్వజ్ఞునికైన ఆత్మప్రశంస కూడదు. (ఆత్మప్రశంసామరణం పరనిందాచతత్సమః) అను వాక్యమును వినియెఱుఁగవే. నీగ్రంథము సర్వేశ్వరునికిన్ని తదీయులకును అంగీకారము కానేరదు. శ్రీజయదేవుల గ్రంథము మాత్రమే మాకు శ్రవణపఠనమునకు యోగ్యమగును. అనిన విని రాజిట్లనియె. ఈరెండు గ్రంథములను శ్రీజగన్నాథుని సన్నిధానమున నునిచి యుంచెదది భగవదంగీకారమగునో చూతము అనిన రాజుమాటలకు విద్వాంసులును, భగవద్భక్తులును సమ్మతించి యొకరాత్రియా రెండు గ్రంథములను శ్రీజగన్నాథుని యగ్రభాగమున నునిచి సన్నిధితలుపులను ముద్రించి బీగమును రాజుచేతికిచ్చి మఱునాఁడందఱును రాజును పురస్కరించుకొని సన్నిధితలుపులను తెఱచి భగవన్మందిరమునఁ బ్రవేశించి పరీక్షించునపుడు శ్రీజయదేవుల గ్రంథము భగవత్సామీప్యమున నుండెను. రాజుగ్రంథము సన్నిధికి వెలుపట పాఱవేయఁబడియుండెను. ఈయాశ్చర్యమును జూచిన యెల్లరును అపరిమితానందమును జెందిరి. రాజుమాత్రము సిగ్గుపడి తలవంచుకొనియుండెను. అప్పుడందఱును శ్రీజయదేవుల గ్రంథమునకు రాజుగ్రంథము ఏకదేశముచేతను సమముకానం

దున శ్రీజగన్నాథుఁడు నిరాకరించెనని చెప్పిరి. రాజు మిగుల ఖిన్నుఁడై భగవత్సన్నిధిని నిలచి స్వామిని బహువిధముల నుతించి సర్వసముఁడవగు నీవు ఒకని నిగ్రహించి మఱియొకని ననుగ్రహించుట న్యాయము కాదు. తల్లిదండ్రులు బిడ్డలకందఱికిని సములై యుండునట్లు నీవును ఆశ్రితులకందఱికిని సముఁడైయుండవలసిన మర్యాదను విడిచి శ్రీజయదేవుల గ్రంథమును మాత్రమంగీకరించి నా గ్రంథమును నిగ్రహించుట మిగుల అనీతియైయున్నది. నీచే అవమానింపఁబడిన నేను నా శిరమును నీపాదములయందే యర్పించెదను. అని నిష్ఠురములాడు రాజును జూచి కృపాజలధియగు శ్రీమన్నారాయణుఁడు ప్రసన్నుఁడై రాజు గ్రంథమునుండి యిరువదినాలుగు శ్లోకములను శ్రీజయదేవుల గ్రంథమునఁ జేర్చి రాజును ఆనందింపించి యంతర్ధానమయ్యెను.

ఆకాలమున శ్రీజగన్నాథక్షేత్రమున మిగుల ధనవంతుఁడగు నొక బ్రాహ్మణునికి స్త్రీసంతానము గలిగెను. ఆశిశువుయొక్క కన్నులసొగసును జూచి తల్లిదండ్రులు పద్మావతియని అన్వర్థనామమును నిచి పెంచుచు లావణ్యవతియైన యాకన్యకను శ్రీమన్నారాయణుఁడే వరుఁడు కావలయునని మనోరథించుచుండిరి. ఈకన్యకను అపేక్షించు బంధువులకు తమపుత్రిక శ్రీకృష్ణార్పణమయ్యెనని చెప్పసాగిరి. ఇట్లాకన్యక దినదినప్రవర్ధమానయగుచుండ ఒకనాఁడు శ్రీజగన్నాథుఁడా బ్రాహ్మణుని స్వప్నమునందు ప్రత్యక్షమై విప్రోత్తమా నీసుతను నాకు దత్తము చేసితివిగదా. నాయభిప్రాయానుసారముగ ఈకన్యకను మదంశభూతుఁడగు శ్రీజయదేవునికిచ్చి పాణిగ్రహణము చేయింపుము. ఇందుచే నానందము వర్థిల్లును అని యనుగ్రహించి లోకనాయకుండంతర్ధానమయ్యెను. బ్రాహ్మణుఁడు మేల్కని స్వప్నమును జింతించి ఆనందాంబుధిమగ్నుఁడై యప్పుడే శ్రీజయదేవులను బ్రార్థించి తోడితెచ్చి వివాహమంటపమలంకరించి సుముహూర్తమున భగవన్నియమనానుసారముగ సాలంకృతకన్యాదానము చేసి (అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా) అని తనభాగ్యమును తానే కొనియాడుచుండెను. శ్రీజయదేవులకు భగవద్విషయమున పరమభక్తి దినదినప్రవర్ధమానమగుచుండెను.

అట్టిసమయమున పరదారపరిగ్రహ, పరద్రవ్యాపహార, అసత్యకథన, అభక్ష్య భక్షణ, అపేయపానాదిదురాచారరహితుండును భూతదయ, పశ్చాత్తాప, శాస్త్రవిశ్వాస, దేవబ్రాహ్మణశుశ్రూషాదిసద్గుణవంతుఁడునగు నొకదేశాంతరవణిజుఁడు ఉజ్జీవనేచ్ఛచే శ్రీజయదేవస్వామినాశ్రయించెను. శ్రీజయదేవులు వానిని భగవద్భక్తియోగనిష్ఠునిఁ జేసియనుగ్రహించిరి. పిదప నావర్తకుఁడు సదానుభవయోగ్యులగు శ్రీజయదేవులను జూచి మీరు నాయూరికి వేంచేసి నాయింట నిత్యవాసము చేయవలెనని ప్రార్థింప కృపానిధులగు శ్రీజయదేవులట్లు చేసి యొకతెగక యావర్తకునికి హితోపదేశము చేయుచుండిరి.

ఇట్లు శ్రీజయదేవులావర్తకుఁడు చేయునట్టి శుశ్రూషలకు సంతోషించుచు నొకమాసమచటవసించి మరల జగన్నాథమునకు పోవలయునని వర్తకునితోఁ జెప్పఁగా ఆవర్తకుఁడు వీరికి సకలోపచారములు చేసి సాష్టాంగదండప్రణామంబాచరించి యొకరథమును సిద్ధపఱచి శ్రీజయదేవులు నిరపేక్షులు గాన వారికెఱుక చేయక యారథమున అనర్ఘరత్నాది బహుద్రవ్యములను గుప్తపఱచి యిద్దరు సేవకులను బిలచి మీరీద్రవ్యమును నావందనపూర్వకముగ శ్రీజయదేవుల భార్యకు సమర్పింపవలయునని దిట్టము చేసి శ్రీజయదేవులను రథమెక్కించి సేవకులను గూర్చి పంపెను. మార్గమధ్యమున వంచకులగు నా సేవకులిరువురిలో నొకఁడు తనభార్య గర్భిణి

గాన తన్ను ఇంటికిఁ బనుపవలయుననియు, మఱియొకఁడు తనకు నిర్బంధమగు కార్యముండుటచే తనకనుజ్ఞయిచ్చి పనుపవలయుననియు, ప్రార్థించి శ్రీజయదేవులయనుమతిని జెంది యిండ్లకుఁ బోవువారివలె నటించిపొంచియుండి మార్గమధ్యమున శ్రీజయదేవులనుఅడ్డగించి రథముననున్న సర్వధనమునుసపహరించి తమచౌర్యమును శ్రీజయదేవులు బయలుపఱతురని శంకించిభీతులై వారికాళ్లుచేతులను ఛేదించి యొకపాడునూతిలో వారిని బడవైచిపోయిరి.

అపుడు శ్రీజయదేవులు మైమఱచినిరంతరభగవదనుభవముచేయుచు ఆనందపరవశులైయుండిరి. అట్టిసమయమున వింధ్యదేశాధీశుఁడు యాదృచ్ఛికముగనచటికివచ్చి యారాత్రి ఆవనమునవసించియుండఁగా ఈపాడునూతియందొకప్రకాశమగుపడిన ఆశ్చర్యమును జెంది వచ్చిచూచి ధ్యానయోగపరులై శ్రీభగవన్నామసంకీర్తనముచేయుచున్న శ్రీజయదేవులను జూచినూతినుండి బయటికి వెడలఁదీసియప్పటి వారిదుర్దశకెంతయు ననుతపించిదేవరవారికిట్టియవస్థగలిగినందునకు కారణమేమనియడుగఁగా శ్రీజయదేవులు ఏకాక్షి ప్రభృతిరాక్షసస్త్రీలదోషమును శ్రీరామునికెఱుకచేయకుండిన జనకకులసుందరివలె తన్ను బాధించిన సేవకులదోషమును బయలుపఱుపక తనకు జననమాదిగ కరచరణములు న్యూనముగానే యున్నవియని చెప్పిరి. రాజుఅదివిని వీరెవ్వరోమహానుభావులు, పరమభక్తులు. ఇంతయాపదయందును పరానర్థమును సహింపక తనకుఁగీడుచేసినవారిదోషములను సహితముమఱుఁగుచేసెదరు. అని చింతించివారిని ప్రార్థించియొకపల్లకిలోనుంచుకొని తనపట్టణమునకుఁ దీసికొనిపోయి యుచితస్థానముననునిచియేఁబదిపరిచారకులనునియమించి సర్వోపచారములను జేయించుచుండెను. ఆపరిచారకులు ఇట్టిపరమభాగవత శుశ్రూష తమకు కోరకయేసిద్ధించినందున జన్మసాఫల్యమయ్యెనని యానందించి జాగరూకులై శుశ్రూషచేయుచుండిరి. రాజు ప్రతిదినమునువచ్చి శ్రీజయదేవులను సేవించి పోవుచుండును. ఒకనాఁడు మోక్షోపాయమగు సులభసాధనమొకటి ననుగ్రహింపవలయునని రాజు ప్రార్థింప శ్రీజయదేవులు సాధువులగు తదీయులనారాధించుటకంటె గొప్పధర్మములేదు. (సిద్ధిర్భవతివానేతి । సంశయోచ్యుతసేవినాం । నసంశయోస్తితద్భక్త । పరిచర్యారతాత్మనాం) అనఁగా అచ్యుతునినారాధించువారికి మోక్షసిద్ధివిషయమున సంశయముగలదు, తదీయులకుపరిచర్యచేయువారికి నిస్సంశయముగమోక్షము లభించును. తదీయులకునామరూపములే ముఖ్యములుగావు. వైరాగ్యాద్యాంతరవేషముచే తదీయులనిశ్చయింపవలయును. అట్టియాంతరవేషము నెఱుఁగుట మిగులనసాధ్యము. ఉపదేశాదులకు ఆంతరవేషమును బరీక్షించియెఱుఁగవలయునే కాని సత్కారమునకంత నిర్బంధము లేదు. భగవద్విభూతియగు చేతనులనెల్లనుతదీయులనిభావించిసత్కరింపుము. రాజపుత్రుఁడు నృత్తుఁడై స్వస్వరూపమును, జననీజనకులస్వరూపమును మఱచియుండినను లోకులువానిని రాజపుత్రుఁడని గౌరవించునట్లు ఈశ్వరసంతానమగుచేతనులలోఁ గొందఱుస్వస్వరూపమును ఈశ్వరస్వరూపమునుమఱచి జడప్రాయులైవర్తించినను నీవువారలను అగౌరవింపక తదీయభావముచేసిసత్కరింపుము. ఇట్టిగంభీరభావముచే ఈశ్వరుఁడునీకువశవర్తియై యుండునుగాన నిత్యముతదీయారాధనపరుండవై యుండుటయుచితమనినియమింప మహాభాగ్యుసుని వారియాజ్ఞనుశిరసావహించి యన్నవస్త్రాదులచే దేశాంతరాగతులగు: తదీయులను శ్రద్ధాభక్తిసమన్వితుఁడై యారాధించుచువచ్చెను.

ఇట్లుండ శ్రీజయదేవులను హింసించినక్రూరసేవకులు రాజు తదీయారాధనపరుఁడైయుండుటనువిని సాధువేషములనుధరించి రాజమందిరమునఁబ్రవేశించి యచట అచింతితముగ శ్రీజయదేవులనుజూచి భయపడి వడవడవణఁకసాగిరి. పరమశాంతులై పరదోషానభిజ్ఞులగు శ్రీజయదేవులు వీరలనుసమ్మానించి యాలింగనముచేసికొని సమీపవర్తులగు పరిచారకులనుజూచి వీరిరువురు పరమభాగవతులు. ఇదివఱకిటువంటియుత్తములిచ్చటికివచ్చినదిలేదు. కానవీరలను రాజువద్దకుఁగొనిపోయి మిగులసమ్మానించునటుల చెప్పుఁడనినియమించిరి. ఆపరిచారకులును మహాభాగ్యుని శ్రీజయదేవాజ్ఞను రాజునకెఱుకచేయ రాజు ఈకపటవేషధారులకు అభ్యుత్థాననమస్కారములుచేసి నానావిధపూజలొనర్చి వారలయిష్టానుగుణముగ ద్రవ్యరాసులనొసఁగి కొన్నినాళ్లు తనయింటవసించి తన్నుఁగృతార్థునిజేయవలయునని ప్రార్థించెను. వారుకపటచిత్తులుకాన, శ్రీజయదేవశాసనముచే తమకెట్టిదండనగలుగునోయనిశంకించి దినేదినేకృశించుచుండిరి. శ్రీజయదేవులువీరలశరీరకార్శ్యతనురాజువలనవిని నరేంద్రా వీరలు పరమభాగవతులు. శబ్దాదివిషయములందత్యంతవిరక్తులు. కానవీరలకుశరీరకార్శ్యత దినదినప్రవర్ధమానమగుచున్నది. ఇట్టిమహాత్ములు క్షణకాలమొకచోట నిలుకడగవసింపరు. నీభాగ్యవశముచే ఇన్నాళ్లిచటవసించిరి. కాననీఁకను వారలనునిర్బంధముచేయక స్వేచ్ఛగాపనుపుము. అనినవిని రాజువారలకు వందనముచేసి మహాత్ములారా ఇన్నాళ్లునానిర్బంధముచే నిచటవసించితిరి. ఇఁకనుమీరుస్వేచ్ఛగఁబోవచ్చునని సవినయముగఁబ్రార్థించి వారియిచ్ఛానుగుణముగ రెండురథములనుసిద్ధపఱచి యందపరిమితరత్నాభరణధనరాసులనునిచి వారలనురథముటెక్కించి కొంతసేనలనుగూర్చిపంపెను. ఆకపటభాగవతులు శ్రీజయదేవులకునమస్కరించి వారియనుమతినిజెందిబయలుదేరి యరణ్యమధ్యమునఁబోవుచుండఁగా తోడువచ్చినసైన్యములోఁ గొందఱురాజభటులు ఈవంచకులనుజూచి పరమభాగవతోత్తములారా మారాజుగృహమునకు అనేకకోటిభాగవతులువచ్చెదరు. అందెవరికిని శ్రీజయదేవులింతసమ్మానముచేయించినదిలేదు. మీవిషయమునవారికిఁగలిగియుండిన విశ్వాసముమిగుల నాశ్చర్యకారియైయున్నది. ఇందుకుకారణమునుదెలుపవలయునని వందనపూర్వకముగఁ బ్రార్థింపఁగా ఆకుటిలచిత్తులిట్లనిరి. అవంతిదేశపురాజువద్ద ఈశ్రీజయదేవులు ప్రధానులైమేము సేవకులమైయుంటిమి. ఒకదినమున శ్రీజయదేవులు మహాపరాధముచేసినందున రాజుకోపించి శ్రీజయదేవులను చంపిరండనిమాకునియమించెను. మేము వీరినికట్టి నిర్జనారణ్యమునకుఁగొనిపోయి యానృశంస్యముచేచంపక కరచరణములనుమాత్రము ఛేదించి యొకపాడునూతిలో వీరినింబడవైచి రాజెఱిఁగినదండించునని వెఱచి యదిమొదలుగ విరక్తులమై దేశాటనముచేయుచు నిచటికివచ్చితిమి. వచ్చినచోట తన్నురక్షించినమహోపకారకులనియుపకారస్మృతిచే శ్రీజయదేవులుమాకింత సమ్మానముచేయించిరనిచెప్పిరి. ఈయనృతమునుసహింపఁజాలక భూమిరెండుచీలికలు కాఁగా ఆవంచకులురథములతోడనాపగుళ్లలో దిగఁబడిభూమయమైపోయిరి. ఈయాశ్చర్యమునుజూచినరాజభటులుపరుగెత్తివచ్చి జరిగినవృత్తాంతమును రాజునకును, శ్రీజయదేవులకునువిన్నవించిరి. అదివిని శ్రీజయదేవులు అతిదుఃఖితులై సర్వేశ్వరుని బహువిధములఁబ్రార్థించి జగదీశా నీకుకీడుచేసిన పూతనకంసశిశుపాలాదులకు పరమపదమునొసఁగిరక్షించినట్లు నాకువిరోధముచేసినయీవంచకులిరువురిని రక్షింపవలయునని ప్రార్థింపఁగా శ్రీరుక్మిణీకాంతుఁడుప్రత్యక్షుఁడై శ్రీజయదేవులకు కరచరణంబులొసంగి తిరోహితుఁడయ్యె. ఈయద్భుతమునువిని రాజుభయభక్తులతోడ శ్రీజయదేవులకు ప్రణామమొనర్చి సకల

రాజుభార్య కపటముగ నేడువసాగెను. ఈవృత్తాంతము చెవులసోకినంతట పతివ్రతాతిలకముగు పద్మావతి భర్తను స్మరించుచు, అవశయై భూమిమీదఁబడి మృతిచెందెను. అపుడు రాజుభార్య ఈయాపత్సముద్రము నేవిధమున నీదవచ్చునని భయపడుచుండ తత్క్షణమున రాజు శ్రీజయదేవులతోడ పట్టణమునకువచ్చెను. తోడనే జరిగినవృత్తాంతమును రాజువిని ప్రధానినిరప్పించి యానుపూర్వముగ సమస్తమును దెలిసికొని యిట్టియనర్థమునకు హేతుభూతయగు స్వస్త్రీని జంపిన స్త్రీహత్యగలుగును గాన తానే ప్రాణములను విడుచుట మేలని తలఁచి నిజపుత్రుని రప్పించి యుచితమగు బుద్ధిమతులు చెప్పి యగ్నిని ప్రజ్వలింపఁజేసి యాయగ్నికి ప్రదక్షిణము చేసి యందుఁ బ్రవేశించుటకు మునుపు శ్రీజయదేవులనియమనమును జెందవలయునని తలఁచి తత్సన్నిధికివచ్చి సాష్టాంగప్రణామమాచరించి యోగురుపుంగవా నేను మహాపాపినిగాన దేవరవారి ధర్మపత్నికి శరీరవియోగము సంభవించెను. ఇందుకు మూలభూతుఁడగు నాకు అగ్నిప్రవేశము తప్ప వేఱు ప్రాయశ్చిత్తము లేదు. దేవరవారికి అచిద్వత్పరతంత్రమగు నీయాత్మకు యమవశ్యత మాని భగవద్విషయీకారము కలుగునట్లు అనుగ్రహింపవలయునని వేఁడఁగా శ్రీజయదేవులు సమీపవర్తులవల్ల గతవృత్తాంతమును విని రాజుచేతిని బట్టుకొని యోరాజా నీవు శరీరత్యాగము చేసికొనవలదని పలుదెఱంగుల నాదరవచనములను జెప్పుచు పద్మావతినిర్యాణమైన స్థానమునకువచ్చి శ్రీవారిని ధ్యానించి యిరువదినాలుగు అష్టపదులను బాడి యానందపరవశులై నృత్యము చేసి సహస్రనామములనుచ్చరించుచు శ్రీజగన్నాథా అబుద్ధిపూర్వకముగ సిద్ధించిన యపవాదమునుండి యీరాజును రక్షింపవలయునని ప్రార్థింప భక్తవత్సలుఁడు ప్రత్యక్షమై శ్రీజయదేవులను ఆలింగనము చేసికొని ఓ సాధుజనాగ్రేసరా నీస్తోత్రమునకు పరవశుఁడనైతిని. నీవు పాడిన యష్టపదిని భక్తితోఁ బఠించువారలచెంత నేను లక్ష్మీసహితుఁడనై వర్తింతును అని యనుగ్రహించి పద్మావతిని బ్రతికించి యంతర్ధానమయ్యెను. పద్మావతి నిజభర్తకు ప్రదక్షిణనమస్కారములాచరించి యంజలిహస్తయై నిలుచుండ దేవతలు పుష్పవర్షము వర్షించిరి. రాజు సకుటుంబముగ శ్రీజయదేవులను శరణుఁజెంది జాగరూకుఁడై శుశ్రూష చేయుచుండెను. అవర్తకుఁడు ఈవృత్తాంతమునంతయు విని యాశ్చర్యానందములను జెంది శ్రీజయదేవసన్నిధికివచ్చి భయభక్తులతోడ శుశ్రూషాపరుఁడై యుండెను. లోకులెల్లరు శ్రీజయదేవుల మాహాత్మ్యమును గొనియాడుచు శ్రీగీతగోవిందమును భక్తియుక్తులై సదాగానము చేయుచుండిరి.

శ్రీజగన్నాథాయనమః.

---

## మూడవయధ్యాయము.

## తులసిదాసులచరిత్రము.

హస్తినాపురమున బ్రాహ్మణకులమునందు ఆత్మారాముఁడను వానికి వాల్మీకాంశము చే నొక పుత్రుఁడు జన్మించెను. ఆపుత్రునికి పండ్రెండవదినమున తులసిదాసులని నామకరణము చేయఁబడియెను. అపుడా దేశమునకు ధార్మికుఁడైన అగ్బర్ పాచ్ఛా అను నాతఁడు రాజై యుండెను. ఆరాజు ఆత్మారామునిని ప్రీతితోడ కాపాడుచు తులసిదాసులయందును అభిమానముతో నుండెను. తులసీదాసులకు పండ్రెండవయేట మాతాదేవియనుకన్యకను పాణిగ్రహణము చేయించిరి. ఆయు

ట్టుకొని గోడయెక్కి యుదుమికి గృహములోపలఁ బ్రవేశించితిరి. ఇది శీలవంతులనదువడి కాదు. ఆస న్నముకలిగియుండిన ఈయాపదను, అపవాదమునునివర్తించువారెవ్వరు (సంసారేకింసారం) అనురీతిని సంసారము అసారమైనది. శరీరము నీటిబుగ్గవంటిది. భోగములు శాశ్వతములుకావు. దేవరవారికి నాయందుఁగలిగియుండు ననురాగమున సహస్రాంశము భగవద్విషయంబునఁగలిగిన పునరావృత్తిరహితశాశ్వతగతిని జెందవచ్చును. (అంగారసదృశీనారీ। ఘృతకుంభసమఃపుమాన్) అనువచనము దేవరవారివిషయమున అనుభవసిద్ధమయ్యెను. పూర్వము కామాంధులైకృత్యాకృత్య వివేకవర్జితులై మెలఁగినవారలలో అహల్యకై ఇంద్రుఁడును, తిలోత్తమకై సుందోపసుందులు ను, మేనకకై విశ్వామిత్రుఁడును, మాంధాతపుత్రికలకై సౌబరియును, ప్రమ్లోచనకై కండుమ హర్షియు, శర్మిష్ఠకై యయాతియు, రతీదేవికై శంబరుఁడును, తారకై చంద్రుఁడును, శచీదేవి కైన హుషుఁడును, రంభకై రావణుఁడును, కుశనాభపుత్రికలకై వాయుదేవుఁడును, ద్రౌపదికై సైంధవకీచకులును, దమయంతికై దిక్పాలక కలికిరాతకులును, సత్యవతికై యుగ్రాయుధుఁ డును, ఊర్వశికై పురూరవుండును, కైకేయికై దశరథుఁడును, సునీతికై యుత్తానపాదుఁడు న్ఋుషిపత్నులకై యగ్నిదేవుఁడును, చిత్రాంగికై రాజరాజనరేంద్రుఁడును, శైబ్యకై జ్యా మఘుఁడును, మఱియు పెక్కువనితలకై పెక్కండ్రును కామరోగపీడితులై పరిభవమును జెం దుటనుమనమువినియెఱుఁగమే. (తమోద్వారంయోషితాంసంగిసంగః) అనురీతిని స్త్రీసంగము తమోద్వారమని శ్రీఋషభదేవులువక్కాణించిరిగద. (విచిత్రాదేహసంపత్తిః। రీశ్వరాయనివేది తుం) అనురీతినిభగవంతునినిర్హేతుకకృపచే మోక్షసాధనభగవత్కైంకర్యోపయోగముగలబ్ధమ గుకరణకళేబరములను ఉచితోపయోగము చేయక వ్యభిచరించువారుత్వరలో యమమహిషఘం టానాదమునువినవలసినవారగుదురు. (నరకేపచ్యమానస్తు।యమేనపరిభాషితః। కింత్వయానా ర్చితోదేవః। కేశవఃక్లేశనాశనః) అనురీతిని అచ్యుతారాధనవిముఖులై యుండినందుకు కారణమ డుగుయమునికి ప్రత్యుత్తరమేమని చెప్పవచ్చును. అనేకులు పుత్రదారగృహక్షేత్ర ధనధాన్యా దులనుతమప్రాణములకంటె గొప్పగఁదలఁచి స్వరూపోచితమై మోక్షసాధనమైనభగవత్సర ణాను బొత్తిగమఱచి జననమరణములయందుఁజిక్కి గతాగతముచేసెదరు. ఇదివఱకు పెక్కుజన్మ ములెత్తితిమి. సముద్రతీరమునందలిసన్నపుటిసుకనైన లెక్కింపవచ్చును. దానికడచినమనజన్మ ములలెక్కింపనలవిగాదు. భగవద్భజనవైముఖ్యమును, శబ్దాదిభోగ విషయరుచియు ఈయన ర్థమునకు ముఖ్యకారణములగును. ఇంద్రియకింకరునికి భగవత్కైంకర్యమెట్లురుచించును. సర్ప దష్టునికిచేఁదు తీఁపైనట్లు సంసారవిషసర్పదష్టునికి నరకహేతువులగు క్రూరవిషయములుభో గ్యములైయుండును. ఓప్రాణనాథా! ఇఁకనైన హేయవిషయాసక్తినివిడిచి శ్రేయఃప్రాప్తికియత్న ముచేయుదువనిస్మరింపించెదను. (స్నేహాచ్చబహుమానాచ్చ।స్మారయేత్వాంనశిక్షయే) అనురీతి ని దేవరవారికి స్మరింపించుదాననేగాని శిక్షించుదాననుగాను. చిత్తముకొలఁది నవధరింపుఁడు. అనివిన్నవించిభయకంపితగాత్రయై బద్ధాంజలియైమౌనముద్రనువహించినిలుచుండెను. ఈహి తోక్తులనువిన్నవించుటచే తులసీదాసులకు జ్ఞానోదయమై రమణీహితోపదేశముచే కృతా ర్థుఁడనైతిని. మహాపాతకియగునాకు భగవంతునినిర్హేతుకకృపచే నీమూలముగబ్రహ్మవిద్యాలభిం చెను. నాతపముఫలించెనుఅనిచెప్పినూతాదేవిని పరమగురువుగాదఁలఁచి సాష్టాంగదణ్ డామమాచరించి (వివిక్తదేశసేవిత్వ। మరతిర్జనసంసది) అను శ్రీభగవద్గీతావచనప్రకార గవర్జితుఁడై రాత్రివేళయనుపెప్పూదయమిడిజన శూన్యాటవికేగెను.

అప్పుడు తులసిదాసులు అచింతితముగ మాతాదేవియొక్క యుపదేశవ్యాజముచే తనకులభించినతత్త్వవివేకభక్తివిరక్తులకు ఆనందించికందమూలములను భుజించుచు శ్రీరామచంద్రచరణనళినధ్యానపరుఁడైయుండెను. ప్రతిదినము ప్రాతఃకాలమున శౌచాంతమున శేషించిన జలమును ఒకవృక్షమూలమునఁబాఱఁబోసి స్నానానుష్ఠానములను నెఱవేర్చికొంతదూరమున నుండునొకగ్రామసమీపమున శ్రీరామచరిత్రమును పఠనముచేసి సాయంకాలమున స్వస్థానమునకు వచ్చిచేరుచుండును. ఒకనాఁడువాడుకప్రకారము శౌచశేషజలమును.వృక్షమూలమునఁ బాఱఁబోయుచుండ నొకబ్రహ్మరక్షస్సు ఘోరరూపముతోడ వీరికెదురనిలచి యోమహాత్మా నీవిషయమునసంతోషించితిని. నీయభీష్టమునడుగుమిచ్చెదననిన తులసిదాసులు నీవెవ్వఁడవు. నాయభీష్టమునిచ్చుటకు కారణమేమనినన బ్రహ్మరక్షస్సిట్లనియె. నేనుబహుదినములనుండి యిచటవసించు బ్రహ్మరక్షసుఁడను. నదీనదతటాకములయందలిజలములనుస్పర్శించుటకు నాకధికారములేదు. పానమునకుజలములేక మిగులశ్రమపడుచుంటిని. గతించినపండ్రెండు వత్సరములుగ ఈవృక్షమూలమున నీవు పాఱఁబోయుచువచ్చిన శౌచశేషజలమును ద్రావినాదాహమును దీర్చుకొనుచువచ్చితిని. నేఁడునీవిషయముననాకుసంతోషమై నీయభీష్టప్రదానముచేయనపేక్షించివచ్చితిని. కావునశంకింపక నీకోర్కెనడుగుమనినబ్రహ్మరక్షస్సుమాటలనువిని తులసిదాసులు ఇదియేమివింత. అమృతమునపేక్షించినవానికివిషములభించినట్లు శ్రీరామచంద్రదర్శనమునపేక్షించుచునట్టినాకు బ్రహ్మరాక్షసదర్శనములభించెను. అనికొంతచింతించి బ్రహ్మరక్షస్సునుజూచి శ్రీరామచంద్ర సందర్శనమునాకభీష్టము. అంతకుశక్తుఁడవేని ఆవరమొసఁగుమనిన బ్రహ్మరక్షస్సు తులసిదాసులనుజూచి యిదినాకసాధ్యమైనకార్యము. అయినను శ్రీరామచంద్రసందర్శనాపేక్షగలనీకుతత్ప్రాప్తికొకసదుపాయముచెప్పెదను నీవుప్రతిదినము శ్రీరఘునాథసంకీర్తనముచేయుచుండుచోటనొకవృద్ధబ్రాహ్మణబ్రహ్మచారి జీర్ణవస్త్రమునుధరించినీయగ్రభాగమ్మునకృతమస్తకాంజలియై బాష్పవారిపరిపూర్ణలోచనుఁడై కూర్చుండి శ్రీరామాయణకథాశ్రవణము చేయుచుండును. ఆమహాత్మునిని రాక్షసాంతకుఁడగు మారుతియనియెఱుఁగుము. నీవు ఆశ్రీరామభక్తుని నాశ్రయించితద్వారా నీయభీష్టసిద్ధినిజెందుమనిచెప్పి బ్రహ్మరక్షస్సు అంతర్ధానమయ్యెను. తులసిదాసులు అమందానందమునుజెందిస్నానానుష్ఠానములనుదీర్చుకొని శ్రీమద్రామాయణపారాయణానంతరమున బ్రహ్మరక్షస్సుచెప్పిన యానవాలుచొప్పున అంజనానందనుని దర్శించిసాష్టాంగదండప్రణామంబులాచరించి బద్ధాంజలియై పలుతెఱఁగులస్తుతించిశ్రీరామభక్తరత్నమా శ్రీరామచంద్రసందర్శనముచే నన్నుకృతార్థునిఁజేయవలయునని ప్రార్థింపనట్లుచేయుదుననియనుగ్రహించి యంజనీనందనుఁడు తులసిదాసుల మనోరథప్రాప్తికైనిజనాథుఁడగు శ్రీజానకీనాథుని ప్రార్థింప దశరథాత్మజుఁడంగీకరించితోడనే తురుష్కరూపమునుపరిగ్రహించి తదనుగుణమగుసైన్యములతోడతులసిదాసులయాశ్రమప్రదేశమునకురాఁగాఁ జూచి యెవ్వఁడోతురుష్కరాజుససైన్యముగవచ్చుచున్నాఁడని తలఁచియభ్యుత్థానవందనాదులనుజేయకతులసిదాసులూరకుండిరి - భగవంతుఁడంతర్ధానుఁడయ్యె - అప్పుడాంజనేయులు వచ్చితులసిదాసులనుజూచియోమహాత్మా శ్రీజానకీజానినీయాశ్రమమునకు విజయుంచేసినతనిని ఏలసేవింపకపోయితివి, అనియడిగినతులసిదాసులువెఱగంది యోమారుతీశ్రీరామస్వామిలీలలను నేనెఱుఁగకమోసపోయితిని-ఎవ్వఁడోతురుష్కుఁడనియుపేక్షించితిని- ధనుష్పాణియైసీతా

లక్ష్మణసమేతుఁడైనాను సేవయొసఁగునటుల పురుషకారము చేయవలయునని పెక్కువిధముల వేడఁగా శ్రీరామభక్తనిక్షేపమగు పవమాననందనుఁడు తులసిదాసుల విషయమునఁ గరుణించి వారియభీష్టప్రదానంబునకై శ్రీరామభద్రునిఁబ్రార్థింప కౌసల్యానందవర్ధనుఁడుతత్ప్రార్థననంగీకరించితులసిదాసులకు శ్రీసీతాలక్ష్మణసమేతముగఁబ్రత్యక్షమైతనపాదపద్మములచేనతనియుత్తమాంగమునలంకరించి యమృతస్యందినియగు నిజపాదకమలయుగళమును అతనిహృద్దేశంబుననెలకొల్పి పరమభక్తియుక్తునిఁజేసితిరోహితుఁడయ్యె. అప్పుడాంజనేయుఁడు తులసిదాసులను చూచివిప్రోత్తమా (కేనోపాయేనలఘునా । విష్ణోర్నామసహస్రకం । పఠ్యతేపండితైర్నిత్యం । శ్రోతుమిచ్ఛామ్యహంప్రభో) అనియడిగినపార్వతికి (శ్రీరామరామరామేతి। రమేరామేమనోరమే । సహస్రనామతత్తుల్యం । రామనామవరాననే) అనియీశ్వరుఁడానతిచ్చెనుగాన శ్రీరామనామానుసంధానముచే సహస్రనామపారాయణ ఫలముసిద్ధించును. మఱియుశ్రీతారకనామము అనుసంధాతలకు సులభముగ భక్తిముక్తులనిచ్చును. కానచిత్తశుద్ధికరమగు నీమహామంత్రమును సంసారులకుపదేశించివారలకు విషయవైరాగ్యమోక్షాసక్తులనుగలుగఁజేసి శ్రీరామచంద్రుని పరిపూర్ణకృపకు లక్ష్యభూతుఁడవగుమనియుపదేశించి యంతర్ధానమయ్యెను. తులసిదాసులు ముక్తిప్రదక్షేత్రమగు కాశీక్షేత్రమునకరిగియచట శ్రీరామచంద్రునియనంతకల్యాణగుణగణములను సంకీర్తనముచేయుచుండెను. అచ్చటవారందఱును తులసిదాసులను బరివేష్టించిదినదినప్రవర్ధమాన శ్రీరామచంద్రభక్తియుక్తులై సదాతారకమంత్రజపశీలురై యుండిరి. తులసిదాసులమఠమున ప్రతిదినము లెక్కలేనిరామభక్తులుభుజించుచు ఎడతెగకభగవన్నామసంకీర్తనముచేయుచుండిరి. తులసిదాసులకు శ్రీరామనామామృతముతప్ప తక్కినవానియందురుచిమృగ్యమయ్యె. వీరు శ్రీరామనామ సంకీర్తనముచేయనారంభించినంతటతచ్ఛ్రవణముచేనెల్లరునుమైమఱచిచిత్రప్రతిమలయట్లుండుచురు. దివారాత్రివిభాగములేకమఠమునసదా శ్రీరామభజనము జరుగుచుండును. బహుప్రజలెడతెగక శ్రవణకుతూహలులైవచ్చుచుందురు. కొందఱుశ్రీమంతులచేసమర్పింపఁబడినస్వర్ణరజతపాత్రాదిపూజోపకరణములు మఠముననిండియుండె. తులసిదాసులు సమలోష్టాశ్మకాంచనులుకాననొకపదార్థమునైన గమనింపకయుండిరి.

ఇట్లుండనిరువురుచోరులు మఠమునందుఁబ్రవేశించియెవ్వరునెఱుఁగకుండ దేవతాగృహమునందలి పూజోపకరణములనపహరించుకొనిపోవుచు వాకిటధనుర్ధరులై జాగరూకులైయుండినయిరువురుమహాపురుషులనుజూచివీరెవ్వరోమునుపిచటలేరు, ఇప్పుడువచ్చియున్నారనిమఱియొకద్వారమునఁదరఁలి పోవఁజూచిననచటను ఆమహాపురుషులుండిరి. చోరులు భయపడితామచటనపహరించినపదార్థములను యథాస్థానమునందుఁబడవైచిపాఱిపోవుచుండ ఆద్వారపాలకులు వీరలనుబోనీకయడ్డగించిరి. ఇంతలో అరుణోదయమైనందున తులసిదాసులు స్నానార్థము మఠద్వారమును నిర్గమించుచుండ చోరులుశరణాగతులై గతవృత్తాంతములనువిన్నవించిమమ్మురక్షింపవలయుననిప్రార్థించిరి. తులసిదాసులు చోరులనడ్డగించిన మహాపురుషులు భక్తక్రీతులగుశ్రీరామలక్ష్మణులనియెఱిఁగి బహువిధసంకీర్తనములుచేసి చోరులనుజూచి మీరు మహాభాగ్యవంతులగుటఁగాన మీకుసులభముగ భగవత్సేవలభించెను. (నాహంవేదైర్నతపసా।నదానేననచేజ్యయా।శక్యఏవంవిధోద్రష్టుం।దృష్టవానసిమాంయథా) అనుభగవద్వాక్యప్రకారము వేదాధ్యయనతపోదానయజ్ఞనిష్ఠులకు అశక్యమగుభగవత్స్వరూపము మీకుదృష్టిగో

చరమయ్యెను. మీపుణ్యంబులీడేరెను అనియనుగ్రహించెను. అంతట వారుభాగవతకటాక్ష
ముచేసత్వగుణనిష్ఠులై తులసిదాసులకు పదచ్ఛాయలై భగవద్గుణానుభవనిష్ఠులై యుండిరి.

పిదపనొకనాఁడు తులసిదాసులు తమమఠమునందు తదీయులననేకుల భుజింపించునప్పు
డు ఆగోష్ఠియందలివారలెల్లరును తులసిదాసులనుచూచిభాగవతోత్తమా మహాపాతకియొకఁ
డు ఈగోష్ఠియందన్వయించియుండుటచే వానితోఁగూడ మేముభుజింపమనిరి. తులసిదాసులు
వారినిజూచి భగవద్భక్తులారా శ్రీతారకనామోచ్చారణముచే బ్రహ్మహత్యాది పాతకములు త
క్షణమున నశించును. (దురాచారోపిసర్వాశీ। కృతఘ్నోనాస్తికఃపురా। సమాశ్రయేదాదిదేవం।
శ్రద్ధయాశరణంయది। నిర్దోషంవిద్ధితంజంతుం। ప్రజ్ఞానాత్పరమాత్మనః) అనురీతిని భగవ
త్సమాశ్రితుని పూర్వవృత్తమును స్మరింపఁగూడదు. కానఅట్టివారిసహపఙ్క్తినిభుజించుటదో
షముకాదు. అనిచెప్పినతులసిదాసులహితవచనములనంగీకరింపక భాగవతోత్తమా నీవచనము
లునూకువినరుచింపవు. భగవన్నామసంకీర్తన ప్రభావముచే మహాపాపములు నశించుననుటకు
ఏదియైననొక ప్రత్యక్షదృష్టాంతమును జూపిననీమాటలను విశ్వసింతుమనిరి. అపుడుతులసిదా
సులు ఆకాశీక్షేత్రమున విశ్వనాథునియగ్రభాగమునఁ గూర్చుండియుండిన నందికేశ్వరుని
యెదుటకొంతయన్నమునునిచి విశ్వనాథునిజూచియోగంగాధరా శ్రీరామనామోచ్చారణముచే
బ్రహ్మహత్యాదిపాతకములునశించుననుప్రమాణములు నిజమేనినందికేశ్వరుఁడు లేచియీయన్న
మును భుజింపపలయుననని విన్నవించెను. తోడనే శ్రీవిశ్వనాథునియనుమతిని ప్రమథగణా
గ్రగణ్యుఁడగునందికేశ్వరుండులేచి ఆయన్నమును నిశ్శేషముగభుజించి యెప్పటియట్లుకూ
ర్చుండెను. ఈయాశ్చర్యమును ఎల్లరునుజూచియానందపరవశులై శ్రీరామరామయనిఘోషిం
చితులసిదాసులకు సాష్టాంగవందనములాచరించితారకనామజపశీలురలో నీవగ్రేసరుఁడవు.
నిన్ను సాక్షాత్ శ్రీరామభక్తుఁడగు మారుతియోలేక శ్రీతారకనామోచ్చారణపరుఁడగు పార్వ
తీపతియోయనిశంకించెదను. అని కొనియాడి తమచేనిగ్రహింపఁబడిన భగవత్సమాశ్రితుని పూ
ర్వవృత్తమునుస్మరింపక యందఱునుసాదరముగసహపఙ్క్తినిడుకొనిభుజించిరి.

పిమ్మట ఆవారణాశిపట్టణమున నొకవర్తకుఁడు శరీరవియోగమునుజెందఁగావానిభార్య
సహగమనముచేయనిశ్చయించుకొని ప్రేతమును వెంబడించి దారినిపోవుచు తులసిదాసులమఠము
వాకిటికివచ్చి ఈమహానుభావునిసేవించి యితనియనుమతిని జెందిపోయెదనని మనోరథించితు
లసిదాసులకు వందనమాచరింపవారు ఆమెనుకటాక్షించి నీవుదీర్ఘసుమంగలివై తొమ్మిదిగురు
పుత్రులనుగని సుఖివై యుండుమని యాశీర్వదించిరి. ఆస్త్రీ తులసిదాసులనుజూచి నాభర్తశ
రీరవియోగమునుజెందినందుననేను సహగమనమునకై భర్తృకళేబరమును వెంబడించిపో
వుచు పరమభాగవతోత్తములరగు దేవరవారినిసేవించి దేవరయనుగ్రహమును జెందనిచ్ఛయిం
చియిచటికివచ్చితిని. ఈసమయమున దేవరవారియాశీర్వాదము వేఱువిధముగనున్నది. అనిన,
విని తులసిదాసులు మదంతర్యామియగు శ్రీరామచంద్రుఁడు సత్యవ్రతుఁడు. (రామోద్విర్నా
భిభాషతే) అనురీతిని అతఁడసత్యమును వచింపఁడు. తదధీనముగునావాక్కు ఒకప్పుడును
తప్పదు. ఆప్రేతమునిచటికి తెండనిచెప్పి తెప్పించి (కౌసల్యాసుప్రజారామ । ఉత్తిష్ఠ) అని
చెప్పినంతట ఆప్రేతము ప్రేతత్వమునుమాని లేచినిలుచుండి సవినయముగతులసిదాసులకుదం

దనములుచేసెను. తులసిదాసులు దంపతులనాశీర్వదించి స్వస్థానమునకుఁబంపిరి. ఈయద్భుతమును కనివినియెల్లరును శ్రీతులసిదాసులమాహాత్మ్యమును పెక్కుతెఱఁగులఁ గొనియాడసాగిరి.

పిదప రాజైనయక్బరుపాచ్ఛా ఈయద్భుతములనువిని యాశ్చర్యపడి పరీక్షింపవలయునని తలఁచి తులసిదాసులను పిలుచుకొనిరమ్మని తనమంత్రిని కాశికిఁబంపఁగా అతఁడువచ్చితులసిదాసులనుసేవించి యోస్వామీమాపాచ్ఛాగారుదేవరవారినిదర్శింపనపేక్షించి తోడ్కొనిరమ్మనిరిఅనివిన్నవింప తులసిదాసులుసమ్మతించి ఆమంత్రినివెంబడించి శ్రీరామనామస్మరణతో డహస్తినాపురసమీపమున వచ్చునపుడు డిల్లీప్రభుఁడెదుర్కొని సవినయముగఁదోడ్కొనిపోయియుచితాసనమునఁగూర్చుండఁబెట్టియోసాధుజనాగ్రేసరా దేవరవారుఇటీవలపెక్కువిచిత్రములనుకాశీపట్టణమునఁజూపితిరఁట. అదియెవరిసామర్థ్యమనియడిగినతులసిదాసులు ఓయిరాజామన్నాథుఁడయిన శ్రీరామభద్రునిదివ్యనామసామర్థ్యమనిమందలించెను. అదివినిరాజు ఇదినిజమగునేని ఆయద్భుతనామమునకువాచ్యుఁడగుజానకీరమణునిఁజూపుము. చూపవేని నిన్నుడుగుదాటికదలనియ్యనని చెప్పి తులసిదాసులను కావలియందుంచెను. అప్పుడుతులసిదాసులు ఆంజనేయులనుస్మరింప ఆరామభక్తాగ్రేసరుఁడు తత్క్షణమునఁబ్రసన్నుఁడై తులసిదాసులవందనాద్యుపచారములనంగీకరించి అతనికి రాజుచేఁగలిగిననిర్బంధమునువిని స్మరించినమాత్రముననే పదివేలవానరవీరులనురప్పించి యోవనచరవీరులారామీరుముహూర్తమాత్రమమీస్వభావచేష్టలను ఈరాజునకుఁజూపుఁడని నియమించినంతట ఆకపివీరులుశరములవలె ఆకాశముననెగిరి పట్టణవాసులగుజనులను ఒకరిమీదనొకరినివైచి వృక్షములను సమూలముగ పెఱికిగోపురప్రాకార గృహములను నేలతోఁగలిపి లోభులగుధనికులబొక్కసములను పరులపాలుచేసి భగవద్విముఖులను బాధపెట్టియిట్లు నానావిధమైనయుపద్రవములచేపట్టణమునహాహాకారము గలుగఁజేయరాజుచూచిదిగులుచెందిదీనికికారణమేమని విచారింపఁగావివేకియగుమంత్రి ఓరాజారామభక్తాగ్రేసరులగుతులసిదాసులనుకావలియందుంచినిర్బంధించినందున (అపూజ్యాయత్రపూజ్యంతే। పూజ్యాయత్రావమానితాః। తత్రత్రయంభవిష్యంతి। వ్యాధిదుర్భిక్షతస్కరాః) అనురీతినిమనరాష్ట్రమునకిట్టియనర్థముగలిగెను. కానపూజార్హులగు తులసిదాసులనుశరణుచెంది అనుతాపయుక్తుఁడవైయపరాధక్షాపణముచేసికొంటివేని నీకును నీరాష్ట్రమునకును మేలగుననిచెప్పినవిని మంత్రిమాటలునిజమనియంగీకరించి తులసిదాసులసన్నిధికివచ్చి దండప్రణామముచేసి లేచినిలుచుండిమస్తకన్యస్తాంజలియై శ్రీరామభక్తోత్తమా నాయపరాధమును క్షమించినన్నును నాదేశమును రక్షింపవలయునని ప్రార్థింప తులసిదాసులు మందస్మితముచేసియోరాజా శ్రీరామచంద్రునిని నీకుఁజూపవలయునంటివిగదా. సూర్యోదయమునకుముందు అరుణోదయమువలె నాజీవితేశ్వరుఁడగు శ్రీరఘునాథుని యగ్రభాగమున వారికంతరంగులగు వానరవీరులేగుచుందురు. మాస్వామికిడెబ్బదిరెండు వెల్లువలవానరసైన్యముగలదు. అందుపదివేలవానరవీరులు ముందుగవచ్చిరి. వీరినివెంబడించి తక్కినసైన్యములువచ్చును. ఆవెనుక శ్రీరామచంద్రుండు వేంచేయునుఅనినవిని డిల్లీపతిభయకంపితగాత్రుఁడై స్వామీపదివేలవానరవీరులచే పట్టణముల్లోలకల్లోలమయ్యె. తక్కినవానరసైన్యములువచ్చిననేమిగతియగునో తెలియదు. దేవరవారిదర్శనమే మాకుఁజాలును. శ్రీరామభద్రసందర్శనమింతకంటె గొప్పదిగాదు! ఈవనచరవీరులిచ్చో [illegible]చిపోవునట్లు అనుగ్రహింపవలయుననిప్రార్థింప తులసిదాసులకు కరుణగలిగిభక్తితో [illegible]

యులనుస్మరించి వానరులను అంతర్ధానముచేయించెను. తులసిదాసులయద్భుతచరిత్రమును ప్రత్యక్షసిద్ధముగఁజూచినరాజు ఆనందపరవశుఁడై వారిపాదపద్మములకు వందనములుచేసి దేవరవారుకొన్నాళ్లిచట వసించినన్ను గృతార్థునిజేయవలయునని ప్రార్థింపనంగీకరించి తులసీదాసులొకయేడచటవాసముచేసి యాదేశవాసులనెల్ల శ్రీరామనామసంకీర్తనపరులనుగావించి మఱియుకృతార్థులనుజేసెను.

తదనంతరము తులసిదాసులు రాజానుమతినిజెందియచ్చోటువిడిచి ముక్తిప్రదక్షేత్రమై భగవత్సాన్నిధ్యయుక్తమై శ్రీవామనతపోభూమియై శ్రీశత్రుఘ్ననిర్మితమై శ్రీకృష్ణజన్మస్థలమగు మధురానగరమునకేతెంచి గోకులబృందావన గోవర్ధనములనుదర్శించి పావనయగుయమునయందుగ్రుంకియచ్చటనొక మాసమువసించిపెక్కండ్రను శ్రీరామభక్తులంజేసి భగవద్భక్తులతోఁగూడియానందించుచుండెను. అప్పుడచట ప్రియదాసుఁడను నొకబ్రాహ్మణోత్తముఁడు భగవద్భక్తాగ్రేసరుఁడైయుజ్జ్వలించుచుండెను. కలియుగమున లోకోజ్జీవనార్థము భగవన్నియమనముచేనవతరించిన శ్రీజయదేవాది భక్తజనులదివ్యచరిత్రము ఆభాగవతోత్తమునిచేసంస్కృతభాషయందు వ్రాయఁబడియుండుటనువిని తులసిదాసులు ప్రియదాసులయొద్దకువచ్చి నీవువ్రాసిన భక్తచరిత్రమును నేనువినన పేక్షించెదను. నాకోరికను సఫలముచేయుమని ప్రార్థించినప్రియదాసులు కరుణించి ఈతులసిదాసులయవతారమునకు పూర్వోత్తరకాలములయందవతరించినభగవద్భక్తులచరిత్రములు భగవంతునికటాక్షముచే సాక్షాత్కరింప వానిని విశదతమముగ వర్ణించివ్రాసితిని. మహనీయగుణగరిష్ఠులగునీతులసిదాసులచరిత్రమును మాత్రమువ్రాయక బుద్ధిమాంద్యముచే మోసపోయితిననిఖేదించిరిఐనను నాచేవ్రాయఁబడిన భక్తచరిత్రమును ఈమహాత్మునినియమనానుసారముగ చదివివినిపించెదనని ప్రారంభించి చదువుచుండ ప్రియదాసులకు తెలియకుండ శ్రీతారకబ్రహ్మము తులసిదాసులచరిత్రమును ఆగ్రంథమున వ్రాసియుంచెను. ప్రియదాసులుక్రమముగ భగవద్భక్తుల చరిత్రములనుజదువుచు తనకుతెలియకయే తనపుస్తకమున వ్రాయఁబడియుండు తులసిదాసుల చరిత్రమునుజూచి యందలి యక్షరవిన్యాస, శబ్దసౌకుమార్య, గంభీరార్థపూర్తులకు అద్భుతమందియచటనుండినసకలభాగవతులసమక్షమునకర్ణామృతముగఁజదివివినిపించెను. అప్పుడచటనుండిన భాగవతులందఱు శ్రీరామచంద్రస్వహస్తలిఖితమగు తులసిదాసవైభవగ్రంథమును శిరసావహించి పరమానందభరితులై ప్రియదాస, తులసిదాసులను పలుతెఱంగులస్తుతియించి స్వస్థానములకుఁబోయిరి.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.



## నాలుగవయధ్యాయము.

### శ్రీనామదేవచరిత్రము.

శ్రీమత్పండరిపురమున దామాజియనునొక భాగవతోత్తముఁడునిరంతర శ్రీకృష్ణపూజాపరుఁడై నిత్యవాసము చేయుచుండెను. అతనియిల్లాలుగుణాబాయియనుపతివ్రతాశిరోమణియుడలెగక భర్తృశుశ్రూషాపరయైయుండెను. ఈదంపతులిరువురును ప్రతిదినము శ్రీకృ

త్పాండురంగనిని సర్వోపచారములతోడ నారాధించుచు తన్నివేదితాన్నమును భుజించుచు భగవన్నామసంకీర్తనముచేయుచు ఆనందపరవశులై కాలముగడపుచుండిరి.

ఒకనాఁడుగుణాబాయి తనభర్తనుజూచి మన్నాథామనకు సంతతిలేనందున సుపుత్రలాభమునకై శ్రీపాండురంగని ప్రార్థింతమనిన ఆమాటలనువిని దామాజియోముగువా అజ్ఞానముచే నిట్లుపలుకుచున్నావు. మనవార్ధక్యదశయందుమనకుసంతానమెట్లుగలుగును. పాండురంగఁడు మనకేవిధమున సంతతియొసఁగును. అనినగుణాబాయియిట్లనియె. ఓప్రాణనాథా ఏలయిట్లుపచించెదవు. సర్వశక్తియుక్తుఁడగుమనపాండురంగనికసాధ్యమొకటిగలదే. శ్రీరామావతారకాలమునవానరులచేఱాళ్లను నీటఁదేల్పలేదా. ఱాతినినాతిగఁజేయలేదా. మృతుఁడైన బ్రాహ్మణపుత్రునిబ్రతికింపలేదా. శ్రీకృష్ణావతారమునందత్యంతశైశవావస్థయందు పూతనా,శకట, తృణావర్తాదులను సంహారింపలేదా. దావాగ్నినిమ్రింగిగో,గోప,గోపికలనురక్షింపలేదా. బ్రహ్మగోవత్సగోపాలబాలకులను దాచియుంచినపుడు తానన్నిరూపములను బరిగ్రహించి సుఖముగనుండలేదా. అదియునుగాక మృతుఁడైనగురుపుత్రుని బ్రదికించి గురుదక్షిణగనొసఁగలేదా. నష్టపుత్రుల్నువైదికునికినను గ్రహింపలేదా. మఱియుమనశ్రీవిఠలనాథునియతిమానుషచరిత్రములనులెక్కింపచతుర్ముఖాదులకైనను తరముగునా. ఇట్టిసర్వశక్తుఁడు మనకొకపుత్రదానముచేయుటరుదా. అనినభార్యమాటలనువిని దామాజికొంతచింతించిసంతసించి నీమాటలునిక్కమనిపచించి భగవత్సన్నిధిని ప్రవేశించిశ్రీపాండురంగనికి అనంతదండములుసమర్పించియోపుండరీకవరదా నాభార్య నీయనుగ్రహముచే నొకపుత్రునిఁబడయఁగలయుననియాశపడుచున్నది. దేవరవారుకటాక్షింపవలయునని ప్రార్థించియాలయముఖమంటపమునందుపరుండినిద్రించెను. అప్పుడతనిస్వప్నమున శ్రీమత్పండరినాథుఁడు ప్రత్యక్షమైనీకునాయట్టిసుపుత్రునిచ్చితిని. శోకంపకుము. పేకువనుభీమనదికిస్నానమునకుపొమ్ము. అచటనొకముత్తెపుచిప్ప నీటఁదేలుచునీయొద్దకువచ్చును. అందునీకొకపురుషశిశువుదొరకును. నాయనుగ్రహలబ్ధమగునాశిశువునాయందు మిగులభక్తిగలిగినాకుపరమప్రీతివిషయమైయుండును. ఆపుత్రుఁడుపరమభాగవతుఁడగునుద్ధవునియంశమున లోకులకు భగవద్భక్తినిగలుగఁజేయుటకై మన్నియమనముచే జనించినవాఁడు అనిచెప్పియదృశ్యుఁడయ్యెను. తోడనే దామాజిమేల్కాని స్వామికనంతదండములుసమర్పించిపలుదెఱంగులస్తుతియించి స్వగృహమునకువచ్చిస్వప్నవృత్తాంతమునంతయు భార్యకుచెప్పియామెకు అమందానందముగలుగఁజేసియిరువురును శ్రీపాండురంగసంకీర్తనముచేయుచు రాత్రిగడపిరి. ప్రాతఃకాలమున దామాజి భీమనదికిపోయి యందుభగవన్నామోచ్చారణతోడ స్నానముచేసి నిత్యకృత్యములను నెఱవేర్చిపుత్రాగమనమునునిరీక్షించుచుండ శ్రీపాండురంగనికృపచే ప్రవాహవశముననొకముత్యపుచిప్పనీటఁదేలుచువచ్చుచుండెను. దామాజియప్పుడానందపరవశుఁడై (కృష్ణానందముకుందమురారే। వామనమాధవగోవింద। శ్రీధరకేశవరాఘవవిష్ణో। లక్ష్మీనాయకనరసింహ)అని భగవంతునిస్తుతించుచుఆముత్యపుచిప్పనెత్తికొని యందుపదిలముగనున్న శిశువునుస్వగృహమునకుఁగొనిపోయితద్భార్యచేతికిచ్చియీశిశువునకుపాలిచ్చిపోషించువారెవరు. నేనుదరిద్రుఁడనగుటచే గోక్షీరముచేనైన శిశుసంరక్షణముచేయుటకుశక్తిహీనుఁడనైయున్నాను. అనిచింతించుచుండ శ్రీపాండురంగనిసంకల్పముచే గుణాబాయికిపాలిండ్లయందవ్వారిగ పాలుస్రవించెను. అప్పుడీయద్భుతమును జూచిదంపతులిరువురును ఆశ్చర్యపడియిదిభక్తవత్సలునిలీలయని నిశ్చయించి యాశ్రితపారిజాతం

పుత్రుఁడగు శ్రీపాంచజన్యధరుని స్తుతించి యాబిడ్డనికి నామదేవుఁడని నామకరణము చేసి ప్రేమతోడ పెంచుచువచ్చిరి. అపుత్రరత్నము శైశవావస్థనుగడచి జ్ఞానానుష్ఠానసంపన్నుఁడై శరీరముతోడ భగవద్భక్తియును దినదిన ప్రవర్ధమానమగుచుండ నొకనాఁడు ద్దామాజికి సమీప గ్రామమునకు పోవలసిన కార్యము తటస్థించినందున స్త్రీని బిలచి నీవు నేటికి పూజాద్రవ్యములను మన నామదేవుని చేతికిచ్చి శ్రీపాండురంగని పూజించి రమ్మని నియమింపుము. నేనొక కార్యార్థము సమీప గ్రామమునకు బోయి రేపటికి వచ్చెదనని చెప్పి యతఁడు బయలు దేరిపోయెను. గుణాబాయి భర్తృనియమనానుసారముగ పూజాద్రవ్యములను నామదేవుని చేతికిచ్చి శ్రీపాండురంగని సన్నిధికిఁ బంపెను. నామదేవుఁడు సర్వోపచారములతోడ భయభక్తిపూర్వకముగ శ్రీమత్పాండురంగనిఁ బూజించి సుపక్వమయిన పరిశుద్ధాన్నమును స్వామికెదురనునిచి శ్రీపాండురంగ భుజ్ క్ష్వ-భుజ్ క్ష్వ అని ప్రార్థించెను ఇట్లు ప్రార్థించియు భగవంతుఁడు భుజింపనందున ఖిన్నుఁడై యో స్వామీ నేను నివేదించిన యన్నమును నీవేల భుజింపవు. నీయంతరంగదాసుఁడగు దామాజి గ్రామాంతరమునకుఁ బోవుచు నీయారాధనమునకు నన్ను నియమించెను. నీవారగింపక యూరకుండిన స్వామికి నేనేమియపరాధము చేసితినని మాయమ్మ నన్ను గొట్టును. మాయయ్య విని నన్నుఁదిట్టును అని చెప్పి వెక్కి వెక్కి యేడ్చుచు జగన్నాథా భుజింపుము. నేనేమి తప్పుచేసితిని. నిన్నారాధించు క్రమము నాకు తెలియదు. అయినను నన్నుఁ గరుణించి శీఘ్రముగ వచ్చి భుజింపుము. నన్నాఁకలి దప్పులు బాధించుచున్నవి. నేనేమి చేయుదును. అని పలు దెఱంగుల బతిమాలుచు నేడ్చుచున్న యాబాలునిఁ జూచి కృపాజలధియగు భగవంతుఁడు నిజరూపముతోడ ప్రసన్నుఁడై నామదేవునిని ఆలింగనము చేసికొని శిరంబు మూర్కొని చుబుకంబుపుణికి చెక్కిలి ముద్దుకొని కన్నీరు తుడిచియు పలాలించి యతఁడు నివేదించిన యన్నమును నిశ్శేషముగ భుజించి యో వత్సా ఈవృత్తాంతమును నీ వెవరికిని జెప్పకుము. ఇంటికి పొమ్ము అని బుజ్జగించి తిరోహితుండయ్యెను. పిదప నామదేవుఁడు శ్రీవాసుదేవునికి ప్రణామము చేసి బహువిధముల స్తుతియించి యానందపరవశుఁడై యింటికి వచ్చెను. గుణాబాయి పుత్రుని జూచి నైవేద్యమును నీవేమి చేసితివని యడిగిన నామదేవుఁడు ఓయమ్మా నేనెవ్వరికి నియ్యలేదు. మన పాండురంగఁడు చక్కఁగ భుజించెనని చెప్పెను. అగుణాబాయి బాలుని ముద్దుపలుకులు విని యాశ్చర్యపడి మఱునాఁడు తన భర్త వచ్చినతోడనే యీయతిశయమును అతనితో తిన్నగ మండలించెను. దామాజి మిగుల నాశ్చర్యపడి యో నామదేవా నీవు గొనిపోయిన యన్నమును మన పాండురంగఁ డెట్లు భుజించెనో యది నేను చూడవలయును. నేటికి నీవే భగవంతుని నారాధింపుము. నేనును నిన్ను వెంబడించి వచ్చెదనని పూజాద్రవ్యములను గైకొని యిరువురును భగవన్మందిరమునకుఁ బోయిరి. నామదేవుఁడు దేవాదిదేవునికి భయభక్తియుక్తుఁడై యథావిధిగ పూజచేసి భుజింపుమని వేడెను. అపుడు జగదీశుఁడు దామాజికంటికి గోచరింపక నామదేవునికి మాత్రము ప్రసన్నుఁడై యో వత్సా నీ తండ్రి నిన్ను వెంబడించి వచ్చినందున నేను నిన్నటివలె భుజింపను. అతనికి నాదర్శనము నొసఁగను. అనిన నామదేవుఁడు ఓ స్వామీ సర్వసముఁడవగు నీకు పక్షపాతము తగునా. నా తండ్రిని నిగ్రహించి నాకుమాత్రము ప్రత్యక్షమైన నేను నిన్నూరక విడువను. నేను మాత్రము నీ కేమి లంచమిచ్చితిని. ఎల్లరచే స్తుత్యమానుఁడవగు నీవు ఏల నిందకొడిగట్టెదవు. (తుల్యోమిత్రారిపక్షయోః) అని పరోపదేశము చేసి స్వానుష్ఠానసమయమున నొప్పనిన దువడికూడునా. నీవిట్టి యక్రమము చేసిన నిన్ను దిద్దుటకు వసుదేవ, నందగోప, సాందీపులున్నవారే. యుక్తియుక్తవచనమును బాలునిచేనైనను గ

హింపవలయునుగదాయని విన్నవించిననామదేవుని ముద్దుపలుకులకుకరుణించి శ్రీరుక్మిణీకాంతుఁడుదామాజి, నామదేవులకిరువురికినిదృగ్గోచరుఁడై నామదేవుఁడునివేదించిన పావనమగు నన్నమునుభుజించియదృశ్యుండయ్యె. అపుడుదామాజి నామదేవునిఁజూచి (నతుమాంశక్ష్యసేద్రష్టుం। అనేనైవస్వచక్షుషా) అనురీతిని ప్రాకృతచక్షుర్గోచరముగాని శ్రీభగవంతునిసేవ నీవలననాకుసిద్ధించెను. నీవుపుత్రుఁడవుకావు. నాకులదైవమని కొనియాడి శిరముమూర్కొన్నియాలింగనముచేసికొని స్వగృహముచేరి జరిగినవృత్తాంతమునంతయు భార్యకెఱిఁగించియిరువురును పుత్రునిలాలనముచేయుచుండిరి. అనంతరముతల్లిదండ్రులు తనబంధువర్గములను విచారించి రాధాబాయియనుకన్యకామణినిదెచ్చి నామదేవులకు పాణిగ్రహణముచేయించిరి. కొంతకాలమునకుపిమ్మట రాధాబాయిగర్భవతియైయొకపురుషశిశువునుప్రసవించెను. అపుడు నామదేవులతల్లిదండ్రులు పండ్రెండవదినమున నామకరణమునకుయత్నించిశ్రీమత్పండరిసాధునినివిందుభోజనమునకుపిలిచిరి. భగవంతుఁడుశిశువునకుప్రేమపురస్సరముగవరుసదెచ్చెను. గుణాబాయి హృషీకేశునిఁజూచి యోస్వామీనామదేవునిశిశువునకు ఏమిపేరుపెట్టవచ్చుననియడిగి శ్రీవాసుదేవుననుమతిచే నారాయణుఁడని నామకరణముచేసిరి. జగదీశ్వరుఁడాశిశువునకు ఆభరణములను రాధాబాయికివస్త్రాదులనొసంగి నిజాలయమునకరిగెను. దామాజియు, గుణాబాయియు అత్యంతవార్ధక్యమునుజెంది దారిద్ర్యపీడితులైయుండిరి. గుణాబాయిపుత్రునిజూచి ఓనామదేవా నీవుదివారాత్రివిభాగములేక సదాభగవద్భక్తిసాగరమగ్నుఁడవైయుండిన సంసారకార్యములెట్లుజరుగును. నీయట్టిభగవద్భక్తులనేకులులౌకికవైదికకార్యముల రెంటను సమర్థులైయుండలేదా. నీస్థితిమాత్రము వేఱొకవిధముగనున్నది. ఇంటిలోనన్నవస్త్రములకు లేక స్త్రీలును శిశువులును పడుకష్టములనుజూచి యెట్లుసహింపవచ్చును. అనిచెప్పినతల్లిమాటలనువిని నామదేవులు పాండురంగనిసన్నిధికిపోయి భగవంతునికి ప్రదక్షిణనమస్కారములుచేసి శ్రీరుక్మిణీకాంతా నన్నేలదుఃఖరూపసంసారసాగరమున ముంచితివి. ఈమహాదుఃఖమునెట్లు సహింతును. అనిననామదేవులదీనాలాపములనువిని శ్రీమత్పండరినాథుఁడు ఓవత్సా నేఁడు నిన్నెవ్వరుబాధపెట్టిరి. అనియడిగి కన్నీరుతుడిచిమంచిమాటలుచెప్పుచుండ నామదేవులు దేవాదిదేవా నాతల్లిసంసారవిషయములుగొంతలను జెప్పినానుమిగులమనోవ్యాకులమునుగలుగఁజేయుచున్నది నీదివ్యపాదారవిందములనాశ్రయించిగత్యంతరశూన్యుఁడనైయుండునన్ను ఈఖేదమునుమాన్పిరక్షింపుము. అనివిన్నవించిన పుండరీకవరదుఁడు మందస్మితముచేసి వత్సానీవునాచెంతనుండిన యెడలరజోగుణసముద్భవములగు కామక్రోధములు నిన్నుబాధింపవు. నానిజదాసుఁడవగు నీకునునాకును భేదములేదు. అట్లుండనీవేలశోకించెదవు. అనినవిని నామదేవులు ఓజగన్నివాసా నాకింతయుపచారముచెప్పఁబనిలేదు. నీనామమునాహృదయమునసదా పాదుకొనియున్నది. ఈసంసారమునాకులక్ష్యముకాదు. నామనస్సునీరూపమునందు లయించియున్నది. సూర్యునికెదురనంధకారము తలచూపనట్లు నీనిజభక్తులచెంత సంసారతాపముతలచూపదు. (స్వత్వమాత్మనిసంజాతం। స్వామిత్వంబ్రహ్మణిస్థితం) అనురీతిని నేనునీసొత్తగుదును. నీవునాస్వామివి. సొత్తువిషయమయిన విచారముస్వామికేగాని సొత్తునకుఁగలదా (ముకుందమూర్ధ్నాప్రణిపత్యయాచే। భవంతమేకాంతమియంతమర్థం। అవిస్మృతిస్త్వచ్చరణారవిందే। భవేభవే మేస్తుభవత్ప్రసాదాత్) ఓముకుందా నేనెన్నిజన్మములెత్తినను అన్నిటియందును నీచరణారవిందములను

మఱునకు చింతింపుచుండవలయును. నీకుశిరసావందనము చేసియాచించెదను. ఇందుకు అన్యముగ మోక్షమును సహితము నేనొల్లను. అనిననామదేవులమాటలు భగవంతుఁడు విని మందహాసముచేసి యాలింగనముచేసికొని శ్రీరుక్మిణీదేవినిజూచి యోరమణీ వీరిహృదయపరిపాకమును కనుగొంటివే యని చెప్పి ప్రియోక్తులాడుచుండెను.

ఇట్లుండ నామదేవులభార్యయగు రాధాబాయి తనయత్తనుజూచి నీకుమారుఁడెందు కవతరించెనో తెలియదు. నేనును నాశిశువులును అన్నవస్త్రములు లేక కష్టపడియెదము. ఇతనిదాస్యవృత్తిని ప్రీతిగ నంగీకరింపుచు నట్టిరుక్మిణీకాంతుఁడు మనకుటుంబమునకు ఈదురవస్థను గలుగఁజేసెనని తోఁచుచున్నది. అశక్తులమగుమన మేమిచేయవచ్చును. సంసారదుఃఖమునకు దరిగానము అనివిచారపడుచుండెడి ఈశబ్దము అనాథబంధుఁడగు శ్రీమత్పాండురంగని చెవిసోఁకెను. కృపానిధియైనయద్దేవుఁడు నామదేవులను తెలియకుండునట్లు కేశవసెట్టియను నొకవర్తకునిరూపమును ధరించి, గరుత్మంతుని నొకయెద్దుగాఁ జేసి దానిమీఁద వరాలమూటను వేసికొని నామదేవులయింటిని విచారించుకొనుచువచ్చినపుడు ఆవీథియందుండువారు నామదేవులయింట అన్నము సున్నము. నూనెలోపము. ఆజ్యము పూజ్యము. ఇట్లుండ ఈవర్తకుఁడన్నార్థియై విందుకువచ్చినట్లు తోఁచుచున్నది. ఇతఁడు అచటికేలపోయెడునని తమలోగుసగుసలాడుచుండిరి. మఱికొందఱు ఆగోలిమనకేలయని వర్తకునికినామదేవులయింటినిజూపిరి. వర్తకుఁడాయింటిచెంతకువచ్చి నామదేవులభార్యనుజూచి యోతల్లీ మీయింటికి నేను విందునైవచ్చితిననియె. అదివిని రాధాబాయి ఇంటయజమానుఁడు లేఁడు. అనిచెప్పి పొరుగింటివారితో మాయింటికి భాగవతులనేకులు వాలాయముగవచ్చుచున్నారు. మాయజమానులు ఇంటిస్థితినివిచారింపక వచ్చువారలకు భోజనముపెట్టుమని మాత్రముచెప్పుచున్నారు. నేనేమిచేయుదును. ఈదారిద్ర్యము నెట్లుసహింతును. అనిఖేదముతోఁ జెప్పుచుండినమాటలనువిని యావణిగ్వేషధారి రాధాబాయినిజూచి అమ్మా నడవలోఁ గూర్చుండుటకుమాత్రము కొంతస్థలమిమ్మనియడిగెను. ఆమెవాకిటికడ్డముగా నిలుచుండి నీవెవ్వఁడవు. వచ్చినకార్యమేమి. నీనామధేయమెయ్యది. అనియడిగినవర్తకుఁడు నాపేరు కేశవసెట్టి. నామదేవులు నాకత్యంతస్నేహితులుగాన వారినిజూడవచ్చితిని. నాప్రాణసఖులైన నామదేవులు మిగులదారిద్ర్యపీడితులైయున్నారని కొంతద్రవ్యమును దెచ్చితిని. అనినవర్తకుని మాటలనువిని రాధాబాయి యతని కుపచారముచేసి యింటిలోనికి పిలుచుకొనిపోయి యాసనమిచ్చిగూర్చుండఁబెట్టినవర్తకుఁడు రాధాబాయినిజూచి యోతల్లీ నాప్రియమిత్రులగునామదేవులను కుటుంబపోషణవిషయమున బాధింపకుము. ఈధనమునుంచుకొని కుటుంబభారమునిర్వహింపుము. నేనువచ్చినసంగతిని నీభర్తకుఁ దెలుపుము. అనిచెప్పి తానుదెచ్చినధనమును ఆమెకు అప్పగించి యచ్చోటువిడిచి వెడలిపోయెను. రాధాబాయిమిగుల సంతోషించి నాభర్తచేయుసేవనుమెచ్చియుండి భగవంతుఁడే యీద్రవ్యమునిచ్చెనని నిశ్చయించి వరాలమూటను భద్రపఱచి అందుండికొంతప్రైకము నెత్తుకొని యంగడివీథికిఁబోయి యోగ్యుఁడగునొకవర్తకుని చేతికిచ్చి వానిద్వారాతనయింటికి కావలసినసమస్తపదార్థములను రప్పించుకొనెను. నామదేవులతల్లియగు గుణాబాయి కేశవసెట్టివచ్చిన కాలమునయింటియందులేనందున ఆమెకీవృత్తాంతము తెలియదు.

గుణాబాయి యెచ్చటికోపోయి కొంతతండులములు సేకరించుకొని యింటికివచ్చినపుడు నామదేవులమీఁదికోపముతోఁ బండరినాథసన్నిధిలోఁ బ్రవేశించి భగవంతునికెదురనిలు

చుండినవనీతచోరా ఇష్టులగుమాకుకష్టములనిచ్చితివి. నీవుకృపారహితుఁడవు. ఇఁకనుమాకు నీ దాక్షిణ్యములోనేమిప్రయోజనము. మేముపడరానిపాట్లుపడి పెనిచినబిడ్డను మాయందునిరాశనుగలుగఁజేసి నీదాసునిగఁజేసికొంటివి. ఇదినీతియగునే. సాధువులునిన్ను దారుఁడని చెప్పెదరు. అదినిజముకాదు. కుచేలునియటుకులనుభుజించి యతనికైశ్వర్యములనిచ్చితివి (ఆఖ్యాహిమమతత్వేన । రాక్షసానాంబలాబలం) అని విభీషణునడిగి రాక్షసులమర్మమును దెలిసికొని యతనికిలంకారాజ్యమునిచ్చితివి. ధృవ, గజేంద్ర, ప్రహ్లాద, ద్రౌపదిప్రముఖులవిషయమున వారలకుఁగల దృఢాధ్యవసాయము నిన్ను పరతంత్రునిగఁజేసి వారలరక్షణమునందుప్రేరించెను. రక్షకుఁడనునామమాత్రమునునీవువహించితివి. నినునమ్మినగోపికలను పెక్కుపాట్లుపెట్టితివి. మఱియుపరదారగమనము, పరద్రవ్యాపహరణము, అసత్యకథనము, స్త్రీగోహత్యలు మొదలగు నీదుర్గుణములను ఎన్నతరముకాదు. అనిబహునిష్ఠురోక్తులనుబలుకుగుణాబాయినిచూచి భగవంతుఁడు మందస్మితముచేసి యోతల్లీకోపింపకుము. నన్నేలవ్యర్థముగాదూరెదవు. నీబిడ్డకునీయందు ప్రీతిగలిగినఁదోడ్కొనిపొమ్ము. నిజముపల్కెదను-వినుము. నామదేవుఁడునాబిడ్డఁడే కాని నీబిడ్డఁడుకాఁడు. నాయందలిభక్తిపారవశ్యముచే వీఁడులోకులకు ఉన్మత్తునివలెనగుపడుచున్నాఁడు. తనంతటపండినపండు వృక్షమునంటనిచందమున నాహృదయముచే పండినహృదయముగల నామదేవునికి సంసారమునతనంతట ఆశవీడెను. నాకునునామదేవునకునుగల సంబంధము అనాదియై, నిరుపాధికమైయున్నది. మీకువానితోడిసంబంధముకాదాచిత్కమై, సోపాధికమైయున్నది. ఇట్లుండమీరేలవానికై యనుతపించెదరు. అనిననిగుణాబాయి ఆహామంచిమాటలుచెప్పితివి. క్రూరుఁడగురాజు కాపులసర్వస్వము నపహరించి వారియన్నవస్త్రములకేమియునొసఁగకకష్టపఱచునట్లు మేము కనిపెంచినబిడ్డను మాకుపయోగములేకనీదాసునిగఁజేసికొంటివి. వాచాలకుఁడవుగాననీతప్పులను ఒప్పులనిసాధించెదవు. ఈయనీతినీకుమాత్రమే నీతియైయున్నది. నేనుకష్టపడిపెంచినబిడ్డకు నీవుయజమానుఁడవుఅని యెవరుసమ్మతింతురు. తల్లిదండ్రులమగుమేముదిక్కులేకనడివీధియందల్లాడుచుండ మాబిడ్డనిమీబిడ్డయనికనిపెంచినవానినలెసిగ్గులేకబహుజల్పముచేసెదవు. అనినగుణాబాయినిష్ఠురవాక్యములనువిని భగవంతుఁడు ఈయమ్మకు ఈసమయమున మంచిమాటలనుచెప్పకున్న మనకపకీర్తిసంభవించునని నిశ్చయించి యోభాగ్యవతీ నీవుమహాపుణ్యవతివి. నీమనస్సునిర్మలమైనదిగాన నాకుపరమప్రీతివిషయమగు నామదేవునినీకు పుత్రునిగానిచ్చితిని. లోకోజ్జీవనార్థము బ్రహ్మపుత్రుఁడైయవతరించిన నారదునివలెనామదేవుఁడు నీపుత్రుఁడైయవతరించెను. నామదేవునికి పాలిచ్చిపెంచిననీపుణ్యాగౌరవమును గొనియాడనెవరికితరము. అని యఖిలాండకోటిబ్రహ్మాండనాయకులు చెప్పినమాటలువినిగుణాబాయి భగవంతునిజూచి నీవెట్లుపలికినను చెల్లుబడియగును. అనిచెప్పి శ్రీరుక్మిణీదేవి సన్నిధికిపోయి సమస్తకల్యాణగుణాత్మకుఁడనిసుప్రసిద్ధుఁడగుభగవంతుఁడు నాపుత్రునిట్లు చేయుటనీతికాదని విన్నవించి మఱలవిఠ్ఠలనాథునిసన్నిధికివచ్చి తనకొడుకునుజూచి యోనామదేవానీవేలయిచటనున్నావు. ఈకృష్ణుఁడింద్రజాలమునకుశలుఁడు. దుర్యోధనకులనాశకుఁడు. గోపికాచిత్తచోరుఁడు. జగన్మోహనుఁడు. కటిహస్తుఁడైయిటికఱాతిపైనిలుచుండిదయార్ద్రహృదయులచిత్తములనపహరించుచున్నాఁడు. పుండరీకుఁడువీనికిచోటిచ్చినందునగదాయింతయనర్థమునకు హేతువయ్యెనుఅనిపలికిస్వామినిచూచిపాండురంగాఅనాథులగు మాపైనీకేలకరుణ

రాదు. నీమనస్సుఏటాయోలేక యిసుమో తెలియదు. అనినవిని దయాసింధువగు నిరుపాధికబంధువు ఓగుణాబాయీ నన్నునిష్ఠురములాడకుము. నీనామదేవునితోడ్కొనిపొమ్మని యతనిచేతిని బట్టి గుణాబాయిచేతికి అప్పగించెను. గుణాబాయినామదేవునిని చేతఁబట్టుకొని యింటికిఁబోవుచు ఓపుత్రనీవు ఈప్రపంచస్వభావమునువిడిచి పండరినాధునిని గట్టిగపట్టుకొనియుండిన మేమేమిచేయుదుమనిన అతఁడుతల్లికిప్రత్యుత్తరముచెప్పక నిరంతర భగవద్గుణానుభవపరుఁడై యానందబాష్పములను విడుచుచునిల్లు చేరెను.

అచటసకలపదార్థములును సమృద్ధిగనుండుటకును, తనకోడలగురాధాబాయి బహువిధభక్ష్యములతోడ దివ్యాన్నమును పాకముచేయుచుండుటనుచూచి జగన్నాధుఁడుకరుణించెనని గుణాబాయి సంతసించెను. నామదేవులువీరినిజూచి మనమునకలంకముచెంది యీసంపదయెట్లుసిద్ధించెననితల్లినిఅడిగిన ఆమె తనకేమియు తెలియదనిన రాధాబాయిభర్తకునమస్కరించి యర్ఘ్యపాద్యాద్యుపచారములనుజేసిభుజింపరండు అనిపిలిచిననామదేవులాశ్చర్యపడి యిది యేమివింత. ఈస్త్రీయిన్నిదినములవలెనిష్ఠురములాడక నేఁడుసవినయముగమాటలాడుచున్నది. ఈసంపదనుజూచినసంతోషముకాఁబోలు. (సర్వేగుణాః కాంచనమాశ్రయంతి) అనువాక్యమునిజమైయున్నది అనితనలోచింతించి యీసంపదయెట్లుసిద్ధించెననిభార్యను అడుగఁగా ఆమెనిజముచెప్పిననితఁడు సర్వస్వదానముచేయునని భయపడిమౌనముగానుండెను. అపుడుపరిచారికయగుజనాబాయి పండరినాధుఁడు కేశవసెట్టియైవచ్చి ద్రవ్యమిచ్చిపోయిన వృత్తాంతమును సవిస్తారముగఁజెప్పెను. ఆమాటలనువినినామదేవులు (దయాసింధోబంధోనివరధికవాత్సల్యజలధే( అనిస్తుతించి నపుంసకునకుకన్యాదానమును, అంధునికిదీపదానమును చేసినట్లునిస్పృహుఁడగునాకేలద్రవ్యదానముచేసితివిఅనిచెప్పి యాయూరిలోనుండుబీదలకుతనయింటనుండు సర్వస్వమును దానముచేసిపరిశుద్ధహృదయుఁడై శ్రీపాండురంగనిసన్నిధానమునఁజేరి భగవద్ధ్యానముచేయుచు పరమానందభరితుఁడైయుండెను.

శ్రీమత్పాండురంగపరబ్రహ్మణేనమః.

---

## ఐదవయధ్యాయము.

### కబీర్ దాసులచరిత్రము.

---

గంగాతీరమున తమాల్ మోఖీం అనునొకతురుష్కుఁడు గుడ్డలునేసిజీవించుచుండెను. ఇతఁడు నూలుకడుగుటకై గంగకుపోయి నీటఁదేలుచు ప్రవాహవశమున తనయొద్దకువచ్చిన ముత్యపుచిప్పనుఎత్తిఅందుశ్రీశుకాంశముచే ప్రకాశించుచుండినశిశువునుజూచి యానందపరవశుఁడై యింటికిఁదీసికొనిపోయి భార్యచేతికిచ్చి అపుత్రకులగుమనకు ఈశిశువు భగవత్కటాక్షముచే లబ్ధమాయెనని చెప్పుచుండ ఆశ్చర్యకరముగ ఆమెకుస్తనములయందు పాలుచేపెను. తల్లిదండ్రులు ఆశిశువునకు కబీర్ అని నామకరణముచేసిరి. ఆబిడ్డఁడు మాటలాడనేర్చినంతోట సదారామనామోచ్చారణము చేయుచుండిన నందనునుజూచి యాశ్చర్యపడి యీతురుష్కునికి సాక్షాద్భగవద్దాసుఁడు జన్మించెనని స్తోత్రముచేయసాగిరి. తల్లిదండ్రులు కబీరునకుయుక్త

కాలమునందు వివాహముచేసిరి. కబీర్ ప్రపంచవ్యాపారములయందు మనసు లేక సమస్తచేతనములయందును సమభావము చేయుచు శబ్దాదివిషయసుఖములనువర్జించి శ్రీరామనామభజనము చేయుచుండెను. ఇట్టినడతనుజూచి లోకులందఱు ఇతఁడుపిచ్చివాఁడని చెప్పినవ్వుచుండిరి. తల్లిదండ్రులుమాత్రము ప్రీతితోడ పెంచుచుండువారగుటచే పుత్రునిలాలనచేయుచుండిరి. ఇట్లుండ కబీరునకు తానేకుటుంబ నిర్వాహముచేయఁదగినవయసువచ్చెను. జలాగ్నులవలె, విషామృతములవలె, అంధకారదీపములవలె ప్రపంచచింతకును పారమార్థికచింతకును పరస్పరవిరోధము కాన కబీర్ ప్రపంచచింతనుమాని పరమార్థచింతతోఁగూడి బీదచందమునసుండెను. ఇదిచూచి తల్లిపుత్రునినిబిలచి వత్సానీవిట్లు ప్రపంచవ్యవహారమున మనసులేక తిరిగినసంసారకృత్యము లెట్లుజరుగును అనిబహువిధములుగఁజెప్పిగుడ్డలు నేయుమనినిర్బంధించెను. కబీర్ గుడ్డలునేయుటకుప్రారంభించి యప్పుడప్పుడురామచంద్రులనుధ్యానించుచు మైమఱచియుండును. తల్లిచూచి చేయితట్టిపుత్రుని హెచ్చరించి పనిచేయుమనిచెప్పిపోవును. కబీర్ కొంతనేసి మరలధ్యానపరుఁడైయుండును. ఇట్టిస్థితిని జగన్నివాసుఁడగుశ్రీరామచంద్రుఁడు చూచి ధ్యానపరుఁడైయుండు కబీర్ చెంతకువచ్చి కూర్చుండి తానేగుడ్డలునేయసాగెను. మహాయోగులకుదుర్లభుఁడగు శ్రీజానకీరమణుఁడు నేయుచుండఁగా కబీర్ జాగ్రదవస్థనుజెంది కొంచెమునేయును. అపుడు దాశరధిమఱుఁగువడియుండును. మఱలవెంటనే కబీర్ ధ్యానపరుఁడైయుండును. ఎప్పటియట్లు రఘునాధుఁడునేయసాగును. ఇట్లిరువురుగనేసిముగించిన వస్త్రమును కబీర్ మడిచి తల్లిచేతికిచ్చిన ఆయమ్మ యంగడికిపోయి విక్రయించిరమ్మని పుత్రుని నియమించెను. కబీర్ అంగడికిపోయి వస్త్రమునెదుటనుంచుకొని కూర్చుండి హృదయమున శ్రీరామధ్యానముచేయుచు వాక్కుచే శ్రీరామనామమునుజపించుచు తానువచ్చిన కార్యమునుమఱచియుండెను. మార్గమున వచ్చుచుపోవుచునుండు జనులు ఈవస్త్రమునుజూచియిదియమూల్యము దీనినివెలయిచ్చికొనుటకు మనముఅశక్తులము అనిచెప్పుచు వస్త్రమువెలయెంతయనిగానియడుగక యేపోవుచుండిరి. మఱికొందఱు చెంతకువచ్చి చక్కఁగఁజూచుటకును శంకించిరి. ఒక్కొకరికిని వారి వారిశక్తికిమీఱినపదార్థమనితోఁచెను. కాన నొకరును వస్త్రమునుగొనరైరి. ఇంతలో సూర్యుఁడస్తమించినందున అంగళ్లుమూయఁబడియె. కబీర్ కన్నులు తెఱచిచూచి యందఱునిండ్లకుఁబోయిరి. మనవస్త్రము విక్రయింపఁబడదయ్యెను. ఇంటికిఁబోయినఁదల్లికొట్టునుగదాయని వెఱచి సమీపముననుండినయొకపాడుగుడిసెలో ప్రవేశించి శ్రీరామనామస్మరణముచేయుచుండెను. ఇట్లుండ జగదీశుఁడు వీరియచంచలనిష్ఠనుచూడనపేక్షించియొకవృద్ధబ్రాహ్మణుఁడై యతిజీర్ణమైన వస్త్రమునుధరించి వడవడవణఁకుచు నచటికివచ్చి నేనుదీనుఁడను. వస్త్రములేక చలిచే బాధపడుచున్నాను. కాన నాకొకవస్త్రము నిమ్మని వేడిన కబీర్ తనచేతినూతనవస్త్రముచెఱిసగముచించియిచ్చి యెప్పటియట్లు ధ్యానపరుఁడైయుండెను. వృద్ధబ్రాహ్మణుఁడైవచ్చిన సీతాపతి యారూపమునువిడిచియొకఫకీరువేషమునువేసికొని మఱలకబీరునకెదురనిలచి సర్వేశ్వరుఁడరూపియైయుండ నీవేలసరూపధ్యానముచేయుచుండెదవు అనియడుగఁగాకబీర్ ఆఫకీరునుజూచి యోయిసాధూ జగదీశునికి అరూపసరూపములు సమమైయుండును. (నతేరూపంనచాకారం। నాయుధానినచాస్పదం। తథాపిపురుషాకారో। భక్తానాంత్వంప్రకాశసే) అనుశ్రుతిని అరూపియైనభగవంతుఁడు భక్తులకై సరూపియైయుండును. భగవంతునిదివ్యాత్మస్వ

ावें ॥ गुण अनंत अविगतिहिं जनावे। यश अपार श्रुति पार पावे ॥ चरणकमल नित रमा पलोवे। चाहत नेक नयन भर ावे ॥ अगम अगोचर लीला धारी। सो राधावश कुंजबि- ारी ॥ जो रस ब्रह्मादिक नहिं पायो। सो रस गोकुल गलिन हायो ॥ बड़भागी यह सब व्रजवासी। जिनके सँग खेलें ाविनाशी ॥ सूर सुयश कहि कहा बखानै। गोविंद गति ोविंद जानै ॥ ४ ॥

साख मुनिजन भेरें देव अस्तुति करें स्मृति पुराण गुण वेद ावें। तुम प्रभु एक अनेक है रमि रहे अमित जगजंतु नहिं ंत पावें ॥ शेष महेश गंधर्व किन्नर थके व्यास ब्रह्मादि नहिं ार पावें। चरण पाताल औ शीश आकाशमें चंद्र सूरज दोउ ा सुहावें ॥ यही परतीत तेरी चहुँ युगनमें भक्तके हेतु धरि े धावें। कहत मिहरदास निवास लियो नंदगृह कान्ह ुत जान यशुमति खिलावें ॥ ५ ॥

## राग रामकली।

हौं इक नई बात सुनि आई ॥ महरि यशोदा ढोटा जायो र घर बजत बधाई। द्वारे भीर गोप गोपिनकी महिमा वरणि जाई। अति आनंद होत गोकुलमें रत्न भूमि निधि छाई। ाचत तरुण वृद्ध अरु बालक गोरस कीच मचाई। सूरदास वामी सुखसागर सुंदर श्याम कन्हाई ॥ ६ ॥

## राग भैरव।

देखो री यह कैसो बालक रानी यशोमति जायाहै। सुंदर वरण कमलदललोचन देखत चंद्र लजाया है ॥ पूरण ब्रह्म अलख अविनाशी प्रगट नन्दघर आया है। मोर मुकुट पीतांबर सोहै

జముచే నీకు నాసేవఘటించెను. ఇదిమొదలునీవును మద్భజనము చేయుచుండుమని కరుణించి యదృశ్యుఁడయ్యెను. కబీరుతల్లి యానందభరితయై పుత్రునిని ఆలింగనము చేసికొని శిరము మూర్కొని తనయా నీనిమిత్తముగ అఖిలాండనాయకుఁడగు శ్రీరామచంద్రునిదర్శనము నాకు లభించెను. బ్రహ్మాదులకలభ్యమగు నిట్టిమహాఫలము నాకు సిద్ధించినందున నాయట్టిభాగ్యవతి లోకమునందు లేదు అనిచెప్పి యానందపరవశయై పుత్రునిఁదోడ్కొని నిజమందిరమును జేరెను.

శ్రీసీతాలక్ష్మణహనుమత్సమేత శ్రీరామచంద్రస్వామినే నమః.

---

## ఆఱవయధ్యాయము

### కబీరుదాసుచరిత్రము.

భగవంతుఁడగు శ్రీరామభద్రుఁడు ప్రత్యక్షమై శ్రీరామభజనము చేయుచుండుమని కబీరుని తల్లికి నియమించినదిమొదలు ఆయమ భగవన్నియమనానుసారముగ సదా శ్రీరామభజనము చేయుచు మునుపటివలె కుమారునిని బాధింపక భగవద్భక్తుఁడగు పుత్రుని గౌరవించుచు చిత్తశాంతితోఁగూడియుండెను. కబీరుభార్య అనసూయాదేవికి సమానురాలగు మహాపతివ్రత కావున స్వభర్తయొక్క ఛందానువర్తినియై యుండెను. ఇట్లు ఈముగ్వురును జ్ఞానవైరాగ్యసంపన్నులై కాలమును గడపుచుండ కబీరుభార్య గర్భవతియై యొకపుత్రుని గనెను. వానికి పండ్రెండవదినమున కమాల్ అని నామకరణము చేసిరి. ఆయర్భకుఁడు దినదినప్రవర్ధమానుఁడై జ్ఞానవైరాగ్యసంపన్నుఁడై తండ్రితోడ శ్రీరామనామస్మరణ చేయుచుండెను. ఆఱవయేట కమాల్ తనతండ్రికి వందనము చేసి యోతండ్రీ నాకు తీర్థయాత్ర చేయవలయునని యపేక్షకలిగియున్నది. ఉచితమగునేని దేవరవారు నియమింపవలయునని వేఁడఁగా కబీరుతనపుత్రుని యధ్యవసాయమున కమితసంతసించి పోయిరమ్మని యనుమతిచేసి దీవించి పంపెను. కమాల్ జనకాజ్ఞను శిరసావహించి గృహమునుండి బయలుదేరి శ్రీరామనామస్మరణ చేయుచు పోవుచుండ మార్గమున నితనిజూచి భగవద్భక్తులందఱు తమతమచోట్లకు తోడ్కొనిపోయి యుపచరించి పంపుచుండిరి. ఇతఁడు అహోరాత్రము నారదులవలె శ్రీరామనామస్మరణ చేయుచు శ్రీద్వారకకుపోయి భగవద్భక్తిచేయుచు నచ్చట నాలుగుమాసములు వసించి యచ్చోటు విడిచి పెక్కుతీర్థములం గ్రుంకుచు భీమనదీతీరమునకు వచ్చి త్రికోటితీర్థమున స్నానము చేసి యచ్చట విష్ణుభక్తులతోఁగూడి యానందించుచుండ విష్ణుదాసుఁడనునొకవర్తకుఁడు కమాలును తనగృహంబునకుఁ దోడ్కొనిపోయి పూజించి వారిభక్తికి సంతోషించి నిరపేక్షుఁడగు నితనికి మనమేమి సమర్పింపవచ్చునని యోచించి తనబొక్కసమునందలి యొక యమూల్యరత్నమును దెచ్చి వారిపాదములయందు సమర్పించి యోస్వామీ యీరత్నము లోకోత్తరము. చీఁకటిస్థలములయందు వేఱుదీపము నపేక్షింపకయే యిది ప్రకాశించుచుండును. ఈరత్నమును అంగీకరింపవలయునని ప్రార్థింపక కమాల్ వర్తకుని నిజూచి నేను ఈ రత్న[illegible]నిపోయిన వైరాగ్యశీలుఁడగు నాజనకుఁడు కోపించును. మఱియు మహాత్ములకన్న

छू इतनो जो दियो घनश्याम कुबेरहुकी मति बौरी ॥ देखत गोहिं लुटाय दियो न बची बछिया छछिया न पिछौरी ॥१०॥

## घनाक्षरी।

फूल गये गोप गृह गोपिकन भूल गये,हुलसी मचाई माने प्रेम रसाईमें। कीच मची दधिकी अधिक गैल गैलन मे कन सबै पगे आनँद बधाईमें ॥ छोटी सुठि चोटी है कछोटी कटी गोटी भई, फैलगई थौन बड़े स्वेदकी अवाईमें। राजी दिल दन विनोदन विहँसि नन्द, नाचे आज आँगन कन्हाईकी बाईमें ॥ ११ ॥

## राग प्रभाती।

गिरिधर लोरी लै मथुराके वासी ॥ चिरजीवो वसुदेवके नंदन लि बलि माता घोरी। भूपर भार भयो अतिभारी सुर समूह सब य पुकारी।जगतपिता जगनायक स्वामी धर्म्म कथा जगथोरी॥ न गिरासों यों हरि भाषो असुर मार संतन पतिराखो आदि ष तेरो अंत न पायो धरहु भक्त हित खोरी। वसुदेव देवकी अति- नेने पूरणब्रह्म जान सन्माने स्तुति करत बहोर बहोरी कंसके य चित चोरी ॥ नंद यशोदा हर्ष निरख मन पायो निर्धन मनहुँ रमधन आदि युगादि धरणिधर माधव लखि न जात गति तोरी। जवधुआं मिल नँदगृह आईं भाग भले हरि दर्शन पाईं हिल मिल पलना देत झुलाई हाथ गहे पट डोरी ॥ दैत्यानी इक कंस पठाई कर छल विष स्तन पर लाई बनि वरांगना अति छबि सुंदर ब्रज बधुआं चित चोरी। पलनासों हरि जाय उठाये चूमि नयन स्तन मुख लाये ऐसी चूस करी मेरे ललना लीने प्राण

జరిగినవృత్తాంతమును చెప్పెను. ఆపతివ్రతతనపుత్రునిసుగుణసంపత్తిని స్మరించి కన్నీరువిడిచి యోవత్సా సాధువులకై నిజశరీరమును పేక్షించితివిగదా. నీవేభాగ్యశాలివి. ఉభయకులవిశుద్ధుండవు. అప్రతిమప్రభావుండవు, అని చెప్పి కన్నీరుతుడుచుకొని మనస్సును ధైర్యయుక్తముచేసిచిత్తశాంతితోడ పాకముచేయుటకు యత్నించెను.

మున్ను జటాయువు భగవదర్థమై శరీరమును పేక్షించెను. ఇపుడు కమాల్ భాగవతార్థమై శరీరమును పేక్షించెను. కాన ఈకమాల్ దాసుని యధ్యవసాయ మత్యంతము శ్లాఘనీయమైయొప్పెను. పిదప కబీరుభార్య పావనత్వభోగ్యత్వములతోడ పాకము చేసి దివ్యాన్నమును భగవంతునికి నివేదించి భాగవతులను భుజింపజేసెను- భాగవతులందఱును భుజించి సుఖముగ నిద్రించి ప్రాతఃకాలమున బయలుదేరిపోవునపుడు దారి విడిచివచ్చుటకై కబీరువారలను వెంబడించెను. పుత్రుని శిరమును కబీరు ఛేదించుకొనివచ్చిన పిదప ఆవర్తకుండు ఆమొండెమును రాజునకు చూపించి గతవృత్తాంతమును విన్నవింపఁగా రాజు మార్గమునకు చెంత నందఱును చూచునట్లు ఆమొండెమును శూలమున గ్రుచ్చియుంచుడని భటులకు నియమించెను. కబీరుదాసులు భాగవతులతోడ మార్గమున పోవుచుండ ఆమొండెము ఆభాగవతులకంజలిచేసెను. దీనిని చూచి యాసాధువులు ఆశ్చర్యపడి యీమొండెమునకంజలిచేయుచుండుట మిగుల వింతయైయున్నదనిరి. కబీరు భాగవతులను జూచి సాధువులారా యిది వింతకాదు - శ్రీభీష్ములు శరతల్పంబునఁబడియుండియు నుత్తరాయణమును నిరీక్షించుచు శరీరమున ప్రాణమును నిల్పియుండలేదా- జటాయువు రావణఖడ్గముచే ఛేదింపఁబడి పడమిఁబడియు శ్రీరామదర్శనాపేక్షచే ప్రాణవంతుఁడైయుండలేదా. అట్లు ఈవైష్ణవోత్తముఁడు ఏకారణముచేతనో శిరమును బోఁగొట్టుకొనియును పరమభాగవతులగు దేవర వారిని సేవించుటకై ప్రాణముతోఁగూడియున్న వాఁడు కాఁబోలును. ఇప్పుడు వాని మనోరథమీడేరినందున ఈయాత్మకు పరమపదంబబ్బుటకు సందియంబులేదు -అనిన కబీరుమాటలను విని సాధుజనులు జరిగిన దానిని నిజముగఁ జెప్పుమని నిర్బంధింప కబీరుసంతోషచిత్తుఁడై జరిగినగ్రంధమును నిజముగ విన్నవించెను. అపుడు సాధువులు మిగుల కరుణించి కబీరుభార్యను కమాల్ శిరస్సుతోడ గప్పించి యామొండెమును శూలాగ్రమున నుండి క్రిందికిదించి దానితోడ ఈశిరమును అతికించి తమ హస్తములచే స్పృశించి భగవంతుని ధ్యానించి కృపానిధియగు జగదీశుని కృపచే ఈయర్భకుఁడు జీవించుఁగాక యనినతోడనే కమాల్ నిద్రించిలేచినవానివలె లేచి సాధువులకును, జననీజనకులకును ప్రదక్షిణనమస్కారములు చేసెను- ఈయద్భుతమును జూచి వారణాసియందలివారు ఆబాలవృద్ధముగ ఆనందపరవశులై కబీరుదాసతత్పుత్రుల భాగవతారాధన వైభవంబును వేవిధములఁగొనియాడసాగిరి - సాధువులు కబీరును సన్మానించి భార్యాపుత్రులతోడ వారిగృహంబులకనిచి తాము తీర్థయాత్రకు పోయిరి.

శ్రీహరిదాసేభ్యోనమః.

# భక్తవిజయము.

## ఏకాదశాధ్యాయము.

### కపీరుదాసు చరిత్రము



ఒకనాఁడు కపీరుదాసులు రామనామ స్మరణచేయుచు అంగడివీధినిపోవుచుండ నొక స్త్రీ తిరగటిలో పిండివిసరుచుండుటను చూచి కొంతసేపు చింతాపరుఁడై యుండి గట్టిగ ఏడ్వసాగెను. అప్పటివారందఱును అయ్యా నీ వేలయేడ్చెదవు. నీవ్యసనమునకు కారణమేమి. నిన్నెవరేమనిరి. అని యడిగినఁ కపీరుదాసు వీరలకు నాదుఃఖమును పరిహరింపఁదగిన సామర్థ్యము కలదా. ఒకఁడు తనదుఃఖమును తనవలెనే దుఃఖించువానితో చెప్పినఁగుననేమి ప్రయోజనము. చకోరమునకు కలిగిన తాపము చంద్రోదయము చేతఁ జనునట్లు నాదుఃఖము పరమాత్మ దర్శనము చేతఁ జనలయును గాని వేఱొకటఁ జెడదు. అని తలఁచి నిరుత్తరుండై యుండెను. అప్పుడు నిరంజనుఁడను భగవద్భక్తుఁడొకఁ డచ్చటికి వచ్చి కపీరును చూచి యో మహాత్మా యేలయేడ్చెదవని యడిగినఁ కపీరుదాసు కన్నీరు తుడుచుకొని యాతనిజూచి చంద్రదర్శనముచే సముద్రము పొంగునట్లు ఆనందమును జెంది యిట్లనియె. భాగవతోత్తమా నేను ఇచ్చట వచ్చుచుండ ఒక స్త్రీ తిరగటిలో పిండివిసరుచుండెను. అది చూచినంతట సాధువులు వచించు రీతిని సంస్కృత చక్రస్థులైన స్వకర్మములచే భ్రామ్యమాణులగుచు దుఃఖాతురులైన జీవులు స్వకృత పాపానుగుణముగ యమయాతనల ననుభవించుచుండునట్లు నాబుద్ధికి గోచరించెను. తిరగటి మీఁదిరాయి ఆకాశమనియు క్రిందిరాయి భూమియనియు ఆరెంటికి నడుమ చిక్కిన తండులములు ప్రాణులనియు దానిని మట్టుచుండిన స్త్రీ యముఁడనియును తలఁచి బుద్ధిపూర్వకముగను అబుద్ధిపూర్వకముగను అకృత్యకరణ, కృత్యాకరణ, భగవదపచార, భాగవతాపచార, అసహ్యాపచారంబులను అనంతములుగఁ జేసిన మనకును ఇట్టి దుఃఖము సంప్రాప్తమగును గదా యని యేడ్చితిని. అని చెప్పిన విని నిరంజనుఁడు కపీరునుజూచి నీతలంపు మిగుల నుచితమైయున్నది. అయినను ఆ తిరగటి నడుమనుండెడి యచ్చునకు చుట్టును ఒకటి రెండంగుళముల దూరమునకు లోపలనుండు బియ్యము రెండురాళ్ల నడుమ చిక్కి పిండి కాక సురక్షితముగనుండ లేదా యని దానిని కపీరుదాసులకు చూపి భూమ్యంతరిక్షములకు మధ్యనుండు సమస్త ప్రాణులను యముఁడు శిక్షించుచుండ తిరగటి యచ్చునాశ్రయించి యుండు ధాన్యమువలె భగవన్నామమున వలంబించి (యజ్ఞానాం జపయజ్ఞోస్మి) అని భగవంతుఁడు తానేకొనియాడిన జపయజ్ఞములయందు నిష్ఠులైయుండు జీవరాసుల కొకప్పుడును భయము లేదని సమాధానము చెప్పిన నిరంజనునికి వందనం బాచరించి దుఃఖమును విడిచి శ్రీరామనామస్మరణ చేయుచు స్వగృహము చేరెను. నిరంజనుఁడును స్వస్థానమునకుఁ బోయెను. పిదప కపీరు సదా శ్రీరామనామ భజనపరుఁడై [illegible] జీవన హేతువుగ బహుకీర్తనలు చేయుచు నానందించుచుండి యొకనాఁ డేకాంతంబున నిట్లని [illegible]ంచెను. ప్రేమలేని భగవత్కీర్తనము వలె భూతదయ లేని జ్ఞానము వలె వైరాగ్యము లేని సన్న్యాసము వలె సద్గురుసంబంధము లేని భగవద్భక్తి ఫలింపదు. కాన జ్ఞా[illegible]ఁడగు నాచార్యుని నాశ్రయించి నాజన్మ[illegible] సఫలము చేయవలయును. [illegible] (జ్ఞానహీనం గురుం ప్రాప్య కుతో మోక్షమవాప్నుయాత్ । [illegible] నాశ్రయ ప్రవ[illegible]ంనగచ్ఛతి) అను రీతిని జ్ఞానహీనుఁడగు గురువును ఆశ్రయిం[illegible]

యోజనము - జ్ఞానహీనుఁడంధప్రాయుఁడు. అనుష్ఠానహీనుఁడు పంగుప్రాయుఁడు. జ్ఞానానుష్ఠానములు రెండును కలిగినస్వపరోజ్జీవనకారియగును - కాన నేనొక సదాచార్యునాశ్రయించినగాని ధన్యుఁడనయ్యెదను - అని బహువిధముల చింతించి వారణాసియందు వసించుచుండిన శ్రీరామానందస్వామియను సన్న్యాసిని శరణుఁ జెందవలయునని యపేక్షించి శ్రీసీతారుక్మిణులు సమస్తరాజులను పేక్షించి శ్రీరామకృష్ణులను బతిం చినట్లు కబీరుదాసు జ్ఞానానుష్ఠానసంపన్నుఁడైన శ్రీరామానందస్వామిని పరమాచార్యునిగ వరింపఁగోరి వారియాశ్రమము చెంతకు వచ్చి దూరమున నిలుచుండి సాష్టాంగవందనములు చేసి బద్ధాంజలియై స్వామిని కన్నులు గడగంటఁగటాక్షించి జ్ఞానోపదేశముకృప చేయవలయునని ప్రార్థించెను. శ్రీరామానందస్వామి కబీరు తురుష్కుఁడగుటచే నితని కుపదేశించిన లోకాపవాదము కలుగునని శంకించి మౌనముగానుండెను - కబీరుదాసు మఠమునకు వెలుపల నిలుచుండి నేను అకించనుఁడను - అనన్యగతిని - మీ పాదపద్మంబులను శరణము చెందుదును - శరణాగతుని పేక్షించుట ధర్మము కాదు - అని విన్నవించి మేఘజలము నిరీక్షించు చాతకమువలె ఆచార్యకటాక్షమును నిరీక్షించుచుండెను - శ్రీరామానందస్వామి లోపలనుండి నీవు మ్లేచ్ఛుఁడవు - కాన నే నుపదేశింపనని చెప్పి మౌనముగానుండెను. అప్పుడు కబీరుదాసు నా మనసు దేవర పాదపద్మముల నాశ్రయించియున్నది. పూర్వము తన్ను పేక్షించిన ద్రోణాచార్యులను విడువక భక్తిచేసి సిద్ధిఁ జెందిన యేకలవ్యునివలె దేవరవారు పేక్షించినను నేను విడువక భక్తిచేసి యెవ్విధినైనను దేవర కటాక్షమునకు పాత్రుఁడనయ్యెదను - అని విన్నవించి స్వగృహమునకుఁ బోయెను. పిదప నొకనాఁడు కబీరుదాసు శ్రీరామానందస్వామి వాక్కుచే శ్రీరామనామమును వినవలయును. పాదధూళి నా శిరమున సోఁకవలయును. దీనికి సదుపాయ మెద్ది అని చింతించి శ్రీరామానందస్వామి స్నానమునకు పోవు దారియందు భూమిలో నొక పల్లము త్రవ్వి దానియందుఁ గూర్చుండి తలను మాత్రము మీఁద నుంచుకొని మేఘాగమనమును నిరీక్షించు చాతకమువలె శ్రీరామానందస్వామి రాకను నిరీక్షించుచుండ బ్రాహ్మముహూర్తమున రామానందస్వామి గంగాస్నానమునకు బయలుదేరి వచ్చుచు కబీరుదాసు తలమీఁద అడుగునుంచి యోహో చీఁకటి నెఱుఁగక యెవరిమీఁద నో కాలునుంచితిని అనియను తాపముతోడ శ్రీరామరామ యని యుచ్చరించుచుండెను. కబీరుదాసు తోడనే లేచి సాష్టాంగవందనము చేసి (అద్య మే సఫలం జన్మ । సుప్రభాతా చ మే నిశా) అని యానందించి యాచార్యదేవుల వారి పాదపద్మములచే దాసభూతుని యుత్తమాంగము నలంకరించి శ్రీతారకమంత్రము నుపదేశించితిరి. నాయంతటి భాగ్యశాలి ముల్లోకంబుల లేఁడు. నా పుణ్యఫలము నేఁడు చేకూడెను అని స్తోత్రము చేసెను. శ్రీరామానందస్వామి శ్రీరామనామస్మరణ చేయుచు విష్ణుపదియందు స్నానము చేసి పూర్వాహ్ణక్రియలను నెఱవేర్చి నిజాశ్రమమునకు వచ్చి కబీరువంటి మహాభాగవతుని దినఱకు ఈలోకంబునకని విని యెఱుంగను. శ్లాఘ్యమగు స్వర్ణమును నిప్పులోనునిచి కాచి పరీక్షించునటుల వాని యభ్యాసమును ఇంకను పరీక్షించి చూచెదను అని చింతించుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు కబీరుదాసులు అంగడివీధిలో శ్రీరామనామసంకీర్తనము చేయుచు ఆనందభరితులై మన్నాథుఁడగు శ్రీరామానందస్వామి నాకు పరమకృపచే శ్రీతారకనామము నుపదే[illegible] (గురుం ప్రకాశయేద్ధీమాన్) అను రీతిని ఆచార్యవైభవమును ప్రకాశింపించుచు నృత్యము[illegible]ండఁ బ్రాహ్మణులు చూచి యసూయాగ్రస్తచిత్తులై యావృత్తాంతమును శ్రీరామానంద[illegible]కి విన్నవించిరి. శ్రీరామానందస్వామి కబీరుదాసుల విషయమున అత్యంతప్రే

మయుక్తులై యుండియు తన భావమును ఇతరుల కెఱుక చేయక యాగ్రహగ్రస్తునివలె నటించి తో
డనే కబీరుదాసువద్దికివచ్చి తన్ను చూచినంతట భయభక్తియుక్తుండై నమస్కరించి బద్ధాం
జలియై నిలుచున్న కబీరుదాసును చూచి యోరీ తురుష్కాధమా నేను నీకు మంత్రోపదేశము చేసి
తిననియు, నీవు నా శిష్యుండవనియు ఏల క్రొవ్వియ బద్ధములాడెదవు, నేను నీకుపదేశించినందునకు
సాక్షియెవరు అని చెప్పి గోపికలు కృష్ణుని దుష్టచేష్టలను గ్గడించి మొఱయిడినపుడు యశోద యంతః
రంగమున పుత్రవాత్సల్యమును బయలు పఱుపక గోపికల తృప్త్యర్థమై కృష్ణుని శిక్షించినట్లు శ్రీరా
మానందస్వామియు కబీరుదాసులయందలి తన వాత్సల్యమును మఱుఁగు చేసి కొండెము చెప్పిన
బ్రాహ్మణుల సంతృప్తి పఱుపవలయుననియు, కబీరుదాసుల యధ్యవసాయమును పరీక్షింపవలయు
నని యుతలంపు గలిగి కోపగ్రస్తునివలె నటించి తన పాదుకచే కబీరుదాసుని శిరమునఁ గొట్టెను. అ
ప్పుడు కబీరుదాసునకు పాదుక దెబ్బచే గాయము తగిలి రక్తము ప్రవహింపసాగెను. కబీరుదాసులు
పరమానందభరితులై సన్నెలు కొన్న దేశికోత్తమా దేవరవారు దాసభూతునికి శ్రీ తారక నామము
నుపదేశించినపుడు చెంతనొకరును సాక్షులేరైరి. మనల శిష్యాచార్యులుగ ఘటింపించిన సర్వసా
క్షియగు సర్వేశ్వరుఁ డొక్కఁడే సాక్షియై యుండెను. ఆ కొఱంత తీరనిపుడు దేవరవారు ఆబాల
వృద్ధముగ చూచుచుండ అస్మన్నిక్షేపమగు దేవరవారి పాదుకచే దాసుని శిరంబును కరంబలంక
రించితిరి. ఓ జనులారా సంసారార్ణవమగ్నుఁడగు నాకు శ్రీ తారక నామపోతంబు నిచ్చి పరమకృప
చేదరిఁజేర్చిన మహానుభావుఁ డితఁడే. అందఱును చూడుఁడని చెప్పి యతివినయముతోడ బ
ద్ధాంజలియై నిలుచుండ శ్రీరామానందస్వామి యధిక సంతోషమును జెంది కబీరుదాసుని శిరమున
అభయహస్తము నునిచి సాధుజనాగ్రేసరా యెడతెగక శ్రీ తారక నామోచ్చారణము చేయుచుం
డుమని యాజ్ఞాపించి మఠంబున కేగెను.

కబీరుదాసులానందభరితులై పెక్కువిధంబుల శ్రీరామచంద్రుని కల్యాణగుణములను
కీర్తించుచు వారణాసియందలి యెల్లజనులచే కొనియాడఁబడుచుండ కొందఱు దుష్టులు దాత
నుచూచి లోభియు, పతివ్రతను చూచి జారిణియు, సదనుష్ఠానపరుని జూచి అనుష్ఠానహీనుఁ
డును, భగవద్భక్తుని జూచి నాస్తికుఁడును, పరమసాత్వికుని జూచి కోపియు అసూయపడున
ట్లు కబీరుదాసుయొక్క సద్గుణగణములను కనిఁగని సహింపనివారై దుర్యోధనాదిదుష్టచతుష్ట
యము శ్రీకృష్ణాశ్రయులగు పాండవులకు కీడు వెదకి పదివేల శిష్యులతోడ దుర్వాసమహర్షిని పంపి
నట్లు కబీరుదాసులకు కీడును జింతించి దేశదేశములయందలి భాగవతులెల్లరు ఒక్కదినమున వార
ణాశికి రావలయునని కబీరుదాసులు ప్రార్థించి వ్రాసినట్లు విన్నపపత్రికలు వ్రాసి కబీరుదాసుల వ
గెచేవ్రాలు చేసి పంపిరి. ఆ పత్రికలను జూచినంతట గోకులము, అయోధ్య, బృందావనము,
మధుర, ద్వారక, శ్రీమత్పండరిపురము, శ్రీజగన్నాథము మొదలయిన పుణ్యస్థలములయందు వ
సించు భాగవతులెల్లరు నిజముగ కబీరుదాసుల ప్రార్థనయని నమ్మి యేక కాలమున లక్షలకొలఁది వ
చ్చి వారణాశియందు చేరిరి. కపటముగ నిందఱిని రప్పించిన దుష్టులు కబీరుదాసులు ఇందఱిని
ఎట్లు సత్కరించి నిర్వహింతురో మనము చూతమని వేడుక చూచుచుండిరి. భాగవతోత్తములగు
రుదాసులు వచ్చిన భాగవతుల నెదుర్కొని యాలింగనవందనాదియథార్హసత్కారములు
నేఁడు అచింతితముగ ననేక భాగవతుల దర్శనము సిద్ధించెనని సంతోషించుచుండెను.
డు రాసక్రీడయందు పెక్కురూపములను పరిగ్రహించి యొక్కొక్క గోపికకు [illegible] ఒక్కొక్క

ష్ఠుఁడైయుండినట్లు కపీరుదాసులయొక్క యిష్టదైవమగు శ్రీజానకీరమణుఁడనంతమగుకపీరుస్వరూపములనుపరిగ్రహించి గంగాతీరమునవిడిసియుండుభాగవతులలోనొక్కొక్కరి చెంతకును కపీరుదాసులవలెపోయియుపచరింపసాగెను. ఒకసాధువునుకుశలప్రశ్నముచేసెను. ఒకరికి అర్ఘ్యపాద్యంబులనిచ్చెను. ఒకరినిస్నానముచేయించి ధౌతవస్త్రములచే నలంకరించెను. ఒకరికి పూజాద్రవ్యంబులనిచ్చెను. ఒకరనిపీఠముననునిచి తాళవృంతముచేవిసరెను. కొందఱినిబంతిగఁ గూర్చుండఁబెట్టి షడ్రసోపేతాన్నమునువడ్డించెను. కొందఱికిచందనతాంబూలాదులచే సంతోషంబునొనర్చెను. కొందఱితోడభగవన్నామసంకీర్తనంబు చేయుచుండెను. (బోధయంతః పరస్పరం) అనురీతినికొందఱికి హితోపదేశముచేయుచుండెను. కొందఱినిచేతులనుబట్టుకొని నృత్యముచేయుచుండెను. ఇట్లుమూడహోరాత్రములందఱికినీ నానావిధోపచారములనుచేసి వారలనుస్వస్థానములకుబంపెను. కపీరుదాసులు ఆనందభరితులై శ్రీరామనామసంకీర్తనము చేయుచుండిరి. వీరికికీడుచేయఁదలఁచినదుష్టులు తమయత్నమునిష్ఫలమైనందునకు లజ్జించి కపీరుదాసులసన్నిధికివచ్చి సాష్టాంగవందనములుచేసి స్వకృతాపరాధంబులను క్షమింపవలయునని ప్రార్థించి వారియనుగ్రహమునుజెంది కామక్రోధరహితులై సత్వనిష్ఠులై తామును శ్రీరామభజనముచేయుచుండిరి.

అనంతమోహాయనమః. R. R.

## ఎనిమిదవయధ్యాయము.

### నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవులు, ముక్తాబాయివీరలయుత్పత్తిచరిత్రము.

---

గంగాతీరమున అప్పపురమున గోవిందపండితుఁడనునొక వైష్ణవోత్తముఁడుండెను. అతనిభార్య నిరాబాయియనుపేరుకలది. వీరిరువురును సంతతిలేకవ్యాకులచిత్తులై సంతానప్రాప్తికై భగవంతునిప్రార్థించుచుండ భగవత్కటాక్షముచేవారలకు ఒకపుత్రుఁడుజనించెను. జనించినపండ్రెండవదినమున విఠోబాఅనినామకరణముచేసి తల్లిదండ్రులు పుత్రునిప్రీతితోడపెంచుచుండిరి. ఎనిమిదవయేటనుపనయనముచేసి సాంగోపాంగముగవేదముల నభ్యసింపించిరి. ఈవిఠోబాతీర్థయాత్ర చేయవలయుననినిశ్చయించి వైరాగ్యయుక్తుఁడై తల్లిదండ్రులనియమనముచెంది భగవత్స్మరణచేయుచు బయలుదేరిపెక్కుపుణ్యతీర్థములయందు గ్రుంకులిడి దివ్యక్షేత్రములయందు సాన్నిధ్యముచేసియుండు భగవన్మూర్తులనుదర్శించి అలకాపురికివచ్చి చక్రతీర్థమునస్నానముచేసి జపముచేయుచుండఁగాఆక్షేత్రముననుండు సిద్ధపండితుఁడనుబ్రాహ్మణుఁడచటికి స్నానార్థమువచ్చి బ్రహ్మచారినిష్ఠనుచూచి సంతసించినమస్కరించి యోమహాత్మానీదేశమెద్ది. ఇచ్చటికివచ్చినకార్యమేమి. నీతల్లిదండ్రులు సజీవులైయున్నారాయని యడిగినవిఠోబా నేనుగంగాతీరమున అప్పపురమున వసించువాఁడను. అచ్చటనాతల్లిదండ్రులున్నారు. నేనుతీర్థయాత్రకుబయలుదేరి ద్వారకాదిదివ్యక్షేత్రములనుదర్శించి పుణ్యతీర్థములయందు స్నానముచేయుచు ఈచక్రతీర్థమునకువచ్చితిననియెను. అదివినిసిద్ధపండితుఁడు సంతోషించి విఠోబానుప్రార్థించి తనయింటికిపిలుచుకొనిపోయి సర్వోపచారములుచేసి [illegible] భగవన్నివేదితాన్నమును భుజింపించి యాదినమంతయు తనయింట[illegible]

యుననిప్రార్థించినవిఠోబా యట్లుచేసెను. ఆరాత్రిసిద్ధపండితునిస్వప్నమున శ్రీపాండురంగ నాథుఁడు సాక్షాత్కరించి యోసిద్ధపండితా ఈబ్రహ్మచారికి నీపుత్రికను సాలంకృత కన్యాదానము చేయుమని నియమించియదృశ్యుఁడయ్యెను. సిద్ధపండితుఁడు తోడనే మేల్కొనియత్యానందమును జెంది స్వప్నవృత్తాంతమును బ్రహ్మచారికి చెప్పెను. అందుకు ఆబ్రహ్మచారిభగవంతుఁడు నాకునియమించినట్లు చేసెదననియెను. మఱునాఁడురాత్రివిఠోబా స్వప్నమున శ్రీపండరినాథుఁడువచ్చి యోవిఠోబా నీకునలుగురుదివ్యమూర్తులు అవతరింపవలసియుండుటచే నానియమనానుసారముగ నీసిద్ధపండితునికన్యకను పెండ్లియాడుమని యాజ్ఞాపించి తోడనే యంతర్థానమయ్యెను. అప్పుడు బ్రహ్మచారి నిద్రచాలించిలేచి సంతోషచిత్తుఁడైతనస్వప్నవృత్తాంతమును సిద్ధపండితునికిఁ జెప్పెను. అతఁడును ముదమును జెంది యాక్షణమున బ్రాహ్మణులను రప్పించి ముహూర్తనిశ్చయముచేసి సకలపదార్థములను సేకరించి వివాహమంటపము నలంకరించి నవవధూవరులను శృంగారించి స్వస్తివచనములను పఠించి జామాతను సాక్షాద్విష్ణుస్వరూపునిగ భావించి సాలంకృత కన్యాదానముచేసెను. వివాహమహోత్సవము నెఱవేర్చి నాలుగైదుదినములయిన వెనుక సిద్ధపండితుఁడు కొమార్తను అల్లునిని పిలుచుకొని భగవద్భక్తివర్ధకమగు శ్రీపండరిపురమునకుపోయి శ్రీపాండురంగనిదర్శించియాలింగనముచేసికొని సర్వోపచారములతోడ నారాధించియుత్సవమును సేవించినపిదప విఠోబామామయగు సిద్ధపండితునిజూచి నేను సేతుయాత్రపోయి త్వరగావచ్చెదనని చెప్పి యతనినియమనమును బొంది బయలుదేరి పోయెను. సిద్ధపండితుఁడు సంసారసహితముగ అలకాపురమును జేరెను. విఠోబామామయనుమతిని శ్రీమత్పండరినాథునినియమనము బొంది యనేకపుణ్యతీర్థంబులయందు గ్రుంకుచు నచ్చటనచ్చట దివ్యదేశములయందు వేంచేసి యుండు భగవంతునిదర్శించుచుపోయి సేతుస్నానముచేసి మరలశ్వశురగృహమును జేరెను. అచ్చటనాలుగుదినములయినతర్వాతమామగారిని చూచిఅప్పురినివసించుచుండునాతల్లితండ్రులను దర్శింప నపేక్షించెదనుగాన అచ్చటికిపోయివచ్చునటుల అనుమతిచేయవలయునని యడిగిన సిద్ధపండితుఁడు ఇతనికినాకొమార్తనుఇచ్చి వివాహముచేసినదియితనితల్లిదండ్రులకు తెలియదు. శ్రీమత్పండరినాథుఁడే ఘటకుఁడైయుండి వివాహమును నెఱవేర్చెను. కాననేనుసంసారసహితముగనితని వెంబడించిపోయి యీమహాత్మునితల్లిదండ్రులనుకన్నులారదర్శించివచ్చుటయుచితమని నిశ్చయించియల్లునినికొమార్తనుపిలుచుకొని సకుటుంబముగబయలుదేరిఅప్పురమునకువచ్చిగోవిందపండితునిదర్శించి శ్రీపాండురంగనినియమనముచే జరిగినవృత్తాంతమునువిన్నవించెను. విఠోబాతల్లిదండ్రులుఆనందరసాబ్ధిమగ్నులై తమకువందనముచేసినిలుచున్నపుత్రునికినికోడలికినిమంగళాశాసనముచేసి సిద్ధపండితునికిని, అతనిభార్యకును పెక్కుబహుమానములు చేసెను. సిద్ధపండితుఁడుఅచటకొన్నాళ్లువసించితనకొమార్తెకుబుద్ధిమతులుచెప్పిగోవిందపండితుని యనుమతిచెందినిజభార్యతోడ అలకాపురముచేరెను. విఠోబాభార్యాసహితుఁడై తల్లిదండ్రులకు భయభక్తులతోడ శుశ్రూషచేయుచుండ కొన్నాళ్లకుపిదపఆవృద్ధులు శ్రీపాండురంగనికృపచే పరమపదము ప్రాపించిరి. విఠోబా (సమదుఃఖసుఖస్వస్థః। సమలోష్టాశ్మకాంచనః। తుల్యప్రియాప్రియోధీరః। స్తుల్యనిందాత్మసంస్తుతిః। మానావమానయోస్తుల్య। స్తుల్యోమిత్రారిపక్షయోః। సర్వారంభపరిత్యాగీ। గుణాతీతస్సఉచ్యతే) అనురీతిని త్రిగుణాతీతుఁడైయవ్యభిచారభక్తియోగమున భగవంతుని సేవించుచుండెను. ఈవృత్తాంతమును సిద్ధపండితుఁడువిని చింతా[illegible]చ్చ

టికివచ్చి వైరాగ్యశీలుఁడగునల్లునిఁజూచి యోమహాత్మా నీవిట్టివిరక్తితోడ సంసారమును నిర్వహించుటకష్టము. కాననాయింటికివచ్చి సుఖివైయుండుమని ప్రార్థించి సమ్మతిపఱిచి కొమార్తెతోడజామాతనుపిలుచుకొనియాలంకాపురముచేరియందఱును నొకగృహమునవసించిసదా శ్రీమత్పండరినాథునికీర్తించుచు ఆషాఢకార్తికమాసములయందు శ్రీమత్పండరిపురమునకుఁబోయిమహోత్సవదర్శనముచేయుచు సుఖించుచుండిరి.

ఇట్లుండ నానాటవిఠోబాకు వైరాగ్యమతిశయించి భార్యనుజూచి మనకువివాహమైబహుదినములు కావచ్చెను. ఇదివఱకుమనకుసంతానములేదయ్యెను. ఇఁకనుగలుగుటయుదుర్ఘటమని తోఁచెడిని. కాశికిపోయియచ్చటసన్న్యసించవలయుననునపేక్షనాకుమిక్కుటమైయున్నది. ఇందులకునీయనుమతిని నిరీక్షించెదననియడిగిన భర్తవాక్యములనువిని రుక్మాబాయి మిగులచింతాక్రాంతురాలై భర్తకుప్రత్యుత్తరమొసఁగక తనజనకునిజూచియోతండ్రీ నీయల్లుఁడిప్పుడు సన్న్యాసాశ్రమముస్వీకరింపనిచ్ఛయించి నాయనుమతినడిగెను. నేనుమౌనముగానుంటిననిచెప్పి వ్యసనపడుచుండుకొమార్తనుజూచిసిద్ధపండితుఁడిట్లనియె. ఓపుత్రీనీవుశోకింపకుము. సంతానమునఁబడసి పితృఋణమును తీర్పకమునుపుసన్న్యసింపఁదగదనిశాస్త్రము చెప్పుచున్నది. అట్లుండనితఁడెట్లుశాస్త్రమర్యాదనుల్లంఘింపవచ్చును. అనుమతినీయక నీవుమౌనముగానుండుమనిచెప్పెను. మఱికొన్నాళ్లకువెనుక విఠోబాతనభార్యనిదురమైకముచే చిత్తస్వాస్థ్యముతప్పియుండుకాలమున ఓసీనేనుగంగాయాత్రపోయివచ్చెదననిన రుక్మాబాయియదియేమాటయనియోచింపకయట్లుచేయుఁడనెను. విఠోబాగరుడునినోటనుండి తప్పించుకొన్నసర్పమువలెనానందించుచుబయలుదేరి ప్రయాగకుపోయి త్రివేణీసంగమమున స్నానముచేసి పుష్కరమునకువచ్చి స్వయంవ్యక్తవిష్ణుస్వరూపమగునాతీర్థరాజమునగ్రుంకియచ్చటివైష్ణవులు శ్రీభగవద్గీతాపారాయణముచేయుచుండ తానచ్చటఁగూర్చుండివినుచుండెను. ఒకనాఁడుపారాయణముచేయుచుండ మోక్షసన్న్యాసయోగమనుపదునెనిమిదవయధ్యాయమున (అసక్తబుద్ధిస్సర్వత్ర। జితాత్మావిగతస్పృహః। నైష్కర్మ్యసిద్ధింపరమాం। సన్న్యాసేనాధిగచ్ఛతి) అనఁగా ప్రపంచచింతనుమాని మనసునుస్వాధీనముచేసికొని యాశలన్నింటినివర్జించి కర్మఫలత్యాగముచేయువాఁడుత్కృష్టమైననైష్కర్మ్యసిద్ధిని పొందుననియు (వివిక్తసేవీలఘ్వాశీ। యతవాక్కాయమానసః। ధ్యానయోగపరోనిత్యం। వైరాగ్యంసముపాశ్రితః। అహంకారంబలందర్పం। కామంక్రోధంపరిగ్రహం। విముచ్యనిర్మమశ్శాంతో। బ్రహ్మభూయాయకల్పతే) అనఁగా నేకాంతస్థలమునందువాసముచేయుచు మితముగభుజించుచు మనోవాక్కాయములను నియమములోనిలిపి సదాధ్యానయోగాసక్తుఁడై వైరాగ్యమునుజెంది యహంకారబలదర్పకామక్రోధపరిగ్రహములనువిడిచిమమకారరహితుఁడై శాంతుఁడైనవాఁడు పరబ్రహ్మప్రాప్తికి సమర్థుఁడగుననియు చదువఁగాదానినివిని దుర్వ్యాధివ్యాఘ్రపీడితమై, విషయక్షుద్రగుల్మాఢ్యమై, తృష్ణాపాదపశాలియై, పుత్రదారగృహక్షేత్రమృగతృష్ణాంబుపుష్కలమైనసంసారమనుకాంతారమునందు కృత్యాకృత్యవివేకాంధుఁడనై పరిభ్రమించుచుండునేను శ్రీగీతాచార్యునియుపదేశముచొప్పున సర్వసంగపరిత్యాగముచేసికొని పరబ్రహ్మానుభవముచే సుఖించెదనని నిశ్చయించి (సుదూరమపిగంతవ్యం। యత్రభాగవతాస్థితాః) అనురీతిని కాశికివచ్చి జ్ఞానానుష్ఠానసంపన్నుఁడగుశ్రీరామానందస్వామిరామాశ్రమమునుప్రవేశించి వారినిశరణుఁజెందిస్వామీ నాకుసన్న్యాసంబునొసంగికృపచే

యవలయుననిప్రార్థించెను. అపుడు శ్రీరామానందస్వామి విఠోబానుచూచి నీవుపుత్రునిగలిగించిపితలఋణమునుండి విముక్తుఁడవైతివా? జననీజనకభార్యాపుత్రులకేమిటనుకొఱంతలేక వారలనుతృప్తులంజేసివారియనుమతినిజెందివచ్చితివా? నీవుప్రపంచవిషయమునందు నిస్పృహుఁడవైయున్నాఁడవాయనియడిగిన విఠోబానిజమునుమఱుఁగుచేసిదేవరవారడిగినట్లు సర్వమునునాకుసంపన్నమైయున్నది. నాతల్లిదండ్రులుపరలోకగతులైరి. అనివిన్నవించిననిజమనినమ్మి శ్రీరామానందస్వామి విఠోబాను సన్న్యాసాశ్రమంబునప్రవేశింపఁజేసెను. ఈవృత్తాంతమును వీరిభార్యయగురుక్మాబాయివిని మూర్ఛాక్రాంతురాలై కొంతసేపటికితెలివినిజెందితన దుఃఖమునకుపరిగానక తపించుచుండెను. ఈమెదురవస్థనుజూచి తల్లిదండ్రులుబహువిధములుగబుజ్జగించిసమాధానముచెప్పియు దుఃఖశాంతినిజెందకయిఁక నేనేమిచేయుదును. అనాథనైతిని. నాప్రాణనాథుఁడు నన్నుమోసపుచ్చి సన్న్యసించెనుఅనిచెప్పి (అహమశ్వత్థరూపేణ । పాలయామి జగత్త్రయం) (అశ్వత్థస్సర్వవృక్షాణాం) అనుభగవద్వాక్యప్రకారము సాక్షాద్భగవత్స్వరూపమై యాశ్రితాభీష్టఫలప్రదాయియై యుండునయ్యశ్వత్థమునకు భయభక్తులతోడ పూజాప్రదక్షిణనమస్కారములు చేయుచుండెను.

ఈమెయిట్లుచేయుచుండ నశ్వత్థనారాయణునికి కృపకలిగియీయమకోరినకోరిక సిద్ధింపఁదగినపరిపక్వకాలము ఘటించెను. ఎట్లనినతనమగనికాచార్యుఁడగు శ్రీరామానందస్వామి సేతుయాత్రచేయబయలుదేరి మార్గవశమున నలకాపురికివచ్చి రుక్మాబాయి యారాధించుచుండునశ్వత్థరాజముక్రిందఁగూర్చుండెను. అపుడశ్వత్థనారాయణునిపూజించి ప్రదక్షిణముచేయుచుండిన రుక్మాబాయియీయతిపుంగవునికి భయభక్తులతోడ నమస్కరింప నతఁడునీవుసుపుత్రులనుగని దీర్ఘసుమంగలివైయుండుమనియాశీర్వదించెను. అదివినిరుక్మాబాయి మందస్మితముచేసిన శ్రీరామానందస్వామియోసాధ్వీనీవుచిఱునవ్వునవ్వుటకుకారణమేమనినరుక్మాబాయియిట్లనియెను. దేవాభర్తలేకపుత్రులెట్లుగలుగుదురు, నాభర్తసన్న్యసించెననియెఱుంగకయె దేవరవారిట్లాశీర్వదించితిరికాఁబోలు. భాగ్యహీనయగునానిమిత్తమున మహనీయులగుదేవరవారియాశీర్వచనమునకు అన్యథాత్వముప్రాప్తమయ్యెనని నాదౌర్భాగ్యమునుస్మరించినవ్వితిని. అనినవిని శ్రీరామానందస్వామి పుత్రహీనుఁడుసన్న్యసింపఁదగదనిశాస్త్రమర్యాదకలిగియుండ దీనికివిరుద్ధముగసన్న్యసించువాఁడును, అట్టివానికిసన్న్యాసమునిచ్చువాఁడునుప్రాయశ్చిత్తార్హులగుదురు. అనిచెప్పియామెచే గతవృత్తాంతమును సవిస్తారముగవిని యోహోయిట్టిప్రమాదమునకునేనేకారణభూతుఁడనైతిని. విఠోబానన్నువంచించినాచేసన్న్యాసమునుపరిగ్రహించెను. (సంవత్సరంతదర్ధంవా।మాసత్రయమథాపివా, పరీక్ష్యవివిధోపాయైః। కృపయానిస్పృహోవదేత్)అనురీతినితన్నాశ్రయించినశిష్యునిపరీక్షింపక వానిమాటలను విశ్వసించియపరాధార్హుఁడనైతిని. అనికొంతచింతించినీతల్లిదండ్రులుజీవితులైయున్నారాయనియడిగినరుక్మాబాయినాకుతల్లిదండ్రులుమొదలైనసమస్తబంధువులున్నారు.ఎందఱుండిననేమిఫలము. భర్తలేదవానియున్నానుఅనిశోకించిన శ్రీరామానందస్వామియామెతండ్రినిరప్పించినతఁడువచ్చిదండప్రణామముచేసియతిశేఖరా దేవరవారెచటనుండియెచటికివేంచేయుచున్నారు, అనియడిగిన శ్రీరామానందస్వామి నేనుకాశీక్షేత్రమునవసించువాఁడను. సేతుయాత్రపోవుచు నిచటికివచ్చితిని. వచ్చినచోనీపుత్రికతనచరిత్రమునుజెప్పెను. జరిగినయనర్థమునకునేనేమూలమైతినిగాన [illegible]ను

సవరించుటకైమరలకాశికిపోయెదను. నీవు నీపుత్రికనుదోడ్కొనినాతోడరమ్మని నియమించి శ్రీరామానందస్వామికాశికిఁబోయెను. సిద్ధపండితుఁడుసంతోషచిత్తుఁడై కొమార్తనుదోడ్కొనిపోరిని వెంబడించివారణాసినిజేరెను. శ్రీరామానందస్వామితనయాశ్రమమునుజేరినతోడనేవిఠోబానుపిలిచి నీవేలయబద్ధములాడినన్నువంచించితివి. ఇప్పుడైననునిజమును జెప్పుమనిన విఠోబా భయకంపితగాత్రుఁడై నిజమును విన్నవించి సన్న్యాసాశ్రమపరిగ్రహమందలియత్యపేక్షచే నన్నృతమాడితిని. మన్నింపవలయుననిప్రార్థించిన శ్రీరామానందస్వామి నేనునీభార్యనుతోడ్కొనివచ్చితిని. నీవునీభార్యతోఁగూడినీస్థానమునుజేరి గృహస్థుఁడవైసుఖింపుము. ఇదివిరుద్ధమనితలఁపకుము. అర్జునుఁడుకాంపిల్యపురమున మత్స్యయంత్రమునుఛేదించి ద్రౌపదినిదోడ్కొనికుంతీదేవిచెంతకువచ్చి యోజననీనేనొకభిక్షతెచ్చితిననిన మఱుఁగుననుండిన కుంతీదేవి యోచింపక యాభిక్షనుమీరేవురును భుజింపుఁడనిచెప్పివెలుపలవచ్చి మెఱుపుతీఁగవలె ప్రకాశించుద్రౌపదినిజూచి నేనువిచారింపకమీరేవురును భుజింపుడంటిని. ఇదివఱకునామాట యబద్ధమైనదిలేదు.మీరునునామాటజవదాటియెఱుఁగరు.ఇందుకేమిచేయవచ్చుననిచింతింప ధర్మపుత్రుఁడుమాతృనియమనమలంఘ్యమనిచెప్పుచుండ శ్రీవేదవ్యాసమహర్షివిచ్చేసియేవురికిని భార్యకాఁదగిన కొన్నినిమిత్తములనుజెప్పికుంతీదేవిమాటసత్యముగపాండవులేవురికిని, ద్రౌపదికిని పాణిగ్రహణముచేయించెను.ఒకపురుషునికిభార్యయైయుండఁదగినస్త్రీయేవురికిభార్యయయ్యును ద్రౌపదిపతివ్రతాశిరోమణియని ముల్లోకంబులనుగొనియాడఁబడుచున్నది. నాకంతర్యామియైన శ్రీరామభద్రుఁడిదివఱకునాచేనబద్ధముపలికించినదిలేదు. సుపుత్రులనుగనుమని నీభార్యను దీవించితిని. నన్నెఱుఁగక శ్రీరామచంద్రుఁడు నానోటనిట్లుపలికించినందుననేనుబలికినదివ్యర్థము కానేరదు. శ్రీపాండురంగఁడునీకుస్వప్నగతుఁడై రుక్మాబాయిని పాణిగ్రహణముచేయుమని నియమించినకాలమున నీవలననలుగురుదివ్యమూర్తులవతారముకావలసియున్నదనియనుగ్రహించెనుగదా. ఈసందర్భములనన్నింటెనిపర్యాలోచనముచేసి నీవుగృహస్థుఁడవై భగవన్నియమనానుసారముగ పుత్రోత్పాదనమునుజేయుము. దీననీకుదోషముసంభవింపదు.హృషీకేశుఁడునిన్నుగక్షించునుగాక. అనినియమించి విఠోబానురుక్మాబాయితోడఁజేర్చి సిద్ధపండితుఁడుమెుదలగుబంధువర్గముతోడనలకాపురమునకుఁబంపెను.

ఇట్లుండ కొందఱసూయాగ్రస్తులీవిఠోబాసన్న్యాసియై మరలనిట్లుగృహస్థుఁడుకావచ్చును.వీనిపూర్వజన్మకృతపాపముమరలసంసారమునకీడ్చెను.వీఁడువిషయలోలుఁడు. కాననిట్టివైపరీత్యముకలిగెనని బహువిధములఁగఁజెప్పసాగిరి.విఠోబాతనయాచార్యులయాజ్ఞనుశిరసావహించిచిత్తమునకలంకములేకుండెను. అసూయాపరులగునచటివారు విఠోబానుజాతిభ్రష్టుఁడనినిగ్రహించిరి. ఇతఁడడవిలోనొకగుడిసెనుగట్టుకొనియుంఛవృత్తిచేయుచు శ్రీరామధ్యానపరుండైయుండపండ్రెండేండ్లకుపిదప రుక్మాబాయిగర్భమున ముగ్గురుకొడుకులును,నొకకూఁతురునుజనించిరి. ఇందుప్రథమపుత్రుఁడగునివృత్తిదేవుఁడుశివాంశముచేతను, మధ్యముఁడగుజ్ఞానదేవుఁడువిష్ణ్వంశముచేతను, కనిష్ఠుఁడగుసోపానదేవుఁడు చతుర్ముఖాంశముచేతను, నందఱికినికడగొట్టగుముక్తాబాయియోగమాయాంశముచేతను లోకోజ్జీవనార్థముగ నవతరించిరి.

శ్రీపాండురంగపరబ్రహ్మణేనమః.

---

हूँ बैठें तेरे पास। करौ दधि मंथान उदयो सूर कमल विकास॥ गायके सुनि वचन हँसि उर आय लगे गुपाल। कियो भोजन दियो अतिसुख रसिक नयनविशाल॥ ४४॥

## राग धनाश्री।

महरानेते पांडे आयो। ब्रज घर घर बूझत नँदगवर पुत्र भयो सुनिकै उठधायो॥ पहुँच्यो आय नंदके द्वारे यशुमति देखि अनंद बढायो। पांव धोय भीतर बैठायो भोजनको निज भवन लिपायो जो भावे सो भोजन कीजे विप्र मनहिं अति हर्ष बढायो। बडी वैस विधि भयो दाहिनो धनि यशुदा ऐसो सुत जायो॥ धेनु दुहाय दूध लै आई पाँडे रुचिकर खीर चढायो। घृत मिष्टान्न खीर मिश्रित करि परसि कृष्णहित ध्यान लगायो॥ नयन उघार विप्र जो देखे खात कन्हैया देखन पायो। देखो आय यशोदा सुतकृत सिद्ध पाक यह आन जुँठायो॥ महरि विनयकरि दोउकर जोरचो घृत मधु पय फिर बहुत मँगायो। सूर श्याम कत करत अचगरी बारम्बार ब्राह्मणहिं खिझायो॥ ४५॥

## राग रामकली।

पांडे भोग न लागन पावै। कर कर पाक जभी अर्पत है तभी ताहि छुइ आवै॥ इच्छाकर मैं ब्राह्मण नोत्यो ताको श्याम खिझावै। वह अपने ठाकुरहिं जिमावत तू तबहीं छुइ आवै॥ जननी दोष देत कत मोको विधि विधान कर ध्यावै। नयन मूँदि कर जोर नाम लै बारंबार बुलावै॥ यह अंतर नहिं होत भक्त सों क्यों मेरे मनभावे॥ सूरदास बलि बलि विलास पर जन्म पाय यश गावै॥ ४६॥

## राग विलावल।

सफल जन्म मेरो आज भयो। धनि गोकुल धनि नंद यशोदा जिनके हरि अवतार लियो॥ प्रगट भयो पुण्य अब सुकृत फल दीन-

నీకును నాకును నించుకయును భేదములేదు. శ్రీధరుండగు పరమాత్మ యొకండే సర్వభూతములయం దును వ్యాపించియున్నాఁడు (క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి। సర్వక్షేత్రేషుభారత) అనఁగా సర్వక్షేత్ర ములయందుండు క్షేత్రజ్ఞుఁడు నేనేయని తెలిసికొనుము. అని శ్రీభగవంతుఁడు శ్రీగీతయందుఁ జెప్పి యున్నాఁడుగదా. బహువిధభూషణములయందు స్వర్ణమొకటే వ్యాపించియుండురీతిని సమ స్తప్రపంచమునందు విష్ణువొక్కఁడే వ్యాపించియున్నాఁడు. అని జ్ఞానదేవులు చెప్పినవివిని యాబ్రా హ్మణులాతనిఁ జూచి నీయధ్యవసాయము నిజమగునేని యీయెనుమును గొట్టిన నీశరీరమునందు గా యములు కలుగవలయునని చెప్పి తురుష్కునిచే మహిషమును గొట్టించిరి. తోడనే జ్ఞానదేవులవీఁపు న గాయములు కలిగెను. దీనిం జూచి బ్రాహ్మణులు నీకును మహిషమునకును కొంచెమైనను భేదము లేనియెడల దీనినోటిచే వేదములను పలికింపుమనిరి. జ్ఞానదేవులు మహిషము చెంతనువచ్చి తమహ స్తముచే దానిశిరమును స్పర్శించి నీవు వేదములనుచ్చరించి యీబ్రాహ్మణులకు సంతోషమును గలుగఁజేయుమనిన తోడనే యాయెనుము వేదములనుచ్చరింపసాగెను. అపుడందఱును ఈయా శ్చర్యమును జూచి సంతోషచిత్తులై యిట్టియతిశయమును మేమెన్నఁడును కనివినియెఱుఁగము అని పరస్పరము చెప్పుకొనిరి. అపుడు సూర్యోదయమున నంధకారము నశించునట్లు ఈబ్రాహ్మ ణులకు అభిజనవిద్యావృత్తములచే గలిగిన యహంకారము నశించి మనము వేదశాస్త్రములను నభ్యసించియేమి ప్రభావమును లోకులకు చూపితిమి. జ్ఞానదేవులవలె మహిషముచే వేదములను పలికించు సామర్థ్యము మనకు లేదయ్యెను. ఈయద్భుతము బ్రహ్మాదులకగోచరము. వీరు ముమ్మ్వూ రును ముమ్మూర్తులు కావలయును. వీరి చెలియలు యోగమాయ కాఁబోలును. సాక్షాదవతార మూర్తులు కానిచో వీరలకిట్టి మాహాత్మ్యమెట్లుకలుగును. వీరలపాదస్పర్శముచే తీర్థములకు తీర్థత్వము సిద్ధించును. ఇట్టి మహానుభావులకు వేఱొక ప్రాయశ్చిత్తమేల. వీరలే త్రిలోకములయం దుండువారికి నిపూజ్యులు. వీరలను గనిన తల్లిదండ్రులే ధన్యతములు. వీరే నిజమైన బ్రాహ్మణులు. మనము సంసారార్ణవమగ్నులమై తృష్ణాపీడితులమైయున్నారము. మనము శిష్యవిత్తాపహారకు లగు గురువులమే కాని జ్ఞానానుష్ఠానసంపన్నులగు గురుపుంగవులము కాము అని చెప్పుకొనుచుం డిరి. జ్ఞానదేవులు వారలను జూచి భూసురులారా మేమజ్ఞానులము. సర్వజ్ఞులరగు దేవరవారిక సాధ్యమెద్దియును లేదు. ఇపుడిచట జరిగిన కార్యము దేవరల ప్రభావమే కాని వేఱుకాదు. అనినవిని విప్రులు వీరలయధ్యవసాయమునకు మిగుల నానందించి యామహాత్ములను స్వగోష్ఠియం దిడుకొని గౌరవించిరి.

జ్ఞానదేవులు ఆపైఠ్ణపురమున నొకయింట సోదరులతో డవసించి సకలజనులకును దైవ భక్తికలుగునట్లు హరినామసంకీర్తనము చేయుచుండిరి. ఒకనాఁడు వీరు కాపురముండెడి యింటి యజమానుఁడును, సాధుసంగమప్రియుఁడునగు సుశీలుఁడను బ్రాహ్మణునియింట పితృశ్రాద్ధము వ చ్చెను. అపుడా సుశీలుఁడాయూరి బ్రాహ్మణులను శ్రాద్ధమునకుఁ బిలువఁగొందఱు మూర్ఖులు నీయిం ట సన్న్యాసిపుత్రులు కాపురముండుటచే మేము నిమంత్రణకు రాఁజాలమని చెప్పి తక్కినవారలను రానీక నిర్బంధించిరి. ఇందుచే నా సుశీలుఁడు దుఃఖాక్రాంతుఁడైయుండ జ్ఞానదేవులు సుశీలు నివ్యసనమునకు కారణము నడిగి తెలిసికొని నీవు చింతింపకుము. సంతోషముగ పాకము చేయిం పుము. సాక్షాత్తుగ నీపితరులు వచ్చి భుజింతురని చెప్పెను. సుశీలుఁడామాటను నమ్మి పాకము చే యించి జ్ఞానదేవులతో చెప్పెను. అతఁడు మంత్రాక్షతలె త్తిజపించి వేయఁగా సుశీలుని పితృదేవ

लटपटी यह गति मंद मराल। सो राजा जो पहिले पहुँचे सूर सो भवन उताल।जो जैहै बलराम अगमने तो हँसिहैं सब ग्वाल५०॥

## लावनी।

रूप रसिक मोहन मनोज मनहरण सकल गुण गरबीले। छैल छबीले चपल लोचन चकोर चित चटकीले॥रत्नजटित शिरमुकुट लटक रहि सिमट श्याम लट घुँघुरारी। बालविहारी क लाल चतुर तेरी बलिहारी॥ लोलकमोती कान कपोलन झ कबनी निर्मल प्यारी। ज्योति उज्यारी हमें हरबार दर्श दे गिरि-धारी॥ दंत छटासी बिज्जु घटा मुख देख शरद शशि शरमीले। छैल०॥ मंद हँसन मृदु वचन तोतरे वय किशोर भोली भाली। करत चोचले अधर अमोलक पीक रच रही लाली॥ फूल गुलाब चिबुक सुंदरता रुचिर कंठछवि वनमाली।करसरोजमें बुन्द मेहँदी अमन्दहै बहु प्रतिपाली॥ फूलछरीसी नरम कमर करधनी शब्द भये तुरसीले॥ छैल० ॥ झँगुली झीन जरीपट कछनी श्यामल गात सुहात भले। चाल निराली चरण कोमल पंकजके पात भले॥ पग नूपुर झंकार परम उत्तम यशुमतिके तात भले। संग सखनके निकट यमुना बछरान चरात भले॥ ब्रज युवतिनके प्रेम भोर भये घर घर माखन गटकीले॥ छैल० ॥ गावैं बाग विलास चरित हरि शरद रैनि रसरास करैं। मुनिजन मोहे कृष्ण कंसादिक खल-दल नाश करैं॥ गिरिधारी महराज सदा श्रीब्रज वृंदावन बास करैं। हरिचरित्रको श्रवण सुन सुन कर मन अभिलाष करैं॥हाथ जोर कर करैं बीनती नारायण दिल दरदीले॥ छैल० ॥ ५१ ॥

బెదరింపఁగా ముక్తాబాయిసింహమునుజూచినయేనుఁగువలె భయకంపితగాత్రయై జ్యేష్ఠభ్రాతయనుమతిని పండుగునకుభక్ష్యములుచేయుటకై నవభాండములగొనుటకుఁగుమ్మరవానియింటికిఁబోయెదననియె. అదివినివిసోబాకేశుఁడామెను చెంపమీఁదఁగొట్టియామెకుముందుగాకుమ్మరవానియింటికిపోయియీస్త్రీకిభాండములను నీవీయవలదు. నీవిచ్చినయెడల నాకునీవచ్చవలసిన ఋణమునంతయునిప్పుడేయియ్యవలసినదని బాధపెట్టుదుననియెను. ఆమాటలువినికుమ్మరవాఁడువ్యసనాక్రాంతుఁడైనేనునావచ్చుబడికిమించి వెచ్చముచేసినందున నీయిదుమనాకుఘటిల్లెను. గృహస్థాశ్రమమునదారిద్ర్యమును, వార్ధక్యమునపుత్రశోకమును, దుష్టునిచేనప్పుపుచ్చుకొనుటయు మిగులదుఃఖకరము. నేనీదుష్టునికిఋణముపడినందున వీనికిభయపడిపరమసాధువులయాపేక్షను నెఱవేర్పఁగూడకయున్నది. దౌర్భాగ్యుఁడనుగాన నీపతితునికిఋణపడితినని చింతించిముక్తాబాయికి భాండములనియ్యననియెను. ఆచిన్నదియింటికివచ్చి వ్యసనపడుచుండఁగా జ్ఞానదేవులుచూచి కన్నీరుతుడిచినీవగపునకు కారణమేమనియడిగి జరగినవృత్తాంతమును తెలిసికొని యోచెల్లెలా విసోబాకేశుఁడవమానించెననిశోకింపకుము. వానిస్వభావమునకు మన మేమిచేయవచ్చును. మనకర్మమనుభవింపకతీఱదు. (అవశ్యమనుభోక్తవ్యం। కృతంకర్మశుభాశుభం) అనువచనమబద్ధము కానేరదు. అనిసమాధానము చెప్పి నీవుచేయవలసినభక్ష్యములను నావీఁపుమీఁదచేయుమనిచెప్పి తనయోగమహిమచే జఠరాగ్నినిప్రజ్వలింపఁజేసి నోటజ్వాలలెగయ కన్నులెఱ్ఱనై వీఁపునుకాలినపెనమువలెవేడిచేసెను. ముక్తాబాయి భ్రాతృనియమనానుసారముగ వారివీఁపుమీఁద భక్ష్యములనుచేసివానిని పక్వముగనెత్తి పేర్చియుంచెను. జ్ఞానదేవులు జఠరాగ్ని నెప్పటియట్లు మందముచేసిరి. వెలుపలపోయియున్న నివృత్తిదేవ, సోపానదేవులువచ్చినంతట అందఱునుజేరి స్వానుభవమనుస్వర్ణపాత్రమున పరమభక్తియను పాలుబోసిశాంతిసుఖమనుశర్కరనుకలిపిభగవద్గుణానుభవమనురొట్టెనుజేర్చి యానందమను రుచిననుభవించుచు ఈయనుభవమునకు భోక్త శ్రీవాసుదేవుఁడనియధ్యవసించిపిదప ముక్తాబాయిపాకముచేసియుంచినభక్ష్యములను భగవంతునికినివేదించిపావనమగుతచ్ఛేషమునుగోవిందనామస్మరణముతోభుజించుచుండిరి. విసోబాకేశుఁడుపొంచియుండియీయాశ్చర్యమునుజూచి తనయకృత్యమునకనుతపించియాహానేనెంతమూఢుఁడను. భాగ్యహీనుఁడను. వీరలవతారమూర్తులనియెఱుఁగకపోతిని.మందభాగ్యుఁడురత్నములనురాళ్లనితలఁచినట్లుపుణ్యశ్లోకులనుకేవలమానవులనితలఁచి వీరలకుకీడుచేసితిని. ఇట్టినాకిచ్చటికిపోయినను గత్యంతరములేదు. భాగవతాపచారదోషమునుక్షమించుటకు భగవంతుఁడునుసమర్థుఁడుకాఁడు. సర్వశక్తుఁడగు సర్వేశ్వరుఁడీవిషయమునమాత్రమశక్తుఁడైయున్నాఁడు. పూర్వముపరమభాగవతుఁడైనయంబరీషువిషయమున నపచారముపడినదుర్వాసుఁడు త్రిలోకములను సంచరించిరక్షకులనుగానక భగవంతునిశరణుచెందిన శ్రీమన్నారాయణుఁడోదూర్వాసా భాగవతాపచారపరులను రక్షించుటకు నేనుసమర్థుఁడనుకాను. (తమేవశరణంగచ్ఛనాభాగతనయంమునే) అఁగానాభాగతనయుఁడగునంబరీషునిశరణుఁజెందుము. అనినియమించిన దుర్వాసుఁడట్లుచేసి కృతార్థుఁడయ్యెనుగదా. కాననేనీమహాత్ములశరణుచెంది వీరికృపకుపాత్రుఁడనయ్యెదననినిశ్చయించి యింటిలోపలప్రవేశించి జ్ఞానదేవులయుచ్ఛిష్టమును బలాత్కారముగఁగైకొని స్వీకరించి తత్ప్రభావముచే అవిద్యనుసమూలముగభేదించి భగవద్భక్తియు, సంసారవిరక్తియు, భాగవ

త్ప్రేమయునతిశయించి జ్ఞానదేవులపాదారవిందములకు సాష్టాంగవందనములు చేసియగతికుఁడను, శరణాగతుఁడను, అపరాధసహస్రభాజనమై, భీమభవార్ణవోదరపతితుఁడగునన్ను కేవలకృపచేరక్షింపవలయునని ప్రార్థింపజ్ఞానదేవులువీనియాంతరభావమునెఱిఁగి వానితలపై అభయహస్తమునుంచికరుణించెను. అదిమొదలుజ్ఞానదేవప్రసాదముచే వీసోబాకేశుఁడుపరమశాంతుఁడైజ్ఞానదేవులకుఅంతేవాసియైభక్తాగ్రేసరుఁడనియెల్లరచేఁగొనియాడఁబడుచుండెను.

శ్రీహృషీకేశాయనమః.

## పదియవయధ్యాయము.

### జ్ఞానదేవులునామదేవులతోడతీర్థయాత్రచేయుచరిత్రము.

జ్ఞానదేవులు పండరిపురమునకువచ్చి నామదేవదర్శనాపేక్షచే వారియింటికిపోఁగా వారెదురేఁగి (వైష్ణవం వైష్ణవోదృష్ట్వా ప్రణమేద్దండవద్భువి) అనురీతినిదండవత్ప్రణామముచేసిపిలుచుకొనిపోయి సర్వోపచారములతోడ పూజించిజ్ఞాననిక్షేపమయిన యోస్వామీ సంసారసాగరమగ్నులగు జీవరాసులనుద్ధరించుటకై యవతరించినదేవరవారు పరమకృపచే నీకుడిసెకువేంచేసితిరి. నేనుకృతార్థుఁడనైతిని అనిచెప్పి మరలప్రణామముచేసి లేవకయుండెను. అవుడు జ్ఞానదేవులు నామదేవులనెత్తి యాలింగనముచేసికొని యోనామదేవా నీభాగ్యమునకుపరిమితిలేదు. భగవద్భక్తిసుఖము నీకేప్రాప్తమైయున్నది. కామక్రోధలోభ మోహమదమాత్సర్యములను సమూలముగఛేదించి శ్రీరుక్మిణీకాంతునియందు పరమప్రేమయుక్తమగు భక్తినిజేయుచున్నాఁడవు. నీభాగ్యమేభాగ్యము (ఆస్ఫోటయంతిపితరః। ప్రనృత్యంతిపితామహాః। వైష్ణవోయఃకులేజాతః। సనస్సంతారయిష్యతి) అనురీతిని నీపితరులుమనకుటుంబమునకొకవైష్ణవుఁడుజనించెను. మనలనుద్ధరించునని శబ్దించుచున్నారు. నీపితామహులుపరమానందభరితులై నృత్యముచేయుచున్నారు. వారలపుణ్యమునేనేమనవచ్చును. అనిచెప్పి నీతోనామనోరథమును అంతరంగముగఁజెప్పవలసియుండుటచే నేకాంతస్థలమునకుపోదమురమ్మని అతనిచేతినిఁబట్టి పిలుచుకొనిపోయివిజనస్థలమునఁగూర్చుండపెట్టుకొని తీర్థయాత్రయుదేవతాదర్శనమునుమనమిరువురముగచేరి చేయువలయునని యపేక్షించెదను. నీవునామనోరథము నీడేర్పవలయుననిమిగులవేడుకొనిరి. నామదేవులామాటనువిని వ్యసనాక్రాంతచిత్తులై శ్రీపండరినాథునినిత్యసేవను ఆక్షేత్రమునందలి నిత్యవాసమునువిడిచి వేఱొకటినిఅపేక్షించుటకరస్థమగు జలమునుపారఁబోసి మేఘజలమును అపేక్షించునట్లున్నది. అనిచింతించి జ్ఞానదేవులనుచూచియోస్వామీ నేనుపండరినాథునికిస్వాధీనము. నేనుపుట్టినదిమొదలు నేటివఱకునాదేహయాత్రయు, ఆత్మయాత్రయు శ్రీపాండురంగని యధీనమైయున్నది. మనోవాక్కాయములచే అతనికేశేషమైయున్నాను. ఆదేవునిదర్శనము నెడతెగకచేయుచుండునట్లు కృపచేయవలయునని ప్రార్థించిన జ్ఞానదేవులునామదేవులను ఆలింగనముచేసికొని యోనామదేవానీయంతరంగభావమునాకుచక్కఁగవిశదమయ్యెను. నీతలంపట్టిదైన శ్రీపండరినాథుని చెంతకుపోదమురమ్మని వారిచేతినిపట్టుకొని సన్నిధినిప్రవేశించి బలిపీఠముచెంతనమస్కరించి లోపలచొచ్చి[illegible]

పైనిలిచియుండు స్వామిని నేత్రోత్సవముగ సేవించి విధిప్రకారము పూజించి స్తోత్రము చేసి జ్ఞానదేవుఁడు తనమనోరథమును విన్నవింపఁగా శ్రీనివాసుఁడాలించి జ్ఞానదేవా శుద్ధస్ఫటికమువలె కలంకరహితుఁడవగు నీవు మనసుచలించి తీర్థయాత్రనపేక్షించుట సూర్యుఁడు తేజస్సును, చంద్రుఁడు శీతమును అపేక్షించునట్లున్నది. అనిన జ్ఞానదేవుఁడు జగదీశా దేవర వారి శ్రీమూర్తి నిజమైనను జ్ఞానమునకన్న భక్తిమిగుల శ్రేష్ఠమైనది. ఈనామదేవులు పరమభక్తిని క్షేపము. ఇతనితోఁగూడ సంచరించి పరమభక్తిరూపమగు పరమానందమును పానము చేయనపేక్షించి విన్నవించితిని. కావున పరమకృపచే నామనోరథమును పూర్తిచేయువలయునని ప్రార్థించెను. అపుడు శ్రీపండరినాథుఁడు మందహాసముతోడ నామదేవులనుజూచి యోవత్సా జ్ఞానదేవులను సాక్షాత్పరబ్రహ్మస్వరూపమని యెఱుఁగుము. అతఁడు నీతోడిమైత్రిని అపేక్షించుచున్నాఁడు. కాననీవతనితోఁగూడ పోయి యతని హృదయానుసారముగ నడచుకొమ్ము. సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందు నన్ను మఱువకుము. నాకు ప్రాణపదమగు నీవిశ్లేషము దుస్సహమైయున్నది. శీఘ్రముగ మఱలిరమ్ము అని చెప్పి జ్ఞానదేవులనుజూచి నీవు శుద్ధసత్వమూర్తివి-సర్వజ్ఞుఁడవు. నిన్నొకటి వేడెదను. నామదేవుఁడు నాకు రుక్మిణికన్న అత్యంతాభిమతవిషయము. అట్టివానిని నీదాక్షిణ్యమునకై నీతోడఁబంపెదను. వానిని పరమప్రీతితోడ కాపాడి తోడ్కొనిరావలయును అని చెప్పి నామదేవుల చేతిని బట్టి జ్ఞానదేవుల చేతికప్పగించి నామదేవుని విశ్లేషమును సహింపక కన్నీరునించి జ్ఞానదేవా నా ప్రాణపదమగు నామదేవునిని జాగ్రత్తగా చూచుకొనుమని చెప్పిన మాటను జ్ఞానదేవులు వినియానందభరితులై శ్రీపండరీశుని సేవించి నామదేవుని చేతినిఁబట్టుకొని చంద్రభాగయనునదికివచ్చి యిరువురును స్నానము చేసి తీర్థయాత్రకు సంకల్పము చేసికొని పుండరీకవరదుని చరణారవిందములకు సాష్టాంగవందనము చేసి (వ్రజత్ చింతయ కేశవం) అనురీతిని కేశవనామస్మరణముతోడ బయలుదేరిపోయిరి. శ్రీపండరినాథుఁడు కొంతదూరమనుగమించి యాయిరువురిని దారివిడిచి నిజమందిరంబును జేరెను. అపుడు రుక్మిణీదేవి స్వామిపాదపద్మములను కడుగుటకు తీర్థమును దెచ్చి వారి నేత్రములయందలి శోకబాష్పములనుజూచి యాశ్చర్యపడి మన్నాథా యీవ్యసనమునకుఁగారణమేమియని యడిగిన భక్తవత్సలుఁడో సఖీ నా ప్రాణపదమగు నామదేవుఁడు పితృమాతృసుతభ్రాతృదారామిత్రాది సర్వమును నేనేయని యధ్యవసించియుండును. అట్టివానిని జ్ఞానేశ్వరుని వెంటఁబంపితిని. అతఁడితని నెట్లు దోడ్కొని పోవునోయెఱుఁగను. ఆనామదేవుని విశ్లేషము నాకు ఖేదమును గలుఁగఁజేయుచున్నది. పరమభక్తరత్నమగు నామదేవుఁడొకప్పుడును నన్నెడవాసినవాఁడుగాఁడు. అట్టివానిని విడిచియుండుటచే నామనస్సు దేనియందును నంటకయున్నది. నేను సకలజగద్రూపవృక్షమునకు మూలమైయున్నాను. నామదేవుఁడా వేరునకు ధారకమగు జలమైయున్నాఁడు. అట్టిజలమును జ్ఞానదేవుఁడను మేఘము కైకొనిపోయెను. అనివ్యసనపడుచుండ రుక్మిణీదేవి యోభక్తక్రీతా నీవచనములు సత్యమైనను (సర్వస్యచాహంహృదిసన్నివిష్టః) అని నీవే చెప్పియున్నాఁడవుగదా. సర్వజీవహృదయాంబుజవర్తియగు నీకు నామదేవుని విశ్లేషమెట్లు సిద్ధించును. ఏలయిట్లు వ్యసనపడెదవు. అని చెప్పిన అనంతకల్యాణగుణనిధియగు భగవంతుఁడు జగన్మాతనుజూచి నేను అరూపియయ్యును భక్తులయనుభవమునకై శ్రీవైకుంఠాదిస్థలములయందు సరూపినైయున్నాఁడను. అట్టిదివ్యమంగళవిగ్రహవిశిష్టుఁడనగు నాకు తత్తద్దేశవాసులయిన భక్తులు నా[illegible] వారలకు నేనును ప్రాణపదని క్షేపమైయుందుము, సూర్యుని[illegible] ప్రభకును,

పుష్పముతోడ దానిపరిమళమునకును పృథక్స్థితిలేనట్లునాతోడ వీతరాగులగునాయంతరంగభక్తుల కుపృథక్స్థితిలేదు. అట్టివారలలో నగ్రగణ్యుఁడయిన నామదేవునివిశ్లేషమును నేనెట్లుసహింతును. అనిచెప్పి చింతాక్రాంతుఁడైయుండెను. శ్రీరుక్మిణీదేవియు ననేకభక్తులును భక్తవత్సలునికి బహువిధములుగ సమాధానముచెప్పి దుఃఖోపశమనను చేయుచుండిరి.

ఇచ్చటివృత్తాంతమిట్లుండ నామదేవులును, జ్ఞానదేవులును దారినిపోవుచుండఁగా నామదేవులు పదేపదే తిరిగి చూచుచు నోకృపాజలధే, ఓజగన్నాథా, ఓపండరినాథా, ఓప్రాణనాథా, (త్వమేవమాతాచపితాత్వమేవ। త్వమేవబంధుశ్చగురుస్త్వమేవ। త్వమేవవిద్యాద్రవిణంత్వమేవ। త్వమేవసర్వంమమదేవదేవ) అనురీతిని నాసర్వస్వమునీవైయుండ నిపుడు నిన్ను విశ్లేషింపవలసివచ్చెనని దుఃఖించుచు మూర్ఛిల్లి నేలపైఁబడుచు తల్లినివిడిచిన స్తనంధయునివలె ప్రలాపించుచుండెను. అతనినిజూచి జ్ఞానదేవులు భక్తశిఖామణీపరిపూర్ణుఁడై, సర్వాంతర్యామియగు శ్రీవిఠ్ఠలనాథుఁడు నీహృదయకమలమునందు వసించి సర్వసాక్షియైయుండ నీవేల వ్యసనాగ్నికి అశనమయ్యెదవు. మందభాగ్యుఁడు వానిపెద్దలు నిక్షేపించినధనమును కనిపట్టి యనుభవించుటకు వితరణలేక కష్టపడునట్లు సాధుజనులపాలినిక్షేపమగుగోపాలచూడామణి నీహృదయస్థుఁడైయుండ నతనిననవరతము దర్శించుచు నానందింపక పాండురంగని నెడవాసితినని యేలకుందెదవు అనిచెప్పిన నామదేవులు ఓస్వామీ అరూపమగు నంతర్యామిత్వమును పాసించుటకు నేను యోగారూఢుఁడనుగాను. దివ్యమంగళవిగ్రహవిశిష్టుఁడై, యనంతకల్యాణగుణనిధియై, యర్థితార్థపరిదానదీక్షితుఁడై, సనకాదిపరమయోగిసేవ్యమానుఁడై, శ్రీరుక్మిణీసమేతుఁడై, నారదవీణానాదవినోదుఁడై, పుండరీకవరదుఁడై, జీవన్ముక్తనిక్షేపమై, భీమనదీతీరమున కటిహస్తుఁడై, చేతనులయాభిముఖ్యమునునిరీక్షించియుండు శ్రీపాండురంగనినిదప్ప నామనసు వేఱొకటినంటదు. ఆభగవంతునిదివ్యచరణారవిందములను నేననవరతము దర్శనముచేయుచుండునట్లనుగ్రహింపుము. అట్లు కానియెడల నాప్రాణములు నిలువవు. ఆజగదీశునిదర్శనకీర్తనధ్యానములే నాకుధారక, పోషక, భోగ్యములైయున్నవి. అనియిట్లనవరతము చెప్పుచు తనముగ్ధాలాపములచే జ్ఞానదేవులకు పరమానందమును గలుగఁజేయుచుండెను. ఒకనాఁడు జ్ఞానదేవులు నామదేవులనుజూచి పరమభక్తశిఖామణీ నీవెట్లుహృషీకేశునిని కరతలామలకముగఁజేసికొంటివి. ఎట్లు భజించితివి - ఎట్లుధ్యానించితివి - ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికరూపమగు తాపత్రయాగ్నినిజల్లార్చి జననమరణప్రవాహమునకుఁదప్పి నరకాంగారశమనియగువాసుదేవతరుచ్ఛాయను ఎట్లు ప్రాపించితివి. అనియడిగిన నామదేవులతనికి నమస్కరించి స్వామీ నేను పామరుఁడను. మూఢుఁడను. శ్రీపండరినాథుఁడునారత్నణమును దేవరవారిస్వాధీనముచేసియుండ నజ్ఞులలో నగ్రగణ్యుఁడనగునన్ను దివ్యజ్ఞానానందమూర్తులరగు దేవరవారిట్లడుగుట కామధేనువు పరులను గడ్డియాచించునట్లున్నది. అనిచెప్పి మౌనముగానుండెను. అపుడు జ్ఞానదేవులు ఓనామదేవా నీహృదయము సముద్రమువలె మిగుల లోఁతైయున్నది. నీముద్దుపలుకులు స్వానుభవానందరసమునకన్న నతిశయించినయానందమును గలుగఁజేయుచున్నవి. అమృతస్యందినియగునీదివ్యసూక్తులననవరతము శ్రవణానందముగ వినఁగోరెదను. నీకు సదృశులగునంతరంగభక్తులీలోకమునందు లేరు. ఇట్టియనుభవముననుదలియ పేక్షచే నీసహవాసము శ్రీపాండురంగనికృపచే పొందితిని. నీవలెనపార[illegible]

భవించువారీభూలోకమునందు లేరు. (తమోబాహ్యాంవినశ్యేత్తు। పావకాదిత్యసన్నిధౌ। బాహ్యామాభ్యంతరంచైవ। విష్ణుభక్తార్కసన్నిధౌ) అనురీతిని సూర్యాగ్నులసన్నిధిని వెలుపలి చీకటినశించును. నీవంటివిష్ణుభక్తార్కసన్నిధిని నాస్తికసహవాసముచేగలుగువెలుపలి చీకటియు, కామక్రోధాదులచేగలుగులోజీకటియు నశించును. నీవు సంకోచమునుగడిచి నాకునీయనుభవమునుజెప్పి నామనోరథపరిపూర్తిచేయుమనిప్రార్థించిరి. తోడనే నామదేవులు నమస్కరించి సవినయముగనోస్వామీ లోకమునుద్ధరించుటకై యవతరించినజగద్గురూ తండ్రి తనబిడ్డనిమృదుమధురాలాపములను ప్రీతితోడ విననపేక్షించునట్లు దేవరవారు నావాక్కులచే నాస్వానుభవమును విననపేక్షించియిన్ని యుపచారములనుజెప్పుచున్నారు. నియమానుసారముగ దేవరవారిపరమకృపాలబ్ధమగుననుభవమునువిన్నవించెదను. ప్రథమమున అచంచలవైరాగ్యము కలుగవలయు, అదికలిగినపిదప భూతదయవర్ధిల్లును. అపుడు నీవునేను అను వ్యవహారము నశించును. ఇట్టిస్థితియెవనికిగలదో వాడే శుద్ధభజనమునకధికారియగును. ఇట్టిలక్షణములతోగూడనిభజనము ఈగతోడభుజించినయన్నమునకు సదృశమగును. నాహృదయమున జ్ఞానానందస్వరూపియగు శ్రీవిఠ్ఠలమూర్తిని సర్వస్వామిగా నధ్యాసించియున్నాడను. అదియునాకుధ్యానము. ఈజ్ఞానమేనాకానందజనకమైయున్నది. ఇదినాశరహితమైనది. అశుణమఅనుపక్షిదేహమునుమఱచి నాదమునలయించునట్లు దేహస్మరణమునుమాని భగవద్వియశ్రవణమునందు లయింపవలయును. కృపణుడగువాడు చిత్తమును నానావిధవ్యవహారములయందుంచినను ద్రవ్యార్జనమందుపూనియుండునట్లు శ్రీమన్నారాయణుడేనాశరహితధనమని తద్గతహృదయుడైయుండవలయును. చాతకపక్షి యాకాశమున సంచరించుచు మేఘమునలక్ష్యముంచునట్లును, పశువుపర్వతారణ్యభూములయందు మేయుచుతనమాడయందుమనసునుంచునట్లును సంసారమునవర్తించుచుండియు హృదయమునసర్వభావములచే శ్రీపాండురంగనిని భావింపవలయును. రాజస, తామస, గుణములనువిడిచి సత్వగుణశీలుడై భగవత్ప్రేమయుక్తుడై నియమముతోడనేకాంతముగగూర్చుండి శ్రీహరినిధ్యానింపవలయును. ఇదిపరమసాధనము. తక్కినసాధనములు బహుబంధకములగును. ఇట్లునామనోవాక్కాయములచే చేయుననుభవమునకు శ్రీరుక్మిణీకాంతుడు సాక్షియైనిర్వాహియైయున్నాడు. అనిచెప్పిననామదేవులయనుభవవాక్యములనువిని జ్ఞానదేవులు సంతోషించియోనామదేవా త్రికాలములయందలివిష్ణుభక్తులలోనీకు సదృశులు లేరు. నీవాగమృతమునాకుసిద్ధించినట్లు కాలాంతరములయందు ఒకరికినిసిద్ధింపదు. మహాయోగులును, ఋషులును నానావిధయోగాభ్యాసముచేయువారైనను వారలలోనీయట్టిపరమభక్తులొకరునులేరు అనిచెప్పిరి. ఇట్లుప్రతిదినమును (మచ్చిత్తామద్గతప్రాణాః। బోధయంతఃపరస్పరం। కథయంతశ్చమాంనిత్యం। తుష్యంతిచరమంతిచ) అనురీతిని పరమానందమునను భవించుచు హస్తినాపురమునకువచ్చిరి. నామదేవులు శ్రీహరికల్యాణగుణములను వర్ణించుచుండెడిపరమానందమును ఆపట్టణవాసులెల్లరును చూచి యాశ్చర్యపడి స్త్రీపురుషవిభాగములేక భగవన్నామసంకీర్తనముచేయుచు మైమఱచి భక్తిపరవశులై యుండిరి.

ఈవృత్తాంతమునుఅచటిరాజువిని నేనువీరియధ్యవసాయమును పరీక్షించిచూచెదను. కపటముగానుంచినవీరికవమానముతప్పకకలుగజేసెదను. అనినిశ్చయించుకొనినామదేవులుపరమానందభరితులై కీర్తనముచేయుచుండగా కోటికొకగోశ్వమును దెచ్చి వారినొక్కించియోపరువ్వు నీవుబ్రతికిం

చిననీభక్తినిజమని నమ్ముదును. అట్లుచేయనియెడల కేవలవేషధారివగునిన్ను శిక్షింతును అనిచెప్ప చుండ నామదేవులతోడ భజనముచేయుచుండినవారెల్లరుచిత్రప్రతిమలయట్లుండిరి. అప్పుడా తురుష్కరాజు నామదేవులనుజూచియీపశువును ఎన్నిదినములలో బ్రతికించెదవనిన నాలుగుదినములలో శ్రీకృష్ణపరమాత్మయీపశువును బ్రతికించునని నామదేవులుచెప్పిరి. అదివిని రాజు కొందఱుభటులను కావలియుంచి నిజమందిరంబునకుఁబోయెను. అపుడునామదేవులు శ్రీహరినిస్మరించి (హేగోపాలక హేకృపాజలనిధే హేసింధుకన్యాపతే। హేకంసాంతక హేగజేంద్రకరుణాపారీణ హేమాధవ। హేరామానుజ హేజగత్రయగురో హేపుండరీకాక్షమాం। హేగోపీజననాధపాలయపరంజానామినత్వాంవినా) అనిపెక్కువిధములస్తుతించి యాపశువుతలను తనయొడిపైనుంచుకొని శ్రీపండరినాధా,అనాధనాధా,మన్నాధా,శీఘ్రముగరమ్ము. నేనుపిలుచుచుండనీవాలస్యముచేయుటకుకారణమేమి. శ్రీరుక్మిణితోసల్లాపమాడుచునన్నుమఱచితివా. భక్తులకీర్తనమునువినిచొక్కితివా,యోగులహృదయములఁజిక్కినిలచితివా.ఆశ్రితులసంకటములను నివారించుటకై యెచ్చటికైననుబోయితివా.పండరిపురమున నీదర్శనమునకై యెవరైన పరమభక్తులువచ్చిరాయనియార్తహృదయుఁడైపిలువఁగాశ్రీపాండురంగనాధుఁడు ప్రత్యక్షమైన నామదేవులులేచి స్వామిపాదపద్మములనుబట్టుకొనియనాధబంధో,ఆపద్బాంధవా యేలనాలుగుదినములుగాను పేక్షించితివి. ఇదినీకుధర్మమాయనియడిగిన భగవంతుఁడు ఓనామదేవా నామీఁదతప్పులేదు. ఈపశువునాలుగుదినములలో బ్రతుకుననినీవుచెప్పితివి. కాననేనుతామసించివచ్చితిని. తోడనేబ్రతుకునని నీవు చెప్పియుండిన నేనుఅప్పుడేవచ్చిపశువును బ్రతికించియుందును. నాభక్తులనోటవచ్చుమాటలనునిజముచేయుటనాకు ముఖ్యవ్రతము. నేనుఅంతరంగభక్తులకు పరతంత్రుఁడనయియుండువాఁడను అనిచెప్పిపశువునులేపియదృశ్యుఁడయ్యె.రాజభటులీయాశ్చర్యమును రాజుతోచెప్పిననతఁడువచ్చినామదేవులచరణారవిందములకు వందనముచేసిస్వామీ దేవరవారేధన్యతములరు. శ్రీహరికిఅంతరంగదాసులరు.దేవరవారిపరమభక్తివైభవము దేవతలకును వాచామగోచరము.మూఢుఁడనగునేను దేవరవారినిపరీక్షింపవచ్చినతప్పును క్షమించినన్నుదాసునిగనేలుకొని రక్షింపవలయుననిప్రార్థించితానును భగవన్నామస్మరణచేయుచుండెను. అప్పుడు అచ్చటివారెల్లరును నామదేవులప్రభావములను పలుదెఱఁగుల వర్ణించుచుండిరి.

శ్రీభక్తవత్సలాయనమః.

---

## పదునొకండవయధ్యాయము.

### జ్ఞానదేవులును,నామదేవులునుకబీరుదాసులయింటికివచ్చుచరిత్రము.

---

నామదేవులు జ్ఞానేశ్వరులతోడహస్తినాపురమునందుఁ గొన్నాళ్లువసించి యచ్చటివారలను భగవద్భక్తియుక్తులనుజేసియచ్చోటు విడిచి కాశికివచ్చిగంగలోస్నానముచేసి, యచ్చటిదేవాలయంబులకుఁబోయి, భగవంతునిదర్శనముచేయుచు నాలుగునెలలాక్షేత్రమునవసించిరి. ఒకనాటిరాత్రి యీయిరువురును కబీరుదాసులయింటికిపోఁగా కబీరుదాసులు భార్యాసమేతులై యెదుర్కొనియావైష్ణవోత్తములకుసాష్టాంగవందనములుచేసియింటిలోపలికి [illegible]

చుకొనిపోయిరి. ఆసుశీలునియింటి దారిద్ర్యస్థితి చూచుటకును, చెప్పుటకును సహింపను. నానాటి యాహారమునకు ఏమియును లేక శిశువులు సహితముపవాసముగ నిద్రించుచుండిరి. ఇట్లుండఁగా వచ్చినయతిథులను ఆదరింపవలయునని కబీరుదాసులు తనభార్యతో చెప్పిన ఆగుణవతి మంచి దనిచెప్పి చింతాక్రాంతయైయంగడివీధినిబోయెను. అపుడురాత్రిజామైనందుననంగళ్లుమూయఁబడియుండెను. ఒకయంగడివాఁడుమాత్రము మేల్కొనియుండఁగా కబీరుదాసులభార్య వానిసమీపమునకుఁబోయిదైన్యముతోఁడ ఓభాగ్యవంతుఁడా తీర్థయాత్రాపరులగుపరమసాధువులు మాయింటికివచ్చియున్నారు. వారికినాతిథ్యముచేయుటకు నాయింటపదార్థములెవ్వియునులేవు. నీవుదయచేసి బియ్యము, పప్పుమొదలగు వస్తుసంభారములనిచ్చినయెడల వానిక్రయమును రేపుప్రాతఃకాలముననీకుతెచ్చియిచ్చెదను. అనియడిగినకబీరుదాసుభార్యను వర్తకుఁడు చూచి యకాలముననొంటిగవచ్చి పదార్థములనడుగునీవెవ్వతవనిన ఆయుత్తమురాలు నేను ఈయూరిలోవాసముచేయు వైష్ణవోత్తములగు కబీరుదాసులభార్యనని చెప్పెను. వర్తకుఁడు కామపరవశుఁడైయాపతివ్రతనుజూచి నిన్నుజూచినదిమొదలు నేనుచెఱకువిల్తునిబాణములచే పీడితుఁడనగుచున్నాను. నామనోరథమునీడేర్చిన నీవుకోరినవస్తువులెల్లనిచ్చెదను. నాకుమూల్యము పనిలేదనియె. ఆసాధ్వియీమాటలను విని నేనేమిచేయుదును. సాధువులగునతిథులుపవసించియున్నారు. ఈవర్తకుఁడుతప్పతక్కినవారలంగళ్లుమూసికొనియిండ్లకుపోయిరి. భర్తచిత్తవృత్తినెఱిఁగితదనుగుణముగనడచుటభార్యకుపరమధర్మము. పూర్వముఅతిథిశుశ్రూషాపరుఁడగుసుదర్శునిభార్యతనపెనిమిటిమనోభావమననుసరించియతిథియైవచ్చినధర్మదేవతయొక్కయంగసంశ్లేషమునకొడంబడియెనుగదా. నేనీవర్తకునియపేక్షకుసమ్మతించియైనవలసినవస్తువులనుగొనిపోయిభర్తృనియమనానుసారముగ భాగవతులనారాధించెదను. శాస్త్రమున ధర్మాధర్మనిరూపణము చేయఁబడియుండినను సమయోచితముగఁగొన్నిధర్మములు అధర్మములై, అధర్మములు ధర్మములగుచున్నవి. అనృతమాడఁగూడదనివేదము విధించియుండ (వివాహకాలేరతిసంప్రయోగే। ప్రాణాత్యయేసర్వధనాపహారే। విప్రస్యచార్థేహ్యనృతంవదేయుః। పంచానృతాన్యాహురపాతకాని) అనురీతినివివాహాదులయందు అబద్ధమాడుటపాతకముగాదనివిశేషవిధిగలిగెను. వేదమున జీవహింసకూడదని విధించి మరల యాగములయందుఁజేయఁబడు జీవహింసదోషముగాదని విధించెను. పతివ్రతయగు స్త్రీభర్తృవశవర్తినియైతదిచ్ఛానుగుణముగఁజేయు సర్వకార్యములును పరమధర్మమైయుండును. సర్వప్రకారములచే స్వాతంత్ర్యమునువిడిచి భర్తృవశంగతలుకాని స్త్రీలకు స్వేచ్ఛాచరణము నరకహేతువగునుగాని భర్తకుఅనువ్రతయగు నాకు భర్తృముఖోల్లాసకరముగఁజేయుకార్యములు నరకాస్పదములుకావు. అనిచింతించి తనపెనిమిటికి ఆరాధ్యుఁడగుశ్రీరామచంద్రునిపాదపద్మంబులనుస్మరించి వర్తకునిఁజూచినేనడిగినవస్తువులనిమ్ము. నేనింటికిపోయి భర్తృనియమనానుసారముగసాధువులనారాధించి మఱలి వచ్చి నీయభీష్టంబు నెఱవేర్చెదను అనినవినివర్తకుఁడు నీమాటలనునేనెట్లునమ్ముదును. నామనోరథమునుముందుపూర్తిచేసినీకువలసినవస్తువులను యథేష్టముగఁగొనిపొమ్ము. అట్లుచేయుటకు సమ్మతింపవేని నీవు నీదారినిపొమ్ము. నీవుగోరినపదార్థములనియ్యననియెను. అదివినియాపతివ్రతవర్తకునిఁజూచినీవునామాటలను విశ్వసింపవేని నేనుచేయుప్రతిజ్ఞనైననునమ్మి నేఁగోరిన వస్తువులనిమ్ము. లోకము సత్యమూలము. సత్యముచేతనేజగత్తు ప్రతిష్ఠితమైయున్నది. కాన

నేను సత్యమేవచించెదను. నేను మరలరానియెడల సర్వకారణమగు సత్యమును తప్పువారి గతికిపోయెదను. అత్తనుదూషించుటయు, భర్తవిషయమున దుశ్చిత్తయగుటయు, పరమాన్నమునితరులకీకయొక్కతెగభుజించుటయు, వంటచేసితాను మున్నుభుజించుటయు, పనులయెడ కుటిలయగుటయు, బొంకులాడుటయు, పుత్రికను వెలకిచ్చుటయు, సుజనులకుకీడుచేయుటయుఅగునీదుశ్చరితలఫలముననుభవించెదను. అని ప్రతిజ్ఞచేసిన ఆపతివ్రతమాటలను వర్తకుఁడు విశ్వసించియామెకోరినవస్తువులనిచ్చెను. ఆవస్తువులనుదీసికొనియామెతనయింటికివచ్చి జరిగినవృత్తాంతములనన్నింటిని భర్తకుఁజెప్పెను. అతఁడు ఈవస్తువులను తనయింటికివచ్చియుండుసాధువులకిచ్చివారిని తృప్తిపఱిచి వారు భగవదారాధనముచేసి తచ్ఛేషమునుభుజించి నిద్రించినపిమ్మట కపీరు తనభార్యనుజూచి తదీయారాధనమునకై యిట్టిసమయమునను నకుపకరించినమహాపుణ్యాత్మునికేమిచేసిననుదగును. సాధువులనిమిత్తమై నిజశరీరమును వర్తకునికినిచ్చుటకుసమ్మతించిన నీవు పుణ్యశాలినివి. ఇపుడు అర్ధరాత్రియయ్యెను. దారిబురదగానున్నది. అడుసుత్రొక్కినకాళ్లతో నచటికిపోవుటుచితముకాదు. అర్ధరాత్రిని స్త్రీయొంటిగా వీధినిపోవుటయు అనుచితము. నీవడుసునందు జారిపడితివేని మహాపకారియగువర్తకునికి నీవుచేసియుండు వాగ్దత్తము వ్యర్థమగును. అనిచెప్పి భార్యను తనవీఁపున వహించియావర్తకునియంగడికి సమీపమున తీసికొనిపోయివిడిచి నీవువర్తకునిమనోరథము నెఱవేర్చిరమ్మని నియమించి యింటికిపోయెను. ఆయువతికామాతురుఁడై తనరాకను నిరీక్షించుచున్న వర్తకుని యంగడిలోప్రవేశించి నీమనోరథమును నెఱవేర్చుకొనుము అనియెను. అపుడు సూర్యోదయమునందంధకారమునశించునట్లు వర్తకునికి శ్రీరామచంద్రునికటాక్షముచే అజ్ఞానమునశించియాపతివ్రతకుభయభక్తులతోడ ప్రదక్షిణనమస్కారములుచేసి యోతల్లీనీభర్తయగు కపీరుదాసులు శ్రీరామభక్తినిక్షేపము. అట్టిమహానుభావులభార్యయగునిన్ను సాక్షాల్లోకమాతయనఁదగును. అట్టినీవిషయమున తప్పుదలఁచితిని. నాజన్మమువ్యర్థమయ్యెను. లెక్కలేనిజన్మములనెత్తియిట్టివిషయవాంఛలచే దుర్గతినిజెందిననేను భగవత్కటాక్షముచేదుర్లభమగు మానుషదేహమునుజెందియు మహాపాపినైతిని. నేను పితరులతోడ రౌరవాదినరకములను జెందుటకు పాత్రుఁడనైతిని. నీకటాక్షామృతమును నామీఁదవర్షించి నన్నుపుత్రునిగ అభిమానించినాకభయమిచ్చి నీభర్తసన్నిధినిశరణాగతునిగఁజేసి నన్నురక్షించవలయునని బహువిధముల ప్రార్థించిన కపీరుదాసులభార్య సంతసించియావర్తకునికి అభయమిచ్చి వానినివెంటఁబెట్టుకొని స్వగృహమునకువచ్చి భర్తకువందనములుచేసి వర్తకునిజూపి నడచినవృత్తాంతమును విన్నవించి యీమహాత్మునుమీరుశిష్యునిగనంగీకరించిశ్రీరామభద్రునికి అంగీకారయోగ్యమగునట్లుఅనుగ్రహింపవలయునని పురుషకారముచేసిన కపీరుదాసులు వానినికటాక్షించి. తనపాదములను బట్టుకొని భూమిపైఁబడియుండు వానినెత్తి యాలింగనముచేసికొని కన్నీరుతుడిచి శోకింపకుము. సదాశ్రీరామచంద్రునినిధ్యానించుచు, తన్నామములనుచ్చరించుచు, శ్రీదాసులనారాధించుచుండుము. దుర్విషయేచ్ఛను సమూలముగ ఛేదింపుము. రాజసతామసంబులనువిడిచి సత్వనిష్ఠుఁడవైయుండుము. ఈషణాత్రయమునువర్జింపుము. (త్యజదుర్జనసంసర్గం । భజసాధుసమాగమం । కురుధర్మమహోరాత్రం । స్మరనిత్యమనిత్యతాం) అనురీతిని దుష్టులసహవాసమును వర్జింపుము. సాధువులసమాగమమునుగోరుచుండుము. అహోరాత్రము శాస్త్రవిహితమును

ధర్మములనాచరింపుము. శరీరము నీటిబుగ్గవంటిదనిదానియనిత్యతనెల్లప్పుడును స్మరింపుచుండుము. (మస్తకస్థాయినంమృత్యుం ।, యదివశ్యేదయంజనః । ఆహారోపినరోచేత । కిముతాకార్యకారితా) అనఁగా తనతలపైఁగూర్చుండియుండుమృత్యువును తెలిసికొన్నవానికి ఆహారము సహితము రుచింపదనఁగా నరకావహమగు నిషిద్ధకార్యములయం దెట్లుమనసు ప్రవర్తించును. అని హితోపదేశముచేసిన కపీరుదాసులవాక్యములనువిని వర్తకుఁడు ఆర్తహృదయుఁడై (నవైరాగ్యాత్పరోలాభః । నబోధాదపరంసుఖం । నగురోరపరస్త్రాతా । నసంసారాత్పరోరిపుః) అనురీతిని వైరాగ్యమునకు మించిన లాభమును, సుబోధమునకుమించిన సుఖమును, గురువునకుమించిన రక్షకుఁడును, సంసారమునకుమించిన శత్రువును లేదని నిశ్చయించి సన్మార్గవర్తియై సాధుగోష్ఠినుండెను. ఈయద్భుతమును నామదేవులును, జ్ఞానదేవులును చూచి యాశ్చర్యపడి కపీరుదాసుల యనుమతిని జెంది బయలుదేరిపోయి తీర్థయాత్రచేసి మరల కపీరుదాసులయింటికివచ్చిరి. కపీరుదాసులు వారలనెదుర్కొని సాష్టాంగవందనములు చేసి యుపచరించిరి. అపుడువీరుమువ్వురును సంతోషభరితులై భగవద్గుణానుభవముచేయుచు ఆనందరసాబ్ధినోలలాడుచుండ జ్ఞానేశ్వరులు నామదేవ, కపీరుదాసులకు పూర్వజన్మమును ఈజన్మకారణమగుభగవన్నియమనమును స్మరింపించిన వారిరువురును ముదమంది జ్ఞానేశ్వరులకు సాష్టాంగవందనంబాచరించిరి. జ్ఞానదేవులు కపీరుదాసులనుజూచియో భక్తాగ్రణీ శ్రీమన్నారాయణుఁడు పుండరీకునికిదర్శనమిచ్చుటకై శ్రీపండరిక్షేత్రమునకువేంచేసి యిప్పటికినిఆశ్రితులననుగ్రహించుచుభీమనదీతీరమునందుసన్నిధిచేసియున్నాఁడు. ఆవైష్ణవశిఖామణి యీనామదేవునికి ప్రాణపదమై వశవర్తియైయున్నాఁడు. ఆపుండరీకవరదునిని నీవుదర్శనముచేయవలయుననిన కపీరుదాసులుఆనందభరితులై యోస్వామీదేవరయాజ్ఞనుశిరసావహించికార్తికశుద్ధమునకుత్థానైకాదశికివచ్చి చేరెదనని విన్నవించెను. జ్ఞానదేవులును నామదేవులును కపీరుదాసులయనుమతినిజెందితీర్థయాత్రకుపోయిరి.

అజ్ఞానతిమిరభాస్కరాయనమః.

## పంద్రెండవయధ్యాయము.

### జ్ఞానదేవ,నామదేవులతీర్థయాత్రయందుబావినీళ్లుతమంతటప్రవహించుట,నాగనాథుని సన్నిధివీరలకభిముఖమైతిరుగుట,వీనిచరిత్రము.

నామదేవులును, జ్ఞానదేవులును ప్రయాగకువచ్చిత్రివేణీసంగమమునందు స్నానముచేసి యయోధ్య, మధుర, గోకులము, ద్వారక మొదలగు స్థలములనుదర్శించి యచ్చటిపుణ్యతీర్థములయందు స్నానముచేసి మార్వాడిదేశమునకు వచ్చునపుడిరువురును తృష్ణాధిక్యముచే మిగులపీడితులైరొచ్చటవెదకినను పానార్థముజలముదొరకక దారిప్రక్కనుండినయొకబావినిజూచి దానిచెంతకుపోఁగా అందునీళ్లుపాతాళముననుండెను. జ్ఞానదేవులకుబావిలోదిగుటకు [illegible]కలదు

గానతఁడాబావిలోదిగిదప్పితీఱునటులతీర్థపానముచేసి పైకివచ్చెను. నామదేవులు దాహమును సహింపక శ్రీమత్పండరినాథునినిస్మరించినసర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడునునగురుక్మిణీకాంతుఁడు నామదేవులదప్పిబాధను నెఱిఁగియాబావినీళ్లుపైకివచ్చిప్రవహించునట్లుసంకల్పించెను. నామదేవులాతీర్థమునుద్రాగి దాహశాంతిచేసికొనిరి. ఈయద్భుతమునుజూచి జ్ఞానదేవులు ఆశ్చర్యపడినామదేవులనుఆలింగనముచేసికొనియోనామదేవా శ్రీపాంచజన్యధరుఁడునీకుస్వాధీనుఁడైయున్నాఁడు. (పితృమాతృసుతభ్రాతృ । దారామిత్రాదయోపివా । ఏకైకఫలలాభాయ । సర్వలాభాయకేశవః) అనువాక్యమును భగవంతుఁడునీవిషయమున ననుష్ఠించిచూపెను. జగన్నాథుఁడునీకు విధేయుఁడైయుండ నీకునసాధ్యమొకటికలదాయనిసల్లాపములాడుచు నిరువురును ఆస్థలమునువిడిచిపోయిరి. ఆతీర్థమునామదేవులకీర్తిప్రవాహమనఁదగియిప్పటికిని ప్రవహించుచున్నది. అందుమార్గశిరమాసమున సాధుజనులువచ్చి స్నానముచేయుదురు.

పిదపనామహాత్ములిరువురును హరిద్వారమునకుపోయి గంగాస్నానముచేసి, హిమాచలమునెక్కి గంగోత్తరినిస్నానముచేసి, కేదారేశుని, బదరీనారాయణునిదర్శించి, హిమవంతమును దిగి, సాలగ్రామనైమిశారణ్యములనుదర్శించి, గయాక్షేత్రమునకుఁబోయిఫల్గునినదిలోస్నానముచేసి, విష్ణుపాదమునుదర్శించి, పితరలనుద్దేశించిపిండప్రదానముచేసి, వైద్యేశ్వరము, శ్రీజగన్నాథము, శ్రీకూర్మము, భీమేశ్వరము, రాజమహేంద్రము, సింహాచలము, మంగళగిరి, శ్రీశైలము, ద్రాక్షారామము, విరూపాక్షము, అహోబిళము, వేంకటాచలము, కాళహస్తి, ఘటికాచలము, కాంచీపురము, వేదగిరి, అరుణాచలము, శ్రీముష్ణము, చిదంబరము, మాయూరము, కుంభఘోణము, శ్రీరంగము, జంబుకేశ్వరము, వృషభాద్రి, హాలాస్యము, తోతాద్రి, మహేంద్రగిరి, కన్యాకుమారి, రామేశ్వరము, దర్భశయనము, అనంతపద్మనాభము, జనార్దనము, పాపనాశనము, కుత్తాలము, గోకర్ణము, త్ర్యంబకము, యాదవాద్రిమొదలగుదివ్యక్షేత్రములయందు భగవద్దర్శనముచేసి గంగ, యమున, సరయు, ప్రభాసము, శోణభద్ర, నారాయణి, కృష్ణవేణి, గోదావరి, నర్మద, సింధు, పుష్కరము, బాహుద, పంప, క్షీరనది, కావేరి, కృతమాల, తామ్రపర్ణి, ధనుష్కోటిమొదలగుపుణ్యతీర్థములయందు గ్రుంకియచటనివసించుభగవద్భక్తులతోకలసిభగవద్గుణానుభవముచేయుచు మాఘకృష్ణపక్షచతుర్దశి మహాశివరాత్రిదినముననాగనాథపురమునకువచ్చిరి. అచ్చటస్నానముచేసియాహ్నికములనునెఱవేర్చినాగనాథునిసన్నిధికివచ్చి సాష్టాంగవందనముచేసిమహామంటపమున భగవన్నామసంకీర్తనముచేయుచుండిరి. వీరలిట్లు శ్రీపాండురంగనిధ్యానించుచుహరికీర్తనముచేయుసమయమున సమస్తజనులువచ్చియానందబాష్పములువిడుచుచు, శ్రవణానందముగవినుచుండిరి. కొందఱానందాతిశయముచే శరీరమునుమఱచిస్తబ్ధులైయుండిరి. ఇట్లుండఆదేవాలయమునందలియర్చకులు స్నానసంధ్యావందనములుచేసి స్వామినిపూజించుటకువచ్చియాగోష్ఠినిజూచి లోపలప్రవేశించుటకుదారిగానక యసూయాగ్రస్తచిత్తులై వారలనుజూచి మేములోపలప్రవేశించుటకు దారివిడువుఁడు. మమ్ముముట్టకుఁడు. ఇవియేమికూఁతలు. ఈయాటపాటలను పండరిపురమునకుపోయి చేయుఁడనిచెప్పియు వారలుభగవద్గుణానుభవమున చొక్కిదారివిడువకయుండిరి. అర్చకులుమొదలగుబ్రాహ్మణులుకోపగించుకొని నామదేవులసమీపమునకువచ్చి ఓహోయీయిదియేమియాటపాటలు. భగవత్సన్నిధికివచ్చువారికి దారిలేకయున్నది. దేవాలయమున వెనుకటి భాగమునకుపోయి మీకిష్టమైనట్లాడుచు పాడుచునుండుఁడుఅనిచెప్పినసామ

దేవులుమంచిదని గోష్ఠితోడ సన్నిధికివెనుకపోయి భగవన్నామసంకీర్తనము చేయుచుండిరి. నామదేవులుపండరినాథునిఁదలఁచుకొనియావునెడవాసినదూడవలె తద్విశ్లేషమునకు సహింపకబహువిధములుగ స్తోత్రముచేయుచుండ ఆకాశమునుండి తొమ్మిదిలక్షలభగవద్భక్తులు మెఱుపుతీఁగలవలె ప్రకాశించుధ్వజములనుజేతఁబట్టుకొని వచ్చిరి. అచటనుండినయెల్లరును ఆశ్చర్యపడి శ్రీవైకుంఠనాథుఁడు వచ్చుచున్నాఁడని భ్రమించిచూచుచుండిరి. అపుడునామదేవులానందపరవశులై భగవంతునిఁగీర్తించుచుండిరి. ఈతొమ్మిదిలక్షలపతాకలు తొమ్మిదిలక్షలసూర్యులవలె నిజప్రభలచేలోకమంతయు వ్యాపించెను. ఇంద్రాదులు ఆకాశముననుండి పుష్పవర్షమునువర్షించిరి. అపుడుప్రాఙ్ముఖుఁడైయుండిన శ్రీనాగనాథుఁడు నిజమందిరంబుతోడ పశ్చిమాభిముఖముగాతిరిగి నామదేవులను గటాక్షించుచుండెను. అందఱును ఆనందాతిశయముచే తాళములువేయుచు, కీర్తనముచేయుచు శరీరములనుమఱచిపరవశులైరి. నామదేవులారాత్రియంతయును భగవత్కల్యాణగుణామృతవర్షముచే సకలప్రాణిసస్యములకు సుజీవనమునొసంగుచుండ సూర్యోదయమయ్యెను. అపుడాయర్చకులు నాలుగుజాములయందును శివపూజచేసియుదయకాలమునస్నానమునకై వెలుపలవచ్చి నామదేవులుగోష్ఠితోడ భగవన్నామసంకీర్తనముచేయుచుండుటనుజూచి తమకుసూర్యుఁడుపశ్చిమముననుదయించినట్లుతోఁచినందున నాశ్చర్యపడి నేఁడేఁటిసూర్యగతివిపరీతమయ్యెను. ఒకవేళరాత్రియంతయుమనము మేల్కనిశివపూజచేయుచుండినందునపిత్తముప్రకోపించుటచే మనకుదిగ్భ్రమకలిగియుండవచ్చుననికొంతచింతించి సావధానముగనూహించితీర్థములన్నియు మునుపటియట్లేయున్నవి. సూర్యుఁడు యథాక్రమముగతూర్పుదిక్కునందే యుదయించియున్నాఁడు. శ్రీనాగనాథస్వామిమాత్రము ఆలయముతోడ పశ్చిమాభిముఖుఁడైనామదేవునిభక్తికి ఆనందించుచున్నాఁడు. చంద్రమౌళీశ్వరుఁడు నామదేవునికీర్తనలకు చొక్కియిట్లుచేసెనుగాఁబోలు. ఇదిమిగులనద్భుతము. మనము కేవలముపామరులమగుటచే నీభాగవతోత్తమునివిషయమునందపచారపడితిమి అనిభయభక్తియుక్తులైనామదేవులకువందనముచేసియోభక్తశిఖామణీ నీవేభగవంతునికంతరంగభక్తుఁడవు. నీవేభాగ్యశాలివి. నీపితరులెట్టినోములునోఁచిరో తెలియదు. ఆనందముతోడ నిన్నుజూచుచు నీవుచేయుభగవత్కీర్తనలను వినుచుకాలమునుగడపుసుజనులభాగ్యవిశేషమెన్ననలవికాదు. నీవుఉద్ధవాంశజనితుఁడవని యిప్పుడిపుడు తెలియవచ్చెను. పతాకహస్తులగు శ్రీమన్నారాయణపార్షదులుఇదిగో నీదర్శనార్థమువచ్చియున్నారు. నీచరిత్రము పరమపావనమైనది. జ్ఞానదేవుఁడు తన్నుజాతిభ్రష్టుఁడనినబ్రాహ్మణులకైమహిషముచే వేదములనుచ్చరింపించినటుల నీవును అసూయాగ్రస్తులమగుమాకు అఘటితములనుజేసిచూపితివి అనిస్తోత్రముచేసియంజలిహస్తులైనిలుచుండ పతాకహస్తులగు భగవద్భక్తులదృశ్యులై దేవదేవునిసన్నిధికిపోయిరి. సకలజనులును ఆనందభరితులైరి. జ్ఞానదేవులు నామదేవులను ఆలింగనముచేసికొని తనచేతులచేనతనిని ఆపాదచూడము స్పర్శించిరి. నాగనాథునిసన్నిధియిప్పటికిని పశ్చిమాభిముఖమై నామదేవులసత్కీర్తిని బ్రకటించుచున్నది.

అతిమానుషచేష్టితాయనమః.

## పదుమూడవయధ్యాయము.

### భగవంతుఁడునామదేవులతీర్థయాత్రకైయుద్యాపనముచేయించుచరిత్రము.

పిదపజ్ఞానదేవులును, నామదేవులును నాగనాధునినియమనముచెంది, బయలుదేరి, పండరిపురమునకువచ్చి యానందముచేమైమఱచి దూరముననుండఁగానే గోపురముగోచరమైనంతట దండముసమర్పించి పండరినాధునిసేవయందలియార్తిచేవేగముగవచ్చి చంద్రభాగలో స్నానముచేసిహరికీర్తనముచేయుచుగోపురద్వారమునందునమస్కరించిలోపలప్రవేశించిబలిపీఠము చెంతవందనముచేసి స్వామికెదుటవచ్చి పరమభక్తితో సేవించుచుండిరి. అపుడుభగవంతుఁడు వీనినాలింగనముచేసికొని సంతోషించెను. నామదేవులుస్వామిపాదములయందు తనశిరమునుజేర్చియానందబాష్పములచే కడిగి స్వామీ దేవరనియమనమునుశిరసావహించి. జ్ఞానదేవులతోడ తీర్థయాత్రపోయివచ్చితిని. దేవరవారినివిశ్లేషించినదినములను యుగములుగఁగడపితిని. ఇఁకనెన్నటికినిటుపంటి విశ్లేషమునాకులేకుండునటులననుగ్రహింపుము. నిన్నెడవాసి నదిమొదలనవరతము నీరూపమునే ధ్యానించుచుంటిని. నీపాదారవిందములే నాకుసర్వధనమైయున్నదిఅనిన రుక్మిణీకాంతుఁడు ఓవత్సానీవుచేయుచుండుభజనము నాకు అహోరాత్రమానందమునుగలుగఁజేయుచుండెను. నీవు నన్నువిశ్లేషించినపిదపనట్టిసంతోషమును నాకుఁగలుగఁజేయఁదగినభక్తులిచ్చటనెవరునులేనందున నాహారాదులురుచింపకదైన్యమునుజెందినీరాకకెదురుచూచుచుంటిని. అనవరతము నిన్నే స్మరించుచుంటిని. నాప్రాణపదమైనభక్తశిఖామణీ నీకన్నప్రియులునాకన్యులులేరు. నీవుసర్వదేశ, సర్వకాల,సర్వావస్థలయందునునన్నే స్మరించుచుంటివి. నన్నువిడిచి బహుదూరముపోయివచ్చితివి అనిచెప్పిభక్తులందఱును జూచుచుండమరలనాలింగనముచేసికొని ముఖమునుగుడిచి తనకంఠముననున్నతులసిహారమును అతనికంఠమునందువైచికృపాదృష్టిచే కటాక్షించెను. అపుడచ్చటికి వచ్చియుండిన వైష్ణవోత్తములగు నివర్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవ, వీసోబాకేశప్రభృతులనేకులు పండరినాధునకు సాష్టాంగవందనముచేసి నామదేవులనాలింగనముచేసికొని సముద్రఘోషమువలె జయజయశబ్దములు చేసిరి. అపుడు ఆకాశముననుండి దేవతలును, ఋషులును భగవన్నామసంకీర్తనముచేయుచుసన్నిధికివచ్చిరి. లోకమాతయగు రుక్మిణీదేవిస్వస్తివచనముచెప్పినామదేవునిముఖమును పరిపూర్ణకృపతోచూచి సంతోషించుచుండెను.

పిదపభగవంతుఁడు నామదేవులనుజూచి నీవు మిగులకష్టపడిశ్రద్ధతో తీర్థయాత్రచేసివచ్చినందున ఉద్యాపనముచేయవలయును.అట్లుచేయనియెడల షడ్రసాన్నమును పాకముచేసిభుజింపకపోయిననట్లువ్యర్థమగునో యారీతినియాత్రచేసియుద్యాపనముచేయనియెడల నిష్ఫలమగును.అనిచెప్పియతనిచేతినిఁబట్టుకొనియంతఃపురమునకుఁదోడ్కొనిపోయిలేనగవుతోడరుక్మిణినిజూచి యోరుక్మిణీ నాప్రాణసహాయుఁడగునామదేవుఁడు తీర్థయాత్రచేసివచ్చెను. దానికినుద్యాపనము చేయవలయుననిన ఆజగన్మాత ఈనామదేవునికి నీపాదపద్మములు తప్పవేఱుధనములేదు.కానవీనికార్యములన్నిటిని నీవేపూనిచేయవలయును. వీనిచరిత్రముమిగుల అద్భుతమైనది. వీనిప్రభావము దేవతలకును దెలియదు. నీవు శీఘ్రముగ నామదేవులను బిలుచుకొనిపో

యి యీయూరిలోనుండు బ్రాహ్మణుల కెల్ల విందుచెప్పిరమ్మని చెప్పి యోనాథా నీసంకల్పము నకు అసాధ్య మెద్ది. ఇచ్ఛామాత్రముననే సమస్తము నడచుచుండును అని చెప్పినరుక్మిణివచనములకు వైకుంఠనాథుఁడు సంతోషించి నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవ, ప్రభృతులు ధ్వజములను బట్టుచుండ మహాస్థలాయద్భుతమును జూచుచు వెంబడింప నామదేవులను పురస్కరించుకొని తాను వెనుక పోయెను (నిరపేక్షంమునింశాంతం । నిర్వైరంసమదర్శినం । అనువ్రజామ్యహంనిత్యం। పూయేయేత్యంఘ్రిరేణుభిః.) అనఁగా నీశ్వరేతర సర్వపదార్థములయందు నిరపేక్షుఁడై భగవంతుని మననము చేయుచు మనోనిగ్రహముచేసి యెవరియందును ద్వేషములేక సుఖదుఃఖములయందును, లోష్ఠకాంచనములయందును, ప్రియాప్రియములయందును, నిందాస్తుతులయందును, మానావమానములయందును, మిత్రద్వేషులయందును సమదర్శియైనమహాత్ముని పాదరేణువులచే పరిశుద్ధుఁడనగుటకై యట్టివానిని వెంబడించెదను అనుతనమనోరథమునకు మంచిసమయము ఘటిల్లెనని శ్రీపాండురంగనాథుఁడు నామదేవులను వెంబడించెననుటకు సందియములేదు. పిదప భగవంతుఁడు నామదేవసహితుఁడై పోయియాయూరనుండు బ్రాహ్మణులనెల్ల విందునకు పిలుచుచు పట్టణమునకు ప్రదక్షిణము వచ్చెను. భగవంతుఁడాసమయమున బ్రాహ్మణవేషధారియై వచ్చినను అతని తేజోవిశేషమును జూచునపుడితఁడు సామాన్యబ్రాహ్మణుఁడుకాఁడు. భగవంతుఁడు కాఁబోలునని యెల్లరును శంకించిరి. ఇతని ముఖమును జూచినంతటఅందఱికి నానందాతిశయమును, తాపోపశమనమును గలిగెను. బ్రాహ్మణులందఱును సంతోషచిత్తులై దేవర వారివాసస్థలమెయ్యది. నామధేయమేమి అనియడిగిన చక్రపాణివారలను జూచి యోబ్రాహ్మణులారా నాపూర్వోత్తరము నామదేవునికి తెలియును. నాప్రాణసఖుఁడగు నితఁడు తీర్థయాత్రచేసివచ్చి నేఁడు పండరినాథుని సన్నిధిలోపల నుద్యాపనము చేయుచున్నాఁడు. దానికి మీరందఱు రావలయును. నాపేరనంతయ్య. మీరుత్వరితముగా రావలయును. అని యుపచారముగ చెప్పి సన్నిధికి వచ్చి రుక్మిణీదేవిని జూచి బ్రాహ్మణులకు విందు చెప్పినదియు, అచ్చట జరిగిన యతిశయములను జెప్పెను. అదివిని రుక్మిణీదేవి నిన్ను బ్రహ్మాదులెఱుఁగరనిన దేహాభిమానులకెట్లు సాధ్యమగును. నామదేవుని నిజదైవమవగు నీవు నేఁడానంద పరవశుఁడైయున్నాఁడవని జగజ్జననిచెప్పుచుండ కామధేను, కల్పవృక్షములు భగవంతుని తలంపెఱిఁగివచ్చి షడ్రసాన్నమును, నానావిధభక్ష్యభోజ్యములను, పరిమళమిళితపానీయములను, చందనపుష్పతాంబూలాదిభోగ్యపదార్థములను అపరిమితముగ నిర్మించెను.

అపుడు రుక్మిణీసత్యభామలు నామదేవులకు అభ్యంజనాదులను జేయించి స్వస్తివచనము చెప్పి హారతియొత్తిరి. భగవంతుఁడగు శ్రీమన్నారాయణుఁడు నామదేవులను వస్త్రభూషణాదులచే నలంకరించి కూర్చుండఁబెట్టియందఱును కొనియాడుచుండ వచ్చిన బ్రాహ్మణాదులకు ఆసనాద్యుపచారములను జేసెను. అంతరిక్షముననుండు దేవతలుఁ మనకు భగవంతుఁడమృతము నొసగెనేగాని యిట్టి ప్రేమామృతమును నొసఁగనేలేదని చెప్పి భక్తుల వైభవమును స్తుతించుచుండిరి. రుక్మిణీకాంతుఁడుమునుపటివలె బ్రాహ్మణరూపియై వచ్చి యచ్చటవచ్చియుండు బ్రాహ్మణుల పాదములను గడిగి తనయుత్తరీయము చేతుడిచి వారి మెడలకు పుష్పహారములను వేసి కస్తూరితిలకమును నిచి నూతనవస్త్రంబులనిచ్చి బంతిగఁ గూర్చుండఁబెట్టి నానావిధషడ్రసాన్నములను భక్ష్యాదులతో వడ్డించి సంకల్పము చెప్పి నామదేవుని చేతితో తీర్థమును విడిపించెను. బ్రాహ్మణులు

పరిషేచనాపోశనాహుతులుచేసి, గోవిందస్మరణతోడభుజించుచుండ వైకుంఠపతియభీష్టవస్తువులనడిగి, వడ్డించుచుండెను. అందఱును అభీష్టముగభుజించి, యుత్తరాపోశనముచేసి, లేచి, గండూషపూర్వకముగ చేతులుకాళ్లుకడిగికొని, శుద్ధాచమనముచేసి, పరిశుద్ధస్థలమున సుఖోపవిష్టులై, జనార్దనునిధ్యానించుచుండపండరినాథుఁడుచందనకుసుమతాంబూలంబులనిచ్చి వారిచ్చినమంత్రాక్షతలనుదనపీతాంబరంబునతీసికొనియాయక్షతలనుదనచేతితో నామదేవునిశిరంబున నునిచినీకుపరమభక్తిదినేదినేవర్ధిల్లుచుండునుగాకయనియనుగ్రహించి యతనిఁబిలుచుకొనివచ్చి నివృత్తిదేవ, జ్ఞానదేవ,సోపానదేవ,వీసోబాకేశప్రభృతులతోడభోజనమునకుకూర్చుండెను.అపుడు రుక్మిణీదేవి షడ్రసోపేతాన్నమునువడ్డించెను. నామదేవులుమైమఱచిభగవద్ధ్యానముచేయుచుండిరి.అపుడుభగవంతుఁడులేచివచ్చి నామదేవునికిహెచ్చరికచేసి యతనినితనతోడఁగూర్చుండఁబెట్టుకొని యతనిశరీరమునుదుడిచితనచేతికబళములనిచ్చిసావధానముగభుజింపుమనెను. నామదేవుఁడుభగవద్ధ్యానపరుఁడై యాకబళములను భగవంతుఁడిచ్చుటయెఱుఁగకుండెను.అపుడుభగవంతుఁడుఓనామదేవానీకునునాకునునించుకయుభేదములేదు. (యోమాంపశ్యతిసర్వత్ర। సర్వంచమయిపశ్యతి। తస్యాహంనప్రణశ్యామి।సచమేనప్రణశ్యతి)అనఁగానెవఁడు సమస్తభూతములయందునన్నును, నాయందుసమస్తభూతములనుజూచుచున్నాఁడో వానికినేనును, నాకువాఁడునుప్రత్యక్షస్వరూపులమైయుందుము.అనిగీతయందు చెప్పియున్నానుగదా.అవ్యక్తుఁడనగునేనునీయందలిప్రేమాతిశయముచేవ్యక్తుఁడనైనీచెంతనున్నాఁడను.నీదర్శనాపేక్షచేపరమభక్తులువచ్చియున్నారు. వారలతోసల్లాపముచేయుము. ఈనివృత్తిదేవుఁడుశివస్వరూపమనియు,జ్ఞానదేవుఁడు నాస్వరూపమనియు,సోపానదేవుఁడుబ్రహ్మస్వరూపమనియు, నెఱుఁగుము అనిచెప్పి కృపాదృష్టిచే కటాక్షించుచుండ నామదేవులు భగవంతునిఁజూచి (నాస్థాధర్మేనవసునిచయే నైవకామోపభోగే। యద్యద్భవ్యంభవతుభగవన్ పూర్వకర్మానురూపం। ఏతత్ప్రార్థ్యంమమబహుమతంజన్మజన్మాంతరేపి। త్వత్పాదాంభోరుహయుగగతానిశ్చలాభక్తిరస్తు) ఓభగవంతుఁడా నాకుధర్మార్థకామములయందు ఆస్థలేదు. పూర్వకర్మానురూపముగరాఁదగినదివచ్చును గాక.నేనుగొప్పగకోరఁదగినదియొకటికలదు. జన్మజన్మాంతరములయందు నీపాదపద్మములయందలి నిశ్చంచలభక్తి నాకుఁగలుగవలయు. అనిప్రార్థించినకృపాసముద్రుఁడు అట్లగుఁగాకయని యనుగ్రహించి వానినోటికిచ్చిన కబళమునఁగొంతయెత్తి తానుభుజించెను.అచ్చటనుండిన భక్తులందఱాశ్చర్యపడి యానందపరవశులైరి.బ్రాహ్మణులందఱును ఒకరితోనొకరు నేఁడుమనయాచారములన్నియునేలఁగలిసెను.ఇదిగోవడ్డించుచుండుస్త్రీలేయేజాతిగలవారో తెలియలేదు. మనకన్నము వడ్డించినవానినిఁజూచిన నాలుగుజాతులయందును జేరనివాఁడనితోఁచుచున్నది. నామదేవునికి తండ్రిగానుండవచ్చునని యూహింపఁదగియున్నది. త్రికరణములచేతను వానియందు ప్రేమతోఁగూడియున్నాఁడు. వానినిగొనిసంకల్పమునకు జలమువిడిపించెను. మనమిచ్చినయక్షతలను వానితలమీఁదవైచెను. కానవానితండ్రియనుటకు సందేహములేదని యోచించుచు మనఃక్లేశమునుజెందిరి.

భక్తిక్రీతాయనమః.

## శ్రీపుండరీకవరదుఁడుబ్రాహ్మణులయొద్దప్రాయశ్చిత్తమునుజేసికొనినచరిత్రము.



బ్రాహ్మణులందఱును పండరినాథునిజూచి యితఁడుమిగులఅక్రమముచేయుచున్నాఁడు. ఁడుఎవఁడో తెలియలేదు. ఇతనియన్నమును భుజించినందునమనయనుష్ఠానములన్నియుచెడిపోయెను. ఇఁకను అవశ్యముప్రాయశ్చిత్తముచేసికొనవలయును. అనియొకరితోనొకరుచెప్పుచుగుంపులుగుంపులుగఁగూడిపోవుచుండ భగవంతుఁడడ్డముగవచ్చి వారినిపోనీకనిల్పి యోవిప్రులారా దక్షిణతీసికొనిపోవచ్చునని చెప్పి పిలుచుకొనివచ్చి కూర్చుండఁబెట్టి స్వర్ణనవరత్నములసీదళాదుల నొకటిగకలిపియందఱికిని సంభావనయిచ్చి నామదేవులచే ఆబ్రాహ్మణుల పాదంబులకు వందనముచేయించి వీనిపైమీరు పూర్ణముగకృపయుంచవలయునని చెప్పి యోబ్రాహ్మణులారా మీముఖములను జూచినమనస్సున నేదోకలంకముండునట్లు తోఁచుచున్నది.అందునకుకారణము చెప్పుఁడనియడిగెను. అప్పుడు బ్రాహ్మణులు ఓపురుషోత్తమా నామదేవుఁడు నికృష్టజాతియనియందఱికిని తెలిసియున్నది. అట్టివానిని సహపఙ్క్తినిడుకొనిభుజించినదికాక వానియుచ్ఛిష్టమును ప్రీతితోడస్వీకరించితివి. కాననిన్నుజూచిన వేషధారియనితోఁచుచున్నది. నీకులమిట్టిదని తెలియలేదు. నిమిషమునకొకవిధముగనున్నాఁడవు. నీకునిందాస్తుతులు సమమైయున్నవి. నీవుబ్రాహ్మణవేషధారివై వచ్చినందున మేము నీయుద్యాపనమునకువచ్చి భుజించితిమి. బ్రాహ్మణులు వేదము విధించినట్లు నడవవలయునుగదా. నిన్నుజూచినసర్వజ్ఞుఁడవని తోఁచుచున్నది. అట్లుండ నామదేవునియందలి ప్రీతిచేనిట్లుచేసితివి. అనిచెప్పిన బ్రాహ్మణుల మాటలనువిని భగవంతుఁడు ఓవిప్రులారా నేను నామదేవునిని సహపఙ్క్తియందు భుజించినదియు, వానియుచ్ఛిష్టమును స్వీకరించినదియు దోషమనిచెప్పితిరి.అదిదోషమా.అందఱికిని అంతర్యామియగుపరమాత్మయొకఁడేగదా. వానికినుత్కృష్టజాతియనియు, నికృష్టజాతియనియు,స్తుతియనియు, నిందయనియు భేదభావములేదు. ఆత్మలకు కర్మసంబంధముచేఁగలిగినశరీరములు వేలువేలువిధమైయుండునుగానిఆత్మస్వరూపముననించుకయైనను భేదములేదు.(నిత్యస్సర్వగతస్థాణురచలోయంసనాతనః) అనురీతిని ఆత్మనిత్యుఁడై, సర్వవ్యాపియై, స్థిరుఁడై,చలనములేనివాఁడై,యనాదియైయున్నాఁడు.ఇట్టినామదేవునిని నికృష్టజాతియనిచెప్పితిరి.ఆత్మలు జ్ఞానానందస్వరూపమై యేకాకారమైయుండుటచే జాతిభేదములేదు. శరీరములును,పాంచభౌతికములై యేకాకారమైయున్నవి. అట్లుండనుత్కర్షనికర్షములెట్లు సిద్ధించును. మీరువేదశాస్త్రములయందు నిపుణులయ్యును అఖండజ్ఞానములేక భ్రాంతులైయున్నారు (విద్యావినయసంపన్నే । బ్రాహ్మణేగవిహస్తిని । శునిచైవశ్వపాకేచ । పండితాస్సమదర్శినః) అనురీతిని విద్యావినయసంపన్నుఁడగుబ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, దానిమాంసముతినువానియందును పండితులుసమదర్శనులై యుందురు. (ఇహైవతైర్జితస్సర్గో । యేషాంసామ్యేస్థితంమనః । నిర్దోషంహిసమంబ్రహ్మ । తస్మాద్బ్రహ్మణితేస్థితాః) అనురీతినెవరిమనస్సు సమస్తమునందును సమభావమును జెందియున్నదో యట్టివారిచే ఈజన్మమునందే మోక్షముసాధింపఁబడుచున్నది.ఏకారణముచే బ్రహ్మమేకమై,నిర్దోషమైయున్నదో యాకారణమువల్ల సమదృష్టికలవారు బ్రహ్మమునందేయున్నారు.ఇట్లుండ శాస్త్రజ్ఞులరగుమీరుసమభావమునువిడిచినామదేవునినెట్లునికృష్టకులజాతునిఁగఁజెప్పవచ్చును.వే

విహితమగువర్ణాశ్రమధర్మములవల్లనుశ్రేయములు. కాన నికృష్టకులజాతుఁడగు నామదేవుతోఁ సహపఙ్క్తిభోజనమునకర్హుఁడు కాఁడనిమీరుతలఁచుచుంటిరి. అందుకు సమాధానము చెప్పెదను. (శ్వపచోపిమహీపాల। విష్ణుభక్తోద్విజాధికః। విష్ణుభక్తివిహీనస్తు। యతిశ్చశ్వపచాధమః) అనురీతిని శ్వపచుఁడైనను విష్ణుభక్తుఁడైనయెడల బ్రాహ్మణునికన్న నధికుఁడగును. విష్ణుభక్తి లేనివాఁడు యతియైనను శ్వపచునికన్ననధముఁడగును (మద్భక్తజనవాత్సల్యం। పూజాయాం చానుమోదనం। స్వయమభ్యర్చనంచైవ। మదర్థేడంబవర్జనం। మత్కథాశ్రవణేభక్తిః। స్వరనేత్రాంగవిక్రియా।మమానుస్మరణంనిత్యం।యచ్చమాంనోపజీవతి।భక్తిరష్టవిధాహ్యేషా।యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతే। సవిప్రేంద్రోమునిశ్శ్రీమాన్। సయతిస్సచపండితః।తస్మైదేయంతతోగ్రాహ్యం।సచపూజ్యోయథాహ్యహం)అనఁగా భగవద్భక్తులయందువాత్సల్యయుక్తుఁడై, భగవద్విషయముననొకరుచేయుపూజకు సంతోషించువాఁడై, తానునుభగవదారాధనముచేయువాఁడై, భగవద్విషయమునదంభరహితుఁడై, భగవత్కథాశ్రవణమునభక్తియుక్తుఁడై, భగవద్గుణానుభవకాలమున గద్గదకంఠము, ఆనందబాష్పము, పులకాంకురము, వీనితోకూడినవాఁడై, సదాయితరచింతలేక భగవంతునిస్మరించువాఁడై, భగవత్సన్నిధినినిష్కాముఁడై యీయష్టవిధభక్తులతో వర్తించువాఁడు మ్లేచ్ఛుఁడైననువాఁడేబ్రాహ్మణశ్రేష్ఠుఁడు. వాఁడేముని. వాఁడేశ్రీమంతుఁడు. వాఁడేయతి. వాఁడేపండితుఁడు. వానికినుపదేశింపఁదగుననియు, వానిచేనుపదేశమునుపొందఁదగుననియు, వాఁడుభగవంతునివలెపూజ్యుఁడనియు భగవద్వాక్యమున్నదిగదా. ఓబ్రాహ్మణులారా యీప్రమాణములనుమీరేలచింతింపరు. మీకుసమ్మతములేనివిషయమున మొదటనేయాక్షేపించియుండవలయును. నేనునామదేవునిచే సంకల్పముచేయించినపుడును, మీరిచ్చిన యక్షతలనునేను వానిశిరమునసుంచినపుడును, ఏలమానముగానుంటిరి. బ్రహ్మజ్ఞానముచే మీయందఱికన్న నామదేవుఁడేగొప్పవాఁడు. అందఱికినిపూజ్యుఁడు. కానవానియుచ్ఛిష్టమును భుజించితిని. ఈపండరిక్షేత్రమున నాదాసులు అహోరాత్రమునన్నుకీర్తనముచేయుచున్నారు. నేనువారలతోఁగూడియానందించుచునామదేవునివంటి పరమభక్తులయుచ్ఛిష్టమునుప్రార్థించుచు అదిలభించినపుడుఅలభ్యములభించెననియానందముతోడ స్వీకరింతును. ఇట్టియుచ్ఛిష్టమాహాత్మ్యముచేతనే నేనందఱికినివందనీయుఁడైయున్నాఁడనుఅనినవిని బ్రాహ్మణులు ఓమహానుభావా నీవుఅనంతకల్యాణగుణనిధియగు భగవంతుఁడనియిపుడునిశ్చయించితిమి. మాసందేహమువీడెను. అయినను (యచ్ఛాస్త్రవిధిముత్సృజ్య।వర్తతేకామకారతః। నససిద్ధిమవాప్నోతి।నసుఖంనపరాంగతిం।తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతే। కార్యాకార్యవ్యవస్థితౌ।జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం। కర్మకర్తుమిహార్హసి) అనఁగాశాస్త్రవిధినిఅనుసరింపకస్వేచ్ఛగవర్తించువానికిసిద్ధియు, సుఖమును, పరమగతియునులేదు- కానఓ అర్జునాశాస్త్రమును ప్రమాణమనినమ్మి కార్యాకార్యములను తెలిసికొని శాస్త్రోక్తమగుకార్యములను నీవు ఆచరింపుము. అనిగీతయందు నీవేవిధించియున్నాఁడవుగదా. బుద్ధిమంతులకు వర్ణాశ్రమవిపరీతమగునడువడియొప్పదుగదా (ధర్మస్యప్రభురచ్యుతః) అను రీతిని ధర్మమునకు అచ్యుతుఁడు ప్రభువైయున్నాఁడు. నీవుమావలె కర్మపరతంత్రుఁడవుకాకయుండినను ప్రథమాచార్యుండవగుటచే శాస్త్రవిధినిలోకులకు ఆచరించిచూపుటయుచితము. కానమాప్రార్థననంగీకరించినామదేవునియుచ్ఛిష్టమును భుజించినదోషమునకు పరిహారముగచంద్రభాగలో విధిపూర్వకముగాస్నానముచేసి పంచగవ్యమునుస్వీకరింపవలయుననిచెప్పిరి.

ఆమాటను విని భగవంతుఁడు ఓవిప్రులారా (కరచరణసరోజే కాంతిమన్నేత్రమీనే। శ్రమముషి భుజవీచివ్యాకులే గాధమార్గే। హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం। భవమరుపరిఖిన్నః ఖేదమద్యత్యజామి) అనఁగా సంసారమరుకాంతారమున డస్సిన నేను పాణిపాదములనెడి పద్మములుగలదియు, మనోహరములగు నేత్రములనెడు మత్స్యములుగలదియు, భుజములనెడు నలలచే వ్యాకులమైనదియు, అగాధమైనదియు నగు హరియను సరస్సునందు ప్రవేశించి కాంతియనునుదకమును ద్రాగి యిపుడు నాదుఃఖమును విడిచెదను అని ముముక్షువులచే ప్రార్థింపఁబడు స్నానమును సదా చేయుచుండు భాగవతోత్తముఁడగు నామదేవుని పరమపావనమగు నుచ్ఛిష్టమును భుజించిన నాకు చంద్రభాగలో స్నానమును, పంచగవ్యస్వీకారమును ప్రాయశ్చిత్తముగ విధించితిరి. భాగవతోచ్ఛిష్టస్వీకారము చేదాసిపుత్రుఁడు నారదుఁడై సకలలోకులకును వందనీయుఁడై యుండుటను వినియెఱుఁగరే. పరిమళద్రవ్యముల మూటలను వహించుచతుష్పాజ్జంతువు దానిపరిమళము నెఱుఁగనట్లు వేదభారమును వహించు మీరు తత్సారతమంబైవిశేషధర్మంబగు భాగవతానువర్తనక్రమము నెఱుఁగక సామాన్యధర్మనిష్ఠులైనాకిట్టి ప్రాయశ్చిత్తమును విధించితిరి. అయినను (మహాజనాయేన పథాస్సపంథః) అనఁగా బహుజనులు పోవు రీతిని పోవలసినదియుక్తము. కావున నీయారి బ్రాహ్మణులగు మీరందఱును ఐకకంఠ్యముగ విధించు ప్రాయశ్చిత్తమును అనుష్ఠించెదను. అని చెప్పి నామదేవులను చేతఁబట్టుకొని యాబ్రాహ్మణులు వెంబడించిరాఁగా చంద్రభాగకుపోయి విధిప్రకారము స్నానముచేసి యాబ్రాహ్మణులచే పంచగవ్యమును స్వీకరించెను. పిదప బ్రాహ్మణులకు దక్షిణలిచ్చి వారిని స్వస్థానములకుఁబంపి యనేకభక్తులతోడ సన్నిధికి వచ్చెను. అపుడు రుక్మిణీ, సత్యభామలెదుర్కొని యర్ఘ్యపాద్యాద్యుపచారంబులను జేసి భగవంతునితోడఁ గూర్చుండఁబెట్టి పరసోపేతాన్నమును వడ్డించిన నందఱును ఆనందభరితులై భుజించుచుండ భగవంతుఁడు తనయుచ్ఛిష్టమును భాగవతులకు నిచ్చుచు, వారియుచ్ఛిష్టమును తాను భుజించుచు, నీరీతిగ నందఱును పూర్ణముగ భుజించి చందనకుసుమతాంబూలాది భోగ్యవస్తువులను స్వీకరించిన పిదప భగవన్నియమనమును జెంది భాగవతులందఱును స్వస్థానములకుఁబోయిరి.

అపుడు దేవలోకమునుండి నారదమహాముని వచ్చి పుండరీకవరదునికి వందనములు చేసియతనిని కౌఁగిలించుకొని పరమానందభరితుఁడైతన్నియమనముచే భగవన్నామసంకీర్తనము చేసిన భగవంతుఁడు సంతోషించి తనకంఠమున నుండిన తులసిహారమును అతనికంఠమున వైచియనుగ్రహించి పంపెను. పిదప రాధయును, రుక్మిణియును నామదేవుని విషయమున భగవంతుఁడత్యంతపరతంత్రుఁడై వానియుచ్ఛిష్టమును స్వీకరించియుందులకై బ్రాహ్మణులచే ప్రాయశ్చిత్తమును జెందినయద్భుతచరిత్రమును, భగవంతుని వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్యగుణంబులను, నీగుణములు నామదేవుని విష[illegible]మున ననుభవసిద్ధముగ ఫలించియుండుటను పెక్కువిధంబులఁ గొనియాడుచుండిరి. పిదప నారదుఁడు సత్యభామసన్నిధికి వచ్చి వందనముచేసి యామెచే నచ్చట జరిగిన వృత్తాంతములను విని యోతల్లీ పూర్వము భగవంతుఁడు (నాహంవసామి వైకుంఠే। నయోగిహృదయే రవౌ। మద్భక్తాయత్ర గాయంతే। తత్ర తిష్ఠామి నారద) అని నాతోఁ జెప్పియుండెను. దానినిపుడు నామదేవులవిషయమున ననుష్ఠించిచూపెను. అని విన్నవించి నియమనమును జెంది స్వస్థానముఁబోయెను. ఆరాత్రి భగవంతుఁడేకాంతముగ శయనించియుండ శ్రీరుక్మిణీదేవి స్వామిపాదములను బట్టుచు ఓప్రాణనాథా, ముల్లోకంబులయందు నీకవతుమిగులనంతరంగులు అనియడిగిన భ

तुम हमरे नाथ गुसैयां । आपन रहत नींदको मातो हम चारत तेरी बन बन गैयां ॥ कबहूं जाय कदम चढ बैठे हम गैयन सँग लगत पठैयां । मानी हार सूरके प्रभुने अब नहिं जाऊँ मोहिं नंदकी दुहैया ॥ ११६ ॥

## राग टोडी ।

आज कौने धों बन चरावत गाय कहा धों भई बडी बेर कहँ सुध लेहुँ कौन विधि ग्वालि करत अवसेर ॥ वृन्दावन आदि सकल बन ढूंढचो जहिं गायनकी टेर । सूरदास प्रभु रसिकशिरोमणि कैसे दुराए दुरत डुँगरनकी ओट सुमेर ॥ ११७ ॥

## राग सारंग ।

ब्रजवासिन पटतर कोउ नाहीं । ब्रह्म सनक शिव ध्यान न पावत तिनकी जूठन लै लै खाहीं ॥ धन्य नंद धन्य जननि यशोदा धन्य जहां अवतार कन्हाई । धन्य धन्य वृन्दावनके तरु जहं विहरत प्रभु त्रिभुवन राई ॥ हलधर कहत छाक जेंवत संग मीठो लगत सराहन जाई । सूरदासप्रभु विश्वंभरहैं ग्वालन कौर अघाई ११८

## राग हमीर कल्याण ।

ठुमक गति चलन अनोखी चाल । मोर मुकट मकराकृत कुंडल केसर बेंदी भाल ॥ आगे गैयां पाछे गैयां संग सोहैं ब्रजबाल । विष्णुदास मुरलीधरकी छबि देखत भई निहाल ॥ ११९ ॥

## राग केदार ।

बन आये बनवारी । शिर धार चन्दन खौरि मोतियनकी गलमाला मोर मुकट पीताम्बर सोहै कुंडलकी छबि अति न्यारी ॥

రించిరి. పిదప భగవంతుఁడా బ్రాహ్మణులకుపచారములు చెప్పి కొంతసేపచట నేనుండవలయు నని ప్రార్థించి వారు చూచుచుండ నామదేవుఁడు, నివృత్తిదేవుఁడు, జ్ఞానదేవుఁడు, సోపానదేవుఁడు, సామంతుఁడు, వీసోబా కేశుఁడు, నరహరి, చోకామేళుఁడు, ఘోరాకుంభారు మొదలగు అనేకభక్తులను సహపఙ్క్తి నిడుకొని యత్యంత ప్రేమతోడ భుజించుచుండెను. అపుడు వీరలకు రుక్మిణి, సత్యభామ, రాధయీ ముప్పురును వడ్డించుచుండిరి. షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు భగవంతుఁడు భక్తులతోడ భుజించుచుండ బ్రహ్మాదిదేవతలాకాశముననుండి పుష్పవర్షము వర్షించి . యీయద్భుతములనుజూచి యీభక్తులభాగ్యమే భాగ్యము. వేదాంతమునందలి రహస్యవస్తువగు భగవంతుఁడు వీరలకిట్లు ప్రత్యక్షమైయుండుటాశ్చర్యమని భగవంతుని సౌశీల్యాదిగుణములనుగొనియాడుచుండిరి. అందఱును భుజించియయినపిదప భగవంతుఁడు తనపీతాంబరమున నందఱియుచ్ఛిష్టమును సంగ్రహించిదానిని భాగవతప్రసాదంబని భక్తులకెల్లవినియోగించి తానును స్వీకరించెను.

అపుడు బ్రాహ్మణులందఱాశ్చర్యపడియొకరితోనొకరిదియేమివింత. ఇతఁడు బ్రాహ్మణుడు అనితలఁచిప్రాయశ్చిత్తము చేయించితిమి. ఇతని కార్యమునుజూడఁగా నెందునుఅంటనివాఁడై యున్నాఁడు. ఇతఁడు గ్రామ, కులాది, వ్యపదేశములేనివాఁడైయున్నాఁడు. వర్ణాశ్రమధర్మములీతనియందు వెదకిననులేవు. మఱియు భూమిపర్వతవృక్షాదులనైనను, మనుష్యాదిచరములనైనను అభేదముగవహించునట్లును, సూర్యుఁడుతన తేజస్సుచే నన్నిటినిఅభేదముగవర్ధింపించునట్లును, శ్రీమన్నారాయణుఁడంతర్యామియైసర్వమునుసమముగరక్షించునట్లును, ఇతనికిస్వకీయ, పరకీయ భేదములేకయున్నది. కాననితఁడు శ్రీమత్పాండురంగఁడుగానుండవలయును. మనోవాక్కులకగోచరుఁడగునీపురుషోత్తముఁడు నామదేవునిభాగ్యవశముచేవానియందత్యంతమోహముతోఁగూడియున్నాఁడు అనిచెప్పుకొనుచు వారుభగవంతునిధ్యానించుచుండ హృషీకేశుఁడు తనదివ్యమంగళవిగ్రహముతో బ్రాహ్మణులకును, భక్తులకును, దర్శనమిచ్చెను. ఆదివ్యమంగళవిగ్రహస్వరూపమును వర్ణించుటకు, చతుర్ముఖ, పంచముఖ, షణ్ముఖ, సహస్రముఖులకును అలవికాదు. విద్యాధిదేవతయగుసరస్వతికిని శక్యముకాదు. కాననట్టియద్భుతస్వరూపమును వర్ణించుటకు అల్పజ్ఞానశక్తియుక్తులగుమనుష్యులకెట్లుసాధ్యమగును. ప్రసన్నవదనమును, సుందరమగు తామరరేకులవంటి కన్నులును, అందమగు కపోలములును, పలకవలె విశాలమై కస్తూరికలితోర్ధ్వపుండ్రతిలకముతోఁగూడిన నెత్తియు, దివ్యములగు మకరకుండలములతోఁగూడిన శ్రీకారములవంటి చెవులును, శంఖమువంటి కంఠమును, అతివిశాలమై శ్రీశ్రీవత్సములతోఁగూడిన వక్షమును, మూడుమడతలుగలిగి లోఁతైననాభితోఁగూడియుండునుదరమును, అజానుబాహువులును, సమములగుతొడలును, మోకాళ్లును, కమలములకు సదృశములగు చరణములును, దివ్యపీతాంబరమును, కిరీట, హార, కేయూర, కటకాది దివ్యాభరణములును, శంఖ, చక్ర, గదా, ఖడ్గ, కోదండ, పద్మరములును, తులసీవైజయంతివనమాలికలును, వరదాభయహస్తంబులునగువీనితోఁగూడినదివ్యమంగళవిగ్రహముతో దర్శనమిచ్చెను. అపుడనంతగరుడవిష్వక్సేనాదినిత్యసూరులును, సనకాదిజీవన్ముక్తులును, బ్రహ్మాదిదేవతలును, భృగుప్రభృతిమహర్షులును, నారదాదిదేవర్షులును, వ్యాసాది మునులును, చిత్రరథాదిగంధర్వులును, కపిలాదిసిద్ధులును, ప్రహ్లాదాదిభక్తులును, మూర్తిమంతములగు వేదములును, పుణ్యనదులును, ఆనందభరితులై స్వస్తివాచనంబులనుజెప్పుచు భగవంతుని ప

## राग गौरी ।

लटकत चलत युवति सुखदानी । सन्ध्या समय सखा मंडलमें शोभित तनु गोरज लपटानी॥ मोर मुकुट गुंजा पियरो पट मुख मुरली बाजत मृदुबानी । चतुर्भुज प्रभु गिरिधारी आये बन ते ले आरती वारत नन्दरानी ॥ १२४ ॥

## राग गौरी ।

मैया मोरी कमरी चोर लही । मैं बनजात चरावन गैया ।... देख गही ॥ एक कहै कान्हा तेरी कामर यमुनामें जात बही । एक कहै श्याम तेरी कामर सुरभी खाय गई । एक कहत नाचो मेरे आगे लैदेहों और नई । सूरदास यशुमतिके आगे अंशुअन डार दई ॥ १२५ ॥

## राग कान्हरो ।

पौढे श्याम जननि गुणगावत । आज गयो मेरो गाय चरावन यह कहि मन हुलसावत ॥ कौन पुण्य तपते मैं पायों ऐसो सुंदर बाल । हर्ष हर्षके देत सखनको सूर सुमनकी माल ॥ १२६ ॥

# कालींदमनलीला ।

## छन्द ।

गेंदके संग कूद बालक यमुना जल पैठे धायके । नाग नागिन करत क्रीडा हरि उतरे तहां जायके ॥ कौन दिशाते आयो रे बालक कहां तुम्हारो गाम है । कौन सखीके पुत्र जो कहिये कहा तिहारो नामहै ॥ पूर्व दिशाते आये री नागिन गोकुल हमरो गामहै । मात यशोदा पिता नंदजू कृष्ण हमरो नाम है ॥ प्रभुके सम्मुख कहते नागिन जारे बालक भागके । तेरो रूप देखे दया उपजे नाग मारै जागके ॥ भागे कुलको दाग लागे अब भागे

లరైననన్ను భజింపుఁడు. మీకీనిష్ఠ సిద్ధించినవేఱుగాతపోయజ్ఞాదులు చేయఁబనిలేదు. నానామస్మరణచేయుచు సర్వభూతదయాపరుఁడైనవాఁడు పునరావృత్తిరహిత పరమపదమును జెంది నిత్యసూరులతోఁగూడియానందింపవచ్చును. అనియీపరమరహస్యమునుపదేశింపఁగా బ్రాహ్మణులు కృతార్థులమైతిమని సాష్టాంగముగవందనముచేసి భగవంతునిస్తుతించిరి. అపుడురుక్మిణీకాంతుఁడు జ్ఞానదేవులనుజూచి యీబ్రాహ్మణులను నీచేతికప్పగించితిని. అనిచెప్పిన జ్ఞానదేవులు సాష్టాంగముగనమస్కరించి స్వామీదేవరవారి నియమనమును నాశిరసావహించి వీరలకుదేవరవారినిజస్వరూప ధ్యానప్రకారములను జెప్పెదనని విన్నవించెను.

అనంతమూర్తయేనమః.

## పదియాఱవయధ్యాయము.

### కూర్మదాసుచరిత్రము.

సూర్యసారథియయిన యరుణునియంశముచే కూర్మదాసుఁడు కాళ్లులేని[illegible]బ్రాహ్మణకులమునజనించి పెరిగినడవఁదగిన వయస్సువచ్చినప్పుడు కాళ్లులేనందున నడవ[illegible]తాఁ బేలునలెభూమిపైఁబ్రాకుచుండెను. అయిదాఱేండ్లవయస్సఅయినంతట నెచ్చటవారిసంకీర్తనజరగినను అచ్చటికెల్ల నేలఁబ్రాకుచుపోయి యాకీర్తనమును శ్రవణముచేయుచుండెను. కూర్మమువలెనేల ప్రాకుటచేనితనికి కూర్మదాసుఁడనిపేరుకలిగెను. ఇట్లుండ నొకనాఁడొకచోట శ్రీపండరిపురమాహాత్మ్యమునుజదువుచుండ అదివిని శ్రీపండరినాథునిదర్శనముచేయవలయునని యత్యంతాపేక్షకలిగి కేలుమోడ్చి యచ్చటనుండువారలనుజూచి నేనుపండరిపురమునకుఁబోవ నపేక్షించెదను. రుక్మిణీరమణుఁడు నన్నురప్పించుకొనినాకుదర్శనమిచ్చునాయనియడిగిన వారలునవ్వి కాళ్లులేనినీకు పండరిపురమునకుఁబోవుటకెట్లుసాధ్యపడును. మాకవయవములన్నియునుచక్కఁగానున్నవి. వయస్సుఅధికమయ్యెను పండరిపురమునకుఁబోవవలయుననపేక్షతోమాత్రముకూడియున్నారమే కాని పోవుటకుసాధ్యపడలేదు. అట్లుండనీవెట్లు తలఁచినమాత్రమున పోఁగలవు. అనిచెప్పినవిని కూర్మదాసుఁడుదుఃఖించి నాకుమనుష్యశరీరము ప్రాప్తమయ్యెను పండరిపురమునకుఁబోయిపుండరీకవరదునినిదర్శించి జీవన్ముక్తులగు నామదేవులు, జ్ఞానదేవులు, మొదలగుభక్తులగోష్ఠిని సేవింపనియెడల నాజన్మమువ్యర్థమగును. అనిచెప్పి శుభస్యశీఘ్రమ్మనురీతినితోడనేబయలుదేరి భూమిపైఁబ్రాకుచు ఆదినమంతయును రెండుగడియలదూరముపోయెను. అచ్చటనొకయాంజనేయుఁలయాలయమునుజూచి యందుప్రవేశించి బడలికలుతీర్చుకొని యాఁకలిదప్పులచే మిగులపీడితుఁడై పండరినాథా, రుక్మిణీకాంతా, అకించనుఁడను, అనన్యగతికుఁడనగునన్నురక్షింపుము. నాకుసర్వవిధబంధువునునీవే. నీకన్యమునునేనెఱుంగననియనుతపించుచుండు కూర్మదాసులకుతత్క్షణమున నొకపెతికవానివలెప్రత్యక్షమై నీకుకాళ్లులేకయుండ నిట్లుప్రయాసపడి యెచ్చటికిపోయెదవు చెప్పుమనినఅతఁడు నాపేరుకూర్మదాసుఁడు. పండరి నా[illegible]పవలయుననపేక్షచే పోవుచున్నాఁడననినవినియాతర్తకుఁడుసంతోషించి యోబ్రా[illegible] నేనునుపండరిపురమునకుఁ బోవుచున్నాను. నీవునాకుమంచితోడైతివి అనిన కూర్మదాసుఁడు [illegible]లేనివాఁడను. కానఁనేనెట్లునీకుతోడౌదును. [illegible]

गात सुर नर मुनिजन चित्र लिखे सोहैं॥ रुनक झुनक नूपुर धुनि उठत उठत पैंजनी पग ठुमक ठुमक किंकिणी कटि बाजत चित करखें। विद्याधर गंधर्व किन्नर जहां उघटैत गत जय जय जय भाषत सुरबधू पुष्प वरखें॥ ज्यों ज्यों फण ऊंचे करत त्यों त्यों कृष्ण मारें लात देत न अवकाश प्रभु नाचत गतिधीमें। तरुण वदन गरल वमन मरल किये या विधि कर लटक लटक पग ललित रंग भीने॥नारदादि शिव विरंचि तज प्रपंच धरन ताको पग दुर्लभ सोई उरग शीश धारें। विद्याधर प्रभु दयाल तज विवाद कियो निहाल काली नेर धन्य भाग विसरत न विसारें॥ १२८॥

तांडव गति मुंडन पर निर्तत वनमाली। पंपंपं पग पटकत फंफंफं फनन उपर विंविंविं विनती करत नागवधू आली॥संसंसं सनकादिक नंनंनं नारदादि गंगंगं गंधर्व सभी देत ताली॥ सूरदास प्रभुकी वानी किंकिंकिं किनहूं न जानी चंचंचं चरण धरत अभय भयो काली॥ १२९॥

## राग कान्हरो।

जबहिं श्याम तनु अति विस्तारयो। पटपटात टूटत अँगजान्यो शरण२अहिराज पुकारयो॥ यह वाणी सुनतहिं करुणामय तबहि गये सकुचाये। यही वचन सुन द्रुपदसुताके दीनों वसन बढाये॥ यही वचन गजराज सुनायो गरुड छाँड तहँ धाये। यही वचनसुन लाक्षागृहमें पांडव जरत बचाये॥यह वाणी सहिजात न प्रभु पै ऐसे परमकृपाल। सूरदास प्रभु अंग सकोरयो व्याकुल देख्यो व्याल॥ १३०॥

वंदौं मैं चरण सरोज तिहारे। सुंदर श्याम कमलदल लोचन ललित त्रिभंग प्राणपति प्यारे॥ जे पद पद्म सदाशिवको धन

పదంబైయున్నాఁడవని చెప్పుచు భక్తులతోఁగూడియాడుచు నిట్లుపరమానందభరితుఁడై చొక్కియుండ రుక్మిణీకాంతుఁడగు భగవంతుఁడు ప్రత్యక్షమై నామదేవుల నెత్తి యాలింగనముచేసికొని ముఖముతుడిచి యచ్చటనుండిన సాధువులనుజూచి యోభక్తులారా నివృత్తిదేవుఁడు నాదాసుఁడు. అతఁడు [illegible]వైరాగ్యములయందు అచంచలనిష్ఠుఁడై తనహృదయమున నన్నే మఱక ధ్యానించుచున్నాఁడు. ఈజ్ఞానదేవుఁడట్టి యనుభవమునకు అపారమగు సముద్రమైయున్నాఁడు. ఈసోపానదేవుఁడు, రోహిదాసుఁడు, ఘోరాకుంభార్, వీసోబాకేశుఁడు, శోకాపరమానందుఁడు, చోకామేళుఁడు, జగమిత్రనాధుఁడు, సారంగదేవుడు, శరకేశవదాసుఁడు, నరహరి, భానుదాసుఁడు వీరలిపుడిచ్చటనాకు ప్రియభక్తులైయున్నారు. భీష్ముఁడు, రుక్మాంగదుఁడు, అక్రూరుఁడు, ఉద్ధవుఁడు, అర్జునుఁడు, ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు, నారదుఁడు మొదలగువారు బహుకాలముగానాకు ప్రియులు. వీరెల్లరునాయంతరంగముచక్కఁగా నెఱిఁగినవారు. అయినను సర్వవిషయములందును విరక్తుఁడగునీనామదేవుని నడువడియత్యద్భుతమైయున్నది. అని చెప్పుచుండ యాత్రవచ్చినభక్తజనులు ధ్వజములను జేతులఁబట్టుకొని జయజయఘోషములు చేయుచు, తాళములుఁ తట్టుచు, పరమానందభరితులై లోపలప్రవేశించి కటిహస్తుఁడై యిటికపాతిమీఁద నిలుచుండు భగవంతునిదర్శించి పాదకమలములను నేత్రములయందు అద్దుకొనియాలింగనము చేసికొని మైమఱచి నృత్యముచేసి బహువిధములుగ స్తుతించి పిదపస్వామినిజూచి కూర్మదాసులమనోరధమును విన్నవించి యతనికి సేవయొసఁగవలయునని ప్రార్థించిరి.

అదివిని భగవంతుఁడు సంతోషించి నేఁడు నాకు సుదినము. నామనోరధము నేటికి పూర్ణమగును. అని చెప్పి జ్ఞానదేవులకును, నామదేవులకును తనయంతరంగము నెఱిఁగించి వారలను పిలుచుకొని కూర్మదాసులకు దర్శనమిచ్చుటకు బయలుదేరెను. ఇట్లీముగ్వురును బయలుదేరిపోవుచు పెండియను గ్రామమును జూచినతోడనే యచ్చటనొకనందవనమును పరిపాలించుచుండు సామంతుఁడను భక్తునిఁ జూడవలయునని భగవంతునికిచ్ఛకలిగి యాతోఁటకు సమీపమున వచ్చుచుండఁగా జ్ఞానదేవ, నామదేవులనుజూచి నేనీతోఁటలోపలికిఁబోయి కొంతసేపుండివచ్చెదను. మీరిచ్చటనుండుఁడు అని చెప్పి లోపలప్రవేశించి సామంతునిజూచెను. అతఁడు సద్భావభక్తిచేయుచుండువాఁడు కాన భగవంతునిఁజూచినతోడనే రెండుపాదములను గట్టిగాపట్టుకొని యానందవార్ధిమగ్నుఁడై స్వామీనాభాగ్యమేభాగ్యము (పద్భ్యామభిగమాచ్చైవ । స్నేహసందర్శనేనచ) అనురీతిని కాళ్లతోనడచివచ్చి నాయందలిస్నేహమును సందర్శింపించితివి అని చెప్పి యానందపరవశుఁడై పునఃపునఃప్రణామముచేసి భక్తవత్సలా యీభక్తునినిమిత్తమిట్లు కష్టపడిపోవుచున్నాఁడవు అని చెప్పుచుస్వామిని పూజింపనారంభించెను. అపుడుభగవంతుఁడు ఓసామంతా యీసమయమున నేమిపూజచేసెదవు. అదియుండనిమ్ము. నన్నుపట్టుకొనుటకై యిద్దరుదొంగలుతఱుముకొని వచ్చుచున్నారు. వారలచేతికిదొరకకదాఁచుకొనుటకై నీయొద్దకు పాఱివచ్చితిని. కావునకొంచెముచోటిమ్ము. గ్రహణముపట్టినపుడు సూర్యునికిఅర్ఘ్యమురుచింపనట్లు ఈసమయమున నీవుచేయుపూజ నాకు రుచింపలేదు. అనిన సామంతుఁడు ఓవాసుదేవా నీ[illegible]దాఁచుకొనియెదవు. నీవుదాఁచుకొనుటకొకస్థలమునాకగపడలేదు. నీవులేనిచోటు కొం[illegible]నులేదుగాన నెంతవెదకినను నీవుదాఁచుకొనఁదగిన స్థలములేదు. అనంతకోటిబ్రహ్మాండ[illegible]యుండనిన్ను దాఁచియుంచుటకు ఒకస్థలముకలదా. అని చెప్పినజగన్ని

# गोवर्द्धनलीला।



## राग मलार।

देखो माई बादरकी बरिआई मदनगोपाल धरयो कर गिरि-
र इन्द्र ढीठ झर लाई ॥ जाके राज्य सदा सुख कीनो ताको
। सेवक करे स्वामिसों सरबरि इन बातन पति जा
ढीठ बलि खात हमारी देखो अकिल गँवाई। सूरदास तिनका
काको डर जिहिं बन सिंह कन्हाई ॥ १२४ ॥

## राग बिलावल।

राखि लेहु गोकुलके नायक। भीजत ग्वाल गाय गोसुत सब
विषम बूँद लागत जनु सायक ॥ वर्षत मूसलधार सेनपति
महामेघ मघवाके पायक। तुम बिन ऐसो कौन नन्दसुत यह
दुसह मेटिबे लायक ॥ अघमर्दन बकवदन विदारन बकी-
शन सब सुखदायक। सूरदास तिनको काको डर जिनको
मसे सदा सहायक ॥ १२५ ॥

## राग लावनी।

साँवरे शरणागत तेरी। इंद्रने आय ब्रज घेरी ॥ देखोजी यह
बादर मिल आये। दामिनी दमकत भरलाये ॥ मेघभर लोका
बरसावें। भाग अब कहो कितको जावें ॥ कहोजी अब कैसे बने
परयो इंद्रसों बैर। कोप्योहै पृथिवीको पालक होगी किसविधि ठैर ॥
जुगत हम बहुतेरी हेरी ॥ साँवरे० ॥ कही हम तुम्हरी सब मानी।
भट गिरिवरकी मन ठानी इंद्रकी झूँठ सभी जानी। लखी हम
तुम्हरी नादानी ॥ गोकुल राजा नन्दजू जावर कुँवरकन्हाय।
वृथा वचन अब होत तिहारो जनकी करो सहाय ॥ यतनमें नहिं

కట్టుకొని వెనుక దానిని భేదించుకొని వెలుపలరా నేరనియట్లు నేను సామంతుని హృదయమునఁ జిక్కి మరల వెలుపలరా నేరక యున్నాఁడను. అని చెప్పిన విని నామదేవుఁడు జలమును విడిచిన మత్స్యము వలె త్రుళ్లుచుండ సామంతుఁడు ఓ నామదేవా నీమీఁద భగవంతునికి కృపయతిశయించి యున్నది. నీపుణ్యవిశేషముచే కమలలోచనుఁడు నామదేవుఁడు నా ప్రాణసఖుఁడని చెప్పుచున్నాఁడు. నీభాగ్యమేమనవచ్చును. నీమహిమ పండరినాథుఁడే యెఱుఁగునని చెప్పి నామదేవుని పాదములపైఁబడి యానందపరవశుఁడై యుండ నామదేవుఁడు భగవంతునిఁ జూచి నా ప్రాణమునకు ప్రాణమైన కల్యాణగుణాంబుధే యిపుడు నిన్ను నాకు చూపవలయును అని చెప్పి మిగుల సంకటపడుచుండ ఆవచనములను సామంతుఁడు విని భగవంతుని తలంపు నెఱిఁగి తన ఱొమ్మునకు చుట్టుకొని యుండిన వస్త్రమును శీఘ్రముగ విప్పెను. అప్పుడు భక్తవత్సలుఁడగు పాండురంగఁడు నామదేవునికి ప్రత్యక్షమైనతఁడు విఠ్ఠలనాథుని పాదంబులను గట్టిగ పట్టుకొని వెక్కి వెక్కి యేడ్చుచుండ భగవంతుఁడతని నెత్తి ఱొమ్మునననఁచుకొని తన పీతాంబరముతో నతని శోకాశ్రువులను దుడిచి మంచిమాటలను జెప్పి యాశ్వాసము చేసిన వ్వాచు నాతని చేతిని బట్టుకొని తోఁటకు వెలుపల వచ్చి యచట జరిగిన యద్భుతములను జ్ఞానదేవునికిఁ జెప్పి యింకను కూర్మదాసుని దర్శించుటకు పోవుదమని చెప్పి సామంతునిని గూడఁ బిలుచుకొని నలుగురుగఁ బోవుచుండ నచ్చట కూర్మదాసులకు కుడికన్నును, కుడిభుజమును అదర సాగెను. అందుచే అతఁడు నేఁడు భగవంతుఁడు మేలు చేయునని తలఁచుచుండ నానలువురును కూర్మదాసు నెదుట వచ్చి నిలిచి యోయయ్యా యింత కష్టపడి యెచ్చటికి పోయెదవని యడిగిన నతఁడు ఏకాదశియగు నేఁడు పాండురంగనిని సేవింపవలయునని పోయెదను. పూర్వకృతపాపముచే కాళ్లులేనివాఁడనై యుండుటచే అచ్చటికి పోవుటకు సాధ్యపడలేదు. దీనబంధువగు నాదేవుఁడిచ్చటికి వచ్చి దర్శనమిచ్చిన బ్రతికి యుందును. లేనియెడల నా ప్రాణములు నిలువవు అని చెప్పెను. ఇతని వైరాగ్యమునుజూచి భగవంతుఁడు సంతోషించి కూర్మదాసునికి నిజరూపము చూపెను. అపుడు కూర్మదాసుఁడు పెన్నిధానమును బొడగన్న పేదవలె తాపము తీఱి భగవంతునికి సాష్టాంగవందనం బాచరించి పాదములను బట్టుకొని సేవకుఁ డయ్యెను. భగవంతుఁడా పరమభక్తునిని తన హస్తములతో నెత్తి ఱొమ్మునననఁచుకొని సంతోషముతో నీకేమి వరము కావలయును. అడుగుమని చెప్పిన కూర్మదాసుఁడు (శ్రీనాథ నారాయణ వాసుదేవ। శ్రీకృష్ణ భక్తప్రియ చక్రపాణే। శ్రీపద్మనాభాచ్యుత కైటభారే। శ్రీరామ పద్మాక్ష హరే మురారే) అని స్తుతించి భక్తవత్సలా అకించనుఁడును, అనన్యగతియును నగు నాయందు కరుణించి నాకు దర్శనమిచ్చితివి. బ్రహ్మాదులకలభ్యమగు నీలాభమునకన్న నేను ప్రార్థింపవలసిన గొప్పలాభము వేఱొద్ది యులేదు. (శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి। భక్తప్రియేతి భవలుంఠనకోవిదేతి। నాథేతి నాగశయనేతి జగన్నివాసే। త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకుంద) భుక్తిముక్తిదాయకుఁడవైన యో స్వామీ శ్రీవల్లభాది నీనామంబులను సదా నేనాలాపించుచుండునట్లు కరుణించితివేని యదియ నాకు పదికోట్ల వరప్రదానములు. నీనామామృతముతప్ప మరియొక భోగ్యపదార్థమును నేనెఱుఁగను. ఇట్టి నేను నిన్ను ప్రార్థింపవలసిన వరమేమియు లేదు. అయినను అపదార్థమగు నన్ను భక్తుఁడని యభిమానించి జీవన్ముక్తులగు జ్ఞానదేవ, నామదేవ, సామంతుల సమక్షమున నాకొక వరంబొసఁగవలయునని నీవపేక్షించుచుండ వరము నొల్లననుట నాకు ధర్మము కాదు. దేవరచిత్తానుసారముగ నొకవరము వేఁడెదను. (యాన్యాని కర్మాణి కరోతి జంతుః। తాన్యేవ పాపాని భవంతి తస్య)

ఓభగవంతుఁడా మనుజులేయేకార్యములను జేయుచున్నారో యవియన్నియు పాపములుగానే యున్నవి. ఇట్టివారు నిన్నెట్లు తెలిసికొని యుపాసించి యుజ్జీవింతురు. కృపానిధే నాయందలి యనుగ్రహముచే నాకు చూపినయీరూపమును అందఱికిని జూపుచు నిచ్చట వసించి యుండుము. నిజరక్షణమునందన్వయములేని స్తనంధయులకై తల్లియౌషధసేవ చేయునట్లు స్వస్వరూప భగవత్స్వరూపంబుల ననుమతి చితమకుప్రాప్తమగు భగవత్కైంకర్యమును విడిచి యనుతాపశూన్యులై సంసారఘోరసముద్రమున మున్గి లెదరి యెఱుఁగక తాపత్రయంబులచే బాధపడుచుండు సంసారుల తాపనివారణార్థమై నీవిచ్చటవసించి నీనిజరూపదర్శన, నామామృతపానంబులచే బద్ధాత్ములనుద్ధరింపుము. ఈవరముతప్ప నేనన్యమును గోరను. అనివిన్నవించిన భగవంతుఁడతని ప్రార్థన నంగీకరించి యచ్చటసన్నిధిచేసి తనయాశ్రితపారతంత్ర్యమును కూర్మదాసుని పరమభక్తిని ఇప్పటికిని ప్రకటించుచున్నాఁడు. ఈబహుళాపురము పండరిక్షేత్రమునకు సమానమై భక్తజనులచే కొనియాడఁబడుచున్నది. ఆషాఢకార్తికమాసములయందు పండరిపురమునకు పుండరీకవరదుని దర్శనమునకు వచ్చు సాధుజనులుత్సవాంతమునందు బహుళాపురమునకుఁబోయి కూర్మదాసవరదుఁడగు భగవంతునిని దర్శనము చేయుచుండుదురు. ఈక్రమము ధారకపోషకములగు నన్నపానములను స్వీకరించినపిదప భోగ్యమగు చందన,కుసుమ, తాంబూలములను స్వీకరించుటను పోలియున్నదని చెప్పఁదగియున్నది.

భక్తాభీష్టఫలప్రదాయనమః

## పదునేడవయధ్యాయము.

### రాకాచరిత్రము.

పండరిపురమునందు పరమవైరాగ్యశీలుఁడై రాకాయను పేరుగలయొక కుమ్మరవాఁడుండెను. పతివ్రతాశిరోమణియైనయతనిభార్య బాకాయను పేరుగలది. ఈయిరువురికి రూపవతియగు భంగయనునొక కొమార్తయుండెను. వీరలు భాండములు చేసి వ్యాపారము చేయుచు కాలము గడపుచుండిరి. ఇట్లుండ నొకకాలమున భాండములు చేసి కాల్పకయింటిలోఁ చేర్చియుండఁగా నందొకభాండమున నొకపిల్లి తనపిల్లలనునిచి కాపాడుచుండెను. అది యెఱుఁగక రాకా భాండములను బేర్చియావములోఁ పెట్టి నిప్పునంటించెను. అగ్నియెందును వ్యాపించి రగులుచుండఁగా ఆహారము సంపాదించుటకుఁబోయియుండిన పిల్లివచ్చి తనపిల్లలను గానక యావము సమీపమునకువచ్చి కూయుచుండెను. అపుడీరాకా ఆపిల్లి కూయుచుండుటను జూచి కొంతయోచించి దీనిపిల్లలు ఆవములోఁ జిక్కియుండవచ్చును. కానయీపిల్లి యావమును జుట్టిచుట్టి వచ్చి కూయుచున్నది. అని నిశ్చయించి తలను మోదుకొనుచు తనభార్యను జూచి మనకు మహాపాపము సంభవించెను. పిల్లి తనపిల్లలను కుండలోఁ జేర్చియున్నదని తెలియక యీకుండను ఆవములో తక్కినకుండలతో చేర్చి నిప్పునుంచితిమి. ఇప్పుడీపిల్లి యావమును జుట్టిచుట్టి యఱచుచున్నది. దుఃఖమును జూడ సహింపరాదని చెప్పిన ఆస్త్రీ తానును ఏడ్వనారంభించెను. ఇట్లు స్త్రీపురుషులాహారములేక [illegible]ండఁగా రాకా ఆపద్బాంధవుఁడగు పండరినాథుని స్మరించి స్వామీ లాక్షాగృహమున[illegible]నపాండవులను రక్షించినట్లును, హిరణ్యకశిపునిచే నగ్నియందుద్రోయఁబడిన ప్రహ్లాదుని రక్షిం

చినట్టును ఈపిల్లికూనలను పరమకృపచే రక్షింపవలయుననిప్రార్థించి మఱియు భగవంతుని నుద్దేశించి యీమార్జాలశిశువులకు విపత్తునుగలుగఁజేసినయీవ్యాపారమును ఇఁకమీఁద నేను జేయుటలేదు. అబుద్ధిపూర్వకముగసిద్ధించినయాపదనుతొలఁగించిరక్షింపుము - అనిభగవంతుని ప్రార్థించుచు, దేహమునుమఱచి భూమిపైఁబడిపొరలుచు, రోదనముచేయుచుండెను. అతనిభార్యకూడుపున మోదుకొనుచు ఓభక్తవత్సలా! ఆపద్బాంధవా! శీఘ్రముగవచ్చిరక్షింపుమనిభగవంతుని ప్రార్థించుచు నేడ్చుచుండెను. ఇట్లుండ ఆయావము రెండహోరాత్రములు కాలుచుండి మూడవదినము చల్లాఱెను. తోడనే భాండముననుండినపిల్లికూనలు తల్లికంఠధ్వనినివిని కూయసాగెను. ఆశబ్దమునురాకావిని పరమానందమునుజెంది యావమునువిప్పి చూడఁగాఆపిల్లలుండినకుండమాత్రము కాల్లకపచ్చికుండగానేయుండెను. అపుడురాకాఆకుండ నెత్తియందుండినమూడుపిల్లలనుదానితల్లియొద్దవిడిచి శ్రీమత్పండరినాథునికృపకుసంతోషించెను. మూడహోరాత్రములు నిరాహారులై యుండినయీదంపతులకు పిల్లికూనలనుజూచినంతటనించుకయైనను శ్రమతోఁచకముఖమున తేఁటకలిగెను. రాకా (అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా) అని చెప్పితనభార్యనుజూచినాప్రతిజ్ఞాప్రకారముసర్వారంభపరిత్యాగముచేసి నిరుపాధికబంధువగుపుండరీకవరదునిపాదపద్మములయందుభరన్యాసము చేసెదనని చెప్పియారసుండెడి బీదలనుపిలిచి తనసర్వస్వమునుచూఱయిచ్చిభార్యాపుత్రికలతోడనిల్లువిడిచియడవికిఁబోయెను. అచ్చట రెండుపుల్లలు చేరియుండిననెవరో చేర్చియుండవచ్చునని దానినిస్పర్శింపకయొంటిపుల్లలనుయేర్పతెచ్చివిక్రయించినమూల్యముచే జీవించుచు (రథ్యాకర్పటవిరచితకంథః । పుణ్యాపుణ్యవివర్జితపంథాః। యోగీ యోగనియోజితచిత్తః। రమతే బాలోన్మత్తవదేవ) అనురీతినివీధినిపడియుండుగుడ్డపేలికలనుగుట్టికట్టుకొని పుణ్యాపాపవివర్జితమగుమార్గమునవలంబించి చిత్తమును యోగయుక్తముచేసిబాలోన్మత్తులవలెరక్షించుచుండెను.

ఒకనాఁడొకయంగడిసమీపమునవీధినిపడియుండినయొకచింపిగుడ్డనురాకా యెత్తుకొనెను. అదిచూచియొకఁడు ఈగుడ్డదివటీకిపనికివచ్చును. విరక్తులు దీనినెత్తఁదగదనిన నామాటయుచితమనియంగీకరించి యాగుడ్డనచ్చటనేపాఱవైచియొకయొంగిటాకునుమానమునకు మఱుఁగుచేసికొనెను. అనేకులువిరక్తులుండినను ఒకరును ఈరాకాకుసములుకారైరి. ఒకనాఁడితనికొమార్తయగుభంగస్నానముచేసి భగవదారాధనముచేయుచుండనాచెంతనామదేవులకొమార్తె గుడ్డలుగుంజుచుండినందున ఆనీళ్లుఆమెమీఁదచెదరఁగావస్త్రజలమునామీఁదచెదరుచున్నదని చెప్పెను. అదివిని నామదేవులకొమార్తె ఓసిపోవే జాతిలోకుమ్మరదానవయ్యును ఆచారమధికమైయున్నది. కులాచారములనువిడిచివిచ్చలవిడిగతిరుగుచున్నారుగదా. నీతండ్రిసర్వారంభపరిత్యాగముచేసెదనని సంకల్పించియట్లుచేయక కామముచేసంసారయుక్తుఁడై పాండురంగనిమనస్సునకాయాసమును గలుగఁజేయుచున్నాఁడు. మీరునిజముగవిరక్తులరుకారు. అనినవిని భంగ నామదేవులకొమార్తనుజూచి నిజముపలికితివి. మీతండ్రి యేడ్చి యేడ్చి భక్తిని సంపాదించెననియూరంతయు నెఱుఁగును. అర్చావతారసమాధినుండుపాండురంగనినుపద్రవించి మాటాడునట్లును తనతో భోజనముచేయునట్లును నిర్బంధించుచున్నాఁడు. మాతండ్రియట్లేమియు చేయలేదు. పిల్లి... నిమిత్తము సంసారేచ్ఛనువిడిచియడవిలోపుల్లలనునేర్పతెచ్చివిక్రయించినమూల్యముతో దేహయాత్ర[illegible]ను నొకరికినుపద్రవములేకనిష్కాముఁడైజీవించుచున్నాఁడు అనినవిని

యాబిడ్డదుఃఖించుచునింటికివచ్చి తనతండ్రియగునామదేవులతో జరిగినవృత్తాంతమును జెప్పఁగా నతఁడువినియాశ్చర్యపడి పాండురంగనిసన్నిధికిపోయి పాంచజన్యధరునిఁజూచిస్వామీరాకాయనుకుమ్మరవాఁడు సకాముఁడో లేక నిష్కాముఁడోయనియడిగిన భగవంతుఁడుమందహాసముచేసియోనామదేవా రాకావంటినిష్కామనిధిచతుర్దశభువనంబులయందును లేఁడు అనిచెప్పిన నామదేవులుఅట్లైననతనినిరపేక్షత్వమును నాకుపరీక్షించిచూపవలయునని ప్రార్థించిన విఠ్ఠలనాథుఁడు రుక్మిణీదేవిని, నామదేవులను వెంటఁబెట్టుకొనియడవికిఁబోయి రాకాతనభార్యాపుత్రికలతోడపుల్లలనేర్పఱచుటయు, భూమిమీఁదనడచునపుడుజంతువులకుపద్రవములేకభూమినిఁజూచుచుఁదిన్నగనడచుటయునైడతెగకభగవన్నామస్మరణముచేయుచు బాలోన్మత్తపిశాచములవలెవర్తించుటయురుక్మిణీనామదేవులకుఁజూపి యోనామదేవా రాకాయొక్క నిష్కామభజనము చూడుముఅనిచెప్పుచుండరుక్మిణీదేవిభగవంతునితలంపెఱిఁగి తనచేతియమూల్యరత్నకంకణమునురాకా పుల్లలనేర్పఱచుకొనుచుండుచోటనునిచిదానిమీఁదనొకపుల్లనునిచెను. భగవంతుఁడు రుక్మిణీ నామదేవులతోడ లతాగృహంబునమఱఁగియుండఁగా రాకాతనభార్యాపుత్రికలతోడ పుల్లలనేరుకొనుచువచ్చిరత్నకంకణముమీఁదనుంచియుండుపుడకయెత్తిదానిక్రిందనుండిన కంకణమునుజూచెను. తోడనేయాకంకణమునుస్పర్శింపక తనభార్యకుఁజూపి యీయడవి మధ్యమున నేనునిష్కాముఁడనై జీవించుచుండనిందుకువిరోధముగ నీకంకణముగపడెను. అనిచెప్పియేరినపుడకలనెల్లనేలఁబడవైచి యీయడవినివిడిచిభార్యాపుత్రికలతోడ భీతుఁడైపాఱిపోయెను. అపుడు నామదేవులు మిగులనాశ్చర్యపడియిట్టివైరాగ్యనిష్ఠనాకులేదు. నాసంశయముతీరెను. ఇట్టిభక్తునికినీవుదర్శనమునొసంగవలయుననిన భగవంతుఁడు సంతసించి, పాఱిపోవుచుండురాకాకు నిజరూపముతోడ దర్శనమిచ్చిననతఁడుపరమానందమునుజెంది సాష్టాంగ వందనముచేసి భార్యాపుత్రాదులతోడనిలుచుండ, భగవంతుఁడు రాకానుపరమకృపతో కటాక్షించియాలింగనముచేసికొనినామదేవునికై నేనునిన్నుపరీక్షించితిని. నీవుచిత్తమునకలంకమువిడిచియెప్పటియట్లునిష్కామభజనముచేయుచునాకానందమునుగలుగఁజేయుచుండుము. నేనెల్లప్పుడునీహృదయమున్నవసించినీకుసేవయొసఁగుచుండెదనని చెప్పి యదృశ్యుఁడయ్యెను

ఆపద్బాంధవాయనమః.

## ఘోరాకుంభారునిచరిత్రము.

తెరటోకియను గ్రామమునందు ఘోరా కుంభార్ అను పేరుగల మఱియొకకుమ్మరవాఁడుండెను. అతఁడుభగవద్విషయమునపరమభక్తితోఁగూడినవాఁడు. అతఁడుగృహస్థధర్మముతోఁగూడియింటవసించుచు(నైవకించిత్కరోమీతి|యుక్తోమన్యేతతత్త్వవిత్|పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్|ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ నిమిషన్నపి| ఇంద్రియాణీంద్రియార్థేషు|వర్తంత ఇతిధారయన్)అనురీతినివస్తువులనుజూచుచు,శబ్దములనువినుచు, పదార్థములనుతాఁకుచు,అఘ్రాణించుచు,భుజించుచు,నడచుచు,నిద్రించుచు,శ్వాసోచ్ఛ్వాసములుచేయుచు, మాట్లాడుచు,మూత్రపురీషవర్జనముచేయుచు,విషయములనంగీకరించుచు, కన్నులుమూయుచు, తెఱచుచు, నింద్రియములుఇంద్రియవిషయములం[illegible]ంచుచున్నవేగా

నీతనకు దేనియందును అన్యాయము లేదని నిరంతర భగవత్స్మరణ చేయుచు భగవద్గీతయందు చెప్పి యుండు రీతిని త్రిగుణాతీత లక్షణములతోఁ గూడియుండెను. ఒకనాఁడతని భార్య బిడ్డను ఇంటవిడిచి పెట్టి జలము తెచ్చుటకు పోయెను. అపుడు మన్ను త్రొక్కుచుండిన ఘోరాకుంభార్ చిత్తము భగవద్భక్తియందు లయించి యన్యము నెఱుఁగక తనయొద్దకు దోఁగాడుచు వచ్చిన శిశువును మంటితోఁ గలియఁద్రొక్కి భగవన్నామ సంకీర్తనము చేయుచు భగవద్ధ్యానముచే నానందపరవశుఁడై యెప్పటియట్లు మన్ను త్రొక్కుచుండెను. నీళ్లు తేఁబోయిన భార్య వచ్చి పాలిచ్చుటకు నింట బిడ్డని వెదకి కానక భర్తయొద్దకు వచ్చి యా శిశువు మంటితోఁ ద్రొక్కఁబడి రక్తమాంసశల్యములు మంటిలో కలసియుండుటను జూచి బొబ్బలిడుచు మోదుకొని యేడ్చుచు భర్తను జూచి యిది యేమి. విపరీతము చేసితిరి. నేనును ఇపుడే ప్రాణములను విడిచెదను అని ప్రలాపించిన ఆశబ్దము చెవిని ప్రవేశించినంతట స్మరణ వచ్చి భార్యను జూచి యో సిరాక్షసీ కొంచెమైన విచారింపక నాధ్యానమును భంగపఱచి నా హృదయమున వసించు శ్రీరుక్మిణీకాంతుని నిని వెళ్లఁగొట్టితివని చెప్పి పరమసాధువగు తాను (కోపస్య వశ మేషహ) అను రీతిని కోపమునకు వశ్యుఁడై చక్రమును ద్రిప్పు కొయ్యనెత్తుకొని యామెను గొట్టఁబోయెను. అప్పుడా యువతి భయపడి నన్ను మీరు ముట్టకుఁడు. మీకు పాండురంగని మీఁద ఆనయున్నదని చెప్పెను. ఆమాట వినినంతట కొయ్యను పాఱవైచి యొకమూలఁ గూర్చుండి భగవంతుని ధ్యానించుచుండెను. అపుడాయూరివారలందఱును గుమిగూడి వచ్చిరి. అందుఁ గొందఱతని నున్మత్తునిఁగ భావించిరి. మఱికొందఱు సత్పురుషులీమహానుభావుఁడు ప్రపంచాతీతుఁడు. భరతాది పరమయోగులవలె జ్ఞానయోగనిష్ఠచే జడప్రాయుఁడై యున్నాఁడు. నిరుపాధికబంధువై, భక్తవత్సలుఁడై, సర్వశక్తివిశిష్టుఁడైన శ్రీపాండురంగనాథుఁడీ శిశువును బ్రతికించి మూఢజనులచే ఈనుజ్ఞానికి కలిగిన యపవాదమును మాన్పి యితని మాహాత్మ్యము నెల్లరకు ప్రకటనచేయును. మనము పదరనేలయని చెప్పిరి. ఇట్లు వారివారికి తోఁచినట్లు చెప్పి తమతమ యిండ్లకుఁ బోయిరి. ఘోరాకుంభారును అతని భార్యయు నిరువదినాలుగు దినములొకరితో నొకరు మాటలాడక యుండిరి. పిదప ఘోరాకుంభార్ భార్య నేనిట్లుండిన సంసారము నిర్వహించుట కష్టమని చింతించి చెంబుతో నీళ్లు తెచ్చి భర్తకాళ్లను గడుగవచ్చెను. ఘోరాకుంభార్ తనభార్యను జూచి నేను నిన్ను ముట్టఁగూడదని పండరినాథుని మీఁద ఆనయుంచితివి. కాన నన్ను స్పర్శింపకుమనెను. ఆమాట విని యామె శోకాక్రాంతయై పుట్టింటికి వచ్చి తన తల్లిదండ్రులతో జరగిన వృత్తాంతమును జెప్పి వంశవృద్ధికై నాచెలియలి నినాభర్తకిచ్చి వివాహము చేయవలయునని ప్రార్థించిన వారు సమ్మతించి సమస్తపదార్థములను సేకరించి బంధువులను, బ్రాహ్మణులను రప్పించి తమకనిష్ఠపుత్రికను ఘోరాకుంభారునకిచ్చి వివాహము చేసి యల్లునిజూచి యందఱి సమక్షమున మాపుత్రికలిరువురి విషయమున నీవు సమభావముతో ప్రవర్తింపవలయును. అట్లు చేయవేని పాండురంగని మీఁద ఆనయున్నది. అని చెప్పిన విని ఘోరాకుంభార్ మిగుల సంతసించి భగవంతుఁడు కటాక్షించిన బంధములు తమంతట వీడుటకు సందేహము లేదని నిశ్చయించి యత్తమామలను జూచి మీనియమనము చొప్పున నడచుకొనియెదను అని చెప్పి యన్న వస్త్రాదులనిరువురికి సమముగ నిచ్చి యాదరించుచు వారల శరీరములను స్పర్శింపక జాగరూకుఁడై యుండెను. ఇట్లుండ పెద్దభార్య భర్తను జూచి నేను మీహృదయానుసారముగ నడవక పాపినైతిని. నాచెలియలు మీ [illegible] చేసెను. ఆమెను స్పర్శింపకయుండుటకు కారణమేమని యడిగిన ఘోరాకుంభార్ భార్య [illegible] వివాహకాలమున తమపుత్రికలిరువురియందును సమభావముతో ప్రవ

ర్తింపవలయునని మీతల్లిదండ్రులు పాండురంగనిమీఁద ఆనవెట్టిరి. నేను ఆయానకుకట్టువడి మీయిరువురివిషయమున సమభావముతో ప్రవర్తించుచున్నానని చెప్పెను. అదివిని యిరువురును దుఃఖాక్రాంతలై మౌనముగనుండి రాత్రిభర్తనిద్రాపరవశుఁడైయుండునపుడు స్త్రీలిరువురును అతనికిరుపార్శ్వములయందు పరుండియతని చేతులనుతమ వక్షస్థలముననుంచుకొనియుండిరి. అతఁడుభగవధ్యానపరుఁడై యత్యల్పమగు నాహారనిద్రలతోఁగూడియుండువాఁడు కాన తోడనే మేల్కని వీరలునావ్రతమును జెఱచుటకిట్లుచేసిరి. (అంగారసదృశీనారీ। ఘృతకుంభసమఃపుమాన్। తస్మాన్నారీంనరోదృష్ట్వా। దూరతఃపరివర్జయేత్) అనఁగా పాలఁతిదావవహ్ని, పురుషుఁడాజ్యఘటంబుకాన విరక్తుఁడగుపురుషుఁడు స్త్రీనిదూరమునందేపరిత్యజింపవలయును. ప్రమాణమును గమనింపకవీరలతోఁగూడి వర్తించినందున నాకీదురవస్థకలిగెను. అని చెప్పితనరెండుచేతులను ఛేదించుకొనెను. అపుడాస్త్రీలేడ్చుచుదైవమును దూరుచుతమభాగ్యహీనికి వగచుచుసంకటపడుచుండిరి. అదిచూచిఘోరాకుంభార్ మీరిట్లుదుఃఖింపకుఁడు. ఆశ్రితకల్పతరువగు రుక్మిణీకాంతుఁడుండ మనకేమిటనుకొఱఁతలేదు. మీరుత్రికరణములను వానికర్పింపుఁడు. అని హితోపదేశముచేసి ఘోరాకుంభార్ భగవన్నామస్మరణచేయుచుండెను. ఇట్లుండ ఆషాఢశుద్ధైకాదశిరాఁగా ఘోరాకుంభార్ తనభార్యలిరువురిని బిలుచుకొనిపండరిపురమునకువచ్చి చంద్రభాగలోస్నానముచేసి క్షేత్రప్రదక్షిణముచేసి గోపురద్వారమున దండము పెట్టి యాలయమునప్రవేశించి యాశ్రితనిక్షేపమగుపండరినాథునినాలింగనముచేసికొనిధ్వజస్తంభము వద్దకువచ్చెను. అచ్చటనామదేవుఁడానందముతోడ నృత్యముచేయుచుండెను. పండరినాథుఁడు నామదేవునికంటికిమాత్రము దర్శనమిచ్చుచు తానునునృత్యముచేయుచుండెను. నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవులును సామంతాదిభక్తులును గూర్చుండి యానందముతోడ భగవత్కీర్తనమును వినుచుండఁగా నామదేవులుచేతినిపైకెత్తి యందఱినిలేచినిలుచుండుఁడని చెప్పినవారట్లుచేసిరి. అపుడు నామదేవులందఱి చేతులకునొక్కొక్కతాళమునిచ్చిన వారలు తాళముతట్టుచు నామస్మరణముచేయుచు ఆనందపరవశులైయుండిరి. ఘోరాకుంభార్ తానును అందఱివలెతాళముతట్టుచు హరికీర్తనముచేయుటకు చేతులులేకపోయెనేయని వ్యాసనపడుచుండ కృపానిధియగు శ్రీరుక్మిణీకాంతునికటాక్షముచేత తత్క్షణముననునుపటివలెచేతులుకలిగెను. ఘోరాకుంభార్ దీనదయాళువగు పాండురంగని కృపనుగొనియాడి యందఱివలె తానును తాళముతట్టుచు భగవంతునికీర్తించుచుండెను. అప్పుడచ్చటికివచ్చియుండిన భగవద్భక్తులందఱాశ్చర్యపడుచుండ ఘోరాకుంభార్ భార్యలు భగవంతునుద్దేశించి జగజ్జీవనా! భక్తవత్సలా! దీనబంధూ! మాయందుకృపచేయుము, అనినభగవంతుఁడు వారితలంపెఱింగి ఘోరాకుంభారుచేత్రొక్కఁబడిన శిశువునుజంకనిడుకొనిరుక్మిణీదేవి వెంబడింపప్రత్యక్షమై యందఱును జూచుచుండ ఆశిశువునుదాని తల్లిచేతికిచ్చెను. అపుడు జగజ్జననియగురుక్మిణీదేవి పరమవైరాగ్యశీలుఁడగు ఘోరాకుంభారునుజూచి నీభార్యయమ్మయు భగవంతునిమీఁదనుంచిన యానయింకమీఁదనీకులేదు. ఇఁకను నీవుసుఖముగవీరిద్దరితోడ గృహస్థధర్మమునుజరపుచు వస్తుధ్యానించుచుండుము అనియనుగ్రహించిన అందఱును ఘనులసంతోషించిరి.

సంకటహరణాయనమః.

# పదునెనిమిదవయధ్యాయము.

## నామదేవులుసదాచార్యునాశ్రయించుచరిత్రము.



భగవంతుఁడు రుక్మిణీసమేతముగ ప్రత్యక్షమై తన్ననుగ్రహించి యదృశ్యుఁడైనపిదః
ఘోరాకుంభార్ అచ్చటనుండినభక్తులకువందనముచేసి భాగవతోత్తములారా మీరందఱు
నాయింటికి విజయంచేయవలయుననిమిగులప్రార్థించినవారలుసమ్మతించియతనియింటికి వచ్చిరి
ఇట్లువచ్చినవారలను ఘోరాకుంభార్ సర్వోపచారములతోఁబూజించి భుజింపించి యుచిత
లమునఁగూర్చుండఁబెట్టి చందనకుసుమతాంబూలాదిమంగళద్రవ్యంబులనిచ్చి యుపచరించెను
అపుడు నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవులు ముక్తాబాయి, సామంతుఁడు, నామదేవులు మొ
దలయిన పరమభక్తులు (బోధయంతఃపరస్పరం) అనురీతిని ఈశ్వరకల్యాణగుణగణములొక
రికొకరు చెప్పుకొనుచు నానందించుచుండ జ్ఞానదేవులు ఘోరాకుంభారునుజూచి సాధుజనా
గ్రేసరా యీఘటములను వరుసగఁగూర్చుండఁబెట్టితివి. నీవుకుండలనుజేయువాఁడవు. కాన ఈ
ఘటములలోఁబరిపక్వ ఘటములను, అపరిపక్వ ఘటములను పరీక్షించిచెప్పవలయునని యడిగి
న వారిచతురవచనములకు ఘోరాకుంభార్ సంతసించి ఓస్వామీసంసారులకుపయోగముగు సా
ధారణమృద్ఘటములతారతమ్యమునాకు తెలియును. చేతనకర్మానుగుణముగసర్వేశ్వరునిచే సృ
జింపఁబడినపాంచభౌతికఘటములయొక్క తారతమ్యములనునెఱిఁగిచెప్పుటకు అజ్ఞుఁడనగు నే
నుసమర్థుఁడనుకాను. అయినను దేవరవారినియమనమును నాశిరసావహించియథాశ్రుతము
గవిన్నవించెదను. బిడ్డలపలుకులను తల్లిదండ్రులుముద్దుచేసికొనునట్లు అశ్రోత్రియుఁడనగు నా
మాటలను శ్రీమత్పాండురంగని ప్రాణపదమైకీర్తికెక్కియుండు భాగవతులెల్లరు ముద్దుచేసి
కొనవలయునని ప్రార్థించెదను. లోకమునఉపాదానకారణము, నిమిత్తకారణము, సహకా
రికారణము అనునీమూఁడుకారణములు చేరియొకకార్యముకలుగవలయును. మృద్ఘటమునకు
మన్ను ఉపాదానకారణము. కులాలుఁడునిమిత్తకారణము. దండచక్రతీవ్రాదులు సహకారి
కారణము. జగత్తునకీశ్వరుఁడు తానేత్రివిధకారణమైయుండును. ఎట్లనిన చిదచిద్విశిష్టవేషము
చే ఉపాదానకారణమై, సంకల్పవిశిష్టవేషముచే నిమిత్తకారణమై, జ్ఞానశక్త్యాదివిశిష్టవేషము
చేసహకారికారణమై, కార్యవర్గమును ఈశ్వరుఁడుసృష్టించెను. ఇట్టిసర్వేశ్వరసృష్ట్యంతర్భూ
తమైన చేతనపరిగృహీతమగుపాంచభౌతికఘటములతారతమ్యములు జగన్నిర్మాణముచేసిన
సిద్ధకులాలుఁడగుశ్రియఃపతికిని, సర్వజ్ఞులరగుదేవరబోటివారికిని తెలియునేగాని మందప్రజ్ఞుఁడ
గునాకెట్లుతెలియును. అయినను ధనుర్వేదపారంగతుఁడగునొకపురుషునిమంత్రశక్తిచే తృణ
ము బ్రహ్మాస్త్రమగునట్లుదేవరవారియనుగ్రహబలముచే నేనీఘటములనుజంకకపరీక్షించెదను. అని
చెప్పి తానుభాండమునుతట్టుపలకనెత్తుకొనియచ్చటపఙ్క్తిగఁగూర్చుండియుండుపరమభాగవ
తులశిరములమీఁద గట్టిగనొక్కొక్కదెబ్బకొట్టుచురాఁగా అందఱును అనవరతభగవద్గుణా
నుభవశీలులై, ప్రపంచాతీతులైనపరిశుద్ధాంతరంగులుకాన వీరిదెబ్బను పాటింపక భగవదను
భవమునచొక్కి మౌనముగనుండిరి. నామదేవులు భగవద్భక్తియందు అందఱికిని మేలుబంతి
యై యుండియును గురుకులవాసముచేయమిచేనఖండజ్ఞానమించుకకొఱఁతవడియుండినందున
తన్నుఁగొట్టవచ్చినఘోరాకుంభారునుజూచి నన్నేలకొట్టెదవని వెనుకకొదిగెను. అదిచూచి

ఘోరాకుంభార్ ఈబంతియందు ఇదియపక్వఘటమనిజ్ఞానదేవులతోఁజెప్పెను. అపుడీశ్వరవిభూతియగు ప్రాణికోట్లయందెవ్వరికిని అవమానము చేయఁగూడదను గౌరవాభిప్రాయముగల భాగవతులందఱు నామదేవులహితమునుగోరి వానికవమానముకలుఁగవలయునని గట్టిగనవ్విరి. ముక్తాబాయినవ్వుచులేచి యిదియపక్వభాండమని తెలిసిచెప్పితివిగాన నీవుభాండపరీక్షయందు మిగుల సమర్థుఁడవని ఘోరాకుంభారును స్తుతించెను.

అపుడు నామదేవులుమిగుల చింతాక్రాంతులై శీఘ్రముగపాండురంగనిసన్నిధికివచ్చి స్వామికివందనముచేసియంజలిహస్తుఁడై శోకాశ్రువులనువిడిచియేడ్చుచుస్వామీ! నేఁడునేనుమిగులనవమానమునుజెందితిననిన భగవంతుఁడు మందస్మితముచేసి నామదేవునిని ఔమ్మనవంచుకొని నిన్నెవరేమిచేసిరి. నీవు నాప్రాణసఖుఁడవగుటచే దాఁచకనిజముచెప్పుమనిన నామదేవులు ఘోరాకుంభారునియింట జరగినవృత్తాంతమును సవిస్తరముగ విన్నవించెను. అదివిని జగన్నివాసుఁడు నామదేవా! ఘోరాకుంభార్ నిజమునుజెప్పెను. జ్ఞానదేవాదిభాగవతులందఱు నీమేలుఁగోరి నీకునస్సునశోచనము కలుగవలయునని నవ్విరేకాని నిన్నవమానింపవలయునని నవ్వినవారుకారు. నీవునొకసద్గురువునుఆశ్రయించి పక్వముకావలయుననిన నామదేవులు నాదుఃఖమును దేవరవారిసన్నిధిలోనే తీర్చుకొనవలయునని వచ్చితిని. బావిత్రవ్వఁబోయినచోట భూతములయలుదేరెనన్నట్లు నీవును జ్ఞానదేవాదులవలె నన్ను అపక్వఘటమనిచెప్పుచున్నావు. నీవిట్లునన్నుబాలువిడిచిన నాకొఱంతను నేనెవరితోఁజెప్పుకొందును అనిన భగవంతుఁడుపుష్పమును దానిపరిమళమును అభేదమైయుండునట్లునీకునునాకును భేదములేదు. కాననీవుశోకింపకుము. జ్ఞానానుష్ఠానసంపన్నుఁడగు సదాచార్యునాశ్రయింపుము. నాకుపాండురంగఁడు స్వాధీనుఁడైయుండుటచే వేఱొకయాచార్యుఁడేల యనితలఁపకుము. ఆయాచార్యస్వరూపమును కొంతవివరించెదను. శ్రద్ధతోడవినుము. (ఆచినోతిహిశాస్త్రార్థాన్ । ఆచారేస్థాపయత్యపి । స్వయమాచరతేయస్తు । ఆచార్యస్సోభిధీయతే) అనఁగాతాను శాస్త్రార్థములను జక్కఁగపరిశీలించి తనజ్ఞానానుష్ఠానములచే శిష్యులకు సదాచారమును కలుఁగఁజేయువాఁడాచార్యుఁడనఁబడును. అనాదికాలముగ భగవద్విముఖుఁడై బద్ధసంసారియైనచేతనుని నిత్యసూరులతోఁజేర్చుటకు సర్వశక్తివిశిష్టుఁడగు నీశ్వరునికిశక్యమేగాని యితరులకు శక్యముగాదు. లోకమునజ్ఞానానుష్ఠానసంపన్నులై చేతనోజ్జీవనకాములగువారీశ్వరావేశముచే ఆచార్యత్వమును నిర్వహించెదరు. అగ్నితప్తమయ్యును వెలిగారపుసంబధంములేక బంగారము కరఁగనియట్లు నీవునన్నాశ్రయించియుండినను ఆచార్యసంబంధములేక పరిపక్వముకానేరవు. ధర్మసంస్థాపనార్థమునేను జేసినరామకృష్ణాద్యవతారములయందువసిష్ఠసాందీపప్రభృతులయెడల శిష్యభావమునుజెందియుపాసించుటను వినియెుఁగవే. సంసారసంబంధములేని నాకు గురుకులవాసమనావశ్యకమైనను (యద్యదాచరతిశ్రేష్ఠః । తత్తదేవేతరోజనాః) అనురీతిని శ్రేష్ఠులయాచారమునితరజనులనుసరింతురు. కాన గురుకులవాసమత్యావశ్యకమనుటను నేనేయనుష్ఠించిచూపితిని. కాన నాయనుమతిని సదాచార్యునాశ్రయింపుము. అట్లుచేయవేని జ్ఞానదేవాదులవలెనీకు అఖండజ్ఞానము సిద్ధింపదు. అదిసిద్ధింపకగాని మోక్షార్హుఁడవుకానేరవు. [illegible] టలకునాయాటలు సరిపోవవలసివచ్చునని చెప్పినభగవంతునివాక్యములనువిని నామదేవులు [illegible] మినిడాచి (అసంతవిహాత్రహిసంభవంతి । హాసంతికాయామివహవ్యవాహః । అత్రై)[illegible]

లోయదిసంభవంతి । తత్రై ।వలాభస్సరసీరుహాణాం) అనురీతిని అసత్తులేవుట్టుచుండెడి యీ లోకమున నొకసత్పురుషుఁడుకలఁగుట కుంపటియందు తామరపుష్పించుటకు సదృశమైయున్నది. కాన జ్ఞానానుష్ఠానసంపన్నుఁడై స్వపరోజ్జీవనమునందు కుశలుఁడగు నాచార్యుఁడు సిద్ధించుటదుర్లభము కానఓస్వామీ! యట్టిగురువును నీవేనిశ్చయించి నాకుచూపుమనిన భగవంతుఁడు సంతోషించి వీసోబాకేశుఁ డఖండజ్ఞానపరిపూర్ణుఁడు, నీవతనినాశ్రయించిన నిన్నుతనవలెజేయును. కాన నతనియొద్దకుఁబోయియుపదేశమునుజెందిరమ్మని నియమించిన నామదేవులు భగవదాజ్ఞనుశిరసావహించి వీసోబాకేశుఁడు నాగనాథస్వామిసన్నిధినున్నాఁడని విని యచ్చటికిపోయెను. అపుడచ్చట వీసోబాకేశుఁడు రెండుకాళ్లను లింగాకృతియగు నాగనాథస్వామిపైనుంచుకొని నిద్రించుచుండెను. అదిచూచి నామదేవులసహ్యపడియీయామన్మత్తుఁడు శివలింగముపై కాళ్లుంచుకొనియున్నాఁడు. ఇట్టి జడప్రాయునిని జ్ఞానానుష్ఠానసంపన్నుఁడని శ్రీపాండురంగఁడు వీనియొద్దకునన్నుపంపెను. అయినను ఆతురపడక యితనిభావమును పరిశీలించెదను. అనిచెప్పి చేయితట్టి యతనిమేల్కొలిపియిదియేమి విపరీతము. సత్పురుషులచే సాధువనికొనియాడఁబడునీవు భగవంతునితలమీఁద కాళ్లుంచుకొని నిద్రించుకారణమును జెప్పవలయుననిన అతఁడునామదేవులనుజూచి నిద్రాపరవశుఁడనై యవివేకముచే తప్పుచేసితిని. నేనుస్థూలకాయుఁడను. కాన నాశరీరము నాకు స్వాధీనపడదు. నామీఁదదయయుంచి స్వామిమీఁదనుండునాకాళ్లనెత్తి స్వామిలేనిచోటనుంచుమని ప్రార్థించెను. అపుడు నామదేవులు మంచిదనిసమ్మతించి తనచేతులతో నతనికాళ్లనెత్తి క్రిందనుంచఁబోయిన నచటనొకలింగముండెను. నామదేవులాశ్చర్యపడి యతనికాళ్లను మఱియొకస్థలముననుంచఁబోయెను. ఎంచుఁజూచినను లింగములుగానేయుండెను. ఇదియేమివింతయనియాయాలయమునంతయును జూడఁగా లింగములేనిచోటు కొంచెమైననులేకయుండెను.అన్నివస్తువులును లింగములుగానే యుండెను. తన్నుజూచిన తానునొకలింగముగానుండెను. తోడనే నామదేవులతనికాళ్లనువిడిచిపెట్టిదేవరవారిపాదస్పర్శముచేసర్వముభగవత్స్వరూపమైతోఁచెను.ఇఁకనుదేవరవారి వాగమృతమునావీనులసోఁకిన నఖండజ్ఞానపరిపూర్ణుఁడనై సంసారాంబుధినిదాఁటుదుననుటకు సంశయములేదు.దేవరవారిజ్ఞానపూర్తిసర్వజ్ఞుఁడగుపాండురంగని కెఱుకయేగానియజ్ఞుఁడనగునాకు తెలియదు.అనివిన్నవించిన వీసోబాకేశుఁడునామదేవులనుజూచియోవైష్ణవశిఖామణీ! జీవాత్మ ప్రాకృత శరీరమునవ్యాపించియుండునట్లుసర్వేశ్వరుఁడు సమస్తచరాచరంబులను తనకుశరీరముగాఁజేసికొని తాననిటనువ్యాపించి శరీరియైయున్నాఁడు.మనుజులు నేను బాలుఁడను, వృద్ధుఁడను,అంధుఁడను,కృశుఁడనుఅనివ్యవహరించుచున్నారు. నేనుఅనుపదమునకుర్థ్యుఁడు శరీరగతుఁడగు జీవాత్మయైయున్నాఁడు. బాల్యత్వ, వృద్ధత్వ, అంధత్వ, కృశత్వములు శరీరగతధర్మములేగాని యాత్మకుసంబంధములేదు. అట్లుండశరీర,శరీరిసంబంధముచే శరీరగతధర్మములను శరీరియందారోపించి నేనుబాలుఁడను ఇత్యాదిరీతిని వ్యవహరించుచున్నారు. ఈరీతి నిసమస్తచేతనాచేతనములను భగవంతుఁడు శరీరముగపరిగ్రహించియుండుటచే అఖండజ్ఞానియెందును భగవంతునిదర్శించుచుసర్వముభగవంతుఁడే చేయుచున్నాఁడని యనుసంధింపవలయును. ఇట్టినిశ్చయజ్ఞానముకలిగినవానికి రాగద్వేషములకవకాశములేదు. (ఈశ్వరస్సర్వభూతానాం । హృద్దేశేర్జునతిష్ఠతి । భ్రామయన్సర్వభూతాని। యంత్రారూఢానిమాయయా)

అనఁగా సర్వభూతహృదయాంబుజవర్తియగునీశ్వరుఁడు సూత్రధారిబొమ్మలనాడించునట్లు సమస్తభూతములను భ్రమింపఁజేయుచున్నాఁడని బ్రహ్మవిద్యయగు భగవద్గీతచెప్పుచున్నది. సూత్రధారిచేయుకార్యములను బొమ్మలుఁ చేయుచున్నవని చెప్పుమూఢునివలె అంతర్యామియగు సర్వేశ్వరుఁడుచేయించు కార్యములయందు ప్రాణులుకర్తలనితలఁచువారు అజ్ఞులగుదురు. కొంతసేపెండలోనిలిచి సూర్యునిఁజూచుచుండినపురుషునిదృష్టికితరవస్తువులు గోచరింపనియట్లు బ్రహ్మనిష్ఠుఁడై బ్రహ్మానుభవముచేయువానిదృష్టికితదితరముగోచరింపదు. జ్ఞానదేవుల కటాక్షముచే నాకిట్టియఖండజ్ఞానములభించెను.నీవుశ్రీపాండురంగని నియమనముచే నిచ్చటికివచ్చితివి. కాననీదృష్టికి సర్వముభగవత్స్వరూపమైతోఁచెను. ఈజ్ఞానమును నీహృదయమున దృఢముగ నవలంబించివ్యవసాయముచేసితివేనినీదృష్టికిసర్వమునుపాండురంగనాథస్వరూపమైయుండును అనివిసోబాకేశుఁడుపదేశించిన నామదేవులానందపరవశులై (స్థితోస్మిగతసందేహః। కరిష్యేవచనంతవ) అని విన్నవించిదండవత్ప్రణామముచేసెను. విసోబాకేశుఁడు లేచితనహస్తమును నామదేవునిశిరముపైనునిచి యఖండపరబ్రహ్మస్వరూపమును విశదతమముగనుపదేశించి యనుగ్రహించి పంపెను. పూర్వము పాండురంగని దివ్యమంగళవిగ్రహమునమనసులయించితదితరమును జూడలేక పాండురంగని క్షణకాలవిశ్లేషమును సహింపకయుండిన నామదేవులు విసోబాకేశునియుపదేశమనుబీజమును తనహృదయక్షేత్రమున నాటి పాండురంగని కటాక్షామృతమనెడిజలమును పార్చిమననరూపవ్యవసాయముచేయుటచే సమస్తచేతనాచేతనములు శ్రీపాండురంగస్వరూపమైతోఁచెను. స్వయంవరకాలమున నలునిచెంతనలరూపమును పరిగ్రహించికూర్చుండియుండినదిక్పాలకులనుజూచి వారలలో నిజమగునలుని నేర్పరింపనేరకయుండినదమయంతివలె సదాచార్యోపదేశముచే నామదేవులకు సమస్తచేతనాచేతనములుశ్రీపాండురంగనాథునిదివ్యమంగళవిగ్రహములై తోఁచినందున అందునిజమగుపుండరీకవరదుని దివ్యమంగళవిగ్రహము నేర్పరింపనేరక భక్తజనులతోఁగూడి పరిపూర్ణానందమునననుభవించుచుండెను. అపుడు భక్తవరదుఁడగు పుండరీకవరదుఁడాగోష్ఠికివచ్చి నామదేవులనాలింగనము చేసికొని శిరంబుమూర్కొని యోవత్సా! గురూపదేశమును జెందినపిదప నేలనాయొద్దకురావైతివనియడిగిన నామదేవుఁడంజలిహస్తుఁడై ముందునిన్ను భీమనదీతీరమున నిటికతాలిపై నిలుచుండువానిఁగాఁజూచుచుంటిని.ఇపుడు సద్గురూపదేశముచే జ్ఞానదీపములభించి యజ్ఞానాంధకారముతొలఁగి పోయినందున సమస్తచేతనాచేతనములు నీమూర్తివిశేషములుగా నగపడుచున్నవి. కాననేనెందుండినను నీసన్నిధినేయున్నవాఁడను. దేనిఁజూచినను నీరూపమునేచూచుచున్నాను. ఏమినుడివినను నీనామమునేనుడువుచున్నాను. ఏమితలఁచినను నిన్నేతలఁచుచున్నాఁడను. ఏమిచేసినను నీపనులనేచేయుచున్నాఁడను. (నారాయణైకనిష్ఠస్య। యాయాచేష్టాతదర్చనం। యోయోజల్పస్సతుజపః। తత్ధ్యానంయన్నిరీక్షణం) అనునిష్ఠవిసోబాకేశుని యనుగ్రహముచేనాకు సిద్ధించెను. ఇపుడు నాజన్మంబు సఫలంబయ్యెను. పురుషోత్తమా!యిఁకను నాకేమిటను కొఱఁతలేదు. నాకుసర్వంబును నీవేసంఘటించితివి. అయిననొకవరంబువేఁడెదను. జితేంద్రియులలో ప్రధానుఁడగునర్జునుండు (చంచలంహిమనఃకృష్ణ। ప్రమాథిబలవద్దృఢం। తస్యాహంనిగ్రహంమన్యే।వాయోరివసుదుష్కరం) అనఁగాఓకృష్ణా! మనసుచంచలమై,క్షోభపెట్టునదియై,నిగ్రహింపశక్యముకానిదై, దృఢమైయున్నది. వాయువునుబట్టుకొనుట

చేసికొనుటకు సాధ్యపడనట్లు మనసును వశ్యముచేసికొనుట దుష్కరమనితలంచెదను. అని దుఃఖించెనుగదా. అట్లుండనింద్రియకింకరుండగునాకిట్టిమనసెట్లు సాధ్యపడును.అనాదికాలము గ నీవిషయమున విముఖుండనై యుంటినిగాననిప్పుడుకలిగినయాభిముఖ్యము నిలుకడగా నుండు ననినమ్మను. కావున ఓదీనదయాళో! ఆచార్యానుగ్రహముచే నిపుడు నాకుసిద్ధించినజ్ఞానదీపము ను నీకృపయనునాజ్యముచే వర్ధిల్లఁజేయుము. ఇదియెనాప్రార్థన. అనివిన్నవించిన భగవంతుం డు సంతోషించి నామదేవునిచేతినిబట్టుకొని సకలసాధుజనులను జూచియోసాధువులారా! యిపుడు నానామదేవునిని అపక్వమగుఘటమనియెవ్వరైనను జెప్పఁగలరాయనియడిగెను. అం దుకు జ్ఞానదేవులుమొదలగువారు నవ్వుచు శిరఃకంపముచేసిరి.

సర్వ్వదూపాయనమః.

---

## స్పర్శభాగవతునిచరిత్రము.

పండరిపురమునసదాభగవద్భజనచేయుచు నొకభాగవతుఁడువసించుచుండెను. అతని భార్యపేరు కమలాబాయి.వీరిరువురుశ్రీరుక్మిణీదేవినిఆరాధించుచురాఁగా నొకనాఁడు ఆదేవి ప్రత్యక్షమైనీకేమివరముకావలయునని యాభాగవతునినడుగఁగా అతఁడుఓజననీనేను సంసా రనిమిత్తముగా నొకప్పుడును కష్టపడకుండునట్లు కృపచేయవలయుననియడిగెను. అప్పుడురుక్మి ణీదేవియొకస్పర్శవేదినిచ్చి దీనితో ఇనుమునుస్పర్శింపించిన నదిబంగారమగును. దానిమూలము గానీవుజీవింపవచ్చునని చెప్పి యదృశ్యయయ్యె. ఆభాగవతుఁడాస్పర్శవేదిని తెచ్చి [illegible] తన భార్యచేతికిచ్చి దానిమహిమనుజెప్పియీరహస్యమునొకరికిని జెప్పక దీనిని భద్రముగనుంచుకొ నుము. సాధువులకుఁదెలిసిన నన్నుబరిహసింతురనిచెప్పి యేకాంతముగ ఇనుమును బంగారము చేసి దానిమూలముగనిష్టమగుపదార్థంబులననుభవింపుచు లోకులకు మర్మమును అగపడుపక దరిద్రునివలెను, వైరాగ్యశీలునివలెను నటించెను. స్పర్శవేదిచే నితనికి స్పర్శభాగవతుఁడని ప్ర సిద్ధికలిగెను. అట్లుండనొకనాఁడు కమలాబాయి చంద్రభాగకుపోయి జలముతీసికొనివచ్చున పుడు నామదేవులభార్యయగు రాధాబాయిచూచియిదిగోనేనునుజలము తీసికొనివచ్చెదను. ఇం చుకనిలువుమనిచెప్పి ఘటముతోనీళ్లుముంచుకొని కమలాబాయితోడ కలిసికొనియిరువురుగవ చ్చునపుడుపరస్పరము తమతమగృహకృత్యములనుజెప్పుకొనుచువచ్చిరి.కమలాబాయిరాధాబా యినిజూచి యోసఖీ!మీరేలయన్నవస్త్రములకుఁగష్టపడియెదరు.అనియడిగిన నాభర్త యితర చింతలేక పండరినాథుఁడే గతియనియున్నాఁడు. అతనినమ్మినమేమేమి చేయవచ్చునని రాధా బాయిచెప్పెను.అదివిని కమలాబాయి నీపెనిమిటిశ్రీపండరినాథునిని సదాధ్యానించుచున్నాఁడే. అతఁడు మీకేమియునియ్యలేదా. ఫలమియ్యని వృక్షమునకు నీళ్లుపోసిపెంచియేమి ప్రయోజ నము. జీవనమునకేమియునీయనివానినేలవ్యర్థముగభజింపవలయును. నాభర్త రుక్మిణీదేవినుపా సించిన ఆజగజ్జనని ప్రత్యక్షమైయొకస్పర్శవేదినిచ్చెను. దానినుంచుకొని మేము బంగారముచేసి విక్రయించికాలక్షేపముచేయుచున్నామనెను. తోడనే రాధాబాయియాస్పర్శవేది యెట్లుం డును.దానినినాకుచూపుమనిన ఓరాధాబాయీ! నీవుమాయింటికివచ్చితివేని దానినినీకుఁజూపెద ననికమలాబాయి చెప్పెను. అపుడురాధాబాయి తనయింటికిపోయి నీళ్లకుండ[illegible]దించిపెట్టి

प्यारी । कहा कहूँ कछु कहत न आवे तिहारो मुख देख चन्दा रयोहै लजाई प्यारी ॥ १६९ ॥

## राग बिहाग ।

यह कहिके प्रिय धाम गई ॥ चौंक परे हरि जब यह जानी अब यह कहा भई ॥ दोष न होय कछू सखि मेरो उपमा चंद दई । प्रेम न भरी नख शिखलौं प्यारी यौवन गर्व मई ॥ लावो मनाय सखीरी यामिनि जात बही । पुरुषोत्तम प्रभुकी छबि निरखत लावो वेगि सही ॥ १७० ॥

## राग गौड़मलार ।

वृषभानु कुँवरि जब देखों। तब जन्म सफल करि लेखों॥ मैं राधा राधा गाऊँ । राधा हित वेणु बजाऊँ॥ मैं राधारमण कहाऊँ। काहे दूजा नाम धराऊँ॥ जहँ राधा चर्चा कीजै । तहँ प्रथम जान मोहिं दीजे॥ जहँ राधा राधा गावैं । तहँ सुनबेको हम आवैं ॥ श्रीराधा मेरी सम्पति । श्रीराधा मेरी दम्पति ॥ श्रीराधा मेरी शोभा । श्रीराधाको चित लोभा ॥ मैं राधाके संग नीको । राधा बिन लागत फीको ॥ १७१ ॥

## राग खेमटा ।

देखी कहूँ गलिनमें मो प्राण जीवनी । एहो सुजान प्यारी हम चूक क्या विचारी क्यों दुरगई लतनमें दे दर्श आनन्दनी॥ जब चलत चाल छबिसों तब हलत हार उरसो ठुम ठुम चरन धरन पै तू गति गयन्दनी ॥ तेरी छटा चरणकी निंदत रवी करणकी हाहा कुँवारि किशोरी तू है सुख समूहनी । यह सुनत वचन मेरो पाषाण द्रवत हेरो हित रूप लाल तेरो एहो दुख-निकन्दनी ॥ १७२ ॥

విత్తమును నేను అపహరింతుననియెను.నీవునాహితవచనంబులనుజింతించినిజముగవైరాగ్యశాలి వికమ్ము. స్పర్శవేదిచింతవిడువుము అనిచెప్పిననామదేవులహితోక్తులనాదరింపక స్పర్శభాగవతుఁడు నీయుపదేశముచాలును.మడుగునకువచ్చినాస్పర్శవేదిని నీటిలోవెదకియెత్తియిమ్మనికఠినముగపలికిననామదేవుఁడట్లుచేసెదనని చంద్రభాగకువచ్చి నీటిలో దిగిరెండుచేతులతో రాళ్లనెత్తియిందునీస్పర్శవేదిని నెత్తుకొమ్మనిచెప్పెను. అపుడారాళ్లన్నియును స్పర్శవేదులై యుండెను.అదిచూచియందఱును ఆశ్చర్యపడిసమలోష్టాశ్మకాంచనః) అనఁగా పెంకును,బంగారమును గుణాతీతునికితుల్యమైయుండుననుగీతావచనము నేఁడుమననామదేవులవిషయముననసుభవసిద్ధమయ్యెనుఅనియొకరికొకరు చెప్పుకొనుచుండిరి. ఈవింతనుజూచినంతట స్పర్శభాగవతునికినామదేవులయనుగ్రహముచే జ్ఞానోదయమై యోస్వామీ నాకుజ్ఞానోపదేశముచేసి యనుగ్రహింపుమనిప్రార్థించెను. నామదేవులుసంతసించి తనచేతిరాళ్లనుచంద్రభాగలోపాఱవైచి స్పర్శభాగవతునికఖండజ్ఞానమునుపదేశించెను.

శ్రీముకుందాయనమః.

---

## పందొమ్మిదవయధ్యాయము.

## జగన్మిత్రనాగనాధునిచరిత్రము.

---

వైద్యనాధమనుపట్టణముననాగనాధుఁడనునొకభాగవతుఁడు బ్రాహ్మణకులమునజనించి (శమోదమస్తపశ్శౌచం।క్షాంతిరార్జవమేవచ।జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం।బ్రాహ్మంకర్మస్వభావజం) అనుగీతావచనప్రకారము శమదమాదికల్యాణగుణసంపన్నుఁడైవిష్ణుభక్తియుక్తుఁడైయుండెను. అతఁడుకుటుంబికావుననూరిలోనుంఛవృత్తిచేసి జీవించుచునహోరాత్రముభగవన్నామ సంకీర్తనముచేయుచుండెను. ఆయూరిప్రజలువీరికీర్తనలను మిగులప్రీతితోడవినియితఁడుసాక్షాత్పాండురంగనియవతారమనికొనియాడుచుండిరి.ఇతఁడుతననుగుణములచేనందఱికినిమిత్రుఁడైయుండినందుననితనికి జగన్మిత్రనాగనాధుఁడని పేరుప్రఖ్యాతమయ్యెను(వసతి హృదిసనాతనేచవిష్ణౌ।భవతిపుమాన్।జగతోస్యసౌమ్యరూపః।క్షితిరసమతిరమ్యమాత్మనోంతః । కథయతిచారుతయైవసాలపోతః) అనఁగానొకసాలవృక్షముతానుండుభూమియొక్కసారమునుతనతలచే మాపునట్లుయీపురుషునిహృదయమునసనాతనుఁడగువిష్ణువు వసించుచున్నాఁడోయట్టిపురుషుఁడు లోకులకుసౌమ్యరూపియైయుండును. అని శ్రీవిష్ణుపురాణమునయమకింకరసంవాదమునఁజెప్పఁబడియుండులక్షణములుఈజగన్మిత్రనాగనాధునియందుప్రత్యక్షసిద్ధమైయుండెను. ఇట్లుండనాయూరిలోవాసముచేయుచుండినకొందఱుదుష్టులుఅసూయాక్రాంతులై దుర్యోధనాదిదుష్టచతుష్టయము(మమప్రాణాహిపాండవాః)అనురీతిని శ్రీకృష్ణునికి ప్రాణపదంబగుపాండవులనునిందించుచుండినట్లుసజ్జనప్రియుఁడగుజగన్మిత్రనాగనాధునిని దుర్భాషలాడుచుండిరి-అందొకఁడు ఒకనాఁడుఅర్ధరాత్రమునజగన్మిత్రనాగనాధునియింటనగ్నినిక్షేపముచేసెను-ఆయగ్ని యెందునువ్యాపించియిల్లుకాలుచుండఁగా అపరమభాగవతుఁడు మేల్కని(కృతకృత్యాఃప్రతీక్షంతే। మృత్యుంప్రియమివాతిథిం)అనురీతినితాను భగవద్విషయమునన్యస్తభరుఁడగుటచే కృతకృత్యుఁడైమృత్యువు

నుప్రియముగునతిథినిఁగా నిరీక్షించుచుండుపూర్ణాధికారికానసేఁడు విరోధమగు సంసారబంధ మునుభగవంతుఁడువిడిపించియనుగ్రహించుననినిశ్చయించి భగవద్ధ్యానపరుఁడైయుండెను- అ పుండరీకనాథుఁడు ప్రత్యక్షమైయితనిచెంతవసించి గర్భస్థుఁడగుపరీక్షిత్తును అశ్వత్థామబా ణాగ్నిచేదగ్ధుఁడుకాకుండసంరక్షించినట్లు జగన్మిత్రనాగనాథునిసకుటుంబముగసంరక్షించెను. ఆయూరిప్రజలు పరుగెత్తివచ్చియనుతాపయుక్తులై చింతించుచుండ భాగవతజనులీసత్పురు షునియింట నెవఁడోయగ్నినుంచెను. భక్తవత్సలుఁడును, ఆపద్బాంధవుఁడునునగు పుండరీకన దుఁడుసమయమునందుప్రత్యక్షమైయీమహాత్మునినిరక్షింపవలయుననిరి. మరికొందఱుదుష్టులు సంతోషించుచుండిరి. ఆయిల్లురాత్రియంతకాలుచుండియును నొకతృణమైనను లోపలప డకనీరైయాకాశమార్గముననెగిరిపోయెను. భాగవతశిఖామణియగు జగన్మిత్రనాగనాథుని కొక యుపద్రవమునులేక హిరణ్యకశిపునిచే అగ్నియందు త్రోయఁబడినప్రహ్లాదునికి అయగ్నిచల్లనై యుండినట్లితనికిని చల్లనైయుండి శ్రీపండరినాథునిసాన్నిధ్యముచే సకుటుంబముగ కుశలిరై యుండెను. ఈయద్భుతమునుజూచి భక్తులెల్లరును శ్రీమత్పాండురంగనియాశ్రితవాత్సల్యమును బహువిధములఁగఁగొనియాడుచుండిరి. ఈవైష్ణవోత్తమునివిషయమునందు నిష్కారణముగనసహ మానులైయుండినవారలకు భగవత్కటాక్షముచేననుతాపము కలిగి జగన్మిత్రనాగనాథుని సం న్నిధికివచ్చి శరణాగతులైయపరాధక్షాపణము చేసికొని వారివలన హితోపదేశమునుజెంది పరమసాధువులైరి. అగ్రామస్థులు వీరియొద్దకువచ్చి విప్రోత్తమా మీకుటుంబసంరక్షణమునకై కొంతభూమియేర్పాటుచేసెదము. దేవరవారంగీకరింపవలయునని ప్రార్థించిరి. అతఁడుపక్షులు సస్యఫలములనుభక్షించుచు తటాకతీర్థమును పానముచేయుచు జీవించునట్లు నేనొకరికినిబాధ లేక యుంఛవృత్తిచేసికొని యథాలాభసంతుష్టుఁడనై శ్రీమత్పాండురంగనిపదంబులనుపూజించు చునతనికల్యాణగుణములనుధ్యానించుచు తత్స్వరూపులగునతిథులనారాధించుచు తచ్ఛేషముచే దేహయాత్రజరపుకొని సుఖినైయుండుదును. నాకేమిటనుకొఱఁతలేదు. నాచేపరిగ్రహింపఁబ డియుండు పాత్రమక్షయపాత్రముకాన నాకై మీరుచింతింపకుఁడు. మీకుభగవంతుఁడు మే లుచేయునుగాకయని చెప్పినమాటలనువిని వారియనుమతిలేకపోయినను తమప్రావీణ్యాతిశ యముచే వారిపేరిటనొకగ్రామము నేర్పఱిచి దానివచ్చుబడిని ధర్మమునకువినియోగించుచువ చ్చిరి. కొన్నాళ్లకుపిదప అగ్రామమునకొకతురుష్కుఁడధికారియైవచ్చి జగన్మిత్రనాగనాథుని పేరిటనుండినభూములనునగరిభూములతోచేర్చికొనెను. ఆయూరివారెల్లరు నాయధికారియొద్ద కు పోయి జగన్మిత్రనాగనాథునిమాహాత్మ్యమునుజెప్పి నిరపేక్షుఁడగు నతనిపేరిట నేర్పాటుచే సిధర్మమునకుపయోగపడుచుచువచ్చిన భూములనెప్పటియట్లుస్వాధీనముచేయవలయునని ప్రా ర్థించిరి. ఆయధికారి జగన్మిత్రనాగనాథుని రప్పించి నీపేరేమనియడిగి నీవుజగన్మిత్రుఁడవగుటయ థార్థమేనిసర్వప్రాణులకును మిత్రుఁడైయుండవలయునుగదా. మాకుపరంపరగావ్యాఘ్రము కు లదైవమైయున్నది. ఇపుడు దానిని పూజింపవలసినకాలమువచ్చెను. నీవడవికిపోయి సాయం కాలమునకులోగానొకపులినిపట్టుకొనిరమ్ము. అట్లుచేయవేనియీభూమినీపేరిట చేయఁబడినకా లము మొదలు నేటివఱకు దీనికిచేరవలసినపన్నును నిన్నునిర్బంధించివసూలు చేయుదును. పులి ని తెచ్చితివేని నీవునిజముగ జగన్మిత్రుడవనినిశ్చయించెదను. అనిచెప్పిన అందుకతఁడుసమ్మతిం చియరణ్యమధ్యమునకుఁబోయి శ్రీపాండురంగనిధ్యానించుచుండెను. భక్తపరతంత్రుఁడగు పం

డరినాధుఁడొక పెద్దవ్యాఘ్రమై వీరికి ప్రత్యక్షమయ్యెను. జగన్మిత్రనాగనాధుఁడు వ్యాఘ్రరూపియగు భగవంతునికి ప్రదక్షిణనమస్కారములుచే సిస్తుతియొనర్చి గ్రామాధికారిచెప్పినమాటలను విన్నవించి జగదీశా! నీవు వానియింటికివచ్చి వానిపూజనంగీకరించి వానినిరక్షింపవలయునని ప్రార్థించెను. పండరినాధుఁడు సమ్మతించి నీయుత్తరీయమును నామెడకుఁగట్టి నన్నుపట్టణమునకు పట్టుకొనిపొమ్మని నియమించెను. జగన్మిత్రనాగనాధుఁడు పులినిబట్టుకొని పట్టణముసమీపమున వచ్చుచుండ నచ్చటనుండినపశువులును, మనుష్యులును భయపడికోటలోప్రవేశించి దాఁచుకొనిరి. అనేకులుజగన్మిత్రనాగనాధుని ప్రభావమును, అధికారిచే గ్రామమునకుఁగలుగు ననర్థమును బహువిధములుగఁజెప్పుకొనుచుండిరి. ఇట్లుండ గ్రామాధికారియీవృత్తాంతమునువిని భయపడియింటిలోప్రవేశించి తలుపుమూసికొనియుండెను. జగన్మిత్రనాగనాధుఁడు కోటవాకిలిచెంతరాఁగాతలుపుమూసియుండినందున వ్యాఘ్రరూపియగుభగవంతుఁడుగట్టిగగర్జించితనచేతితోఁగొట్టి యాతలుపును పొడిచేసెను. జగన్మిత్రనాగనాధుఁడు లోపలప్రవేశించి, వ్యాఘ్రమును జూచిభయపడుసాధువులనుగనుగొనిమీరు వెఱనకుఁడు అనిచెప్పియధికారి యింటివాకిటికిరాఁగా అచ్చటమూసియుండినతలుపును వ్యాఘ్రముపగులఁగొట్టెను. జగన్మిత్రనాగనాధుఁడధికారినిపిలిచిమీకులదైవమువేంచేసెను. ఏలపూజింపకతలుపుమూసికొంటివి అనిచెప్పిన నాయధికారిభయపడియొకమూలనుదాఁగియుండెను. పులిభయంకరముగఘోషించుచుండెను. జగన్మిత్రనాగనాధుఁడాపులినినానావిధములుగ నాటలాడించుచుండెను. అపుడాయధికారి లోపలనుండి నట్లు సకుటుంబముగ జగన్మిత్రనాగనాధుని ప్రార్థించి యోమహాత్మా నీప్రభావము నెఱుఁగకయపచారపడితిని. శరణాగతుఁడనగునన్ను రక్షింపుమనిచెప్పిన నచ్చటనుండిన సాధువులందఱును నవ్విరి. జగన్మిత్రనాగనాధుఁడు మందస్మితముచేసెను. వ్యాఘ్రముశాంతినివహించెను. పిదపనాయధికారి కొంతధైర్యమునవలంబించి యిల్లువిడిచి వెలుపటవచ్చి జగన్మిత్రనాగనాధునికి సాష్టాంగవందనముచేసి దూరముగనిలుచుండి బద్ధాంజలియై యోభాగవతోత్తమా! నాకుబుద్ధివచ్చెను. జగన్నాధుఁడుభాగవతపరతంత్రుఁడని తెలిసికొంటిని. ఇఁక నెన్నటికినిట్టి యపచారమునకొడిగట్టను. నీవుజగన్మిత్రుఁడవుకాన జగత్తునురక్షింపుము. నేనునుతక్కిన ప్రజలునునిగుల భయాక్రాంతులమైయున్నారము. నీవుపులి నెప్పటివలెనడవినివిడిచిభీతులమగుమమ్మందఱను రక్షింపుము అని ప్రార్థించిన జగన్మిత్రనాగనాధుఁడు కరుణించియిఁకనిట్టి యక్రమములనుజేయకుము. సాధువులనుపూజించుచుభగవన్నామమును స్మరించుచు జనులనురాజనీతితోరక్షించుచుసుఖివై యుండుము అనిచెప్పిపులినిబట్టుకొని యడవికిఁబోయిదాని మెడనుగట్టియుండినతనయుత్తరీయమును విప్పివేసెను. తోడనేవిఠ్ఠలనాధుఁడు నిజరూపముతోడ జగన్మిత్రనాగనాధునికి ప్రత్యక్షమై యతనినాలింగనముచేసికొని నీవుపట్టణమునకుఁబోయి యెప్పటియట్లునన్ను ధ్యానించుచు సుఖివై యుండుమనియనుగ్రహించి యదృశ్యుఁడయ్యెను. పిదపనాభాగవతశిరోమణి పట్టణమునకు వచ్చుచుండ నధికారిమొదలగుగ్రామస్థులందఱును భయభక్తివిశ్వాసములతోడ జలపూర్ణకుంభములనెత్తుకొనివచ్చి సాష్టాంగముగవందనముచేసి యుపచరించి భగవన్నామమును ఘోషించుచు జగన్మిత్రనాగనాధునిని పురస్కరించుకొనివచ్చిరి.

భక్తసులభాయనమః

———

# ఇరువదియవయధ్యాయము.

## శోకాపరమానందునిచరిత్రము.

పారిసీయను నూరిలో అఖండ వైరాగ్యశీలుఁడై మానావమానములను వర్జించి సదా భగవన్నామస్మరణచేయుచు శోకాపరమానందుఁడనునొకభాగవతుఁడుండెను. అతఁడు ప్రతిదినము బ్రాహ్మముహూర్తమునలేచి స్నానసంధ్యావందనములనుదీర్చి సర్వోపచారములతో భగవంతునినారాధించిభగవద్గీతనుపారాయణముచేయుచుండును.(భగవన్ పరమేశాన। భక్తిరవ్యభిచారిణీ । ప్రారబ్ధంభుజ్యమానస్య । కథంభవతిహేప్రభో) అనఁగా ఓస్వామీ ప్రారబ్ధమనుభవించువానికచంచలభగవద్భక్తియెట్లుకలుగును. అనిభగవంతునిని భూదేవియడుగఁగా(ప్రారబ్ధం భుజ్యమానోపి । గీతాభ్యాసరతస్సదా । సముక్తస్సుఖీలోకే । కర్మణానోపలిప్యతే । మహాపాపాదిపాపాని । గీతాధ్యానంకరోతిచేత్ । క్వచిత్స్పర్శంనకుర్వంతి । నలినీదళమంభసా। గీతాయాఃపుస్తకంయత్ర । యత్రపాఠఃప్రవర్తతే । తత్రసర్వాణితీర్థాని । ప్రయాగాదీనితత్రవై। సర్వేదేవాశ్చఋషయో । యోగినఃపన్నగాశ్చయే । గోపాలగోపికావాపి ।నారదోద్ధవపార్షదైః । సహాయోజాయతేశీఘ్రం । యత్రగీతాప్రవర్తతే । యత్రగీతావిచారశ్చ । పఠనంపాఠనంశ్రుతం । తత్రాహంనిశ్చితంపృథ్వ్వ । నివసామిసదైవహి । గీతాశ్రయోహంతిష్ఠామి । గీతామేచోత్తమంగృహం । గీతాజ్ఞానముపాశ్రిత్య । త్రీన్ లోకాన్ పాలయామ్యహం) అనఁగా ప్రారబ్ధమనుభవించువాఁడైనను భగవద్గీతనుసదా ఆసక్తితో పారాయణముచేయువాఁడు ముక్తుఁడైసుఖియైకర్మముచే బద్ధుఁడుకాకయుండును.భగవద్గీతను మననముచేసినయెడలతామరాకును నీళ్లంటనట్లు మహాపాపములంటవు. భగవద్గీతపుస్తకముండుచోటను, గీతాపారాయణము జరుగుచోటను, ప్రయాగాదిసమస్తపుణ్యతీర్థములు సాన్నిధ్యమైయుండును. గీతాపారాయణముచేయువానికి సమస్తదేవతలును, ఋషులును,యోగులును,పన్నగులును, గోపాలగోపికలును, నారదులును, ఉద్ధవులును, భగవత్పార్షదులును శీఘ్రముగసహాయులగుదురు. ఎచ్చట గీతచదువఁబడుచున్నదో, యుపదేశింపఁబడుచున్నదో, వినఁబడుచున్నదో,యర్థవిచారముచేయఁబడుచున్నదో యచ్చటనేనుసిద్ధముగవసించుచున్నాను. నేనుభగవద్గీతనుఆశ్రయించియున్నాను. అదేనాకునుత్తమగృహము. దానినాశ్రయించి సమస్తలోకములను పాలించుచున్నాను. అని భగవంతుఁడనుగ్రహించినట్లు వరాహపురాణమునందుఁజెప్పఁబడియున్నది. భగవద్గీతయందును (అధ్యేష్యతేచయఇమం । ధర్మ్యంసంవాదమావయోః । జ్ఞానయజ్ఞేనతేనాహ। మిష్టస్స్యామితిమేమతిః) అనఁగా ఓసంజయా మనసంవాదరూపమైన మహాత్మ్యమైనయీగీతను ప్రతిదినముపారాయణముచేయువాఁడు జ్ఞానయజ్ఞముచే నన్నారాధించువాఁడని నాయభిప్రాయము. అని శ్రీకృష్ణుఁడు తానేచెప్పెను. కానశోకాపరమానందుఁడీ ప్రమాణములనుబాటించి ప్రతిదినము భక్తితోడ భగవద్గీతాపారాయణముచేయుచువచ్చెను. ఇట్లుపారాయణముచేయునపుడొక్కొక్కశ్లోకమునకు నొక్కొక్కవందనముగ ౭౦౦ నేడునూఱులు సాష్టాంగవందనములుచేయును. ఇట్లుతననియమములను నెఱవేర్చియంతకుమీఁదనుంఛవృత్తిచేసి జీవించును. ఇతఁడు (విచిత్రాదేహసంపత్తి । రీశ్వరాయనివేదితుం)అనురీతినివిచిత్రమగు దేహసంపత్తిభగవద్విషయము

నవిని యోగించుటకై మనకీయఁబడియున్నది. కాననట్టిశరీరమునుసదా భగవద్విషయమునవిని యోగపఱుపవలయుననునభిప్రాయముతోఁగూడివర్తించెను. ఒకనాఁడొకవర్తకుఁడు శ్రీకాపరమానందుఁడనుష్ఠానముచేయుచుండుచోటికివచ్చెను. అపుడకస్మాత్తుగా వర్షమువచ్చి భూమియడుసయ్యెను. శ్రీకాపరమానందుఁడు దానినిపాటింపకయడుసుభూమియందు నమస్కారముచేయుచుండుటను వర్తకుఁడుచూచియితఁడు శుద్ధాంతఃకరణుఁడనితెలిసికొని తనయంగడిలోనుండినయొకపట్టువస్త్రమును దెచ్చియతనికినమస్కరించిప్రార్థనాపూర్వకముగనిచ్చెను. నిరపేక్షుఁడగు శ్రీకాపరమానందుఁడు భిక్షాన్నమునుజీర్ణవస్త్రమును తప్పతక్కినవినాకు త్యాజ్యములనిచెప్పి యాపట్టువస్త్రమును శ్రీరుక్మిణీకాంతునికి సమర్పించిననాకు సంతోషముకలుగును. భగవంతునికినీయందు కృపకలుగును అనిచెప్పినవినకయావర్తకుఁడుబలవంతముగ అవస్త్రమును వీరినడుమునకుచుట్టి యథేచ్ఛగపోయెను.

శ్రీకాపరమానందుఁడు తాను యాచింపకయే లభించినయావస్త్రమును చక్కఁగనడుమునకుచుట్టుకొని యావస్త్రమునకడుసుతగులుననుభయముచే సాష్టాంగవందనముచేయక చేతులతోమాత్రముభూమినిస్పర్శించివందనముచేయుచువచ్చెను. అన్యవిముఖుఁడై కేవలభగవదనుభవపరుఁడగునితనికి పట్టువస్త్రవ్యాజముచే మనసునిలుకడతప్పి చంచలమయ్యెను. తోడనే యాఁకలిదప్పులుబాధింపసాగెను. దేహమునాయాసముతోఁచెను. అపుడు శ్రీకాపరమానందుఁడు నేఁడేలయిట్టివిపరీతముకలిగెను. నిరపేక్షుఁడనగునేనునావ్రతమును విడిచియీవస్త్రమును పరిగ్రహించినందునఁగదా యీయనర్థముకలిగెను. పరిశుద్ధాన్నము శ్వానస్పర్శముచే నపరిశుద్ధమైనట్లు భగవద్గీతాపఠనమననములచే నత్యంతపరిశుద్ధమగునాహృదయ మీవస్త్రపరిగ్రహముచే చంచలమయ్యెను. ఇంతస్వల్పపరిగ్రహముచే నింతయనర్థము కలిగినయెడల నియమములేకసదా సర్వపరిగ్రహముచేయువారికెట్టియనర్థములు సంభవించునోతెలియదు. ఈపరిగ్రహదోషమునకు ఏమిప్రాయశ్చిత్తముచేయవచ్చును అనిచింతించుచుండ నొకఁడు నాఁగటిని భుజమునఁదగిలించుకొని యెద్దులనుదోలుకొని పోవుచుండెను. శ్రీకాపరమానందుఁడా మనుష్యునిఁబిలిచి నీకీపట్టువస్త్రమునిచ్చెదను. నీయెద్దులనుగొంతసేపు నాస్వాధీనముచేయుమని యడిగి వానిని సమ్మతిపఱచిపట్టువస్త్రమును వానికిచ్చియాయెద్దులమెడమీఁదనుండిన కాడికొయ్యకు తనకాళ్లనుజేర్చికట్టుకొని యాయెద్దులను బెదరించి తఱుముమనియాకాపునుప్రార్థించెను. అవివేకియగు నామనుష్యుఁడుసమ్మతించియట్లుచేసెను. ఎద్దులతివేగముగ నడవినిఁబరుగెత్తినందున శ్రీకాపరమానందునిదేహమునకు ఱాళ్లుముండ్లుతగిలి శరీరమునరక్తప్రవాహముకలిగెను. ఆయెద్దులితనిశరీరమునుజూచిభయపడి యధికముగపరుగెత్తెను. అపుడు శ్రీకాపరమానందుఁడు తనశరీరస్థితినియోచింపక నేనుజేసినతప్పునకుమంచిప్రాయశ్చిత్తము తోడనేకలిగెను అనిసంతోషించి భగవన్నామములను స్మరించుచునుండెను. శరీరమునధికముగగాయములు తగిలిరక్తమాంసములు క్షయించియు నిట్టిదుర్దశయందును నితరచింతలేక భగవదనుభవమునఁజొక్కియానందపరవశుఁడైయుండెను. అపుడు పండరినాథుఁడితనిచిత్తశుద్ధికి సంతసించిగజేంద్రునిసంరక్షణార్థము పరుగెత్తివచ్చినట్లు శీఘ్రముగ వచ్చికాడికొయ్యకుఁగట్టియుండిన యతనికాళ్లనువిప్పి తనచేతితోస్పర్శించినంతట నతనిశరీరము మునుపటికన్న నధికమైన యారోగ్యముతోఁగూడినదయ్యెను. అపుడుభగవంతుఁడు శ్రీకాపరమానందునిశిరముపై తనహస్తము

నుంచి యోసాధుజనాగ్రేసరా! యేలయిట్టిసాహసము చేసితివి. ఇట్టికఠినప్రాయశ్చిత్తమునకు నీవేమితప్పుచేసితివి. (జంగమశ్రీవిమానాని । హృదయానిమనీషిభిః) అనురీతిని నీహృదయము నాకాలయమైయుండ నాసౌకుమార్యమునుజింతింపకయేల యీదేహమునిట్లు కష్టపెట్టితివి. నీవుభుజించునవియన్నియు నాకాహారమగుచున్నవి.నీమాటలునాస్తోత్రమైయున్నది.నీగమనము నాప్రదక్షిణమగుచున్నది. నీనిద్రయష్టాంగయోగములగుచున్నది. ఇట్లన్యవిముఖుఁడవై సర్వకర్మములనునాకర్పించుచుండునీవిట్లు చేయుటయుచితముగాదు. అనిన శోకాపరమానందుఁడు ఓస్వామీ చంచలమగునామనసు నిన్నుదృఢముగనవలంబించునట్లు కృపచేయవలయునని ప్రార్థించినభగవంతుఁడట్లగును గాకయనియనుగ్రహించి పండరిపురమునకువచ్చి యచ్చటిభక్తులకు శోకాపరమానందునివృత్తాంతమును జెప్పిననందఱును ఆశ్చర్యపడిరి. జ్ఞానదేవుఁడు హృషీకేశా! దేవరవారిలీలకంతముగలదా.ఒకనికన్నొకనిని శ్రేష్ఠునిఁగానిర్మించెదవు.భక్తులగౌరవమును నీవేయెఱుఁగుదువు. అనిచెప్పి బహువిధములఁగ స్తుతించెను.

ప్రణతార్తిభంజనాయనమః,

---

## నరహరిభక్తునిచరిత్రము.

పండరిపురమున నరహరియనుపేరుగలయొకస్వర్ణకారకుఁడుండెను. అతఁడుప్రతిదినము ప్రాతఃకాలమునలేచి భీమనదిలోస్నానముచేసి నిత్యకర్మములనెఱవేర్చి భక్తితోడమల్లికేశ్వరపూజచేయుచుండును. అతఁడుపరమశివునిఁదప్పమరియొకదేవతను కలనైన స్మరించియెఱుఁగఁడు.తానుపుట్టినదిమొదలు పండరినాథునిసేవించినదిలేదు.విఠ్ఠలనాథునిదిక్కునుసహితము తిరిగి చూడఁడు. ఇట్లుండనితనియింటికిసమీపముననుండినయొకవర్తకునికిసంతానములేనందున శ్రీమత్పాండురంగని సన్నిధికివచ్చి నాకొకపుత్రుని ననుగ్రహించిన నీకు నవరత్నఖచితమగు బంగారుమొలత్రాడు సమర్పించెదనని ప్రార్థనచేసికొనెను. భగవత్కటాక్షముచే ఆవర్తకునికి పుత్రుఁడుకలిగెను.వర్తకుఁడు జాతాశౌచమునివర్తియైనపిదప సన్నిధికివచ్చిపుండరీకవరదునిసేవించితనప్రార్థనను జెల్లింపవలయుననితలఁచి మొలత్రాడుచేయుటకు కుశలుఁడగుపనివాఁడెవ్వఁడని యచ్చటనుండినవారలనువిచారింపఁగా వారలు నరహరి గట్టివాఁడనిచెప్పిరి. వర్తకుఁడు స్వర్ణమును, రత్నములనుఎత్తుకొని నరహరియింటికివచ్చి పండరినాథునికిమొలత్రాడుచేసిసమర్పింపవలయుననియడిగెను. స్వర్ణకారకుఁడు వర్తకునిఁజూచి నీవుకోరినట్లుచేసియిచ్చెదను. నేను పండరినాథునిఁజూచియెఱుఁగనుగాననీవు కొలతపట్టితెచ్చితివేని చేసియిచ్చెదననెను. వర్తకుఁడామాటలనువినినవ్వితామరసమీపముననుండు మండూకమాకమలమునందలితేనెనాస్వాదింపనెఱుఁగనట్లు నీవీయూరిలోపుట్టిపెరిగి పండరినాథునిసేవింపక భాగ్యహీనుఁడవైతివనిచెప్పి తాను స్వామిసన్నిధికిఁబోయికొలత తెచ్చియిచ్చెను. పనితీరఁగానే యామొలత్రాటిని వర్తకుఁడు తీసికొనిపోయి స్వామికిసమర్పింపఁగా నాలుగువేళ్లుతక్కువపడినందునమఱల నరహరిచేతికిచ్చిచక్కపఱచి సన్నిధికితీసికొనిపోయి స్వామికిసమర్పించిన రెండువేళ్లధికముగానుండెను. ఈరీతినిఅయిదాఱుమార్లు చక్కపఱచియు కొలతసరిపడకపోయినందున వర్తకుఁడు

చింతాక్రాంతుఁడై నరహరియింటికివచ్చి యెన్నిమార్లుచక్కపఱచినను మొలత్రాడుస్వామికిస
రిపడలేదు. కాన నీవేసన్నిధికివచ్చి నీచేతితోఁగొలతయెత్తి మొలత్రాడుచేసియియ్యవలయునని
ప్రార్థించెను.నరహరి శివునిఁదప్పనితరదేవతలనుజూడఁగూడదను సంకల్పముతోఁగూడినవాఁ
డుగానవర్తకునిప్రార్థనకులోఁబడికన్నులకు వస్త్రముచుట్టుకొనివర్తకునిచేతినిఁబట్టుకొని పండ
రినాథునిసన్నిధికిపోయెను. అచ్చటనుండువారంధులనురోగికిసన్నము రుచియింపనియట్లుఈ
భాగ్యహీనునికిపండరినాథునిసేవరుచింపలేదనిపరిహాసముచేసిరి.నరహరి, సన్నిధిలోపలఁబ్రవేశిం
చిపండరినాథునిసమీపమునకుఁబోయిస్వామిని తనచేతులతో తడవిచూడఁగా నయిదుముఖము
లును,జటాభారమును,చంద్రుఁడును,నాగయజ్ఞోపవీతమును,వ్యాఘ్రచర్మమును, శూలడమరుక
ములునుఅగపడెను.అపుడు నరహరియాశ్చర్యపడి యీపండరినాథునివిష్ణునిఁగా తలఁచియుంటి
ని- ఇపుడునాచేతికి శివరూపమగపడుచున్నది. అనిచెప్పికంటికిఁజుట్టుకొనియుండినగుడ్డనువిప్పి
స్వామినిఁజూడఁగా పూర్వముతాను వినియుండినట్లు కిరీటమును,మకరకుండలములును, శ్రీవత్స
కౌస్తుభములును,వైజయంతివనమాలికలును, పీతాంబరమును,కటిన్యస్తహస్తములును,సమచరణ
ములును ప్రకాశించుచుండ నిటికటాతిపై శంఖహస్తుఁడైనిలుచుండియుండు విఠ్ఠలనాథునిఁజూ
చినాకేలయిట్టిభ్రమకలిగెనని తనవ్రతహానికి చింతించి మరలకన్నులకుగుడ్డచుట్టుకొని స్వామిని
తడవిచూడఁగాపూర్వమువలెశివచిహ్నములగపడెను-అపుడునరహరికి జ్ఞానోదయమై సర్వేశ్వ
రునికి నామరూపములనంతములై యుండ నాబుద్ధిమాంద్యముచే నిదివఱకు విష్ణునామరూపముల
నుద్వేషించి పండరినాథునిసేవింపకయుంటిననివగచి స్వామికిసాష్టాంగవందనములు చేసి బహు
విధములఁగవిష్ణుశివనామంబులచే స్తుతించి స్వామీ! నాయవివేకమునుదొలఁగించితివి-భాగ్యహీ
నతచే నిదివఱకునిన్ను ద్వేషించుచుంటిని.ఇఁకను నీయంతరంగభక్తులలోనొకనిఁగనన్ననుగ్రహిం
పవలయుననిప్రార్థించిన రుక్మిణీకాంతుఁడుసంతసించి యోనరహరీ! నీవునాశివస్వరూపమును
శ్రద్ధతోడనారాధించుచుంటివి-త్రికరణములచే నన్యము నెఱుఁగక భగవత్పరుఁడవైన నీకఖండ
జ్ఞానమునుగలుగఁజేయుటకై యిట్లుచేసితిని.అత్రిమహాముని పుత్రార్థియై జగత్కారణవస్తువగు స
ర్వేశ్వరుఁడు,తనకుప్రత్యక్షముకావలయునని తపస్సుచేయఁగానేను, హరి,హర, హిరణ్యగర్భ
రూపములతోనతనికి దర్శనమిచ్చిననతఁడు నేనొక్కదేవునిని ప్రార్థింపముగ్గురును ప్రత్యక్ష
మగుటకు కారణమేమనిన మాముగ్గురికిని భేదములేదు.మాకు దివ్యాత్మస్వరూపముఅభిన్నమై,
రూపములుభిన్నమైయుండును.కాన మేముముగ్గురమునునీచేఁ గోరఁబడినయొక్కదేవతయేగా
ని ముగ్గురు దేవతలము కాముఅనియతనికి సమాధానముచెప్పి యతనిమనోరథంబునెఱిఁగి మాము
గ్గురియంశములచేనీకుముగ్గురుపుత్రులుకలుగుదురనియనుగ్రహించితిని-అత్రిమహామునికిత్రిమూ
ర్తులయంశములచేదత్తాత్రేయ, దూర్వాస, చంద్రులుపుత్రులైరి. ఈయితిహాసమునునీవువినియె
ఱుఁగవేయనిచెప్పినభగవద్వాక్యమునువిని నరహరి నేనుధన్యుఁడనైతిననిచెప్పి తానుజేసిన మొల
త్రాటినిస్వామికిసమర్పింపఁగాదానికొలతసరియైయుండెను-వర్తకుఁడు సంతోషించిస్వామిని,
నరహరినిఁగొని యాడి స్వస్థానమునకుఁబోయెను. భగవంతుఁడు నిజభక్తులచిత్తవృత్తికనుగుణ
ముగనడచువాఁడుకాన. నాదినము మొదలు నరహరిభక్తునికై తనశిరమునందుబాణలింగమునంటి
కిరీటమునుధరించియున్నాఁడు. నరహరియును అదిమొదలుహరిహరరూపంబులనభేదముగ భ
గవన్మూర్తివిశేషములను అధ్యవసాయముతోడ నారాధించుచుశ్రీమత్పండరినాథునికినంతరంగ
భక్తుఁడైయుండెను.

హరిహరరూపాయనమః.

## నామదేవులను పండరినాథుఁడు పరీక్షించిన చరిత్రము.

ఒకనాఁడు పండరినాథుఁడు నామదేవుని నేకాంతముగ పిలిచి నేను సర్వభూతములయందును అనుప్రవేశించి (క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి। సర్వక్షేత్రేషుభారత) అనురీతిని క్షేత్రజ్ఞుఁడనై యున్నాను. ఈతత్వమును నీహృదయమునఁ బాదుకొల్పియున్నాఁడవే యనియడిగిన నామదేవుఁడు నమ్రుఁడైయో స్వామీ! వీసోబాకేశుని యుపదేశబలము చేతను, నీయనుగ్రహబలము చేతను నీవిప్పుడానతిచ్చినట్లు నిన్ను సమస్తచేతనాచేతనములకు శరీరియని యధ్యవసించియున్నానని విన్నవించిన భగవంతుఁడు సంతోషించెను. మఱియొకనాఁడు భగవంతుఁడు నామదేవుని యధ్యవసాయమును బరీక్షింపవలయునని తలఁచి శ్వానరూపమై పండరిపురమునందలి వీధులయందు సంచరించుచు భాగవతులు గుమిగూడి భుజించుస్థలములకుఁ బోయిన వారలా శ్వానమును బెదరించి వెళ్లఁగొట్టిరి. కొందఱు భుజించుచోటికి శ్వానము వచ్చెనని యసహ్యపడిరి. ఆశ్వానము వీరలేమఱియుండ పాకశాలయందుఁ బ్రవేశించి యన్నముంచియుండు పాత్రమునందు నోరు వెట్టెను. అచ్చటనుండిన వారలు దీనిని గొట్టుటకు యత్నింపఁగా నచ్చటనిలువక తప్పించుకొని పాఱిపోయెను. ఇట్లీశ్వానము పెక్కుచోట్లకుఁ బోయిన నొక్కరైన దానికొక్కకబళమును నియ్యక నిర్దయులై వెళ్లఁగొట్టిరి. నామదేవులు తనచేత నొకరొట్టె నుంచుకొని యుండఁగా శ్వానమచ్చటఁ బ్రవేశించి యారొట్టెను నోరం గఱచుకొని పరుగెత్తెను. అపుడు నామదేవులు వీసోబాకేశుని యుపదేశముచే శుద్ధాంతఃకరణుఁడై సర్వమును భగవత్స్వరూపముగ భావించుచుండుటచే నాశ్వానమును సాక్షాత్పండరినాథునిఁగ దలఁచి భక్తిచే నీయొక గిన్నెలో నేయిఁ బోసికొని యో స్వామీ యుత్తరొట్టెను భుజింపకుము. అది నోటికి కఠినముగా నుండును. ఈ నేతిలో నద్దుకొని భుజింపుమని చెప్పుచు వెంబడించి శ్వానమును బట్టి తనయొడిని నిడుకొని కూర్చుండి దానినోటనుండిన రొట్టెను తీసికొంచెము కొంచెము గ్రుంచి నేతిలో నద్ది దానినోటి కిచ్చుచువచ్చెను. ఆశ్వానము వీరిచ్చు రొట్టెను బ్రీతితోడ భుజించుచుండెను. వీరిట్లు చేయుటను జూచిన భాగవతులు నవ్వుచు నామదేవునికి పిచ్చిపట్టెను-కాన కుక్కకు రొట్టెను తినిపించుచున్నాఁడని యొకరితో నొకరు గుసగుసలాడుచుండిరి. మఱికొందఱు బుద్ధిమంతులితఁ డఖండజ్ఞానపరిపూర్ణుఁడు; కాననితనికి సర్వప్రపంచము భగవదాత్మకమై తోఁచుచున్నది. కాననీశ్వానమును భగవంతునిఁగ భావించి యారాధించుచున్నాఁడు. ఇది యుచితమేగదా. సర్వవ్యాపియగు భగవంతుఁ డీశ్వానమునందు లేకయున్నాఁడే. ఇతని యధ్యవసాయమునకు సంతసించి యీశ్వానమునకంతర్యామియగు భగవంతుఁ డితనికి ప్రత్యక్షమై పొడచూపకుండునే-అఖండజ్ఞానములేని యీ వైష్ణవులు తత్వమును విచారింపక భాగవతుని నవమానించుట మిగుల ననుచితమని చెప్పిరి. అపుడు శ్వానరూపియగు రుక్మిణీకాంతుఁడు నామదేవునిఁ జూచి నీ వెట్లు నన్నెఱిఁగితివనిన నామదేవుఁడు స్వామీ! వీసోబాకేశుఁడు నీమర్మమును నాకుఁ జెప్పెననెను-భగవంతుఁడు సంతోషించి సకలజనులు చూచుచుండ నామదేవు ననుగ్రహించి యదృశ్యుండయ్యెను-మునుపు శ్వానమునకు నన్నమిడక వెళ్లఁగొట్టినవారు భగవంతుఁడని యెఱుఁగక కేవలశ్వానమని వెళ్లఁగొట్టి[illegible] నామదేవుఁడు మర్మము నెఱిఁగి భగవంతుని నారాధించి కృతార్థుఁడయ్యెను-మనము [illegible] లమగుటచే తానుగా వచ్చిన భగవంతుని ననాదరించితిమని యనుతపించిరి.

కొంతకాలము గడచినపిదప కార్తికశుద్ధైకాదశినాఁడు నామదేవుఁడు భగవత్సన్నిధిని హరికీర్తనము చేయుచుండఁగా భగవంతుఁడతనిఁజూచి నీవు నేఁడిచ్చట భుజింపింపవలయునని నని నామదేవుఁడు నేఁడేకాదశి. కాన నేటికిమాత్రమిట్లునియమింపవలదు. నేఁడన్నమును భుజించిన నే నెన్నటికినీపాదంబులఁ జేరుదును. దేవతలలో హృషీకేశుఁడును, వృక్షములలో నశ్వత్థమును, పత్రములలోతులసియుఁ శ్రేష్ఠములగునట్లు వ్రతములలో నేకాదశి శ్రేష్ఠమైనదిగదాయని విన్నవించి నవినిభగవంతుఁడునామదేవా పూర్వమంబరీష, రుక్మాంగదాదులు వైరాగ్యశీలురైయీవ్రతమునను ష్ఠించిరి. తడిలేనిబీజమును, ప్రీతిలేనిదానమును నిష్ఫలమగునట్లు వైరాగ్యములేనివ్రతము వ్యర్థమగు ననిననామదేవుఁడో దేవేశా! దేవరవారియనుగ్రహబలముచే నానిశ్చయమునకు స్థాలిత్యము కలుగ దనినపుండరీకవరదుఁడు సంతసించి యోవత్సా నీదృఢజ్ఞానవైరాగ్యములు కొంచెపడక వర్ధిల్లుచుం డునుగాకయనియాశీర్వదించెను.

మఱియొకయేకాదశిదినమున నామదేవునిఁబరీక్షించుటకై భగవంతుఁడొకవృద్ధబ్రాహ్మ ణరూపమునుధరించి నామదేవునియింటికివచ్చి నేనుమిగులనాఁకలిచే బాధింపఁబడుచున్నాను. కాననాకన్నము కావలయుననిన నామదేవుఁడు నేఁడేకాదశి. అన్నమును స్వీకరింపఁగూడ దు. (ఏకాదశ్యాంనభుంజీత। కదాచిదపిమానవః। యదిభుంజీతమోహేన। నరకేషునిమజ్జతి) అనఁగా ఏకాదశియందొకప్పుడును భుజింపఁగూడదు. మోహముచే భుజించువాఁడు నరకమునఁబడును. అనివిష్ణుస్మృతిచెప్పుచున్నది. (ఏకాదశ్యాంమునిశ్రేష్ఠ। యోభుంజేన్మూఢచేతసః। ప్రతిగ్రాస మసౌభుఙ్క్తే। కిల్బిషంశ్వాదివిట్సమం। నిష్కృతిర్మద్యపస్యోక్తః। ధర్మశాస్త్రే మనీషిభిః। ఏకాదశ్యన్నకామస్య। నిష్కృతిః క్వాపినోదితా) అనఁగా నెవఁడుమూఢవ్యాదయుఁడై యేకా దశియందు భుజించునో వాఁడు భుజించునొక్కొక్కకబళమును పాపమునుగలుగఁజేయును. అదికుక్కమొదలగు హీనజంతువులవిష్టకుసమమగును. ధర్మశాస్త్రమునమద్యపానముచేసిన వానికిప్రాయశ్చిత్తము విధింపఁబడియున్నది. ఏకాదశియందు భుజించినవానికి ప్రాయశ్చిత్త ము విధింపఁబడలేదు. అనిసనత్కుమారసంహిత చెప్పుచున్నది. (అష్టవర్షాధికోమర్త్యో। హ్యాపూ ర్ణాశీతివత్సరః। ఏకాదశ్యాముపవసే। త్పక్షయోరుభయోరపి) అనఁగా నెనిమిదియేండ్లకుపైఁబ డి యెనుబదియేండ్లకు లోఁబడినవయస్సుగలవారు శుక్ల, కృష్ణపక్షములయందలియేకాదనుల యందుపవసింపవలయునని కాత్యాయనస్మృతిచెప్పుచున్నది(సబ్రహ్మహాసగోఘ్నశ్చ। స్తేయీచగు రుతల్పగః। ఏకాదశ్యాంతుయోభుఙ్క్తే। పక్షయోరుభయోరపి। మాతృహాపితృహాచైవ। భ్రా తృహాగురుహాతథా। ఏకాదశ్యాంతుయోభుఙ్క్తే। శక్తిమాన్నిరుపద్రవః। సురాపానసమం పాపం। భవేత్తస్యనసంశయః) అనఁగా నేకాదశియందు భుజించువాఁడు బ్రహ్మహత్యయు, గోహత్యయు, స్వర్ణాపహారమును, గురుపత్నీగమనమును జేసినవాఁడగును. మఱియుశక్తిమం తుఁడై నిరుపద్రవుఁడైయుండువాఁడేకాదశియందు భుజించినయెడల తల్లిని, దండ్రిని, సహోదరుని, గురునిఁజంపినవాఁడగును. అట్టివానికి సురాపానమునకు సమమగుపాపముని స్సంశయముగఁగలుగునని శ్రీవిష్ణుధర్మము చెప్పుచున్నది, (వరంస్వమాతృగమనం। వరంగోమాం సభక్షణం। వరంచాపిసురాపానం। హరివాసరభోజనాత్) అనఁగా నేకాదశియందు స్వీక రింపఁబడునన్నమునకన్న స్వమాతృగమనమును, గోమాంసభక్షణమును, సురాపానమును

శ్రేష్ఠములగునని శ్రీమహాభారతము చెప్పుచున్నది. (యానికానిచపాపాని। బ్రహ్మహత్యాదికానిచ। అన్నమాశ్రిత్యతిష్ఠంతి। సంప్రాప్తేహరివాసరే). అనఁగా నేకాదశిదినమున బ్రహ్మహత్యమొదలగుసమస్తపాపములన్నమును నాశ్రయించియుండునని పాద్మపురాణము చెప్పుచున్నది. కాననేకాదశియందు భుజించుటయు, భుజింపించుటయు మిగులననుచితము. నీవ నుక్తుఁడవగుట నిజమేని ఖర్జూరాదిఫలములనిచ్చెదను. అంగీకరింపుమనియెను. అందులకాబ్రాహ్మణుఁడన్నముతప్ప మఱియొకదానియందును నాకపేక్షలేదు. నామనోరథమును నీవుపూర్తిచేయవేని నేను ప్రాణమువిడిచెదను, నీకుబ్రహ్మహత్యదోషముసిద్ధించును. అనిననామదేవుఁడోయీబ్రాహ్మణుఁడా! నేను భగవద్భక్తుఁడను. పాపపుణ్యములనువర్జించి పాండురంగనిపాదపద్మములయందు న్యస్తభరుఁడనైయున్నాను, అనినవినిబ్రాహ్మణుఁడు నీమనస్సున సత్వనిష్ఠలేదు. మాటలుమాత్రమతీయనైయున్నవి. అన్నములేమిచే మూర్ఛవచ్చుచున్నది. సాయాంకలినిదీర్పవేని నిజముగ నాప్రాణములుపో వుననినమ్ముము. అనిన నామదేవుఁడు ఓవిప్రా! నీప్రాణముపోయిన నాగతియునట్లేమగియుననిచెప్పి బ్రాహ్మణునిసమీపమున వచ్చిచూడఁగానతనికి శ్వాసమునిలిచిపోయెను. అపుడచ్చటనుండిన స్త్రీపురుషులందఱును గుమిగూడివచ్చినామదేవునిఁ జూచియోపాపాత్మా యేలమావీధినిబ్రహ్మహత్యచేసితివి. ఆఁకలిగొన్న వారికన్నముపెట్టకబ్రహ్మహత్యకుబాధ్యుఁడవైతివి. జ్ఞానవంతుఁడనిపేరుపెట్టుకొనియొకకబళమన్నమీయక పెద్ద బ్రాహ్మణునిఁ జంపవచ్చునాయని బహువిధములుగఁజెప్పుచుండ నామదేవులు తనమనస్సున క్లేశమును, చాంచల్యమును జెందక బ్రాహ్మణప్రేతమును తనభుజమున మోసికొనిపోయి భీమనదీతీరమున చితిపేర్చియాశవమును దానియందునిచి తానును అశవముప్రక్కనపరుండి పిడకలను మీఁదవేసికొనియగ్నినంచుకొనియెను. నామదేవులభార్యయీవృత్తాంతమును విని తానునువచ్చి చితియందు పరుండెను. అగ్నివ్యాపించుచుండఁగా నాయూరిబ్రాహ్మణులును, తక్కినవారును నామదేవునినిశ్చయజ్ఞానమును, దృఢమగువైరాగ్యమును నింతయొప్పునే. ఈనిష్ఠయిదివఱకుకనివిని యెఱుఁగము. అనిచెప్పుచు నాశ్చర్యపడి చూచుచుండ వృద్ధబ్రాహ్మణరూపియై యుండినపండరినాథుఁడు నిజరూపముతోడ ప్రత్యక్షమై చితాగ్నినిజల్లార్చి తనచేతులతో నామదేవునినెత్తి యాలింగనముచేసికొనియోవత్సా! నీవంటివైరాగ్యశీలుఁడు ముల్లోకంబులందునులేఁడు. నీనిష్ఠయంబరీష, రుక్మాంగదాదులనిష్ఠనతిశయించియున్నది. పూర్వముభక్తిపరతంత్రుఁడనైయనేకవిచిత్రకృత్యములనుజేసినట్లేకలియుగమునందు నీకుపరతంత్రుఁడనైయనేకాద్భుతకార్యములనుజేయుచున్నాను. అనిచెప్పి నీవైరాగ్యమునకును, నఖండజ్ఞానమునకును, దృఢభక్తికిని, ఎన్నటికి స్థాలిత్యముకలుగకుండునుగాకయునియాశీర్వదించియదృశ్యుఁడయ్యెను. ఈయద్భుతమునుజూచుచుండిన చిన్నపెద్దలందఱును నామదేవునిశరణుఁజెంది శ్రీరుక్మిణీకాంతుఁడగు భగవంతునికల్యాణగుణంబులనుగొనియాడియానందభరితులైరి.

శ్రీహరివాసరవ్రతైకశీలప్రియాయనమః.

# ఇరువదియొకటవయధ్యాయము

## జనాబాయి చరిత్రము.

ఒకసంవత్సరముకార్తికోత్సవమును సేవింపబహుప్రజలు పండరిపురమునకువచ్చి పుండరి సాధునిసేవించి భాగవతులకోలాహలమునుకన్నులారఁజూచి యానందించి వారివారియిండ్లకుఁ బోవునపుడందొకబాలికస్వామిసన్నిధిని నిలచి భాగవతులభక్తిపారవశ్యమునుజూచి యాయా నందమునమనస్సులయించి స్తబ్ధయైయుండెను.తల్లిదండ్రులు మొదలగుబంధువర్గమాబాలికనుతమ తోడనూరికిరమ్మనియెంతబుజ్జగించినను ఆమెసమ్మతింపక నేనీపండరిక్షేత్రమునవసించి పుండరీక వరదునిన్ని,తద్దాసులనుదర్శనముచేయుచుండెదను.మీరునాచింతనువిడిచి యూరికిపొండని చెప్పి నవారలాకన్యకనువదలిపెట్టిపోయిరి.వీరలసంవాదమును వినుచుండినభాగవతులు మిగులనాశ్చర్యపడియీబాలికకింతతీవ్రముగ జ్ఞానభక్తివైరాగ్యములుపరిపక్వమగుటకుఁ గారణముతెలియలేదు. శ్రీమత్పండరినాధుఁడభిమానించెనుగాఁబోలు. (అన్యజన్మనిసర్వాత్మా । విష్ణురభ్యర్చితోమయా) అనురీతిని బాలికసర్వశరీరియగువిష్ణువును పూర్వజన్మమునఁ జక్కఁగానారాధించియుండుననికొనియాడిరి. పిదపనాబాలిక భగవత్సన్నిధినిఁగూర్చుండి భగవంతునిధ్యానించుచుండ నామదేవులుచూచి కరుణించి నీవేల తల్లిదండ్రులనువిడిచియొంటిగనున్నదానవు.నీపేరేమనియడిగిన ఆమెనాపేరు జనాబాయి. నాతండ్రిపండరినాధుఁడు. తల్లిశ్రీరుక్మిణీదేవి. భగవద్భక్తులు నాబంధువులు. అనిచెప్పి మౌనముగనుండెను.నామదేవులుమిగులసంతసించి యోజనాబాయీ! నీవుమాయింటికివచ్చి భగవద్భక్తిచేయుచుండుము. అనిచెప్పి యామెచేతినిబట్టి పిలుచుకొనిపోయి తనతల్లియగు గుణాబాయినిజూచి యోజననీ యీచిన్నది పండరినాధునియందలి భక్తిచే తల్లిదండ్రులు మొదలగుబంధువర్గమును పేక్షించి యిచ్చటనిలిచెను. కావునమనతోడవసించి భగవన్నామస్మరణచేయుచుండునుగాక. అనిచెప్పిపూర్వము శ్రీకృష్ణావతారకాలమున కంసుని పంపునపరమభాగవతుఁడగు నక్రూరుఁడుధనుర్యాగమునకై భగవంతునిబలభద్రునితోడ మధురకుఁబిలుచుకొనిరాఁగా రాజవీధిని కంసునికి చందనముతీసికొనిపోవుచుండిన యేకవక్రయను కుబ్జనుజూచి భగవంతుఁడు (సుగంధమేతద్రాజార్హం । రుచిరంరుచిరాననే । ఆవయోర్గాత్రసదృశం । దీయతామనులేపనం) అనియడిగి యామెచే నంగరాగమునుజెంది యామెకుబ్జత్వమునుమాన్పియాయువతి కోరిన ప్రకారమామెకు తనయంగసంశ్లేషమును గలుగఁజేసియామెదతిగర్భంబునందునుపశ్లోకుఁడనుపరమభాగవతునినవతరింపించిన నాతఁడు నారదశిష్యుఁడై లోకోజ్జీవనమునకై సాత్వికతంత్రమనుగ్రంధమును రచించెను. ఆయేకవక్రయిపుడు పాండురంగనికృపచే జనాబాయియైయవతరించి యననరతము నిరామయమగు శ్రీకృష్ణరసాయనమును పానముచేయుచున్నది. నాభాగ్యవిశేషముచే ఈసుశీలతోడి సహవాసము నాకు లబ్ధమయ్యెను. అని పురాతనవృత్తాంతమును స్మరించియానందించుచుండెను. అదిమొదలుజనాబాయి నామదేవునియింట దినదినప్రవర్ధమానయగుచు నింటిపనులన్నియును జేయుచు సదాభగవధ్యానసరాయణయయియుండెను. ఎవరైననీవెవ్వతవనియడిగిననేను నామదేవునియింటిపరిచారికను. ఈ మహానుభావుఁడే నాకుతండ్రి. అతఁడుతప్ప నాకువేఱెవరునులేరని చెప్పుచుండును.

ఒకనాఁడు నామదేవుఁడు తనయింటసందుకొనియుండఁగా నర్ధరాత్రమున గాలివాన కొట్టుచుండదానిచే నాయింటిపైకప్పాకాశమున కెగిరిపోయెను. అపుడురుక్మిణీకాంతుఁడు

సుదర్శనమును తనచక్రమునుజూచి నీవు పోయినామదేవునియింటిపైకప్పు నెప్పటియట్లుకప్పి యాయింట నొకవర్షబిందువైన నునుపడకుండునట్లుచేయుము. నేనునిదిగో నిన్ను వెంబడించివచ్చెదను. అనినియమించిన సుదర్శనము భగవంతుఁడు నియమించినట్లుచేసెను. తోడనే పాండురంగఁడువచ్చి పడిపోయినగోడలనుజూచి తనచేతితో మన్నుకలిపియెప్పటియట్లు గోడలను నిర్మించెను. భగవంతుఁడు సర్వశక్తుఁడై సత్యసంకల్పుఁడైయుండినను స్వాశ్రితులకు మోక్షవిరోధియనినైహికసుఖములనుమట్టుపఱుచును. (యాచితోపిసదాభక్తై । ర్నాహితంకారయేద్ధరిః । బాలమగ్నౌపతంతంతు । మాతాకింననివారయేత్) అనురీతిని నిప్పునఁబడనపేక్షించు శిశువును తల్లి నివారించునట్లు తనభక్తులైహిక సుఖమునపేక్షించినను హితకామియగు భగవంతుఁడు వీనియపేక్షను తలకట్టఁడనిన నిరపేక్షుఁడగునామదేవునికి గృహక్షేత్రాది యైహికసుఖంబులనొసఁగలేదనుటచిత్రముకాదు. మరియు (హరిర్దుఃఖానిభక్తేభ్యో । హితబుద్ధ్యాకరోతివై । శస్త్రక్షారాగ్నికర్మాణి । స్వపుత్రాయయథాపితా) అనురీతిని హితకామియగు తండ్రి పుత్రుని యారోగ్యమునకై పుండునుగోసికారముంచునట్లు సర్వేశ్వరుఁడు నిజభక్తులకువైరాగ్యముకలుగుటకై దుఃఖములను గలుగఁజేయుచుండును. కానభగవద్భక్తులకు నైహికసుఖము మృగ్యమైబహువిధములగునాపదలు గలుగుచుండును. భగవంతుఁడిట్లుగోడలు పెట్టి క్రిందపడియుండినచెత్తనుదూరముగతీసికొనిపోయి పాఱవేయుచుండఁగానింతలో ప్రాతఃకాలమైనందున నామదేవులు వెలుపటవచ్చి భగవంతునిఁజూచి నమస్కరించియిదియేమివేషము. ఇచ్చటనేమిచేయుచున్నావనియడిగిన వాసుదేవుఁడతనిననుగ్రహించియో నామదేవా! గాలివానచే నీయింటికపాయముకలిగెను. నీవుసంసారకార్యములనుబొత్తిగఁబాటింపక సదానన్ను ధ్యానించుచుండుటచే నీతల్లియగుగుణాబాయి నిష్ఠురములాడునని నేను అర్ధరాత్రమునవచ్చి నీయింటినెప్పటియట్లుచక్కపెట్టితిని. అనిచెప్పుచుండ గుణాబాయి పరుగెత్తివచ్చి భగవంతునికి వందనముచేసెను. భగవంతుఁడు నామదేవునితోసల్లాపముచేయుచునతనియింటిలోపల ప్రవేశించి నెమ్మదిగ కూర్చుండెను.

అపుడు జనాబాయివేగముగవచ్చి నమస్కరించి భగవంతునికాయాసము కలిగెననియతనిశరీరమునుతిన్నఁగ పట్టుచుకృపానిధే, ఆశ్రితవాత్సల్యైకజలధే మమ్ము రక్షించుటకై నీశరీరమునకు కష్టమునుగలుగఁజేసికొంటివి. అనిచెప్పుచుండ నామదేవులు స్వామీ నీశరీరమునకాయాసమధికమైయుండుటచే లేచియుష్ణతీర్థమున స్నానముచేసి భుజింపరమ్మని ప్రార్థించెను. గుణాబాయి భగవంతునికి స్నానమునకుతీర్థమిచ్చియనుష్ఠానానంతరము భోజనమునకై స్థలశుద్ధిచేసి యాకులనువేసెను. అపుడు గోవిందుఁడు, విఠ్ఠలుఁడు, నారాయణుఁడు, మాధవుఁడను పేళ్లుగల నామదేవునిపుత్రులు నలువురితోడ భగవంతుఁడొకబంతిగఁగూర్చుండెను. గుణాబాయియు నామదేవుఁడును నొకప్రక్కఁగూర్చుండిరి. భగవంతుఁడు నియమించినందున ఆనియమనమును అతిక్రమింపఁగూడదని భర్తయనుమతినిజెంది రాధాబాయి తానునొకమూలఁగూర్చుండెను. ఇట్లందఱునుగూర్చుండఁగా జనాబాయి వడ్డించుచు తనమనసున నన్నమ్మాత్రమువిడిచి యుఱదఱునుగూర్చుండిభుజించుట రసభంగమనితలఁచెను. భగవంతుఁడుకొంచెముభుజించి నాకన్నము రుచింపలేదనిన నామదేవులు భక్తవత్సలా అదినిజమే. జనాబాయియీబంతిని లేనందున నీకాహారమురుచింపలేదనెను. రుక్మిణీకాంతుఁడు భుజింపకయన్నమున చేతినుంచుకొని కొంతసేపు

కూర్చుండి తక్కినవారుభుజించియయినంతట నందఱునులేచి గండూషపూర్వకముగా చేతులు కాళ్లుకడుగుకొని యాచమనముచేసి సుఖోపవిష్టులైరి. భగవంతునికి జనాబాయియందుఁగలిగియుండు ప్రేమాధిక్యమునకు రాధాబాయియు, గుణాబాయియు నాశ్చర్యపడిరి. గుణాబాయి భగవంతుని భుక్తశేషమును జనాబాయికిచ్చి యిది బ్రహ్మాదులకలభ్యము. నామదేవునిసహవాసముచే నీకులభించెనని చెప్పెను. అందుకు జనాబాయి మనము వెనుకభుజింతమని యామహాప్రసాదమును పదిలముచేసియుంచెను. ఆరాత్రినామదేవులును, భగవంతుఁడునొక్క శయ్యను పరుండియుండ నామదేవుఁడు నిద్రించినపిదప భగవంతుఁడు సద్దుచేయకలేచి జనాబాయియొద్దకువచ్చి యోచిన్నదానా నాకాఁకలిగనున్నది. నామదేవునితోఁడ భుజించునపుడు నీవురసభంగమనితలఁచినందున నాకన్నము రుచింపదయ్యె. ఇపుడునీవునాయాఁకలిని దీర్పవలయుననిన జనాబాయియోలక్ష్మీకాంతా నీకృపకుసదృశముగ నేనీయఁదగినపదార్థమెద్దియునులేదు. నాయాత్మనొసఁగెద నంగీకరింపుము. ఇప్పుడకాలము. కానభుజింపఁదగినవస్తువులెవ్వియును లేవు. నీభుక్తశేషమును గుణాబాయి నాకిచ్చెను. దానినీకిచ్చుటకు సంకోచపడుచున్నాను. అని చెప్పిన జనాబాయి ముగ్ధాలాపములకు పండరినాథుఁడు సంతోషించి నీవు సంకోచపడవలదు. నాభుక్తశేషమును తెమ్మని చెప్పిన జనాబాయి మహాప్రసాదమని దానిని దెచ్చి భగవంతునికెదుటనునిచెను. భగవంతుఁడు జనాబాయిని తనతోడఁగూర్చుండఁబెట్టుకొని యిరువురుగ భుజించిరి. అదిచూచి రుక్మిణీదేవి వేదపురుషునికపరిచ్ఛేద్యుఁడగుభగవంతుఁడీజనాబాయితోడ నేకపాత్రమున భుజించుచున్నాఁడని యాశ్చర్యపడెను. ఇట్లిరువురును భుజించి చేతులుకడుగుకొని శయనించిరి. గుణాబాయియిదియంతయుఁజూచుచుండి తిన్నగనడుగులిడుచు నామదేవునియొద్దకువచ్చి యీవృత్తాంతమునతనితోఁజెప్పిన నతఁడు ఓతల్లీయిదివింతకాదు. భగవంతుఁడుభక్తిక్రీతుఁడుగదా. రామావతారకాలమున శబరియెంగిలిభుజింపలేదాయని చెప్పినవిని గుణాబాయి తనచోటికిపోయెను. జగన్నివాసుఁడు జనాబాయి నిద్రించినవెనుక నెప్పటియట్లు నామదేవునిశయ్యనుపరుండెను. మరలనాలవజామునలేచి జనాబాయియొద్దకువచ్చి చేయితట్టిననామె నిద్రాతిశయముచే మానముగనుండెను. భగవంతుఁడు తనచేతితోనామెనులేవనెత్తి కూర్చుండఁబెట్టి తనపీతాంబరముతో ముఖముతుడిచియోజనాబాయీనీవుపిండివిసరునప్పుడు నేనునునీతోడవిసరుచుసంతోషింపవలయుననియపేక్షించి వచ్చితిని. అనినజనాబాయి తిరుగటిరాళ్లను సంధించిధాన్యమునుదెచ్చియుంచఁగా భగవంతుఁడోబాలికామణీ నీవు తిరుగటి కొయ్యను చేతఁబట్టుకొని పాడుచుండుము. నేనునీపాటలనువినుచుపిండివిసరెదనని చెప్పి యామెపాడుచుండ తానుపిండివిసరుచుండెను. జనాబాయియపుడు భగవంతునిసముఖమున పాడినపాటలయొక్క తాత్పర్యమేమనఁగా నివృత్తిదేవ, జ్ఞానదేవ, సోపానదేవులు నాకుఆప్తబంధువులు. వారలప్రసాదముచే శ్రీశార్ఙ్గపాణినాయందు కృపచేసెను. నామదేవులు నాతండ్రి, రాధాబాయి నాప్రియమైనతల్లి. కబీరు, సావంతుఁడుమొదలగువారు నాసహోదరులు. వారుచేసినయతిశయములను నేనేమనిచెప్పుదును. వారలుభక్తిచేసిచక్రపాణిని స్వాధీనము చేసికొని యనేకాద్భుతములను గలుగఁజేసి సుఖానందమున పరిపూర్ణులై యున్నారు. పైఠ్నిపురమున బ్రాహ్మణులు జ్ఞానేశ్వరులనవమానముగ మాటలాడినప్పుడతఁడుమహిషమునోటిచే నాలుగు వేదములను జెప్పించెను. ఘోరాకుంభార్ పాండురంగనిధ్యానించుచు తనబిడ్డను మంటిలోఁడద్రొక్కి భగవంతునియ్యా

ననతిక్రమించితినని తనచేతులను ఛేదించు కొనెను. పిదప నామదేవులకీర్తనలను వినుచుండ నా చేతులెప్పటియట్లు మొలచెను. మృత్యుపరవశమైన బిడ్డని పాండురంగఁడు తెచ్చియిచ్చెను. ఇదియేమియాశ్చర్యము. తోఁటవాఁడగు సామంతునినివనమాలి చూడఁబోయిన చోటవాఁడు తన వక్షస్థలమును చీల్చి భగవంతుని నితనహృదయమున నుంచుకొనెను. అనంతకోటిబ్రహ్మాండము లను తనకుక్షినుంచుకొనియుండు భగవంతుఁడు సంతోషముతోడ సామంతుని హృదయమున దాఁచుకొనెను. అట్లుదాఁచుకొన్నవానిని తోడ సేనామదేవులు వచ్చిబయలుపఱిచిరి. నాయిష్ట బంధువగు కబీరుకాశిలో గుడ్డలు నేయునపుడు భగవధ్యానముచే మైమఱచియుండ కోదండపాణి వచ్చికూర్చుండి యాగుడ్డలను నేసెను. శివరాత్రినాఁడు తూర్పుముఖమైయుండిన నాగనాథస్వామి నామదేవులకీర్తనలను వినుటకై తనయాలయముతోడ పశ్చిమాభిముఖుఁడయ్యెను. అట్లునామదేవులు కీర్తనము చేయుచుండ తొమ్మిదిలక్షలపతాకహస్తులాకాశమునుండి భూమికిదిగిరి. అఘటితములగు నీయద్భుతములకుఁ గారణమిపుడు నాతోడఁగూర్చుండి పిండివిసరుచుండువాఁడు. నీరిమహిమను వర్ణించుటకు వేదశాస్త్రములకు సాధ్యముకాదనుటయే. ఈతాత్పర్యముతోఁ గూడిన పాటలను జనాబాయి పాడుచుండఁగా భగవంతుఁడు శ్రవణానందముగ వినుచు పిండి విసరుచుండెను.

అపుడు గుణాబాయి యీశబ్దమును వినిపడకయుండుండి యోజనాబాయీ నీతోడ పిండి విసరువారెవరని యడిగిన ఆమెమౌనముగానుండెను. అప్పుడు గుణాబాయి పిండివిసరుటకొక కూలికత్తెనుంచుకొంటివా యేమి. ఈచీఁకటియందు కూలికివచ్చిన స్త్రీయెవతయని కోపముతో నడిగిన భగవంతుఁడు పిండివిసరుచుండు నాపేరు కృష్ణాబాయి. నేనుకూలికిరాలేదు. పాటలవినుటకువచ్చి పిండివిసరుచున్నానని చెప్పెను. అపుడా నామదేవులు తల్లియొద్దకుపరుగెత్తివచ్చి యోతల్లీయితఁడు త్రైలోక్యరక్షామణియగు గోపాలచూడామణిగదా. నీకు తెలియలేదా. ఆమహాత్మునికఠినముగఁ బలుకఁదగునేయని చెప్పినగుణాబాయి సిగ్గుపడియింటిలోపల ప్రవేశించి జనాబాయిమిగులభాగ్యశాలిని. ఇదియత్యద్భుతము. శ్రీరుక్మిణీభునకుచద్వంద్వైకభూషామణియగు సౌందర్యము ద్రామణిని ఈజనాబాయియింత స్వాధీనము చేసికొనియున్నదిగదా. దీనినెఱుఁగకయవివేకముచే విపరీతముచేసితిని. బ్రహ్మాదులకును స్తుతించుటకు సాధ్యపడనివానిని కఠినముగమాటలాడితిని. ఆహా. ఇట్లుభగవంతునికినంతరంగ భక్తురాలగు జనాబాయికిని నపరాధము చేసిన నాకెంత క్రూరదండనవిధించిననుతగును. అనివ్యసనపడుచుండెను. భగవంతుఁడుపిండినంతయునువిసరి మఱికొంతరాత్రిశేషించియుండినందున జనాబాయితోడ మాటలాడుచుండి కొంతసేపటికిని ద్రించెను. వెనుకనరుణోదయమైనందున జనాబాయి (ఉత్తిష్ఠనరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికం) అనిచేయి తట్టియోస్వామీ సన్నిధిలో నిన్నర్చించుటకును, దర్శించుటకు ననేకభక్తులువచ్చి కాచియుందురు. అనిచెప్పిన భగవంతుఁడులేచి జనాబాయియందుఁదనకుఁగల యాదరాతిశయమునందఱికిని ప్రకటనముచేయవలయునని తలఁచి పీతాంబరముతోడ దివ్యాభరణములనచ్చటనునిచి జనాబాయియొక్క జీర్ణవస్త్రమును గప్పుకొని సన్నిధికివచ్చెను. అర్చకులు తలుపుతెఱచి లోపలప్రవేశించిచూడఁగా భక్తవత్సలుఁడు జీర్ణవస్త్రమును గప్పుకొనియుండెను. అదిచూచికొందఱు దేవాధిదేవుఁడగు నీకీజీర్ణవస్త్రముతగునేయనియడిగిరి. కొందఱు మర్మజ్ఞులు శ్రీరామావతారమున శబరియు, కృష్ణావతారమునకుబ్జయు, నిపుడునీ ఎవతో యొక (స్త్రీ)

భగవంతునికత్యంతమంతరంగురాలై యుండవలయును. దానియందలి తనమక్కువనుబయలుపరుచుటకై యాయువతిధరించియుండినజీర్ణవస్త్రమును మనప్రాణనాథుఁడు కప్పుకొని వచ్చెనని యర్చకులాజీర్ణవస్త్రము నెత్తి చూచిన నాభరణములు లేవయ్యెను. అదిచూచియర్చకులు మొదలగువారు మనస్వామిప్రీతితో పిడికెఁడటుకులిచ్చువారికి తనసర్వస్వమునిచ్చును. ఇపుడుచింతయంతివలె భక్తియోగయుక్తయగునొకభాగ్యశాలినియొక్కభక్తియనువలనుఁజిక్కియీభక్తప్రియుఁడు తనపీతాంబరాభరణంబులనాయమ్మకిచ్చియామెజీర్ణవస్త్రమును మహాప్రసాదమనికప్పుకొని వచ్చెను. లోకవంద్యయగునాపుణ్యరాశియెందుండునదియో యెఱుఁగము. మనముసన్నిధితలుపులను ముద్రించియుండుకాలమున భగవంతుఁడిట్లుచేసిన మనమేమిచేయవచ్చును. అనిచెప్పి కొంతవిచారించి కొన్నాళ్లకు మునుపు సన్నిధికి వచ్చినజనాబాయి ధరించియుండినవస్త్రమిదియని శంకించియందఱునుఆమెయొద్దకుపోయియోజనాబాయీ నీయంతరంగభక్తిచే దేవశిఖామణిని వశీకరించితివి. కాన మేముచేయునుపచారములు భగవంతునికి రుచింపవయ్యెను. రాత్రియతఁడునీయొద్దకు వచ్చితనపీతాంబరాభరణంబులను నీకిచ్చినీజీర్ణవస్త్రంబును ధరించుకొనివచ్చెను. ఇప్పుడాపీతాంబరాభరణంబులనిచ్చితివేని భగవంతునికి సమర్పింపవచ్చుననిరి. జనాబాయి వారలనుజూచియావస్తువులు నేనెఱుఁగననిన వారుఓయువతీయాపదార్థములు నీయొద్దనుండుననుటకుసందియములేదు. కానవానినిమ్ము. అట్లుచేయవేని నీవుదండింపఁబడుదువనిన జనాబాయి యిదియేమి విపరీతము. నన్నేలనిందకులోఁబఱిచెదరు. ఆపదార్థములను నేనెఱుఁగను. అవినాయొద్దనుండిన నాకన్నులుచెడిపోవును గాకయని ప్రతిజ్ఞచేసెను. అపుడు వారులోపలప్రవేశించియానుదతిశయనించుస్థలమునుశోధింపఁగానాయాభరణములన్నియును పీతాంబరమునఁజుట్టియొకమూలనుంచఁబడియుండెను. అదిచూచివారందఱుఈస్త్రీ భగవద్ద్రవ్యము నపహరించి తానెఱుఁగనని ప్రతిజ్ఞచేసెను. ఇట్టిదుష్టాత్మను గ్రామమునకువెలుపల రాజమార్గమునకుసమీపమున శూలమునఁగ్రుచ్చవలయునని గ్రామాధికారులకెఱుకచేసి యందఱునేకహృదయులై జనాబాయినీడ్చుకొని పోయి చంద్రభాగతీరమున నాటియుండెడుశూలముచెంతనిలిపిరి. అపుడు జనాబాయి (శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిషద్వాక్యసంపూజ్యమంత్రం। సంసారోత్తారమంత్రం సముపచితతమస్సంఘనిర్యాణమంత్రం। సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసందష్టసంత్రాణమంత్రం। జిహ్వేశ్రీకృష్ణమంత్రం జపజపసతతంజన్మసాఫల్యమంత్రం) అనఁగా ఓనాలుకా శత్రునాశనమునకు ముఖ్యమంత్రమును, ఉపనిషద్వాక్యములకు పూజ్యమంత్రమును, సంసారాంబుధిని దాఁటించుమంత్రమును, మిక్కుటమగునజ్ఞానరాశిని నాశముచేయుమంత్రమును, సర్వైశ్వర్యములనిచ్చుటకొక్కటియగుమంత్రమును, వ్యసనములనెడిసర్పములచేఁగఱవఁబడినవారిని కాపాడెడిమంత్రమును, జన్మసాఫల్యమంత్రమును నగు శ్రీకృష్ణమంత్రమును నెడతెగకజపింపుము. అనియనుసంధించుచుండెను. (యజ్ఞానాంజపయజ్ఞోస్మి) అనఁగా యజ్ఞములయందు జపయజ్ఞము నేనని భగవద్గీతయందు తానే చెప్పియున్నాఁడు. కాన జనాబాయిజపమునకు సంతసించి భక్తాపాయభుజంగగారుడమణియగుగోపీలోచనచాతకాంబుదమణియాయినుపశూలమును భస్మమగునట్లు సంకల్పించెను. ఆయద్భుతమును జూచి యందఱునునాశ్చర్యపడియీనారీశిరోమణియొక్కభక్తి నిస్సమాభ్యధికమైయున్నది. అనియాసాధ్వినిగొనియాడియనుతాపయుక్తులై వినయముతోనామెకువందనముచేసియొల్లనీభ

ర్తిముల్లోకములందును మేలుబంతియైయున్నది. మాయపరాధంబులను క్షమింపవలయునని ప్రార్థించిపండరినాథునిలీలావిశేషములను బహువిధములుగ స్తుతించుచు స్వస్థానములకుఁబోయిరి.

ఒకనాఁడు జనాబాయి నామదేవునియింటివాకిటను గూర్చుండి పాండురంగనివిషయముగ కవనము చేయుచుండెను. భగవంతుఁడు సన్నిధిగర్భగృహమున నేకాంతముగనుండి యామెపలుకులు వాణికృతులనొకతాటియాకునందు లిఖించుచుండెను. అపుడుజ్ఞానదేవుఁడు దర్శనార్థము రాఁగా భగవంతుఁడా తాటియాకును మఱుఁగుచేసెను. జ్ఞానదేవుఁడు భగవంతునికి సాష్టాంగవందనముచేసియేకాంతముగ వ్రాయుచుండి నన్నుజూచిమఱుఁగుచేసినదియేమనియడిగిన భగవంతుఁడు మందస్మితవదనారవిందుఁడై జ్ఞానేశ్వరా! జనాబాయి నామదేవునియింటివాకిటఁ గూర్చుండి పరమభక్తితోడ నామీఁదకవనము చేయుచున్నది. అది సనకాదులస్తుతికన్న నతిశయించియుండుటచే ప్రేమతోడనాకృతులను వ్రాయుచున్నాననెను. జ్ఞానదేవుఁడాశ్చర్యపడి విజయీభవ. రుక్మిణీకాంతా! నీప్రభావమును శ్రుతులువర్ణించుచున్నవి. నీయనంతకల్యాణగుణములనెడి జలరాశిని వాల్మీకి, పరాశర, వ్యాస, శుకాదిమేఘములాశ్రయించి తజ్జలములనుపానముచేసి జీవసస్యములకు ధారకముగ వర్షించుచున్నవి. అనంతాదినిత్యసూరులును, బ్రహ్మాదిదేవతలును, సనకాదియోగులును, నారదాదిదేవఋషులును, ప్రహ్లాదాదిభక్తులును నిన్ననవరతము భక్తిపరవశులై స్తుతించుచున్నారు. ఈయందఱనుపేక్షించి జనాబాయికవనమునకు చొక్కి వ్రాయుచుంటివి. ఇది ధేనువుసద్యోజాతమగువత్సమునందలి ప్రేమాంధతచే తనపూర్వవత్సములను, పోషకులనుగొమ్ములతోపొడిచిత్రోయుటను బోలియున్నది. (త్వయికించిత్సమాపన్నే కింకార్యంసీతయామమ) అనఁగానీకొకింతయాపదగల్గినసీతతోనాకేమికార్యమనిసుగ్రీవమహారాజుతో చెప్పితివిగదా. ఇదినీకుస్వభావగుణమైయున్నదిగదా. భర్తతనయంతరంగమును పతివ్రతయగుభార్యకుదాఁచనట్లు దేవరవారియంతరంగమునుఅస్మదాదులకువ్యక్తపఱుపక దాఁచుటకునిమిత్తమేమి. నీవుభక్తపరతంత్రుఁడవనిముల్లోకంబులెఱుఁగును. ఇందుకులజ్జయేల. నీకింతయభిమతవిషయమైయుండునట్టిజనాబాయిని నీతోడవచ్చి దర్శింపవలయునని యపేక్షించెదను. అనివిన్నవించిన నాశ్రితపరతంత్రుఁడగు నందనందనుఁడువల్లెయని సంతోషచిత్తుఁడై పూర్వము కుబ్జాగృహమునకుద్ధవునితోడవచ్చినట్లిపుడు జనాబాయియొద్దకు జ్ఞానదేవునితో వచ్చెను. ఈయద్భుతమునుజూచి భగవంతునియాశ్రితపారతంత్ర్యమును వర్ణించుచు ననేకభాగవతులువెంబడించిరి. అట్లుభగవంతుఁడు జ్ఞానదేవాదులగునంతరంగభక్తులతోడ వచ్చుటనుజూచి నామదేవుఁడెదుర్కొని సాష్టాంగవందనముచేసి తోడితెచ్చి కూర్చుండఁబెట్టి భగవన్నామసంకీర్తనముచేయుచుండిననందఱునానందపరవశులై . వినుచుండిరి. భగవంతుఁడు నామదేవునిజూచియీసాధువులందఱును జనాబాయినిజూడవలయునని యపేక్షించి వచ్చిరి. ఆస్త్రీరత్నమును రప్పింపుమనిన నామదేవులు మహాభాగ్యమనివెడలి పేడత్రొక్కుచుండిన జనాబాయినిబిలుచుకొనివచ్చెను. జనాబాయి పాండురంగనికిని, జ్ఞానదేవులుమొదలగు సాధుజనులకును వందనముచేసి యొకప్రక్క నిలుచుకొనియుండఁగా జ్ఞానదేవుఁడు నామదేవులను జూచి నేఁడొకయతిశయమును గంటిని. ఈపుణ్యశ్లోకుఁడు, జనాబాయి తనవిషయమై చేసిన కవనమును తానేయేకాంతముగ వ్రాయుచుండినన్నుజూచినంతట తాళపత్రముదాఁచియుంచెను. అనిచెప్పిన భక్తప్రియుఁడువిని జనాబాయియొక్కభక్తిరసమును నేను వ్రాసినదితప్పుకాదు. ఈ

సుదతియొక్క చిలుకపలుకులు నాకానందమును గలుగఁజేయుచున్నది. తేటవచనములయొక్కయు వేదగర్భమగుపరమతత్త్వమైయున్నది. కాననాకృతులను నామానసికపత్రమున వ్రాసికొంటిని. ఈజనాబాయి నన్నుస్తుతించినకృతులను పఠించువారిగృహద్వారమునందు నేనుసాన్నిధ్యముచేసి వారలనుజాగరూకుఁడనై రక్షించుచుందును. అనిభగవంతుఁడానతిచ్చినవిని జ్ఞానదేవాదులుచేతులుతట్టి జయజయఘోషములుచేసిరి. అపుడచ్చట కబీరు, శోకామేళుఁడు, రోహిదాసుఁడు, సావంతుఁడుమొదలగుపరమభక్తులుండిరి. జ్ఞానదేవ,నామదేవులు గ్రహములనడుమ ప్రకాశించుసూర్యచంద్రులవలెప్రకాశించుచుండిరి. జ్ఞానదేవుఁడు జనాబాయినిజూచియో స్త్రీరత్నమా శ్రీకృష్ణునికత్యంతమంతరంగుఁడైనయుద్ధవుఁడిపుడునామదేవుఁడైపండరినాథుని నారాధించిస్వాధీనముచేసికొనియెను. నీవుపూర్వజన్మమున భగవంతుని నేరూపముగా భజించితివనియడిగిన జనాబాయి నమ్రయై యోస్వామీ నేను శ్రీకృష్ణావతారకాలమున కుబ్జనైయంగరాగములనిచ్చి భగవంతుని నారాధించితిని. వాసుదేవుఁడు కంసవధానంతరము తనప్రాణసముఁడగు నుద్ధవునితోడనాయింటికివచ్చి నన్ననుగ్రహించెను. ఇపుడాభగవంతుఁడు పుండరీకవరదుఁడై యుద్ధవాంశజుఁడగు నామదేవునికి పరతంత్రుఁడైయుండుటచే నేనుభగవంతునిమనోభావంబునకనుగుణముగ జనాబాయినై యుద్ధవాంశజుఁడగునామదేవునియభిమానమును జెంది తద్వారా యీభగవంతుని కటాక్షపాత్రమునకులక్ష్యమైతిని. అనివిన్నవించినవిని జ్ఞానదేవుఁడాశ్చర్యపడి యసల్లైన నీవపారపుణ్యరాశివి. కానబ్రహ్మాదులకును దుర్లభుఁడగుహృషీకేశుఁడు నీవశవర్తియై యున్నాఁడు అనిచెప్పెను. పిదపభగవంతుఁడచ్చటనుండిన భక్తులనుజూచి యోసాధువులారా యిదిమొదలునన్ను గీర్తించువారలలో వీరివీరికీర్తనలను వీరువీరువ్రాయవలయునని యొకనిర్ణయముచేసెదను. జ్ఞానేశ్వరులకృతిరత్నములను సచ్చిదానందబ్రాహ్మణుఁడును, నివృత్తిదేవుని కృతులను సోపానదేవుఁడును, ముక్తాబాయికృతులను జ్ఞానేశ్వరుఁడును, శోకాపరమానందుని కృతులను వీసోబాకేశుఁడును, సావంతునికృతులను శివోబాఅర్చకుఁడును, కూర్మదాసుని కృతులను శయద్దేవుఁడును, అనంతభట్టునికృతులను చోకామేళుఁడును వ్రాయవలయునని నియమించి నామదేవునియొక్కయు, జనాబాయియొక్కయు సుధారసకృతులను నేనే వ్రాసెదనని చెప్పి జ్ఞానదేవులనుజూచి యిఁకను జనాబాయికృతులను మీకుచూపుటకు సంకోచములేదనిచెప్పెను. ఇదివిని సాధుజనులు భగవంతునిఁజూచి యపర్యాప్తామృతమగు దేవా! విశ్వనియంతయగునిన్నిట్లువశ్యముచేసికొనియుండుజనాబాయియొక్క భాగ్యవిశేషమువాఙ్మానసగోచరమైనది. చంద్రాంతర్వర్తియగు శశమందఱకునుమాననీయమగునట్లు నీపరిగ్రహముచే జనాబాయి జగద్వంద్యయయ్యెను. ఈభాగ్యరాశిని పరిచారికయనియిఁకనెవరైనను హేయముగపల్కఁదగునేయని కొనియాడిరి. అపుడు నామదేవులు పరిమళమిళితశుద్ధోదకము తెచ్చి (అస్మద్గురుసమారంభాం । మత్స్యాధీశ్వరమధ్యమాం। లక్ష్మీనాయకపర్యంతాం। వందేగురుపరంపరాం) అనిగురుపరంపరానుసంధానముచేయుచు భగవంతునియొక్కయు, భాగవతులయొక్కయు శ్రీపాదతీర్థమునుజేర్చి (విష్ణుపాదోదకంపీత్వా । కోటిజన్మాఘనాశనం । ఏతత్సమస్తపాపానాం । ప్రాయశ్చిత్తంమనీషిభిః । నిర్ణీతంభగవద్భక్త । పాదోదకనిషేవనం) అనఁగా విష్ణుపాదోదకమునుపానముచేసిన కోటిజన్మములయందలిపాపములునశించును. చేతనునిచేఁజేయఁబడినసమస్తపాపములకు భగవద్భక్తులపాదోదకముప్రాయశ్చిత్తమగునని ప్రజ్ఞావంతులచే నిర్ణీత

మైయున్నదనితత్ప్రభావమును గొనియాడి (పిబఙ్ శిరసిధారయేత్) అనురీతిని ఆతీర్థమును స్వీకరించి శిరస్సునధరించి భగవంతునికిని, సాధువులకునుబహువిధోపచారములను జేసెను. పిదపభగవంతుఁడుభక్తులతోడసన్నిధికిఁబోయిజరగినవృత్తాంతములను శ్రీరుక్మిణీదేవికిఁ జెప్పెను.

స్తవప్రియాయనమః.

---

## ఇరువదిరెండవయధ్యాయము.

### మత్స్యేంద్రనాధునిచరిత్రము.

---

ఒకనాఁడు క్షీరసముద్రతీరమున కైలాసపతియగుపరమశివుఁడు పార్వతీదేవితోడ సంచరించుచు శ్రీతారకనామభజనముచేయుచుండెను. అపుడుపార్వతీదేవి పరమశివునికివందనముచేసి యోప్రాణనాధా నీవిపుడు భజించుశ్రీతారకనామముయొక్కమాహాత్మ్యమును నాకుఁ జెప్పవలయుననిప్రార్థించిన శంకరుఁడు మిగులసంతోషించి పార్వతినిజూచి యోగిరిజాయిపుడు నీవడిగినశ్రీతారకనామమహిమను లెక్కించిచెప్పుటకు దేవతలకును, మహర్షులకును సాధ్యముకాదు. శ్రీతారకబ్రహ్మమగురామునియవతారము సాధుపరిత్రాణ, దుష్కృతవినాశ, ధర్మసంస్థాపనములకై చేయఁబడియున్నది. ఈయవతారమున సమస్తకల్యాణగుణములును మిగులప్రకాశించుచుండును. ఈభగవంతునికటాక్షముచే కోసలదేశమునందలి నిఖిలచరాచరములు ముక్తిఁజెందె. ఈమహాత్మునిచే వర్ణాశ్రమధర్మంబులు రక్షింపఁబడియెను. ఈపురుషోత్తముని నామములను జపించువారికి భుక్తిముక్తులు కరస్థములైయుండును. నారద, వాల్మీకాదులీ నామప్రభావమునెఱుఁగుదురు. నిత్యవిభూతియందు అయోధ్యయనుదివ్యనగరంబున భగవంతుఁడు శ్రీరామరూపియై సాన్నిధ్యముచేసి శ్రీతారకమంత్రోపాసకులకు ధ్యానగమ్యుఁడైవారలకు భుక్తిముక్తులనొసఁగుచున్నాఁడు. ఈరామభద్రునియొక్కయు, నతనినామములయొక్కయు వైభవము రామతాపనీయమనునుపనిషత్తునఁ జెప్పఁబడియున్నది. మఱియుభగవంతుఁడు రామరూపమునుబరిగ్రహించి కింపురుషవర్షాధిపతియైయావర్షజనులచే నుపాసింపఁబడుచున్నాఁడు. బ్రహ్మాదిదేవతలచే ప్రార్థితుఁడై యీవైవస్వతమన్వంతరమున దశరథపుత్రుఁడై యవతరించి శరణాగతివైభవమును ప్రకటించెను. ఈభక్తవత్సలునికి వాచకమగు శ్రీతారకనామమును పఠించుటచే సహస్రనామములను బఠించినఫలముసిద్ధించును. ఈరామభద్రునిచరిత్రముసర్వలోకములయందును నెల్లరచేశ్రద్ధాభక్తులతోడ పారాయణము చేయఁబడుచున్నది. విష్ణులోకంబున శ్రీమహావిష్ణువునకు విష్వక్సేనుఁడును, సత్యలోకమున హిరణ్యగర్భునికి మార్కండేయమహర్షియు, కైలాసమునశంకరునికి నందికేశ్వరుఁడును, శతకోటిప్రవిస్తరమగు శ్రీరామాయణమును వినుపించుచున్నారనియు, నింద్రాదిలోకములయందేఁబదికోట్లు, పదికోట్లు, ఒక్కకోటి, సంఖ్యలచే నిర్మింపబఁడియుండు శ్రీరామాయణము పారాయణముచేయఁబడుచున్నదనియుబ్రహ్మాండాది పురాణములు చెప[illegible]న్నవి. నార[illegible]దేశముచే బ్రహ్మను[illegible]మును జెందిన వాల్మీకిమహర్షి యీ మనుష్యలో[illegible] శ్రీరా[illegible]నిరువదినాలుగువేలసంఖ్యగలదిగా రచించెను. శ్రీరామభద్రునితార[illegible]పాసించిసమస్తదేవతలును[illegible]వారివారిపదములను జెందిరి. ఇట్టితా

రకమహామంత్రమునీ సమస్తకల్యాణగుణాత్మకుఁడగు లక్ష్మీకాంతుఁడు పూర్వము నాకుపదేశించెను. అట్టిపరమమంత్రమును శ్రద్ధాభక్తిసమన్వితయగునీకు నేనుపదేశించెదను. అనిచెప్పి వినీతయగు పార్వతికి పరమశివుఁడు శ్రీతారకమంత్రోపదేశము చేసెను. ఇట్లద్రికన్యకకు శంకరుఁడుపదేశించుచుండ సముద్రంబున సంచరించుచుండిన గర్భిణియగు నొకమత్స్యము పార్వతీపరమేశ్వరులను ప్రేమతోఁ జూచుచు నచంచలమైయుండెను. పూర్వము పరమభాగవతుఁడగు ప్రహ్లాదుఁడు తల్లిగర్భముననుండి నారదోపదేశము ననుగ్రహించినట్లు మత్స్యగర్భముననుండిన శివాంశమగు జీవుఁడు పరమశివోపదేశమును బొంది సదా శ్రీతారకనామమును ధ్యానించుచు చిరకాలము మత్స్యగర్భమున నవసించి సహజజ్ఞానముతోడ మనుష్యరూపియై జనించెను. భగవత్సంకల్పముచే లోకోజ్జీవనార్థము భరతఖండమునఁ జేర్పఁబడెను. ఆపురుషుఁడు మత్స్యగర్భమున జనించినందున మత్స్యేంద్రుఁడని పిలువఁబడియెను. అతఁడు తనశరీరము మత్స్యగంధముతోఁగూడియుండినందున మనుజులచెంతఁ జేరక నేను అస్పృశ్యుఁడనని చెప్పుచుండెను. అతఁడు సాక్షాచ్ఛివాంశజుఁడగుటచే జ్ఞానవైరాగ్యనిక్షేపమైయుండెను.

ఇతఁడు సకలజగజ్జీవనమో, కల్యాణగుణాకరమో, మూర్తీకరించిన శ్రీతారకబ్రహ్మమో, గుణాతీతశుద్ధస్వరూపమో, యనిసాధువులు తన్నుఁగొనియాడుచుండ జననమాదిగ నవిద్యాస్పర్శములేక ప్రకాశించుచుండెను. ఈమహాత్ముఁడు తీర్థయాత్ర చేయుచు, పెక్కుతీర్థంబులఁ గ్రుంకుచు దివ్యక్షేత్రంబుల సన్నిధి చేసియుండు భగవద్రూపంబులను దర్శించుచు, భిక్షాన్నముచే జీవించుచు ననికేతనుఁడై, దినములఁ గడపుచుండెను. ఒకనాఁడొకయూరిలో నొకవర్తకునియింటికి పోయి యస్పృశ్యునికి భిక్షయొసఁగుఁడనిన ఆవర్తకునిభార్య యన్నమును దెచ్చి యతనికిచ్చి మహాతేజస్వియై, కాషాయధరుఁడై, భస్మోద్ధూళితశరీరుఁడైయుండు మత్స్యేంద్రనాథుని రూపమును జూచి యితఁడెవఁడో మహాత్ముఁడని తలఁచి యోసాధుజనాగ్రేసరా యెందుండి యెందుఁబోవుచు నిందులకేతెంచితిరని సవినయముగ నడిగిన నోతల్లీ నేను అనికేతనుఁడను. తీర్థయాత్రాపరుఁడను. అస్పృశ్యుఁడను అని చెప్పిన ఆవర్తకునిధర్మపత్ని యోమహాత్మా! మాకధికధనముండియును పుత్రభాగ్యము లేనందున మాయిల్లు చంద్రికలేనిరాత్రివలెనున్నది. కాననాకు సంతానము కలుగునట్లనుగ్రహింపుమని ప్రార్థించిన ఆమత్స్యేంద్రనాథుఁడామెననుగ్రహించి యొకచిటికెఁడు విభూతిని ఆమెచేతనిడి దీనిని భుజింపుము. నీకు విష్ణుసదృశుఁడగు పుత్రుఁడు కలుగునని చెప్పి యథేచ్ఛగాపోయెను.

ఆవర్తకునిపత్ని మత్స్యేంద్రనాథుఁ డనుగ్రహించియిచ్చిన విభూతిని తోడనే భుజింపక తన చెలికత్తెలతో తనకదిలభించినవిధమును జెప్పన వారలు స్త్రీస్వభావముచే గౌరవబుద్ధిని విడిచి, సన్న్యాసులను నమ్మఁగూడదు. సొక్కుపొడివేసి మనుష్యులను వశీకరింతురు. అని చెప్పిన నావారిమాటలను చితమనియంగీకరించి విభూతిని ప్రొయిలో పాఱవైచెను. పండ్రెండుసంవత్సరములకు, పిదప మత్స్యేంద్రనాథుఁడాయూరికివచ్చి వర్తకునియింటికిపోయి యస్పృశ్యునికి భిక్షమిడుఁడని యడిగిన వర్తకునిభార్య యన్నము తెచ్చిపెట్టెను. అపుడీపుణ్యశ్లోకుఁడా స్త్రీనిజూచి నేనిచ్చినవిభూతిచేఁ గలిగిన పుత్రునిఁజూడ నపేక్షించెదననిన ఆయువతి నిజమును జెప్పిన నితఁడు శపించుననుభయముచే మారుపలుకకుండెను. మత్స్యేంద్రనాథుఁడు ఓవనితా! నీవు వెఱవకుము. విభూతి యేమిచేసితివి. నిజముచెప్పుము అనిన ఆపొలఁతి అవివేకముచే దానిని స్వీకరింపక ప్రొయిలో వైచితినని చె

ప్పెను. అదివినిమత్స్యేంద్రనాథుఁడుగతించినదానికివగవఁబనిలేదు. ఆప్రాయిస్త్రీలోనిబూడిదనెచ్చ బపోసితివనియడిగిన తాను నిత్యముబూడిదనుబోయుచుండుకుప్పనుజూపెను. అపుడుసుశీలుఁ డాకుప్పపైనిలుచుండి యోయీయస్సృశ్యుఁడారమ్మని పిలిచెను. అపుడాకుప్పనుండి గురునాథావచ్చితిని. వచ్చితిని అనివినవచ్చెను. మత్స్యేంద్రనాథుఁడాయూరిప్రజలనురప్పించి యాకుప్పనుకుల్లగింపఁగా పంద్రెండేండ్ల ప్రాయపువాఁడై, దివ్యతేజోవిశిష్టుఁడై, సర్వలక్షణోపేతుఁడై సుందరముఖమును, విశాలనేత్రములునుగలిగి భగవన్నామస్మరణచేయుచుఁ గూర్చుండియుండు నొకబాలునినందఱును జూచియాశ్చర్యపడిరి. మత్స్యేంద్రనాథుఁడాపురుషునిచెంతకుపోయి తనహస్తమునతనిమస్తకముపైనునిచి సావధానమనిన నతఁడులేచి మత్స్యేంద్రనాథునికి సాష్టాంగవందనముచేసెను. మత్స్యేంద్రనాథుఁడాబాలునిని కృపావలోకనముచే ననుగ్రహించి ద్వాదశవర్షములుభూదేవిగర్భమునసురక్షితుఁడైయుండినందున నితనికిగోరక్షితుఁడని నామకరణముచేసియతనిచేతినిబట్టుకొని నడచెను. అపుడువర్తకుఁడీయద్భుతమునుజూచి మనదౌర్భాగ్యముచే చేతికిఁజిక్కినమహాఫలముతప్పిపోయెననిశోకించితనభార్యతోడ మత్స్యేంద్రనాథునికి వందనముచేసియోస్వామీదేవరవారిప్రసాదమును విశ్వసింపక వెలలేనిమాణిక్యమును బోఁగొట్టుకొనిమందభాగ్యులమైతిమి. ఈదీనులను గరుణింపవలయునని ప్రార్థించిన మత్స్యేంద్రనాథుఁడు కరుణించి భయపడకుఁడు. భగవత్కటాక్షముచే మీకుపుత్రుఁడుకలుగునని యనుగ్రహించి గోరక్షితునిఁ బిలుచుకొనియథేచ్ఛగఁబోయెను.

గోరక్షితుఁడు మత్స్యేంద్రనాథునిఁజూచి భవార్ణవపతితుఁడనగునాకుశ్రీతారకమంత్రమునుపదేశింపుమని ప్రార్థించిన ఓవనితా! కొంతకాలముపోయిన నీకు పరిపక్వకాలము కలుగును. అపుడు శ్రీతారకమంత్రోపదేశమునకధికారివగుదువనిచెప్పిన గోరక్షితుఁడట్లుకానిండని యాచార్యునివెంబడించి పోవుచుండెను. మత్స్యేంద్రనాథుఁడొక గ్రామసమీపముననుండి యోగోరక్షితా యీయూరిలోప్రవేశించిభిక్షయెత్తుకొనిరమ్మనినగోరక్షితుఁడట్లుచేసెదనని యాయూరిలోప్రవేశించి యింటింటభిక్షమడుగుచు సమారాధనముజరగుచుండినయొకబ్రాహ్మణునియింటికివచ్చి భిక్షమడిగెను. ఆబ్రాహ్మణునిభార్య భక్ష్యములతోడ నన్నము తెచ్చియిచ్చెను. గోరక్షితుఁడాయన్నమునుదెచ్చి మత్స్యేంద్రనాథునికిచ్చిన దానినతఁడు భగవంతునికినివేదించి తచ్ఛేషమునుస్వీకరించి గోరక్షితునిఁజూచి నేఁడునీవు తెచ్చినభిక్షమమిగులభోగ్యమైయున్నది. రేపటికినట్లుతేవలయునని చెప్పిన గోరక్షితుఁడట్లుచేసెదనని విన్నవించి యాచార్యభుక్తశేషమును స్వీకరించెను. మఱునాఁడుదయమునలేచిస్నానానుష్ఠానములఁదీర్చియాచార్యనియమనముచెంది యాగ్రామమునందుప్రవేశించితనకుభక్ష్యములతోడభిక్షమిడినబ్రాహ్మణపత్నినిఁజూచి యోతల్లీ నిన్ననీవిచ్చినభిక్షను మాయాచార్యునికి నివేదింపఁగా నతఁడుస్వీకరించి మిగులభోగ్యముగానున్నదని కొనియాడి రేపటికినినిట్టిభిక్షము తేవలయునని నియమించెను. అందుకునేనొడంబడితిని. కాననేటికినిన్నటియట్లు భక్ష్యములతోడ భిక్షయొసఁగవలయునని యడిగిన నాగృహిణినిన్నమాయింటబ్రాహ్మణసమారాధనము జరగినందునభక్ష్యములుండెను. నేఁడుభక్ష్యములులేవు. కాన కలకొలఁదియిచ్చెదనని చెప్పిన గోరక్షితుఁడమ్మా నేనునిరపేక్షుఁడను: లోష్టకాంచనములను సమముగఁజూచువాఁడను. అట్లుండియునాయాచార్యునికైనిన్నువేఁడెదననిన అమ్మ యోరీబాలకా! లేనిపదార్థము తెచటనుండితత్తును. భిక్షకులుగృహస్థులనునిర్బంధింపకయు

చ్చినదానిని తీసికొనవలయును. నీకిష్టమైన నేనిచ్చుదానిని తీసికొనిపొమ్ము. అనిన గోరక్షితుఁడునా యాచార్యుని యపేక్షను పూర్తిచేయుటకై యతని యాజ్ఞను శిరసావహించి నీయొద్దకు వచ్చితిని. భక్ష్యములనొసఁగవేని నేనిచ్చోటు విడిచిపోవనని చెప్పి యచ్చటఁ గూర్చుండెను. అపుడా బ్రాహ్మణి యోరీ! దుష్కారము చేయకుము. నేను ధర్మము చేయవచ్చిన నదియధర్మమయ్యెను. నీవు నిజముగ భిక్షమునకు వచ్చినవాఁడవైన రుచ్యములగు వస్తువులను గోరవు. కుక్కవలెనన్నమునకై జగడమాడకుము. అని చెప్పిన గోరక్షితుఁడు ఓజననీ! నేను కుక్కకన్న నికృష్టుఁడను. అయినను మాయాచార్యునికై నీచేత భక్ష్యములనుదీసికొనక పోనని చెప్పెను. బ్రాహ్మణి నీవిపుడు కంటిని పెఱికియిచ్చినను భక్ష్యములు దొరకవని చెప్పిన గోరక్షితుఁడు నీవు కోరిన నాకంటినైన నిచ్చెదను. భక్ష్యములనిమ్మనెను. ఆవనిత వీనిమనోనిశ్చయము నెఱుఁగక కన్నిచ్చిన భక్ష్యములనిత్తుననెను. తోడనే గోరక్షితుఁడొకకంటిని పెఱికి యామె కెదుటనునిచియిఁకను భక్ష్యములు తెమ్మనెను. అపుడామె సుదతి భయపడి యిదియేమి విపరీతము. రాచటికమువారెఱిఁగిన నాకు దండన కలుగునని తలుపుమూసికొని గోరక్షితునికంటినుండి వచ్చు రక్తమును తన పైటకొంగున తుడుచుచు నీ ప్రమాదమునకేమి చేయవచ్చునని శోకించుచుండిన గోరక్షితుఁడు శాంతమూర్తియై యో భాగ్యశాలినీ! భయపడకుము. మాయాచార్యునికి భక్ష్యములిమ్ము. అనిన ఆమె యింటిలో ప్రవేశించి శీఘ్రముగ భక్ష్యములను జేసి యథేష్టముగఁ దెచ్చియిచ్చెను. గోరక్షితుఁడు తల్లీ వెఱవకుమని చెప్పి మత్స్యేంద్రనాథునివద్దికి వచ్చి యతనికిఁ దెలియకుండ కంటిని మూసికొని దేవరవారి నియమనముచొప్పున భిక్ష తెచ్చితినని వారికెదుటనునిచెను. మత్స్యేంద్రనాథుఁడు సంతసించి నీకంటికేమి యుపాధి కలిగెననియడిగి యతనిచే జరగిన వృత్తాంతమును విని మేలు చేసితివి. భక్ష్యములకై యొకకంటిని చ్చితివిగదా. నాకొకకన్నిచ్చెదవా యనియడిగిన నతఁడు మహాభాగ్యమని శీఘ్రముగ రెండవ కంటిని పెఱికి యాచార్యునికి సమర్పించెను మత్స్యేంద్రనాథుఁడితని గురుభక్తికి మిగుల సంతసించి యతని రెండుకన్నులను తన చేతితోడ తడవినమాత్రమున నేత్రము లెప్పటియట్లయ్యెను. వెనుక గోరక్షితునిఁ జూచి నీ వేసచ్ఛిష్యుఁడవు. ఇట్టిశిష్యుఁడు ముల్లోకములయందును లభించుట దుర్లభమని చెప్పి యతనికి శ్రీతారకమంత్రమునుపదేశించెను. పూర్వమీ మంత్రమును భగవంతుఁడు శివునికుపదేశించెను. మత్స్యగర్భముననుండి మత్స్యేంద్రుఁడు శివునివలన నుపదేశమును బొందెను. మత్స్యేంద్రుఁడు గోరక్షితునికుపదేశించెను. ఆగోరక్షితునివలన శాంభవుఁడును, అతనివలన నద్వైతనాథుఁడును, అతనివలన ప్రభావానుఁడును, అతనివలన కైనాథుఁడును, అతనివలన నివర్తిదేవుఁడును, అతనివలన జ్ఞానదేవ, సోపానదేవ, ముక్తాబాయి వీరును నుపదేశము చెందిరి. జ్ఞానదేవుఁడు వీసోబాకేశునికిని సారంగదేవునికిని నుపదేశించి పండరినాథుని నియమనముచే పండరిక్షేత్రవాసులగు బ్రాహ్మణులకును మఱియు ననేక భక్తులకును పదేశించెను. పుండరీకవరదుని నియమనముచే నామదేవులు వీసోబాకేశుని నాశ్రయించి యుపదేశమును బొందితన్నాశ్రయించిన జనాబాయికిని, మఱియు ననేక భాగవతులకు నుపదేశించెను. వారలనాశ్రయించి మరియు పెక్కండ్రు పదేశమును బొందిరి. ఈగురుపరంపరాక్రమము శ్రీపాండురంగని కటాక్షముచే నేటికిని వర్ధిల్లుచున్నది. ఈగురుపరంపరయనెడి మేఘసమూహము పండరినాథుఁడను సముద్రము నాశ్రయించి తత్కల్యాణగుణములనెడి జలములను గ్రోలి ప్రాణిసస్యములకు ప్రాణధారకముగ వర్షించుచున్నది. శంఖపాణియగు విఠ్ఠలనాథుఁడు కర్షకుఁడై యాసస్యములను శాపాది భక్తియను ధాన్యమును

ఫలింపఁజేయుచున్నాఁడు. (ఆచార్యస్యహరిస్సాక్షాత్ । గురుదేవపరంబ్రహ్మ) ఇత్యాదివాక్యములాచార్యనిసాక్షాన్నారాయణునిఁగాచెప్పుచున్నవి. ఒక్కొక్కయాచార్యుఁడునుతనశిష్యునికినాచార్యుఁడైతనయాచార్యునికి తానుశిష్యుఁడైయున్నాఁడు. ఇట్లనేకులాచార్యులుండిన వీరినందఱినిసాక్షాద్విష్ణుస్వరూపులనుగనెట్లుచెప్పవచ్చును. అట్లుచెప్పినభిన్నాత్మలగుననేకగురువులనేకాత్మయనిచెప్పవలసివచ్చును. విష్ణుస్వరూపము కాదనిచెప్పిన సాధారణ మనుష్యుఁడనిచెప్పవలసివచ్చును. అట్లాచార్యునిమనుష్యునిఁగాభావించిన (విష్ణోరర్చావతారేషు। లోహభావం కరోతియః। యోగురౌమానుషంభావం। ఉభౌనరకపాతినౌ) అనఁగాభగవంతుని యర్చావతారమునలోహభావముచేయువాఁడును, ఆచార్యునియందుమానుషభావముచేయువాఁడును నరకమునుజెందుదురని బ్రహ్మాండపురాణముచెప్పుటచే నరకముకలుగును. తుదకాచార్యునినిజస్వరూపమెట్టిదనిన కేవలభగవత్స్వరూపమునుకాదు - కేవలమాత్మయునుగాదు. నరత్వ, సింహత్వములతోఁగూడిన నరసింహావతారమువలెనీయాచార్యస్వరూప మత్యద్భుతమైయుండును. కేవలభగవత్స్వరూపమనినగురుపరంపరకు స్వరూపైక్యదోషముకలుగును. కేవలమాత్మయనిన ననేకప్రమాణవిరోధముకలుగును. ఆదిశేషావతారమగుబలభద్రునియందుభగవదావేశముకూడియుండుటచేనీయవతారముభగవంతునిదశావతారములలోనొకటిగఁజేర్పఁబడియున్నది. అట్లుఅగ్నితోఁగూడినయినుమువలె భగవదావేశముతోఁగూడినవిలక్షణాత్మయని యాచార్య స్వరూపమునుగౌరవింపవలయును. అనేకములయినయినుములనునిప్పులోవేసికాల్పఁగావానియందు వ్యాపించియుండునగ్నియొక్కఁడై యినుములుభిన్నములైనట్లు అనేకులగునాచార్యులయందావేశించియుండునీశ్వరుఁడొక్కఁడైయాత్మలుభిన్నములైయుండును. మరియునగ్నితోఁగూడిన యినుముస్వరూపమైలోఁచుటచే భగవదావేశముతోఁగూడినవిలక్షణాత్మయగు నాచార్యునిని భగవత్స్వరూపమనియధ్యవసించుటుచితము.

శ్రీతారకబ్రహ్మపరమగురవేనమః.

## సారంగదేవచరిత్రము

భీమనదీతీరమున విఠోభాయనుబ్రాహ్మణునికిఅతనిభార్యయగురుక్మిణీదేవియందింద్రాంశముచేనొకపుత్రుఁడుకలిగెను. ఆపుత్రునిసౌందర్యమును జూచితల్లిదండ్రులు పరమానందభరితులై పెద్దలనియమనముచే సారంగదేవుఁడని నామకరణముచేసిపెంచుచు నుచితకాలముననుపనయనముచేసిరి. ఈసారంగదేవుఁడు తననోటనేదిచెప్పిననదిఫలించుచువచ్చెను. ఇతనియింటలక్ష్మిసాన్నిధ్యముచేసియుండెను. సమస్తవిద్యలును, అష్టాంగయోగములును, అణిమాదిసిద్ధులును ఇతనిస్వాధీనమైయుండెను. ఇతఁడువేయినిన్నూఱుసంవత్సరములుజీవించి తాపిండినదీతీరమున నొకమఠమునుగల్పించియందువసించుచు ప్రతిదినము పండరిపురమునకువచ్చిభగవంతుని యెదుటనృత్యకీర్తనములు చేయుచుండెను. ఇతనికివేయిన్నిన్నూఱుగురు శిష్యులుకలరు. వారలతోడనితఁడుగగనమార్గమున సంచరించుచుండును. ఇట్టిసామర్థ్యములతోఁగూడి [illegible] రంగదేవుఁడొకసదాచార్యుని నాశ్రయింపక తనశిష్యులకుతనబుద్ధికి గోచరించు [illegible] చేయుచువచ్చెను. ఒకనాఁడుసారంగదేవుఁడేకాంతస్థలమునఁదుఁగూర్చుండియుండ [illegible].

నాకొకసదాచార్యుఁడు లభింపలేదు. నాసామర్థ్యమునకు తగినవారి నెందునుగానను. అగ్నితప్తము[illegible]ను వెలిగారములేక బంగారము కరఁగనట్లు సద్గురుసంబంధములేక యెంతసామర్థ్యము కలిగియుండినను వ్యర్థమగును. (పాపిష్ఠః క్షత్రబంధుశ్చ । పుండరీకశ్చ పుణ్యాకృత్ । ఆచార్యవత్తయా ముక్తౌ । తస్మాదాచార్యవాన్ భవేత్) అనఁగా మహాపాపియగు క్షత్రబంధువును, పుణ్యవంతుఁడగు పుండరీకుఁడును సదాచార్యసంబంధముచే మోక్షమును జెందిరి. కాన నాచార్యునాశ్రయించియుండవలయునని శ్రీమహాభారతము చెప్పుచున్నది. ఆచార్యునినాశ్రయించియుండు పురుషుఁడే తత్వము నెఱుఁగుచున్నాఁడని యుపనిషత్తులు చెప్పుచున్నవి. నేనింతకాలము జీవించియు పెక్కుసామర్థ్యములతోఁగూడియుండియు సద్గురుసంబంధములేక నాజన్మము వ్యర్థమయ్యెను. భగవంతుఁడు తానును రామకృష్ణాద్యవతారములయందు వసిష్ఠ, సాందీప, ప్రముఖులనునాశ్రయించెనుగదా. శ్రేష్ఠులయాచారమవశ్యకర్తవ్యము. అని పెక్కువిధములుగ చింతించి భగవదంశసంభూతుఁడగు జ్ఞానదేవునికీవిషయమై యొకపత్రిక వ్రాయుదమని యోచించుచుండెను. అట్టిసమయమున జ్ఞానదేవులు పండరినాథుని సన్నిధికివచ్చి సాష్టాంగవందనము చేసి స్వామీ! అళకాపురికి పోయివచ్చెదనని విన్నవించి స్వామినియమనమును జెంది బయలుదేరి యళకాపురికివచ్చి సిద్ధేశ్వరునికి వందనము చేసియచ్చట వసించియుండెను. ఇట్లుండ సారంగదేవుఁడు జ్ఞానేశ్వరునికి పత్రిక వ్రాసికొనుటకై తాటియాకును, గంటమును చేతఁబట్టుకొని చిరంజీవియని వ్రాయవచ్చునా! ఒకవేళ నితని నాచార్యునిఁగా పరిగ్రహింపవలసివచ్చినయట్లు వ్రాయుట ప్రమాదమగును. తీర్థస్వరూపియని వ్రాయవచ్చునా? ఇతఁడు నాకన్న చిన్నవాఁడుగాన నట్లు వ్రాయుట మర్యాదగాదు. అని కొంతచింతించి యేమియునులేఁక వట్టియాకును జుట్టి జ్ఞానదేవుని చేతికిమ్మని యొకశిష్యుని చేతికిచ్చి పంపెను. అతఁడాపత్రికనుదీసికొని యళకాపురికి వచ్చి జ్ఞానదేవునికెదుట నిలిచెను - జ్ఞానదేవుఁడతనిఁ జూచి నిన్ను సారంగదేవుఁడు పంపెనా యనియడిగి యతని చేతియాకును తీసివిప్పిచూచి యోహో ఇన్నాళ్లుకడచియు సారంగదేవుని బ్రతుకుడుత్తాకుగానేయున్నది. భర్తృహీనయగు స్త్రీ చేసికొను శృంగారమువలెను, దయాహీనుఁడు చేయు జ్ఞానోపదేశమువలెను, సారంగదేవుఁడు బహుకాలము జీవించియు, బహువిద్యలనభ్యసించియు, బహుసామర్థ్యములతోఁగూడియుండియు సద్గురువునాశ్రయించి కృతార్థుఁడుగాక వ్యర్థుఁడయ్యెను. అని చెప్పి సారంగదేవునికి తానొకపత్రిక వ్రాయనారంభించి సర్వప్రాణులకును చైతన్యము సమమైయున్నది. అది పెద్దదియు కాదు, చిన్నదియు కాదు. స్త్రీపురుషనపుంసకములును గాదు (ఆశ్చర్యవత్పశ్యతికశ్చిదేనం। ఆశ్చర్యవద్వదతితథైవచాన్యః। ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి। శ్రుత్వాప్యేనం వేదనచైవకశ్చిత్) అనఁగా ఈయాత్మను యోగసిద్ధిచేనొకానొకఁడద్భుతవస్తువని చూచుచున్నాఁడు. ఒకానొకఁడద్భుతవస్తువని చెప్పుచున్నాఁడు. ఒకానొకఁడద్భుతవస్తువనివినుచున్నాఁడు. ఇట్లు చూచియు, చెప్పియు, వినియు దానినిజస్వరూపమునునొక్కఁడైన నెఱుఁగఁడు అని భగవద్గీతయందు భగవంతుఁడు చెప్పెను. సారంగదేవా! నీవుదీని నెఱుఁగుము. అని వ్రాసియాశిష్యుని చేతికిచ్చి పంపెను. దానిఁజూచి సారంగదేవుఁడు విజ్ఞాననిధియగు జ్ఞానేశ్వరుని సన్నిధికి శీఘ్రముగ పోవలయునని బయలుదేరి తన[illegible]క పెద్దవ్యాఘ్రమును రప్పించి దానిపైనెక్కుకొని యొకకృష్ణసర్పమును త్రా[illegible]ఁబట్టు[illegible]యున్ననన్నూఱుశిష్యులు పరివేష్టింపవచ్చుచుండెను. అళకాపురనివాసులీ[illegible]భుతమునుజూ[illegible]జ్ఞానేశ్వరునికి విన్నవించిరి. అపుడు జ్ఞానదేవుఁడూహించి అట్లువచ్చు

వాఁడు సారంగదేవుఁడని తెలిసికొని తానపుడు కూర్చుండియుండిన మట్టిగోడను జూచి యోజీర్ణకుడ్యమా! నన్ను జూచుటకు సారంగదేవుఁడు వ్యాఘ్రవాహనుఁడై వచ్చుచున్నాఁడు. నేనతని నెదుర్కొనిపోవలయును. కాన నీవు నన్ను వహించుకొని పొమ్మనిన తోడనే యాకుడ్యము నడవసాగెను. ఇట్లు నామదేవులు జీర్ణకుడ్యమును వాహనముగఁ జేసికొని దానినడపించుకొని వచ్చుటను విని సారంగదేవుఁ డాశ్చర్యపడి నేను చేతనమును నడపించుట తిశయము కాదు. జ్ఞానదేవుఁడ చేతనమును నడపించుకొని వచ్చుట యత్యద్భుతమై యున్నది. ఇట్టి సద్గురువు నాశ్రయించి కృతార్థుఁడనయ్యెదనని నిశ్చయించి వ్యాఘ్రము నవరోహించి యడుగున కొకనమస్కారము చేయుచు జ్ఞానదేవునిఁ జూచినంతట భయభక్తులతిశయించి సాష్టాంగవందనము చేసి యీమహానుభావుఁడు సాక్షాత్పాండురంగని యవతారమని ప్రతిపత్తి చేసెను. అవుడు జ్ఞానదేవుఁడు సారంగదేవుని చేతిని బట్టుకొని యాసమీపముననుండు నొకవటవృక్షము క్రిందఁ గూర్చుండి యతనికి మంత్రోపదేశము చేసి యనుగ్రహించెను. ఆవృక్షము జ్ఞానదేవుఁడు సారంగదేవున ననుగ్రహించిన స్థలమని యిప్పటికిని శిష్టులచే సేవింపఁబడుచున్నది. ఆచోటు నుభవతాపనివారకమని సాధుజనులు కీర్తించెదరు. అచ్చట క్షణమాత్రమువసించువా[illegible] బ్రహ్మానందము కలుగుచున్నది. పిదప జ్ఞానదేవుఁడు సారంగదేవుని హస్తమును బట్టుకొని తన యాశ్రమమును ప్రవేశింపఁగా నచట వస్త్రహీనయై యుండిన ముక్తాబాయిని జూచి సారంగదేవుఁడు వెనుకకు పోయెను. అది చూచి ముక్తాబాయి ఓరి ప్రజ్ఞాహీనుఁడా! యేలసంకోచపడి వెనుకకు పోయెదవు. సమదర్శి కెందును బ్రహ్మమే ప్రకాశించుచుండును గాని మరియొకటి తోచదు. వ్యాసుఁడు దేవాంగనలంగనినఁగ్నులై తెరుణుఁడై చనుచుండిన తనకొడుకగు శుకునిఁగని చీరలొల్లక నిర్వికారలై యుండి వస్త్రధారియు, వృద్ధుఁడునగు తన్నుఁ జూచినంతట కోకలధరించుటకు కారణంబడిగిన దేవకన్యకలు వేదవ్యాసునిఁ జూచి నీపుత్రుఁడు స్త్రీపురుషులనెడు భేదదృష్టిలేక నిర్వికల్పుఁడై యుండును గాన నీకు నతనికి మహదంతరము కలదని ప్రత్యుత్తరము చెప్పిరి. నీవిది వినియుండలేదా. పెక్కేండ్లు జీవించి సర్వవిద్యలను సర్వసిద్ధులను సాధించితివి నీచిత్తమును వశీకరించు సామర్థ్యము లేదయ్యెనుగదా. జ్ఞానదేవుని నాశ్రయించియు నీహృదయ కాలుష్యము పోనకపోయిన నితఁడు చేసిన యనుగ్రహము భస్మమునఁ బ్రేల్చిన యాజ్యాహుతియగుననుటకు సందేహములేదు. (యదా తే మోహకలిలం। బుద్ధిర్వ్యతితరిష్యతి। తదా గంతాసి నిర్వేదం। శ్రోతవ్యస్య శ్రుతస్యచ। శ్రుతివిప్రతిపన్నా తే, యదా స్థాస్యతి నిశ్చలా। సమాధావచలా బుద్ధి। స్తదా యోగమవాప్స్యసి) అనఁగా నెప్పుడు మోహమువలనఁ గలిగిన కల్మషమును నీబుద్ధి వదలిపెట్టునో యప్పుడే నీవు వినినదియు, వినఁదగినదియు నగు వేదార్థములు సమాప్తియగుచున్నవి. ముందు చలింపఁజేయఁబడిన నీబుద్ధి యెపుడచంచలమై సమాధిలో నుండునో యపుడు నీవు యోగమును బొందఁగలవు. అని భగవద్గీతయందు భగవంతుఁడు చెప్పియున్నాఁడుగదా. నీప్రజ్ఞను పరీక్షించుటకై నేను నీకంటికి వస్త్రహీననై పొడచూపితిని, జ్ఞానదేవుని యుపదేశబలముచే నీవు స్థితప్రజ్ఞుఁడవగుదువని భగవంతుని ప్రార్థించెదననిన ఆసారంగదేవుఁడు ముక్తాబాయికి వందనము చేసి తల్లీ సాక్షాద్యోగమాయాంశ సంభూతవు. జ్ఞానదేవుని యనుగ్రహమునచే నాకు సిద్ధించిన జ్ఞానాగ్నిని నీ యుపదేశమను వాయువు ప్రజ్వలింపఁజేసెను. నా యజ్ఞాన[illegible] దగ్ధ[illegible]బు సఫలంబయ్యెను. అని విన్నవించెను. అపుడు జ్ఞాన[illegible] శిరంబున హస్తముంచిన నతఁడు జ్ఞానోదయమును బొంది జీవన్ము[illegible]

దేవులు వసించుటచేనళకాపురి భూలోకవైకుంఠమో, లేక పాండురంగక్షేత్రమో యని సజ్జనులచేఁగొనియాడఁబడుచుండెను. సాక్షాత్పండరినాథుఁడే లోకోజ్జీవనముకై జ్ఞానదేవుఁడై యవతరించెననియిం ద్రాంశజుఁడగుసారంగనాథుఁడండటికిని వ్యక్తముచేసెను. (గురుం ప్రకాశయేద్ధీమాన్) అనురీతిని సారంగదేవుఁడు తనగురువగు జ్ఞానదేవుల వైభవమును ప్రకటనముచేయుచుండెను.

శ్రీ గు ర వే న మః.

## ఇరువదిమూఁడవయధ్యాయము.

### చోకామేళునిచరిత్రము.

పండరిపురమునందు చోకామేళుఁడనునొకపరమభాగవతుఁడు పంచమకులమునందవతరించి శ్రీపాండురంగనియందు పరమభక్తితోఁగూడియుండెను. అతఁడు ప్రతిదినము స్వామిసన్నిధికి ప్రదక్షిణముచేయుచు గోపురద్వారమునందు భగవంతునిదర్శనమునుగోరుచుఁగూర్చుండియుండును. ఇట్లుండనొకనాఁడు కొందఱుబ్రాహ్మణులు ఈపరమసాధువునుజూచి (శ్వపచోపి మహీపాల । విష్ణుభక్తోద్విజాధికః) అనుభగవద్వాక్యమునకర్థ్యముచేసియీయర్థ్యచే ఓరీచోకామేళా! నీవేలవిఠ్ఠలనాథునిని దర్శింపవలయునని వ్యర్థముగభక్తిచేయుచున్నావు. నీయందు భగవంతునికి కృపయుండిన నిన్నతఁడురప్పించి దర్శనమొసఁగకుండునా. పాకశాలయందు శ్వానము ప్రవేశింపఁగూడనట్లు నీవుభగవత్సన్నిధిని ప్రవేశింపఁగూడదు. కాననీయాశ [illegible] సిద్ధించును. అనినచోకామేళుఁడు లేచినిలుచుండిబద్ధాంజలియైయోవిప్రులారా! [illegible]సమున బహుదూరముననుండియు కమలములను వికసింపఁజేయునట్లు పాండురంగఁడాలయములోపలనుండినను మార్గస్థులగు నిజదాసులకు వికాసమునుగలుగఁజేయును పాండురంగఁడాలయములోపలనేయున్నాఁడనితలఁపకుఁడు (ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే [illegible] తిష్ఠతి) అనుభగవద్గీతావచనప్రకారముసర్వేశ్వరుఁడు సర్వభూతహృదయాంబుజవర్తియై యున్నాఁడు. నేనునికృష్టుఁడనైనను నాహృదయపద్మంబునందు సన్నిధిచేసి నన్ను రక్షించుచున్నవాఁడు. అనిచెప్పి యోపుండరీకవరదా! నీదివ్యమంగళవిగ్రహదర్శనమునాకు లభించునట్లుకృపచేయవలయునని ప్రార్థించిస్వగృహమునకుపోయి శ్రీరుక్మిణీకాంతునినవరతము ధ్యానము చేయుచుండెను. ఇట్లుండ భగవంతుఁడు చోకామేళునినిజభక్తికిసంతసించి యతనికిదర్శనమొసఁగవలయునితలఁచి రాత్రిసన్నిధితలుపులు ముద్రింపఁబడినవెనుక నతనియింటికిఁబోయి యెదుటనిలువఁగా చోకామేళుఁడు సాష్టాంగవందనముచేసి భగవంతునిస్తుతించి హేకృపాజలధే! ఆలయంబుననాకునీదర్శనంబునొసఁగవలయునని ప్రార్థించిన భగవంతుఁడట్లు చేసెదనని చెప్పి చోకామేళునిచేతిఁబట్టుకొనిసన్నిధికి బిలుచుకొనివచ్చి తనచెంతఁగూర్చుండఁబెట్టు [illegible]కామేళా! నీవంతరంగభక్తుఁడవు. నిన్నుక్షణమైననుమఱువను. నామదేవునితో [illegible] తక్కినభక్తులతోఁగలసియుండునపుడును నీతలఁపువచ్చుచుండును. [illegible] భగవంతునిపాదద్వయంబునుగట్టిగఁబట్టుకొని యోస్వామీ [illegible]! దేవతవారిపరిపూర్ణకటాక్షమే దాసభూతునికి ధారకపో

షక భోగ్యంబులనివిన్నవించెను. ఇట్లువీరిరువురును మాటలాడుచుండుటను బ్రాహ్మణులు తలుపువెలుపటనుండివిని యాశ్చర్యపడి చోకామేళుఁడు సన్నిధిలో స్వామితో మాటలాడుచుండునట్లున్నది. పండరినాథునిసన్నిధికిఁ బంచముఁడు రాఁదగునా? వీఁడిచ్చటికివచ్చినందున మన యాచారమంతయునశించెను. యాగశాలయందు శ్వానము ప్రవేశించినట్లు షడ్గుణైశ్వర్యసంపన్నుఁడగు భగవంతునిమందిరమున నీపంచముఁడు ప్రవేశించెను. అని చెప్పుచు తలుపు తెఱచి లోపల ప్రవేశించిచూచి యోరీ చోకామేళా! నికృష్టకులజాతుఁడవగు నీవు మేము కవాటబంధనము చేసియుండు సమయమున నెట్లులోపల ప్రవేశించితివి. అనియడిగిననతఁడు సవినయముగ వారలనుజూచి నేను లోపల ప్రవేశింపలేదు. భగవంతుఁడు నాచేతినిఁబట్టుకొని లోపలికిపిలుచుకొని వచ్చెను. ఇప్పుడు నేనిచ్చటికివచ్చినతప్పును మన్నింపుఁడు. ఇఁకనురాకుండెదనని చెప్పిన బ్రాహ్మణులు వీనియందు దోషములేదు. పండరినాథుఁడిట్టిలీలలనుజేసిన మనము వీనినిదండించి యేమి ప్రయోజనము. అయిననిఁకను వీఁడిచటనుండిన దేవాధిదేవుఁడు పలుమాఱువీనినాలయము లోపలికిపిలుచుకొనిపోవును. అట్లుచేయుటమనయాచారమునకుఁ గొఱఁతయగును. అనితలఁచి చోకామేళునిఁజూచి నీవిప్పుడే యీచోటునువిడిచి చంద్రభాగనుదాఁటిపొమ్ము. అట్లుచేయకున్న నీకు శూలారోహణము విధింతుమనిన ఆభగవద్భక్తుఁడు బ్రాహ్మణులారా! మీనియమనానుసారము చేసెదను. నేను భగవంతునిదర్శించుటయనుచితమనిచెప్పితిరి. గంగయందుపంచములుస్నానము చేయలేదా. అందుచే గంగకు దోషముకలదా? భూమిమీఁద సకలజాతివారును నడచుచుండలేదా! అందుచేభూమికిదోషముకలదా. అట్లు సర్వవ్యాపియగురుక్మిణీకాంతుఁడు సర్వసముఁడై యుండఁగా నట్టి పరిపూర్ణునికి దోషమునుగల్పించుట న్యాయ్యము కాదనిన విని వారలనూయాక్రాంతులై యోరీ! నీవు చండాలుఁడవు. సకలజాతులకును నికృష్టుఁడవు. నీవా మాకుజ్ఞానోపదేశముచేసెదవు. నీనడునడివిపరీతమైయున్నది. ఇఁకను నీవు చంద్రభాగకావలిగట్టున గుడిసెకట్టుకొని వసింపుము. అట్లుచేయకున్న నిన్నుశిక్షించివెళ్లఁగొట్టుదమనిరి. అపుడా సాధువు బ్రాహ్మణులకువందనముచేసి మీరే తల్లిదండ్రులని నమ్మియుంటని. శరణాగతునుల్లంఘింపఁదగునా? భగవంతుఁడు శరణాగతధర్మమునను ష్ఠించి చూపుటకేగదా రామావతారముచేసెను। మీరలు నిత్యము శ్రీరామాయణపారాయణముచేయుచుండియు తత్సారమగుశరణాగతివైభవమును మీమనంబుల నూహింపరైతిరి. ఇప్పుడైన నాగొప్పయపరాధమును చింతించి శరణాగతుఁడగు నన్నురక్షింపుఁడు. విభీషణశరణాగతికాలమున ప్రతికూలవచనములాడిన నిజాంతరంగులకు కపోతవృత్తాంతంబునుపన్యసించి భగవంతుఁడు విభీషణునంగీకరించెనుగదా. ఆనృశంస్యప్రధానులై యుండఁదగినభగవద్భక్తులగుమీబోంట్లకు నిర్దయ తగదనివిన్నవించెను. ఇట్లెంతప్రార్థించినను వారలుకఠినచిత్తులై పూర్వమువలెనే చెప్పుచుండిన చోకామేళుఁడు దుఃఖితుఁడై కన్నీరు విడుచుచు భగవంతునికి వందనముచేసియింటికి పోయి తనభార్యను వెంటఁబెట్టుకొని చంద్రభాగనుదాఁటి యచ్చటనొకగుడిసెకట్టుకొని దానియందు వసించెను.

చోకామేళుఁడచ్చటవసించి భగవంతుని ననవరతము ధ్యానించుచుండెను. ఒకనాఁడతఁడుభోజనమునకుఁ గూర్చుండఁగా పుండరీకవరదుఁడు సాన్నిధ్యమై నేను నీ [illegible] యునని చెప్పెను. అదివిని యతఁడు సంతోషించియాగుడిసెకు ప్రక్కనుండు [illegible] చెట్టు క్రిందికి భగవంతునిఁబిలుచుకొనిపోయి యిరువురుఁగూర్చుండి భుజించుచుండఁగా చోకా

మేళుఁడు మ్రానిమీఁదనుండిన కాకులను జూచి యో కాకులారా! నాభాగ్యరాశియగు భగవంతుఁడు మ్రానిక్రిందభుజించుచున్నాఁడు. కానమీరించుకసేపు దూరముగఁదొలఁగిపొండని చెప్పుచుండ నతనిభార్యతెచ్చిన దధిపాత్రమామెచేతినుండి తప్పి భూమిపైఁబడిపెరుగు స్వామి పీతాంబరముమీఁదఁజెదరినఁజూచిచోకామేళుఁడు ఓసఖీ! యేమికార్యముచేసితివి. సాక్షాద్భగవంతుఁడుగదానాతోడ భుజించుచున్నాఁడు. (ఆనృశంస్యంపరోధర్మః) అనుగొప్పధర్మమునువిడిచినిర్దయులైమనలవెళ్లఁగొట్టిన బ్రాహ్మణులను పేక్షించియీదీనబంధువుమనయింటికివచ్చిన నీవదియెఱుఁగకయపచారముచేసెదవనిచెప్పెను. అప్పుడామార్గమునఁబోవుచుండినయర్చకుఁడొకఁడీమాటనువిని కోపాగ్ని ప్రజ్వలించుచుండ ఓరీచండాలుఁడా! యేమివదరెదవు. అనిచెప్పుచువచ్చియతనినిచెంపమీఁదఁగొట్టి భీమనదిలోస్నానముచేసి సన్నధికిపోయెను. అచ్చటభగవంతునిపీతాంబరమంతయుపెరుగుచే తడిసియుండుటయు, చెంపవాచియుండుటయును జూచి భ్రమనుజెంది ఓహో యచటనడచినదంతయు నిచటననుభవసిద్ధమైయున్నది. నేనుభగవంతునికంతరంగభక్తుఁడగుచోకామేళుని ప్రభావము నెఱుఁగకయతనికవమానము చేసితిని. అనియనుతపించి భగవంతునిశరణుఁజొచ్చినయెడ తనవిషయమగు నపరాధముక్షమించును. భాగవతాపచారముక్షమింపఁడు. ఇదిపూర్వముదూర్వాసునివిషయమునవ్యక్తమైయున్నదిగదా. అనిచింతించి చోకామేళునియొద్దకువచ్చియోమహాత్మా! నీప్రభావమును నేనెఱుఁగక నీకవమానమునుజేసితిని. నేనునిన్ను జెంపమీఁదఁగొట్టినందునభగవంతునికిచెంపవాచియున్నది. భగవంతునికి నిజభక్తుఁడవగునీవుసన్నిధికివచ్చిన అతనిశరీరవైవర్ణ్యముమానును. అని ప్రార్థించియతనిచేతులనుబట్టుకొని సన్నిధికిపిలుచుకొనిపోయెను. చోకామేళుఁడు భక్తవత్సలుని నాలింగనముచేసికొనియప్రమేయా! వేదములు మనుష్యానందముమొదలు బ్రహ్మానందపర్యంతము వర్ణించుచుపోయిపరబ్రహ్మానందము మనసునకప్రాప్యమైయున్నదనిమఱలెను. చతుర్ముఖాదులు నిన్నుస్తుతింపనేరకయున్నారు. అట్లుండఅపదార్థమగునేనునునిన్నుస్తుతించెదను. ఇదిప్రమాదము కాదు. (మహార్ణవాంతఃకోమజ్జతోరణుకులాచలయోర్విశేషః) అనురీతిని సముద్రమునమునుఁగునణువునకును, కులపర్వతమునకును భేదమేమియు లేదుగదాయనివిన్నవించిభగవంతునిచెక్కిలినిస్పర్శించినంతట వాపుమానిపండరినాథుఁడు ప్రసన్నవదనుఁడైయుండెను. ఈవిచిత్రమునంతయునుజూచి యాశ్చర్యపడి భక్తవత్సలునియాశ్రితపారతంత్ర్యమును బహువిధములుగఁగొనియాడిరి. పూర్వముతన ప్రభావము నెఱుఁగకయపచారపడిన బ్రాహ్మణులెల్లరు దూర్వాసాములవృత్తాంతమును స్మరించి భయకంపితగాత్రులై జాత్యభిమానమును విడిచి చోకామేళునికివందనముచేసి యోమహానుభావా! జాత్యభిమానముచే భాగవతోత్తముఁడగు నిన్నుదూషించి పుండరీకవరదునిమనసు పుండుచేసితిమి. పూర్వమొక బ్రహ్మరక్షస్సునకు తానుపాడినకైశికమనుపాటయొక్క ఫలమునిచ్చిబ్రహ్మరక్షస్త్వమునుమాన్పినభాగవతోత్తమునివలెబ్రహ్మవేత్తయగునిన్నవమానించిమహాపాతకులమైన మాయపరాధములనుమన్నించి మేముభగవదభిమానాంతర్భూతులగునటుల ననుగ్రహింపవలయుననిమిగుల ప్రార్థించియతనియభిమానమును జెంది కలంకరహితులైరి. అదిమొదలు భగవన్నియమనముచే చోకామేళుఁడు ప్రతిదినముసన్నిధికివచ్చి భగవంతునిదర్శనముచేయుచుండెను.

దీనబంధవే నమః.

## పండరినాథుఁడుజనాబాయితోడదాస్యముచేయుచరిత్రము.

ఒకనాఁడుపుండరీకవరదుఁడుహంసతూలికాతల్పమునశయనించి శ్రీరుక్మిణీదేవినిజూచి నేఁడునాకుమిగుల బడలికగానున్నది. నీచేతులతో నాశరీరమునుపట్టిపిసుకుమని నియమించిన రుక్మిణీదేవిప్రాణనాథా! యింతబడలికకుకారణమేమి. ఏమిపనిచేసికష్టపడితివి. సామంతభక్తుని తోఁటనుత్రవ్వితివా. కబీరుదాసునిధ్యాననిష్ఠనుజూచి యతనికైవస్త్రమునేసితివా. నామదేవునికై మంటిగోడనుగట్టితివా. కూర్మదాసునికైబహుళాపురమునకువేగముగా నడచితివా. జ్ఞానదేవుఁడారోహించినమంటిగోడలోనావేశించి నడపించితివా. శోకాపరమానందునికై యపవిలోపరుగెత్తితివాయనియడిగిన జగన్నాథుఁడు ఓరుక్మిణీ! నేఁడు నేనీకార్యములనుజేయలేదు. నామదేవునియింటికిననేకభక్తులుభోజనమునకు వచ్చిరి. అందుచే జనాబాయికిమిగులపని కలిగెను. ఆస్త్రీరత్నము నన్నుస్మరించుచు నానామములనుచ్చరించుచు కష్టపడుచుండెను. నే నదిచూచి సహింపకయొకస్త్రీరూపమునుబరిగ్రహించుకొని పోయియాయువతిచేయవలసిన పరిచర్యలను జేయఁబూనుకొనిపిండివిసరి, యిల్లలికి, కుప్పయూడ్చి వెలుపలఁగుమ్మరించి, గుడ్డలు గుంజి, నీళ్లుచేదితిని. జనాబాయి చేయవలసినసర్వకార్యములను ఆమెతోడఁగలసి యిట్లునిర్వహించితిని.అనిచెప్పినరుక్మిణీదేవియాశ్చర్యపడిమన్నాథా! నీకు నీయాశ్రితపారతంత్ర్యమునైజమేగదా. సంకల్పమాత్రమున సృష్టి,స్థితి,సంహారములనునిర్వహించునీవు ఆశ్రితులవిషయమున ప్రయాసపడికాయికవ్యాపారములను జేయవలయునని కామించితివి కాఁబోలును. పామరులెల్లపామునకేయొటుకయగునట్లాశ్రితవిషయమగు నీదయాసౌశీల్యాదిగుణములునీకే యొటుకలగుచు సదానీతోడవర్తించునన్మదాదులకవాఙ్మానసగోచరమైయున్నది. అనికొనియాడి భగవంతునాలింగనముచేసికొనియతనికరకమలములనా పాదమస్తకము హితముగపట్టుచుండెను.

ఒకనాఁడునామదేవుఁడు హరిహరక్షేత్రమునమహాపర్వకాలమునందు గరుడస్తంభము చెంతనిలుచుండి భగవన్నామసంకీర్తనముచేయుచుండఁగా అక్రూరవరదుఁడు నామదేవుని యానందమునుజూచి సంతసించి తానొకమనుష్యరూపియై చేతులతాళముపట్టుకొని యతనివెనుకనిలిచియతఁడు పాడుచినపదములను జ్ఞాపకముచేయుచువచ్చెను. అదిచూచి భక్తులందఱు నాశ్చర్యపడిరి. ఆకాశముననుండి దేవతలు పుష్పవర్షముపర్షించిరి. మరియొకనాఁడునామదేవుఁడు భగవన్నామసంకీర్తనముచేయుచుండఁగా భగవంతుఁడొకభక్తునివలెవచ్చి నామదేవునికెదుటనిలుచుండి నృత్యముచేసెను. అపుడుగోపికావల్లభునికి దేహము పరవశమై పీతాంబరము జాఱిపడినభక్తులందఱును జూచుచునూరకుండిరి. నామదేవుఁడు స్వామిచేతినిఁబట్టుకొని ఓసర్వజ్ఞమూర్తీ!పీతాంబరముజాఱినది.దానినెత్తికట్టుకొమ్మనిచెప్పెను. అదివినిభక్తవత్సలుఁడు మందహాసముతోడ నాకుమానావమానములులేవు. ఉత్కృష్టనికృష్టులను భేదమునులేదు. భక్తులకుచిత్తమునర్పించి వారినిసంతోషపఱచి వారితోడ నృత్యముచేయుచుండుట నాయుద్యోగము. నాకుపరమభక్తుఁడగునామదేవునికీర్తనమును విన్నమాత్రమున నాశరీరముపరవశమగుచున్నది. నేనేమిచేయుదునని చెప్పుచుండుసమయమున కబీరుదాసుభగవంతునిఁ గొని యాయానందకోలాహలమును జూచుచుండెను. భగవన్నామసంకీర్తనమున భగవంతుఁడునామదేవునిని తక్కినపరమభక్తులనుతనతోడ...

జూచి నేఁడునానుసంకీర్తనముమిగులనానందకరమైయుండెనుగదాయనియడిగినజ్ఞానదేవుఁడు నవ్వివసూర్యుఁడే దివటీపట్టిన ప్రకాశమునకుఁ దక్కువయుకలదా .అట్లునీవేచేతులనుతాళము పట్టుకొని నృత్యముచేయుచుండఁగానానందమునకుఁదక్కువయెట్లుకలుగుననిజ్ఞానదేవుఁడు చెప్పినమధురవాక్యములకు భగవంతుఁడు మందస్మితముచేసి నీవు నిజముపలికితివని యామోదించి జ్ఞానదేవ, నివృత్తిదేవ, సోపానదేవ, నామదేవులను, విసోబాకేశసామంతులను, కబీర్ ఘోరాకుంభారులను, చోకామేళుని, నరహరిమొదలగు నంతరంగభక్తులను సహపఙ్క్తినిడుకొనిభుజించిభక్తులనామంత్రణముచేసి నిజమందిరమునకుఁబోయెను.

అపుడు కబీరుదాసు భగవంతునివెంబడించిపోయి కొంతముచ్చటించుచుండి భక్తప్రియుని యనుమతిచెంది సేతుయాత్రబయలుదేరెను. కబీరు భగవన్నామసంకీర్తనముచేయుచు మార్గమునుబట్టిపోవుచుండఁగా నిరువురు బ్రాహ్మణసహోదరులితనిమాహాత్మ్యమును విని యితనికిశిష్యులై యుపదేశమునుజెందిరి. కబీరాబ్రాహ్మణులకునుపదేశించి సేతుయాత్రను నిర్వహించి కాశికిపోయెను. ఈకబీరుచేనుపదేశమునుజెందినబ్రాహ్మణులను వారిబంధువులు, తురుష్కునిచేనుపదేశమునుజెందిరనివిని జాతిభ్రష్టులనుజేసిరి. ఈయిరువురికిని సంతతి కలిగియుండినందున భాగవతవైభవమునెఱుఁగని యజ్ఞులవలనఁగలిగినయపవాదమునకు భయపడి వ్యసనాక్రాంతులైయాయూరువిడిచికాశికివచ్చి తమయాచార్యుఁడగుకబీరునకుసాష్టాంగవందనముచేసి కేలుమోడ్చి నిలుచుండి నడచినవృత్తాంతమును విన్నవించిరి.అదివినికబీరుదాసువారలనుజూచి భగవంతునియందున్యస్తభరులైసర్వకరణములనువానివిషయమునందువినియోగించుచు తదన్యమునెఱుఁగకుండుమనకులోకనిందతో పనియేమి. (న్యాసవిద్యైకనిష్ఠానాం । వైష్ణవానాంమహాత్మనాం । ప్రాకృతాభిస్తుతిర్నిందా । నిందాస్తుతిరితిస్మృతో) అనఁగా ప్రపత్తినిష్ఠులై మహాత్ములగువైష్ణవులకు ప్రాకృతులనిందస్తుతియగును. వారిస్తుతినిందయగును. ఎట్లనినభగవత్ప్రపన్నులు శరీరధర్మములనుపేక్షించి యాత్మస్వరూపమును గౌరవింతురు. భగవంతునిసర్వవిధబంధువనియధ్యవసించి దేహబంధువులను మ్రుచ్చులనిదలఁతురు. అనవరతభగవదనుభవమును పురుషార్థముగఁగొనిక్షుద్రపురుషార్థములనొల్లకయుందురు.నరకద్వారంబగు శబ్దాదివిషయసుఖములను వర్జించిమోక్షద్వారంబగుభగవత్కైంకర్యమునఁజొక్కియుందురు. ప్రాకృతులుఆత్మస్వరూపమునుమఱచి దేహధర్మమును గౌరవింతురు. సర్వవిధబంధువగుభగవంతునిభజింపకయాభాసబంధువులను వర్ధింతురు. భగవదనుభవమును అల్లముఅనివర్జించి క్షుద్రపురుషార్థములను బెల్లమనిమనోరథింతురు. మోక్షద్వారంబగు భగవత్కైంకర్యమునొల్లక నరకద్వారంబగుశబ్దాదివిషయానుభవమునందుఁజొక్కియుందురు. కాననట్టిప్రాకృతులవలనఁగలుగుచుండు నపవాదమునకైమీరుచింతింపకుఁడు.బిడ్డలకై చింతించెదమనియుందురేమో యాబిడ్డలకు మీరెక్కడితండ్రులు. వారికిదివఱకు ఎందఱోతండ్రులైరి. సర్వవిధబంధువగుసర్వేశ్వరుఁడు సర్వాత్మలసంరక్షణమునందు జాగరూకుఁడైయున్నాఁడు. మీరీచింతనువిడిచి భగవంతునినిచింతింపుఁడు. మీకు [illegible]గునుగాకయనిహితోపదేశముచేసినయాచార్యునిసుభాషితములనువిని చింతను [illegible]మునకువచ్చిచేరిరి. పిదపవీరలువివాహమునకుఁగావలసిన సమస్తపదార్థములను సంపాదించుచుండఁగా నాయూరిబ్రాహ్మణులువచ్చి మీకుసంబంధులెవరనియడిగిన కబీరుశిష్యులువారల [illegible] జాతిభ్రష్టులంజేసితిరిగదా. ఇఁకను మాకు కులాచారము [illegible]

లేమి. అన్నకూఁతును తమ్మునికొడుకునకును, తమ్మునికూఁతును అన్నకొడుకునకునిచ్చి మాలో సంబంధము చేసికొనియెదము. అనినవిని బ్రాహ్మణులుతమలో యోచించియీయిరువురును కబీరును విష్ణుభక్తునిచేనుపదేశమును బొందిరని జాతిభ్రష్టులుగఁజేసితిమి వీరలట్లుపదేశము చెందుటచే మనకొకింతయుహానిలేదు. వీరలుమనమీఁదనిందను మోపి కులాచారమునకు విరుద్ధముగవివాహమును జేయుటకు నిశ్చయించియున్నారు. ఇందుచేమనకపకీర్తికలుగును. కబీరుమహానుభావుఁడనియు, నతనిచరిత్రములత్యద్భుతములనియు, నతనికిభగవంతుఁడు భృకుటిభటుఁడైయున్నాఁడనియు ఆబాలవృద్ధము చెప్పుచున్నారు. వెనుకనేమికీడు పొసఁగునో తెలియదు. భగవంతుఁడు భక్తిని గౌరవించునేకాని జాతిని గౌరవింపఁడు. ఇందుకు నిదర్శనముగ బ్రహ్మరక్షస్సుచండాలునియభిమానముచే పరిశుద్ధుఁడగుట మొదలగు పెక్కుకథలువరాహాది పురాణములందు వినఁబడుచున్నవికదాయని బహువిధములుగ చింతించి యాయిరువురను నెప్పటియట్లు తమలోఁగలుపుకొని వారలపుత్రులకు తమపుత్రికలనిచ్చి తమకొడుకులకు వారలకొమార్తెలను తీసికొని వివాహమును నెఱవేర్చిరి. పిదపనీయిరువురును సర్వసంగపరిత్యాగము చేసి వారణాసిని నివసించుకబీరుదాసుసన్నిధికిఁబోయి సదాచార్యునికిపాదచ్ఛాయలైయుండిరి.

శ్రీభక్తవరదాయనమః.

---

## ఇరువదినాలుగవయధ్యాయము.

### కబీరుదాసుశిష్యుఁడగుపద్మనాభునిచరిత్రము.

కాశిలో బ్రాహ్మణకులమునపద్మనాభుఁడనునొకపుణ్యపురుషుఁడవతరించెను. అతనికి చౌలోపనయనాదులు యథాకాలమున యథావిధిగ జరపింపఁబడియెను. ఇతఁడుసాంగముగ వేదములను, స్మృతీతిహాసపురాణములను, నభ్యసించియందుపూర్ణయోగ్యతను సంపాదించెను. ఈపద్మనాభుఁడొకనాఁడేకాంతముగఁగూర్చుండి తనమనంబుననిట్లని వితర్కించెను. స్వరూపరూపగుణవిభవములచే సర్వోత్కృష్టుఁడై యఖిలచేతనాచేతనములకు తానేయాధారమై తనకు వేఱొకయాధారము లేనివాఁడై దేవమనుష్యాదిజాతులను, శ్వేతకృష్ణాదివర్ణములును, వృద్ధిక్షయాదివికారములును, జన్మమరణాద్యవస్థలును, లేనివాఁడై యప్రమేయములగు జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజస్సులనుషడ్గుణైశ్వర్యములతోఁగూడినవాఁడై జ్ఞానానందైకస్వరూపుఁడై చేతనాచేతనములకు లోపలను వెలుపలను వ్యాపించియుండువాఁడై యెందునునంటక యన్నిటిని ప్రకాశింపించువాఁడై యజ్ఞానాదిహేయగుణరహితుఁడై యిచ్ఛాగృహీతమగునసంతనామరూపములతోఁగూడినవాఁడైయుండుసర్వేశ్వరుఁడొకఁడుగలఁడు. అతనిచేననంతకోటిబ్రహ్మాండంబులు సృష్టింపఁబడియున్నవి. ఈయండంబులన్నియుననంతాత్మలచే నిబిడీకృతమైయున్నది. ఈయాత్మలుపూర్వకర్మానురూపముగ నానావిధయోనులయందుఁ బుట్టుచున్నవి. అందుమనుష్యశరీరము మిగులదుర్లభము. అట్టిజన్మములభించినను అనాదిదు[illegible]యింద్రియవశ్యుఁడై భగవద్విముఖుఁడై యుండుటను జూచి జ్ఞానవంతుఁడై యింద్రియ[illegible]జయించి భగవదాభిముఖ్యముతోఁ గూడియుండుటయరుదు. ఇంతయుఁ దెలిసియున్నను జ్ఞానాను

స్థానసంపన్నుఁడగు సద్గురువు లభించుట యెంతయు నసాధ్యము. అట్టి సద్గురుసంబంధము కలుగక భగవదంగీకారము సిద్ధింపదు. కాన సదాచార్యు నాశ్రయించి యతని యుపదేశమును బొంది భగవంతుని యందు తైలధారవలె నవిచ్ఛిన్నమగు భక్తి చేసి సమస్తకరణములను భగవద్విషయమున వినియోగించి సుఖదుఃఖ, లోష్టకాంచన, ప్రియాప్రియ, నిందాస్తుతి, మానావమాన, శత్రుమిత్రులయందు సముఁడై, సర్వారంభపరిత్యాగియై యుండువాఁడు (బ్రహ్మభూయాయ కల్పతే) అను రీతిని బ్రహ్మమును బొందుటకు సమర్థుఁడగుచున్నాఁడు. అనాదికాలముగ ననంతజన్మములనెత్తి యిట్టి జ్ఞానమును తదనుగుణమగు ననుష్ఠానమును లేక యింద్రియకింకరుఁడనై యమవశ్యుఁడనైతిని. ఇఁకను భగవంతుని కటాక్షముచే సదాచార్యు నాశ్రయించి యుపదేశమును బొంది యనవరతము భగవద్భక్తి చేసి కృతార్థుఁడ నయ్యెదను. అని బహువిధములుగఁ జింతించి జ్ఞానానుష్ఠానసంపన్నుఁడై భగవంతుని కత్యంతమంతరంగుఁడై యుండు కబీరు నాశ్రయించి యుపదేశమును బొంది యతని యనుగ్రహముచే నీషణాత్రయమును వర్జించి పరమశాంతచిత్తుఁడై సదా భగవద్ధ్యానము చేయుచుండెను.

ఇట్లుండ నాపట్టణమునందు వసించు వర్తకుఁడొకఁడు శ్రీమంతుఁడై యౌదార్యము, భగవద్భక్తి, బంధుపోషణము, ఆశ్రితరక్షణము మొదలగు సద్గుణములతోఁ గూడియుండెను. అతని భార్య శ్లాఘ్యగుణంబులకు రత్నాకరమై యుండెను. ఈదంపతులకు నైదుగురు పుత్రులు గలిగి గుణవంతులై తల్లిదండ్రులకు విధేయులై యుండిరి. ఇన్ని విభవములతోఁ గూడియుండు కాలమున నవ్వర్తకుఁడు పూర్వకర్మవాసనచే కుష్ఠరోగము గలవాఁడై శరీరమున క్రిమిజాలమును, దుర్గంధమును నానాటనధికమై బాధపడుచుండెను. అందఱును సమీపమున వచ్చుటకసహ్యపడుచుండిరి. బహుద్రవ్యమును వ్యయముచేసి పెక్కౌషధములను స్వీకరించియు, బహువిధములగు దానములు చేసియు, ననేక జపహోమాదిసత్క్రియలు చేయించియు నించుకైన నుగుణములేక యారోగము వర్ధిల్లుచుండెను. వర్తకుఁడు వేదనను సహింపలేక భార్యాపుత్రాదిబంధువర్గములను జూచి నన్ను మోక్షప్రదాయినియగు గంగయందు పడవేయుఁడని ప్రార్థించెను. వారలతని సుగుణసంపత్తిని స్మరించి విశ్లేషాసహిష్ణువులై యతని ప్రార్థన నంగీకరింపకుండియు నెట్టకేలకట్టి దుఃఖము ననుభవించుటకన్న శరీరవియోగమే చాలా మేలని నిశ్చయించి యతని ప్రార్థనకొడంబడి యతని నెత్తుకొనిపోయి గంగాతీరమున నుంచుకొని శరీరము నీటఁ దేలక శీఘ్రముగ మునుఁగుటకై చేతులకును కాళ్లకును కుండలను గట్టుచుండిరి. అపుడు బహుజనులు గుమిగూడి యావేడుకను జూచుచుండిరి.

ఆసమయమున కబీరుశిష్యుఁడగు పద్మనాభుఁడు గంగాస్నానమునకు వచ్చి యాసంఘమును జూచి కారణమడిగి తెలిసికొని వర్తకుని చెంతకుఁ బోయి యేల యిట్టి సాహసము నీవు చేసితివి. (దుర్లభో మానుషో దేహః) అను రీతిని మనుష్యశరీరము కలుగుట మిగుల దుర్లభము, జీవాత్మలు దేవాద్యుత్కృష్టజన్మములయందును పూర్వజన్మార్జితపుణ్యపాపఫలములను అనుభవింతురు. మనుష్యశరీరమునందు పూర్వజన్మార్జితము ననుభవించుచు నుత్తరకాలఫలములకు సాధనముల ననుష్ఠింతురు. కాన సర్వఫలములను మనుష్యశరీరముచేతనే సాధింపవలయును. జీవులకు నానావిధములగు నుత్కృష్ట, నికృష్టజన్మములు కలుగుటకుఁ గారణము మనుష్యజన్మమునందుఁ జేయఁబడిన పుణ్యపాపములై యున్నది. ఊర్ధ్వలోకములయందు దేవాదిపుణ్యశరీరములను బరిగ్రహించి స్వర్గాదిసుఖంబుల ననుభవించువారు (క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి) అను రీతిని పుణ్యక్షయా

నంతరము మనుష్యలోకమునకు వత్తురు. మనుష్యులిచ్చటినుండి సర్వఫలములను సాధింతురు. కావననిట్టి దుర్లభమగుమనుష్యశరీరము భగవత్కటాక్షము చేలభించియుండఁగా నట్టిశరీరమునకు హానినిపూని వెదకుట మతిమంతునికార్యము కాదు.అనిచెప్పినపద్మనాభునివాక్యములనువిని వర్తకుఁడు తనవృత్తాంతమునంతయును సాంగోపాంగముగా విన్నవించెను. అదివినిపద్మనాభుఁడు ఓభాగ్యవంతుఁడా! నీశరీరారోగ్యమునకై యసారమగుపెక్కుసాధనంబులననుష్ఠించితివిగాని సారతమమగుసులభోపాయమును స్మరింపవైతివి. మృతసంజీవనమగునట్టి శ్రీరామనామమును త్రికరణశుద్ధితోడ ముమ్మారుచ్చరించితివేని యీమహావ్యాధి తత్క్షణమున నశించిపోవును. తైలహీనమగుపదార్థములు దుర్బలములగునట్లు భగవన్నామోచ్చారణములేనిసర్వసాధనములును నిస్సారములగును. ఇపుడునీవును,నిన్నుపరివేష్టించియుండుజనులును శ్రీరామరామరామయనిఘోషింపుఁడనిపద్మనాభుఁడుచెప్పినఁనందఱునట్లుచేసిరి. తత్క్షణమున సర్వజనులుచూచుచుండ వర్తకునిశరీరమువనుండు వ్యాధితొలఁగిపోయెను. అతనిశరీరము మునుపటికన్న తేజస్సును, దార్ఢ్యమును జెందియొప్పెను. గంగాతీరమునఁగూడియుండినసర్వజనులు శ్రీతారకనామోచ్చారణము చేసినంతటవారివారిరోగములునశించియారోగ్యముకలవారైరనుటయాశ్చర్యముకాదు. శ్రీరామచంద్రునికటాక్షముచేనందఱికిని భవరోగనాశహేతువగుభక్తివిరక్తులు తత్క్షణంబుననంకురించివారుశమదమాద్యాత్మగుణోపేతులైసర్వలోకులకు వందనీయులైరి.ఆవర్తకుఁడుతోడనే లేచి పద్మనాభునికి ప్రదక్షిణనమస్కారములు చేసి యతనిచేనుపదేశమును జెంది భాగవతాభిమానాంతస్స్వాంతుఁడై తనయాచార్యుఁడగుపద్మనాభునియొక్కయు, పరమాచార్యుఁడగు కబీరుదాసుయొక్కయు, ప్రథమాచార్యుఁడగుశ్రీతారకబ్రహ్మముయొక్కయు ప్రభావమునుగొనియాడుచు నదిమొదలనవరతము శ్రీరామనామస్మరణయేమతికయుండెను.

ఈయతిశయమును కబీరుదాసువిని తనశిష్యుఁడగుపద్మనాభునినిరప్పించి శ్రీరామనామమును స్వల్పప్రయోజనమునకై మూడుమాఱులుచ్చరింపవలయునా. గోటితోగిల్లఁదగినవస్తువునకుగొడ్డంటినిప్రయోగించితివి. త్రికరణశుద్ధిగనొకతూరి రామయనునక్షరద్వయమునుచ్చరించినఁ అనంతకోటిజన్మములయందలిఘోరపాపములు నశించిదైహికాముష్మికసుఖములుకలుగును. ఆనామప్రభావమును వర్ణించుటకు వేదపురుషునికిని శక్యముకాదు.ఇట్టిమహాప్రభావముతోఁగూడిన మహామంత్రమును నీవు అత్యల్పఫలమునకై మూడుమాఱులుచ్చరింపించితివి. అనిచెప్పిన పద్మనాభుఁడు గురుపుంగవా! ఆవర్తకుఁడు జ్ఞానానుష్ఠానపరిపూర్ణులగుదేవరవారిపాదపద్మంబులనాశ్రయింపనిళొంటతీఅనొక్కమారును, శరీరరోగముతోడ భవరోగమునశించి ముక్తికాంతను వరించుటకై యొక్కమారును, అచ్చటఁగూడియుండిన సర్వజనులును జ్ఞానవైరాగ్యసంపన్నులై మోక్షార్హులగుటకునొక్కమారును మంత్రమునుచ్చరింపించితిని. అనిసవినయముగవిన్నవించెను. కబీరుదాసు మిగులసంతసించి నీవు సచ్ఛిష్యుఁడవనియతనిబుద్ధివైశాల్యమును జక్కఁగాఁగొనియాడెను.

శ్రీరామాయనమః.

---

కబీరుదాసు సంసారముననుండియును తామరాకున నీళ్లంటనట్లుండుననంటక విరక్తుఁడై సదాభగవదనుభవానందముతోఁగూడి శ్రీతారకనామము జపించుచుండెను. అట్లుండనొకనాఁడు పదివేలసాధువులు కాశికి వచ్చియీయూరిలో మాకు సదావర్తియిచ్చి యాదరింపఁదగినవారెవరైననుగలరాయని విచారించుచురాఁగానచ్చటనుండినకొందఱు దుష్టులు వారలనుజూచి యీయూరిలో కబీరుదాసు అనునొకభగవద్భక్తుఁడున్నాఁడు. అతఁడీయూరికివచ్చు భాగవతులనెల్ల నన్నపానములకుఁగొఱఁతలేకయాదరించుచున్నాఁడు. అతఁడుతప్ప వేఱొకరును అట్లాదరించువారులేరు. కాన మీరచ్చటికిపొండనిననాసాధువులు శ్రీరామనామమును ఘోషించుచు కబీరుదాసునింటికి వచ్చిరి. ఆశబ్దమును విన్నమాత్రమున కబీరుదాసు వేగముగవచ్చి సాధువులనుజూచి ప్రీతియుక్తుఁడై సాష్టాంగవందనముచేసిన వారలు సంతసించి కబీరుదాసుయొక్కవినయాదిసుగుణంబులను గొనియాడిరి. కబీరుదాసు వారలనుపచరించి కూర్చుండఁబెట్టి తుళసిసెట్టియను వర్తకునియింటికేఁబోయి యతనిఁజూచి నేఁడుపదివేలసాధువులు నాయింటికివచ్చియున్నారు. వారలకుసదావర్తియిచ్చుటకై నీవుబియ్యము,పప్పు,మొదలగు వస్తుసంభారములనొసఁగుమనిప్రార్థించిన నావర్తకుఁడున్మత్తుఁడును, దురాచారవంతుఁడునునగుటచే సంకోచపడకకబీరును జూచి నీభార్యనొకరాత్రి నాకు స్వాధీనముచేసితివేనినీవుకోరినవస్తువులన్నిటినిచ్చెదననెను. అదివిని కబీరు తనమనంబుననిట్లనివితర్కించెను. ఈవర్తకుఁడు లోకాపవాదమునకును, యమవశ్యతకును గొంచెమైనను వెఱవకయిట్లపేక్షించుచున్నాఁడు. (స్త్రీశుద్ధిరర్థశుద్ధిశ్చ । యస్యనాస్త్యపిధర్మవాన్ । సఏవనరకంయాతి । శిరచ్ఛేదేకుతోభిషక్) అనఁగా స్త్రీశుద్ధియు, ద్రవ్యశుద్ధియులేనివాఁడెంత ధర్మిష్ఠుఁడైనను శిరచ్ఛేదమును జక్కఁపఱుచుటకౌషధములేనట్లీపాపికి ప్రాయశ్చిత్తములేదు. పాపములనుజేయువానికిని, అట్టివానికిసహాయముచేయువానికిని సమఫలముచెప్పఁబడియున్నది. కాన వీఁడు నరకావహమగు తుచ్ఛభోగమునపేక్షించుటయు, నేనందునకు సహాయపడుటయు క్రూరనిషిద్ధము. అయినను (విచిత్రాదేహసంపత్తి । రీశ్వరాయనివేదితుం) అనఁగా విచిత్రమగుదేహసంపత్తి యీశ్వరవిషయవినియోగమునకై యీయఁబడియున్నది. రాజునకుకానుకనిచ్చుటకన్న రాజుచూచుచుండ రాజపుత్రునకునొకపదార్థమునిచ్చిననాప్రభువునకు ప్రీతియినుమడియగునట్లు భగవత్కైంకర్యమునకన్న భాగవతకైంకర్యము భగవంతునికత్యంతాభిమతమైయుండును. (ఆరాధనానాంసర్వేషాం । విష్ణోరారాధనంపరం । తస్మాత్పరతరంప్రోక్తం । తదీయారాధనంనృప) అనఁగానంపటినారాధించుటకన్న భగవదారాధనమువిశేషము. అంతకన్న భాగవతారాధనము విశేషతరము. అని ప్రమాణము పలుకుచున్నదిగదా. మఱియుస్వార్థముగ శాస్త్రనిషిద్ధకార్యములను జేయుట నరకాస్పదమగునేగాని భగవద్భాగవతవిషయమై యట్టికార్యముచేయుట భగవన్ముఖోల్లాసహేతువగును. యాగములయందు జీవహింసయు, వివాహాదులయందు అనృతమును నింద్యముకానట్లు నిరుపేదయగునేనతిథులగుసాధువులనారాధించుటకై యీవర్తకునిమనోరథమును నెఱవేర్చుటదోషము కాదు.నాభావమును నాకంతర్యామియగు శ్రీరామభద్రుఁడెఱుఁగును. అని తనలో నిశ్చయించియోమహాత్మా! భాగవతారాధనంబునకు కొఱఁతలేకవలయునట్టివస్తువులనిచ్చితివేని నీవునొకవర్తకునకై నేనేమిచేసిననుదగును. కాననేఁటిరాత్రి నీవు కోరినట్లు నావ్యాధ

యాలయవాసియగు శ్రీరామభద్రుఁడు సాక్షిగా నేటిరాత్రి నాభార్యను నీయింటికిఁబంపెదన నిచెప్పిన కపీరుదాసుమాటలను విని స్త్రీపురుషులయౌవనమనునుద్యానవనమున ననవరతము విహరించుచుండు కామరాజునకు నాహైఁగరుణకలిగెనని వర్తకుఁడు మిగులనానందించి కపీరు దాసుకోరినవస్తువులనవ్వారిగనిచ్చెను. కపీరావస్తువులనెల్లనుగొని తోడనేవచ్చిసాధువులకుయథే ష్టముగనిచ్చి వారలనామంత్రణముచేసెను. ఆరాత్రి కపీరు తాను వర్తకునికి వాగ్దత్తముచేసినవిధ మును తనభార్యతోఁజెప్పిన నాపతివ్రతాశిరోమణి ప్రాణనాథా! నాయాత్మాత్మీయములు దేవ వారికి అచిద్వత్పరతంత్రమైయుండ ఈవస్తువును దేవరవారియిష్టానుసారముగ వినియోగింపవ చ్చునని విన్నవించి భర్తృనియమనముచే తనశరీరమునలంకరించుకొని బయలుదేరిన కపీరుదా సు ఆయువతిని వెంటఁబెట్టుకొనివచ్చి వర్తకునియింటవిడిచి పెట్టిపోయెను. అప్పుడువర్తకుఁడా నారీరత్నమునుజూచి కామాతురుఁడై దీపమునఁబడు శలభమువలె నావనితయొక్క యంగ సంస్పర్శమును మనోరథించుచుండ భక్తవత్సలుఁడగు శ్రీపాండురంగఁడాయుధపాణియైయగూ ఘూరికొత్వాల్ వేషమును ధరించి వర్తకునియింటఁబ్రవేశించియోరీపాపాత్మా! కుటిలబుద్ధీ! పర మభాగవతుఁడగుకపీరుదాసునకుభార్యయు, పరమసాధ్వియునగు నీపతివ్రతాశిరోమణియందు మాతృభావముచేయక యీమెయంగస్పర్శమున పేక్షించితివిగదా. కుక్కదేవార్హమగుపురోడా శమునుస్పర్శింపవచ్చినట్లు నీవీభాగ్యశాలినిని స్పర్శింపనపేక్షించితివి. నిన్నిపుడు వధింపక వి డువనని పరుసములాడుచుండఁగా నావర్తకుఁడు భయకంపితగాత్రుఁడై యాకొత్వాల్ పాద ములనుబట్టుకొని కృపానిధీ! కామాంధుఁడనై తప్పుచేసితిని. మన్నింపుమనివేడిన వర్తకునిఁజూచి యిఁకనెన్నటికినిట్టిపాపము తెరువునఁబోకుమని హితోపదేశముచేసి యీపతివ్రతకు సాష్టాం గవందనముచేసి తదనుగ్రహపాత్రుఁడవగుమనినవర్తకుఁడట్లుచేసెను. పిదపకొత్వాల్ వేషధా రియగుభగవంతుఁడాపాలఁతిని పిలుచుకొనివచ్చి కపీరునియింటవిడిచిపెట్టి యదృశ్యుఁడయ్యెను. అపుడు కపీరు జరగినవృత్తాంతమును తనభార్యచేవిని (కోపమాహారయేత్తీవ్రం) అనురీతిని కో పమునారోపించుకొనియతివేగముగ కొత్వాల్ యింటికిపోయివానిని క్రూరదృష్టితోఁజూచి భా గవతారాధనమునకైవలసినవస్తువులనవ్వారిగనిచ్చినమహోపకారకుఁడగువర్తకునికి నేనుసమ్మ తించి నాభార్యనుపంపియుండ నీవేల పిలువనిపేరంటమునకు వచ్చియావర్తకునినిబెదరించి తివి. స్త్రీకిపురుషుఁడుస్వామియై, యాస్త్రీపురుషునికిష్టవినియోగార్హయై యుండుట పరమధ ర్మముగదా. అట్లుండనీవిషయమునందన్వయించుటకు నీకేమి సంబంధము. వర్తకునిశయ్యాగృహ మున నీవెట్లుప్రవేశింపవచ్చునని కఠినాక్షరముగఁబల్కిన కొత్వాల్ భయపడి వీరిపాదములను బట్టుకొని యోసాధుజనాగ్రేసరా! నాకేమియును దెలియదు. నేనావర్తకునిఁగాని, నీపత్నినిఁగా ని చూచియెఱుఁగను. అనిప్రమాణపూర్వకముగఁజెప్పినవిని కపీరాశ్చర్యపడి యిదిభగవం తునిలీలయని తెలిసికొని వర్తకునియొద్దకుఁబోయియోధర్మాత్మా! నిన్నదలించినవాఁడీయూరికొ త్వాల్ కాఁడు. అప్రమేయుఁడగుభగవంతుఁడారూపమునుదాల్చికొనివచ్చినీకు దర్శనమొసఁగె ను. నీభాగ్యమేభాగ్యము. ఎండమావులనుపానముచేయవలయునని పరువెత్తువానికమృతసింధు వద్దపడినట్లు క్షుద్రపురుషార్థమునపేక్షించిననీకు కోరకయేపరమపురుషార్థముసిద్ధించెను. మహా తపస్వులకు దుర్లభుఁడగుభగవంతుఁడు పరమకృపచే నీకు సేవయొసఁగెను. నీపాపంబులుతొలఁ గెను. నీజన్మంబుఫలంబయ్యెను. ఇఁకనిమిషమైననేమఱక భక్తవత్సలునిధ్యానించుచు తన్నామ

మును గీర్తించుచుండుము. అనిచెప్పిన కబీరుదాసుయొక్క సుధారసవాక్యంబులనువిని వర్తకునికి తత్క్షణంబున జ్ఞానోదయమైనందున కబీరుదాసునకు దండప్రణామముచేసి దేవరవారిసహవాసముచే భగవంతునిదర్శనమునాకుసిద్ధించెను. కాన సాధుసంగతి మోక్షపర్యంతమగుసర్వఫలంబులనిచ్చుననుటకు సందేహములేదు. (మహత్సేవాంద్వారమాహుర్విముక్తేః) అనఁగా మహాత్ముల సేవ మోక్షద్వారమగునని భగవంతుఁడు తానేచెప్పెనుగదా. అదియీయెడననుభవసిద్ధమయ్యెను. దుర్బుద్ధినైనూత్పసదృశయగుదేవరవారిధర్మపత్నివిషయమునవిపరీతభావమునుజెందిన నాతప్పును మన్నించి నన్ను శిష్యునిఁగ నంగీకరింపవలయునని ప్రార్థించిన కబీరుదాసుఆతనికి నభయమిచ్చినీకనుతాపము కలిగినపుడే నీపూర్వాఘమగ్నిస్పర్శమైనదూదివలెదగ్ధమయ్యెను. ఇఁకను భగవదనుభవరతుఁడవై యింద్రియసుఖంబులనొల్లక జాగరూకుఁడవయి వర్తింతువేని యుత్తరోఘంబు నిన్నుస్పర్శింపదని హితోపదేశముచేసి స్వస్థానమునకుఁబోయెను. అదిమొదలువర్తకుఁడు సర్వసంగపరిత్యాగముచేసి యాచార్యుఁడగు కబీరుదాసు విధించినపథ్యముతోఁగూడి కాలక్షేపము చేయుచునుండెను.

ధర్మ సేత వే న మః.

## ఇరువదియయిదవయధ్యాయము.

### రోహిదాసుచరిత్రము.

గంగానదికి దక్షిణభాగముననొకగ్రామమునందు మాదిగకులమున రోహిదాసుఁడనునొకభాగవతుఁడవతరించెను. (అమానిత్వమదంభిత్వ।మహింసాక్షాంతిరార్జవం । ఆచార్యోపాసనంశౌచం । స్థైర్యమాత్మవినిగ్రహః । ఇంద్రియార్థేషువైరాగ్య । మనహంకారఏవచ । జన్మమృత్యుజరావ్యాధి।దుఃఖదోషానుదర్శనం। అసక్తిరనభిష్వంగః । పుత్రదారగృహాదిషు।నిత్యంచసమచిత్తత్వ । మిష్టానిష్టోపపత్తిషు।మయిచానన్యయోగేన।భక్తిరవ్యభిచారిణీ । వివిక్తదేశసేవిత్వ । మరతిర్జనసంసది । ఆధ్యాత్మజ్ఞాననిత్యత్వం । తత్వజ్ఞానార్థదర్శనం । ఏతజ్జ్ఞానమితిప్రోక్త । మజ్ఞానంయదతోన్యథా) అనఁగా విద్య,ధనము మొదలగు వానిచేత్తగొప్పవాఁడననితలఁపకుండుట, డంభములేకయుండుట,జీవహింసచేయకుండుట, త్రికరణములేకమైయుండుట, ఆచార్యసనుపర్తింట, సదాశుచియైయుండుట,స్వనిష్ఠయందుచలింపకుండుట,మనసునిగ్రహించుట,యింద్రియవిషయములయందు ప్రీతిలేకయుండుట, అహంకారములేకయుండుట, జన్మమరణవార్థక్యవ్యాధిదుఃఖములయొక్కదోషములను దెలిసికొనియుండుట, ఐహికభోగములయందు ఆసలేకయుండుట, పుత్రదారగృహాదులచేఁగలుగుసుఖదుఃఖములలోసంబంధింపకుండుట, యిష్టానిష్టప్రాప్తులయందు సమచిత్తము కలిగియుండుట, యితరచింతలేకనాయందుదృఢభక్తిచేయుట, విజనస్థలమునవసించుట, జనసంఘమున ప్రీతిలేకయుండుట, అనవరతము ఆత్మజ్ఞానముతోఁగూడియుండుట, తత్వజ్ఞానార్థము నెఱుఁగుట,అనునివిజ్ఞానమనియువీనికితరమగునవి అజ్ఞానమనియు చెప్పఁబడునని భగవద్గీతయందు భగవంతుఁడు చెప్పియుండురీతిని రోహిదాసుఁడుపైఁజెప్పిన

యాత్మగుణములతోఁగూడియుండెను. ఇట్టిసుగుణసంపత్తిగలయీసుశీలుఁడు తనకులవృత్తియం దు ప్రవేశించినతోడనే ప్రతిదినమునొకపాదరక్షను గుట్టి ధర్మమునకని భద్రపఱుచుచు తన కంటికిభగవద్భక్తులుగోచరమైనంతట వారలయొద్దకు పోయి వందనకుశలప్రశ్నంబులుచేసి వారలపాదములకు పాదరక్షలనర్పించుచునుండును. తీర్థయాత్రాపరులకును, బీదలకునుకూలి నపేక్షింపకజీర్ణములగువారలపాదరక్షలనుజక్కపఱిచియిచ్చుచు సదాభగవద్ధ్యానకీర్తనంబుల ను జేయుచునుండును.

ఈభాగవతాగ్రగణ్యుఁడు తనయింటిసమీపముననొకనందవనమునుగల్పించియందుతు లసీమొదలగుభగవదారాధనయోగ్యంబులగు పుష్పజాతివృక్షములనునిచి పోషించుచు ప్ర తిదినము శ్రీమన్నారాయణుని. పూజింపవలయుననిమిగులమనోరథించుచుండ దీనదయాళుఁడ గు భగవంతుఁడు సాలగ్రామమూర్తియై యితనికి సేవయొసఁగెను. రోహిదాసుఁడు పరమయో గులకు వాఙ్మనసాపరిచ్ఛేద్యుఁడగు భగవంతుఁడుతనకుసేవయొసఁగుటకుప్పొంగి వానియాశ్రితవా త్సల్యాది భగవత్కల్యాణగుణంబులను బహువిధములఁగొనియాడుచు పూజాద్రవ్యములగు తీర్థ పాత్రాదులను తోలుతోనిర్మించి నందవనమునఁగూర్చుండి పూజింపనారంభించినంతటనాఁకలి మిగులబాధించెను.అపుడు రోహిదాసుఁడుతనమనంబుననిట్లనివితర్కించెను.భగవంతునారాధిం చువారలుషఃకాలమున స్నానముచేసియనుష్ఠానములను నెఱవేర్చి భగవంతునారాధించి పిదప తన్నివేదితాన్నమును స్వీకరించుట శాస్త్రవిహితమగుననుష్ఠానమైయున్నది.నేను బాల్యముమొ దలుకొని ప్రాతఃకాలమునభుజించుట వాడుకయైనందున నిపుడునన్నాఁకలి బాధించుచున్న ది.అట్టిబాధతోడ భగవంతునారాధించిన కాయముమాత్రము భగవత్కైంకర్యముననన్వయించు నేగాని మానసమున్నమును ధ్యానించుచుండును. చిత్తశుద్ధిలేనియారాధనము బూదిలోఁవేల్చి ననేయియగును. ఆఁకలిబాధనుసహింపక భగవంతునికిఁజేయవలసినయుపచారములను సంగ్ర హముగఁజేయుటయున్యాయ్యముగాదు. భగవంతుఁడు మనశ్శుద్ధికి సంతోషించుచునట్లు కాయ కశుద్ధికి సంతోషింపఁడు. కాననుదయమున క్షుద్బాధను పరిహరించుకొని పిదపత్రికరణముల నైక్యపఱిచి యచంచలభక్తితోడ యథావకాశముగ భగవంతునినారాధించుట యుత్తమ మనితోఁచుచున్నది. అని నిశ్చయించిప్రతిదినముషఃకాలమున (ఉత్తిష్ఠ-చింతయహరిం) అను రీతిని హరిస్మరణముతోడ లేచి కొంతసేపు భగవంతునికల్యాణగుణంబులను, తానతనికనన్యా ర్హశేషమైయుండుటను జింతించుచుండి పిదప భగవన్నామస్మరణముతోడ స్నానముచేసి వైష్ణవచిహ్నమగునూర్ధ్వపుండ్రమునుధరించి భగవన్నివేదితాన్నముచే క్షుద్బాధనుదీర్చుకొని మరలస్నానముచేసి సావధానముగ భగవదారాధనమునకుపక్రమించి చర్మాసనమునఁగూర్చుండి చర్మపేటికయందుండు సాలగ్రామమూర్తియగు భగవంతునిని చర్మపీఠంబుననునిచి చర్మమయ ములగు పూజాపాత్రంబులను, తులసిని, నానావిధపరిమళపత్రపుష్పంబులను భగవత్సన్నిధినునిచి నానావిధములగునుపచారములనుజేయుచు నడుమ నడుమ ధ్యానపరుఁడై తన్నుమఱచిచొ క్కుచు భగవన్నామంబులనుగట్టిగనుచ్చరించుచు నృత్యముచేయుచు అనాదికాలముగ నీ యాత్మభగవద్విముఖుఁడై యింద్రియలోలుఁడై భగవద్భాగవతసంబంధమును మఱచియాభాస బాంధవలోలుఁడై పరహింస, పరదారగమన, పరద్రవ్యాపహార, అసత్యకథన, అభక్ష్యభ క్షణ, అపేయపానాది దురాచారవంతుఁడై పెక్కుగర్భములంబుట్టుచుతానుజెందిన దుర్దశను

స్మరించి నేలంబడిపొరలియేడ్చుచు నీజన్మంబునభగవన్నిర్హేతుకకటాక్షముచే తనకులభించిన భగవద్భాగవత ప్రాపిణ్యాదులనుస్మరించి పరమానందభరితుఁడై గంతులువేయుచు నిద్రాహారక్రమములేక భగవదనుభవమునతనమనసు పోయినపోకలెల్ల పోవుచునుండెను. భక్తక్రీతుఁడగు పండరినాథుఁడు రోహిదాసునిభక్తికిసంతోషించి యతనివెంబడించి తిరుగుచుండెను. ఇట్లుచిరకాలము జరగినపిదపనొకనాఁడాగ్రామపురోహితుఁడు దైవవశముగ నందవనసమీపమునకు వచ్చి భగవదారాధనముచేయుచుండురోహిదాసునుబిలిచిన నతఁడు వచ్చి నమస్కరించెను. పురోహితుఁడు రోహిదాసునుఁజూచి నీవు తులసివనమును బ్రతిష్ఠించి పోషింపవచ్చునాయని యడిగిననతఁడు లోకమున వననిర్మాణముచేసి పోషించుటకు జాతినియమముకలదా. పంచములు పైరుచేసినపదార్థములు దేవబ్రాహ్మణులకుపయోగపడుచుండలేదా. అనినబ్రాహ్మణుఁడు నీవానందవనముననేమి చేయుచున్నావనియడిగియతఁడు చేయుభగవదారాధనక్రమమును నతనిచే వినిచేయితట్టినవ్వుచు భళీ! మిగులబాగైయున్నది. మాదిగవాఁడవగునీవు సాలగ్రామమూర్తినిస్పర్శించి యారాధింపవచ్చునా. భగవదారాధనమునకు అపరిశుద్ధమగు చర్మపాత్రములుకూడునా! ముందుగభుజించి పిదప భగవంతునినారాధించుట న్యాయ్యమా. అనియడిగిన రోహిదాసుఁడు సవినయముగబద్ధాంజలియైనిలుచుండి నేనుగండకినదికిపోయి సాలగ్రామమును దెచ్చుకొనలేదు. బ్రాహ్మణులెవరును సాలగ్రామమునియ్యలేదు. శ్రీపండరినాథుఁడు పరమకృపచేసాలగ్రామమూర్తియై నేనువసించుచోట సేవయొసఁగి నాపూజనంగీకరించుచున్నాఁడు. ఆలయములయందు భగవంతుని నన్నిజాతులవారు స్పర్శించుటయు, నాలింగనముచేసికొనుటయు, నారాధించుటయు స్వయంవ్యక్త, దైవ, ఆర్ష, మానుషక్షేత్రములయందెందైననాచారమైయున్నదా. అట్లుండపుండరీకవరదుఁడుమాత్రము తనస్వాతంత్ర్యముచే భక్తసులభుఁడై శ్రీపండరిక్షేత్రముననెల్ల జాతులవారును తన్నాలింగనముచేసికొనుటకును, నారాధించుటకును సమ్మతించియున్నాఁడుగదా. చండాళయోనిజాతుఁడగుచోకామేళునిభక్తికి పరవశుఁడైయతనియింట భుజించి యతనిచేతినిఁబట్టుకొనియాలయమునకులోపలపిలుచుకొని పోయియుండునది జగత్ప్రసిద్ధమైయున్నది. భగవంతుఁడు నామదేవునియుచ్ఛిష్టమునుభుజించినదియు, జనాబాయితోడ నేకపాత్రముననన్నముస్వీకరించినదియు, నామెచేయవలసినపరిచారకకృత్యములనన్నింటిని తానేచేసినదియు, రహస్యముకాదు. అట్టిదీనబంధువగునుద్ధవప్రియుఁడు భక్తులచిత్తశుద్ధినిజూచి యానందించునేగాని జాతిభేదమునుపాటింపఁడు. ఆభక్తవత్సలునిలీలలకానందింపవలయునేకాని యసూయపడుట భవాదృశులకు ధర్మముకాదు. సమస్తపదార్థములునుచర్మముచే మూయఁబడియున్నవి. సమస్తజీవరాసులశరీరములును చర్మావృతములైయున్నవి. మఱియు మలమూత్రాదిహేయపదార్థములతోఁ గూడియుండుశరీరమునందలిచర్మమునకన్న అట్టిశరీరసంబంధములేక పరిశుద్ధమైయుండుచర్మము మేలైయుండును. శబరియెంగిలినిస్వీకరించినవానికి చర్మపాత్రము నిషిద్ధముకాదు. (భక్త్యైరణ్వప్యుపానీతం । ప్రేమ్ణాభూర్యేవమేభవేత్ । భూర్యప్యభక్తోపహృతం । నమేతోషాయకల్పతే) అనఁగానాభక్తుఁడణువునిచ్చినను ప్రేమతోగొప్పగనంగీకరింతును. భక్తిలేనివాఁడు గొప్పగానిచ్చినను నేను సంతోషింపను. అనిభగవంతుఁడుతానే చెప్పియుండలేదా. ఇట్టిప్రమాణములు భవాదృశులకెఱుకయైయుండియు నేలయిట్లువాక్రుచ్చెదరు. ముందుగభుజించిభగవదారాధనము చేయుటనుచితమనిచెప్పితిరి. భగవంతునికిచి తకు

ద్ధిముఖ్యమేగాని శరీరశుద్ధిముఖ్యముకాదు. వీధిలోపాదరక్షలనువిడిచి యాలయమునఁ బ్రవేశించి నోటితో భగవంతునిస్తుతించుచు మనసుచేపాదరక్షలను స్మరించువానివలె నన్నునుధ్యానించుచు భగవంతునిఁబూజించుటయుపచారమేగానియుపచారము కాదు. కాన క్షుధాతురుఁడనగునేను క్షుద్బాధనుదీర్చుకొని త్రికరణములనైక్యముచేసికొని భగవంతునారాధించుచున్నాను. ఇది మిగులనుచితమనినాబుద్ధికిఁదోఁచుచున్నది. అనినవిని బ్రాహ్మణుఁడు క్రోధపరవశుఁడై కన్నులెఱ్ఱజేసికొని పెదవులదరుచుండ నోరీమూర్ఖుఁడా! శుద్ధమగు సాలగ్రామమును బ్రాహ్మణులుతప్ప తక్కినవారుస్పర్శింపఁగూడదు. నీయాచారములన్నియు అనాచారములైయున్నవి. సర్వజ్ఞునివలెనాకు జ్ఞానోపదేశముచేయుచున్నాఁడవు. అనిచెప్పినవిని రోహిదాసుఁడు మానియైపండరినాథునిని ధ్యానించుచుండెను. తోడనేభక్తవరదుఁడగు పుండరీకవరదుఁడు గరుడవాహనారూఢుఁడై యాబ్రాహ్మణుఁడుచూచుచుండ రోహిదాసునికిఁ బ్రత్యక్షమై యతని నిస్తుతిప్రణామంబులనంగీకరించి యోవత్సా! నేనందఱినిసమముగభావింతును. తనస్వాధీనముననుండి పోఁగొట్టుకొన్న యైశ్వర్యమునపేక్షించునార్తుఁడును, నూతనముగనైశ్వర్యమును గోరునర్థార్థియు, కేవలాత్మానుభవమునపేక్షించు జిజ్ఞాసుఁడును, భగవదనుభవైకరతుఁడగుజ్ఞానియు, నాకుప్రియకరులైయుందురు. ఈనలువురిలోపల (జ్ఞానీత్వాత్మైవమేమతం) అనురీతిని భగవదనుభవకామియగుజ్ఞానినాకాత్మయని నాయభిప్రాయము. అట్టిజ్ఞానులలో నీవగ్రగణ్యుఁడవు. కాననీధ్యానస్మరణపూజలకు నేనుసంతోషించుచు నీకదృశ్యుఁడనై సదానిన్ను వెంబడించితిరుగుచున్నాఁడనని చెప్పి రోహిదాసునిముఖమున బ్రహ్మతేజస్సునుగలుగఁజేసి యంతర్ధానుఁడయ్యెను. దీనినంతయునుజూచుచుండినపురోహితునికినసూయాదిదుర్గుణములు మాని భయభక్తులతిశయించి రోహిదాసునిఁజూచి నిన్నుసామాన్యునిగఁదలఁచియవాచ్యములగు పలుకులుపలికితిని. ఇపత్తైనను నేనిట్లుచేసినందున పుటముపెట్టినబంగారమువలెను, సానవట్టినరత్నమువలెను నీప్రభావముజగత్ప్రసిద్ధమయ్యెను. పుష్పముతోఁజేరినదారముగౌరవమునుజెందినట్లు నీసహవాసముచే బ్రహ్మాదులకలభ్యమగుపాండురంగనిసేవ నాకు లభించెను. గజేంద్రవరదుఁడనిసాధువులచేఁ స్తుతింపఁబడు భగవంతుఁడు నేఁడురోహిదాసవరదుఁడయ్యెను. ఇఁకను నీప్రభావమును గీర్తించువారికి శ్రీపండరినాథునికృపచే భవబంధములు తొలఁగుననుటకు సందియములేదు. ఇందుకునేనేనిదర్శనమైయున్నాఁడను. ఎట్లనిన నీప్రభావము నెఱుఁగక నిన్ను పరుషములాడిన నాకు నీసమీపవర్తనముచే పాండురంగనిసేవసిద్ధించి నాయజ్ఞానముతొలఁగి సుజ్ఞానదీపములభించెను గాన నీప్రభావమునెఱిఁగి స్తుతించువారలకు పుండరీకవరదునికటాక్షముచే భవబంధములు వీడుటాశ్చర్యముకాదు. నేఁడుమొదలునన్ను నీవానినిఁగా నభిమానింపవలయునని ప్రార్థించి రోహిదాసుని యనుమతినిజెంది స్వస్థానమునకుఁబోయి పరమశాంతచిత్తుఁడై యీశ్వరవిభూతియగు సమస్తచేతనాచేతనములయందు సమభావముచేయుచు భగవద్భక్తులనుజాతినిరూపణముచేయక గౌరవించుచనవరతము భగవద్ధ్యానముచేయుచుండెను.

ఆశ్రితవాత్సల్యైకనిధయే నమః.

अटपटी पाय सूधे बाबा कैसे रहो कान्ह कौने दान लायो जो दानको कहायो है ॥ किधौं शनी मंगल किधौं राहु केतु चौथ आये किधौं संक्रांति किधौं ग्रहणहूँ लजायो है ॥ अँचरा न गहो कहो कैसो दान मांगत हौ कहा जगजीवन तू ऊधम मचायो है ॥ देखो सखी कैसे नयन खंजनसे नाचत हैं जाने तो. यशोदा मैया कहा खाय जायो है ॥ ३१५ ॥

## राग जंगला ।

द्वार पौरियाको रूप राधेको बनाय लाई गोपी मथुराते वृन्दा-वनकी लतान में । कह्यो टेर कान्ह सों बुलायो तोहि कंसजीने कौनके कहेते दधि लूटत हो दानमें॥संगके सखा सब डगर भुलाय गये कृष्ण सों सयाने गये पकर भुजा पान में॥ छूट गयो छल तो छबीली अवलोकनमें ढीली भई भौंह वा लजीली मुसकानमें ३१६॥

## राग विलावल ।

एरी यह को है री याहे दान देत गोवर्द्धन केरी ग्वैंड़े ॥ हारन खेतन गाम मडैया कान्हर ठाढो ऐंड़े॥ बाप भरे कर कंस रजाको पूत जगाती पैंडे। या ब्रजकी अब रीति नई है औ लातीको नीर बरेंडे ॥ पराये बगर जिन देहु अडीठन कान्हर छेंडीछेंडे । कृष्ण-दास बरजो नहिं मानत तोरत लाजकी मैंडे ॥ ३१७ ॥

## राग सोरठ ।

कांकडली ना घालो म्हारी फूटे गागड़ली। तू तो ठानों घरमें ठाकड़ होभी ठाकड़ली ॥ आकड़ आकड़ बोलो कान्हा मैंभी आकड़ली। मोढे थानो कारी कामर हाथमें लाकड़ ली॥ नौलख धेनु नंद घर दुहिया एकन वाखड़ली । माखन माखन आपने खायो रहगई छाछड़ली ॥ जाय पुकारूं कंसके आगे मारे थाप-

। वृन्दावनमें रास रच्योहै मोरकी पांखड़ली ॥ नरसीके स्वामी सामलियां दूधमें माकड़ली ॥ ३१८ ॥

## राग परज।

तुम टेढ़े म्हारी टेढ़ी गगरिया। टेढ़ी टेढ़ी चाल चलो त्रिभंगी काहेकी दिखावे लाल टेढ़ी पगरिया ॥ टेढ़ी अलकमें क्या बाँधूंगी कछु न सुहावे मोहि थारी सगरिया। टेढ़ो श्रीवृन्दावन गोकुल टेढ़ो वाहूमे टेढ़ी वृषभानु नगरिया ॥ टेढ़ो श्रीनंद बाबा मात यशोदा और टेढ़ी वृषभानु दुलरिया। सूरदास टेढ़ीकी संगत टेढ़े होकर पार उतरिया ॥ ३१९ ॥

## राग गुजरी।

गिरिवर धरयो आपने करको। ताहीके बल दान लेतहो रोक रहतहो हमको ॥ अपनेही मुख बडे कहावत हमहूँ जानत तुमको। यह जानत पुनि गाय चरावत नितप्रति जात हो बनको ॥ मोर-मुकुट मुरली पीतांबर देखे आभूषनको। सूर कांध कमरी हूँ जानत हाथ लकुटिया करको ॥ ३२० ॥

## राग बिलावल।

यह कमरी कमरी कर जानत। जाके जितनी बुद्धि हृदयमें सो तितनी अनुमानत ॥ या कमरीके एक रोमपर वारों कोटिन अंबर। सो कमरी तुम निन्दत गोपी तीनलोक आडम्बर ॥ कमरीके बल असुर सँहारे कमरी ते सब भोग। जात पाँत कमरी है मेरी सूर सबहि यह योग ॥ ३२१ ॥

अब तुम सांची बात कही। एते पर युवतिनको रोकत माँगत दान दही ॥ जो हम तुमहिं कह्यो चाहतही सो श्रीमुख प्रकटायो। नीके जाति उघारी अपनी युवतिन भले हँसायो। तुम कमरीके

ओढनहारे पीतांबर नहिं छाजत। सूर श्याम कारे तनु ऊपर कारी कामरि भ्राजत ॥ ३२२ ॥

मोसों बात सुनो ब्रजनारी। एक उपख्यान चलत त्रिभुवनमें सो तुम आज उघारी ॥ कबहूँ बालक मोहन दीजे मोहन दीजे नारी ॥ जो मन आवे सोइ कर डारै मूंड चढतहै भारी ॥ बात कहत अठिलात जात सब हँसत देत कर तारी ॥ सूर कहा ये हमको जाने छाँछकी बेचनहारी ॥ ३२३ ॥

यह जानत तुम नंदमहर सुत। धेनु दुहत तुमको हम देखत जबहि जात खरकहिं उत ॥ चोरी करत यही पुनि जानत घर घर ढूँढत भांडे। मारग रोक भये अब दानी वे ढंग कबते छाँडे ॥ और सुनो यशुमति जब बाँधे तब हम करी सहाय। सूरदास प्रभु यह जानत हम तुम ब्रज रहत कन्हाय ॥ ३२४ ॥

## राग आसावरी।

को माता को पिता हमारे। कब जनमत हमको तुम देख्यो हँसी लगत सुनि बात तुम्हारे॥ कब माखन चोरी कर खायो कब बाँधे महतारी। दुहत कौन गैयाको चारत बातकही तुम भारी ॥ तुम जानत मोहिं नंदढटोना नंद कहांते आये। मैं पूरण अविगत अविनाशी माया सबन भुलाये ॥ यह सुनि ग्वालि सभी मुसुकानी ऐसेही गुण जानत। सूर श्याम जो निदरचो सबही मात पिता नहिं मानत ॥ ३२५ ॥

## राग सोरठा।

तुम का जाने री गूजर दधिकी बेचनहार। कौन पिता को मात हमारे जन्म अजन्म रूप रंग धार ॥ भुवके भार उतारन कारन लीन मनुज अवतार। मेरी माया जगत भुलानो मेरो कह्यो सत्यकर मानो गावत वेद पुराण भागवत यश गावत श्रुति चार ॥

నాది భగవత్కైంకర్యములను జేయుచు వైరాగ్యశీలులగు భాగవతులతో సల్లాప, సహవాసములు చేయుచునన్యవిముఖుఁడవై వర్తించిన భగవంతుఁడు నీమనోవీధిని సంచరించుచు నిన్నెడఁబాయకుండును. జ్ఞానవంతులు (ఆత్మవత్సర్వభూతాని) అనురీతిని సకలభూతములను తనసమానభేదముగ భావింపవలయును. నీవు భేదభావమును విడిచి పరమానందసిద్ధికి యత్నింపుము. భగవంతునిఁదప్పఁదక్కినవారలనుపాసించితివేని నీకు పరమసిద్ధికలుగదు. దేవాసురయక్షరాక్షసకిన్నరపన్నగాదులచేతను, మనుష్య, పశు, పక్షి, మృగములచేతను అతిసార, జ్వర, గుల్మా, దిమహారోగములచేతను రాగ, ద్వేష, లోభ, మోహ, మద, మాత్సర్యములచేతను నాశమునుజెందని పరమానందసిద్ధికై శ్రీకేశవునిపాదపద్మములయందు నీహృదయమును నిలుపుము. అందుచే సుఖము గలుగును. కానసారమగుసంసారమార్గమునఁగలుగు దేవమనుష్యాదిశరీరములకు భోగ్యములగుస్వర్గాదిభోగముల కాసపడకుము. నీకుసర్వోత్కృష్టమగుపరమార్థమునుపదేశించెదనువినుము. సర్వభూతములయందు సమబుద్ధిచేయుము. సర్వభూతసమత్వమేయచ్యుతునికి ముఖ్యారాధనమైయుండును. ఇట్టిసమత్వభావములేకచేయునారాధనము బూదిలోవ్రేల్చిననేయియగును. ఇట్టియారాధనముచే సర్వేశ్వరుఁడు ప్రసన్నుఁడగును. భగవంతుఁడు ప్రసన్నుఁడైనదుర్లభమెద్దియునులేదు. ధర్మార్థకామములను గోరుటమేలుకాదు. అవియల్పఫలప్రదములు. వానిచేప్రయోజనములేదు. మోక్షమునుసయితము నీవపేక్షింపఁబనిలేదు. చక్కఁగఁబండినమామిడిచెట్టుక్రిందఁజేరినవానికి తనంతటఫలముసిద్ధించునట్లు పరబ్రహ్మమగుమహాకల్పవృక్షమునాశ్రయించినవానికి మోక్షానందఫలముతనంతటసిద్ధించును. దీనికిసందేహములేదు. నమ్ముమనిహితోపదేశముచేసెను. అపుడారాజు శ్రీరామానందస్వామియుపదేశమును తనహృదయమునఁబాదుకొలిపి సర్వపదార్థములును భగవద్రూపములుగాభావించుచునాచార్యునియనుమతిచే ద్వారకకుపోయి శ్రీవాసుదేవపరబ్రహ్మమునుదర్శించి యనంతవందనములుచేసిపురుషోత్తమా! అనంతజన్మములయందునిన్నెఱుఁగక విషయాంతరంబులంజిక్కియమనష్యుఁడనైతిని. దుర్లభమగుమనుష్యశరీరములభించియు నిన్నాశ్రయింపక యైహికభోగములకై కాళికాదేవినుపాసించుచుంటిని. ఆదేవి నాకుగురువై వైరాగ్యమునుపదేశించి భాగవతులసన్నిధికిఁబంపెను. వారలుఅద్వేషమునుగలుగఁజేసి (ఆచార్యస్యహరిస్సాక్షాచ్చరరూపీనసంశయః) అనురీతినిసాక్షాద్భగవత్స్వరూపియైజ్ఞానానుష్ఠానసంపన్నుఁడగుశ్రీరామానందస్వామిపాదంబులంజేర్చిరి. ఆదేశికోత్తముఁడును శ్రీతారకమంత్రమునునాకుపదేశించి సర్వభూతసమభావంబును గలుగఁజేసినన్నునీవానిఁగఁజేసెను. అనాదికాలముగ నింద్రియకింకరుఁడనై నేఁజేసినవ్యభిచారములనుమన్నించియిఁకనిమిషమైనను నిన్నుమఱువకుండునటులననుగ్రహింపుమని విన్నవించిన నిజభక్తునియధ్యవసాయమునకు సంతసించి శ్రీవాసుదేవుఁడు (తాసామావిరభూచ్ఛౌరీ । స్మయమానముఖాంబుజః । పీతాంబరధరస్స్రగ్వీ। సాక్షాన్మన్మథమన్మథః) అను రీతిని గోపికలకు యమునాతీరమున సేవయొసంగినట్లుబీభాజిరాజునకు సేవయొసంగి నీవు నామదేవాదులవలె నాయంతరంగభక్తుఁడవైతివి. శ్రీరామానందగురువుపదేశించినపథ్యమునదృఢముగనిలువుము. నేను నిన్నెడఁబాయకసదా నీహృదయమునందు సాన్నిధ్యముచేసియుండెదననియనుగ్రహించియంతర్ధానుఁడయ్యె.

బీభాజీరాజు ద్వారకయందు నాలుగుమాసములు వసియించి భగవన్నియమనమును జెంది కాశికివచ్చుచుండ మార్గముననరణ్యమధ్యముననొక వ్యాఘ్రము గర్జించుచురాఁగా రాజుభార్య చూచి భయపడి యోప్రాణనాథా! యిదిగోయొక బెబ్బులివచ్చుచున్నది. మనమేమిచేయవచ్చునని చెప్పిన రాజువిని యోవనితా యేల! వెఱచెదవు. సాక్షాద్భగవంతుఁడు వచ్చుచున్నాఁడు. నీవేల బెబ్బులియని భయపడెదవు. భగవంతుఁడు సమస్తచేతనాచేతనములను తనకు శరీరముగఁ జేసికొనియనుప్రవేశించియున్నాఁడు. కానసర్వమును వానిమూర్తులై యుండ నీవన్యథాభావము చేసితివి. ఇందుచే నీహృదయముపరిపక్వముకాలేదనితోఁచుచున్నది. కవచధారియగుపురుషుని నిపురుషునిఁగభావింపవలయునే గాని కవచమనిభావించుటయజ్ఞానము గాదా. అట్లుసర్వంబునననుప్రవేశించి చేతనాచేతనరూపప్రపంచమును కవచముగనంగీకరించియుండు భగవంతునియందీశ్వరభావము చేయక బుద్ధిమాంద్యముచే వ్యాఘ్రభావము చేసితివి. మనకుశ్రీరామానందస్వామి యిచ్చినజ్ఞానప్రదీపముచేఁ జూచితివేని యజ్ఞానాంధకారము నశించి వ్యాఘ్రభ్రాంతినివదలి భగవంతుని సాక్షాత్కరింతువు. అని చెప్పుచుండ నావ్యాఘ్రముసమీపమునకు వచ్చి వీరిరువురినిఁజూచుచు నూరకనిలుచుండెను. అపుడు రాజుపులినిజూచియో వ్యాఘ్రమా! భగవంతునికి శరీరమవైననీవు నీహృదయాంబుజనత్రియగుభగవంతునుపాసింపక యింద్రియములకు లోఁబడి యేల యిట్లువ్యర్థముగ కాలమునుగడపెదవు. ఇఁకను మృగస్వభావమును వదలి యేకాంతస్థలమునందు వసించుచు నీశ్వరవిభూతియందొకపదార్థమునైననుహింసింపక వృక్షమునుండిరాలినయాకులు మొదలగువానినాహారము గాఁగొని సదాభగవంతునిని ధ్యానించుచుండుము. అని చెప్పినతోడ నేయాపులికిజ్ఞానముకలిగి కన్నీరువిడుచుచు రాజుపాదపద్మములపైఁబడిలేవకయుండెను. అపుడు రాజు పరమకృపచే నాపులినిలేవనెత్తి తనకంఠముననుండినతులసిమాలను దానిమెడనువేసి తనహస్తమును దానిశిరముపై నునిచి దానిచెవినిభగవన్నామమునుపదేశించి (శ్రీమన్నామప్రోచ్యనారాయణాఖ్యం। కేనప్రాపుర్వాంఛితంపాపినోపి। హానఃపూర్వంవాక్ప్రవృత్తానతస్మిన్। తేనప్రాప్తంగర్భవాసాదిదుఃఖం) ఓవ్యాఘ్రమా! శ్రీమన్నారాయణనామమునుచ్చరించి యెట్టిపాపియైనను తనకోరికను జెందకపోయినదికలదా. అయ్యోయిదివఱకౌనామోచ్చారణమున మనవాక్కుప్రవర్తింపనందున మనకు గర్భవాసాదిదుఃఖములుసంప్రాప్తమయ్యెను. (మాభీర్మందమనోవిచింత్యబహుధాయామీశ్చిరంయాతనా। నామీనఃప్రభవంతిపాపరిపవస్స్వామీననుశ్రీధరః। ఆలస్యంవ్యపనీయభక్తిసులభంధ్యాయస్వనారాయణం। లోకస్యవ్యసనాపనోదనకరోదాసస్యకింనక్షమః) ఓమందమనస్సా! యమయాతనలను పెక్కుతెఱఁగులఁ జింతించిభయపడకుము. శత్రువులు మనలనేమియుచేయనేరరు. శ్రీధరుఁడుగదామనకుస్వామి. భక్తిసులభుఁడగు శ్రీమన్నారాయణుని నాలస్యముచేయక ధ్యానింపుము. సమస్తలోకులవ్యసములనుసమూలముగ పోఁగొట్టువాఁడు ఒకదానునివ్యసనమును బోఁగొట్టలేఁడాయనియావ్యాఘ్రమునకు హితోపదేశముచేసి బీభాజీరాజు కాశికిపోయి శ్రీరామానందస్వామిపాదచ్ఛాయయందువసించి భరతయోగివలె ననవరతము భగవద్ధ్యానపరుఁడై యుండెను. అదిమొదలావ్యాఘ్రము తనకురాజుపదేశించినట్లు తనజాతిస్వభావమును, స్వజాతిమృగములసహవాసమును, నింద్రియవశ్యతను, జీవహింసనువిడిచి యేకాంతస్థలమున మితముగుసాత్త్వికాహారముతోడ వసించుచుననవరతముభగవద్ధ్యానముచేయుచునుండి

मीठो दधि है यह मधुरे कह्यो कन्हाई । सूरदासप्रभु सुख उपजाये ब्रजललना मन भाई ॥ ३३२ ॥

## राग कालिंगडा ।

अच्छा लेहु ब्रजबासी कन्हैया अच्छा लेहु रे॥बरसानेसे चली रे गुजरिया आगे मिले महाराज रे ॥ कोरीकोरी मटुकीमें दही रे जमाया चाख लेहु महाराज रे ॥ दधि मेरो खायो मटुकिया रे फोरी इंडुरी कहां डारी लाल रे ॥ हार शृङ्गार सभी मेरो तोरयो दुलरी कहां डारी लाल रे॥जाय पुकारूंगी कंसके आगे न्याव करो महाराज रे॥मीराके प्रभु गिरिधर नागर चरण कमल बलिहार रे ३३३॥

---

# हिंडोराझूलन लीला ।

## राग मलार ।

ब्रज पर नीकी आज घटा।नान्ही नान्ही बून्द सुहावनी लागत चमकत बिज्जु छटा ॥ गर्जत गगन मृदंग बजावत नाचत मोर नटा। गावत सुरहि देत चातक पिक प्रकटयो मदन भटा ॥ सब मिल भेंट देत नंदलालहिं बैठे ऊंची अटा। चतुर्भुज प्रभु गिरिधरनलाल शिर कसूमी पीत पटा ॥३३४ ॥

आज कछु कुंजनमें बरसासी । बादरगणमें देख सखी री चमकत है चपलासी॥नान्ही नान्ही बून्दन क[illegible]भुरयासी पवन बहुत सुखरासी । मंद मंद गर्जनसी सुनियत नाचत मोर सभा सी ॥ इन्द्र:धनुषमें बग मिल डोलत बोलत हैं कोकिलासी । इन्द्रवधू छबि छाय रहीहै गिरिपर श्याम घटासी ॥ उमग महीरुहसे महि कंपत फूली मृगमालासी । रटत व्यास चातककी रसना रसपीवत हौं प्यासी ॥ ३३५ ॥







శ్రీమతేరామానుజాయనమః.

# భక్తవిజయము-రెండవభాగము.

## ఇరువదియేడవయధ్యాయము.

### నరసింహామేధచరిత్రము.

బీభాజిరాజు ద్వారకనుండి కాశికిపోవుమార్గమున నతనియనుగ్రహమును, ఉపదేశమును బొంది పరమవిరక్తితోడ వివిక్తదేశమున భగవద్ధ్యానముచేయుచుండి శరీరమును చాలించినవ్యాఘ్రము శివాంశముతోఁగూడి పురాతనఘటమను గ్రామమున నొకబ్రాహ్మణకుటుంబమునందు పుత్రుఁడై యవతరించెను. తల్లిదండ్రులీపుత్రరత్నమునకు నరసింహామేధ అని నామకరణముచేసిరి. ఇతనియేడవసంవత్సరమున తల్లిదండ్రులు పరలోకగతులైరి. పినతండ్రియు అన్నయు ఇతనిని పెంచుచువచ్చిరి. ఇతఁడు సమవయస్కులయిన బాలకులతో నాట్లాడుచు కాలముగడపుచు భోజనవేళకుమాత్ర మింటికివచ్చుచుండును. ఇట్లుండ నితని వదినె మొదలగువారు ఇతనినిఁజూచి యోయుఱఁదీ యిట్లుక్రీడలతోడ కాలమునుగడపుచు నన్యమునెఱుఁగకుండిన, మీఁద నీభార్యాపుత్రాదులెట్లుజీవింతురు. అనినిష్ఠురములాడిన నరసింహామేధ చింతాక్రాంతుఁడై అచ్చోటువిడిచిబయలుదేరి నిర్మానుష్యమగు నొకయరణ్యమధ్యమునఁబోవుచు తనమనంబున నిట్లని చింతించె. నాపూర్వకర్మ మెట్టిదో తెలియదు. నాతల్లినిబోఁగొట్టుకొంటిని. బాల్యమున మాతృవియోగమును, యౌవమున భార్యావియోగమును, వార్థక్యమున పుత్రవియోగమును జగమున జనులకు మిగుల దుస్సహములైనవి. నేను మాతృహీనుఁడనగుటచే నావదినె మొదలగు బంధువులు నన్ను నిష్ఠురములాడసాగిరి. ధ్రువునికి పినతల్లి పలికిననిష్ఠురవాక్యములు విరక్తిబీజములైనట్లు మాతృహీనుఁడనగు నాకు ఈబాల్యదశయందు వదినె మొదలగుబంధుజనులాడిననిష్ఠురాలాపములు కేవలవిరక్తిహేతువులయ్యెను. ఇఁకనేను ఐహికసుఖేచ్ఛనుమాని శ్రేయఃప్రాప్తికి యత్నించెదను. ఈశ్వరసౌహార్దము నాయందంకురించినందున నామనోరథము వ్యర్థముకానేరదు. అని చింతించుచు నాయర[illegible]ముఁ దాఁకశివాలయమునుజూచి దానిలోపలప్రవేశించి మహాలింగమును దర్శించెను. [illegible]మధ్యమునందుండుటచే ఆదేవాలయము జనశూన్యమైయుండెను. అ

ట్లుండినను నరసింహమేధ ధైర్యమునవలంబించి స్వామియగ్రభాగమున నిలిచి యంజలి హస్తుఁడై పెక్కువిధంబులస్తుతించుచు ఏడుదినంబులు నిద్రాహారములులేకయుండ పార్వతీ రమణుఁ డితనిభక్తికి సంతోషించి ప్రసన్నుఁడయ్యెను.

అపుడు నరసింహమేధ పరమశివునికి సాష్టాంగవందనంబాచరించి భక్తియుక్తుఁడై స్తుతించుచుండ పరమేశ్వరుఁడు సంతోషించి యోవత్సా నీమనోరథమును అడుగుము నిన నరసింహమేధస్వామినిజూచి యోదేవా నీవుసర్వజ్ఞుఁడవు. నేనజ్ఞుఁడను. ఇట్టి నాకు నీకత్యంతము ప్రియతమమగు వస్తువునను గ్రహింపవలయునని సవినయముగ విన్నవించెను. ఆమాటనువిని పినాకపాణి మందస్మితముచేసి నీవు మిగులచతురుఁడవు. నీకోరిక మిగుల శ్లాఘనీయమైయున్నది. నాకత్యంత ప్రియతమమగువస్తువున పేమిటంచితివి. (ఈశ్వరస్సర్వ భూతానాం। హృద్దేశేర్జునతిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని। యంత్రారూఢానిమాయయా) అనురీతిని సర్వభూతములహృదయమునవసించి సూత్రధారి బొమ్మలనాడించునట్లు సమ స్తాత్మలను తనమాయచే భ్రమింపఁజేయుచుండును. శ్రీకృష్ణపరమాత్మకన్న నాకు ప్రియ తమమగు పదార్థము వేఱొక్కటిలేదు. నేను సదా ఆభగవంతునిధ్యానించుచు నతనినామ మును జపించుచుందును. ఇది మిగులరహస్యము. నిస్సమాభ్యధికమయినయాపదార్థ మును నీకుఁజూపెదను. రమ్మనియతనిచేతిని బట్టుకొని యమునాతీరమునకుఁ బోయెను. అపుడు అంబికాపతిమనోరథంబు నెఱిఁగి శ్రీరుక్మిణీకాంతుఁడు సాన్నిధ్యముచేసి పూ ర్వము తనచేఁజేయఁబడినరాసక్రీడనుదర్శింపించెను. ఎట్లనిన శరద్రాత్రియందు శ్రీకృష్ణుఁ డు గోపికలతోడ యమునాతీరమున విహరించుచుండి వారలకానందము ఉన్మస్తకమైనం దున నతివృష్టిచే నశించు సస్యమువలె ఈయబలల కత్యానందముచే ప్రాణహాని కలుగునని శంకించి భగవంతుఁ డంతర్ధానముకాఁగా గోపకన్యకలెల్లరుగుమిగూడి శ్రీకృష్ణగుణచేష్టితము లెల్లను స్మరించుచు బృందారణ్యమధ్యమున సంచరించుచు నొకరితోనొకరిట్లని చెప్పసాగిరి.

ఒకగోపిక తక్కినయువతులనుజూచి యోసఖియలారా వినుఁడు. నేనేశ్రీకృష్ణుఁ డను. కాన నేనులలితముగ నడచుచున్నాను చూడుఁడనెను. మఱియొకతె నీవు శ్రీ కృష్ణుఁడవుకావు. నేనే శ్రీకృష్ణుఁడను. నాపాటనువినుమనెను. మఱియొకసుదతి యోరి దుష్టకాళియా పాఱకనిలువుము. నేను కృష్ణుఁడను. ఇదిగో చూడుము. నిన్ను పట్టెదనని భుజమునుతట్టి తనచేతినే సర్పమువలె పట్టుకొనినిలిచెను. మఱియొకబాలఁతి యోగోపా లకులారా వర్షమునకు వెఱవకుఁడు. అచంచలులై యుండుఁడు. నేనీగోవర్థనమునెత్తి గొడు గుగాఁ బట్టెదననెను. మఱియొకభామ యోగోపబాలకులారా నేను ధేనుకుని సంహరించి తిని. మీరలు తాలవనమునందుప్రవేశించి యథేష్టముగసంచరింపవచ్చుననెను. మఱియొక యింతి శ్రీకృష్ణునివలె నిలిచి పశువులను బిలుచుచుండెను.

ఇట్లు గోపికలు శ్రీకృష్ణునియొక్కదివ్యలీలలననుకరించుచు మైమఱచి తన్మయులై బృందావనమున సంచరించుచుండ నొకబాలఁతి భూమినిజూచి శరీరమున పులకాంకుర ములు గలుగుచుండ తనప్రక్కనుండు స్త్రీలనుజూచి యోచెలియలారా చూడుఁడు. ఇచట శంఖరథాంగకల్పక ధ్వజారవిందాంకుశ వజ్రలాంఛనములగు శ్రీకృష్ణునిపాదములు

జాడయగుపడుచున్నది. దీనినిజూడ వాఁడు క్రీడతోడ వినోదముగా నడచిపోయెనని తోఁచుచున్నది. మహాపుణ్యశాలినియగు నొకానొకసుందరివానితోఁగూడి మందముగ నడచియున్నది. కాన ఆయువతియడుగులజాడ చేరియున్నది. ఇచట శ్రీకృష్ణుఁడు పుష్పహారణముచేసెను. కాన ఆమహానుభావుని పాదాగ్రముమాత్రము భూమియందూనియున్నది. ఇదిగో చూడుఁడు. ఇచట శ్రీకృష్ణుఁడు కూర్చుండి యాపుష్పములచే నొకస్త్రీని ముద్దుగ నలంకరించెను. ఆయతివ తనపూర్వజన్మమున సర్వశరీరకుఁడగు శ్రీమన్నారాయణుని చక్కఁగా నారాధించినది. ఓ గోపాంగనలారా ఇటుచూడుఁడు. ఆ గోపాలచూడామణి తాను పుష్పములచే నలంకరించి గౌరవించినయాయబలనువిడిచి యీమార్గమునపోయెను. ఇచట నొకస్త్రీయొక్క యడుగులజాడ శ్రీకృష్ణుని వెంబడించియున్నది. కాన ఆచారుముఖి శ్రీకృష్ణునితోఁ జేరుటకై నితంబభారముచే శ్రమపడుచు శీఘ్రముగ నడచినట్లు తోఁచుచున్నది. ఓ సుశీలలారా ఒక స్త్రీ వానిచేతిమీఁద చేతినుంచుకొని కూడనడచియున్నది. కాననడుగులుసమీపించి యస్వాధీనముగనుంచఁబడియున్నవి. ఇచటఁజూడుఁడు. ఆవంచకుఁడు ఆమెచేతిని స్పర్శించినదిమాత్రమే కాని వేఱు బహుమానమేమియుచేయనందున ఆమె యవమానమును జెంది నిరాశచే తిరిగిపోయినట్లడుగులజాడ తెలియవచ్చుచున్నది. ఇచట శ్రీకృష్ణునియడుగులు వేగముగనుంచఁబడియున్నవి. ఇందుచేనాతఁడిచటనొకతెనుజూచి నీవిచటనుండుము. నేనుశీఘ్రముగపోయి మనమిరువురమునుకూడియుండుటకు తగినస్థలమునుజూచుకొని నీయొద్దకువచ్చి చేరెదనని చెప్పిపోయినట్లు తోఁచుచున్నది. ఓగోపికలారా ఇంతకుమీఁద వానియడుగులజాడ యగుపడలేదు. వాఁడెచ్చోటనో పరులకు దుర్గమమగుస్థలమునకుపోయెను. కానమీరలుతిరిగిరండు. ఇంతకుమీఁదమనముపోవుట కష్టము. ఈయడవియందు వెన్నెల నైతముప్రవేశించుటకు సాధ్యముకాకయున్నది. అని చెప్పఁగావిని గోపికలందఱును శ్రీకృష్ణునికనిపట్టుటకష్టమని శోకాక్రాంతలై మఱలి యమునాతీరమునకువచ్చి కూర్చుండి శ్రీకృష్ణగుణచేష్టితములను బాడుచుండిరి.

ఇట్లుండ తామరవలెవికసించి ప్రకాశించుచుండు దివ్యముఖమండలముతోడ సకలలోకరక్షకుఁడై దివ్యచరిత్రుఁడగు శ్రీకృష్ణుఁడురాఁగాఁజూచి యా గోపికలెల్లరు పరమానందభరితలైరి. వారలలోనొకతె కృష్ణకృష్ణకృష్ణయని మాత్రముచెప్పి మౌనముగనుండెను. మఱియొకతె నేత్రములనెడిభృంగములచే ఆకృష్ణునిముఖారవిందమధురమధువును పానముచేసెను. వేఱొకతె వానినిజూచి కన్నులుమూసికొని వానిదివ్యరూపమును ధ్యానించుచు యోగనిష్ఠతోఁగూడియుండెను. ఇట్లు తన్నుకామించి బహువిధచేష్టలతోడ పరివేష్టించిన స్త్రీలలోఁగొందఱిని ప్రియవచనములచేతను, కొందఱిని శీతలకటాక్షములచేతను, కొందఱిని స్పర్శించుటచేతను సమాధానపఱచెను. పిదప నిష్కలంకలై పరిశుద్ధహృదయలయిన యాగోపికలతోడ రాసక్రీడకు ప్రారంభించెను. ఆ స్త్రీలందఱును శ్రీకృష్ణునియందే లయించిన మనస్సుకలవారలై వానిసామీప్యమును విడువకుండినందున గుండ్రముగ రాసమండలగోష్ఠి యేర్పడకపోయెను. కాన శ్రీకృష్ణుఁడొక్కొకతెచేతిని బట్టుకొని ఆస్పర్శసుఖముచే పరవశలై కన్నులుమూసికొనియుండుపాలఁతిచేతిని మఱియొకతె చేతితోఁ జేర్చి వారలను గుండ్రముగనిలిపెను. ఆగోపికలు ఆనందపరవశముచే శ్రీకృష్ణునిచేతిని బట్టుకొని

యుండునట్లు తలఁచి తృప్తిచెందిరి. శ్రీకృష్ణుఁడు వేగముగ సంచరించులాఘవసామర్థ్యముచే ఒక్కొకతెకును ప్రక్కననుండునట్లగుపడెను. పిదప శరత్కాలవర్ణనతోఁగూడినపాటలును, వానికితాళముగ చేతికంకణములశబ్దములునుగూడి రాసక్రీడశోభించెను. శ్రీకృష్ణుఁడుమాత్రము శరత్కాలచంద్రునివెన్నెలలయొక్కసొబగును, వికసించిన కుముదములతోఁగూడి మనోహరములగుతటాకములనువర్ణించి పాడుచుండెను. గోపికలు శ్రీకృష్ణునిదివ్యనామములనుమాత్రము పాడుచుండిరి. ఇట్లుపాడుచు చుట్టివచ్చునపుడు శ్రమచేనొకగోపిక కంకణములుశబ్దించుచుండ తీఁగకుసదృశమైయుండు తనచేతిని శ్రీకృష్ణునిభుజముమీఁద నునిచెను. మఱియొకగోపిక పాటలనుశ్లాఘించు వ్యాజముచే నేనుఁగుతొండమునకు సమములగు భుజములతోఁగూడిన శ్రీకృష్ణుని గట్టిగకట్టుకొని ముద్దుపెట్టెను. మఱియొకతె శ్రీకృష్ణుని కపోలముతోడ తనకపోలమునుజేర్చి తనకుఁగలిగిన పులకమనెడి సస్యమునకు నీరునిచ్చుమేఘమువలె చెమటతోఁగూడియొప్పు శ్రీకృష్ణునిభుజములనుగాఢాలింగనము చేసెను. ఇట్లు వారివారి యానందములననుభవించుచు గట్టినాదముతోడ శ్రీకృష్ణుఁడుచేసిన రాసగానమునకు అనుగీతముగా సాధుసాధుకృష్ణా బాగైయున్నది అని ద్విగుణమగునాదముతోడ పాడుచు నతఁడుపోవునపుడుకూడపోవుచు నతఁడుతిరుగునపుడెదురుముఖముగాతిరుగుచు వానినెడవాయకయుండిరి. ఇట్లు తనవిశ్లేషమునయొక్కొక్కనిమిషమును కోటివర్షములుగ తోఁచునట్లు ఆస్త్రీలకానందమును వర్ధింపించుచు శ్రీకృష్ణభగవంతుఁడు రాసక్రీడచేసెను.

ఇట్టి రాసక్రీడావైభవమును శివునికిదర్శింపించి నరసింహమేధనుజూచి వీని నిచటికేలతెచ్చితివి అనియడిగిన పార్వతీరమణుఁడు నరసింహమేధను స్వామిపాదములపైఁబడవైచి జరిగినవృత్తాంతమును విన్నవింప భగవంతుఁడు సంతోషించి వానికభయమిచ్చి యోపరాత్పరమూర్తియగు శంకరునిపురుషకారముచే నీవు బ్రహ్మాదులకలభ్యమగునా లీలలను దర్శించితివి. ఇఁకను నాయంతరంగభక్తులలో నొకఁడవైతివి. నీచేదర్శింపఁబడిన నాలీలామృతవృష్టిచే జీవాత్మలనెడి సస్యములను పోషింపుము. రాసక్రీడయందు నీచేఁజూడఁబడిన స్త్రీలు పురుషోత్తముఁడగు నాకు అత్యంతపరతంత్రులై నాయందు న్యస్తభరులై స్త్రీప్రాయులైయుండు మద్భక్తులనియు, వారలు స్త్రీవేషధారులై యగుపడినందున ఆత్మలకు పారతంత్ర్యమే ముఖ్యస్వరూపమనియు, వారలనేత్రస్తనమధ్యభాగములను జ్ఞానభక్తివైరాగ్యములనియు (ప్రపన్నశ్చాతకోయద్వత్ । ప్రపత్తవ్యైకపోతవత్) అనురీతిని వారలు నావిషయమున చాతకములవలెను నేనువారలవిషయమున కపోతమువలెను వర్తింతుమనియు, నాసంశ్లేషవిశ్లేషములే వారలకు స్వర్గనరకములైయుండుననియు తెలిసికొనుము. లోకులకుజ్ఞానమార్గమునను గ్రహించు శంకరుఁడు నాకు ఆచార్యుఁడైనందున నీవును అతనివలె లోకులకు జ్ఞానమార్గమునుపదేశించి నన్నుసంతోషింపించుము. ఇదియ నావిషయమున నీవు చేయవలసినకైంకర్యము. నేనిదిమొదలు నిన్నెడబాయక నీతోవర్తించెదను. అని నరసింహమేధను భగవంతుఁడు అనుగ్రహింపఁగా పార్వతీరమణుఁడు సంతోషించి భగవంతునినుతించి నరసింహమేధను వెంటఁబెట్టుకొని తనయాలయముచేరి యదృశ్యుఁడయ్యెను.

అదిమొదలు నరసింహమేధదివారాత్రవిభాగములు లేక శ్రీకృష్ణకల్యాణగుణచేష్టితములను వర్ణించుచు తన్మూర్తినిధ్యానించుచు ఆశివాలయమున వాసముచేయుచుండెను. పురాతనఘటమనుగ్రామమున నితని సోదరుఁడు మొదలగు బంధువులితనినిగానక బహుస్థలములయందు వెదకుచు నిర్జనాటవియందేకాంతముగ శివాలయమున వసించియుండిన నరసింహమేధను జూచి యింటికిపిలుచుకొనిపోయిరి. ఆ యూరిలోనుండువారు ఆబాలవృద్ధముగ నితనిభక్తివిరక్తులకాశ్చర్యపడిరి. నరసింహమేధ సదా శ్రీపాండురంగనిధ్యానించుచు కీర్తించుచునుండెను.

ఆయూరనుండిన యొకబ్రాహ్మణోత్తముఁ డీనరసింహమేధయొక్క హృదయపరిపాకమును చక్కఁగా నెఱిఁగి తనకన్యకకితఁడు తగినవరుఁడని నిశ్చయించి బంధువులనొడంబఱిచి జామాతను సాక్షాద్విష్ణుస్వరూపునిగభావించి సాలంకృతకన్యాదానముచేసెను. పిదప నరసింహమేధకు బిడ్డలుకలిగి సంసారమధికమయ్యెను. ఈమహాత్ముఁడు కుమ్మరపురుగువలె నెందునునంటక నిరంతరభగవద్ధ్యానపరుఁడై యుండెను.

శ్రీగోపికాపతయేనమః.

## ఇరువదియెనిమిదవయధ్యాయము.

### నరసింహమేధ తనకుమారునికి వివాహముచేయించినచరిత్రము.

నరసింహమేధ అనవరతముభగవత్కల్యాణగుణంబులను వర్ణించుచు సమస్తప్రపంచమును భగవత్స్వరూపమనిభావించుచు తాను భగవదనుగ్రహముచే సాక్షాత్కరించిన శ్రీకృష్ణలీలామృతమున ననుభవించుచు పరమశాంతుఁడై జ్ఞానవైరాగ్యసంపన్నుఁడై సంసారులగు చేతనులకు తనజ్ఞానానుష్ఠానములచే భక్తివిరక్తులను గలుగఁజేయుచు కాలక్షేపముచేయుచుండెను.

ఇట్లుండ పురాతనఘటమునకు సమీపముననుండు శ్యామలాపురమున త్రిపురాంతకుఁడను నొకబ్రాహ్మణుఁడు వర్తకముచేయుచు మిగులధనవంతుఁడై యుండెను. ఆత్రిపురాంతకుఁడు తనకొమార్తకు వివాహముచేయవలయునని నిశ్చయించి తన పురోహితుఁడగు కృష్ణభట్టును పిలిపించి తన పుత్రికకు తగినవరుని వెదకవలయునని చెప్పఁగా సద్గుణరాశియయినయాపురోహితుఁడు కొంతయాలోచించి నరసింహమేధ మహానుభావుఁడై భాగవతాగ్రగణ్యుఁడై భగవత్ప్రసాదలబ్ధజ్ఞానయుక్తుఁడై వైరాగ్యశీలుఁడై యెల్లరకును మాననీయుఁడైయున్నాఁడు. అతని కుమారునికి త్రిపురాంతకుని కొమార్తనిచ్చిన నెంతయు మేలైయుండునని నిశ్చయించి నరసింహమేధయొద్దికివచ్చి శ్యామలాపురముననుండు త్రిపురాంతకుఁడను బ్రాహ్మణోత్తముఁడు తన పుత్రికను నీపుత్రునికిచ్చి వివాహముచేయింపవలయునని నిశ్చయించియున్నాఁడనియు, నిది తగినసంబంధమనియు చెప్పి వారినొడంబఱిచి త్రిపురాంతకుని చెంతకుపోయి నీకొమార్తకు నరసింహమేధ కుమారునిని వరునిగా నిశ్చయించివచ్చితి[illegible]

అదివిని త్రిపురాంతకుఁడు నరసింహమేధ మిగులబీదయై కుటుంబపోషణమున చింత లేక సదాభగవన్నామసంకీర్తనముచేయుచు జడప్రాయుఁడైయున్నాఁడు. ఇట్టివానిసంబంధముచితముకాదనియు, దీనినెట్లయినను తప్పింపవలయుననియు, తనమనంబున నిశ్చయించి పురోహితునిఁజూచి నీవునరసింహమేధయొద్దికిపోయి రేపటికి ముహూర్తమునిశ్చయమైయున్నది. కానమాగౌరవమునకు తగినవరుసతోడ త్వరగారావలయుననియు అట్లురానియెడల కన్యక మఱియొకనికీయఁబడుననియు చెప్పిరమ్మనిపంపెను. అపుడు శ్రీకృష్ణభట్టు నరసింహమేధయింటికిపోయి ఆమహానుభావునితో త్రిపురాంతకునియభిప్రాయమును చెప్పెను. అదివిని నరసింహమేధమందస్మితముచేసి శ్రీకృష్ణభట్టునుచూచి త్రిపురాంతకుఁడు తనపుత్రికను నాపుత్రునికిచ్చుటకుసమ్మతిలేక యిట్లుచెప్పిపంపెను. నేనుచేయఁదగ్గదియెద్దియును లేదు. దయాసింధువై దీనబంధువగు శ్రీమత్పాండురంగనికృపయెట్టిదో నాకుఁదెలియదు.

☞ ఆదేవదేవునికృపచే త్రిపురాంతకుఁడు కోరినట్లు రేపటికి వచ్చెదనని మందలించెను. కృష్ణభట్టుపరమానందమును జెంది యోభాగవతోత్తమా శ్రీమత్పాండురంగఁడునీకువశవర్తియై యుండుటచే నీకసాధ్యమెద్దియును లేదు. ఆదేవదేవుఁడు ఏకవస్త్రయై మహాసభయందుదుశ్శాసనునిచే పరిభవింపఁబడినద్రౌపదిచే పిలువఁబడి యాపతివ్రతాశిరోమణిమానమును కాపాడెనుగదా. పినతల్లి నిష్ఠురోక్తులచే అవమానమును జెంది తన్నాశ్రయించిన ధ్రువునికి సర్వోత్తమపదంబొసంగలేదా? ప్రహ్లాదునికై స్తంభముననవతరించి యతనిమాటలను కాపాడలేదా? అట్టిమహానుభావుఁడు (అనన్యాశ్చింతయంతోమాం। యేజనాఃపర్యుపాసతే। తేషాం నిత్యాభియుక్తానాం। యోగక్షేమంవహామ్యహం।) అనఁగా నిరపేక్షులయి నన్నుపాసించు నచంచలచిత్తులగువారియోగక్షేమములను నేనేవహించుచున్నాను అని భగవద్గీతయందు చెప్పియుండురీతిని నీయోగక్షేమము శ్రీవాసుదేవుఁడువహించియుండ నీవుదేనికిని చింతింపఁబనిలేదు. [illegible] త్రిపురాంతకునియొద్దకుపోయి నీవుకోరినట్లు రేపటికి సిద్ధముగ నరసింహమేధవచ్చును. సంశయింపఁబనిలేదు. పెండ్లిమర్యాదలవిషయమున నీకు వెనుకదీయఁడు. మఱియు అతఁడుమహాసంఘముతోడవచ్చునని తోఁచుచున్నది. కాననీవు తగినసన్నాహముతోనుండుమనిచెప్పెను. అదివిని త్రిపురాంతకుఁడునవ్వి అయ్యానిరుపేదయగు నరసింహమేధ మనయోగ్యతకుఁదగినవరుసను జాగ్రతచేసికొని రేపటిలోగావచ్చుటకెట్లు సాధ్యపడును. అతఁడు జడప్రాయుఁడు. కానయోచింపకవచ్చెదనని చెప్పియుండును. అతనిస్వభావములోకప్రసిద్ధముకదా? ఆయున్మత్తునిమాటలను నీవెట్లునిజమునినమ్మితివి. అని పరిహసించి పురోహితునిమాటలను అలక్ష్యముచేసెను. అదిచూచి కృష్ణభట్టు ఓత్రిపురాంతకా నీవు ధనవంతుఁడవనియు, నరసింహమేధబీదయనియు, నీకోరికప్రకారము రేపటికతఁడువచ్చుట యసాధ్యమనియు చెప్పితివి. ఎవనికటాక్షలేశముచే బ్రహ్మాదులు తమతమపదములను జెంది సుస్థిరులైయున్నారో, యెవనిక్రీడకు సమస్తబ్రహ్మాండములు క్రీడాకందుకములై యుండునో, యెవ్వనికి బ్రహ్మాదిసురసంఘము దాసవర్గమైయుండునో యట్టిజగదీశుఁడు నరసింహమేధయొక్క భక్తియనువలయందుఁజిక్కి యామహాత్మునికి భృకుటీభటుఁడై యున్నాఁడు. ఆవైరాగ్యశీలునికి విరించాదినిరంకుశవిభూతులు తృణీకృతమైయు[illegible] అతని మహిమను నీవెఱుఁగవు. పరమవైరాగ్యశీలులగు భాగవతోత్తముల నహర [illegible]

हलकत उर राधे हरि वनमाल गरे ॥ बिहँसत दमक उठत दशनावलि अव[illegible]न झरे । ललित किशोरी टरत न लखि छबि दृग शिशु अ[illegible]रे ॥ ३६० ॥

## राग देश ।

कहत श्याम श्यामाजू मोको दर्शन देत रहो जू।अंचल अलक पलक सुनिरंतर इक संकोच सहो जू ॥ यह विनती मानिये जो श्रवण सुन नाहिन वचन कहो जू । विहारन दास कहत रुख लीये यह सुख सहज लहो जू ॥ ३६१ ॥

सुहावन सबान गधा सुख तिहारे बाट पर्‌यो। यह जो शतगुणों रूप अंग संग झूलनमें उघर्‌यो॥यह जो जो चौगुनो चाव कौन विधि भागनते जो बढ्यो । वृन्दावन हित रूप रसिक प्रीतमको लहनो सुकृत कर्‌यो ॥ ३६२ ॥

## राग मलार ।

एहो लाल झूलिये तनक धीरेधीरे।काहेको इतनी रमक बढावत द्रुम उरझत चीरेचीरे ॥ जो तुम झुक झुक झूटनके मिस आवत हो नीरे नीरे । नागर कान्ह डरात न काहू लेत भुजन भीरे भीरे ॥ ३६३ ॥

## राग यमन ।

झोका दीजो सम्हारके मेरी सारी न लटके । सघन कुंज द्रुमडार कँटीली काहू छोर जिन अटके॥ उन बातन अब भेंट नहीं कछु और धोखे जिन भटके । ललित किशोरी लाल जाओ घर काहेको चटके मटके ॥ ३६४ ॥

## राग मलार ।

कैसे झूलों हिंडोरे बतियां माने नाहिं हरी । बरजो न मानत यह काहूको लोककी लाज टरी ॥ हाहा खात यह तो पैयां परतहैं

డనినభగవంతుఁడు మందస్మితముచేసి యోవిప్రా ద్వారకానగరమునం దీనరసింహమేథకు అనేకవర్తకశాలలు కలవు. అందాకశాలకు ఈమహానుభావుఁడు నన్నుకార్యకర్తగ నియమించియున్నాఁడు. నాపేరు శ్యామళసా. నేను ఇతనికిమిగులనంతరంగుఁడను. కాఁబట్టి యన్నిపనులను నాముఖోల్లాసముగ చేయుచుండును. వివాహార్థము నన్నురప్పించినందున నేనువచ్చితిని. ఇతనిసర్వలౌకికకార్యములను నేనే నిర్వహించెదను. నీవు బంధుమిత్రులను వెంటఁబెట్టుకొని త్వరితముగరమ్ము అనిచెప్పిపంపి సంకల్పమాత్రముచే విశ్వకర్మనురప్పించి వివాహమంటపమును నిర్మింపుమని నియమించిన నతఁడట్లుచేసెను. కామధేనువు, కల్పతరువును సాన్నిధ్యముచేసి సమస్తపదార్థములను సమృద్ధిగనిచ్చుచుండెను. త్రిపురాంతకుఁడు బంధుమిత్రులతోడ వచ్చిచేరెను. ఇంద్రాదులు పెండ్లికొమార్త నలంకరించిరి. శచీదేవి మొదలగువారు పెండ్లికొమార్తకును చితమయినయలంకారమును జేసిరి. శుభముహూర్తమునందు భగవంతునినియమనముచే పాణిగ్రహణమహోత్సవము జరుపఁబడియె. భగవంతుఁడును శ్రీరుక్మిణీదేవియు వధూవరులకు ప్రక్కనఁగూర్చుండిరి. దేవతలసాధువాదమును విప్రులయాశీర్వాదమును దేవదుందుభిఘోషమును సముద్రఘోషము నతిశయించియుండెను. వాసుదేవుఁడును తన్మహిషులును దేవర్షిసంఘమును వధూవరులను ఆశీర్వదించిరి. వివాహకార్యములనన్నింటిని భగవన్నియమనానుసారముగ ఇంద్రాదిదేవతలు నిర్వహించిరి. సుమంగలులుచేయవలసినకార్యములను అరుంధతిప్రభృతిమునిపత్నులును శచీదేవి మొదలయినదేవపత్నులును నిర్వహించిరి. వివాహార్థము వచ్చినవారలకెల్ల అమూల్యవస్త్రాభరణంబులొసంగఁబడియె. సాక్షాద్భగవంతుఁడువివాహగోష్ఠియందన్వయించి యారగించుటచే (హరిర్యత్రతృప్తోభుక్తే । తత్రభుక్తేజగత్త్రయం) అనురీతిని ముల్లోకములవారును సంతృప్తులైరని వేఱుగఁజెప్పవలసినదిలేదు. ఇట్లుభగవంతుఁడతివిభవముతోడ వివాహకార్యములనునిర్వహించి సంబంధులను బహుమానించి స్వస్థానమునకనిచి నరసింహమేథను బంధుమిత్రులతోడ నతనియింటవిడిచి యోభక్తాగ్రగణ్యా నేనెల్లపుడు నీచెంత వర్తించుచున్నాఁడను. నీవు స్మరించినపుడెల్ల నీకుదృగ్గోచరుఁడనై నీకార్యములను నెఱవేర్చెదను. ధనలుబ్ధుఁడు ధనమునుకాపాడునట్లు నీవుశమదమాదిసుగుణసంపదనుగాపాడుము. నావిభూతియగుచేతనాచేతనములను నన్నుగభావింపుము. నీవును నీయభిమానాంతర్భూతులకును మత్సాయుజ్యముకరస్థమైయుండును అనియనుగ్రహించి నిజపరివారముతోడ నంతర్థానమయ్యెను.

అర్థితార్థపరిదానదీక్షితాయనమః.

---

## ఇరువదితొమ్మిదవయధ్యాయము.

---

నరసింహమేథహుండియిచ్చినచరిత్రము.

పురాతన ఘటమున నరసింహమేథ (సమదుఃఖసుఖస్స్వస్థ । స్వమలోష్టాశ్మకాంచనః । తుల్యప్రియాప్రియోధీర । స్తుల్యనిందాత్మసంస్తుతిః ॥ మానావమా స్తుల్యోమిత్రారిపక్షయోః । సర్వారంభపరిత్యాగీ । గుణాతీతస్సఉచ్యతే)

దుఃఖములను పాషాణస్వర్ణములను ప్రియాప్రియులను నిందాస్తుతులను మానావమానములను శత్రుమిత్రులను నిందాస్తుతులను సమముగభావించుచు ఆత్మావలోకనమును జేయుచు సకలోద్యోగములనుబరిత్యజించి త్రిగుణాతీతుఁడై యనవరతభగవధ్యాననిరతుఁడైయుండు కాలమున ద్వారకాయాత్రపోవు బ్రాహ్మణులు కొందఱచటికివచ్చి యీయూరిలో ద్వారకకు హుండియిచ్చువారుకలరాయని విచారింప సాధుజనులవైభవమునుజూచి నిర్నిబంధనముగ అసహ్యపడుకొందఱుదుష్టులు ఆబ్రాహ్మణులనుజూచియీయూరిలో నరసింహమేధ యనునొకబ్రాహ్మణుఁడు కలఁడు. అతఁడు మిగులధనవంతుఁడు. ఏయూరికైనను ఎంత మొత్తమునకైనను హుండీలనియ్యఁగలఁడు. అనిచెప్పిన ఆబ్రాహ్మణులు నరసింహమేధ యింటిని విచారించుకొనిపోయియతనింజూచి మేము ద్వారకకుయాత్రపోవువారము. దారిలో చోరులవలనిభయముచే ద్రవ్యమునుమాతోడఁగూడ తీసికొనిపోవుటకు అనుకూలింపలేదు. ఆఱువందలవరాలకు ద్వారకకుహుండిని ఇప్పింపవలయునని ప్రార్థించిరి. అదివిని నరసింహమేధ తనమనంబున నిట్లని వితర్కించెను. నేను నిరుపేదను. నానాటికికుటుంబపోషణమును నిర్వహించుట నాకుదుర్లభమైయున్నది. ఇట్టినేనుగొప్పమొత్తమునకుహుండినిచ్చుట కెట్లుసమర్థుఁడనగుదును. ఎవరో యసూయాపరులు వీరలను నాయొద్దికి పంపిరని తోఁచుచున్నది. అయిననేమి (సర్వస్యచాహంహృదిసన్నివిష్టో। మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనంచ। వేదైశ్చసర్వైరహమేవవేద్యో। వేదాంతకృద్వేదవిదేవచాహం) అనఁగా సమస్తప్రాణుల హృదయములయందు నేనువసించెదననియు, వారలకుస్మృతియు జ్ఞానమును మాంద్యమును నావలననేకలుగుచున్నవనియు సమస్తవేదములచేనెఱుఁగఁబడఁదగినవాఁడును, వేదములను బయలుపఱచినవాఁడును, వేదములమర్మములనెఱుఁగువాఁడును నేనేయనియు శ్రీభగవద్గీతయందు భగవంతుఁడు చెప్పియున్నాఁడుగదా. అట్లుండ అసూయాపరులని కొందఱిని నేను తలఁచుటన్యాయముకాదు. సర్వముభగవంతుఁడేచేయుచున్నాఁడు. ద్వారకాయాత్రచేయఁగోరిన బ్రాహ్మణులమూలముగా శ్రీద్వారకానాథుఁడే నాకు ద్రవ్యమునిప్పించుచున్నాఁడు. వీరికోరికప్రకారము వీరలకొకహుండి వ్రాసియిచ్చి నేనీద్రవ్యమును పుచ్చుకొని యీశ్వరసంతానమగు చేతనులలో దీనులగువారల నారాధించెదను. వీరలమూలముగా నాకీ ద్రవ్యమునిప్పించుశ్రీకృష్ణపరమాత్మవీరలకు ద్వారకయందు ద్రవ్యమును చెల్లించునుగాక. సర్వజ్ఞుఁడై, సర్వశక్తుఁడగుభగవంతునికిదియొకలీలయైయుండును అనితనమనంబున నిశ్చయించి తానాద్రవ్యమును పుచ్చుకొని వారలచేతికొకహుండినివ్రాసియిచ్చెను. ఎట్లనిన శ్రీద్వారకలోనుండు వర్తకశాలాధికారియగుశ్యామళసాకు పురాతనఘటమునసుండు నరసింహమేధ అనంతనమస్కారములుచేసి వ్రాయువిన్నపమేమన్న శ్రీద్వారకాయాత్రచేయు సాధువులగు బ్రాహ్మణులు ఆఱువందలవరాలు నాచేతికిచ్చిరి. నేనిచ్చినయీహుండిని పుచ్చుకొనివచ్చుచున్నారు. చూచినతోడనే అచట దీనికి ద్రవ్యమునుచెల్లింపవలయునని ప్రార్థించెదను. అని వ్రాసి తనచేవ్రాలుచేసి యాబ్రాహ్మణులకిప్పించెను. వారలుహుండిని పుచ్చుకొని సంతోషముతోడ ద్వారకకుఁ బోయిరి. నరసింహమేధ ఆద్రవ్యమును (దేయందీనజనాయచవిత్తం) అనురీతిని ఈశ్వరసంతానమైన దీనులగువారలవిషయమున వినియోగించెను. యాత్రపోయినబ్రాహ్మణులు ద్వారక [illegible]తినిదర్శించి యాయూరిలోనుండువారలను పురాతన

ఘటమునందునరసింహమేధయొక్క వర్తకశాలాధికారియయిన శ్యామళసాయెవరని విచారింపఁగా వారు ఈయూరిలో నరసింహమేధకువర్తకశాల లేదు. అట్లుండ శాలాధికారి యెట్లు కలిగియుండవచ్చును అని పరిహాసముచేసిరి. అదివిని యాత్రవచ్చినవారలు దిగులుచెంది దుఃఖించుచుండిరి. ఇట్లుండ దేవాధిదేవుఁడయిన రుక్మిణీకాంతుఁడొకవ్యాపారివేషమును ధరించి యుద్ధవా, క్రూరులు తన్ను వెంబడింపనొకదివ్యశకటమునారోహించియచటికి వచ్చి దుఃఖించుచుండు బ్రాహ్మణులనుచూచి శకటమునవరోహించియో బ్రాహ్మణోత్తములారా నేను పురాతనఘటమునందు నరసింహమేధయొక్క వర్తకశాలాధికారిని. నాపేరు శ్యామళసా. అతఁడు ద్వారకాయాత్రచేయు బ్రాహ్మణులకు ఆఱువందలవరాలకు హుండియిచ్చినట్లును వారలచే ఆహుండిని పుచ్చుకొని త్వరితముగా వారలద్రవ్యమునిప్పింపవలయుననియు నాకు జాబువ్రాసియున్నాఁడు. నేను ఆసాధుజనాగ్రేసరుఁడగు నాయజమానునియాజ్ఞను శిరసావహించి యాబ్రాహ్మణులను వెదకుచున్నాను. మీరాయాత్రజనులయియుండవచ్చునని తోఁచుచున్నది. నాతలంపునిజముగునేని మీరలు నాయజమానుఁడువ్రాసియిచ్చినహుండియిచ్చితిరేని మీకుద్రవ్యమును చెల్లించెదననెను. అపుడా బ్రాహ్మణులు కర్ణామృతములగు నామాటలనువిని పరమానందభరితులై యోయిశ్యామళసా మేమే యాత్రవచ్చినబ్రాహ్మణులము. ఇదిగో నరసింహమేధమాకువ్రాసియిచ్చినహుండియనియతనిచేతికిచ్చిరి. శ్యామళసా సవినయముగా ఆహుండిని తనరెండుచేతులతోతీసికొని నేత్రములయందొత్తుకొని శిరసావహించి యానందాశ్రుపూరితలోచనుఁడై హుండినిచదువుకొని యోమహాత్ములారా నాయజమానునకనేక వర్తకశాలాధ్యక్షులుండినను నేనతనికిప్రాణపదమైయుందును. నేనతనికొలువున వేతనమునకమరినవాఁడనుగాను, అతనిసుగుణసంపత్తి నన్నుదాసునిగానేలుకొనియెను. నేనతనికిని అతఁడునాకును బహిఃప్రాణములైయుందుము. అతఁడెట్లుసదావాత్సల్యయుక్తుఁడై నన్నే స్మరించుచుండునో యట్లు నేనును సదా అతనికన్యము నెఱుఁగక యతనినే స్మరించుచుందును. అతఁడే నాకు సర్వవిధబంధువైయున్నాఁడు. నాశరీరముమాత్రము ఇచట నున్నదేకాని నామనస్సు అతనియందే లయించియున్నది. మహానుభావులగుమీవ్యాజముచే నాయజమానునిచేవ్రాలనుచూడఁగంటిని. నేఁడు నా జన్మము సఫలమయ్యెను. ఇదిగో మీద్రవ్యమును పరిగ్రహింపుఁడు అనిచెప్పి శకటమునఁదెచ్చినద్రవ్యమునువారలకిచ్చియదృశ్యుఁడయ్యెను. అపుడా బ్రాహ్మణులు ఆశ్చర్యపడి ద్రవ్యమునెంచగా ఎంతయెంచినను మితములేక పెరుగుచుండెను. వారలీయద్భుతమునుజూచి యిదిభగవల్లీలయని నిశ్చయించి యాద్రవ్యమును దీనజనులకుపయోగించి మరల పురాతనఘటమునకువచ్చి నరసింహమేధకు సాష్టాంగవందనంబాచరించి జరిగినవృత్తాంతమును అతనికివిన్నవించి యోమహాత్మా నీకృపచే మాకు శ్రీద్వారకాపతిసేవయొసఁగెను. మేముధన్యులమైతిమి, పేదకు పెన్నిధానమునిడ్డించినట్లు నీయనుగ్రహముచే మాకుయాదృచ్ఛికముగ భగవంతునిసందర్శనము లభించెను. ఇఁకను మమ్మును నీవారనియభిమానించితివేని మాకుపునర్జన్మము సిద్ధింపదు అనివిన్నవించి యామహాత్మునియనుగ్రహమును నియమనమును జెంది తమయూరికిఁబోయిరి. నరసింహమేధభగవంతుని కల్యాణగుణంబులనుగొనియాడుచు నానందపరవశుఁడై ప్రపంచమునుమఱచి భగవద్ధ్యానపరుఁడై యుండెను.

ఆశ్రితకల్పద్రుమాయనమః.

भौंहकी ललित किशोरी वारी है । ललिता करि परिहास कही यह नागर नंददुलारी है ॥ ३७७ ॥

## राग झँझोटी ।

श्यामाजी झूलें पीरी पोखार। पार गावत है ऊंचेस्वर कोकिल रही मौन मुख धार॥रमकनकी दमकन नग भूषण शोभा विपिन निहार। चौकाकी चमकन पर डारू श्वेत दामिनी वार॥थरकतहै अतर अतगट शिर पर सूही सार।खुमक बनी उर पीतकंचुकी मुख पर श्रमकण बार ॥ सजनी री इक साँवरि आई झूलनको रिझवार।ताके सँग झूलत हैं प्यारी करत अधिक मनुहार ॥ कौन गाम क्या नाम तिहारा करिये कृपा विचार । तरुणिनमें अतिसुंदर प्यारी चतुरनमें वर नार॥ललिता कहै बोल री सामर नानर देहुँ उतार । राजसुता सँग झूलन आई दियो ढीठ डर डार ॥ डोरी गह लीनी ललिता ने दोऊ दिये उतार । हँस पुनि चपल बलैयाँ लेवे कोउ पीवत जल वार ॥ मैननमें समझावत मुखसे वचन न सके उचार ।नंदगामकी ओर बतावे ऊंचे हाथ पसार॥ अँचराकी सरकनमें कौस्तुभमणिकी परी चिन्हार । हर हर हँसत सकल व्रज सुंदरी यह वोही खिलवार ॥नई पाहुनी आई झूलन बैठी घूँघट मार । वृन्दावन हित रूप बलिगई छदम न सकत उघार ॥ ३७८ ॥

बाँकी छबि झूलत प्यारी।बाँकी आप बिहारी बाँके बाँकी सँग सुकुमारी ॥ बांकी घटा घिरी इत चमकन चपलाहूंको न्यारी । ललित किशोरी बांकी मुसकन बंक पैंग पर वारी ॥ ३७९॥

## राग पीलू खेमटेकी राहमें ।

कौन चढे पहले सुरंग हिंडोरे । सोई करत मनुहार हिये हित रमकदेत जोरजोरे।गावत राग तान मधुरे स्वर कोटि काम चित चोरे। रसिक प्रीतम यह होड़ पियापरी रीझ देत तृण तोरे॥३८०॥

మున పత్రికయందువ్రాసియుండినసమస్తపదార్థములను బండిమీఁదనుంచుకొనివచ్చెను. నరసింహమేధ పత్రికయందువ్రాసియుండుప్రకారము వారువారుకోరినపదార్థములను వారివారికిప్పించి పత్రికనువ్రాసినవానికి వాఁడుకోరినరీతిని గుండుతూఁతినిచ్చెను. ఈయద్భుతమునుజూచియందఱును ఆశ్చర్యపడి నరసింహమేధమాహాత్మ్యమునుకొనియాడి పత్రికనువ్రాసినవానినిజూచి కల్పవృక్షమును జేరియు, నీదారిద్ర్యము నిన్నేమియును పేక్షింపనీకచేసెనని వానినిపరిహసించిరి. అప్పుడచ్చటగుమిగూడియుండినబంధుజనులు పరిచారకవేషధారియగుగోపాలునిజూచి నీవెవ్వఁడవు. నీవాసస్థలమెయ్యది. నీపేరెమి యనియడిగిన భగవంతుఁడునవ్వుచు వారలనుజూచి యీనరసింహమేధకు ద్వారకయందనేక వర్తకశాలలు కలవు. అందొకశాలకు నేనునిర్వాహిని. వీరిసేవకులలో నేనే ముఖ్యుఁడను. ఇతఁడుతన యంతరంగమును నాకుమాత్రమే యెఱుకచేయుచుండును. నేనితనిఛందానువర్తినైయుండును. ఇతనియోగక్షేమములను నేనేవహించియుండును. ఇతఁడునాయందున్యస్తభరుఁడై, నిర్భయుఁడై, నిస్పృహుఁడైయుండును. నాపేరుశ్యామళసా. ఇతనికొమార్తకు వరుసనిచ్చిపోవుటకై నాయజమానునితలఁపునెఱిఁగివచ్చితినని చెప్పి తన సంకల్పమాత్రముచే సమస్తపదార్థములనురప్పించి బంధువులను తక్కినవారలను గూర్చుండఁబెట్టి సకలభక్ష్య భోజ్య, చోష్య, లేహ్యపానీయములతోడ భుజింపఁజేసి దివ్యపరిమళమిళితచందనమును, కుసుమతాంబూలములను ఇచ్చి నరసింహమేధమెడను సొకతులసిహారమును వేసి యదృశ్యుండయ్యెను. అపుడచటివారెల్లరు ఇది శ్రీపాండురంగనిలీలయని నిశ్చయించి నరసింహమేధమాహాత్మ్యమునుగొనియాడి యతనివైభవంబును పెక్కువిధంబులస్తుతియించిరి. విఠ్ఠలనాథుఁడు పరమకృపాతిశయముచే నరసింహమేధకంఠమునవేసినతులసిహారము అతఁడు భగవన్నామసంకీర్తనముచేయుకాలమునందెల్ల నతనికంఠమునప్రకాశించుచుఁ దక్కినకాలములయందదియదృశ్యముగుచుండును.

ఈ యద్భుతమునువిని యాదేశాధిపతి నరసింహమేధయొక్క మాహాత్మ్యమును పరీక్షించి యెఱుఁగవలయునని యతనిచెంతకువచ్చి యతనిమెడనున్నతులసిహారమును పరిహరించి యోనరసింహమేధా నీవు నిజముగ భగవద్భక్తుఁడవేని అందఱుచూచుచుండ నీకంఠమునకు మునుపటియట్లు మఱియొకహారమురావలయును. అట్లురాదేని నీవువేషధారివని నిశ్చయించి నిన్నుశిక్షింతునని చెప్పెను. అప్పుడు నరసింహమేధ భగవంతునిస్తుతించుచుండెను. ఎంతగాస్తుతించినను అతనికంఠమునకు హారమురాదయ్యెను. అపుడుభగవంతుఁడు నరసింహమేధవాక్కుచే నిందాస్తుతినపేక్షించి హారమునొసఁగకుండెను. రాజు ఈవేషధారి యింద్రజాలముచేసి లోకులనుభ్రమింపఁజేయుచున్నాఁడని చెప్పి కత్తిదూసికొని యితనినిఛేదింపవచ్చెను. నరసింహమేధ భగవంతునుద్దేశించియోహరిమాయావీ, జారచోరశిఖామణీ, ఒకతులసిమాలికనిచ్చుటచే నీతండ్రిసొత్తుచెడిపోవునా. నన్నేలపరీక్షించెదవు. నేను ప్రాణహానికైశోకింపలేదు. నీనామప్రభావమునకు అగౌరవముకలుగునేమోయని శోకించెదను. నాకొకహారమునిచ్చి నీనామప్రభావమును కాపాడి పిదపవిరోధియగునీపాంచభౌతికశరీరమునువిడిపింపుము. అదియును నేనుప్రార్థింపను (దివివాభువివామమాస్తువాసో । నరకేవా నరకాంతకప్రకామం । అవధీరితశారదారవిందౌ । చరణౌతేమరణేపిచింతయామి) ఓ నర

# होरी लीला ।

## राग जङ्गला ।

प्यारी पिया दोऊ खेलत होरी । नन्दनँदन ब्रजराज साँवरो श्रीवृषभानुकिशोरी ॥ परमानन्द प्रेम रस भीने लिये अबीर भर झोरी । करत मनमें चित चोरी ॥ भुजभर अंक सकुच तज गुरुजन बिचरत हैं मिल जोरी। छूटी अलकाँ उरझीं कुण्डलसों बेसर प्रीत फँस्योरी ॥ चलो सुझावो गोरी ॥ कर कङ्कण कञ्चन पिचकारी केसर भर लै दौरी । छिरकत फिरत हुलस लिये हर्षत निरखत हँस मुख मोरी ॥ चलो क्यों होइयो बौरी ॥ धनि गोकुल धनि धनि श्रीवृन्दावन जहँ यह फाग रच्योरी। श्रीरसरंग रीझरहे ब्रजपर वारों वैकुण्ठ करोरी ॥ मुक्ति काशी जहँ थोरी ॥ ३८६ ॥

## राग होरीसारंग ।

श्यामा श्याम सों होरी खेलत आज नई । नंदनँदनको राधे कीनो माधव आप भई ॥ सखा सखी भई सखी सखा भये यशुमति भवन गई । बाजत ताल मृदंग झाँझ डफ नाचत थेइ थेई ॥ गोरे श्याम सामरी राधे या मूरति चितई । पलटचो रूप देख यशुमतिकी सुध बुधि बिसर गई ॥ सूर श्यामको वदन बिलोकत उघरगई कलई ॥ ३८७ ॥

## राग जङ्गला ।

या ब्रजमें कैसी धूम मचाई ॥ इत ते आई कुवँरि राधिका उतते कुवँर कन्हाई । खेलत फाग परस्पर हिल मिल या छवि बरणि न जाई॥ घरे घर बजत बधाई॥ बाजत ताल मृदंग झांझ डफ मंजीरा सहनाई।उडत गुलाल लाल भये बादर केसर कीच मचाई॥ मनो मघवा झर लाई॥राधे सैन दई सब सखियन यूथ यूथ मिल धाई।

ములు, కాలము, తద్గుణములు, వీనికి పరమార్థమగు నాత్మ యివియన్నియు నీవే. విద్యావిద్యలు, సత్యాసత్యములు, ప్రవృత్తినివృత్తులు, వేదోక్తసర్వకర్మములు ఇవియన్నియు నీవే. ఓభగవంతుఁడా సమస్తకర్మభోగములననుభవించువాఁడును, కర్మసాధనములగు ద్రవ్యములును, సర్వకర్మఫలములును నీవే. ఓమహాప్రభూ నాయందును ఇతరులయందును శేషభూతములగు సకలలోకములయందును నీవు వ్యాపించియుండుట ఉపాదాననిమిత్తకారణరూపమగు నైశ్వర్యమును అనంతజ్ఞానశక్త్యాదికల్యాణగుణములను చక్కఁగ సూచింపించుచున్నది. పరమయోగులు నిన్ను ధ్యానించెదరు. యాగశీలురు నిన్ను ద్దేశించి యాగములు చేసెదరు. నీవే పితృరూపమును దేవరూపమును ధరించి హవ్యకవ్యములను భుజించెదవు. ఓయచ్యుతా మహదహంకారాది సూక్ష్మములును, పృథివ్యాదిభూతములును, వానియందుండెడి సూక్ష్మమగు నాత్మతత్వమును నై యీ సూక్ష్మప్రపంచమంతయు నెచటనున్నదో, యెందుండి కలుగుచున్నదో యది స్వరూపగుణములచే గొప్పదియగు నీ మహారూపమైయున్నది. సూక్ష్మదివిశేషణశూన్యమై చింతింపఁగూడనిదై యుండు రూపము నీ పరమాత్మస్వరూపమైయున్నది. ఇట్టి పురుషోత్తముఁడవగు నీకు వందనము. సర్వాత్మకా సకలభూతములయందును సత్వాదిగుణములతోఁగూడియుండు నీప్రాకృతశక్తియగు జీవస్వరూపమునకు నమస్కరించెదను. ఏది వాఙ్మానసములకందనిదో యేవిశేషముచేతను విశేషింపింపఁగూడనిదో జ్ఞానులయొక్క జ్ఞానముచే నిరూపింపఁగూడనిదో యట్టి శ్లాఘ్యమగు నీ ముక్తాత్మస్వరూపమునకు వందనము. ఎవనికి తనకన్యమగు పదార్థము లేదో యెవఁ డన్నింటికిని వేఱైయున్నాఁడో యట్టి భగవంతుఁడగు వాసుదేవునికి నమస్కరించెద. కర్మాధీనమగు నామరూపములు లేక కేవల విలక్షణస్వరూపియగు మహాత్మునికి నమస్కరించెద. మఱియు వానికి నమస్కరించెద. వానికనంత నమస్కారములు చేసెద. సంకర్షణాదివ్యూహరూపియగువానికి నమస్కరించెద. దేవతలెవ్వని పరాత్పరరూపమును దర్శింపలేక మత్స్యకూర్మాద్యవతారరూపములనే యర్చించుచున్నారో యట్టి పరమాత్మకు వందనము. ఎవఁడు రుద్రాదిసకలభూతములకును నంతర్యామియై శుభాశుభములను జూచుచునుండునో యట్టి సర్వసాక్షియు, పరమేశ్వరుఁడునగు శ్రీవిష్ణుదేవునికి నమస్కరించెద. వ్యక్తమగు నీజగమంతయు నెవ్వనితో భేదములేకయున్నదో యట్టి విష్ణువునకు వందనము చేసెద. సకలమునకాదియయిన యా శ్రీహరి నాకు ప్రసన్నుఁడగును గాక. అక్షరమను నామమును గలిగియుండెడి యెవనియందు ప్రపంచమంతయు నూలువస్త్రమునఁ గలసియుండునట్లు కలసియు నూలునమణులు గ్రుచ్చఁబడినట్లు గ్రుచ్చఁబడియునున్నవో ఆధ్యానగమ్యుఁడగు నచ్యుతుఁడు నాయందు ప్రసన్నుఁడు గావలయు. సర్వస్వామియై, సర్వశేషియైయుండు నా శ్రీమహావిష్ణువునకు నమస్కరించెద. ఎవనియందు సర్వము నులయించునో, యెవనియందుండి సర్వము సృష్టికాలమునందుత్పన్నమగునో, యెవఁడు సకలశరీరకుఁడయి సకలాధారమైయున్నాఁడో యట్టి సర్వస్వామికనంతవందనములు. శ్రీయనంతుఁ డెందును ఆత్మయై లోపల వెలుపల వ్యాపించి జ్ఞానానందమయుఁడయి నిండియుండుటచే నేను నువాఁడే యగుచున్నాను. కాన సమస్తమును నావలనఁ గలిగెను. నేనే సర్వమైయున్నాను. నిత్యుఁడగు నాయందే సర్వమునున్నది. నేనే యవ్యయుఁడై నిత్యుఁడై వేఱొకయాధారము లేక తనలో నమస్కారము తానుండువాఁడైయుండు పరమాత్మయగుచున్నాను. నేను సృష్టికిఁ బూర్వము [illegible] మును

गौतमकी नारी छुअत उडी नँदलाल ॥ कहा विलोकत भ्रुकुटी कुटिल कर नहीं पूतना खाल । यह अँगिया काली मत समझो जा नाथ्यो पाताल॥गिरिवर उठाय भयो गिरिधारी लाला नहीं जानो ब्रजबाल । जाओजी खावो सुदामाके तंडुल गौवनके रखवाल ॥ इतनी सुन मुसकाय साँवरे लीनो अबिर गुलाल । सूरश्याम प्रभु निरख छिरक अंग सखियन कियो निहाल ॥ ३९१ ॥

## राग भूपाली जंगला ।

डगर मोरी छांडो श्याम बिंध जावोगे नयननमें।भूल जाओगे सब चतुराई लाला मारूंगी सैननमें ॥ जो तोरो मनमें होरी खेलनकी तो लेचल कुंजनमें ॥ चोआ चंदन और अर्गजा छिरकूंगी फागनमें॥चंद्रसखी भजबालकृष्णछबि लागीहै तनमनमें॥३९२॥

## राग जंगला ।

जनि जाओ री आज कोऊ पनिया भरन ॥ ठाढो मगमें मोहन इक इकको मारत पिचकारी तकतक॥जिनको चाहत तिनका रंगमें भिगोय डारे गारियां देन लागो न्यारो बक बक ॥ उनको देखके उलटी दौर आई मुख अपनो इक सारी ढक ढक ॥ शीश कूँपन लागो पाँय थकन लागे छतियाँ करन लगी न्यारी धक धक ॥ आई वसंत विरहोंकी मौजमों मन रंग रह्यो वनवारी छक छक ॥ मौज हरी तिहारो यही रंग रहैगो संग चलनको मैं रही तक तक ॥ ३९३ ॥

## राग गजल ।

मची है आज बंशीवट पै होली । खडा नट गैलमें भर रंग कमोरी ॥ गई थी मैंअभी दधि बेचबे को,झपट मोहन मली मुख मेरे रोली॥पटक मटुकी झपट अंचल झटक कर, लपट दरकाई चूनर और चोली ॥ अजब नट खटहै नँदका हँस मटक कर, लगा बातोंमें मेरी नीवी खोली ॥ ये लखि मैं ढीठता उस नंदके की,

ణుఁడు భగవంతునికి మిగులనంతరంగభక్తుఁడు. అతఁడునిన్నటిదనము స్వామియగ్రభాగమున కన్నీరువిడుచుచు, ఏడ్చుచు, స్తుతించుచు, ఆనందనృత్యముచేయుచు తన్నుమఱచి ధ్యానాసక్తుఁడైయుండెను. ఘనవాసుదేవుఁడు భక్తిప్రీతుఁడుకాన అతనిభక్తివలయందుఁ జిక్కి యేమయ్యెనో తెలియలేదు అనిచింతించుచు రథమునుఅదియుండవలసిన స్థానమునఁ గానక రథచక్రములయొక్కయు గుఱ్ఱములయడుగులయొక్కయు జాడలనుబట్టిపోఁగా ఆజాడవీరలను డాక్రాయనునూరికి తీసికొనిపోయెను. వీరలువచ్చుచుండు వృత్తాంతము వినిరామదాసుఁడు మిగులభయమును జెంది యర్చారూపియగు శ్రీవాసుదేవుని తనయింటి సమీపముననుండిన యొకతటాకమునీటిలో పలప్రతిష్ఠించెను. ద్వారకావాసులయినయర్చకులుమొదలగువారు రథచక్రములయొక్కయు, గుఱ్ఱపుటడుగులయొక్కయు జాడలను బట్టుకొని రామదాసునియింటికివచ్చిరి. ఆజాడలు అదివఱకగుపడియంతకుమీదనదృశ్యమయ్యెను. అపుడుద్వారకావాసులు ఈయిల్లెవరిదనియు, ఈయింటియజమానునినడువడి యెట్టిదనియు ఆయూరివారలనడిగి తెలిసికొనియాయింటఁబ్రవేశించి రామదాసునిఁజూచి నీవేల భగవంతునిచటికిఁదెచ్చితివి. ఇట్టియక్రమమెట్టిసాహసముతోఁజేసితివి. అయినను గతజలసేతుబంధనమువలె మేమునిష్ఠురములాడి ప్రయోజనములేదు. మాకుభగవంతునిజూపుమనిన రామదాసుఁడు నేనేమియునెఱుఁగననెను. అదివినివారలు రామదాసునిబద్ధునిఁ జేసి యతనియిల్లంతయువెదకి భగవంతునిగానక యాయూరిలోనుండిన యన్నియిండ్లను శోధించియు సర్వగతునినేప్రదేశమందునుగానరైరి. పిదప అతనియింటిసమీపముననుండు తటాకమున శోధింతమనితలఁచి యొకయీఁటెచే ఆతటాకమునందంతయు పొడుచుచు వచ్చిరి. ఆయీఁటె భగవంతునిశరీరమునఁదగిలి రక్తప్రవాహముకలిగి యాగుంటనీరంతయు రక్తవర్ణమయ్యెను. కొందఱు నీటిలోదిగి భగవంతుని విగ్రహమునుగని వెలుపలఁదెచ్చిరి. ఈఁటెచేకలిగినగాయము ప్రకాశించుచుండెను. ద్వారకావాసులు భగవంతునిజూచినంతట ఆనందభరితులైరి. రామదాసుఁడుమాత్రము నానిమిత్తమై భగవంతునిదివ్యమంగళవిగ్రహమున గాయముకలిగెనుగదాయని శోకించుచుండెను. అపుడుభగవంతుఁడు రామదాసును చూచి నాకు నీయట్టియంతరంగులు త్రిలోకంబులయందును త్రికాలములయందును లేరు. నీవు నావిశ్వరూపముయొక్క మర్మమును చక్కఁగనెఱిఁగినవాఁడవు. నన్నునీవుసర్వగతునిఁగభావించుచుండియు నాదివ్యమంగళవిగ్రహమునందలి యాదరాతిశయముచే నావిశ్లేషమును సహింపకశోకించితివి. నీయందు నాకుఁగల ప్రేమాతిశయమును బయలుపఱచుటకై నేనునునిన్ను వెంబడించివచ్చితిని. ఇఁకను నీయశోనిధియనఁదగినేనిచటనే వసింపఁగోరెద. నీవీయర్చకులకు నాదివ్యమంగళవిగ్రహభారమునకు సమభారమగు స్వర్ణమునొసఁగవలయు. ఈయర్చకులుఆస్వర్ణమును పుచ్చుకొనినిన్నునునన్నునునిర్బంధింపకద్వారకకుపోవలయును అనినియమించెను. ఆవచనమునువిన్నమాత్రమున అర్చకులుఆనందభరితులై నిరుపేదయగు రామదాసునికి ఇంతస్వర్ణ మెక్కడిది. భగవంతుఁడుమరలనెప్పటియట్లు ద్వారకకువచ్చుటకుసంశయములేదు. పరమభక్తుఁడగు రామదాసునినితృప్తిపఱచుటకై ఘనస్వామియిట్టిలీలనుకొనియాడెను. అనితమలోనిశ్చయించిరి. తోడనేభగవన్నియమనముచే అచటికొక త్రాసు తేఁబడియె. వాసుదేవునితలంపునెఱిఁగియాయర్చకులు భగవంతునినిత్రాసుతట్టయం

దుంచిరి. అప్పుడు భక్తవత్సలుఁడు రామదాసునుజూచి దరిద్రుఁడగు నేను స్వర్ణమెచటనుండి తెత్తునని చింతింపకుము. కల్పవృక్షము నాశ్రయించినవారికి లోపముకలదా. ఆశ్రితకల్పతరువగు నేను నీవశవర్తినై యుండ నీకేమికొఱఁత. నేనును నావిభూతియగు సర్వప్రపంచమును నీకిష్టవినియోగార్హమైయుండ నీవెట్లుదరిద్రుఁడవగుదువు. నీభార్యధరించియుండు బంగారు ముక్కుఅనుదెచ్చి మఱియొకతట్టయందుంచుము. అనినియమించిన రామదాసుఁడు సర్వశక్తియగు భగవంతునికల్యాణగుణములను గొనియాడుచు మహావిశ్వాసముతోడ నియమనప్రకారమాముక్కుఅనుదెచ్చి త్రాసు తట్టయందుంచెను. అప్పుడు భగవత్సంకల్పముచే ఆముక్కుఅయుంచఁబడిన తట్ట క్రిందికిఁవ్రాలి భగవంతుఁడుండుతట్ట మీఁదికివచ్చెను. భక్తవత్సలుఁడు భక్తులకీర్తిని ప్రకటించుటకై చేయువిచిత్రచరిత్రములు అత్యద్భుతములై, సనకాది పరమయోగులకు నిత్యానుసంధేయమైయుండును. ఈయద్భుతమునుజూచి సర్వలోకమును సాధువాదము చేసెను. ద్వారకావాసులు రామదాసునిభక్తిని, భక్తవత్సలునికి అతనియందుఁ గలవాత్సల్యమును వేవిధములఁగొనియాడుచు మహాప్రసాదమనియాముక్కుఅనుపరిగ్రహించి వాసుదేవ రామదాసులకు వందనములుచేసి రామదాసునిజూచి యోమహానుభావా భగవంతునియందలినీభక్తిని, నీయందలిభగవంతునివాత్సల్యమును కొనియాడుటకు చతుర్ముఖ, పంచముఖ, షణ్ముఖ, సహస్రముఖులకలవిగాదనఁగా మందమతులమగు మాకెట్లుసాధ్యమగును. మేము నిత్యము నీభగవంతునిదివ్యమంగళవిగ్రహమును స్పర్శించుచు నారాధించుచునుండియు పాకముచేయఁబడు రసవంతములయిన సర్వపదార్థములయందు ననవరతము ప్రవేశించి యాపాకములకు ముఖ్యోపకారకమైయుండెడి యబకయాపాకరసాంశము నెఱుఁగనట్లు మేమీభగవంతునికల్యాణగుణగణసంపత్తినెఱుఁగమైతిమి. ఇదిగో శరణాగతిచేసెదము. మమ్ము నీవారనియభిమానింతువేని వ్యాఘ్రశరీరము నాశ్రయించియుండు జంతువులావ్యాఘ్రముతోడ నొకకొండనుండి మఱియొకకొండకు దాఁటునట్లు మీయనుగ్రహముచే మేమును మీతోడ ఈభగవంతునిసాయుజ్యమును బడయుదుమని ప్రార్థించి రామదాసులను ఆచార్యునిగవరించి వారియుపదేశానుగ్రహములను జెంది భగవన్నియమనముచే ద్వారకచేరి యచటపూర్వము వలె మఱియొకవిగ్రహమును ప్రతిష్ఠచేసి యారాధించుచుండిరి. శ్రీద్వారకాపతి రామదాసునియందలివాత్సల్యముచే అనుష్ఠించినదివ్యలీలలను ఆకాశముననుండి చూచుచుండిన దేవతలు మేముమనుష్యులమయియుండిన నీమహానుభావుఁడగు రామదాసునికి శిష్యులమైయుజ్జీవింతుము. దేవతలై పుట్టి చెడిపోతిమి. అని చెప్పుకొనుచు తమలోకమునకుఁబోయిరి. ఈయద్భుతమును కని విని యెల్లరును రామదాసునాశ్రయించి వారియుపదేశానుగ్రహములఁజెంది యుజ్జీవించిరి. ద్వారకాపతియగు భగవంతుఁడు రామదాసునిభక్తివైభవమును తద్వాత్సల్యాదికల్యాణగుణవైభవమును ప్రకటించుచు ఇప్పటికిని ఆయూరియందు నెలకొనియున్నాఁడు. ద్వారకాయాత్రచేయుసాధువులాయూరికిపోయిభగవంతునిదర్శించుచున్నారు.

శ్రీద్వారకాపతయేనమః.

# ముప్పదిరెండవయధ్యాయము.

## కల్యాణదాసునిచరిత్రము.

హరిద్వారమున కల్యాణదాసుఁడను నొకబ్రాహ్మణుఁడు నిస్పృహుఁడయి యనవరతభగవధ్యానపరుఁడయి సంసారమునవర్తించుచు భగవద్భక్తిఁజేయుచుండును. అతఁడు సేతుయాత్రబయలుదేరి మార్గముననుండు పుణ్య తీర్థములయందుమునుంగుచు దివ్యక్షేత్రములయందు సన్నిధిచేసియుండు భగవంతుని సేవించుచు సేతువునకువచ్చిచేరెను. అచట నొకగౌడబ్రాహ్మణబ్రహ్మచారివైరాగ్యశీలుఁడయి భగవంతునికి అంతరంగభక్తుఁడయి సర్వపుణ్యక్షేత్ర తీర్థయాత్రలుచేసి సేతుస్నానమునకువచ్చియుండెను. కల్యాణదాసుఁడీబ్రహ్మచారికిఁగల జ్ఞానభక్తి వైరాగ్యములనుజూచి లీలావిభూతియందు ఇంతయధికారి కలిగియుండుట మిగులదుర్లభమని విస్మితచిత్తుఁడై యతనితోఁగూడి సేతుస్నానముచేసి యతనితో స్నేహించి యిరువురునుగూడి భగవన్నామసంకీర్తనముచేయుచు తీర్థయాత్రచేయుచు పూర్వమువామనాశ్రమమై, పిదప శ్రీశత్రుఘ్నునిరాజధానియై, యనంతరముశ్రీకృష్ణజన్మస్థలమయి, పరమపావనక్షేత్రమైయుండుశ్రీమధురకుపోయి యాపుణ్యస్థలమునకొంతకాలము వాసముచేయుచుండిరి. అపుడుకల్యాణదాసునికి శరీరమునను పాధికలిగి యాఱునెలలుమిగులబాధపడెను. అట్టిసమయమున బ్రహ్మచారిశ్రద్ధతోడ కల్యాణదాసునికినుచితముగునుపచారములనుజేయుచుండ భగవత్కటాక్షముచే కల్యాణదాసునికి వ్యాధినివర్తియై శరీరముననారోగ్యముకలిగెను. అపుడుకల్యాణదాసుఁడు బ్రహ్మచారినిచూచి నీవుపరమపుణ్యుఁడవు. భూతదయకలవాఁడవు. ఇట్టియాపత్కాలమున నాకుమిగులనుపకారముచేసితివి. ఇందుకుసదృశముగ నీకు నేనేమిప్రత్యుపకారముచేయఁగలను. నేనెన్నిజన్మములెత్తినను ఈ ఋణము తీర్పఁజాలను. సాక్షాద్భగవంతుఁడు నీరూపమై నన్నాదరించెనని నిశ్చయించెద. ఇందుకుసందియమేమి. సర్వభూతహృదయాంబుజవర్తియై కర్మసాక్షియై యెల్లరకునుకర్మఫలప్రదానముచేయువాఁడు వాఁడేకదా. (పితృమాతృసుతభ్రాతృ। దారమిత్రాదయోపివా। ఏకైకఫలలాభాయ। సర్వలాభాయకేశవః) అనువాక్యమునిజముగ నేనుఏకాకినైతీర్థయాత్రవచ్చినతఱి నాకిట్టియుపాధికలుగునని సర్వజ్ఞుఁడును, సర్వాత్మలకీశ్వరుండును, నాజీవితేశ్వరుండునునగులక్ష్మీశుఁడు నీరూపమైవచ్చి నాకుసహాయుఁడయ్యె. సాక్షాద్భగవత్స్వరూపియగునీకు నాపుత్రికనిచ్చి వివాహముచేయవలయునని మనోరథించెద. ఇందుకు నీ వవశ్యమొడంబడవలయు. నాచేమానసికదత్తయగు నాపుత్రికకు నీవే వరుఁడవనినవిని బ్రహ్మచారి ఓమహాత్మా నేను బ్రహ్మచర్యమునసనుష్ఠించి యుత్తమగతినిఁ జెందవలయునని తలఁచియుండ నీవేలనన్ను నిర్దయుఁడవై సంసారాంబుధియందుఁ బడఁద్రోయ యత్నించెదవు. గృహస్థాశ్రమము పెక్కుడుములకాకరమైనది. చిత్తమును భగవంతునియందు చేరనీకచేయును. సంసారమునుసముద్రము ఆశయనుజలముతోడను మన్మథుఁడనువాయువుచే వృద్ధిచేయఁబడిన మోహమునునలలతోడను, భార్యయనుసుడితోడను, పుత్రసహోదరులనుమొసళ్లతోడనుగూడిమహాభయంకరమై దాఁటఁగూడనిదైయుండును. ఇట్టిక్రూరమగు సంసారమహార్ణవమునమునుఁగుదుగాక తప్పించుకొనియుండునన్ను నీవేలనిర్దయుఁడవై యీసము

ద్రంబున ద్రోయఁజూచెదవు. నేనునీకేమియపకారముచేసితిని. అనిభయకంపితగాత్రుఁ డై విన్నవించిన నావటునిఁజూచి కల్యాణదాసుఁడిట్లనియె. ఓవత్సా శోకింపకుము. ఒకఁడు భార్యాపుత్రాదులతోఁగూడి గృహమునవసించుటచే సంసారియగుననియు, అదిలేమిమాత్ర మునవిరక్తుఁడనియుఁ దలఁపకుము. విరక్తులయి సంసారమునుత్యజించి వాతాంబుపర్ణాశనులయి విజనస్థలంబున వాసముచేయుచుండిన సౌబరి, కండు, భరతాదులుపడినపాట్లువిని యెఱుంగవే! సంసారముననుండి జెలగవలె నెందుననంటకవైరాగ్యాదిసద్గుణసంపత్తిచే లోకవంద్యులయి యుత్తమసిద్ధినిజెందిన శ్రీజనకవిదురాదులసచ్చరిత్రములు పురాణేతిహాసములయందు సుప్రసిద్ధములయి వినఁబడుచుండలేదా. నాయెఱుకకొలఁది నీకుహితోపదేశముచేసెదవినుము. జగత్తుతత్త్వత్రయాత్మకముయియుండును. అందుచిదచిత్తులు ఈశ్వరునికి శేషమై, పరతంత్రమై, తదిష్టవినియోగార్హమైయుండును. ఇందుచిత్తుఅనఁబడు ఆత్మ పరమచిత్తగుపరమాత్మకు శ్రీకౌస్తుభస్థానమైయుండును. చండాలవాటికబ్రాహ్మణునికిప్రవేశయోగ్యముకానట్లు అహంకార, మమకారములనెడి చండాలులువసించుటచే చేతనునిహృదయము భగవంతునికి వాసయోగ్యముకాకయున్నది. బుద్ధిమంతుఁడీచండాలులిరువురిని దూరముగాపాఱఁదోలి హృదయమును భగవంతునికాలయముచేసి శమదమములనెడిజలముచే స్థలశుద్ధిచేసియందుభగవంతునిప్రతిష్ఠించి (అహింసాప్రథమం పుష్పం। పుష్పమింద్రియనిగ్రహః। సర్వభూతదయా పుష్పం। క్షమా పుష్పంవిశేషతః। శాంతిపుష్పంతపఃపుష్పం। ధ్యానపుష్పం తథైవచ। సత్యమష్టవిధంపుష్పం। విష్ణోఃప్రీతికరంభవేత్) అనురీతిని భగవంతునికి అత్యంతము ప్రీతికరమగు నహింస మొదలగు పుష్పములచే అనవరతము భగవంతుని నర్చించుచునుండవలయు. మనకీశ్వరుఁడు అమూల్యమగుమనుష్యజన్మమునిచ్చినందుకు ప్రయోజనమిదియ. ఇట్లుండనిందుకన్యముగ ఇంద్రియకింకరులయివ్యర్థముగకాలమునుగడపువారికి మీఁదయమవశ్యత తప్పదు. ఈనిష్ఠకలవాఁడెట్లువర్తించినను పరిశుద్ధుఁడయియుండును. పుత్రదారగృహక్షేత్రాదులేమమకారవర్ధకములని తలఁపకుము. వీనినినివర్తించినవానికి కాషాయవస్త్రకమండలు, ఆసనాదులు మమకారయోగ్యములుకావా? ఇవియువర్జించినవారికి శరీరముమమకారహేతువుకాదా? విషముకొంచెమైనను, అధికమైనను ప్రాణమునుబోఁగొట్టుటకుసమర్థమగును. అట్లుమమకారయోగ్యములగుపదార్థములేకమైనను, అనేకమైననుచేతనునిపాతివ్రత్యమునుచెఱిచి భగవన్నిగ్రహకారణమై భవరోగవర్ధకమైయుండును. కానవనంబునవసించి మనోనిగ్రహమునకు సామర్థ్యములేక శరీరమునందును, తదనుబంధిపదార్థములయందును మమకారముచేయుటకన్న గృహంబున వసించుచు పుత్రదారగృహక్షేత్రాది సర్వము నీశ్వరవిభూతియనియు, తనకుదేనియందును సంబంధము లేదనియు నధ్యవసించి మమకారవర్జితుఁడయియుండువానికి నేతద్దేహావసానమున పునరావృత్తి రహితమోక్షము సిద్ధించుననుటకునించుకయు సంశయములేదు. (బ్రహ్మణ్యాధాయకర్మాణి। సంగంత్యక్త్వాకరోతియః। లిప్యతేనసపాపేన। పద్మపత్రమివాంభసా) అనఁగానే పురుషుఁడు తానుచేయుకర్మములను బ్రహ్మార్పణముచేసి సంగవర్జితుఁడయియనుష్ఠించుచున్నాఁడో యాపురుషుఁడు తామరాకునందు నీరంటనట్లు పాపముచే స్పర్శింపఁబడఁడు. అనిభగవద్గీతయందు భగవంతుఁడు చెప్పియున్నాఁడు. కాననీవు నాహితోపదేశము నంగీకరించి నాపుత్రికను వివా

హామైభగవన్యస్తభరుఁడవై యహంకారమమకారములకులోఁబడక (నివృత్తరాగస్యగృహం తపోవనం) అనురీతిని గృహమును తపోవనమున వైరాగ్యశాలివై యనవరతభగవధ్యానపరుఁడవై యుండుము. నీయాత్మభారమును భగవంతుఁడువహించి నీయోగక్షేమములకు తానేకర్తయైయుండును. నీకంతర్యామియై నీరూపుచేఁబ్రకాశించుచుండు శ్రీమన్నారాయణుని నా పుత్రికకువరునిఁగ వరించితిని. కాన శ్రీవాసుదేవుఁడు సాక్షిగ నాపుత్రిక నీకేభార్యయయ్యెను. ఇది యిట్లుండగృహస్థాశ్రమమును హేయమనిపల్కితివి. గృహస్థాశ్రమధర్మమును జెప్పెదనువినుము.

బుద్ధిమంతుఁడు బ్రహ్మచర్యమునుజరపినపిదప విధిప్రకారముగనొకకన్యకను వివాహమయి తనకుఁదగినకార్యముచే ద్రవ్యార్జనముచేసి గృహస్థధర్మమును యథాశక్తిజరుపవలయు. పర్వకాలములయందు పిండప్రదానముచేతను, తిలసహితమగు నుదకముచేతనుపితలను, యాగములచే దేవతలను, అన్నముచేనతిథులను, వేదాధ్యయనముచే ఋషులను, సంతతిచేఁబ్రహ్మను, భూతబలికర్మముచే సకలభూతములను, వాత్సల్యముచే సకలలోకములను తృప్తిపఱుపవలయును. ఇట్లుచేయుగృహస్థుఁడు తనసుకర్మములచే సంపాదింపఁబడినయనేకపుణ్యలోకములను జెందును. సన్న్యాసులును బ్రహ్మచారులును గృహస్థునినాశ్రయించి జీవించెదరు కాన గృహస్థధర్మము మిగులగొప్పదై యున్నది. మఱియు వేదములనుగ్రహించుటకును, తీర్థయాత్రలకొఱకును, పుణ్యభూమినిదర్శించుటకును బ్రాహ్మణులుస్వదేశములను విడిచి సంచరించుచుందురు. కొందఱు ఒక్కచోపనింపక సూర్యుఁడస్తమించుచోటును స్వగృహముగఁదలఁచుచు సంచరించుచుందురు. ఇట్టివారికెల్లరకు గృహస్థుఁడు పోషకుఁడయి యుండును. అట్టిదేశాంతరవాసులువచ్చునపుడు కుశలప్రశ్నముచేసి తియ్యనిపలుకులుపలికి యాసనభోజనశయనములనిచ్చి సంతోషింపింపవలయు. అతిథియగువాఁడేగృహస్థుని యొద్దికివచ్చి తనమనోరథము విఫలమైతిరిగిపోవుచున్నాఁడో యాయతిథి యాగృహస్థునికి తనపాపమునిచ్చి వానిపుణ్యమును గొనిపోవుచున్నాఁడు. గృహస్థధర్మమున నుండువానికి పరావమానము, అహంకారము, డంభము, ఒకనికొకవస్తువునిచ్చి పిదపఖేదించుట, కొట్టుట, తిట్టుట, యివియన్నియు శ్రేయస్కరములుగావు. ఇట్టిదుర్గుణములులేక సద్గుణవంతుఁడయి యేగృహస్థుఁడు స్వధర్మమునుచక్కఁగననుష్ఠించునో వాఁడుసర్వానర్థములకుతప్పి యుత్తమలోకమును జెందును. ఇట్లుగృహస్థాశ్రమముననుండి కృత్యములననుష్ఠించి వార్ధక్యమున భార్యను పుత్రునికప్పగించియైన లేక భార్యతోఁగూడియైన వనమునకుపోవచ్చును. ఓయి బ్రహ్మచారీ నీవు నాపుత్రికనువరించి యుత్తమమగు గృహస్థాశ్రమముననుండి యహంకారమమకారవర్జితుఁడవై సర్వపదార్థములు భగవంతునివనియు, సర్వమును జేయువాఁడును చేయించువాఁడును ఆజగదీశుఁడేయనియు, వ్యక్తములగుసర్వపదార్థములు అతనిరూపములనియు, ఒరులకుమనచేఁజేయఁబడు నుపకారాపకారములు శరీరియగు భగవంతునేచెందుననియు దృఢముగనధ్యవసించి మునుపునాచేఁజెప్పఁబడినరీతిని అనవరతమానసికభగవదారాధనశీలుఁడవై వర్తింపుము. భగవంతుఁడుసదానిన్నెడబాయక నీచెంతవర్తించును. అని చెప్పిననాబ్రహ్మచారి కల్యాణదాసునిజూచి ఓమహానుభావా సాక్షాద్భగవంతుఁడు నీరూప

लगे भर भरके पसन । नारायण तबसों मोहिं सजनी सुधि न रही निज वदन वसन ॥ ४१५ ॥

## राग कान्हरो ।

आज ब्रजराजकी देख शोभा नई गई तनु भूल सुध भई हौं बावरी ॥ अधर रँग पान मुसक्यान जादू भारी ताहू पै चित हरन दृगनके भाव री । कुंडलनकी हलन छलन मन मदनकी चलत गज चाल वश करनके चाव री ॥ निरखिके रूप नारायण हरष्यो हियो कौनसे भाग्यसों लग्यो है दाँव री ॥ ४१६ ॥

## राग खट ।

आज नन्दलालमुख चन्द अयनन निरख परम मङ्गल भयो भवन मेरे ॥ कोटि कंदर्प लावण्य एकत्र कर वारों तबहीं जबहिं नेक हेरे ॥ सकल सुखसदन हर्षत वदन गोपवर प्रबलदल मदन जनो संग घेरे । कहो कोउ कैसहूं नाहिं सुध बुध रहे गदाधर मिश्र गिरिधरन टेरे ॥ ४१७ ॥

मुकुट माथे धरे खोर चन्दन करे माल मुक्ता गरे कृष्ण हेरे ॥ पीतपट कटि कसे कर्ण कुण्डल लसे निशिदिना उर बसे प्राण मेरे ॥ मुरलिका मोहनी कर कमल मोहनी ले कनक दोहनी खिरक नेरे ॥ लाल लोचन बने ललित रसमें सने सैनसे अनगिने ग्वाल टेरे ॥ किंकिनी काछनी देत शोभा घनी देख कौस्तुभ मनी सुर छकेरे ॥ प्रभु छबीलो रंगीलो रसीलो आली लसे मन्न मनमें बसेरे ॥ ४१८ ॥

## रागबिलावल ।

माई री आज और काल्ह और दिन प्रति और और देखिये रसिक गिरिराज धरन ॥ दिन प्रति नई छबि बरणे सो कौन कवि

వేని యీకార్యమునుఘటింపించుటమిగులదుర్లభము. అనినవిని కల్యాణదాసుఁడురాజును జూచి నేనుధర్మపాశబద్ధుఁడను. (ధర్మస్య ప్రభురచ్యుతః) అనురీతిని ధర్మమునకుప్రభువు అచ్యుతుఁడుగదా. నేను భగవంతునివిషయమున న్యస్తభరుఁడనయియుండుటయు, ఆజగన్నాథుఁడు నాయోగక్షేమములను తానేవహించియుండుటయు నిజముగ నేని నాప్రార్థనకై యాభక్తవత్సలుఁడిచటికివచ్చి సాక్ష్యముచెప్పుననుటకు సంశయములేదు. ధ్రువునిభక్తికిమెచ్చి యతనికిసర్వోత్తమపదవి ననుగ్రహించినదియు, గజేంద్రునిరక్షించినదియు, ప్రహ్లాదునికై సభాస్తంభమున నవతరించినదియు, శరణాగతయగు ద్రౌపదికి నాపద్దశయందు వస్త్రప్రదానముచేసినదియు, మఱియు ననేకభాగవతులయాపదలఁబాపి స్వకార్యముగ వారలరక్షణభారమునువహించినదియు నిజముగ నేనియట్టియాపద్బాంధవుఁడు నాకైయిచటికివచ్చిసాక్ష్యముపల్కకపోవునా. ఓరాజా యోబంధుజనులారాయించుకయోర్చియుండుఁడు. నేనిప్పుడేపోయి యాదీనబంధువును ఇచటికిఁబిలుచుకొనివచ్చెద. అనిచెప్పియప్పుడేబయలుదేరి శ్రీమధురాపురమునుజేరి దేవాలయమునప్రవేశించి భగవంతునికనంతవందనములుచేసి మస్తకన్యస్తాంజలియై దేవాధిదేవా నేను నీసన్నిధిని గౌడబ్రాహ్మణ బ్రహ్మచారికిఁ జేసినకన్యకవిషయమగువాగ్దత్తమును నాబంధుజనులును, దేశాధిపతియునునమ్మక నీసాక్ష్యమునుగోరుచున్నారు. నీయాశ్రితవాత్సల్యమును జగద్విదితముచేయుటకు మంచిసమయము సిద్ధించెను. ధ్రువగజేంద్రప్రహ్లాదులను వారివారిచోటికిపోయి రక్షించినట్లు నీవుధర్మసంస్థాపనార్థమునన్నువెంబడించి హరిద్వారమునకువచ్చిసాక్ష్యముచెప్పుము. (యదాయదాహిధర్మస్య। గ్లానిర్భవతిభారత। అభ్యుత్థానమధర్మస్య। తదాత్మానంసృజామ్యహం) ఎప్పుడెప్పుడుధర్మమునకు హానికలుగునో, అధర్మమునకునభివృద్ధికలుగునో యప్పుడప్పుడు నేనవతరించుచున్నానని భగవద్గీతయందుచెప్పియున్నాఁడవుకదా. ఆగీతోపనిషత్తుసత్యముగనేని నన్నువెంబడించివచ్చి ధర్మరక్షచేయుము. అనివిన్నవించినకల్యాణదాసునిఁజూచి యోవత్సా నీపలుకులుచితమైయున్నవి. అర్చారూపమును పరిగ్రహించియుండు నేను నడచివచ్చుటసాధ్యముకాదు. అయినను నేనునునావిభూతియును ఆశ్రితవినియోగార్హమైయుండుటచే నాకంతరంగుఁడగు నీకై నేనునడచివచ్చి నాయాశ్రితవాత్సల్యమును నెల్లరకునుప్రకటించెద. నీవుతిరిగిచూడకముందుగనడవుము. నేనునిన్నువెంబడించివచ్చెద. అనిచెప్పి కల్యాణదాసుఁడు ముందునడచిపోవుచుండఁగా తానుసర్వాభరణభూషితుఁడై వాయువశముచే తనదివ్యమంగళవిగ్రహసంబంధమగు దివ్యగంధమంతటనువ్యాపించుచుండ కాళ్లయందుగజ్జెలు మ్రోయుచుండకల్యాణదాసునిని వెంబడించిపోవుచుండెను. ఇట్లువీరిరువురు దివారాత్రివిభాగములేకనడచి హరిద్వారమునకు నరగడియదూరమునవచ్చునపుడు గజ్జెలశబ్దమువినకుండినందున కల్యాణదాసుఁడు తిరిగిచూచెను. భగవంతుఁడచటనేనిలిచి కల్యాణదాసునిఁ జూచి నీవునన్నుతిరిగిచూడకుమని చెప్పియుంటినిగదా. నీవునాయాజ్ఞననువర్తించువఱకు నిన్నువెంబడించివచ్చితిని. ఇఁకనిచ్చోటువిడిచి కదలను. నేనిచటసన్నిధిచేసియుండుటను రాజునకును నీబంధుజనులకును నెఱుకచేసి యందఱినిటకు తోడితెమ్ము అనినియమించిన కల్యాణదాసుఁడతివేగముగ హరిద్వారమునకుఁబోయి రాజునకునుతనబంధువులకునుభగవన్నియమనము నెఱుకచేసిన వారందఱును విస్మయమును జెంది కల్యాణదాసునివెంబడించి

వచ్చి శ్రీరుక్మిణీకాంతునిదర్శించి ప్రదక్షిణ నమస్కారములుచేసి బహువిధముల స్తుతించుచుండ భగవంతుఁడు రాజునుజూచి యీకల్యాణదాసుఁడు నాకు మిగులనంతరంగుఁడు. వైరాగ్యము మొదలగు నాంతరవేషముచేపరిపూర్ణులగువారికి నేనుభృత్యుఁడనయియుందును. నేనుసవిభూతికుఁడనయి వారలయధీనమైయుందును. వారలచిత్తవృత్తికనుగుణముగ నడతును. అట్టివారలకై జన్మరహితుఁడగునేననంతావతారములను జేయుచున్నాఁడను. అవ్యక్తుఁడయి యచింత్యుఁడగునేను నాయంతరంగభక్తులకయి నామరూపములఁ బరిగ్రహించియున్నాఁడను. నాహృదయమును సాధువులును, వారల హృదయములను నేనును ఎఱుఁగుదుమేగాని మాయిరువురిహృదయపరిపాకము జగమున నితరలకెవరికిని వేద్యముకాదు. ఈకల్యాణదాసుఁడు నాసన్నిధినితనపుత్రిక నీబ్రహ్మచారికిచ్చెదననివాగ్దత్తముచేసెను. అట్లుచేయుటనాకుమిగులసమ్మతము. కాన గౌడబ్రాహ్మణుఁడనియోచింపక యితనిపుత్రిక నీబ్రహ్మచారికినిచ్చి త్వరగావివాహముచేయుఁడు. అనినియమించినవారలెల్లరు పరమానందభరితులయి మహాభాగ్యమని భగవదాజ్ఞనుశిరసావహించి యాశ్రితవాత్సల్యైకజలధే నీదాసునికార్యమును నీవేనిర్వహింపవలయునని విన్నవించిరి.

భగవంతునితలంపునెఱిఁగి విశ్వకర్మవచ్చి వివాహమంటపమును నిర్మించెను. కామధేనుకల్పతరువులు సాన్నిధ్యమైసమస్తపదార్థములను నిరవధికముగ నిచ్చుచుండెను. సమస్తదేవతలువచ్చి వివాహకార్యములనునిర్వహించిరి. ఆకాశమునదేవదుందుభులు ఘోషించెను. ఖేచరులు పుష్పవర్షములను గురిపించిరి. అందఱునుగూడి వధూవరులనలంకరించి సాధువాదముతోడ వివాహమహోత్సవమును నెఱవేర్చిరి. బంధుజనులును తక్కినవారలును అనర్ఘ్యవస్త్రాభరణాదులచే పరితృప్తులయి స్వస్థానములకుఁబోయిరి. శ్రీరుక్మిణీకాంతుఁడు తనయాశ్రితవాత్సల్యమును ప్రకటించుచు నిపుడును అచట సాన్నిధ్యముచేసియున్నాఁడు.

శ్రీమధురానాథాయనమః.

## ముప్పదిమూడవయధ్యాయము.

### సూర్‌దాసుచరిత్రము.

శ్రీమధురాపురమున అక్రూరాంశముచే సూర్‌దాసుఁడను భాగవతోత్తముఁడవతరించెను. ఇతఁడుపుట్టంధుఁడయ్యును జ్ఞానచక్షుస్సుచే సదాభగవంతునిదర్శించుచు ననవరతభగవద్ధ్యానముచేయుచు భగవన్నామసంకీర్తనపరుఁడయి శ్రీకృష్ణపరమాత్మవిషయముననేకసాహిత్యములను జేయుచు జ్ఞానభక్తివైరాగ్యసంపన్నుఁడయి పురుషోత్తమవిద్యానిష్ఠుఁడయి తాను జేయుకీర్తనంబుల వినువారికి భక్తివిరక్తులఁగలుగఁజేయుచు కాలక్షేపముచేయుచుండెను. ఇతఁడొకనాఁడు తనకొకనినిసహాయముగఁజేసికొని వానిచేయూది యామూర్తిలోనుండిన భగవత్సన్నిధినిప్రవేశించి సాష్టాంగవందనంబాచరించి భగవంతుని యగ్రభాగంబుననిలిచి భగవంతునిట్లనిస్తుతించెను.

సన్మాత్రరూపివై, యచింత్యమహామాయాయుక్తుఁడయి, సర్వవ్యాపివై, యనేకరూపివై, యేకరూపివైయుండు పరమాత్మకు ననంతవందనములు. అప్రమేయాసకల స్వరూపివైదేవ తాయజ్ఞమున హవిస్సయియుండు నీకునమస్కరించెద. మహాప్రభో విజ్ఞానమునకు సమభూమివై, ప్రకృతికంటె పరుఁడయిననీకు వందనముచేసెద. పంచభూతాత్మవై, యేకాదశేంద్రియాత్మవై, యవ్యక్తాత్మవై, ఆత్మవై, పరమాత్మవైయుండుటచే నీవొకఁడవే యయిదువిధములయియున్నాఁడవు. సకలమయి సకలమున కాత్మవై క్షరములగు సర్వభూతములకును అక్షరమగు నాత్మకును నియామకుఁడయి బ్రహ్మవిష్ణుశివనామములను కల్పనలచేఁ జెప్పఁబడువాఁడవయియుండు భగవంతుఁడా నీవుప్రసన్నుఁడవు కావలయు. అనంతగుణములతోఁగూడినయాత్మవై యానందయుక్తుఁడయినపరమేశ్వరా అనంతనామములతోఁ గూడియుండు నీకునమస్కరించెద. జీవాత్మలవలెకర్మోపాధికమగు దేవమనుష్యాది నామరూపకల్పనలులేక నిత్యమైయుత్తమమై వికారరహితమగుపరబ్రహ్మమునీవే. నామరూపకల్పనలులేక యొకపదార్థమునెఱుఁగుటయసాధ్యముకాన నీవుకృష్ణాచ్యుతానంతవిష్ణ్వాదినామములచే స్తుతింపఁబడుచున్నావు. అజుఁడవై యనంతుఁడయినయోదేవా యీదేవాదికల్పనలతోఁగూడినసమస్త ప్రపంచమునీవే. వికారరహితమగునాత్మయునీవే. ఇట్లుసర్వమును నీవిభూతియయియుండుటచే నీకన్యమెద్దియునులేదు. కాననీవేబ్రహ్మవై, శివుఁడవై, సూర్యుఁడవై, విధాతవై, ధాతవై, యింద్రుఁడవై, వాయువవై, అగ్నివై, వరుణుఁడవై, కుబేరుఁడవయి, యముఁడవై, వేర్వేఱుకార్యములతోఁగూడిన స్వరూపభేదములచే లోకమును రక్షించుచున్నావు. మఱియు సూర్యకిరణరూపివయి ప్రపంచమును సృజించుచున్నావు. కాననీప్రపంచమంతయు నీకు శేషభూతమైయున్నది. సత్ అనుపదముచేచెప్పఁబడు వికారశూన్యమగుపరస్వరూపమై శుద్ధజ్ఞానస్వరూపమై చరాచరముల కధిష్ఠాతయయియుండు నీకనంతవందనములు. ప్రణవప్రతిపాద్యుఁడగు శ్రీవాసుదేవునికి నమస్కరించెద. సంకర్షణునికివందనము. ప్రద్యుమ్నునికి ప్రణామంబాచరించెద. అనిరుద్ధునికభివాదనముచేసెద. ఇట్లుచతుర్వ్యూహరూపియగు నీకునమస్కరించెద. అనియక్రూరునియట్లుస్తుతించి మఱలమాధవునికిట్లనివిన్నవించె. ఓకేశవా నేనీజన్మమున నీవిషయమున నేమియు అపరాధముచేయలేదు. అట్లుండనేను పుట్టంధుఁడనై నీదివ్యమంగళవిగ్రహమును దర్శించుటకు యోగ్యుఁడను కాకయున్నాను. జగదీశా నీయనుగ్రహమును నిగ్రహమనితలఁచుట నాకుస్వరూపహానియగును. నాకిట్టి యవయవవైకల్యమునకు కారణమగు పూర్వజన్మవృత్తాంతము నీయనుగ్రహముచేస్మరణకువచ్చుచున్నది. నేనుకంసునిపనుపున గోకులమునకువచ్చి రామసహితుఁడగునిన్ను రథారూఢుంజేసి మధురానగరమునకుఁ దోడ్కొనిపోవునపుడు గోపికలోపికలులేకవిలపించుచు నొకరితోనొకరు ఇట్లు పలుకసాగిరి. ఓసఖియలారా గోవిందుఁడుమధురకుపోయిన మరలనిచటికెట్లువచ్చును. నగరస్త్రీల మధురాలాపములనెడి యమృతమును పానముచేయునుగదా. అట్లునగరస్త్రీలవిలాసవాక్యములయందులయించిన వానిమనసుగోపికలయందులయింపదు. ఈగోకులమునకు నొకసారవస్తువయియుండిన యీకృష్ణునిచటనుండికొనిపోవు క్రూరదైవము ఈగోపికలకెల్ల నొకకాలమున దృత్యమయ్యెనని తలఁపవలసియున్నది. నగరస్త్రీలవాక్యములు భావగర్భితములయి మందస్మితములోఁగూడియుండును. వారలనడవిలాసములు ఐపలు సౌందరమయియుండును. వారల

యపాంగవీక్షణములు చిత్తాకర్షకములై యుండును. కాననిదిపఱకునట్టివాని నెఱుఁగక గోకులమునవసించుచుండిన కృష్ణుఁడు మధురకుఁబోయిన వెనుక నగరస్త్రీలవిలాసముల నెడిసంకెళ్లచేఁగట్టఁబడును. కాన మరలగోకులమునకువచ్చునని యెట్లుచెప్పవచ్చును. ఇదిగో చూడుఁడు. అక్రూర నామముగలక్రూరునిచేనే మోసగింపఁబడి మనకృష్ణుఁడురథము నెక్కిమధురకుఁబోవుచున్నాఁడు. దయాశూన్యుఁడగునీఘాతుకుఁడు మనమందఱము కృష్ణమోహముచే కరఁగుచున్నారమని యెఱుఁగఁడు కాఁబోలు. ఎఱిఁగియుండిన మనకు నేత్రానందవిషయమగు కృష్ణునిని మఱియొకచోటికేలకొనిపోవును. ఓ చంద్రముఖులారా ఈకృష్ణుఁడుమనమక్కువను ఇంచుకయయినను లెక్కింపక బలరామునితోడ రథము నెక్కిపోవుచున్నాఁడు. వీఁడుమిగుల దయాశూన్యుఁడయియున్నాఁడు. వీనిని పోనీకయడ్డగించుటకు శీఘ్రముగయత్నింపుఁడు. ఓ సుందరాంగులారా మామ మొదలగువారికెదుర నీవిషయము మాటాడఁగూడదని చెప్పవు రేని విరహాగ్నిచే మనముదగ్ధలమైనపిదప నీపెద్దలేమి చేయఁగలరు. నందగోపుఁడు మొదలగువారు తాము నువెంబడించిపోవ యత్నించెదరే కాని యొక్కరయినను గోవిందునిని పోనీకయడ్డగించుటకుయత్నము చేయరయిరి. ఓ చెలియలారా మధురయందలిమందగమనలకు నేఁడు సుప్రభాతమయ్యెను. ఎట్లనిన వారల నేత్రముల నెడిభృంగములు నేఁడుమనకృష్ణునిముఖారవిందమకరందమును పానము చేయును గదా. ఇచటనడ్డగింపఁబడక కృష్ణుని వెంబడించిపోవువారలుమహాపుణ్యవతులగుదురు. ఏలయనిన అట్లు వెంబడించుభాగ్యవతులు వాని సుందరాంగమును వర్ణించుచు తమ దేహములయందు పులకాంకురములు గలుగుచుండ సంతోషింతురుగదా. నేఁడు మధురానగరమువారి నేత్రములు ఈగోపాల చూడామణియొక్క యవయవ సౌష్ఠవమును జూచి మహోత్సవమునను భవించును. మహాభాగ్యవతులగు నానగరస్త్రీలు ఎట్టిమంచికల గనిరో యెఱుఁగము. దానిఫలముగనిరంకుశముగ మనకృష్ణునిఁజూచి కాంతియుక్తలై యానందింతురు. అయ్యో దయలేనిదైవము ఈగోపికాజనులకు నొకమహానిధిని జూపి వెంటనే నేత్రోత్పాటనము చేయుచున్నది. చారుముఖులారా చూడుఁడు. మనయందుకృష్ణునిక్రేమ తక్కువయగుకొలఁదిని మన చేతికంకణములుజాఱిపోవుచున్నవి. ఈయక్రూరుఁడు క్రూర హృదయుఁడు. కానరథమును వేగముగనడపుచున్నాఁడు. హరిమధ్యలారా యిట్లు దుఃఖించుమన్నయందునెవరికి దయకలుగకయుండును. ఏమిచేయుదము. మందగమనలారా కొంతసేపు కృష్ణుఁడుకనఁబడుచుండెను. పిదప వానిరథముమాత్రముదృశ్యమగుచుండెను. ఇపుడా రథచక్రములచేఁగలుగు భూపరాగముగపడుచున్నది. మఱియొకనిమిషమునకునిదియుమఱఁగిపోవును. కృష్ణుఁడుబహుదూరముపోయెను. అనిగోపికలోపికలులేక దుఃఖించుచుండ నేనించుకయయిననుకనికరములేకనిన్ను ఆగోకులము నెల్లదాఁటి తెచ్చితిని. నాటిఫలమును నేఁడనుభవించుచున్నాను. గోపికామనోహరుఁడగునిన్ను ఆగోపికల నేత్రములకు విషయము కాకచేసితిని. కాన నేనీజన్మమున నీదివ్యమంగళవిగ్రహమును సేవించుటకు సాధనములగు నేత్రములులేక పుట్టంధుఁడనయితిని. అనిచెప్పి కన్నీరుమున్నీరుగావగచుచునుండు సూరుదాసునియందత్యంతానురాగముతోఁగూడినవాఁడయి శ్రీవాసుదేవుఁడు నిజభక్తుఁడగు సూరుదాసునికిదృష్టినిచ్చి చతుర్భుజుఁడై నిరతిశయాజ్జ్వల్యకిరీట, రత్నాంచితచూడావతంస, మకరకుండల, గ్రైవేయక, హార, కేయూర, కటక, శ్రీవత్స, కౌస్తుభ, ముక్తాదామ, ధరబం

ధన, పీతాంబర, కాంచీగుణ, నూపురాద్యపరిమితదివ్యభూషణుఁడై శంఖచక్రగదాశార్ఙనందకాది దివ్యాయుధధరుఁడై వైజయంతివనమాలావిభూషితుఁడై స్మయమానముఖాంబుజుఁడై సాక్షాన్మన్మథమన్మథుఁడై సేవయొసంగిన సూరుదాసుఁడు పెన్నిధానంబుఁబొడగన్న పేదవలెనేత్రోత్సవముగ భగవంతునిదర్శించి (త్వమాదిదేవః పురుషః పురాణః। స్త్వమస్యవిశ్వస్య పరంనిధానం। వేత్తాసివేద్యంచపరంచధామ। త్వయాతతంవిశ్వమనంతరూప॥ వాయుర్యమోగ్నిర్వరుణశ్శశాంకః। ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ। నమోనమస్తేస్తుసహస్రకృత్వః। పునశ్చభూయోపినమోనమస్తే॥ నమఃపురస్తాదథపృష్ఠతస్తే। నమోస్తుతేసర్వతయేవసర్వ। అనంతవీర్యామితవిక్రమస్త్వం। సర్వంసమాప్నోషితతోసిసర్వః) ఓభగవంతుఁడా నీవు ఆదిదేవుఁడవు. పురాణపురుషుఁడవు. సమస్తజగత్తునకుపరమాధారభూతుఁడవు. విశ్వవేత్తవు. నీవేముక్తాత్మలచేపొందఁదగిన మోక్షస్థానము. సమస్తజగత్తు నీచేవ్యాపింపఁబడియున్నది. వాయువును, యముఁడును, అగ్నియు, వరుణుఁడును, చంద్రుఁడును, బ్రహ్మయు, బ్రహ్మకు తండ్రియగువిష్ణువునునీవే. నీకువేమాఱునమస్కరించెద. మరలపలుమాఱు నమస్కరించెద. నీకుముందును, వెనుకను, సమస్తదిక్కులయందునునమస్కరించెద. అమితమగుసామర్థ్యపరాక్రమములతోఁగూడిననీవు సమస్తజగములయందునిండి వ్యాపించియుండుటచే నీవేసర్వస్వరూపుఁడవు. అనివిన్నవించి యాశ్రితవాత్సల్యైకజలధే నాకుదృష్టినిచ్చి నీదివ్యమంగళవిగ్రహసేవయొసంగితివి. నీవాత్సల్యమును నేనేమనికొనియాడుదు. నిన్నుఁజూచిననేత్రములతో మఱియొకటినిఁజూడరోయుదును. కాన నీకన్యమగువిషయములనుజూడకుండునట్లు నాదృష్టినుపసంహరించి నీవిశ్వరూపమునసవరతముదర్శించునటుల జ్ఞానచక్షువ్వొసెసంగుము. ఈవరముతప్ప నేనన్యమును వేఁడను. అనివిన్నవించునిజభక్తుఁడయిన సూరుదాసుని యంతరంగశుద్ధికి భగవంతుఁడెంతయుమెచ్చి యతఁడుకోరినట్లుచేసెను. సూరుదాసుఁడు ఎడతెగక హరిసంకీర్తనముచేయుచు నిరంతరభగవద్ధ్యానపరుఁడయియుండెను.

ఇట్లుండ అవంతికాపురిరాజు అనేకపాఠకులను తనచెంతఁజేర్చుకొని పోషించుచుండెను. అందొకవిద్వాంసుఁడు మహావినోదముగ కఠినశిలలుకరఁగునట్లు పాడుచుండును. అతనియందురాజునకు సంతోషమున్మస్తకమయియోయిగాయకా నీయట్లుమనోహరముగపాడువారిని నేనిదివఱకుకనివినియెఱుంగనని ప్రశంసచేసెను. అదివినియాగాయకుఁడు ఓరాజా మధురాపురమున సూర్దాసుఁడనునొకయంధకుఁడు పరమభాగవతోత్తముఁడయి సాక్షాన్నారదుఁడనఁదగియనవరతము భగవంతునిని ధ్యానముచేయుచున్నాఁడు. ఆగానరసమును నేనేమనికొనియాడుదును. అతఁడుగానముచేయనారంభించినగంధర్వులును లజ్జింతురు. సాక్షాద్భగవంతుఁడుశిరఃకంపముచేయును. అనిచెప్పినవినిరాజుఆశ్చర్యపడితన యంతరంగపరికరమునుబంపి సూర్దాసునిని ప్రార్థనాపూర్వకముగరప్పించి యతఁడుతనకుదృగ్గోచరుఁడయినంతటసపరివారముగ నామహానుభావునికి నభ్యుత్థానవందనములుచేసి పూజ్యాసనమునఁగూర్చుండఁబెట్టి భాగవతోత్తమా నీవుచేయుభగవత్కీర్తనను వినవలయునని నేనునునిచటకూడియుండువారును అపేక్షించెదము. మామనోరథమునుసఫలముచేయవలయునని ప్రార్థించిన నతఁడువల్లెయని హరికీర్తనముచేయనారంభించెను. అపుడువిఘ్నే

శ్వరుఁడును సరస్వతియును ప్రత్యక్షమయి తాళమునువీణయుఁగయికొని సూరుదాసుని కీర్తనలకనుగుణముగావాయించుచున తనికిరుప్రక్కలనునిలిచిరి. రంభాదిదేవాంగనలు నతని యగ్రభాగంబుననాకీర్తనలయందలి భావమునను సరించియభినయము చేయసాగిరి. గంధర్వకింపురుషాదులువచ్చివిస్మితులయి కీర్తనలనుశ్రవణముచేయుచుండిరి. పరమయోగుల వాఙ్మానసములకునపరిచ్ఛేద్యుఁడగుభగవంతుఁడు సాక్షాత్కరించి నృత్యముచేయసాగెను. రాజు మొదలగుసభికులెల్లరును మైమఱచి యచంచలులయి స్తంభాకారముగనుండిరి. ఇట్లొక ఘాముపర్యంతము సూర్ దాసుఁడు శ్రీకృష్ణలీలలనువర్ణించుచుండ శ్రవణముచేసియెల్లరును పరమభక్తియుక్తులయి భగవచ్చరణారవిందంబులయందు లయించినమనసులుకలవారలై యానందపరవశులయి మౌనముద్రనువహించిచిత్రప్రతిమలవలెనుండిరి. మఱికొంతసేపటికి భగవంతుఁడును తక్కిన దేవతలును అదృశ్యులయిరి. రాజు సూర్ దాసునిశరణుఁజెంది మహాత్మా నీవిచటవసించి నాకు భగవదనుగ్రహముకలుగునట్లు భక్తివిరక్తులనుపదేశించుచు నీకీర్తనలచే ఈదేశస్థులనుభగవద్భక్తులగునట్లుకటాక్షింపవలయునని ప్రార్థించినన తఁడురాజు ప్రార్థననంగీకరించి యచటవాసముచేయుచుండెను.

ఇట్లుండ రాజస్త్రీలు రాజునుజూచి ప్రాణనాయకా నీయాచార్యుఁడగుసూర్ దాసుఁడొకదినముమాయంతఃపురమునకువచ్చికొంతసేపుభగవంతునిఁగీర్తించి మమ్ముఁగృతార్థలను జేయవలయునని మనోరథించెదమనివిన్నవించినరాజు తనపత్నులప్రార్థనను సూర్ దాసునికివిన్నవించి యొడంబఱిచి వారినితోడ్కొని యంతఃపురమునకువచ్చి యొకపూజ్యాసనమునఁగూర్చుండఁబెట్టిననాభక్తాగ్రగణ్యుఁడు అతిమనోహరముగ భగవంతునిని తన హృత్పద్మంబున నెలకొల్పి కీర్తనముచేయ నారంభించెను. ఇతఁడంధుఁడు గాన రాజపత్నులుశంకలేక యతనికెదుటనిలుచుండివినుచుండిరి. ఇట్లుభగవత్కీర్తనజరుగుచుండుకాలమున శ్రీసత్యభామయతనియగ్రభాగమున సాన్నిధ్యమైనిలిచెను. అపుడు భగవత్కటాక్షముచే సూర్ దాసునికిదృష్టికలిగి, యాదేవినిదర్శించి యోతల్లీ నీవేలయిచటవచ్చినిలిచెదవనియడిగెను. ఈయద్భుతమునుజూచి రాజస్త్రీలు ఈమహాత్ముఁడంధుఁడనితలఁచి మనమునమునశంకలేకయి తనిసన్నిధినివర్తించితిమి. ఇతఁడుయాదృచ్ఛికముగ సాక్షాత్కరించినయీదివ్యాంగననుదృష్టించి మాటాడుచున్నాఁడు అనిచెప్పి లజ్జావిశిష్టలయి తెరచాటునకొదిఁగియుండిరి. అపుడు దేవాధిదేవుఁడగు శ్రీకృష్ణపరమాత్మ ప్రత్యక్షమై సూర్ దాసునికిని, సత్యభామకుసుదర్శనమునిచ్చి వారిరువురినితనదివ్యమంగళవిగ్రహమునందు ఐక్యముచేసికొనియదృశ్యుఁడయ్యెను. ఇందుచేజ్ఞానభక్తివైరాగ్యసంపన్నుఁడై తనాశ్రయించినవానిని భగవంతుఁడు నిత్యానపాయినియగుశ్రీమహాలక్ష్మితోసమముగ నంగీకరించుననియు, భగవంతునివిషయమున అచిద్వత్పరతంత్రుఁడయియుండు పరమభాగవతుఁడు భగవంతునిదివ్యమహిషికోటియందంతర్భూతుఁడగుననియు, అట్టియుత్తముని భగవంతుఁడు సవిగ్రహముగనంగీకరించుననియుభావము. ఈసూర్ దాసునికీర్తనలను శ్రద్ధతోశ్రవణముచేసినవారెల్లరును భక్తివిరక్తులతోఁగూడి ముక్తులైరి.

అక్రూరవరదాయనమః.

## ముప్పదినాలవయధ్యాయము.

### సేనానావిచరిత్రము.

అవంతిపురమున సేనానావియనునొకమంగలవాఁడు భగవత్కటాక్షముచే జ్ఞానభక్తివైరాగ్యసంపన్నుఁడయి, శ్రీభరతయోగివలె ననవరతధ్యాననిష్ఠుఁడయి, స్వవర్ణోచితవృత్తిచే దేహయాత్రగడపుకొనుచు (వరంహుతవహజ్వాలా । పంజరాంతర్వ్యవస్థితిః । నశౌరిచింతావిముఖ । జనసంవాసవైశసం) అనురీతిని శౌరిచింతావిముఖులగుజనులసహవాసమునకన్న అగ్నిజ్వాలాపంజరమునవసించుటశ్రేయమనితలఁచి సంసారులసాంగత్యసల్లాపములనువర్జించి మితాహారముతోఁగూడినవాఁడై కాలమునుగడపుచుండెను. (శ్రేయాన్ స్వధర్మోవిగుణః । పరధర్మాత్స్వనుష్ఠితాత్ । స్వధర్మేనిధనంశ్రేయః । పరధర్మోభయావహః) అనఁగా యథావిధిగఁజేయఁబడుపరధర్మమునకన్న గుణహీనమగుస్వధర్మము శ్రేష్ఠము. స్వధర్మముననుండి మరణమునొందుటశ్రేయము. పరధర్మమునరకావహమగును. అని భగవద్గీతయందు భగవంతుఁడుచెప్పియుండుటచే బుద్ధిమంతుఁడగు సేనానావిస్వధర్మనిష్ఠుఁడయి, యథాలాభసంతుష్టుఁడయి కాలక్షేపమును జేయుచుండెను. (కిమప్యత్రాభిజాయంతే । యోగినస్సర్వయోనిషు) అనురీతిని ఈమహానుభావుఁడుహీనకులమునందవతరించియు (శమోదమతపశ్శౌచం । క్షాంత్యార్జవవిరక్తతా । జ్ఞానవిజ్ఞానసంతోషః । సత్యాస్తిక్యేద్విషడ్గుణాః) అనిచెప్పఁబడియుండుపండ్రెండుగుణములతోఁగూడినవాఁడయి భగవంతునికి ప్రియతముఁడయియుండెను. ఇతఁడుకామక్రోధలోభమోహమదమాత్సర్యములనెడి యరిషడ్వర్గమును జయించియనాదికాలముగ తనహృదయప్రదేశమునవసించుచుండినయహంకారమమకారములనెడి చండాలులిరువురనుదూరముగవెళ్లఁగొట్టి లక్ష్మీకాంతునినితనహృదయాంబుజమున సుస్థిరముగఁబ్రతిష్ఠించి లోకమునుమఱచి యనవరతము మానసికారాధనముచే భగవంతునిసంతోషింపించుచు తానును ఆనందించుచుండెను.

ఒకనాఁడు ఆదేశాధీశుఁడగుతురుష్కప్రభువు క్షౌరముచేసికొనవలయునని సేనానావినిపిలిపించెను. అట్టిసమయమున నాభాగవతోత్తముఁడు శాంతిజలమునస్నానముచేసి, దాంతియనుధౌతవస్త్రమునుధరించి, పరమవైరాగ్యమనువైష్ణవాలంకారముచేసికొని, నవద్వారములతోఁగూడినశరీరనగరమున హృదయాలయమున జ్ఞానమనుగోమయముచే స్థలశుద్ధిచేసి, విజ్ఞానమనురంగవల్లిచేనలంకరించి, యార్జవమనురంభాస్తంభములనునాటి, క్షాంతియనువితానంబునుగట్టి, సత్యపీఠంబున లక్ష్మీకాంతునిఁబ్రతిష్ఠించి, భూతదయయనుధూపమును, దీనజనపోషణమనుదీపమును, సర్వభూతసమభావమనుతాళవృంతమును, అద్వేషమను చామరమును, శ్రవణమనననిధిధ్యాసములనునర్ఘ్యపాద్యాచమనములను, జ్ఞానానందమయమై జ్ఞానగుణకమయి పరమాత్మశేషమయియుండు పరిశుద్ధాత్మయను మహానైవేద్యమును, అకించిన్యమనుతాంబూలమును, అనన్యగతియను నీరాజనమును సమర్పించి తన్నుమఱచి తన్మయుఁడయి భగవధ్యానపరుఁడయియుండెను.

ఇతఁడుప్రపంచమునుమఱచి భగవధ్యానమునలయించియుండినందున రాజసేవకులు తన్నుపిలుచుటనెఱుఁగకుండెను. ఇతనిభావమునెఱిఁగి యితనియింటనుండినవారు సేనా

నావియింటలేఁడని యాభటులకుచెప్పిపంపిరి. మీఁదమీఁద ననేకదూతలువచ్చి పిలిచియు సేనానావియింటలేఁడనియే చెప్పుచుండిరి. ఇట్లుండ (జ్ఞాతిశ్చేదనలేనకిం) అనఁగానొకనికి జ్ఞాతియుండిన నిప్పుతోఁ బ్రయోజనమేమి. అనునీతివాక్యము సత్యముగ ఆసేనానావి జ్ఞాతియగువాఁడు రాజసన్నిధికిఁబోయి యోరాజా సేనానావియింటనేయున్నాఁడు. దేవరయాజ్ఞకు వెఱవక యింటలేఁడని చెప్పిపంపెను. అనివిన్నవించెను. అదివిని రాజు ఆగ్రహగ్రస్తచిత్తుఁడై కొందఱుభటులనుపిలిచి సేనానావినిపట్టికట్టి సముద్రమునఁబడవేయుఁడని యాజ్ఞాపించెను. ఆసమయమున భక్తవత్సలుఁడయి దీనదయాళుఁడయి యాపద్బాంధవుఁడగు శ్రీమత్పండరినాథుఁడు గ్రక్కున సేనానావివేషమునుధరించి యడపమును జేఁబూనియతి వినీతుఁడయి రాజసన్నిధికివచ్చి మోకాళ్లమీఁదగూర్చుండి వందనము (సలాము) చేసెను. అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుఁడై, పరమయోగి వాఙ్మనసాపరిచ్ఛేద్యుఁడై, దేవాధిదేవుఁడై, సర్వలోకశరణ్యుఁడై, సర్వభూతహృదయాంబుజవర్తియై, కర్మసాక్షియై, కర్మఫలప్రదుఁడై, ముక్తినాథుఁడై, లక్ష్మీనాయకుఁడైన శ్రీపుండరీకవరదుఁడు తనయాశ్రితపారతంత్ర్యమును ప్రకటించుటకయి సేనానావివేషమునుధరించియడపమునుదగిలించుకొని తురుష్కప్రభువునకు క్షౌరముచేయ నుద్యుక్తుఁడయ్యెను. మహిషియుచ్ఛిష్టమును అపేక్షించు కాముకునివలెనాశ్రితవిధేయుఁడగుభక్తవత్సలుఁడు సేనానావియొక్క కులధర్మమగు నీచవృత్తిని తాను జేయవలయునని యాసపడెను గాఁబోలు. విఠలునికన్ని వేషములు తగియుండును. ఇట్లు వ్యక్తుఁడయినవానిఁజూచినతోడనే రాజునకుకోపము చల్లారెను. సూర్యోదయమున నంధకారము తలచూపునా? మఱియు చంద్రోదయమున కువలయములకానందముకలుగునట్లు ఈమహాపురుషునిఁజూచినంతట రాజునకును, అచటనుండినవారికిని నిర్వ్యాజముగ నానందరసముప్పొంగెను. ఈక్షౌరకవేషధారి రాజునియమనమును జెంది రాజునకు క్షౌరముచేయప్రారంభించెను. ఈవేషధారి క్షౌరముచేయుకుశలత రాజునకు ఆనందజనకముయి యుండెను. ఇట్లు క్షౌరముముగిసినపిదప వాడుకప్రకారముపరిచారకులు సుగంధతైలమును నొకస్వర్ణపాత్రమునఁ దెచ్చియుంచిరి. క్షౌరకవేషధారియాతైలమును రాజుకురులకు రాచుచుండెను. అపుడు ఆక్షౌరకునికరస్పర్శముచే రాజునకుఁగలహేయగుణములునశించి శమదమాద్యాత్మగుణములంకురించెను. సుగంధతైలమున క్షౌరకుని ప్రతిబింబము చతుర్భుజములతోడను, కిరీటమకరకుండలకేయూరాది దివ్యభూషణములతోడను, శ్రీవత్సకౌస్తుభములతోడను, వైజయంతివనమాలికలతోడను, నఖిలజగజ్జననియగు శ్రీమహాలక్ష్మీకాలయంబగువిశాలవక్షస్థలంబుతోడను, శంఖచక్రాదిదివ్యాయుధములతోడను, దయాపూరితములై యాకర్ణాంతములగునేత్రములతోడను, నిర్వ్యాజమందస్మితముతోఁగూడినముఖాంబుజముతోడను, వరదాభయహస్తంబులతోడను రాజునకు కానఁబడెను. అపుడురాజు ఆప్రతిబింబమునుదర్శించినపిమ్మట బ్రహ్మానందమును జెంది తద్గతమగుమనసుకలవాఁడై యచలుఁడై యుండెను. చాలప్రొద్దెక్కినందున నంతరంగపరివారము స్నానముచేయవలయునని రాజునకుస్మరింపించిరి. రాజులేచి సేనానావినిజూచి నీయట్టిచతురుఁడు లోకంబున లేఁడు. నీవిశ్లేషము నాకు దుస్సహమైయున్నది. నేను స్నానముచేసిభుజించివచ్చెద. ఇంతలో నీవును

నీయింటికిపోయిభుజించిరమ్ము అనిచెప్పి దోసెడువరాలు అతనికొంగునపోసిపంపెను. భగ
వంతుఁడు నేనానావియింటికివచ్చి రాజిచ్చినవరాలను అతనియడపములో పదిలముచేసి
యంతర్థానుఁడయ్యెను. రాజుతైలపాత్రమున తనకగపడిన భగవద్బింబమును భక్తియోగ
నిష్ఠునివలెనిరంతరధ్యానముచేయుచు స్నానభోజనకార్యంబులను సత్వరముగాఁదీర్చుకొని
యాస్థానమునకువచ్చి యంతరంగపరివారమునుజూచి నేనానావియెచటనున్నాఁడు. ఇట్టి
సత్పురుషుఁడెందయినఁగలఁడా? ఆమహానుభావునిసచ్చరిత్రమత్యద్భుతమయి, ముక్తిమార్గ
మయియున్నది. అతనివిశ్లేషమునాకతిదుస్సహమైయున్నది. కాన నాపరమసాధువును
శీఘ్రముగఁదోడితెండనినియమించెను. రాజపరిచారకులు శీఘ్రముగపాఱివచ్చి నేనానావికి
రాజాజ్ఞ యెఱుకచేసిరి. ఇంతలో నేనానావితానుభగవంతునికిఁజేయుమానసికారాధనమును
ముగించి ప్రపంచజ్ఞానమునుమనసునకుఁదెచ్చుకొని రాజభటులు పెక్కుమాఱులుతన్నుపిలి
చిపోయిరనివిని తనమనంబున నిట్లనిచింతించె. నేనింతసేపుమానసికారాధనానిష్ఠుఁడనై
ప్రపంచమునుమఱచియుంటిని. పలుమాఱుపిలిపించియుపోనందున రాజునకు నాపైకోపము
కలిగియుండును. అయిననేమి (అంభోజినీవనవిహారవిలాసమేవ। హంసస్యహంతినితరాం
కుపితోవిధాతా। నత్వస్యదుగ్ధజలభేదవిధౌప్రసిద్ధాం। వైదగ్ధ్యకీర్తిమపహర్తుమసౌసమర్థః)
బ్రహ్మకుతనవాహనమగు హంసపైకోపముకలిగిన పద్మవనవిహారమునుమాన్పవచ్చునే కాని పా
లునునీరును వేఱుపఱుచునట్టి యాహంసయొక్కనైజస్వభావమునుపోఁగొట్టుటకు సమర్థుఁడు
కాఁడుకదా? అట్లు ఈరాజునకు నాయందుకోపముకలిగిన నాజీవనమునకుహానికలుగఁజేయ
వచ్చునే కాని మదీయమగుహృద్గుహాయందు గుప్తముచేయఁబడియుండెడునమూల్యమయి,
నిస్సమాభ్యధికమై, సకలలోకసంజీవనమై, యఖిలజగదుదయకారణబీజమై, నాయాపద్ధ
నమైయుండు పరమాత్మనిక్షేపమునునపహరించుటకువీఁడెట్లుశక్తుఁడగును. నాయందును ఈ
రాజునందును సర్వమునందునునను ప్రవేశించియుండుపరమాత్మయొక్కఁడైయుండ రాజునకు
నాపైకోపముకలుగునని నేనేలశంకింపవలయు. సూత్రధారికితెలియక బొమ్మలునాట్యమా
డునా? నన్నుతనవానిగనేలుకొని నాపూజనంగీకరించెడి పాండురంగఁడను సూత్రధారి
లీలలకు బ్రహ్మాదిపిపీలికాంతమగుసమస్తప్రాణులుబొమ్మలయియుండ రాజుమాత్రము అందు
కు వేఱైనవాఁడా? మఱియు కవచధారియగుపురుషునివలె శ్రీమత్పాండురంగఁడు సమస్త
చేతనాచేతనములను కవచముగధరించియుండుటచే నేనును ఈరాజును ఆపాండురంగని
స్వరూపులైయున్నారము. కాన నేనేలనాజీవితేశుఁడగు శ్రీమత్పాండురంగని సన్నిధాన
మును రాజసభయనిభ్రమించితిని. విక్రమార్కునిసింహాసనముమీఁదఁగూర్చుండెడి పరమలు
బ్ధుఁడుపరమోదారియగునట్లు కర్మభూమియందుజనించియుండునాకు ఇట్టిచిత్తకాలుష్య
ముకలిగెను. అనికొంతచింతించి భగవత్కటాక్షలబ్ధమగు జ్ఞానదీపముచే భేదజ్ఞానమనుతిమి
రమునుపాఱఁదోలి యడపమునుగైకొని యిల్లువిడిచిబయలుదేరి (అనంతవైకుంఠముకుంద
కృష్ణ। గోవిందదామోదరమాధవేతి। వక్తుంసమర్థోపినవక్తికశ్చిత్। అహోజనానాంవ్యస
నాభిముఖ్యం) అనఁగా అనంతా, వైకుంఠా, ముకుందా, కృష్ణా, గోవిందా, దామోదరా,
మాధవాయనిపలుకుటకు సమర్థులయ్యును నొక్కఁడైన నాభగవన్నామములను నుచ్చరిం
చుటలేదు. అయ్యో యీజనులకు సాంసారికవ్యసనమే ముఖ్యమైయున్నది. అని పరోప

దేశరూపముగ భగవన్నామసంకీర్తనముచేయుచు పోయి రాజద్వారమునఁబ్రవేశించి రాజున కెదుటనిలువఁగా రాజు సూర్యునిఁజూచినకమలమువలె, చంద్రునిఁజూచిన కుముదమువలె, మేఘమునుజూచిన చాతకమువలె, కామినినిఁజూచిన కాముకునివలె నామోదించి యభ్యుత్థానముచేసి యతని పాదద్వయంబున తనశిరంబును జేర్చి లేచినిలుచుండి యోమహాత్మా నేఁడు నాకు సుప్రభాతమయ్యెను. నిన్నిదివఱకు సామాన్యమనుష్యుఁడనితలఁచియుంటని. నీవు నాకు క్షౌరముచేసినపుడు తైలమునఁజూపిననీరూపము నాకు చిత్తాకర్షకమైయున్నది. ఇదిగో నేను యాచించెద. నాకు మఱియొకతూరియట్టిదర్శనము నొసంగవలయునని ప్రార్థించి పరిచారకులచే స్వర్ణపాత్రమున సుగంధతైలమునురప్పించి యతని కెదుటనునిచి ఆతైలమునఁజూడఁగా మునుపటివలెభగవంతునిదివ్యరూపముకనఁబడదయ్యె. సేనానావి యీయద్భుతమును విని పులకాంకితశరీరుఁడై భగవంతునిదివ్యలీలలనుస్మరించిమనసుకరఁగుచుండ దయాసింధో, దీనబంధో, నిరవధికవాత్సల్యజలధే, యపారకరుణానిధే, పుండరీకవరదా, లక్ష్మీకాంతా, మహానీచుఁడనగు నానిమిత్తమున నిట్టినీచకార్యమును చేసితివిగదా? అనవరతము సంకల్పమాత్రమున సృష్టిస్థితిసంహారములను జేయుచుండునీవు నీయాశ్రితవాత్సల్యమును ప్రకటింపఁదలఁచి యడపమునుగైకొని క్షౌరకృత్యమును జేయ నాసపడినది వింతయైయున్నది. నేను మహాపాపులలో నగ్రగణ్యుఁడనుగాన నాకై నీవీనీచవేషమునుధరించి నీచకృత్యమునుచేయవలసివచ్చెనని చెప్పుచు నవశుఁడై భూమిపైఁబడియేడ్చుచుండ రాజు అద్భుతచిత్తుఁడయిగద్గదకంఠుఁడై యానందబాష్పములతోఁగూడి ఓపుణ్యరాశీనీనిమిత్తమున నాకు బ్రహ్మరుద్రేంద్రసనకాదులధ్యానమునకును నత్యంతదూరమగు భగవంతునిదర్శనము సులభముగలభించెను. అని చెప్పుచు నతనికుపచారముచేయుచుండెను. సేనానావి కొంతతెలివిని జెంది యోరాజా నీభాగ్యమేభాగ్యము. నీవువసించినగర్భముయొక్క యోగమేయోగము. నీపితరుల పుణ్యమే పుణ్యము. శ్రీకృష్ణపరమాత్మను సాక్షాత్కరించిననిన్నుదర్శించెద. అని చెప్పి యడపముభారమైయుండుటకు కారణముతెలియక శోధింపఁగా నదివరాలచేనిండింపఁబడియుండెను: దానిఁజూచి సేనానావి లక్ష్మీనాథా, యనాథనాథా, పండరినాథా, మన్నాథా అనంతకోటి బ్రహ్మాండసృష్టిని సంకల్పమాత్రముచే చేయునీవు క్షౌరముచేసి సంపాదించిన వేతనమాయిది? అని చెప్పి యాద్రవ్యమును ఈశ్వరసంతానమగు దీనజనులకిచ్చి సంతోషించెను. రాజు నాఁడు మొదలు పరమవిరక్తుఁడై పరమభాగవతుఁడగు సేనానావికి ప్రియశిష్యుఁడైయుండెను. సేనానావియు రాజును శరీరమును నీడయునువలె ననవరతముకూడియుండి నిరంతర భగవధ్యానముచేయుచుండిరి.

విచిత్రచరిత్రాయనమః.

## ముప్పదియయిదవయధ్యాయము.

### సాత్త్వికరాజచరిత్రము.

పరమపావనక్షేత్రమగు శ్రీజగన్నాథమున సాత్త్వికరాజనుభాగవతోత్తముఁడు శ్రీజగన్నాథునిచరణారవిందములయందలి యచంచలభక్తితోఁగూడినవాఁడై శ్రీకృష్ణపరమాత్మను

రెండుచేతులతో ఆప్రసాదమునుగొని స్వీకరించెను. భగవత్సన్నిధానమునందుంచఁబడినహ స్తము దమనమైయుండెను. ఈయాశ్చర్యమునుజూచి యద్భుతాయత్తచిత్తులై యర్చకు లాదమనమునెత్తియందుకొంత శ్రీకృష్ణ,బలరామ,సుభద్ర శ్రీపాదంబులనర్పించి మఱికొంత నందవనంబుననిక్షేపించిరి. రాజుమునుపటికన్న సుగుణములతిశయించి పరమవిరక్తుఁడయి, సంసారమునునిస్సారమనితలఁచి, కంసారిననవరతముభజించుచు (ధ్యాయంతియేవిష్ణుమనం తమవ్యయం । హృత్పద్మమధ్యేసతతంవ్యవస్థితం । సమాహితానాంసతతాభయప్రదం । తే యాంతిసిద్ధింపరమాంచవైష్ణవీం) అనురీతిననవరతము హృత్పద్మమునవసించి యాశ్రితులక భయమిచ్చునవ్యయుఁడగు శ్రీమదనంతునిని సంతతధ్యానముచేయుచుండి, పరమవైష్ణవసిద్ధిని బొందెను.

శ్రీనీలాచలనివాసాయనమః.

## కర్మాబాయిచరిత్రము.

శ్రీజగన్నాథక్షేత్రమున కర్మాబాయియనునారీశిరోమణి గర్భవతియయియుండున పుడు ఆమెభర్త పరలోకగతుఁడయ్యెను. ఈసుదతి భర్తృవియోగమునకెంతయువగచి దుస్సహమగు నాదుఃఖమునుసహించుకొని పుత్రోదయమును నిరీక్షించుచుండ శ్రీజగన్నా థునికటాక్షముచే ఆయువతిగర్భమునందొకపుత్రుఁడుదయించెను. ఆసాధ్వి తనపుత్రునికి యథాకాలమున చౌలోపనయనవేదాధ్యయనములను జరపించి సకలవిద్యలనునేర్పి పది యాఱవయేటనొకచక్కనికన్యకను పాణిగ్రహణముచేయించెను. కొంతకాలమునకు వెనుక కర్మాబాయికోడలు గర్భవతియయి యొకసుపుత్రునిఁగాంచెను. ఆశిశువుకలిగినకొన్నా ళ్లకు కర్మాబాయిపుత్రుఁడు దేహవియోగమును జెందెను. కర్మాబాయి దుస్సహమగుపుత్ర వియోగమును సహించుకొని పౌత్రునిలాలనచేయుచు కొంతశోకమునుమానియుండెను. ఇ ట్లుండనాకస్మికముగా ఆపౌత్రుఁడును మృతుఁడయ్యెను. అపుడు కర్మాబాయి నాప్రారబ్ధ మెట్టిదోయెఱుఁగను. మొదటభర్తృవియోగమును, పిదపపుత్రవియోగమును, తదనంత రము పౌత్రవియోగమును జెంది యేకాకినయితిని. ఈదుఃఖసముద్రమునెట్లుదాఁటుదునని ఖేదించుచు చింతాక్రాంతయై కాలమునుగడపుచుండ ఈమెభాగ్యవశమున జగన్నాథయా త్రవచ్చినయొకభాగవతుఁడు ఈమెయింటవిడిదిచేసెను. కర్మాబాయి యహోరాత్రమును దుఃఖించుచుండుటనుజూచినీదుఃఖమునకుఁగారణమేమనియాభాగవతుఁడడిగినకర్మాబాయి తనచరిత్రమును సవిస్తరముగనతనికి విన్నవించెను. అదివినియాభాగవతుఁడు ఓబాలఁతీ సంసారమున్ననించుకయైనను, సుఖముకలదా? ఈచింతనువిడువుము. నీకుసుమార్గమునుపదే శించెదనువినుము. నావచనములనసత్యములనితలఁపకుము. నేనుద్రవ్యకాంక్షచేఁగాని, భ్ర మచేఁగాని ఉపదేశింపవచ్చినవాఁడనుగాను. కాననావలుకులను నమ్ముము. పురుషుఁడు జనించినతోడనే బాల్యమును, పిదపయౌవనమును, అంతకుమీఁదననివార్యమగువార్ధక్యమును జెంది పిమ్మటమృత్యువశుఁడగును. ప్రాణులయందివియన్నియునుగలుగుట నాకును, నీకును ప్రత్యక్షదృశ్యమయియున్నదిగదా? ఇంతియకాదు. మరణమును జెందినవానికి మరల జన్మముకలుగుట నిశ్చయము. ఈయర్థమునకు శ్రుతి, స్మృత్యాదిశాస్త్రములు ప్రమాణము

లగును. ఈదేహముకలుగుటకు పూర్వజన్మమునఁ జేయఁబడిన పాపపుణ్యములతోఁగూడిన స్థిరమగునాత్మ తప్ప వేఱు కారణమగపడనందున శుక్లశోణితములకునధిష్ఠాతయగునాత్మయే ముఖ్యకారణమగును. కాన పురుషునికి గర్భవాసము మొదలు శరీరావసానపర్యంతము సర్వావస్థలయందును దుఃఖమేకలుగుచున్నదని తలంపుము. అన్నపానములచే నాఁకలిదప్పులు తీఱుటయు, ఆయాయుపాయములచే శీతోష్ణాద్యుపద్రవములుమానుటయు, సుఖమనితలఁచుట యవివేకము. ఎట్లనిన అన్నపానాదులను సంపాదించుటకై చేయుప్రయత్నములచేఁగలుగుదుఃఖములు చెప్పఁదరమా? ఈయన్నాదులేయజీర్ణములగునపు డెంతదుఃఖహేతువగుచున్నది. దీనికిదృష్టాంతమునుజూడుము. వాతదోషముచే స్తంభించియుండు నంగములనుగలవారలయి, శ్రమపడుచు దేహసౌఖ్యమునుగోరువారలకు శరీరమునుగుద్దుటయు, నలుపుటయు, సుఖమైయుండును. కామమోహాంధులగుజనులకు ప్రణయకలహమునందు కోపించినకామినియొక్క చరణతాడనము సుఖముగాఁదోఁచును. ఇట్లుదుఃఖహేతువులయందు సుఖభ్రాంతికలిగియుండుటనుజూచితివే? ఈతీరున మాంస, శ్లేష్మ, మల, మూత్రాదిమయమగు దేహమున సౌందర్య, సౌకుమార్య, సౌరభ్య, కాంత్యాదిగుణములుకలవనితలఁచుట భ్రాంతియకాక వేఱుకాదు. రక్త, మాంస, శ్లేష్మ, మల, మూత్ర, మజ్జా, స్థి, స్నాయుసముదాయమగుదేహమున ప్రీతిచేయువాఁడు నరకమునందును ప్రీతియుంచవచ్చును. చలిచేనగ్నియు, దాహముచే జలమును, ఆఁకలిచేనన్నమును సుఖమనితోఁచుచున్నది. శైత్యదాహక్షుత్తులులేనపుడగ్నిజలాన్నములు దుఃఖహేతువులయియుండును. పురుషుఁడెంతెంత ధనధాన్యరత్నాదులను పరిగ్రహించునోయంతయు దుఃఖమనితలంపవలయు. మనుజుఁడు మనఃప్రియములగు పుత్ర, మిత్ర, కళత్రాదిసంబంధముల నెంతసంపాదించునో యంతయువానిహృదయమునకు శంకువులయియుండును. పురుషుఁడెంతదూరముననుండినను వానిహృదయముననుండు ధనధాన్యరత్నాదులునాశమును, చోరా, గ్ని, భయమును లేకస్థిరముగ బాధించుచుండును. గృహమునచోరాదిభయము లేకుండినను హృదయమునద్రవ్యమునందలిప్రేమచేనవికలుగుచుండును. మఱియు జన్మించునపుడనుభవించునంతదుఃఖము మరణమునందునుగలుగును. పిదప యమయాతనలయందును, మరలగర్భప్రవేశమునందును మహాదుఃఖమేకలుగును. కాననెందును సుఖములేదు. అట్లగుటచే జగమంతయు దుఃఖమయమైయున్నది. ఇట్లు సకలదుఃఖములకువాసస్థానమగుసంసారసాగరమును శ్రీమన్నారాయణుఁడొక్కఁడే దాటించువాఁడు. నీకుసత్యమును జెప్పితిని. నేనువృద్ధురాలనగుటచే ఆజగదీశునారాధించుసామర్థ్యము నాకులేదనియొకవేళ చెప్పుదువేమో బాల్య, యౌవన, జరా, మరణాద్య, వస్థలు దేహమునకేకాని యాత్మకులేవు. శరీరమున ఆత్మ జననమరణాదిరహితమయి, శాశ్వతమయియున్నది. లోకమున పురుషుఁడు బాల్యముగడచినపిదప యౌవనమున హితముచేసికొనియెదననియు, యౌవనమును జెందియుండునపుడు వార్ధక్యమున శ్రేయమగుజ్ఞానమును సంపాదించెదననియు తలఁచును. పిదపవార్ధక్యముసంభవించి యింద్రియములుబలహీనములయినపుడికఁ నేనేమిచేయుదును. దృఢగాత్రుఁడనయియుండినపుడే యాత్మకు హితమును జేయక మూఢుఁడనయితినని శోకించును. ఇట్లుచేయుటయేగాక దురాచారమోహితుఁడయి యొకప్పుడును శ్రేయోమార్గమునకభిముఖుఁడు కానేరఁడు. ఎట్లనిన నానావిధ క్రీడావిశేషములచే

బాల్యమును, చందన, కుసుమ, వనితా, దిభోగపరవశతచే యౌవనమును, అశక్తిచే వార్థక్యమునుగడపుచు, అజ్ఞానులు తమయాయువును వ్యర్థముచేసెదరు. గంగాప్రవాహమునందుండినను చాకలవాఁడు దాహముకలిగినపుడు నీరుద్రాగకయీవస్త్రమునుగుంజికానిమ్ము. ఈవస్త్రమునుగుంజికానిమ్ము అనికాలమునుబోఁగొట్టునట్టును, జాలరి యీమత్స్యమును బట్టికానిమ్ము. ఈమత్స్యమునుబట్టికానిమ్ము అనిప్రొద్దుగడపునట్లును, వెనుకటికాలమును దలఁచి ముందుకాలమునువ్యర్థముచేయఁగూడదు. బాల్య, యౌవన, జరా,మరణావ్య, వస్థలు శరీరమునకేకాని యాత్మకులేవనితలఁచి వివేకయుగునీవాత్మయుజ్జీవించునట్ట్లయత్నమును జేయుము. నీకిప్పుడుభక్తిమార్గమును విశదముగనుపదేశించితిని. ఇదియసత్యమనితలఁపకుము. సర్వప్రకారములచే సంసారబంధమోచనుఁడగు శ్రీమన్నారాయణునిస్మరింపుము. అజగదీశునిస్మరించుటకు ప్రయాసయేమి? స్మరించినమాత్రమున సకలపాపములునునశించి సకలశుభములుకలుగును. కాన అనవరతముహరినిస్మరించి మహాత్ములుజ్జీవింతురు. వానికి లీలాసాధనములగుచేతనులయందు స్నేహమును జేయుము. అందుచే మోహాదిసకలక్లేశములును నశించును. ఆధ్యాత్మికాదితాపత్రయముచే జగమంతయు దుఃఖపడుచుండుటచే మిగుల కరుణింపఁదగుప్రాణులయందు వివేకియగునెవఁడు ద్వేషమును జెందును. ఒకవేళ సకలప్రాణులును ఐశ్వర్య, విద్యా, బలా, దులచే తనకన్ననధికులయియున్నారనియు, తానొక్కఁడేయట్లుకాక శక్తిహీనుఁడై యున్నాఁడననియుతలఁచినను అప్పటికిని ద్వేషముచేయక సంతోషమునేచెందవలయు. ద్వేషముచేయుటచే హానియేకలుగును. కాన ప్రాణులయందు మాత్సర్యముకూడదు. నీవునాహితోపదేశమునవలంబించి సమస్తచేతనాచేతనములను శ్రీవిష్ణుస్వరూపముగభావింపుము. అనిచెప్పి యామెకు శ్రీతారకమంత్రమునుపదేశించి యామెచేతికినొకకృష్ణవిగ్రహమునిచ్చి యోతల్లీ నీవునీపుత్ర, పౌత్రులనెట్లుపలాలనచేయుచుందువో అట్లేగోపాలమూర్తి నుపలాలనచేయుము. నీకుభగవదనుగ్రహముచే పునరావృత్తిరహితమోక్షముకలుగును. అనియనుగ్రహించి యాభాగవతుఁడు యదేచ్ఛగ బయలుదేరిపోయెను. కర్మాబాయి ప్రతిదినముప్రాతఃకాలమునలేచి దంతధావనముచేసికొని బిడ్డయాఁకలికోర్వడనుభయముచే శీఘ్రముగపాకముచేసియాసుపక్వాన్నమును గోపాలునకునివేదించి యతని నుయ్యేలనిడిజోలపాడినిద్రింపించి పిదపతానుస్నానమునకుపోయివచ్చి యథాక్రమముగతన కార్యములను జేసికొనును. ఇట్లుండనొకనాఁడు కర్మాబాయియింటికి పంచకాలపరాయణులగుకొందఱు బ్రాహ్మణులువచ్చి యామెనుజూచి యోజననీ నీవుప్రాతఃకాలమున పాకముచేసినట్లుతోఁచుచున్నది. ఇప్పుడుస్నానమునకుపోవుచున్నదానవు. ఇందులకు కారణమేమనియడిగిన ఆమెనేనువేకువలేచిపాకముచేసి బిడ్డకన్నముపెట్టి జోలపాడి నిదురపుచ్చి యిపుడు స్నానమునకుపోవుచున్నాను. నిద్రలేచి ముందుబిడ్డనిపనిచూచుటయే ముఖ్యకారణమనిచెప్పెను. ఆవిప్రులు తల్లీనీయింటబిడ్డఁడుండునట్లుతోఁచలేదు. నిజమును జెప్పుమనిన కర్మాబాయి శ్రీవేణుగోపాలమూర్తిని నెత్తుకొనివచ్చి వారలకుఁజూపి తనచారిత్రము సమస్తమును వారలకువిన్నవించెను. అప్పుడాబ్రాహ్మణులు సంతోషించి కర్మాబాయి శ్రీవేణుగోపాలునికిఁజేయునుపచారములను శ్రద్ధతోఁగమనించిచూడఁగా ఆమెపెట్టెడునన్నమును భగవంతుఁడుప్రత్యక్షముగనారగించెను. అదిచూచి వీరలాశ్చర్యపడుచుండ కర్మా

विरहन कैसे कटत रैन कहा करूं मेरी गोइयां बिन दरश तरश गई रे ॥ लिखी ललाट मिटत नहिं मोहन भयो उचाट जिया किहि कारण अब आन फँसी मधुवन कुञ्जन परवश होय फँसगई रे ॥ मधुसूदन पिया प्यारा आवे तिरछी बांकी छबि दिखलावे डार गले बैयां सजनी सब कसक निकस गई रे ॥ ४६७ ॥

## राग जंगला।

कभी गली हमारी आव रे मोरे जियाकी तपन बुझाव रे नन्दजूके मोहन प्यारे लाला। तेरे सांवरे बदनपै कई कोटि कामवारे॥ तोरियां जुलफा दिलदियां कुलफां जी दोऊ नैन हैं सतारे। तेरी खूबीके दरशपै लाल नयन तरसते हमारे॥ पिया पिया करे पपीहरा रे निशिदिनसो याद तेरी। मेरे सांवरे सलोने मोहन आशा दर्शन केरी ॥ घायल फिरूं दरशकी पीर जाने नहीं कोई। मोहिं लागी चोट प्रेमकी जिन लाई जाने सोई॥ जैसे जलके सोख हुए मीन क्या जीवे विचारे। कृपा कीजो दरशन दीजो मीरा माधो नन्ददुलारे ॥ ४६८ ॥

## राग रेखता।

दिलदार यार प्यारे गलियोंमें मेरी आजा। आंखें तरस रही हैं सूरत इन्हें दिखाजा ॥ चेरी हूँ तेरी प्यारे इतना तू मत सता रे। लाखों ही दुख सहारे टुक अबतो रहम खाजा॥ तेरे ही हेत मोहन छानी है खाक बन बन। दुख झेले शिर पै अनगिन अबतो गले लगाजा॥ मनको रहूँ मैं मारे कबतक बतादे प्यारे। सूखे विरहमें तारे पानी इन्हें पिलाजा ॥ सब लोक लाज खोई दिन रैन बैठ रोई जिसका कहीं न कोई तिसका तू जी बचाजा॥ मुझको न यूं भुलाओ कछु शरम जीमें लाओ। अपनोंको मत सतावो ऐ प्राणप्यारे राजा॥ हरिचंद नाम प्यारी दासी है जो तुम्हारी। मरती है वह विचारी आकर उसे जिलाजा ॥ ४६९ ॥

## राग जंगला झिंझोटी।

गली वे हमारी क्यों नहीं आमदा बिहारी प्यारे। दर्श दिखाय निहाल करोगे सुन्दर रूप उजारे प्यारे ॥ तेरी याद मेरे मन पर रहिंदी श्याम स्वरूप आँखनके तारे। पुरुषोत्तम प्रभुकी छबि निरखत तन मन धन सब वारे ॥ ४७० ॥

## राग काफी।

मिलना वे महबूब बिहारी। भोरभये वृन्दावन कुञ्जों जाना होकर गली हमारी ॥ मृदु मुसकन सानूं दिलबिच भांदी झमक चलन नूपर धुन प्यारी। ललित किशोरी साँवरी सूरत घुंघरी अलकों पर बलिहारी ॥ ४७१ ॥

मिलना वे दिलदार साँवरे। हुसन तुसाडे चूर हुआ दिल लीता तैं न कबका दांव रे। बाँकी अदा चशमों बसदी दीठापरे न दूजा ठांव रे ॥ ललित किशोरी नूं लख समझावो एक नहीं मेरे मन भावरे ॥ ४७२ ॥

## राग देश।

मेरे नयनोंका तारा है मेरा गोविंद प्यारा है ॥ व सूरत उसकी भोली सी व शिर पगिया मठोली सी। व बोलीमें ठठोलीसी हग बाण मारा है ॥ व घूघरवारियां अलकें व झोके वारियां पलकें। मेरे दिल बीचमें हलकें छुटा घरबार सारा है ॥ दरस सुख रैन दिन लूटे न छिनभर तार यह टूटे। लगी अब तो नहीं छूटे प्रान हरिचंद्र वारा है ॥ ४७३ ॥

## राग रामकली।

एक गामको बास धीरज कैसेकै धरों। लोचन मधुप अटक नहिं मानत यद्यपि यत्न करों ॥ वे या मग नितप्रति आवत हैं हौं दधि लै निकरों। पुलकत रोम रोम गद गद स्वर आनँद उमँग

తివి. వారికర్మానుగుణముగవారివారికి జీవనములుకల్పించు జగన్నాథుఁడశక్తుఁడనియు, అజ్ఞుఁడనియు, దరిద్రుఁడనియు, నీమనంబున నూహించితివి కాఁబోలు. (బహూనిమేవ్యతీతాని। జన్మానితవచార్జున। తాన్యహంవేదసర్వాణి। నత్వంవేదపరంతప) అనఁగా ఓయర్జునా నాకును, నీకును ఇదివఱకనంతజన్మములయ్యెను. నేను వానినన్నింటినెఱుంగుదును. నీవువానినెఱుంగవు. అనిశ్రీభగవద్గీతయందు భగవంతుఁడుచెప్పియున్నాఁడుగదా? జన్మరహితుఁడగు జగదీశుఁడు కర్మరహితుఁడయ్యును చేతనసంరక్షణార్థమయి యనంతావతారములెత్తుచున్నాఁడు. మనమునిద్రించుతఱి తానుమేల్కొనిజాగరూకుఁడయి మనలరక్షించుచున్నాఁడు. మనపూర్వజన్మకర్మంబులనునెఱింగి కర్మఫలంబులనునిచ్చుచున్నాఁడు. అట్లుండ నేను ద్రవ్యమునువ్యయించుటచే వీరలకుదారిద్ర్యముకలుగుననియెట్లుచెప్పెదవు. (ధనమువీధిఁబడినదైవవశంబున। నుండుఁబోవుమూలనున్ననైన। నడవిరక్షలేనియబలుండువర్ధిల్లు। రక్షితుండు మందిరమునఁజచ్చు) అనునీతివాక్యమునీచెవినిసోఁకినదిలేదా? ఓరాజా రాజ్యముచేయునీకింతవివేకములేకపోయిన నీవెట్లు ప్రజలనరసిరక్షింతువు? నీయాత్మరక్షకు సదుపాయంబునెఱుంగనినీవు బహుజనుల నెట్లురక్షింపఁగలవు. నీవుసింహాసనస్థుఁడవయి ప్రజాపాలనము చేసెదనని పేరువహించియుండుట అంధుఁడగువాఁడు తన్ను దివ్యదృష్టియుక్తుఁడనితలఁచి దుర్మానియై దారిచూపెదనని పెక్కండ్రంధులనుపిలుచుకొని సముద్రాభిముఖుఁడై పోవుపోకకుసదృశమైయున్నది. నీకుహితమును జెప్పెద. ఇఁకనైనను ఈయజ్ఞానమునువిడిచి శరీరము నీటిబుగ్గవంటిదనియు, కాలము అతిచంచలమనియు, యముఁడుదయావర్జితుఁడనియు, దేహావసానమున పాపానుగుణమగు నరకానుభవముతప్పదనియుతలఁచి యిఁకనుజన్మములు లేక నిత్యపదవినిఁ జెందుటకు సదుపాయము నుపదేశింపఁగలసాధువులతో సహవాసముచేయుము. అట్లుచేసితివేని (సత్సంగత్వేనిస్సంగత్వం। నిస్సంగత్వేనిర్మోహత్వం। నిర్మోహత్వే-నిశ్చలతత్వం। నిశ్చలతత్వేజీవన్ముక్తిః) అనురీతిని సాధుసంగతిచే పుత్రదారగృహక్షేత్రాదిసంగవర్జితుఁడవగుదువు. అట్లగుటచే నేనునాదియను మోహముమానును. మోహముమానినంతట తత్వత్రయజ్ఞానముకుదురును. అందుచే జీవునికిమోక్షముసిద్ధించును.) అనిదశావంతుఁడు పెక్కువిధంబులహితోపదేశముచేయఁగా నేతినివడిగట్టుటకు సాధనమగువస్త్రము పూజ్యమగునాజ్యమును విడిచియసారమగు చెత్తలను గ్రహించునట్లు రాజుమోక్షసాధనమగుదశావంతునిహితవచనంబులను పేక్షించి యితఁడు రాజశాసనంబును గౌరవింపక తన్నెదిరించి పల్కినది తప్పగాఁగొని మిగులకుపితుఁడయి తనకింకరులనుబిలచి యించుకయైన నోడక నాకట్టెదురనిలిచి నన్నవమానించిపల్కిన యీకష్టాత్మునిఁగొనిపోయి యొకఱాతితోఁజేర్చికట్టి సముద్రంబునంబడవేయుఁడనియాజ్ఞాపించెను. రాజభటులు తమకోనిశాసనమునుయథాత్రముగఁజరపిరి. అపుడవ్యాజబంధువై, దీనబంధువయి, యాపద్బంధువయి, శరణాగతబంధువయి, భీమనదీతీరమునసన్నిధిచేసియుండు శ్రీపుండరీకవరదుఁడు వేగముగవచ్చి దేవతల వేఁడికోలునమందరోద్ధారణమునకయి చేసినకూర్మరూపమునుపరిగ్రహించి దశావంతునిని సముద్రజలమున మునుఁగనీక తనవీఁపునధరించి సముద్రమునయథేచ్ఛగవిహరించుచుండెను. ఈయద్భుతమునుజూచి రాజభటులు రాజునకువిన్నవించిరి. రాజాశ్చర్యపడితత్క్షణమున సముద్రతీరమునకువచ్చి దశావంతా నీవెట్లుసముద్రమున మునుఁగక తేలుచున్నావనియడిగెను.

దశావంతుఁడు రాజునుద్దేశించి యో రాజా అనంతబ్రహ్మాండము లెవ్వని సంకల్పమాత్రముచే సృజింపఁబడి, యెవ్వనిదివ్యశక్తిచేధరింపఁబడియున్నవో, మహాసముద్రము లెవని యాజ్ఞకు భయపడి భూమినాక్రమింపక తమమేరలయందనిలిచియున్నవో, సూర్యచంద్రాదిగ్రహము లెవ్వనియాజ్ఞచేననవరతము కాలచక్రమునకులోఁబడి సంచరించుచున్నవో, యెవనియనుప్రవేశముచే బహ్మాదులుతమతమకార్యములనునిర్వహించుశక్తితోఁగూడియున్నారో, సమస్తజీవరాసులనుబొమ్మలేసూత్రధారిసూత్రమునకులోఁబడికర్మానుగుణముగనాడుచున్నవో, యెవ్వనియనుప్రవేశములేనవుడుబ్రహ్మదులేమియును జేయనేరకజడప్రాయులైయుందురో, యెవఁడుహంసరూపియై బ్రహ్మకు వేదమునుపరమచక్షుస్సునుఇచ్చెనో, సృష్టిస్థితిసంహారము లెవనికిక్రీడలయియుండునో, యనంతకోటిబ్రహ్మాండము లెవనిలీలలకుక్రీడాకందుకములయియుండునో, బ్రహ్మదులెవని విభుస్వరూపమునకు కీటకములైయుందురో, యెవనిసూక్ష్మస్వరూపమునకు పరమాణువులు మేరుసదృశములైయుండునో, యెవఁడన్నిటికినాధారమై తనకు వేఱొకయాధారములేకయుండునో, నీవును నేనును సమస్తభూతజాలములును ఎవ్వనిస్వరూపములైయున్నామో, యాశ్రితరక్షాదీక్షితుఁడయి సకలమనుజనయన విషయభూతుఁడయి, భీమనదీతీరమునందు పుండరీకానుగ్రహవ్యాజముచే ఇటికఱాతిపైనిలుచుండి కటిహస్తుఁడై చేతనులయాభిముఖ్యమును నిరీక్షించుచు నవసరప్రతీక్షుఁడయియుండు శ్రీమత్పండరినాథుఁడు నన్నీమున్నీటమునుఁగనీక కూర్మరూపియై తనవీఁపున ధరించియున్నాఁడు. ఇదియేమిచింత. సంసారాంబుధిమగ్నులనెల్లనుద్ధరించుటకు దీక్షితుఁడయియుండువానికి నొకదాసునినిరక్షించుటతిశయముకాదు. తనయందున్యస్తభరులగువారి యాత్మభారమునుతానే వహించుననుటకునిదర్శనముగ నన్ను తనవీఁపునవహించి మీకెల్లరకుఁజూపుచున్నాఁడు. ఓ ప్రజలారా యిఁకనైననువివేకమునుదెచ్చుకొని శరీరమస్థిరమనియు,శరీరానుబంధులై మమకారయోగ్యములగుపదార్థములు మోక్షవిరోధులనియు నిశ్చయించి వైరాగ్యయుక్తులై మన్నాథుఁడగు శ్రీపండరినాథునిచరణారవిందంబులయందు మీయాత్మభారంబులనర్పించి నిర్భయులరై, నిర్భరులరై, కరణకళేబరములను భగవద్విషయమునవినియోగించుచు నెడతెగక వానినామోచ్చారణముచేయుచు నాహృత్పద్మవాసినిధ్యానించుచు నితరమునువిడిచి తద్గతచిత్తులరయివర్తింతురేని యాభక్తవత్సలుఁడు మీయోగక్షేమములనుతానేవహించి మీకు తనసాయుజ్యంబునిచ్చును. అనిచెప్పిన దశావంతునిసారవంతములగు హితవచనములనచట నుండివినుచుండినవారలచెవులసోఁకినంతట స్పర్శవేదియొనర్చు స్పర్శమాత్రముచే నినుము బంగారమగునట్లు తత్క్షణమునవారెల్లరు జ్ఞానభక్తివైరాగ్యసంపన్నులయి దశావంతునియందాచార్యప్రతిపత్తిచేసి యతని పురుషకారపూర్వకముగ శ్రీమత్పండరినాథుని పాదపద్మములయందున్యస్తభరులైరి. దివిచరులును, భువిచరులును, దశావంతునిమహాప్రభావమును వేవిధంబులవినుతించిరి. రాజు తనభటులచే దశావంతునినిగట్టునకురప్పించి బంధములనువిడఁదీసి యతనికి ననంతప్రదక్షిణనమస్కారములుచేసితనయుత్తమాంగముచే నతనిపాదపద్మముల నలంకరించి యపరాధక్షమాపణముచేసికొని కృతార్థుఁడయ్యెను. మృగరాజుశరీరమునాశ్రయిం

महिंदी रंगुली माए लाई कुल्ल जहान । इकनाँ नूँरंग चढगया इक रह गए अमना मान ॥ ४८१ ॥

## राग बिहाग ।

मन अटक्या बेपरवाहे नाल॥ नयन फँसे दिल मिलया लोडे मूरख लोक असानूँ मोडे मेरा हरदम जाँदा आहे नाल ॥ मुल्लाँ काजी नमाज पढावन हुकम शरादा भय दिखलावन साडे इशक नूँ की इस राहे नाल ॥ नदियों पार सजन दा ठाना कीते कौल जरूरी जाना कुछ करलै सलाह मलाहे नाल ॥ आशिक सोई जेहडा इश्क कमावे जितबल प्यारा उते बल जावे बुल्लेसाह जामिल तू अलाहे नाल ॥ ४८२ ॥

## राग पहाड ।

मैंनूँ हरदम रहिंदा चा सज्जन दे शोक नजारे दा ॥ जब तैं कीता असाँबल फेरा हार शृङ्गार पया भट मेरा सीने रडके साँग कुहाडा इश्क प्यारे दा ॥ रल मिल सैयाँ मारन बोली ओह मेरा साहिब में ओहदी गोली रखदीहां जान पछान जामिन इशर दिहाडे दा ॥ ना आदम ना हव्वा आई ताते जाता अपना माही आया साहब आप बनके रूप सतारे दा ॥ मीरांशाह विभूति रमावां साँवरे दे दर अलख जगावां ओही है शिरताज आजज नीच न कारे दा ॥ ४८३ ॥

## राग देवगंधार ।

बसे मेरे नयननमें नँदलाल। साँवरी सूरत माधुरी मूरत राजिव-नयन विशाल ॥ मोरमुकुट मकराकृत कुण्डल अरुण तिलक दिये भाल । अधरन बंसी करमें लकुटी कौस्तुभमणि वनमाल ॥ बाजूबन्द आभूषण सुन्दर नूपुर शब्द रसाल । दास गोपल मदनमोहन पिय भक्तनके प्रतिपाल ॥ ४८४ ॥

बसे मेरे नयननमें दोउ चन्द। गौर वर्ण वृषभानु नन्दनी श्याम वरण नँदनन्द॥ गोलक रहे लुभाय रूपमें निरखत आनँद-कन्द। जय श्रीभट्ट युगल रस वन्दो क्यों छूटे दृढ़ फन्द॥४८५॥

## राग परज।

या ब्रजमें कछु देख्यो री टोना। ले मटुकी शिर चली गुजरिया आगे मिले बाबा नन्दके छोना॥ दधिका नाम बिसर गयो प्यारी ले लेहु री कोउ श्याम सलोना। वृन्दावनकी कुंजगलीमें आंख लगाय गयो मनमोहना॥ मीराके प्रभु गिरिधर नागर सुन्दरश्याम सुघर रस लोना॥ ४८६॥

## राग मलार।

कोऊ माई लैहै री गोपालहिं। दधिको नाम श्यामसुन्दर घन मुख चढचो ब्रजबालहिं॥ मटुकी शीश फिरत ब्रज बीथिन बोलत वचन रसालहिं। उफनत तक्र चहूँ दिशि चितवत चित लाग्यो नँदलालहिं॥ हँसत रिसात बुलावत बरजत देखो उलटी चालहिं। सूर श्याम बिन और न भावत या विरहिन बेहालहिं॥४८७॥

## राग भैरव।

नयननकी कोरैं कोऊ लैहै। है कोइ ऐसी रसिक रंगीली प्राण निछावर देहै॥ नूतन मधु मैं मोल ले आई छुवत खुमारी ऐहै। ललित किशोरी ततछिन जियरा टूक टूक ह्वै जैहै॥ ४८८॥

## राग बरवा।

हमींको प्यारे दरश दिखायदे॥ लपट झपट कर मटुकी फोरी कर मोर मुकुटकी छैयां॥ मोहन प्यारे नन्ददुलारे तुम लीजो कांधे धर उनको॥ सुन यशुमति इक न्याउ सुन्यो प्रीतिहिं इन मोहनकी॥ हमींको०॥ हौं वृन्दावन जात हती शिर धरि मटुकी

सखियां

घरको सरकी ॥ हमींको० ॥ यह मटुकी अनबेध मोतिनकी मोल जो लागे नन्द यशोदा दोऊ बिकैंगे । सूरदास कहा ब्रजको बसबो नित उठि मांगत दान ॥ हमींको० ॥ ४८९ ॥

## राग बिहाग ।

तुम्हैं कोउ टेरतहै रे कान्ह । गोरी सी भोरी थोरे दिननकी वारी सी वैस उठान ॥ छूटी अलक नील पट ओढे नागरि परम सुजान । सूरदास प्रभु तुम्हरे दरश बिन धीर धरत नहिं प्रान ॥ ४९० ॥

## राग गौरी ।

ग्वालिन क्यों ठाढी नंद पौरी । बेर बेर इतउत फिर आवत बिजया खाय भई बौरी ॥ सुन्दर श्याम सलोनेसे ढोटा उन दधि लेन कह्यो री । हमको कह गयो नेक खडी रह आपुन बैठ रह्यो री ॥ नौ लख धेनु नन्द बाबा घर तेरोही लेन कह्यो री । जोबन माती फिरत ग्वालिनी तैं मेरो लाल ठग्यो री ॥ इतनी सुनत निकस आये मोहन दधिको मोल कहो री । परमानंद स्वामी रूप लुभाने यह दधि भलो बिक्यो री ॥ ४९१ ॥

## राग जिला ।

श्रीवृन्दावन रज दरशावे सोई हितू हमारा है । राधा मोहन छवी छकावे सोई प्रीतम प्यारा है ॥ कालिंदी जलपान करावे सो उपकारी भारा है । ललित किशोरी युगल मिलावे सो अँखियोंका तारा है ॥ ४९२ ॥

## राग देश ।

नीको लगे राधावर प्यारो । मोर मुकुट पियरो पट्टुका है लकुटी कर मतवारो ॥ रोकत गैल छैल अलबेलो नटवर वेष सँवारो । ललित किशोरी मोहन रसिया जीवन प्राण हमारो ॥ ४९३ ॥

జరగినవృత్తాంతమునతనికివిన్నవించియతనిఁదోడితెచ్చి రాజుముందటవిడిచిరి. రాజితనిఁ జూచినంతట సింహాసనమువిడిచిలేచి యెదుర్కొనియాలింగనముచేసికొని నీవుపరమభాగవతుఁడవు. నీయట్టిసద్గుణరాశియెందునులేఁడు. నీవుమునుపటియట్లు దేశాధిపత్యమునునిర్వహించుచుండుమనెను. అదివిని మనమోహనసురదాసుఁడు ఈరాజ్యమునాకేల (నాథేనః పురుషోత్తమేత్రిజగతామేకాధిపేచేతసా । సేవ్యేస్వస్యపదస్యదాతరిసురే నారాయణేతిష్ఠతి । యంకంచిత్పురుషాధమంకతిపయగ్రామేశమల్పార్థదం । సేవాయైమృగయామహేనరమహో మూకావరాకావయం) నాథుఁడును, పురుషోత్తముఁడును, మూఁడులోకములకేకనాయకుఁడును, మనసుతోసేవింపఁదగినవాఁడును, స్వాశ్రితులకు స్వపదంబునిచ్చువాఁడును, దేవతయునగుశ్రీమన్నారాయణుఁడుండ నతనివిడిచి అజ్ఞాతనామకుల గోత్రుఁడును, పురుషాధముఁడును, కొన్నియూళ్లకు నేలికయు, నల్పఫలమిచ్చువాఁడునునగు నొకమనుష్యునికొలువువెదకి మూర్ఖుఁడనయినీచుఁడనయితిని. ఇదివఱకు నేనిన్నుగొలిచినది చాలును. ఇఁకను పురుషోత్తమునిసేవచేసెదను. అనిచెప్పుచుండుసాధుజనాగ్రేసరునిజూచి యోమహాత్మా నీకోరికప్రకారము నీవుపురుషోత్తమునిఁగొలువుము. నన్నునీవానినిగనభిమానింపుము. ఇందుచేనేనుకృతార్థుఁడనగుదును. ముందునీవధికారమునిర్వహించుచుండినమధుర, గోకులబృందావనములకు నీవేరాజవయి యాదేశములవచ్చుబడినినీకిష్టమగునట్లుసాధు, దీనజనపోషణమునకు వినియోగపఱచుకొమ్ము. నీవుపంపిన యనర్ఘ్యరత్నములను నీవేతీసికొనిపొమ్మనిప్రార్థించెను. మనమోహనసురదాసుఁడు రాజుప్రార్థించినప్రకారమురత్నములతోడ రాజ్యమునంగీకరించిరాజును తక్కినవారలనుజూచి (హేలోకాశ్శృణుత ప్రసూతిమరణ వ్యాధేశ్చికిత్సామిమాం । యోగజ్ఞాస్సముదాహరంతిమునయో యాంయాజ్ఞవల్క్యాదయః । అంతర్జ్యోతిరమేయమేకమమృతం కృష్ణాఖ్యమాపీయతాం । తత్పీతంపరమౌషధంవితనుతే నిర్వాణమాత్యంతికం) ఓజనులారా జననమరణవ్యాధులకు నొకచికిత్సచెప్పెదనువినుఁడు. యాజ్ఞవల్క్యాదులయినమునులుచెప్పియున్నారు. అంతర్జ్యోతిస్వరూపంబును, అప్రమేయమును, ముఖ్యమునగుశ్రీకృష్ణుఁడనుపేరుగలయమృతము నాస్వాదింపుఁడు. ఆపరమౌషధమత్యంతసౌఖ్యమును గలుగఁజేయును. అనియుపదేశించి భగవంతునివేవిధంబులస్తుతించుచు శ్రీమధురాపురముచేరి పూజ్యంబగురాజ్యంబునునిర్వహించుచు పూర్వమువలె భాగవతులను, దీనులనునారాధించుచుండెను. అనవరతము భగవద్విషయమునసాహిత్యములుచేయుచు, సాధువులపాదరక్షలనువహించు మనమోహనసురదాసుఁడని సాహిత్యాంతమునందు తననామమును జేర్చుచువచ్చును. కొందఱసూయాగ్రస్తులు దీనినిసహింపక యితఁడాత్మస్తుతిచేసికొనుచున్నాఁడని దూషించుచుండిరి. ఒకనాఁడు మనమోహనసురదాసుఁడు దేవాలయమునకుఁబోవుచుండ నొకసాధువువచ్చి యితనిఁజూచి నేనాలయమునఁబ్రవేశించి భగవంతునిసేవించివచ్చెద. అదివఱకు నాపాదరక్షలనుకాపాడుచుండుమనిచెప్పి యాలయమునప్రవేశించెను. ఈభాగవతోత్తముఁడు సాధువులపాదరక్షలనువహించువాఁడని తానువహించినబిరుదునకు అన్వర్థముగ తనపల్లకినిభటులతోడ స్వగృహమునకుఁబంపి యాపాదరక్షలను పరమానందముతోడ ఱొమ్ముననణఁచుకొని గోపురద్వారంబుననిలిచి లోపలబోయినసాధువురాకనునిరీక్షించుచుకాచియుండెను. ఆసాధువా

లయమునఁ బ్రవేశించి భగవంతునిదర్శించి చాలఁబ్రొద్దెక్కువెలుపలికిరాఁగా మనమోహనసుర దాసుఁడు పాదరక్షలనుతీసికొనిపోయి యాసాధువున కెదురనుంచెను. అప్పుడాసాధువు ఈగుణనిధిఁ నాలింగనముచేసికొని మహాత్మా నీవువహించినబిరుదు నీకేచెల్లును. నీకుసదృశులౌక రును లేరు. భగవద్భాగవతభక్తినీమూర్తిమైయున్నది. నీవేభగవంతునికినంతరంగభక్తుఁడవు. అని పెక్కువిధంబులస్తుతించి యథేచ్ఛగఁబోయెను. మనమోహనసురదాసుఁడు యావ దాయుష్యము తదీయారాధనపరుఁడయియుండి శ్రీమత్పాండురంగనిసాయుజ్యమును జెం దెను.

తదీయారాధనప్రియాయనమః.

## ముప్పదియేడవయధ్యాయము.

### రసికమురారిచరిత్రము.

రసికమురారియనునొకపుణ్యరాశి అనవరతముభగవద్భాగవతారాధనముచేయుచు (ఏతత్సమస్తపాపానాం। ప్రాయశ్చిత్తంమనీషిభిః। నిర్ణీతంభగవద్భక్త। పాదోదకనిషే-వనం) అనఁగా భగవద్భక్తులశ్రీపాదతీర్థస్వీకారము చేతనునిచేఁజేయఁబడినసమస్తపాప ములకుప్రాయశ్చిత్తమనిబుద్ధిమంతులచేనిర్ణయింపఁబడియెనను నీవాక్యమునందు మహావిశ్వా సముగలవాఁడయి ప్రతిదినముభాగవతులశ్రీపాదతీర్థమునుస్వీకరించుచు నెడతెగకభగవన్నా మసంకీర్తనముచేయుచు లోకులకు హితోపదేశముచేయుచు కాలమునుగడపుచుండును. ఇతనికీనిష్ఠపరమానందకరమైయుండెను. ఒకనాఁడు భాగవతులసన్నిధికిపోవసరిపడనియని వార్యమగునసందర్భముసిద్ధించినందున తనకత్యంతమంతరంగుఁడగునొకశిష్యునిజూచి నీవు భాగవతశ్రీపాదతీర్థముచేర్చుకొనిరమ్మని నియమించి యతఁడుతెచ్చినతీర్థమును స్వీకరించి యోవత్సా నేఁడునీవుతెచ్చినతీర్థమునందిన్నిదినములవలె మాధుర్యములేకయున్నది. ఇందు కుకారణమేమి? నీవుప్రతిదినమునేను శ్రీపాదతీర్థమునకయి భాగవతులసన్నిధికిఁబోవున పుడు నన్ను వెంబడించివచ్చుచున్నాఁడవనియు, నీవుమిగులబుద్ధిమంతుఁడవనియు నీయ సందర్భకాలమున శ్రీపాదతీర్థముచేర్చుకొనివచ్చుటకు నిన్నుపంపితినిగాని నేనిదివఱకా తీర్థమునంగీకరింపవలసినక్రమమును నీకుపదేశించినవాఁడనుకాను. నీవునునన్నడిగి తెలిసి కొనకపోయితివి. ఇట్టినిన్ను మందమతియగునేనుయోచింపకయీకార్యమునకు పంపినం దున నేదోప్రమాదముసంభవించెను. అతీర్థాంగీకారక్రమమునిపుడు నీకుపదేశించెదను. జాగ రూకుఁడవయివినుము. (మద్భక్తజనవాత్సల్యం। పూజాయాంచానుమోదనం। స్వయ మభ్యర్చనంచైవ। మదర్థేదంభవర్జనం। మత్కథాశ్రవణేభక్తిః। స్వరనేత్రాంగవిక్రియా। మమానుస్మరణంనిత్యం। యచ్చమాంనోపజీవతి। భక్తిరష్టవిధాహ్యేషా। యస్మిన్ మ్లేచ్ఛే పివర్తతే। సవిప్రేంద్రోమునిశ్శ్రీమాన్। సయతిస్సచపండితః। తస్మైదేయంతతోగ్రాహ్యం। సచపూజ్యోయథాహ్యహం) అనఁగా భగవద్భక్తులయందు వాత్సల్యములోఁగూడియుండ వలయు. భగవద్భక్తులు (యత్నాస్త్రవిధిముత్సృజ్య। వర్తతేకామకారతః। నసనిద్ధిమవా

ష్నోతి । నసుఖంనపరాంగతిం ॥ తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతే । కార్యాకార్యవ్యవస్థితౌ । జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం । కర్మకర్తుమిహార్హసి॥) అనఁగా ఎవఁడు శాస్త్రవిధిననుసరింపక స్వేచ్ఛగావర్తించుచున్నాఁడో యట్టివానికిసిద్ధియు, సుఖమును, పరలోకప్రాప్తియు లేదు. కానశాస్త్రమునుప్రమాణమునినమ్మి శాస్త్రవిహితములను, శాస్త్రనిషిద్ధములను తెలిసికొని శాస్త్రోక్తకర్మంబులఁజేయుచుండవలయునను భగవదాజ్ఞకుకట్టుపడి జాగరూకులయి మెలఁగుచుండువారు కాన నట్టిభాగవతులయందు దోషముకలిగియుండుట కవకాశములేదు. అయినను పాంచభౌతికశరీరసంబంధముచే ప్రామాదికముగనించుకదోషము సంభవించెనేనియు బుద్ధిమంతుఁడదిపాటింపక పశువుతనదూడశరీరమునందలి కల్మషమునుభోగ్యముగనంగీకరించునట్లు భాగవతులయందు ప్రకృతివశ్యతచేఁగలుగు ప్రామాదికదోషమునుభోగ్యముగఁ జేసికొనవలయును. అట్లుచేసికొనుట మొదటిభక్తి. పరులు భగవద్భాగవతవిషయముల యందు జేయుపూజలనుజూచి యసూయపడక సంతోషింపవలయును. అట్లుసంతోషించుట రెండవభక్తి. (విచిత్రాదేహసంపత్తి । రీశ్వరాయనివేదితం) అనురీతిని భగవద్విషయమున వినియోగించుటకయి మనకుభగవంతుఁడనుగ్రహించిన కరణకళేబరంబులను నింద్రియకైంకర్యమునకువినియోగింపక యనవరతముకరణకళేబరంబులచే భగవంతునారాధించుచుండవలయును. అట్లారాధించుటమూడవభక్తి. భగవత్కైంకర్యముచేయువాఁడు భగవన్ముఖోల్లాసమే ప్రయోజనమనియు, తనకుస్వరూపోచితమనియు, భగవత్కైంకర్యము చేయవలయునేగాని దంభమునకయిచేయఁగూడదు. (ధర్మఃక్షయతికీర్తనాత్) అనఁగా తానుధర్మకార్యములనుజేసి తానేచెప్పుకొనినతనచేచేయఁబడినసత్కార్యము భస్మాహుతివలె వ్యర్థమగును. కానబుద్ధిమంతుఁడు దంభవర్జితుఁడయియుండవలయును. (ఆత్మప్రశంసామరణం) అనఁగా తన్నుతానుస్తుతించుకొనుట ఆత్మహత్యకుసదృశమగును. ఇచట యయాతివృత్తాంతమును, కర్ణునిదెబ్బకోర్వక గాండీవమునుదూషించినధర్మపుత్రునినిందించి యందుకుప్రాయశ్చిత్తముగ నాత్మహత్యచేసికొనఁబూనియందుకుమాఱుగ శ్రీకృష్ణానుమతిచే నాత్మప్రశంసచేసికొన్న యర్జుననివృత్తాంతమును స్మరింపవలయును. అట్లు తన్నుపొగడుకొనమి నాలుగవభక్తి. అనవరతము భగవత్కథాశ్రవణమున భక్తితోఁగూడియుండవలయు. ఇంద్రియకింకరుఁడెంతవిషయానుభవముచేసినను పర్యాప్తిలేక యప్పటప్పటికా యనుభవమువానికి నవీనముగతోఁచునట్లు భగవత్కింకరునికి భగవత్కథలప్పటప్పటికి నవీనమయి ప్రీతివర్ధకమయియుండవలయును. అట్లువిననువినను విష్ణుకథలు క్రొత్తలౌచుండుటయైదవభక్తి. భగవంతునిదివ్యచరిత్రములనువినుచు తత్కల్యాణగుణంబులయందవగాహించినవానికి గద్గదకంఠమును, ఆనందబాష్పములును, పులకాంకురములును గలుగుచుండవలయును. వర్షనుదంచువానికి తానుకోరకయేతనశరీరమునచెమటకలుగునట్లు భగవద్గుణానుభవనిష్ఠునికి క్రిందఁజెప్పినశరీరవికారములు కలుగుచుండును. అట్లు శరీరమానందాశ్రురోమాంచమిళితమగుట యాఱవభక్తి. ఎల్లపుడు భగవంతునిస్మరించుచుండవలయు. ఈస్మరణ తైలధారవలె నవిచ్ఛిన్నమయి భోగ్యమయియుండవలయు. మనస్సునిమిషమయిననూఱకుండదు. అట్టిమనస్సుచే భగవంతునిస్మరింపకుండిన నట్టికాలమున ఆమనస్సుభగవదితరములగువిషయములనుస్మరించును. (చంచలంహిమనఃకృష్ణ । ప్రమాథిబలవద్దృఢం । తస్యాహం

నిగ్రహంమన్యే । వాయోరివసుదుష్కరం) ఓకృష్ణామనస్సుచంచలమై, క్షోభపెట్టునదియై, నిగ్రహింపఁగూడనిదియై, దృఢమైయున్నది. ఇట్టిమనస్సునులోఁబఱుచుట వాయువునులోఁబఱుచుటవలె దుష్కరమని తలఁచెదనని యర్జునుఁడుశోకించెను. కాననతిచంచలమగుమనస్సును దుర్విషయములకుపోనీక బుద్ధిమంతుఁడెడతెగక మనసుచేభగవంతునిస్మరించుచుండవలయును. అట్లుచలింపనిమనస్సుతోనెల్లప్పుడుస్మరించుటయేడవభక్తి. భగవంతునినచంచలభక్తితోఁడనారాధించువాఁడు నిష్కాముఁడై భగవదారాధనముచేయవలయును. అట్లుచేయుకతనభక్తికిఫలముగ నొకపదార్థమునుకోరఁజనదు. పతివ్రతయగుస్త్రీ తనకుపరమప్రాప్యమని భర్తృశుశ్రూషచేయవలయు. భర్తతనభార్యనురక్షించుట తనకుధర్మమనితలఁపవలయును. అట్లుచేయక స్వదేహరక్షణమునకయి భర్తకునిజశరీరమును వినియోగించెదనని తలఁచుట భార్యకుస్వరూపహాని. ఇట్లుతలఁచుస్త్రీ తనభర్తతనరక్షణమునకుశక్తుఁడుకాని యెడల వానినివిడిచితన్నురక్షింపఁగల మఱియొకపురుషునిచెంతచేరవలసివచ్చును. భర్తయగువాఁడు తనభార్యనిజశరీరమును తనకిష్టవినియోగార్హముగచేసియుండుటచే ఆస్త్రీని రక్షింపవలయునని తలఁచుట భర్తకుస్వరూపహాని. ఆస్త్రీరోగార్తయై తనకామభోగేచ్ఛకువినియోగపడనియపు డగ్నిసాక్షికముగ తనచేనంగీకరింపఁబడిన యాస్త్రీనిరక్షింపకయుపేక్షింపవలసివచ్చును. ఈతీరున అనన్యప్రయోజనుఁడయి భగవంతునుపాసించుట శేషభూతునికిని, దాసవర్గమువలన నొకకించిత్కారమునుగోరక వారలరక్షించుటశేషికిని పరమధర్మమయియుండును. ఇందుచే భగవచ్ఛేషభూతునికిప్రయోజనాంతరాపేక్షమిగుల త్యాజ్యమని నిర్ణీతమగుచున్నది. అట్లు తాఁజేయుకైంకర్యమునకు ఫలాపేక్షతనకు బొత్తిగలేమి యెనిమిదవభక్తి. ఈయష్టవిధభక్తులు మ్లేచ్ఛునియందుండినను వాఁడువిప్రుఁడగును. వేదపాఠముచే విప్రుఁడగుటమర్యాదయైయుండినను సకలవేదసారమయినయష్టవిధభక్తులు వీనియధీనమయియుండుటచే వీఁడువిప్రుఁడగుచున్నాఁను. వీఁడేముని. ఇంద్రియములను జయించి తనమనంబునుభగవంతునికిజంగమశ్రీవిమానంబుగఁజేసి యందుభగవంతుని సుప్రతిష్ఠితునిఁగఁజేసి యెడతెగకమననముచేయుచుండుటచే మునియగుచున్నాఁడు. ఇతఁడే శ్రీమంతుఁడు. ఒకపురుషునిచే నిర్మింపఁబడినగృహమునందు మూషికాదులు కలుగులను గావించుకొని యవితమువియని యభిమానించునట్లీశ్వరవిభూతియందు కొన్నిపదార్థములను స్వాధీనముచేసికొని యవితమువియనితలఁచియుండుదు రభిమానగ్రస్తులవలెఁగాక (మాతా చకమలాదేవీ । పితాదేవోజనార్దనః । బాంధవోవిష్ణుభక్తాశ్చ । స్వదేశంభువనత్రయం) అనురీతిని నఖిలజగన్మాతయగు శ్రీమహాలక్ష్మి తనకుతల్లియనియు, నఖిలభువనసృష్టిస్థితిసంహారకర్తయగు జనార్దనుఁడు తనకుతండ్రియనియు, నెడతెగక యీశ్వరవ్యాప్తిననుసంధించుచు నద్వేషయుక్తులయియుండువిష్ణుభక్తులు తనకుబంధువులనియు, ఆభగవంతునియైశ్వర్యమగు జగత్త్రయమునుతనదనియునధ్యవసించుటచే శ్రీమంతుఁడగుచున్నాఁడు. ఇతఁడేయతి. భగవత్కింకరుఁడగుతనకునింద్రియకైంకర్యము స్వరూపహానియనియు, నరకహేతువనియు, భగవదనుభవవిరోధియనియు, అనన్యభోగ్యత్వస్వరూపమునకు విషస్పర్శమువంటిదనియును దానినివర్జించి యనవరతభగవన్నిష్ఠుఁడైయుండుటచే యతియగుచున్నాఁడు. వీఁడేపండితుఁడు. సకలశాస్త్రసారమగు మంత్ర, మంత్రార్థ, మంత్రాధిదేవతలును, తత్త్వత్ర

యయాథార్థ్యజ్ఞానమును వీనికికరస్థములై యుండుటచే పండితుఁడగుచున్నాఁడు. ఇట్టివాఁడు తనకు తెలియనియర్థముల వేనినైన నపేక్షించె నేని వానికులగోత్రములనునిరూపింపకయుపదేశింపవలయును. వానియందుండు విశేషార్థములను అనువర్తించి గ్రహింపవలయును. వానిని భగవద్విగ్రహమునిగౌరవించి పూజింపవలయును. ఈయష్టవిధభక్తు లెవనియందున్నవో యట్టిమహాత్ముని శ్రీపాదములనుగడిగి యాతీర్థమును స్వీకరింపవలయును. ఇట్టియోగ్యత లేనివానిపాదోదకమును స్వీకరించుటజ్ఞానమాంద్యహేతువగును. ఆమహాత్ముఁడు తన్ను నీచులలోనగ్రగణ్యుఁడని తలఁచియుండునుగాన నతఁడుతనపాదోదకమునిచ్చుటకు సమ్మతింపఁడు. పెక్కువిధములచే ప్రార్థించి యనువర్తించి ప్రసన్నునిఁజేసి భగవద్విగ్రహమును ప్రతిపత్తితోడ గురుపరంపరానుసంధానపూర్వకముగవాని పాదములనుగడిగి యాతీర్థమును స్వీకరింపవలయును. అట్టియధికారియొక్క కులగోత్రములను, శాస్త్రపాండిత్యమును, శరీరారోగ్యమునునిరూపింపక వాఁడెట్టివాఁడయినను వానియందలియష్టవిధభక్తిసంపత్తిని గౌరవించి వానిపాదోదకమునుస్వీకరింపవలయును. నేనీక్రమమును నీకుపదేశింపక యాచార్యమునకునిన్నునియోగించినందున నీవెట్టిప్రమాదమును జేసితివో నాకదితెలియదు. ఇన్నిదినములవలెనాక తీర్థమునమాధుర్యముతప్పియుండుటచే నేదోయొకప్రమాదముసంభవించియున్నదనినిశ్చయించెదను. అనిచెప్పిన, రసికమురారివాక్యములనువిని యతనిశిష్యుఁడు గురుపుంగవా నీకుగౌరవ్యులగుభాగవతులయొక్క శ్రీపాదతీర్థమును జేర్చునపుడందొకఁడు కుష్ఠవ్యాధితోఁగూడి, యతనిశరీరముమిగులహేయమై, దుర్గంధయుక్తమైయుండినందున నతని పాదములనుస్పర్శించుటకసహ్యపడి తక్కినవారిశ్రీపాదతీర్థమును జేర్చుకొనివచ్చితినని చెప్పెను. అదివిని రసికమురారిమిగులశోకించి భాగవతులసన్నిధికిపోయి కుష్ఠవ్యాధికల భాగవతునిని భగవద్విగ్రహమునిగౌరవించి యతనిపాదములనుగడిగి మునుపటితీర్థముతోడఁజేర్చి స్వీకరింపఁగా నదిమాధుర్యాతిశయముతోఁగూడియుండెను. రసికమురారియానందపరవశుఁడయ్యెను. ఈవిచిత్రమునుజూచినవారలు వీరిభావశుద్ధి కాశ్చర్యపడి యితనికిరసికమురారి యనునామమన్వర్థమైయున్నదని పెక్కువిధంబులస్తుతించిరి.

ఈరసికమురారికాచార్యుఁడగు దయార్ణవస్వామియనుమహానుభావుఁడు జ్ఞానవైరాగ్యసంపన్నుఁడయి సుశీలుఁడై యనవరత భగవదారాధనపరుఁడై యుండెను. కాఁబట్టి యాతనికాదేశాధిపతి భగవదారాధనోపయోగముగకరుణించియిచ్చినమాన్యపుభూములను నూతనముగవచ్చిన దేశాధిపతి దయారహితుఁడై సంస్థానపుభూములతోఁ జేర్చుకొనెను. అపుడుదయార్ణవస్వామి తనశిష్యుఁడగు రసికమురారినిరప్పించి నీవానవీనాధికారి ననువర్తించి యెప్పటియట్లాభూములను నాకుస్వాధీనముచేయవలయునని నియమించెను. రసికమురారి తనయాచార్యులయాజ్ఞనుశిరసావహించి యారాజువసించునగరికుఁబోయి యొకశిష్యునిమూలముగ తనరాకనుఆరాజునకుఁదెలియఁజేసెను. అపుడచటనుండినవారలెల్లరు రసికమురారియొక్కవైరాగ్యాదిగుణగణములను పెక్కువిధంబులనుతించి యితనిదర్శనమాత్రముచే పశుపక్ష్యాదులకును జ్ఞానోదయమగుచున్నదని చెప్పిరి. అదివిని యతనునాస్తికుఁడును, సాధుజనద్వేషియునయిన యామహీపతి రసికమురారిని మదమదించినయట్లని చెప్పిరంత

रह्यो ऐसो तत्त्व ज्ञान निज मनमें तू धार ले ॥ नारायण अपनेको आपही बखान कर मोते वह भिन्न नहीं या विधि पुकार ले ॥ जौलों तोहिं नन्दको कुमार नहीं दृष्टि परे तौलों तू भलेही बैठ ब्रह्मको विचार ले ॥ ५१३ ॥

## सवैया ।

चारहु वेद पुराण अठारहों चौंसठ तन्त्रके मन्त्र विचारे ।
तीन सौ साठ महाव्रत संयम मङ्गल यज्ञपुरी पुर सारे ॥
योग वियोग प्रयोग उपासन मैं हरिदत्त सभी निरधारे ।
तीनोंही लोकनके सगरे फल मैं हरि नामके ऊपर वारे॥५१४॥

## राग भैरव ।

कृष्ण नाम रसना रटत सोई धन्य कलिमें । ताके पदपंकज-की रेणुकी बलि में ॥ सोई सुकृत सोइ पुनीत सोई कुलवन्ता । जाको निशिवासर रहै कृष्ण नाम चिन्ता ॥ योग यज्ञ तीरथ व्रत कृष्ण नाम माहीं । विना कृष्ण नाम कलि उद्धार और नाहीं ॥ सब सुखको सार कृष्ण कबहूं न बिसारिये । कृष्ण नाम लेले भव-सागरको तरिये ॥ श्रीगोवर्द्धन धरन प्रभु परम मङ्गलकारी । उधरे जन सूरदास ताकी बलिहारी ॥ ५१५ ॥

## राग माँझ ।

हर हर जिनके मुखसों निकसे वारे तिन्हांदे जाइयेजी । धूड तिन्हांदे चरणांदी ले मस्तक अपने लाइयेजी ॥ दुर्मति दूर करे निह केवल शिव घर वासा पाइयेजी । दुनीदास हर साधु सङ्गति मिल निर्मल महल समाइयेजी ॥ ५१६ ॥

## राग आस ।

हर हर हर हर हर हर हरे ॥ हर सुमिरत जन बहु निस्तरे ॥ हरिके नाम कबीर उजागर । जन्म जन्मके काटे कागर ॥ जन

పంపెను. అదివిని రసికమురారియాయేనుఁగునన్నును, భాగవతులనువిడిచి మఱియొకచోటి కిఁబోదని ప్రత్యుత్తరము చెప్పిపంపెను. అదివినిరాజుతనభటులను బిలిచి మీరుసాధువేష ములతోఁగూడి భగవన్నామములనుచ్చరించుచుఁబోయి యాయేనుఁగును పట్టుకొని రండని నియమించెను. భటులట్లుచేయఁగా నేనుఁగు భగవన్నామోచ్చారణముచేయు సాధువేష ధారులనేమియును జేయకయూరకయుండెను. భటులాయేనుఁగునుగొనిపోయిగజశాలయం దుఁజేర్చి రాజునకెఱుకచేయఁగా వినియాప్రభువుమిగుల సంతోషించెను. అదిమొదలీయే నుఁగు ఆహారనిద్రలను వర్జించి (గురుపాదాంబుజంధ్యాయేత్) అనురీతిని తనయాచార్య పాదపద్మస్మరణతోఁ గూడియుండెను. రాజునకు సహింపఁగూడనియుదరబాధకలిగి యెన్ని చికిత్సలుచేసినను నివర్తికాకబాధయతిశయించుచుండెను. అపుడురాజుభీతుఁడై భాగవ తాపచారముచే తనకిట్టిబాధకలిగెనని నిశ్చయించి రసికమురారిసన్నిధికివచ్చి భయభక్తి యుక్తుఁడయిప్రదక్షిణనమస్కారములుచేసి యపరాధక్షమాపణముచేసికొని యామహానుభావు ననువర్తించి యతనికిశిష్యుఁడయియుపదేశమునుబొందియతనిని బహువిధంబులఁబూజించి తన్నియమనమును జెంది స్వస్థానమునకుఁబోయెను. ఈయేనుఁగుతనయాచార్య నియమన మును జెంది భాగీరథికిపోయి (గంగాయాంపతనాన్ముక్తిః) అనురీతిని ముక్తిప్రదయగువిష్ణు పదియందు నిజశరీరమునువిడిచి శ్రీవైకుంఠదివ్యలోకమును జెందెను. మనుష్య, పశు, పక్షులు వైష్ణవసమాశ్రయణముచే పరమపదమును బొందుదురను ప్రమాణవాక్యమును ఈపరమభాగవ తునియందు ప్రత్యక్షసిద్ధమయ్యెను. రసికమురారితనయుపదేశముచే పెక్కుజనులనుపరమ వైరాగ్యసంపన్నులంజేసి ముక్తికాంతచే వరింపఁబడెను.

గజేంద్రవరదాయనమః.

---

## ముప్పదియెనిమిదవయధ్యాయము.

### మీరాబాయిచరిత్రము.

ఉదయపురప్రభూనాయకుఁడు పరమధార్మికుఁడయి, సత్యశీలుఁడయి, నీతితప్పక ప్రజాపాలనముచేయుచు శ్రద్ధతోడభగవద్భాగవతారాధనముచేయుచువచ్చెను. శ్రీపాం డురంగనికటాక్షముచే నితనికొకపుత్రికకలిగెను. ఆపుత్రికకు తల్లిదండ్రులు మీరాబాయి యనినామకరణముచేసి సాక్షాచ్ఛ్రీదేవియనిభావించి మిగులమక్కువతోడ పెంచుచుండిరి. ఆమీరాబాయి తనకుబుద్ధితెలిసినపిదప తనతండ్రిశ్రీగోపాలమూర్తిని శ్రద్ధతోడనారాధించు టయు, ఆదేవశిఖామణికి బహువిధంబులగునలంకారములు చేయుటయు, సర్వోపచారం బులను జేయుటయును తనతండ్రిచెంతనుండి చూచుచుండెను. ఈకన్యాకారత్నముప్రతిదిన ముశ్రీగోపాలమూర్తిదివ్యమంగళవిగ్రహమును సేవించుచు ఆమూర్తిననవరతము భావించు చుండినందున సాక్షాన్మన్మథమన్మథుఁడగు శ్రీరుక్మిణీకాంతుని యందామెమనసులయించి యతఁడేతనకు భర్తకావలయుననని మనోరథించుచుండెను. ఇట్లుండనామెతండ్రియాపు త్రికకు సకలకామోపభోగములకాకరమయినవయసువచ్చెను. తగినవరునిని వెదకి వివాహ

ముచేయవలయునని తనయంతరంగులతోఁ జెప్పుచుండఁగా విని మీరాబాయి తనజనకునిఁ జూచి యోతండ్రీ నీవు నాకు వరుని వెదకవలసినది లేదు. నాకుఁదగిన వరునిని నేను మానసికము గవరించియున్నాను. అతఁ డెవ్వఁడనిన సమస్తప్రపంచమున కెవఁడు త్రివిధకారణమయి యున్నాఁడో, యెవని సంకల్పమాత్రముచే సృష్టిస్థితిసంహారములు జరగుచున్నవో, యెవఁడు జన్మరహితుఁడయియుండియు భక్తులకై నామరూపాదులతోఁగూడియుండునో, యెవని దివ్యాత్మస్వరూపమును దర్శింపలేక దేవాదులు సవిగ్రహోపాసనము చేయుదురో, యెవఁడు సర్వప్రపంచమునకు తండ్రియై, రక్షకుఁడై, శేషియై, భర్తయై, జ్ఞేయుఁడై, స్వామియై, యాధారమయి, యాత్మయయి, భోక్తయయి, యున్నాఁడో, సమస్తప్రాణుల కెవఁడు నిరుపాధికబంధువయి సర్వలాభములను గలుగఁజేయుచుండునో, యెవ్వఁ డాశ్రితదుఃఖాసహిష్ణువయి యసురప్రకృతులను శిక్షించుచుండునో, ప్రాణులవ్యసనమున కెవ్వఁ డధికముగు దుఃఖముతోఁ గూడియుండునో, యెవఁడు భక్తవత్సలుఁడయి, భక్తశరణ్యుఁడయి, భక్తపరతంత్రుఁడయి, భక్తాభీష్టఫలప్రదుఁడయియుండునో, యెవని యధిష్ఠానము లేనపుడు చేతనములు చేతనప్రాయములగునో, యెవఁ డర్చారూపమును పరిగ్రహించి మనగృహంబున వసించి సర్వసహిష్ణువయి తన్నారాధించు నీకు పరాధీనముగు నఖిలాత్మస్థితి కలవాఁడయియున్నాఁడో, యట్టిగోపాలమూర్తిని నా ప్రాణనాధునిఁగ వరించియున్నాను. తండ్రియగు నీవు ఆజగదీశునికి నన్ను దత్తముచేసి యావైకుంఠపతికి మామవై త్రిలోకంబులఁ బ్రఖ్యాతులగు సముద్రరాజ, భృగు, జనక, భీష్మకులవలె నీవును మనగోపాలదేవునికి మామవయి ధన్యుఁడవగుము. నన్ను మనుజులకిచ్చుటకు యత్నించితి వేని నాయొడల ప్రాణములుండవు. దేవతకర్హమగు పురోడాశము శ్వానములకస్పృశ్యమగునట్లు శ్రీపురుషోత్తముని కర్హయగు నేను కర్మపరతంత్రులగు మానవులకస్పృశ్యనగుదును. అని చెప్పిన మీరాబాయి మాటలను విని యామెను జూచి యిది యేమి యాశ్చర్యము. అర్చారూపమును పరిగ్రహించియుండు మనగోపాలదేవుఁడు నీ కెట్లు ప్రసన్నుఁడగును. రాజపుత్రికయయి, సుకుమారియయి, యత్యంతసుందరివయిన నీవు రూపయౌవనసంపన్నుఁడగు నొకరాజపుత్రుని భర్తగవరించుట యుచితము. అట్లు వివాహమై నీ భర్తతోడ నీ వనవరతము గోపాలదేవు నారాధించుచుండుము. బాల్యస్వభావముచే నీమనసు పోయిన పోకలెల్ల పోకుము. ఈకృష్ణవిగ్రహముచే నీకించుకయయిన సౌఖ్యము కలుగదు. ఈబుద్ధిని విడిచి నాహితోపదేశము నంగీకరించి సుఖపడుమని చెప్పిన జనకుని మాటలు విని తండ్రీ యాభక్తవత్సలుఁడు సత్యవ్రతుని దోసిట మత్స్యమయి పొడసూపి మునులతోడ నతనిని ప్రళయార్ణవంబున రక్షించి యతనికి మనుపదంబు ననుగ్రహింపలేదా? కూర్మమయి కుధరమును వీఁపున ధరించి దేవతలకమృత మొసఁగి రక్షింపలేదా? వరాహమయి ప్రళయోదధిమగ్నమగు భూమి నుద్ధరింపలేదా? ప్రహ్లాదుని మాట నిజముగ నృసింహవిగ్రహుఁడవయి సభాస్తంభమునఁ దోఁచి తాను భక్తిక్రీతుఁడనుట నెల్లరకుఁ దెల్లంబుగ ప్రకటనము చేయలేదా? అదితిగర్భంబున వామనుఁడయి యుదయించి బ్రహ్మాదులకండాధిపత్యాదుల నొసంగు పరమోదారుఁడా శ్రితసంరక్షణార్థము [illegible] మహాబలిచక్రవర్తిని మూడడుగుల భూమిని వేఁడి త్రివిక్రముఁడయి త్రిలోకం[illegible]నాక్రమించి [illegible]వేంద్రునికొసఁగి యుపేంద్రుఁడని పేరువహింపలేదా? జమదగ్ని తనూజుఁడయి దుష్టనిగ్రహము చేసి భూమిని రక్షింపలేదా? కౌసల్యాసుమిత్రకైకయనందనలయందు

నాలుగురూపములతో నవతరించి రామరూపముచే సామాన్యధర్మమును, లక్ష్మణరూపముచే భగవచ్ఛేషత్వరూపమగు విశేషధర్మమును, భరతరూపముచే నీశ్వర పారతంత్ర్యరూపమగు విశేషతరధర్మమును, శత్రుఘ్నరూపముచే భాగవతపారతంత్ర్యరూపమగు విశేషతమధర్మమును ప్రకటించి శరణాగతివైభవమును సాధుజనులకనుష్ఠించిచూపి మహర్షులకు బాధకులగు రావణాదులనిరసించి శ్రీవిభీషణవ్యాజముచే లోకులకభయప్రదానంబు నొసఁగలేదా? యదుకులంబున శ్రీరామకృష్ణరూపంబుల నవతరించి పూతన, శకట, యమళార్జున, తృణావర్త, కాళియ, ధేనుకా, రిష్ట, ప్రలంబ, కేశి, ద్వివిద, చాణూర, ముష్టికాదిదుష్టవర్గంబులనిరసించి పాండవదూతయై, పార్థసారథియై, చచ్చినవారిని బ్రతికించియు శరణాగతులరక్షించియు నర్జున వ్యాజముచే బ్రహ్మవిద్యయగు గీతోపనిషత్తును లోకులకనుగ్రహించి తనయాశ్రితవాత్సల్యమునువ్యక్తముచేయలేదా? కలియుగాంతమునవర్ణాశ్రమధర్మములులోపించి ధర్మముమఱుఁగుపడిలోకము పాషండమయమైయుండునపుడు కల్కిరూపమును పరిగ్రహించి దుష్టనిరసనముచేసి వర్ణాశ్రమధర్మములను స్థాపించికృతయుగధర్మమును ప్రవర్తింపఁజేయఁగలమహానుభావుఁడితఁడేకదా? మఱియునీకలికాలమున భీమనదీతీరమున శ్రీపాండురంగమూర్తియై యర్చారూపియైయుండియు నామదేవునికిప్రసన్నుఁడయి, యతనితోడసహపఙ్క్తిభోజనముచేసి, జనాబాయితోడ పరిచారికకృత్యములను జేసి, సామంతునిహృద్గుహయందువిహరించి, కూర్మదాసునికిబహుళాపురమున సేవయొసఁగి, శోకాపరమానందునిశరీరకార్శ్యతను మాన్పి, రోహిదాసునిపూజనంగీకరించి, ఘోరాకుంభార్ శిశువునుబ్రతికించి, యతఁడుఛేదించుకొనినచేతులనుగలుగఁజేసి, నరహరికిహరిహరాకారమునుజూపి, చోకామేళునియింటికిపోయియతనితోడచొక్కపుటన్నమునుభుజించి, మఱియుభక్తపరతంత్రుఁడయి పెక్కులీలలననుష్ఠింపలేదా? రామదాసునికయి ద్వారకనువిడిచి డాక్రాయనునూరికివచ్చిత్రాసు తట్టనుండి యతనిభార్యముక్కఱకు సరితూగలేదా? మధురనుండికల్యాణదాసునికయిసాక్ష్యముచెప్పుటకు హరిద్వారమునకునడచిరాలేదా? అట్టిమనగోపాలమూర్తి నామనోరథము నెఱవేర్పకపోవునా? నీవుశంకింపకనన్నతనికర్పింపుము. అనినకొమార్తమాటలనువిని రాజుమిగుల నాశ్చర్యపడి యీబిడ్డశాస్త్రశ్రవణముచేసియెఱుఁగదు. ప్రజ్ఞావాదములనుభాషించుచున్నది. దీనిపూర్వజన్మపరిపాకమెట్టిదో. దీనివిషయమున మనగోపాలదేవుఁడేమితలఁచియున్నాఁడో నేనెఱుఁగను. అయిననుగుణవతియగునీబిడ్డను నిర్బంధింపకదానియిచ్ఛానుగుణముగజరపెదనని తనమనంబుననిశ్చయించితానారాధించుగోపాలమూర్తినిఆమె చేతికిచ్చి తల్లీనీవుకోరినవరుని నీచేతికిచ్చితిని. నీవితనితోయథేష్టముగఁగూడియుండి సుఖింపుము. అనిచెప్పెను.

మీరాబాయి యానందభరితయయి యనవరతము గోపాలమూర్తికభినవాలంకారములను జేయుచు, నానావిధములగునుపచారములఁజేయుచు, మంచిభక్ష్యములతోఁగూడిన దివ్యాన్నమును నివేదించుచు, నతనిచెంతఁగూర్చుండి వీణాగానముతోఁ[illegible]ర్తనముచేయుచు, భగవన్ముఖోల్లాసకరముగసాధువులనారాధించుచు, నిత్య[illegible]తిదినము ఈకార్యములనన్నింటిని యథాక్రమముగనెఱవేర్చియనంతరముభగవద్భాగవతశేషమును భుజిం

చుచు, భోజనానంతరము సాధుగోష్ఠినుండి శ్రీభాగవతపురాణశ్రవణముచేయుచు, కాలక్షేపముచేయుచుండెను. కొందఱసూయాపరులు యువతియగు రాజపుత్రికకు పురుషులసహవాసమపవాదార్హమనియు, రాజునకపకీర్తికరమనియు రాజుచెవినిసోఁకునట్లు చెప్పఁకొనసాగిరి. అదివిని రాజుఖిన్నుఁడై తనభార్యనుజూచి మీరాబాయిమనకుమిగులనపయశస్సునుగలుగఁజేయుచున్నది. అశిష్టులదుష్టవచనంబులను వినుటకు నాకుకష్టముగానున్నది. నేనెంతహితవచనములుచెప్పినను నామాటలనువినక తనమనసు పోయినపోకలెల్ల పోవుచున్నది. నీవయిననుమనపుత్రికకుహితోపదేశముచేసి వివాహకాంక్షను గల్పింపుమని చెప్పిపంపెను. ఆయువతితనకొమార్తనుజూచి తల్లీనామాటలనువినియొకరాజపుత్రునిని వరింపుము. నీవట్లుచేయవేని పాలవంటిమనకులమునకు నీమూలముగనిందకలుగును. స్త్రీయయి జన్మించినయాత్మతనకుఁదగినవరునిఁబెండ్లియాడి కాపురముచేయవలయును. అట్లుచేయుటకుసమ్మతిలేదేని మరణమును జెందుటశ్రేయము. నామాటలను జవదాఁటక నాప్రార్థననంగీకరింపుము. అనిచెప్పినవిని తల్లీ నేనుమనగోపాలదేవునికి దత్తనయితిని. తల్లియగునీవునన్నెట్లుపరపురుషగమనమునకు నియమించెదవు. ఇట్టినడతపగవారికయినను చితముకాదు. తల్లియగునీవించుకయైనను శంకింపక నాకుదుర్నీతిగఱపెదవు? నీయుపదేశముచాలును. నీదారినిపొమ్ము అనిచెప్పిన మీరాబాయిమాటలను ఆసుదతి తనభర్తకువిన్నవించెను. రాజుతద్దయుదుఃఖించి యోవనితామనయాజ్ఞకులోఁబడని చిన్నదానిని యింటనుంచుకొని యపకీర్తిని జెందుటకన్న ఆశిశువునుసదుపాయముచేసంహరించి లోకనిందలేక సుఖించుటమేలనిచెప్పి యామెచేతికివిషమునిచ్చి దీనినేవిధముననయిన నీపుత్రికకిచ్చి యామెనుయమునికతిథిగఁజేయుము అనినియమించిపంపెను. ఆరాజపత్నితనభర్తృశాసనము నతిక్రమింపనేరకతనపుత్రికయొద్దకుపోయి యేమియుఁజేయనేరక యేడ్చుచుండెను. మీరాబాయితనహితాలాపములచే తల్లిదుఃఖమునుబాపి యామెవలనతండ్రిశాసనమునెఱిఁగి యోజననీ శోకింపకుము. పతివ్రతయగు స్త్రీభర్తృశాసనమునుల్లంఘింపఁజనదు. నాతండ్రియిచ్చినవిషమును నానోటఁబోయుము. అఖిలాత్మకుఁడగు నాప్రాణనాథుఁడీవిషమునకుమాత్ర మంతర్యామికాకయున్నాఁడా. వానియనుప్రవేశముతోఁగూడినసర్వపదార్థములును వానిస్వరూపములయియుండమనము దేనికినిభయపడవలసినదిలేదు. కృష్ణరసాయనమును విషమనిభ్రమించితివి. (ఇదంశరీరంపరిణామపేశలం। పతత్యవశ్యంశ్లథసంధిజర్ఝరం। కిమౌషధైఃక్లిశ్యసిమూఢదుర్మతే। నిరామయంకృష్ణరసాయనంపిబ) అనఁగా ఈశరీరము కీళ్లుసడలిముదిసి యవశ్యముక్షీణించును. దీనియారోగ్యమునకయి యౌషధసేవచేసిశ్రమపడుటకన్న భవరోగముమానుటకై శ్రీకృష్ణరసాయనమును పానముచేయుటశ్రేయము. అనిచెప్పితల్లిచేతివిషమునుదీసితనచేతనుంచుకొని యోజననీ నేనుశ్రీకృష్ణదివ్యౌషధమునుస్వీకరించిభవబంధవిముక్తనయ్యెదను. విషహరుఁడగుజగన్నాథుఁడు నాహృదయాలయంబునవసించుచుండ నీవిషము నాకుకీడుకలుగదు. మిత్రప్రజ్ఞులరగు మీకిదివిషమనితోఁచుచున్న దేకాని శ్రీగోపాలదేవునిచే [illegible]యి వానికటాక్షలబ్ధదివ్యజ్ఞానముతోఁగూడియుండునేను ఆభగవంతునియనుప్రవేశముచే [illegible]మునమృతముగఁ జూచుచున్నదానను అనిచెప్పితనమనసునుశుద్ధిగించి (వ్యాహారప్ర[illegible]ఔషధంమునిమనో వృత్తిప్రవృత్త్యౌషధం । దైత్యేంద్రార్తికరౌషధంత్రి

భువనే సంజీవనైకౌషధం । భక్తాత్యంతహితౌషధంభవభయ ప్రధ్వంసనైకౌషధం । శ్రేయఃప్రాప్తికరౌషధంపిబమన శ్శ్రీకృష్ణదివ్యౌషధం) వ్యామోహమునణఁచు నౌషధమును, మునులమనోవృత్తులప్రవృత్తికౌషధమును, దైత్యేంద్రులకార్తినిగలుగఁజేయు నౌషధమును, మూఁడులోకములుజ్జీవించుముఖ్యౌషధమును, భక్తులకత్యంతహితౌషధమును, సంసారభయమును ధ్వంసముచేయుముఖ్యౌషధమును, శ్రేయఃప్రాప్తినిగలుగఁజేయునౌషధమునునగు శ్రీకృష్ణదివ్యౌషధమును పానముచేయుము అని చెప్పి యావిషమును పానముచేసెను. అప్పుడావిషము మీరాబాయి నేమియుఁజేయక శ్రీవేణుగోపాలదేవుని దివ్యమంగళవిగ్రహము నవ్యాపించి స్వర్ణవర్ణమయియుండిన యతనిశరీరమంతయు నల్లనయ్యెను. రాజును అతని భార్యయునచటనుండిన సాధుజనంబులును ఈయద్భుతమునుజూచి మిగులనాశ్చర్యపడిరి. రాజుతాను జేసిన యపరాధమునకయి శోకించిమీరాబాయినిజూచి తల్లీ దేవతలకమృతమిచ్చిరక్షించినవానికి నేనువిషమునిచ్చితిని. ఈభగవంతుఁడు నీకంతర్యామియయి నేఁబంపినవిషమునుతాను పానముచేసి నిన్నురక్షించెను. ఈపురుషోత్తమునిశరీరము మునుపటియట్లుస్వర్ణచ్ఛాయయయి ప్రకాశించునట్లునీవుప్రార్థింపుము. అని చెప్పిన తండ్రిమాటలనువిని మీరాబాయి గోపాలదేవునిఁజూచి యోప్రాణనాథా విషధరములగు నాగములలో ప్రధానుఁడగు నాదిశేషునిపయి శయనించియుండు నీకువిషము బాధకరముకానేరదు. నాయందలివాత్సల్యమును లోకమునకు ప్రకటించుటకయి నాకంతర్యామియయి నేను పానముచేసిన విషమును నీవుస్వీకరించి నీశరీరమున వైవర్ణ్యమునుగలుగఁజేసికొంటివి. నాకై నాతండ్రిని మన్నించియిచటిసాధువులకానందావహముగనెప్పటియట్లుసువర్ణవర్ణుఁడవై సేవయొసఁగుము. అనిప్రార్థించినప్రియురాలిప్రార్థననంగీకరించి పూర్వమువలె సేవయొసఁగి కంఠమునమాత్రమునలుపుతోఁగూడియుండెను. రాజుసంతోషించి పుత్రికను, జామాతను అమూల్యవస్త్రాభరణంబులనొసంగియపరాధక్షమాపణముచేసికొని నిజాస్థానమునకుఁబోయెను. మును పు మీరాబాయి విషయమున నపవాదమునుగల్పించిన దుష్టులు లజ్జించి భగవంతునిశరణుఁజెంది ముముక్షువులయిరి. గోపాలదేవుఁడు తనదివ్యరూపదర్శనానుభవములచే మీరాబాయిని సంతోషింపించుచు నంతఃపురంబునందువసించియామెకుతనదివ్యసాయుజ్యంబు నొసంగెను. మీరాబాయి ప్రాణేశ్వరుఁడగునాగోపాలదేవుఁడిప్పటికిని ఉదయపురమున సాన్నిధ్యముచేసియున్నాఁడు. తీర్థయాత్రచేయుసాధువులాదేవునిదర్శించి కృతార్థులగుచున్నారు.

శ్రీగోపాలచూడామణయేనమః.

## ముప్పదితొమ్మిదవయధ్యాయము.

### కానోపాత్రిచరిత్రము.

శ్రీమత్పండరిపురమునకు దక్షిణమునమంగళవటమనునొకగ్రామముక శ్యామయనునొకవేశ్యకు కానోపాత్రియను పుత్రికారత్నముజనించెను. కానోపాత్రి సౌందర్యమున నూర్వశి, రంభ, తిలోత్తమ, మేనకల నతిశయించియుండెను. భగవద్భక్తి

माल अघाई । हीरे लाल रत्न मणि माणिक भूषण वसन मँगाई ॥ बडे घरनकी मालिन हूँ मैं धनकी रुचि कछु नाहीं । मैं सौदागर प्रेमरतनकी और न कछू सुहाई ॥ फूल फुलेल कि बेचनहारी कहा अधिक इतराई । लेहु लेहु फूल करत कुञ्जनमें हमपे करत बडाई ॥ सुकृत जन्मके फलते भामिन यह मेरे फूल सुहाई । पच पच हार रहे सुर नर मुनि ऐसे फूल न पाई ॥ जिन फूलनको खोजि थकित भये सुर नरपति मुनिराई । ऐसे फूल कहो मृगनयनी कौन बागसों लाई ॥ त्रिभुवनपति जगदीश दयानिधि नन्दकुँवर यदुराई । वा मोहनके बागसों प्यारी नवल फूल चुनलाई । यह सुनके वृषभानु नन्दनी तन मन सुख अधिकाई । आज कि रैन रहो घर हमरे भोर भये उठ जाई ॥ सांची प्रीति देख प्यारेकी रैनकी शैन ठहराई । यह छवि निरखि मगन भये सुर नर दास चरण बलिजाई ॥ ५२१ ॥

---

# मनिहारीलीला ।

## राग गौरी ।

मिठ बोलनी नवल मनिहारी । भौंहैं गोल गरूर हैं याके नयन चुटीले भारी ॥ टेक ॥ चूरी लख मुखते कहै घूँघटमें मुसकात । शशि मनु बदरी ओटते दुर दर्शन यहि भांत ॥ चूरी बडे जो मोलको नगर न गाहक कोय । मो फेरी खाली परी आई घर घर सब जुट टोय ॥ चुरी नील मणि पहरवे नाहिन लायक और । भगवान कोइ ले चलो मोहिं दीमन है इक ठौर ॥ जिहि नगरी रिझवार नहिं सौदागर क्यों जाय । वस्तु बनेरी गांठमें बिन गाहक सो पछिताय ॥ रंग सांवरी गुण भरी धन सुन्यार कुल ओप ॥ मुदित होत सब देखके री यह पुर गोपि गोप ॥ काहूपै न ठगायहै तेरी बुद्धि विशाल ।

యావేశమును గలుగఁజేయుచుండు స్త్రీలయొక్క స్తనభార, నాభిప్రదేశములు మాంసము, కొవ్వు, మొదలగు హేయపదార్థముల సముదాయమై మిగుల వికారమయిన వనిపలుమాఱు చింతించుచుండవలయు. ఒకనికిట్టిభావము నిజముగ కలుగునేని యీహేయపదార్థములు భోగ్యములని తోఁపవు. (శరీరం వ్రణవత్పశ్యే। దన్నంతువ్రణలేపనం। వ్రణసేచనవద్దాహం। వస్త్రంతు వ్రణపట్టవత్) ఓ తల్లీ శరీరమును పుండుగాతలఁపవలయును. పురుషులశరీరములయందొక పుండుగలిగిన నదిమిగుల నసహ్యమనియు, సదుపాయముచే శీఘ్రముగనివర్తనీయమనియు తోఁచునట్లాత్మకుకలిగిన వ్రణరూపమగు శరీరములయందు బుద్ధిమంతుల సహ్యపడుచు దీనివినాశకాలమును నిరీక్షించుచుండవలయును. ఇట్టిహేయశరీరముల నమూల్యములగు నాభరణములచేతను, దివ్యములగు కుసుమ చందనాదులచేతను అలంకరించి తన్మూలమగు నానందమును జెందువారు పుండునలంకరించి యానందించువారగుదురు. ఆఁకలినిమాన్పుటకై స్వీకరింపఁబడు నన్నమును పుండునకు నూఱికట్టునన్నముగా భావింపవలయును. ఇట్టియన్నము భోగ్యముగానుండవలయునని కోరువారు వ్రణలేపనమగు నన్నము నాజ్యాదులతోఁగూడి రసయుక్తమయి యుండవలయునని కోరువారికి సదృశులగుదురు. దాహనివర్తికయి స్వీకరింపఁబడు జలమును పుండును కడుగు జలమని భావింపవలయును. ఈ జలము పరిమళమిళితమయి యుండవలయునని గోరువారు పుండును గడుగుటకు సుగంధయుక్తమగు తీర్థమును పేక్షించువారగుదురు. మానమునకయి శరీరముపయిఁ జుట్టుకొను వస్త్రమును పుండుమీఁదఁ జుట్టుగుడ్డయని భావింపవలయును. మనుజులు వస్త్రహీనులయి తమ ప్రతిబింబములనద్దములయందుఁ జూచిన నవి తమకే యసహ్యములయి యుండును. కానవికారమగు పుంటినిపరులకంటికగపడక గుడ్డచేఁ జుట్టిముఱుఁగు చేయునట్లు మనుష్యశరీరమునందలి వికారము లితరులకంటికగపడనీక వస్త్రముచే నాచ్ఛాదింపవలసియున్నది. ఇట్టివస్త్రము మనోహరమయి యమూల్యమయి యుండవలయునని తలఁచుట పుండునకు చుట్టుగుడ్డ దివ్యభర్మాంబరమయి యుండవలయునని కోరుటకు సాటియగును. ఓ జననీ చక్కఁగ నూహింపుము. స్వస్వరూపమును జక్కఁగ నెఱుఁగని వారును, ఎఱిఁగినను భగవద్విషయమున శరణాగతులయి తచ్చరణారవిందవిన్యస్తాత్మభరులయి నిర్భయులయి, నిర్భరులయి (కృతకృత్యాః ప్రతీక్షంతే। మృత్యుం ప్రియమివాతిథిం) అనురీతిని మృత్యువును ప్రియమయిన యతిథివలె నిరీక్షించియుండుట యీయాత్మకు ప్రాప్తమయి యుండఁగా నట్లు చేయక (నలినీదళగతజలమతితరళం। తద్వజ్జీవితమతిశయచపలం। విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం। లోకంశోకహతంచ సమస్తం) అనురీతిని తామరాకును జెందిన నీళ్లవలె జీవితము మిగుల చంచలమనియు, లోకమునందలి సమస్తపదార్థములు శోకహతములయి యున్నవనియు నించుకయైనను జింతింపక నీటిబుగ్గవంటి శరీరమును స్థిరమనినమ్మి (ఈశ్వరోహమహంభోగీ। కోన్యోస్తి సదృశో మయా) అనురీతిని నేనే ప్రభువనియు, భోగియనియు, నాకు సములు లేరనియు తలఁచుచు దురభిమానగ్రస్తులయి శాస్త్రములను దూషించుచు నాస్తికులయి యమూల్యమగు కాలమును ఆత్మస్తుతి పరనిందా, పరావమాన, పరపీడ, విషయానుభవాదులచే వృథపుచ్చుచు, జననీ, జనకా, తిథి, గురువుల నీశ్వరమూర్తులని భావింపక వారల నగౌరవించుచు, నాస్తికులయి యమవృషభ ఘంటానాదశ్రవణకుతూహలుల[illegible]యుండు మనుజుల చెంతఁ జేరి మసుగుటకు నాకిష్టము లేదు. అయినను ఓ జననీ యించుక [illegible]ర్చియుండు

ము. నాకుఁదగినవరునిని నేనే వెదకియాశ్రయించెదను. అనిచెప్పినసద్గుణగణనిధియగు తన పుత్రికమాటలనువిని యాశ్యాము యేమియుననఁనేరక మౌనముద్రనువహించియుండెను.

ఇట్లుండ శ్రీమత్పండరిపురమున కాషాఢశుద్ధైకాదశీమహోత్సవమునకై సాధుజనులు గుమిగూడి పతాకహస్తులయి చేతులఁదాళములువాయించుచు శ్రీపాండురంగనికల్యాణ గుణంబులనుబాడుచు నానందనిర్భరులయి మైమఱచినృత్యముచేయుచు తానువసించువీధినిఁబోవుచుండఁగా వారినిజూచి కానోబాత్రియామహాత్ములగోష్ఠికడ్డమువచ్చి వందనముచేసి యతివినీతయై నిలుచుండినిటల తటఘటితాంజలియయియిట్లని విన్నవించెను. ఓమహాత్ములారా మీరెందుండి యెందుకయియెందుఁబోవుచున్నారు. (వసతిహృదిసనాతనేచవిష్ణౌ। భవతిపుమాన్ జగతోస్య సౌమ్యరూపః। క్షితిరసమతిరమ్య మాత్మనోంతః। కథయతిచారుతయైవసాలపోతః)। ఓసాధువులారా యెవనిహృదయమునసనాతనుఁడగువిష్ణువు వసించుచున్నాఁడో యా పురుషుఁడు జగత్తునకు సౌమ్యరూపుఁడయి కానఁబడును. సాలవృక్షము తానువసించుభూమియొక్క సారమును తనతలతోఁజూపుట యిందుకుసదృశమైయుండును అనియమధర్మరాజు తనభటులకుఁజెప్పిన వైష్ణవలక్షణము మీయందు పూర్ణముగమూర్తీకరించియున్నదనివిన్నవింపఁగా నాచారుముఖియొక్క మృదువులయి, రసవంతములయి, గంభీరార్థగర్భితములయి, శ్లాఘనీయములైన మధురాలాపములనెడు నమృతప్రవాహము పంఢరియాత్రచేయునట్టిసాధుజనులకర్ణరంధ్రములయందు ప్రవేశించివారలకమందానందమును గలుగఁజేసెను. అప్పుడాసాధువులు కానోబాత్రినిఁజూచి యోతల్లీ ఆషాఢశుద్ధైకాదశీమహోత్సవమునకయి శ్రీమత్పండరిపురమునకుఁబోవుచున్నారము. భూలోకవైకుంఠమగు నాక్షేత్రమున కామహోత్సవకాలమునందు పెక్కుదేశములయందుండియనేకసాధువులు వత్తురు. అట్టిసాధుజనులతోడ భక్తవరదుఁడగు శ్రీమత్పండరినాథుని దర్శించుట పరమప్రయోజనముగఁగోరి పోవుచున్నాము. నీగుణగణంబులనుజూడఁగా ఆపుండరీకవరదుఁడు పూర్వముజనాబాయిని అత్యంతాభిమతవిషయముగనంగీకరించినట్లు తానుగానిన్నంగీకరించెననితోఁచుచున్నది. అనిసాధుజనులుచెప్పఁగా కానోబాత్రి యానందరసాబ్ధిమగ్నయై యాగోష్ఠికిప్రదక్షిణనమస్కారములుచేసి యోసాధువులారా మీచేనుతింపఁబడి మీకువందనీయుఁడయియుండుశ్రీమత్పండరినాథుని స్వరూప, స్వభావంబులను మీచేవినఁగోరెద ననుగ్రహింపుఁడనిప్రార్థించిన వారలెంతయుసంతసించి కానోబాత్రినిజూచివినుమని చెప్పఁదొడఁగిరి.

ఓపుణ్యరాశీ యాపురుషోత్తమునిస్వరూప,రూప, గుణ, విభవంబులను వర్ణించుటకు వేనోళ్లతోఁగూడిన యాదిశేషుఁడునుచాలఁడు. విధిశివసనకాదులధ్యానమునకు అగోచరుఁడయియుండును. వేదపురుషుఁడామహాత్మునియానందముయొక్క పారమునుగనిపట్టనుద్యుక్తుఁడయి మొదటమనుష్యానందమును నిశ్చయించి క్రమముగ చతుర్ముఖానందపర్యంతముచెప్పుచుపోయి పరబ్రహ్మానందము మనసునకప్రాప్యమునితిరిగెను. ఆజగదీశుఁడు తన కల్యాణగుణంబులనుతానే చింతించుచు దానిపారమునుగనిపట్టకయున్నాఁడు. అట్టిభగవంతుని స్వరూపస్వభావంబులను మేమెట్లువర్ణింపఁగలము. అయిననువారివారి బుద్ధికిగోచ

రించుకొలఁదిని స్తుతించుటతప్పుకాదు. ఎట్లనిన మేరుపర్వతమున పిడికెడుబంగారమున్నదనియు, మహాసముద్రమున దోసెడుజలమున్నదనియు, చెప్పినయామాటలు కల్లలుకావు. మేరువునందలి బంగారమమితమయియుండినను అందుపిడికెడు బంగారమునుగలదుకదా ? సముద్రమునందలిజలము పారములయియుండినను అందుదోసెడు జలమునుగలదుకదా ? కాన భగవంతునిస్వరూప, రూప, గుణ, విభవంబులను సర్వజ్ఞుఁడగు తనకే లెక్కింపశక్యముకాకయుండినను వారివారిబుద్ధికి గోచరించినట్లుస్తుతించుటయుచితమైయుండును. భగవంతుఁడు తనకల్యాణగుణములకు తానేపారమునుగానఁడనిచెప్పిన వానిసర్వజ్ఞత్వమునకు హానికలుగదా? అనినలోకమునమహాజ్ఞానియగునొక పురుషుఁడు కుందేటికొమ్ము నెఱుంగననినవాని జ్ఞానమునింద్యముకాదు. కుందేటికొమ్ములోకమునలేని పదార్థము. కాననట్టిదాని నెఱుఁగననుట జ్ఞానమేయగును. అట్లనంతకల్యాణగుణంబులననంతమని యెఱిఁగియుండుట సర్వేశ్వరుని సర్వజ్ఞత్వమునకు హానికరముగాదు. ఇఁకనునీమనోరథపూర్తికయి యాజగదీశుని వైభవమును మాయెఱుకకొలఁది వర్ణించెదము. సాధుపరిత్రాణ, దుష్కృతవినాశ, ధర్మసంస్థాపనములకయి దేవతలచే ప్రార్థ్యమానుఁడయి, యదువంశపయఃపారావారరాకాసుధాకరుఁడయి, వసుదేవానందవర్ధనుఁడయి, దేవకీగర్భంబుననవతరించి, నందనందనుండనియు, యశోదాపత్యమనియు ప్రసిద్ధిఁగాంచి బృందారణ్యంబున వెలుఁగుచు సమవయస్కులగు బాలకులతోఁగూడి గోగోవత్సంబులఁగాచుచు కంసాదిదుష్టులనువర్జించి పాండవాదిశిష్టులను రక్షించిభూభారంబునుదీర్చినపరమయోగిజనసేవ్యమానుండగు శ్రీకృష్ణపరమాత్మ తల్లిదండ్రుల శుశ్రూషయేస్వరూపోచితమగు భగవత్కైంకర్యమని తన్నిష్ఠుఁడయితదన్యమెఱుఁగకయుండిన పరమభాగవతుఁడగు శ్రీపుండరీకుననుగ్రహించుటకు శ్రీమత్పండరిపురమున సాన్నిధ్యముచేసి కటిహస్తుఁడయి భీమనదీతీరంబున నిటికతాలిపైనిలిచి సాధుజనులననుగ్రహించుచున్నాఁడు. ఆమహాత్ముఁడు వికారరహితుఁడయి యెప్పటికినొక్కభేదముగనుండువాఁడు. సర్వమును సాధింపశక్తుఁడు. తనప్రకాశముచే సర్వమునుప్రకాశింపించువాఁడు. స్థిరమగు నానందముతోఁగూడినవాఁడు. సర్వమును తనకువశ్యముచేసికొనియుండువాఁడు. మహాబుద్ధితోఁగూడినవాఁడు. అచంచలుఁడు. శ్లాఘ్యమగువాక్కులుగలవాఁడు. గొప్పయైశ్వర్యముతోఁగూడినవాఁడు. విరోధినిరసనశీలుఁడు. ఉన్నతములగుభుజమూలములతోడను, సువృత్తములగు బాహువులతోడను, శంఖమువంటికంఠముతోడను, కొంతయుబ్బియుండు చెక్కిళ్లతోడను, విశాలమయి యున్నతమయి కఠినమగువక్షస్థలముతోడను, మాంసముచేకప్పఁబడి యవ్యక్తములయియుండు కంఠశల్యములతోడను, శత్రువులకుభయజనకమగు దేహకాంతితోడను, ఆజానుబాహువులతోడను, సుందరమగుశిరముతోడను, విశాలమగు లలాటముతోడను, ఏనుఁగువలె గంభీరమగునడతోడను, మిగులనున్నతమును మిగులకుఱుచయునుగాక తొంబదియాఱంగుళముల ప్రమాణముతోఁగూడిన దేహముతోడను, వ్యత్యస్తములుకాక సమముగభాగింపఁబడియుండు నవయవములతోడను, తన్నుఁజూచువారలదృష్టిచిత్తంబుల నపహరించు సుందరవిగ్రహముతోడను, మహాతేజస్సుతోడను, తామరరేకులవలెవిశాలములయినిడుదలైనయెఱ్ఱనిరేఖలతోఁగూడియుండు నేత్రములతోడను, సాముద్రికశాస్త్రోక్తసర్వ శుభలక్షణములతోడనుగూడినవాఁడు. సకలధర్మ

ముల నెఱిఁగినవాఁడు. ప్రతిజ్ఞతప్పనివాఁడు. సకలప్రాణులకు మేలుచేయువాఁడు. సర్వము నెఱిఁగియుండువాఁడు. మహాపరిశుద్ధుఁడు. ఆశ్రితులకు స్వాధీనుఁడయియుండువాఁడు. ఆశ్రిత రక్షణము మొదలగు మంచికార్యములనే యోచించువాఁడు. బ్రహ్మాదులకు మొదటివాఁడు. లక్ష్మీవిలాసముతోఁ గూడినవాఁడు. అందఱినిరక్షించుటకు సమర్థుఁడు. ఆశ్రితవిరోధినిరసన శీలుఁడు. వారివారిగుణంబులను యోచింపక స్వకార్యముగ నందఱిని రక్షించువాఁడు. పాపులను దండించి ధర్మమును స్థాపించువాఁడు. ఆశ్రితులను జాఱవిడువనివాఁడు. వేదశాస్త్రప్రవర్తకుఁడు. అందఱికిని ప్రియుఁడై యుండువాఁడు. గంభీరహృదయముగలవాఁడు. మృదుభాషి. నదులచే సేవ్యమానుఁడగు సముద్రునివలె సాధుజన సేవ్యమానుఁడయియుండువాఁడు. అందఱును తన్నుఁ జెందఁదగినయాత్కర్షముతోఁ గూడియుండువాఁడు. పక్షపాతము లేక న్యాయమును నడపువాఁడు. ఓయువతీ మేమేమనిచెప్పదుము. ఇపుడు మాచే చెప్పఁబడినవియు, చెప్పఁబడనివియునగు సమస్తసద్గుణములతోఁ గూడినవాఁడు. మఱియు లోక దృష్టాంతములచే వానిగుణములను జెప్పెదము. వినుము. గంభీరమున సముద్రమునకును, ధైర్యమున హిమవత్పర్వతమునకును, సర్వమును సాధించుశక్తియందు స్వస్వరూపమైన స్థితికర్తయగు విష్ణువునకును, చూడచూడనభినవమగు నానందమును గలుగఁజేయుటయందు చంద్రునకును, ఆశ్రితసంరక్షణార్థమయి యాసురప్రకృతులయందు కలుగుకోపమున ప్రళయాగ్నికిని, ఓర్పునందు భూమికిని, ఔదార్యమున కుబేరునికిని, సత్యమున ధర్మదేవతకును సదృశుఁడయియుండును. అని సవిస్తరముగ చెప్పఁగా విని కానోబాత్రియా భగవత్కల్యాణగుణములయందులయించిన మనస్సుకలదియైతనయింటప్రవేశించి తల్లియనుమతినిఁ జెంది సాధువులను వెంబడించి పండరిపురముచేరి పుండరీకవరదునికి వందనముచేసి, యప్రమేయా నీకీర్తిని సాధువులవలన వినినీసందర్శనాపేక్షచే వచ్చితిని. నాచే వినఁబడిన సర్వలక్షణములును మూర్తీకరించియుండు నీదివ్యమంగళవిగ్రహమును సేవించినంతట నాహృదయము నేఁడి చాతకము మేఘశ్యామమగు నీదివ్యమంగళవిగ్రహ సేవయందులయించి తదన్యమును తృణీకరించియున్నది. అకించనులై, యనన్యగతులగు వారికి నీవు కల్పతరువై యుండువాఁడవు. కాన నాదోషంబులను మనమున పాటింపక నన్నంగీకరింపుము. సముద్రతీరంబున విభీషణునికిని, నుభయసేనామధ్యంబున నర్జునునికి అనుగ్రహించిన యభయప్రదానమును స్మరించి శరణాగతయగు నన్ను జాఱవిడువకుము. నీవు నన్నుల్లంఘించినను మందారమకరందమాధుర్యమును గ్రోలుచుండు మధుపము తదన్యము నొల్లనియట్లు నేనమృతస్యందినియగు నీపాదకంజయుగమును మాని యన్యము నొల్లను. అజామిళాదులయపరాధసమూహములను లెక్కింపక రక్షించి కీర్తిఁ గాంచిన నీవు నన్నిపుడు పేక్షించి యపకీర్తిపాలు కాకుము. నిర్వ్యాజబంధువగు నిన్ను నా రక్షణమునకై నేను ప్రార్థించుట స్తనంధయయగు శిశువు తనరక్షణమునకై తల్లిని ప్రార్థించుటకు సదృశమయియున్నది. అఖిలాండములను జాగరూకుఁడవై రక్షించు నీకు నొకయాత్మయొక్క రక్షణము భారము కాదు. అని ప్రార్థించి తనయాత్మభారమును పుండరీకవరదుని పాదపద్మములయందర్పించి శ్రీమత్పాండురంగని నెడతెగక సేవించుచు తన్నామంబులను స్తుతించుచు భాగవతులభగవన్నామసంకీర్తన సమయసంజనితకోలాహలములకానందించుచు గోపురద్వారంబున వసించి సంతతము భగవ ధ్యానము చేయుచుండెను.

ఆదేశాధీశుఁడు కానూబాత్రిసౌందర్యమును కర్ణపరంపరగావిని తనకంతరంగములగు భృత్యవర్గమునుబిలిచిమీరు శ్రీమత్పండరిపురమునకుపోయివిఠ్ఠలనాథుని గోపురద్వారమున వసించు కానూబాత్రియను గణికారత్నమును నాయందుబద్ధానురాగయగునట్లుచేసి మీనేర్పుకొలఁదిబుజ్జగించితోడితెండనినియమించిపంపెను. వారలువచ్చి కానూబాత్రికితమరాజు మనోరథమునెఱుకచేసిరి. అపుడాసుందరాంగి వారలనుజూచి యో సేవకజనులారా మీరాజునియమనముచే మీరలునన్నుపిలుచుకొనిపోవవచ్చినందునకు నేనుమిగులసంతోషించితిని. ఇచ్చటనించుకనిలువుఁడు. ఆలయములోపలికిపోయి శ్రీమత్పండరినాథుని దర్శనము చేసి మిమ్ము వెంబడించివచ్చెదనని చెప్పి సన్నిధిలోపల ప్రవేశించి స్వామియగ్రభాగమునందు నిలిచి యాపద్బాంధవా, మత్ప్రాణనాథా నీకుదాసినగునన్నొకరాజకీటకముపేక్షించుట న్యాయమా? పురోడాశము కుక్కుకుతగునా? ఇట్టిసమయముననీవునన్ను పేక్షింపక రక్షింపవలయునని ప్రార్థింపఁగా నాలయమునందలియర్చకులును, సాధువులును జూచుచుండనాయువతిశరీరమునుండి యొకదివ్యతేజము వెలువడి శ్రీపండరినాథుని దివ్యమంగళవిగ్రహంబునఁ బ్రవేశించెను. పిమ్మటభగవన్నియమనముచే ఆపుణ్యవతి శరీరమును ఆలయప్రదక్షిణప్రాకారమున నిక్షేపముచేసిరి. ఆదివ్యశరీరముభగవత్సంకల్పముచేనొకవృక్షమయ్యెను. అదియిపుడునువర్ధిల్లుచున్నది. ఆక్షేత్రమునకుఁబోవు సాధువులావృక్షమును గౌరవించి కానూబాత్రినిస్మరించి తత్పత్రములను శిరసావహించుచుందురు.

రాజభటులు కొంతసేపు కానూబాత్రిరాకను నిరీక్షించియుండిలోపలఁబ్రవేశించి యచటజరగినవృత్తాంతమువిని విశ్వసింపక కానూబాత్రివిషయమున మోహాయుక్తులై యామెనుమీరెచటనోదాచిపెట్టి కల్లలాడుచున్నారని యచ్చటియర్చకులనదలించి బెదరించిన వారలు మేమేపాపమునెఱుఁగమని పలుమారునిజముచెప్పుచుండినను వారలనుబద్ధులఁజేసి రాజుచెంతకుఁదోడ్కొనిపోయి యావద్వృత్తాంతమును రాజునకువిన్నవించిరి. రాజును ఆభటులమాటలను విశ్వసించి యర్చకులనుధిక్కరించి వారలుతనచేతికిచ్చిన భగవత్ప్రసాదమును జూడఁగానది కేశయుక్తమయియుండెను. రాజాయర్చకులనుజూచిమనపండరినాథునకుసిగకలదాయనియడిగిన నర్చకులు భీతులైముందువెనుకలు యోచింపక కలదని చెప్పిరి. అపుడురాజువింతపడి నేనుపండరిపురమునకువచ్చిపండరినాథునిదివ్యమంగళవిగ్రహమునుపరీక్షించి యతనికిసిగయున్నయెడల మిమ్ము విశ్వసించి మిక్కిలిగౌరవింతును, లేనియెడల క్రూరదండనమునకులోఁబఱుతునని చెప్పి వారలతోడ పండరిపురమునకువచ్చి భగవంతునిశిరమును పరిశోధింపఁగా శరణాగతవత్సలుఁడగుజగన్నాథుఁడు తన్ను ప్రతిదినము భయభక్తులతోనర్చించు నర్చకులమాటలను నిజముచేయఁగోరి పెద్దజుట్టుగలవాఁడయి సేవయొసఁగి తనయాశ్రితవాత్సల్యమును ప్రకటనముచేసెను. రాజుభయభక్తియుక్తుఁడై శ్రీపాండురంగనికిని, అర్చకులకునువందనముచేసి యపరాధక్షాపణముచేసికొని కానూబాత్రిచరమశరీరపరిణామరూపమగు వృక్షమునకు ప్రదక్షిణనమస్కారములుచేసి తత్పత్రములను శిరసావహించియచ్చటి సాధువులనారాధించి స్వస్థానమును జేరెను.

శరణాగతవత్సలాయనమః.

कोमल परम स्वभाव हो जानत प्रीति बिकाय । जो अब आदर देहु-
गी तो फिर आवैंगी धाय ॥ सरिता जल थिर ह्वै रहै जाको सुनत
अलाप । शिव समाधि टारे बली विधिको टारत है जाप ॥ब्रज
मंडल ऐसी नहीं नहीं भरतके खंड । अति गुणवंती भामिनी यह
आई परचंड ॥ यह सुन अति अकुलायकै चली सखी लै संग ।
रूपसिंधु उमँग्यो मनो तासें नानाउठत तरंग॥ उठ सन्मानत साँवरी
फूली सरवस पाय । दृगमों दृग मनसों जो लखि उरझे सहज
सुभाय ॥ अहो कुशल मति नागरी तुम गुण भये प्रशंस । राग
अलापि सुनाइये सखी वीणा धरके अंग ॥ चपल करज नख द्युति
बडी गोरी गाई बाल । रीझी अति लली झपकी दई ताहि आप
हिय माल ॥ मान बडी तानन बडी बडी रूप लहि लाह । प्रगट
करो सब चातुरी जाके मनमें विपुल उमाह॥ विद्या निपुण उजा-
गरी धन तुम शिखवन हार । कोउ छिन बर्साने बसो अब चलो
हमारे लार ॥ सुनत कछू मोर्‍यो बदन चुप ह्वै रही सुजान । बीणा
धर दियो कन्धते रूखी ह्वै गई निदान । ललिता बूझत समझके
का कारण बलिजाउँ । तुम उदास अतिही भई सुन धाम हमारे
नाउँ ॥ मेरे छक है गुणनकी सुनो खोलके कान । पर घर गये जो
को सहै सखी जो न होय अपमान ॥ तुम्हें प्राण सम राखि हैं
लाड़ नयो नित होय । अहो गुणीली भामिनी यह संशय मनते
खोय॥ गुणगाहक विरचे नहीं दूर करो सन्देह । जे गुणको समझैं
नहीं परहरिये तिनके गेह ॥ यह सुन भई जो डहडही सखी साँवरी
गात । चम्पक बरणी धन्य तू कही निपट समझकी बात ॥ अब
हौं निश्चय चलोंगी जान तुम्हारो हेत । तो मन थाह मिली भटू
नृपसुता न उत्तर देत।कहा न्याव सो करत हो कहत अतिलडी बोन।
सुख पावो तो विरमियो नहीं कर जैयो गौन ॥ ससक उठी कर

నాయతిథియాపోశనముచేసి యాహుతులను వేసికొని షడ్రసోపేతమగు నన్నమును గోవింద స్మరణముతోడ భుజించి యుత్తరాపోశనముచేసి లేచి గండూషపూర్వకముగ చేతులు కాళ్లు కడుగుకొని శుద్ధాచమనముచేసి శుచిప్రదేశమున సుఖాసీనుఁడయి హృత్పద్మవాసియగు భగవంతుని ధ్యానించిస్తుతించి దామాజిపండితుఁడు శ్రద్ధాభక్తులతోడ నిచ్చినచందనకుసుమ తాంబూలములనంగీకరించెను.

పిదప దామాజిపండితుఁడతిథిశేషమగు నన్నమును పరమపావనమని స్వీకరించి తన భటులను పిలిచి నన్నూఱుకలముల ధాన్యమును రాచటికమువారి ధాన్యరాశినుండి కొలచియీ బ్రాహ్మణుని వెంబడించి తీసికొనిపోయి యితనియింటఁ జేర్చిరండని నియమించెను. ఆభటులు తమయధికారియాజ్ఞను శిరసావహించి ధాన్యమును బండ్లకెక్కించుకొని యాబ్రాహ్మణుని వెంబడించి పండరిపురమునకుఁ బోవుచుండఁగా మార్గమధ్యమున క్షుధాతురులగు జనులు పయిఁబడి యాధాన్యమునంతయును గొల్లగొనిపోయిరి. ఆబ్రాహ్మణుఁడు దరిద్రునకు తలగడుగఁబోఁగా వడగండ్లవాన వెంటనేవచ్చెనన్నట్లు పరమోదారుఁడగు దామాజిపండితుని యనుగ్రహముచే నాదారిద్ర్యము ధ్వంసమయ్యెనని సంతోషించుచుండ నాపాపరాశి బహుప్రజారూపమైవచ్చి ధాన్యమునపహరించుకొనిపోయెను. సముద్రము పారమైనను పాత్రమునకు తగినజలమే కదా సిద్ధించును. నాకు దామాజిపండితునియన్న మొకపూటకే ప్రాప్తమయియుండెను. నాపాపమునకతఁడేమిచేయును. పూర్వజన్మమున నతిథులకన్నమిడని నాకిపుడన్నమెట్లుసిద్ధించును. అన్నదానముచేయక తపోబలముచే సత్యలోకమును జెందియు శ్వేతమహారాజాయుత్తమ లోకమందును క్షుద్బాధితుఁడయి బ్రహ్మపనుపున భూమికివచ్చి పరులకిడక తనచే పోషింపఁబడిననిజశరీరమాంసమును భక్షించుచు నిట్లు ప్రతిదినంబును మనుజలోకమునకువచ్చుచు బ్రహ్మానుగ్రహముచే నెప్పటియట్లభినవమైయుండు ప్రేతమునందలిమాంసమునుభక్షించియాఁకలి దీర్చుకొనుచు బహుకాలముగడపి భగవత్కటాక్షముచే తనకుదృగ్గోచరుఁడయిన పరమతపోనిధియగు నగస్త్యమహామునినిదర్శించి స్తుతిప్రదక్షిణనమస్కారంబులొనర్చి తానభిమానించి యుండిన యనర్ఘ్యరత్నహారమున తనికిసమర్పించి యతనియనుగ్రహమును జెంది పరిశుద్ధుఁడయి క్షుద్బాధావిముక్తుఁడయి తనచేవిడువఁబడిన ప్రేతరూపశరీరమదృశ్యముగుటకద్భుతంబంది పరమానందభరితుఁడయి సత్యలోకంబున సుప్రతిష్ఠితుఁడయ్యెనని శ్రీమద్రామాయణంబునవినఁబడుచున్నదికదా? కాన పూర్వకృతకర్మమునకిపుడుశోకించి ప్రయోజనములేదు. అనివగచి పండరిపురమునకుఁబోయి భార్యాపుత్రాదులను వెంటఁబెట్టుకొని మంగళవటమునకు వచ్చెను. ఆదేశవాసులగుదీనజనులందఱు దామాజిపండితునియౌదార్యమునువిని యన్నార్థులై వేలకొలఁదివచ్చి మంగళవటముచేరి దామాజిపండితునిఁజూచి యోమహాత్మా యన్నమునకు లేక పెక్కండ్రుమడిసిరి. శేషించిన మేము మేఘమును నిరీక్షించుచాతకములవలె నీకటాక్షమును నిరీక్షించుచున్నామని చెప్పినవిని దామాజిపండితుఁడు కర్ణునియౌదార్యమునకంటెనధికమగు నౌదార్యముతోడను, జీవకారుణ్యముతోడనుగూడి పరమపతివ్రతయగు తనభార్యనవలోకించి యోవనితా యిపుడుమనకు కర్తవ్యమెద్ది? వేలకొలఁదిదీనజనులతిథులయిమనయొద్దకువచ్చిరి. అనంతరూపియగు పండరినాథుఁ డాయనంత[illegible]ముగ

బహుజనరూపియై సేవయొసఁగెనుగాఁబోలు. స్వార్జితముగు ద్రవ్యమునంతయు నతిథులకువినియోగించిరిక్తుఁడనయితిని. ఓయువతీమణీ చితప్పచెప్పితిని. అదియేమన్న నాప్రాణేశుఁడగు పండరినాథుఁడు సర్వమునకధిపతియై యుండన తనిపుత్రుఁడనగు నేనెట్లురిక్తుఁడనగుదును. (స్వదేశంభువనత్రయం) అనురీతిని దైవాధీనమగుసర్వప్రపంచమునాదై యుండ నేనెట్లురిక్తుఁడనగుదును. భగవద్ద్రివ్యముచే భగవత్స్వరూపులగు వీరలనారాధించెదను. రాచటీకము వారికిచేరవలసిన పెక్కువేల గరిసెలధాన్యము నాస్వాధీనముననున్నది. దానిని శ్రీపాండురంగనికి ప్రీతిగవినియోగించెద. నాయందావేశించి యిచ్చువాఁడును, వీరలయందావేశించి పరిగ్రహించువాఁడును శ్రీపాండురంగఁడేకదా? సర్వగతుఁడగు నాదేవదేవుఁడు రాజునకును అంతర్యామియైయుండువాఁడు. కాన నేను జేయుకార్యమునకు రాజుసంతోషించుననితలఁచెదను. ఒకవేళ రాజునకు నాయందుకోపముకలిగిన నన్నొకనినిమాత్రమేగదా శిక్షించును. ఆజగదీశునికరుణచే నింపటాత్మలుసంతోషింతురుగదా? అదియనాకుపురుషార్థము. అని చెప్పి ధాన్యశాలలను తెఱచి భగవత్స్వరూపులగు జనులారా? మీకువలసినట్లుధాన్యములను గొనిపొండు. అనినియమించెను. ఆప్రజలువిచ్చలవిడిగ ధాన్యములనుగొనిపోయిరి. మూఁడు మాసములలో ధాన్యశాలలన్నియురిక్తములయ్యెను. దామాజిపండితునియాదార్యము లోకమంతయువ్యాపించెను. సకలప్రాణులునానందభరితులయిరి.

దామాజిపండితునికార్యనిర్వాహకులలో దుష్టచిత్తుఁడగు నొకఁడీవృత్తాంతమును రాజునకెఱుకచేసెను. అప్పుడా రాజాగ్రహగ్రస్తుఁడయి దామాజిపండితునినిబట్టికట్టితెండని తనభటులనుబంపెను. వారలు మంగళవటమునకువచ్చి రాజునాజ్ఞను దామాజిపండితున కెఱిగించి యతనిఁదోడ్కొనివచ్చుచుండఁగా మార్గమధ్యముననుండు పండరిపురమునుప్రవేశించివచ్చునపుడు దామాజిపండితుఁడా భటులను బహువిధములప్రార్థించి వారియనుమతినిఁజెంది భగవన్మందిరమునప్రవేశించి శ్రీమత్పండరినాథుని సేవించి భగవంతునిట్లనిస్తుతింపసాగెను. అంతములేనిదియు, దాఁటఁగూడనిదియు, కామక్రోధమోహాదితిమితిమింగిలాదులచే భయంకరముగునదియునగు సంసారసాగరమును దాఁటుటకు నావయయి దానికి సీమాభూమియయియుండువాఁడును, ఉపదేశపరంపరచే నెఱుఁగఁబడఁదగినవాఁడును, అనంతశక్తియుక్తుఁడును, దేశకాలవస్తువులచే నపరిచ్ఛేద్యుఁడును, నిజనామప్రభావముచే కర్మయోగాదులకు ఫలప్రదానశక్తినిచ్చువాఁడును, బ్రహ్మాదిసకలాత్మకోటులకుత్కృష్టుఁడును, నిరతిశయానందరూపుఁడును, బ్రహ్మాదులవలె కాలవశ్యుఁడుగాక సకలశక్తియుక్తుఁడయి, నిత్యమై, లేజోమయమయి, ప్రకాశించుదివ్యమంగళవిగ్రహముతోఁగూడి యానందస్వరూపియై యుండువాఁడును, ప్రధానమునకు సీమాభూమియై వేదవైదికములనుపరిపాలించు వాఁడయి ప్రధానమును జీవుఁడును ప్రళయకాలమునలయించు స్థానమయి సర్వమునకును సాంకర్యములేకుండునట్లు సేతువై ముక్తాత్మలకంటెనుత్కృష్టుఁడని చెప్పఁదగిన కారణత్వ శేషిత్వయుక్తుఁడయి ప్రపంచమునకు పర్యవసానకాలమున పర్యవసానస్థానమై యాకాశాదివిభుద్రవ్యములయందు నిండినవాఁడయియుండు శ్రీవిష్ణుదేవా? జగత్తునకు కారణముగు విరాట్పురుషుఁడును, దానికి కారణముగునహంకారమును, దానికి కారణముగుమహత్తత్వమును, దాని

కారణముగు ప్రకృతియునై యీతత్త్వములయొక్క ముఖ్యకార్యములయి కార్యకారణరూపముగనగపడుచుండుస్వాభావికములును, అనంతములునగుజ్ఞాన, బలైశ్వర్య, వీర్య, శక్తి, తేజో, సౌశీల్య, వాత్సల్య, శౌర్య, ధైర్యాది సకలకల్యాణగుణములకు నాశ్రయుఁడయిక్రియాస్వరూపములచేతను కర్తృస్వరూపములచేతను చేతనాచేతనముల నెల్ల రక్షించెదవు. వేదముల కధిపతియు, వేదవేదాంతవేద్యుఁడును, వేదవేదాంతశాస్త్రస్వరూపియు నీవేకాని వేఱుకాదు. శాస్త్రజన్యమనియు, వివేకజన్యమనియుఁ జెప్పఁబడు ద్వివిధజ్ఞానములును వేదప్రవర్తకుఁడగుబ్రహ్మయు, స్మృతిప్రవర్తకులగు మన్వాదులునునీవే. అపక్షయాదిదోషరహితుఁడై జననరహితుఁడయి, యక్షరుఁడయి, నిత్యుఁడగుపరబ్రహ్మమునీవే? అట్టినీవుభక్తపరిపాలనార్థము పండరిక్షేత్రమున శ్రీపాండురంగనామముతోఁగూడిన యర్చారూపివైయవతరించి ప్రకాశించెదవు. కాననిన్ను సేవించి చింతించి శరణాగతుఁడైననావిషయమున సత్క్రియాయోగములకు హానికరముగు రాగద్వేషలోభమోహాది దుర్గుణములు శాంతముకావలయును. అని బ్రహ్మపారస్తుతినిజపించి పండరినాథా నీయైశ్వర్యమును తనదనిభావించి దురభిమానగ్రస్తుఁడగురాజునన్ను శిక్షించుటకయి రప్పించుచున్నాఁడు. నీపదార్థముగు నే నెచ్చోట నేయవస్థను జెందినను నాహృదయమున నీధ్యానముమాత్రము తప్పకయుండవలయును. రాజదండనను జెందినీసన్నిధికి వచ్చి భీమనదినిఁ గ్రుంకిడినిన్ను సేవించెదను. ఆరాజాగ్రహగ్రస్తుఁడయి నాశరీరమును ఛేదించునేని ప్రకృతివినిర్ముక్తుఁడనయి విరజాస్నానముచేసి శ్రీవైకుంఠంబుననిన్ను దర్శించెదనని విన్నవించి శ్రీపాండురంగనిదివ్యరూపమును తనహృదయకోశమున పదిలముచేసికొని రాజభటులను వెంబడించి బెదరిపట్టణమునకుఁబోవుచుండెను.

ఇదియిట్లుండ భక్తవత్సలుఁడగు శ్రీపుండరీకవరదుఁడొకతలారివేషమునుధరించి నడుమునసొకజీర్ణవస్త్రమునుజుట్టుకొని చేతనొకకోలనూని లెక్కపత్రమును జేతఁబట్టుకొని రూకలసంచినితలపైనిడుకొని బెదరిపరువెత్తిపట్టణమునకువచ్చి రాజమందిరద్వారముననిలిచి మంగళవటమున నుండి దామాజిపండితుని చేఁ బంపఁబడిన తలారి ధాన్యమూల్యముగు ద్రవ్యమును లెక్కతోఁడఁదెచ్చియున్నాఁడని రాజున కెఱుకచేయుఁడని ద్వారపాలకులతోఁ జెప్పిపంపి రాజానుమతినిలోపల ప్రవేశించియాస్థానమున రాజున కెదురఁబోయి వందనముచేసి చేతులు కట్టుకొని సవినయముగ నిలుచుండఁగా ఆతలారిని రాజు చూచి యేమివృత్తాంతమని యడిగెను. అందునకు తలవరి రాజునుజూచి యోరాజా దామాజిపండితుఁడు రాచటికమువారికి చేరవలసిన ధాన్యమునుమంచి వెలకు విక్రయించి యెనుబదినాలుగులక్షలవరాలను లెక్కలతోడ నాచేతికిచ్చిపంపఁగా దేవరవారిసమ్ముఖమునకుఁదెచ్చితిని. కృపయుంచియంగీకరింపవలయునని చెప్పి తానుదెచ్చిన లెక్కలకట్టలను, రూకలసంచిని రాజున కెదుటనునిచెను. అదిచూచి రాజాశ్చర్యపడి యోరీతలారీనిన్నుఁజూచిన తలారిగతోఁచలేదు. నీశరీరమునందలి శోభ మిగులనతిశయించియున్నది. నీముఖవర్చస్సు చిత్తాకర్షకమైయున్నది. నీయవయవములు సాముద్రికశాస్త్రోక్తముగ సలక్షణములయియున్నవి. నిన్ను నే నెట్లు కావలివానినిఁగా నమ్ముదును. నీవుతెచ్చిన యీచిన్నసంచియందు ఎనుబదినాలుగులక్షలవరాలణఁగియుండుట మిగుల వింతమైయున్నది. నీయూరెయ్యది? నీపేరేమి? నీతల్లితండ్రులెవ్వరు? నిన్ను పనిచినవా

రెవ్వరు ? నీవేమి నేర్తువు? నీబంధువులెచటనుందురు. దామాజిపండితుఁడు నీకెంతవేతనమిచ్చుచున్నాఁడు. అనియడిగిన ఆతలారియిట్లనియె. ఓరాజా నావృత్తాంతమును జెప్పెదను. వినుము. నేనూరులేనివాఁడను. ఐనను లోకమంతయు నాదై యుండును. నేను నామరహితుఁడను. ఐననులోకమున సమస్తచేతనాచేతనాత్మకములగు సమస్తనామములును నాయవియై యుండును. నాకుతల్లిదండ్రులులేరు. సర్వమునకు నేనేయుత్పత్తిస్థానమైయుండును. నన్ను పెంచినవారులేరు. నేనందఱికిని పోషకుఁడనయియుందును. నేనొకటినేర్చి యొకటినేరని వాఁడను కాను. అన్నియు నేర్తును. నాకు బంధువులులేరు. అందఱును నావారయియుందురు. నేను ధామాజిపండితుడిచ్చు వేతనముచే జీవించువాఁడను కాను. సర్వప్రాణులకర్మపరిపాకము నెఱింగియందఱికిని కర్మానుగుణముగ వేతనమునిచ్చుచున్నాను. ఇట్లుండియు సర్వనివాసియగు నేను శ్రీమత్పండరిక్షేత్రవాసినైయున్నాఁడను. పుండరీకుఁడునన్నిచటనుండుమని నియమించెను. కాననాకిదియపరమోద్దేశ్యముగు వాసస్థానముయియున్నది. అనంతనామియగు నేనువిఠ్ఠలనాయకుఁడను నామముచేపిలువఁబడుచున్నాను. నాదారగారగు దామాజిపండితులు మొదలగు సాధుజనులునన్నీ పేరు పెట్టిపిలుచుచుందురు. దాననాకిది నామధేయమైయున్నది. సర్వకారణముగు నాకుతల్లిదండ్రులు దేవకీవసుదేవులు. వారలునన్ను పుత్రునిఁగవరించిరిగాన నేనువారలబిడ్డఁడనయితిని. సర్వరక్షకుఁడగు నన్ను పెంచినవారలు నందయశోదలు: వారలన్యమునెల్లకనన్నే కోరియుందురు. కాననేనువారలకు పోష్యుఁడనైయున్నాను. నేనాశ్రితులకయియెంతనీచవృత్తినయినను అనుష్ఠింపనేర్తును. వారలునాబహిఃప్రాణములు. కానవారలకయి నేనన్నియుఁజేదయును. సర్వాత్మలకు నిరుపాధికబంధువగు నాకు మన్నామోచ్చారణముచేయుచు, నిరంతరధ్యానపరులయి సకలమును నాస్వరూపముగఁజూచుచు, వైరాగ్యయుక్తులయి పరదుఃఖాసహిష్ణువులై జీవకారుణ్యముతోఁగూడియుండుపరమభాగవతులు ఇష్టబంధువులు. వారలుతమయాత్మభారమును నాపాదములయందర్పించి నిర్భయులైవర్తింతురు. కాననట్టిమహాత్ములను నేనాత్మబంధువులనుగనభిమానించి యున్నాను. సర్వాత్మలకు జీవనమునిచ్చునాకు దామాజిపండితునియానృశంస్యాదిసుగుణములే వేతనమయియున్నది. నేనునిరపేక్షుఁడనుగాన నాసద్గుణనిధియందలి సుగుణగణంబులను వేతనంబుగనంగీకరించి యతనికిభ్రుకుటభటుఁడనై యుందును. మఱియు నావృత్తాంతమునువినుము. పరమయోగులవాఙ్మానసములకగోచరుఁడనగు నేను భక్తపరాధీనుఁడనై వారలయింటివాకిట భృత్యునివలె కాచియుందును. బ్రహ్మాదులకిరీటాగ్రములచే నలంకృతములగు పాదపద్మములుగలనేను భక్తాంఘ్రిరేణువును నాకిరీటాగ్రంబునధరియింతును. మత్పాదోదకంబగు గంగచేత్రిలోకములను పావనముచేయు నేను పరమభక్తులపాదోదకంబులనుస్వీకరింతును. వేదపురుషునిస్తోత్రమునకగోచరుఁడగు నేనుభాగవతులకీర్తనలకుశిరఃకంపముచేయుచుందును. నాస్వభావమునిట్టిదనినిర్ణయించిచెప్పుటకు నేనుశక్తుఁడను గాను. నాదారగారగు దామాజిపండితునికి నీవుదారవయియుందువుగాన నిన్ను గౌరవించినీప్రశ్నలకొకవిధముగ ప్రత్యుత్తరముచెప్పితిని అని చెప్పి తనస్వరూపముచటి వారికెఱుకకాకుండునట్లు తనమాయచేవారిని మోహింపఁజేసి వర్గాలసంచినివిప్పి పర్వతాకారముగధనమును రాజునకెదురఁబోసి నేనుద్రవ్యమును జెల్లించినందులకురసీదునిమ్మనియడిగెను. రాజుసంతోషించి యెనుబదినాలుగులక్షలవరాలకు రసీదు

వ్రాసియతనిచేతికిచ్చి యతనికివస్త్రాభరణములనుబహుమానముగనిచ్చి దామాజిపండితునికి ఆందోళికలను, గజాశ్వములను, అమూల్యవస్త్రాభరణంబులను బహుమానముగనిచ్చిపంపెను. విఠ్ఠలనాథుఁడావస్తువులను మంగళవటమునకుఁదెచ్చి దామాజిపండితుని యింటఁజేర్చి యదృశ్యుఁడయ్యెను. ఆమఱునాఁడు రాజభటులు దామాజిపండితునిఁదెచ్చిరాజనకెదుర నిలిపిరి.

రాజుప్రత్యుత్థానముచేసి దామాజిపండితునికివందనముచేసియోమహాత్మా నీచేపంపఁబడినవిఠ్ఠలనాయకుఁడనుతలారి యెనుబదినాలుగులక్షల వరాలనుచెల్లించి నిన్నటిదినము రసీదునుబుచ్చుకొనిపోయెను. నీవేమియు నెఱుఁగనివానివలెనీభటులను వెంబడించివచ్చితివి. అని చెప్పఁగావిని దామాజిపండితుఁడిది శ్రీపండరినాథునిలీలయని నిశ్చయించి పాండురంగా నాకైనీవీనీచవేషమునుధరించివచ్చితివేయని చెప్పిశోకించుచునవశుఁడయిభూమిపైఁబడెను. రాజతనికి శైత్యోపచారములను జేయఁగా లేచినిలుచుండి యోరాజా నీవుమహాభాగ్యరాశివి. కాననీకుభగవంతుఁడు సేవయొసంగెనని చెప్పెను. ఆభూనాయకుఁ డానందభరితుఁడై నాతప్పులనుమన్నించి పూర్వమువలెనేయధికారమునునిర్వహించుచుండుమనిప్రార్థించెను. అదివిని దామాజిపండితుఁడు నాకిఁకనునీసేవావృత్తితోపనిలేదు. నేనిఁకమీఁదనాజీవితేశుఁడగు పుండరీకవరదునిసన్నిధిలోనివసించి కాలమునుగడపెదనని చెప్పి మంగళవటమునకువచ్చి రాజువిఠ్ఠలనాథునకునిమూలముగపంపినబహుమానములనన్నిటిని సాధుజనులకిచ్చి శ్రీమత్పండరిపురమును జేరి శ్రీరుక్మిణీకాంతునననవరతముదర్శించుచు కరణకళేబరములచేభగవన్ముఖోల్లాసకరములగు కైంకర్యములనుజేయుచు నచటనిత్యావాసముచేయుచుండి పరమపదమును బ్రాపించెను. ఈమహానుభావునిసచ్చరిత్రము నిత్యానుసంధేయమని గౌరవించిసాధుజనులెడతెగక స్తుతించుచుండిరి.

భక్తజనపరతంత్రాయనమః.

## నలువదియొకటవయధ్యాయము.

---

శాంతపమణిరాజుచరిత్రము.

బెదరియనుపట్టణమున శాంతపమణియనురాజు రాజ్యముచేయుచు విషయానుభవమునమగ్నుఁడై యనవరతముయువతులగోష్ఠినుండి కాలముగడపుచుండెను. ఒకనాఁడీరాజు దివ్యములగు వస్త్రాభరణాదులచేనలంకృతుఁడయి సాలంకృతలగువనితలతోడనంతఃపురమునవిహరించుచు గవాక్షములసమీపముననుండి మధురములగుఫలములనుభుజించుచు నాఫలములతోళ్లను ఆగవాక్షములదారిని వెలుపలపాఱవైచుచుండెను. అట్టిసమయమున సుస్మృతప్రాయుఁడగుబనుగు అనుజ్ఞాని రాజభటులకు తెలియకుండునట్లుచేటికివచ్చి రాజుపాఱవేయు పండ్లతోళ్లనేరికొని భుజించుచుండెను. అదిరాజస్త్రీలుచూచి యోరాజా యెవ్వఁడో పరపురుషుఁడీయంతఃపుర గవాక్షములచెంతనుండి మనము పాఱవేయుపండ్లతోళ్లనేరుకొని భుజించుచున్నాఁడనిచెప్పి చూపినరాజుకోపించి భటులనురావించివారలయజాగ్రత్తకయి వారలనుశిక్షించి, నిర్భయుఁడయి యంతఃపురముగవాక్షములచెంతకు ... న

మర్దించి, పాఱఁదోలిరండని నియమించెను. భటులురాజునాజ్ఞాప్రకారము ఆబనుగునుమర్దించిరి. ఉన్మత్తప్రాయుఁడగుబనుగు రాజభటులు తన్నుఁగఠినముగఁగొట్టుచుండఁగా నాదెబ్బలకు నోర్చుకొనినవ్వుచుండెను. అదిచూచిరాజువానినికొట్టకుఁడనిభటులకాజ్ఞాపించి యాబనుగును తనయొద్దకురప్పించి యోరీయున్మత్తుఁడా నీవుకఠినముగుదెబ్బలకు శోకింపకనవ్వుటకు కారణమేమనియడిగెను. ఆబనుగుమరలనవ్వియోరాజా పాఱవైచినపండ్లతోళ్లనుభుజించునాకీశిక్షనువిధించిన, పండ్లనుభుజించు నీకెట్టిశిక్షనుసర్వేశ్వరుఁడువిధించునోయనియు, రాజగృహమునకు వెలుపలవర్తించుననన్నిట్లుశిక్షించిన నంతఃపురాంతర్వర్తివగునిన్నుఈశ్వరుఁడెట్లుశిక్షించునోయనియు, నేకాకియగునన్నిట్లుశిక్షించిన, పెక్కుస్త్రీలతోడక్రీడించునిన్నెట్లులోకేశుఁడు శిక్షించునోయనియు, పరులకుఁగీడుచేయని నిరపరాధియగునాకిట్టిక్రూరదండననువిధించిననీకు ఎట్టిక్రూరదండనను జగదీశుఁడువిధించునోయనియు, ఇంద్రియనిగ్రహముచేసిభగవత్పరుఁడనగునన్నిట్లుశిక్షించిన నింద్రియకింకరుఁడవయిభగవద్విముఖుఁడవగునిన్నెట్లు శిక్షించునోయనియునవ్వితిని. (త్వయిమయిసర్వత్రైకోవిష్ణుః । వ్యర్థంకుప్యసిమయ్యసహిష్ణుః । భవసమచిత్తస్సర్వత్రత్వం । వాంఛస్యచిరాద్యదివిష్ణుత్వం) ఓరాజా నీయందును, నాయందును, సర్వమునందునొకవిష్ణువేవ్యాపించియున్నాఁడు. అట్లుండ వ్యర్థముగనసహమానుఁడవయి నాయందుకోపమును జెందితివి. నీవుత్వరితముగా విష్ణుసాయుజ్యమునుగోరుదువేని యీశ్వరవిభూతియగు సమస్తచేతనాచేతనములయందును సమభావముతోఁగూడియుండుము. అనిచెప్పినమాటలనువినినంతట రాజునకుజ్ఞానోదయమయి వైరాగ్యవంతుఁడై సుతులను హితులనువిడిచి, చుట్టాలనువిడిచి, యిల్లాండ్రనువిడిచి, బహుబలాలినివిడిచి, ధనమునువిడిచి తనజడ్డుతనమునువిడిచి యారాజురాజీవనయనునిమీఁద తనహృదయమును బాదుకొల్పెను. ఇట్లుబనుగు చెప్పినమాటలనువినినమాత్రమున భగవత్కటాక్షముచేరాజునకు భక్తివిరక్తులంకురించి నిర్జనవనంబునప్రవేశించివిజనస్థలంబునఁగూర్చుండియకటామేలైన మానవశరీరమును జెందియు విషయానుభవముచే కాలమును వృథపుచ్చితిని. భగవంతుఁడుజడప్రాయుఁడగుబనుగురూపముగవచ్చి నన్ననుగ్రహించెను. నేనెవ్విధముగభగవంతునినారాధించి కృతార్థుఁడనగుదునోయని యాలోచించుచుండపండరియాత్రచేయుసాధుజనులు గుమిగూడి సకలచరాచరములయుత్పత్తికిచోటగునాభీపుటముగల భగవంతునిఁగీర్తించుచు నానందనటనముచేయుచు దారినిఁబట్టిపోవుచుండిరి. రాజువారలనుజూచి పరమానందభరితుఁడయిలేచివచ్చి వారికి ప్రదక్షిణనమస్కారములుచేసియోసాధువులారా నేఁడునాకుసుదినము.. నేనుసుమిమ్ము వెంబడించి పండరిపురమునకువచ్చి చంద్రభాగయందు స్నానముచేసియిందిరేశునిమందిరమునప్రవేశించియచటనుండు సాధుబృందమునకువందనముచేసికటిహస్తుఁడై యిటికఱాతిపైనిలుచుండు పుండరీకవరదునిని దర్శించిగాఢాలింగనముచేసి యాపురుషోత్తముని పాదపద్మములనలంకరించి (నమోస్త్వనంతాయసహస్రమూర్తయే । సహస్రపాదాక్షిశిరోరుబాహవే । సహస్రనామ్నే పురుషాయశాశ్వతే । సహస్రకోటీయుగధారిణేనమః) అనిస్తుతియించిపండరినాథా అజ్ఞానకూపమునమునిఁగియుండిన నాకుబనుగురూ[illegible]వచ్చి జ్ఞానోపదేశముచేసితివి. నేనిదివఱకు సాధుసహవాసమునొం[illegible] [illegible]గను. నీసాన్నిధ్యమునీయాత్మ[illegible] శేషముగ పరిగ్రహింపుము. ఇదిమొదలు నా[illegible]

మున నాకన్వయములేదు. నీవు నాకాత్మవయి నేను నీకు శరీరముయియుండుటచే నీశరీరము నందలిముట్టికిని నీవేపోఁగొట్టుకొనుము. అనివిన్నవించి గోపురద్వారమునకువచ్చి యన్నపానములను వర్జించి మూఁడహోరాత్రములుపవసించియుండెను. శ్రీరుక్మిణీకాంతుఁడు మూఁడవనాఁటిరాత్రియతని స్వప్నమున సాక్షాత్కరించి వివేకసింధువనుగ్రంథము నతనిచేతికిచ్చి యోవత్సా నీవు శోకింపకుము. నీప్రార్థనమంగీకరించి నీరక్షణభారమును నేనేవహించితిని. కల్యాణపురమున సహజానందస్వామియను నొకమహాత్ముఁడుకలఁడు. నీవతనికి శిష్యుఁడవయి యతనిచే నుపదేశమును జెందుము అనియనుగ్రహించి యదృశ్యుఁడయ్యెను. రాజుతోడనే మేల్కని భగవంతుఁడు స్వప్నమున తనకిచ్చిన పుస్తకము ప్రత్యక్షముగ తనచేత నుండుటను జూచి యాశ్చర్యపడి (అద్యమే సఫలం జన్మ । సుప్రభాతా చ మే నిశా) నా జన్మము నేఁడు సఫలమయ్యెను. నారాత్రియుంచి ప్రభాతముకలిగినదాయెను. అని చెప్పి తనకు భగవంతుఁడనుగ్రహించిన వివేకసింధువనుగ్రంథమును జదివి మననము చేయుచుండఁగా నితనిభాగ్యవిశేషముచే సహజానందస్వామి పుండరీకవరదుని సేవార్థము పండరిపురమునకువచ్చెను. రాజు పెన్నిధానమును బొడగన్న పేదవలె సహజానందస్వామికి ప్రదక్షిణనమస్కారములు చేసి తన స్వప్నవృత్తాంతమును విన్నవింపఁగా నామహాత్ముఁడు సంతసించి పరమకృపతోడ శ్రీతారకమంత్రము నుపదేశించి యతనికి మృత్యుంజయుఁడను నామమునిచ్చి శ్రీపాండురంగని దర్శించి కల్యాణపురమునకు పోయెను. మృత్యుంజయుఁడు గురూపదిష్టమార్గమున నిలిచి యనవరతమనన శీలుఁడయి పరమానందమనుభవించుచు నారాయణపురమున వాసము చేయుచుండెను. ఆయూరిలో నుండు భవరాయజంగమను వాఁడు మృత్యుంజయు నాశ్రయించి యతని యనుగ్రహమును జెంది యనవరతము భగవద్గుణానుభవము చేయుచుండెను. అచటనుండు జంగములలో శ్రేష్ఠుఁడును, హంసుఁడను పేరుగలవాఁడు నగు జంగమీవృత్తాంతమును విని భవరాయజంగమును బిలిపించి జ్ఞానవంతుఁడయినను అన్యజాతివాఁడగు మృత్యుంజయుని నీవెట్లాచార్యునిఁగ పరిగ్రహించితివి. మాయనుమతిలేక నీవు తప్పుచేసితివి. కానభ్రష్టుఁడవైతివి. ఇత్తడి బంగారముచే పూయఁబడినను అది బంగారమగునా ? అట్లు మృత్యుంజయునికెంత జ్ఞానము కలిగియుండినను అతఁడు మనవలె జంగమగునా ? అని చెప్పి యచటి జంగములనందఱిని జేర్చి యైకకంఠ్యముగ మాటాడి భవరాయజంగమును తమజాతినుండి వెలిచేసిరి. అందులకు భవరాయజంగము శోకించి తనకాచార్యుఁడగు మృత్యుంజయునియొద్దకువచ్చి నమస్కరించి జరగినవృత్తాంతమును విన్నవింపఁగా విని మృత్యుంజయుఁడు భవరాయజంగమును జూచి నీవేల శోకించెదవు. ఎవరు దూషించినను ఎవరు భూషించినను నీకేమి ? దూషణభూషణములు శరీరంబునకే కాని యాత్మకు లేవు. ఆత్మజ్ఞానానందస్వరూపుఁడయి, జ్ఞానగుణకుఁడయి, నిత్యుఁడయి, యవికారియై, భగవంతునికి శేషభూతుఁడయియుండును. హంసుఁడు మొదలగువారు నీకవమానము చేయుదు మనియెంచి నీశరీరమున కవమానము చేసిరి. ఒకపురుషుఁడు జనశూన్యమగు నరణ్యమునఁ బోవునపుడు తన్ను బాధింపవచ్చిన జంతువును మఱియొకఁడువచ్చి సంహారించెనేని తాను సంతోషించి యాక్రూరజంతువును హింసించినవానికి బహుమానమును జేయునుగదా ? అట్లు సంసారమరుకాంతారమున పరిభ్రమించు చేతనునికి శరీరము విరోధియైయుండును. ఎట్లనిన ఘటమున నుంచఁబడిన దీపముకాంతిని ఆఘటము నిరోధించునట్లు ఆత్మయొక్క జ్ఞానవ్యాప్తి

अन-मिल हूँ तो मारी जो मिलिहैं ताहि मारि हैं ॥ सुनरी ए चेरी तेरी सौंह मैं कहत वे तो,हरि सरस नयन आँसुहू न ढारिहैं ॥ बडे हैं शिकारी पर इन्हें न सँभागी नारी, मारबेको नवल कन्हैया तलवारि हैं ॥ १७ ॥

याही कुञ्ज तर वह गुंजत भँवर भीर, याही कुंज तर अब शिर न धुनत हैं॥याही रसनाते करीं रसकी रसीली बातें,याही रसना ते अब गुण न गनत हैं ॥ आलम बिहारी बिन हृदय अचेत भये, एहो दई हित कहु कैसेके बनत हैं ॥ जेही कान्ह नयनके तारे हुते निशि दिन,तेही कान्ह कानन कहानीसी सुनत हैं ॥ १८ ॥

आयो आयो भयो ऊधो अब ब्रज मण्डलमें, रागमें कुराय योग रीतको सुनायो है ॥ झोली झन्डा गूदड़ी और भस्म मुद्रा काननमें,हाथनमें खप्पर ये स्वाँगले दिखायो है ॥ संयम नियम ध्यान धारणा दृढ़ासन हो,ब्रह्मको प्रकाश रस रास दरशायो है॥ कूबरीपै पढ़ आयो वेदको भुलाय आयो, रथ चढ़ आयो अनरथ गढ़ लायो है ॥ १९ ॥

जोगी तजे जग हम जग जोग दोऊ तजे, जोगी लावें छार हम छारहूके मटिहैं॥जोगी बँधें कान हम हीये अरु प्रान बंधें, जोगी कहैं नाथ हम नाथ नाथ रटि हैं ॥ जोगी कान मुद्रा हम भूषण बनाय राखे, म्हारे शिर केश बहु जोगी शिर जटि हैं ॥ जानके अजान आज ये कहा भये ऊधोजी, जोगीकी जुगत सों वियोगी कहा घटि हैं ॥ २० ॥

श्याम तन श्याम मन श्यामही हमारो धन, आठों याम ऊधो हमैं श्यामही सों काम है ॥ श्याम हीये श्याम जीये श्याम बिन नाहिं तीये, आंधे कीसी लाकरी अधार श्याम नाम है ॥ श्याम गति श्याम मति श्यामही हैं प्राणपति, श्याम सुखदाई सो

యాశ్వానములను పేరుపెట్టిపిలిచి వానినిజూచి యాజంగములశివలింగములనుమీరేలకబళీకరించితిరి. వానినివారికిచ్చివేయుఁడనినియమించెను. మృత్యుంజయునిమాటలువిని శ్వానరూపములగు వేదాంతసిద్ధాంతములు తాముకబళీకరించినశివలింగములను అందఱుచూచుచుండఁగాకక్కిబయలుపఱిచెను. ఈయతిశయమునుజూచియందఱును ఆశ్చర్యపడిరి. జంగములు మృత్యుంజయునిజూచి మహాత్మా యీపదివేలశివలింగములలో నెదియెవరెవరిచే నారాధింపఁబడినదో మాకు తెలియలేదు. నీవుమాయందుకరుణించి వారివారిశివలింగములను వారివారికిప్పింపవలయునని వేఁడెదము. అనిచెప్పఁగా మృత్యుంజయుఁడు పరమేశ్వరునిధ్యానించెను. తోడనే వారువారారాధించుచుండిన శివలింగములు తమంతటవచ్చి వారివారిహస్తములలో చేరెను. వారందఱునుసంతసించి పూర్వమువలె ఆశివలింగములను తమతమహస్తములయందుకట్టుకొని మేఘగర్జనమువలె భగవంతునిస్తుతించి మృత్యుంజయునికిస్తుతిప్రదక్షిణవందనములుచేసిరి. అప్పుడు హంసుఁడు మొదలగుజంగములందఱు సాక్షాత్కైలాసపతి మృత్యుంజయరూపమును పరిగ్రహించి మనలనరకకూపమునఁబడనీక రక్షించెను. ఇతనికిసహజానందస్వామి మృత్యుంజయుఁడని నామకరణముచేసినదితగును. ఈమహాత్మునిమఠమున వేదాంత, సిద్ధాంతములు శ్వానరూపములయి యితనికినధీనములై యుండుటచే నితఁడే వేదాంతవేద్యుఁడనిచెప్పి యాపరమయోగినియమనమును జెంది రాజుగృహమునకుపోయి పరమేశ్వరునికి మహానైవేద్యముచేసి తచ్ఛేషమగుదివ్యాన్నమునుస్వీకరించెను. ఈజంగములందఱును భవరాయజంగమునకు నమస్కరించి యపరాధక్షాపణముచేసికొనియతనిని తమకులదైవముగభావించి యారాధించిరి. శ్రీపండరినాథుఁడు తనభక్తులనుదూషించినవారిని శిక్షించి వారలను అనుతాపయుక్తులంజేసిరక్షించెను. మృత్యుంజయుఁడు తనయుపదేశానుష్ఠానములచే ననేకాత్మలకు భక్తివిరక్తులనుగలుగఁజేసి భగవత్సాయుజ్యమును జెందెను.

భాగవతాపచారాసహిష్ణవే నమః.

## నలువదిరెండవయధ్యాయము.

### భానుదాసునిచరిత్రము.

పైట్ని పురమునందు సూర్యోపాసకుఁడగునొకబ్రాహ్మణునికి పరమశివాంశముచే నొకపుత్రుఁడు జనించెను. ఆపుత్రునకు తల్లిదండ్రులుచితకాలంబున చౌలో,పనయన, వేదాధ్యయనంబులఁజేయించి యాబాలకుని నొకయుపాధ్యాయునియొద్ద చదివింపఁబంపిరి. విద్యాభ్యాసమునందు శ్రద్ధలేనియీబాలుఁడు పాఠశాలయందు నొకగడియయైనను కుదురుపడినిలువక పాఱిపోవుచుండెను. ఉపాధ్యాయుఁడెంతశిక్షించినను, తండ్రిగ్రుడ్లుఱిమి యెంతగఁగోపించినను, పప్పుబెల్లములిచ్చి తల్లియెన్నిహితములను జెప్పినను పాఠములను జదువక యెల్లప్పుడాటలయందేయాసక్తికలిగియుండెను. ఇట్లుండ నొకనాఁడు వానిమీఁద తండ్రి మిగులఁగోపింపఁగా ఆబాలుఁడెవరికిని జెప్పకయడవికి పరుగెత్తిపోయెను. ఇట్లుపోయి యరణ్యమధ్యమున నొకపర్వతమునుజూచి యాపర్వతగుహాయందుప్రవేశించి యచటనర్చారూపమునుబరిగ్రహించియుండిన సూర్యనారాయణమూర్తికి సాష్టాంగవందనముచేసి నిలు

చుండఁగా సూర్యనారాయణుఁడీబాలకుననుగ్రహింపఁగోరి మనుష్యరూపమునుబరిగ్రహించివచ్చి యొకగిన్నెలో గోక్షీరమునిచ్చి యోవత్సా యీక్షీరమునుగడుపునిండ పానము చేయుము. అనవరతము నీవుశ్రీపాండురంగనాథునిభజింపుము. ఆదేవదేవునిభజించుటచే నీవెల్లరకును మాననీయుఁడవయియుందువు. ఆదేవశిఖామణినుపాసించి ధ్రువుఁడు సర్వోత్కృష్టపదవినిఁజెందెను. ఆజగదీశుఁడు తనభక్తుఁడగుప్రహ్లాదునికయి సభాస్తంభమున నవతరించి, యాభాగవతోత్తమునిమాటను నిజముచేసెను. బలిచక్రవర్తికి భావిదేవేంద్రాధిపత్యమునొసఁగియిప్పటికిని అతనిగృహద్వారమున వసించియాసుశీలునిని రక్షించుచున్నాఁడు. మఱియు నాసర్వాత్మకుఁడు నిజభక్తులకయిచేసిన యద్భుతకార్యములను లెక్కింపశక్యము కాదు. నీవావిఠ్ఠలనాథునిని భక్తియుక్తుఁడవయి భజింపుము. ఆలక్ష్మీకాంతునారాధించు క్రమంబును జెప్పెదనువినుము. (జిహ్వాకీర్తయకేశవంమురరిపుం చేతోభజశ్రీధరం। పాణిద్వంద్వసమర్చయాచ్యుతకథా శ్రోత్రద్వయత్వంశ్రుణు। కృష్ణంలోకయలోచనద్వయహరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం। జిఘ్రఘ్రాణముకుందపాదతులసీం మూర్ధంనమాధోక్షజం) అనఁగానాలుకచేఁగేశవునిని కీర్తింపుము. మనసుచే మురవైరిని భజింపుము. చేతులతో శ్రీధరునిసర్చింపుము. చెవులతోనచ్యుతుని దివ్యచరిత్రములనువినుము. కన్నులతోశ్రీకృష్ణుని దర్శింపుము. పాదములతోశ్రీహరిసన్నిధికినడచిపొమ్ము. ముక్కుతోముకుందుని పాదతులసీని ఆఘ్రాణింపుము. శిరముతో నధోక్షజునికి వందనములుచేయుము. అనాదికాలముగ పెక్కుజన్మములనెత్తి యింద్రియకింకరుఁడవయి సంసారమరుకాంతారంబునందు దారిదెలియక పరిభ్రమించుచుండిననీకు భగవంతుఁడు పరమకృపచేనుత్తమమగు మానుషజన్మమునిచ్చెను. ఈమనుష్యశరీరముచే నన్నింటినిసాధింపవచ్చును. ఈశరీరమునముముక్షువయి భగవత్ప్రాప్తినిఁజెందవేని మఱిలనీకిట్టిమనుష్యజన్మముగలుగుటదుర్లభము. (విచిత్రాదేహసంపత్తి। రీశ్వరాయనివేదితుం। పూర్వమేవకృతాబ్రహ్మన్। హస్తపాదాదిసంయుతం) అనఁగాభగవద్విషయమునవినియోగించియుజ్జీవించుటకు సాధనముగ కరచరణాద్యవయవములతోఁగూడి విచిత్రమగుదేహసంపత్తి నీకు భగవదనుగ్రహముచే సిద్ధించెను. ఈకరణకళేబరములను ఆజగన్నాథునివిషయమున వినియోగింపుము. అట్లుచేయక దుర్వినియోగముచేసితివేని అది వ్యభిచారమగును. యమదండన తప్పదు. కానజాగరూకుడవయి విషయములనెడిక్రూరమృగములబారికిఁదప్పి శ్రీవాసుదేవతరుచ్ఛాయను నాశ్రయించియుజ్జీవింపుము. నేనిచ్చిన క్షీరముచే నీవు విద్యావంతుఁడవగుదువు. అనియనుగ్రహించి సూర్యనారాయణుఁడదృశ్యుఁడయ్యెను. భానునియనుగ్రహమును జెందుటచే నితఁడు భానుదాసుఁడను పేరప్రసిద్ధుఁడయ్యెను.

పైట్ని పురమునందితనితల్లిదండ్రులు పుత్రునిఁగానక యేడుదినములు బహుస్థలములయందు వెదకియు, వెదకించియు నెందునుగపడనందున ఖిన్నులయియుండిరి. ఇట్లుండ నొకబ్రాహ్మణుఁడరణ్యమధ్యప్రదేశమునందలి పర్వతసమీపమునబ్బాలకునింగాంచినాయనానీయింటికిరమ్మనిబతిమాలిపిలిచినను అతఁడురానని చెప్పి యరణ్యమునందు ప్రవేశించెను. భానుదాసునితల్లిదండ్రులు ఈవృత్తాంతమా బ్రాహ్మణునివలనవిని సంతోషించుచు నరణ్యమునందు ప్రవేశించి పుత్రుని వెదకివెదకి కానకతుట్టతుదకు పర్వతగుహాయందుండవచ్చు

నని శంకించి యందుప్రవేశించి చూడఁగా తమపుత్రుఁడచ్చటనర్చారూపియగు సూర్యనా రాయణమూర్తిపాదములయందు శిరస్సునుంచుకొని నిర్భయుఁడయిపరుండి నిద్రించుచుం డెను. తల్లిదండ్రులు అమందానందమును జెందితమచేతులతో ఆబిడ్డనిగ్రుచ్చియెత్తి ముద్దుపెట్టుకొని శిరంబుమూర్కొని యోరీయర్భకా నీవేలయీనిర్మానుష్యమగుస్థలమునందు వసించెదవు. బాలుఁడవగునీవెట్లు ఈపర్వతగుహయందు నిర్భయుఁడవయియున్నాఁడవు. నీ విల్లువిడిచి నేటికేడునాళ్లయ్యెను. దేనినాహారముగఁగొనిక్షుత్పిపాసలనుభరించినేడుదినములు ఇచ్చటనీవుజీవించియు న్నాఁడవు. అనియడిగినభానుదాసుఁడు జననీజనకులకు వందనముచేసి మద్దేవతలారా నేనుచదువలేదని మీరునన్ను బెదరించినందున నామనస్సురోసి యడవికివచ్చితిని. నేనీగుహ నుప్రవేశించి యీసూర్యనారాయణమూర్తికివందనములుచేసి నిలుచుండఁగా మహాతేజ స్వియగునొక విలక్షణపురుషుఁడు నాకుప్రత్యక్షమయి యొకపాత్రమున గోక్షీరములనిచ్చి నాకుహితంబునుపదేశించి యదృశ్యుఁడయ్యెను. నేనాక్షీరమునుగ్రోలితిని. అదిమొదలు భగ వదనుగ్రహముచేనాఁకలిదప్పులు నన్నుబాధింపకయున్నవి. సమస్తప్రపంచము ఈశ్వరస్వ రూపమయితోఁచుచున్నది. నేనును, నన్నుకనిపెంచిన మీరలును, నాకుతత్త్వోపదేశముచే సినసూర్యనారాయణుఁడును, నేనువసించుచుండు పర్వతగుహయును భగవత్స్వరూపము గా నాకంటికగపడుచున్నది. ఓజననీజనకులారా నేనేమిచెప్పుదును. ఆలక్ష్మీకాంతుఁడు లేనిచోటులేదు. వాఁడేనాకుధారకమయి, పోషకమయి, భోగ్యమయి, యున్నాఁడు. మీ రునాయందలి మమకారమువిడిచి యాజగదీశునిభజించినకృతార్థులరగుదురు. నాకువిద్య నేర్పవలయునని మీరుపెక్కుపాట్లుపడియు మీయత్నము ఫలింపదయ్యె. ఇపుడు శ్రీమన్నా రాయణానుగ్రహముచే సకలవిద్యలును నాకుస్వాధీనములై యున్నవి. అతఁడుతలఁచిననణు వుమేరువగును. పిపీలికముబ్రహ్మయగును. సర్వమునుసృష్టించి, రక్షించునట్టిపురుషోత్తముఁ డేయందఱికిని తండ్రియైయుచున్నాఁడు. కాన మనమందఱమును ఆజగజ్జనకునిని భజియిం చిన మనము ప్రకృతి వినిర్ముక్తులమయి ముక్తులమగుదుము. అనిచెప్పినపుత్రునివచనములను విని తల్లిదండ్రులు మనము సూర్యోపాసకులము కాన సూర్యనారాయణుఁడుప్రసన్నుఁ డయి మనబిడ్డనిరక్షించెను. అతనియనుగ్రహముచే ప్రహ్లాదునివలె వీనికిబాల్యమునందేభగ వద్భక్తి పరిపక్వమయియున్నది. అనిచెప్పినమస్కారప్రియుఁడగుసూర్యనారాయణునికి ననంతవందనములుచేసి భానుదాసునివెంటఁబెట్టుకొని యింటికివచ్చి వానిని కులదైవముగభా వించియుండిరి. భానుదాసునికి యౌవనము వచ్చినంతట తల్లిదండ్రులుతుల్యశీలవయోవృత్త ములతోడను, ఆభిజాత్యముతోడను గూడియొప్పునొక కన్యకనుదెచ్చి వివాహముచేసిరి. ఆ యువతియందు భానుదాసునికి సంతతికలిగి వర్ధిల్లుచుండెను. ఇట్టికాలమున భానుదాసుని జననీజనకులుపరలోకగతులైరి. భానుదాసుఁడు సంసారచింతలేక యనవరతము పాండు రంగస్మరణముచేయుచుండెను. ఇతనిభార్యాపుత్రాదులు అన్నవస్త్రములకులేక కష్టపడు చుండిరి. ఇట్లుండ నాయూరిలోవ్యాపారమునుచేయువర్తకులుకొందఱు భానుదాసునిఁజూ చినీవెటతెగక పాండురంగస్మరణచేయుచు లోకచింతలేకయున్నాఁడవు. నీతల్లితండ్రులు జీవించియుండు పర్యంతము కుటుంబరక్షణభారము వారిదయియుండెను. ఇపుడు నీవు కు టుంబరక్షణమునకు పూనుకొనక మున్నట్టియట్లుండిన నీకుటుంబమునెవరు పోషింతురు.

మేము నీకునన్నూఱువరాలిప్పించెదము. వానికిగుడ్డలుతీసి వ్యాపారముచేసి తన్మూలముగ వచ్చులాభముచే కుటుంబరక్షణమును జేయుచు కొంతకొంతగమాయప్పనుతీర్పుము. అని చెప్పి భానుదాసునిసమ్మతిపఱిచి నన్నూఱువరాలకును వస్త్రములుకొనియిచ్చియతనికొక వర్తకశాలనుగుదిర్చి వ్యాపారముచేయువిధమునునేర్పించిరి. భానుదాసుఁడు వర్తకముచేయుచుండియు తులాధారునివలెనతనిమనస్సు అతినిర్మలమయియెందునునంటకయుండెను. మఱియు భానుదాసుఁడు సత్యవ్రతుఁడయి తానువిక్రయించువస్త్రములనుగొన్న క్రయమును నిజముగచెప్పి స్వల్పలాభమునకిచ్చుటచే అందఱును నితనివర్తకశాలకే వచ్చుచుండిరి. కొన్నిదినములలోనితనికి అధికలాభముసిద్ధించి యప్పిచ్చినవారికి వడ్డితోడద్రవ్యమును చెల్లించెను. వస్త్రములుకొనవచ్చువారికి స్వల్పముగులాభమునకు వస్త్రములనిచ్చుచు వారలకుహితోపదేశముచేయుచుండెను. ఎట్లనిన ఓజనులారా పుండుమీఁదచుట్టుటకు కనకాంబరమును వెదకువారివలె హేయమగుశరీరమునకు మంచివస్త్రములనేలఁ గొనియెదరు. మీకోరినట్లుకొనిపొండు. అయినను తత్వమునించుకయూహింపుఁడు. మీరెంతమంచివస్త్రములచే శరీరమునలంకరించినను లోపలనుండుమల, మూత్ర, రక్తాదులు, వానిస్వభావము మానకయే యుండును. భూమిలోపలనెముకలు, వెంద్రుకలుమొదలగుహేయపదార్థములుండఁగా మీఁదమున్నపూసి యలంకరించినంతట లోపలిహేయములుమానునా? అట్లుశరీరతత్వమునెఱుఁగక శవాలంకారముచేయువారివలె హేయమగుశరీరమునలంకరించి యానందించెదరు. ఈ వస్త్రములకిచ్చుద్రవ్యముచే ఈశ్వరకుటుంబమగు దీనులనారాధించితిరేని భగవంతుఁడుసంతోషించును. ఒకతండ్రికి నలుగురుబిడ్డలుకలిగి యందిరువురు అన్నవస్త్రములకులేక దారిద్ర్యముచే పీడింపఁబడుచుండఁగా తక్కినయిరువురు ద్రవ్యవంతులై యాబీదలగుసోదరులను బోషింపక తాముమాత్రము మంచిభోగములననుభవించిన తల్లిదండ్రులకువీరియందు అనూయకలుగునుగదా? అట్లులోకముననుండుచేతనులందఱును జగదీశునికి, మనకుసోదరులయి యున్నారు. మనసోదరులలో పెక్కండ్రు అన్నవస్త్రములకులేక దైన్యమును జెందియున్నారు. వారలనందఱిని రక్షించుటకు మనము శక్తులముకాము. అయినను సాధ్యమయినవఱకు కొందఱినయినను రక్షించుటమేలు. అట్టివారలదేహరక్షణమునకుపయోగపడుపకశ్లాఘ్యములగు వస్త్రాభరణములకు ద్రవ్యమును వ్యయించుటమేలుగాదు. ఇఁకనైనను మీయన్నవస్త్రములకు మితముగ ద్రవ్యమునుపయోగించి తక్కినద్రవ్యమును దీనజనులకుపయోగింపుఁడు. శరీరమునురక్షించుటరక్షణముకాదు. ఆత్మరక్షణమును జింతింపవలయును. మనముదీనులశరీరమునకు రక్షచేసితిమేని మనయాత్మరక్షణభారమును భగవంతుఁడు వహించును. మీకుద్రవ్యమధికముగనుండిన మంచివస్త్రములచే భగవంతునినలంకరించి నేత్రానందముగ సేవించిసంతోషింపుఁడు. పుత్రులుపవసించియుండ తల్లిదండ్రులకన్నపానములు రుచియింపనట్లు దీనజనులన్నవస్త్రములకులేకవగచుచునుండ భగవంతునలంకరించుటయు, నాజగదీశునికి అభిమతముకాదు. కాన సర్వప్రకారములచే. సాధ్యమయినవఱకు దీనజనుల దైన్యమునుమాన్పుఁడు. సర్వప్రపంచమును భగవత్స్వరూపముగఁజూడుఁడు. పరిణామపేశలమయి యవశ్యమునశింపఁగలశరీరమునందభిమానమునువిడిచియాత్మవిచారముచేసి మీరక్షణభారమును భగవదధీనముచేసి కర్మానుగుణముగ మీకుసిద్ధించిన పదార్థములయందుతుష్ఠ

తాబుద్ధి చేయక మీకుటుంబపోషణమునకత్యంతావశ్యకమగుభాగమునుమాత్రము పరిగ్రహించి శేషమును భగవత్కుటుంబమగు ప్రాణులరక్షణమునకుపయోగింపుఁడు. మనము తల్లి గర్భమునుండి వచ్చునపుడేమియు తెచ్చుటలేదు. శరీరమునువిడిచి పోవునపుడొకగవ్వనైనను గొనిపోవుటలేదు. ద్రవ్యార్జనమునకయి మనచేఁ జేయఁబడినపాపసమూహముమాత్రము మానకమనలను వెంబడించివచ్చుచుండును. అనిభానుదాసుఁడు వస్త్రములుగొనుటకువచ్చువారికెల్ల హితోపదేశముచేయుచున్నాఁడనియు, ననవరతము భగవంతునిభజించుచుదీనజనపోషణము చేయుచున్నాఁడనియును నితనియందు బద్ధానురాగులయి యితనియంగడికే వచ్చుచుండిరి. తక్కినవర్తకశాలలకెవరును పోనందున నావర్తకులకు వ్యాపారము జరగక పోయెను. ఆవర్తకులందఱును భానుదాసునిఁజూచి యసూయపడుచుండిరి.

ఒకప్పుడు భానుదాసుఁడును మఱికొందఱువర్తకులును సంతకుపోయి సరకుఁగొని వచ్చుచు మార్గమధ్యమునందొక దేవాలయముననందఱును విడిదిచేసిరి. ఆరాత్రియాయూరిలో హరిదాసుఁడనుభాగవతుఁడు హరికీర్తనముచేయుచున్నాఁడనివిని భానుదాసుఁడుతన మూటలను జూచుకొనియుండుఁడని తనతోడవచ్చినవర్తకులకుచెప్పి తాను హరికీర్తనము జరగుచోటికిపోయి హరిదాసునితో కలసి భగవంతునిస్తుతించుచు శ్రవణానందముగ హరిదాసునికీర్తనలనువినుచునానందభరితుఁడయియుండెను. ఇతనితోడవచ్చినయావర్తకులసూయాపరులయి యితనిగుఱ్ఱమునువిప్పివిడిచి యితనిమూటలనన్నింటినొకపాడునూతిలోఁ బడవైచినిద్రించుచుండిరి. అపుడు భక్తవత్సలుఁడగుజగన్నాథుఁడొకబ్రాహ్మణునిరూపము ధరించివచ్చి భానుదాసునిగుఱ్ఱమును బట్టుకొని యాలయముచెంతఁ గూర్చుండియుండెను. కొంతసేపటికి చోరులువచ్చియావర్తకులనుజక్కఁగమర్దించి వారలసర్వస్వమునునపహరించుకొనిపోయిరి. వర్తకులందఱును తమలోనిట్లనిచింతించిరి. మనము భానుదాసునివిషయమునందసూయాగ్రస్తులమయియతనికి కీడువెదకితిమి అతనియాత్మభారమువహించియుండుశ్రీపాండురంగఁడు మనయందావేశించియతనివస్తువులనుమాత్రము పాడునూతిలో వేయించి భద్రపఱిచెను. మనపాపము చోరరూపమయివచ్చి మనసొమ్ము నపహరించెను. (అన్యథాచింతితంకార్యం । దైవమన్యత్రచింతయేత్) అనువచనముప్రత్యక్షసిద్ధమయ్యెను. అనిచింతించుచుండఁగా హరికీర్తనము ముగిసినపిమ్మట భానుదాసుఁడువచ్చెను. బ్రాహ్మణరూపియై గుఱ్ఱమునురక్షించుచుండుపండరినాథుఁడదృశ్యుఁడయ్యెను. భానుదాసుఁడు తన గుఱ్ఱమును మునుపటియట్లుకట్టియాలయములోప్రవేశించి జరగినవృత్తాంతమునువారలచేవిని యావర్తకులనుజూచి (అవశ్యమనుభోక్తవ్యం । కృతంకర్మశుభాశుభం). అనురీతినిఎట్టివారికయినను పూర్వకర్మఫలముననుభవింపకతీఱదు. నాయందసూయపడినమీరే నామూటలనుపాడునూతిలోపాఱవైచికాపాడితిరి. జాగరూకులై యుండినమీసొమ్మును చోరులపహరించిరి. (గతమునకునువగపకయ్యా । గతమునకునునూరుదెఱచికడుగోరకది । నతనొందదైవంబే । గతిఁబనిచినదానఁబోదుఁగాకనవలయుఁ) ఇఁకనైననుకర్మపరతంత్రులుకాముక్తులగుటకుయత్నింపుఁడు. దానికింతకష్టములేదు. మీయాత్మభారము శ్రీపండరినాథు[illegible]యందునిచి యనన్యవిముఖులరయియాదేవునిని భజింపుఁడు. మీకు ము [illegible]

చెప్పి పాడునూతినుండినతనమూటలనెత్తి వారలకుపంచియిచ్చి వారలనాశ్వాసించి వారితోడ వెలుపలికివచ్చి గుఱ్ఱమునురక్షించినవాఁడుశ్రీపాండురంగఁడనినిశ్చయించి పుండరీకవరదా! చోరభయములేక గుఱ్ఱమునురక్షించినట్లు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడిచోరులచేతికిఁజిక్కకుండునట్లు నాకునీవిచ్చినజ్ఞానరత్నమును కాపాడి నారక్షణమున నేమరకుండుమని విన్నవించి పైట్నిపురమునకువచ్చి వర్తకశాలనుకొంతద్రవ్యముతోడ తనబిడ్డలయధీనముచేసి తక్కినద్రవ్యమును దీనజనులకుపయోగించి పండరిపురమునవసించుచు నిరంతరభగవధ్యానపరుఁడయియాయుశ్శేషమునుగడపి పరమవైష్ణవసాయుజ్యమును జెందెను.

ఆపద్రక్షకాయనమః.

---

# నలువదిమూడవయధ్యాయము.

---

## రామరాజుచరిత్రము.

విద్యానగరమున రామరాజనునతఁడు ధర్మముతప్పక రాజ్యపరిపాలనముచేయుచుండెను. అతఁడుదుర్గాదేవినినిష్టదైవముగనారాధించుచునాదేవికి దివ్యమగునాలయమునుగల్పించి. స్వర్ణవిమానమంటపములను, నవరత్నఖచితసింహాసనములను, అమూల్యాభరణములను నిర్మించి షోడశోపచారములతోడ పూజించుచువచ్చెను. ఇట్లుండ పండరిక్షేత్రవాసియగు బ్రాహ్మణుఁడొకఁడు తానొకయాగముచేయనుద్యుక్తుఁడయి ద్రవ్యార్థియై రామరాజును గానవచ్చెను. ఆరాజుబ్రాహ్మణునిగౌరవించి పూజ్యాసనమునఁగూర్చుండఁబెట్టి కుశలప్రశ్నముచేసి యతనియాగమననిమిత్తమతనిచే తెలిసికొని విప్రోత్తమా! నీమనోరథమును నేనీడేర్చెదను. నాకులదైవమగుదుర్గాదేవికి ఆరాధనముచేయుకాలమున నీవాదేవిసన్నిధికి వచ్చి దేవినిదర్శింపవలయుననిమనోరథించెదనని చెప్పి రాజు స్నానముచేసి ధౌతవస్త్రమునుధరించి తిలకంబుదిద్ది జపాదినియమంబులనుదీర్చి దుర్గాదేవియాలయంబునప్రవేశించి పండరిక్షేత్రవాసియగు బ్రాహ్మణునచటికిరప్పించి షోడశోపచారములతోడదుర్గాదేవిపూజముగిసిమహానైవేద్యమయినపిదప నతనింజూచియోబ్రాహ్మణుఁడాయంబికకు సమమగుదైవము ముల్లోకంబులయందును లేదు. ఈదేవికిఁగలయపరిమితైశ్వర్యము పూర్వమైయుండును. ఈదేవి సౌందర్యమత్యద్భుతమయి యున్నది. పండరినాథునికిట్టిప్రభావము కలిగియుండదు. అచటనింతశ్రద్ధతో నెవ్వరారాధింపఁబోయెదరు. మీరుదరిద్రులుగాన మీపండరినాథునికి వస్త్రాభరణాదివిభవము కేవలము మితమైయుండునని నాకుతోఁచుచున్నదని చెప్పఁగా ఆబ్రాహ్మణుఁడు రాజుమాటలు వినిసహింపనివాఁడై యోరాజా యొకప్పుడయిననీవుపండరిపురమును జూచియుండిననిట్లుంతయుఁనిచ్చకువచ్చినట్లుపలుకవు. అచటివిభవమునుకొంతవివరించిచెప్పెదను వినుము. పండరిపురము విశ్వకర్మనిర్మితమైనది. భగవంతునియాలయము స్వర్ణమయమై రత్నఖచితమయియున్నది. దేవాలయమునకు నలుప్రక్కలను కల్పవృక్షములశాలలు నిబిడీకరించుకొనియున్నవి. అచటిగోడలన్నియు స్వర్ణవేదులయియుండును. అనంతకోటిదివ్యవాహనములానాశిఖరమునకలశము ప్రకాశించుచుండును. ఆయాలయమున కామధేనువులనేకములు

సాన్నిధ్యమయి శ్రీపండరినాథునిభక్తబృందములకు వలసినవస్తువులనవ్వారికనిచ్చుచుండును. నవరత్నఖచితములగు తులసీమేడలెందునునిండియుండును. నందనవనములయందలి కాలువలురత్నఖచితములయియుండును. సాధుజనులు దేహాభిమానవర్జితులై యనవరతము పాండురంగనినికీర్తించు ఘోషమునువిని స్వర్గలోకవాసులానందించుచుండురు. చంద్రభాగయం దమృతముసదాప్రవహించుచుండును. త్రిలోకములయందలితీర్థములీచంద్రభాగయందుసాన్నిధ్యముచేసి భాగవతస్పర్శముచే తమదోషములనుబోఁగొట్టుకొని పారిశుద్ధ్యమును జెందును. దేవకన్యకలు శ్రీపాండురంగనిసన్నిధిని నాట్యముచేయుచుండురు. గంధర్వులు పాడుచుండురు. తుంబురునారదాదులానందపరవశులయి భగవత్కల్యాణగుణగణంబులను వర్ణించుచుందురు. శ్రీపండరినాథునిదివ్యమంగళవిగ్రహము, కోటిసూర్యప్రకాశమగుకిరీటకాంతితోడను, మకరకుండలములతోఁగూడిన కర్ణములపర్యంతము నిడుదలయి భాగవతసస్యములను కృపావృష్టి చేఁబోషించునేత్రములతోడను, దివ్యపీతాంబరముతోడను, కటిన్యస్తహస్తములతోడను, సమచరణములతోడను, చంద్రునిశైత్యముతోఁగూడిన సూర్యప్రకాశముతోడను, ప్రకాశించుచుండును. ఆదివ్యమంగళవిగ్రహమును దర్శించినంతట సంసారతాపమాఱును. బ్రహ్మానందముకలుగును. మఱియు నాదివ్యమూర్తిని సేవించినవాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్య, జ్ఞాన, శక్తులుమూర్తీకరించినట్లుండును. ద్వాదశాదిత్యులును, ఏకాదశరుద్రులును, అష్టవసువులును, అశ్వినీదేవతలును ఆభగవంతునిమందిరమునకింకరులయి కాచుకొనియుందురు. అఖిలఋషులును శ్రీపాండురంగనినవరతముపనిషత్తులచే స్తుతించుచుందురు. బ్రహ్మయు, శివుఁడును, దిక్పాలకులును, నచటసాన్నిధ్యముచేసి భక్తులుచేయుభగవన్నామసంకీర్తనమును శ్రవణానందముగవినుచు, శ్రీపాండురంగనినిదర్శించుచు, విశ్లేషాసహిష్ణువులయియుందురు. నీకులదైవముగుదుర్గయు, ననేకదేవాంగనలును ఆయాలయమహాద్వారమునసమ్మార్జనానులేపాది కైంకర్యములను జేయుచుందురు. దివ్యనదులును, మహాపర్వతంబులును మూర్తీకరించి మాధవుని సేవించుచుండును. ఓరాజా నేనెంతయని యతనినివర్ణింతును. ఆదేవదేవునినివర్ణించుటకాదిశేషుఁడు సహస్రవదనుఁడయి స్తుతించియుతుట్టతుదకు భగవత్కల్యాణగుణంబులకంతమునుగానక లజ్జించినివాస, శయ్యా, సన, పాదుకాం, శుకో, పధాన, వర్షాతపవారణా, దిశరీరభేదంబులను పరిగ్రహించియ శేష శేషవృత్తియందన్వయించితృప్తిఁజెందక శేషసంజ్ఞచే ప్రఖ్యాతుఁడయియున్నాఁడు. నిత్యవిభూతియందుండువారలు భగవంతునిపరమసామ్యమును జెందియుండువారు. కాననచట ఆసర్వేశ్వరునివాత్సల్య, సౌశీల్యాదిగుణములు పగటిచంద్రునివలె ప్రకాశింపకుండుటచేననంతగరుడవిష్వక్సేనాది నిత్యసూరులు శ్రీమత్పండరీపురమునాశ్రయించి పుండరీకవరదునికల్యాణగుణంబులననుభవించుచున్నారు. జున్నునెఱుఁగనివాఁడు గుమ్మడిపూవుతేనియయను, నదినినెఱుంగనివాఁడు కూపమును, పూర్ణచంద్రబింబమును నెఱుఁగనివాఁడు చంద్రరేఖనువర్ణించునట్లు ఏనాఁడును శ్రీపాండురంగనినిదర్శించియెఱుఁగనినీవు దుర్గాదేవినిస్తుతించితివి. అనిచెప్పఁగావిని రాజుకోపగ్రస్తుఁడయి కన్నులెఱ్ఱచేసికొని పెదవులదరుచుండ ఓవిప్రానీవుపాండురంగనికపూర్వలక్షణంబులనుగల్పించి చెప్పితివి. అంతటితో తనివిఁజెందక నాకులదైవముగు దుర్గాదేవిపాండురంగని మహాగోపురద్వారమున పరిచారికయై సమ్మార్జనాదికముచేయుచున్నదని

యుచెప్పితివి. ఇట్టినీవు క్రూరదండనకర్తుఁడవై యున్నాఁడవు. అయినను నేనునీతోడపండరి
క్షేత్రమునకువచ్చి నీవుపల్కినవిభవములచటలేవేని నిన్నుశిక్షింతుననిచెప్పి యాబ్రాహ్మణుని
వెంటఁబెట్టుకొని పండరిపురమునకు వచ్చుచుండెను. బ్రాహ్మణుఁడు పండరినాథునుద్దేశించి
శ్రీరుక్మిణీకాంతా! యీరాజునిన్నవమానించి దుర్గాదేవిని స్తుతించుటవిని సహింపక శ్రీపండరి
పురముయొక్కయు, నీయొక్కయువైభవమును నామనసుపోయినట్లెల్ల రాజునకెదుట
వర్ణించితిని. ఇతఁడుపరీక్షించుటకయి నాతోడవచ్చుచున్నాఁడు. నాపలుకులు నిజముకా
కుండిన నన్నుఇతఁడుశిక్షించును. అందుకయి నేనుభయపడలేదు. ఎన్నాళ్లుబ్రతికియుండినను
ఈశరీరమొకనాటికగ్నికాహారముకాకతప్పదు. నీవైభవమునకు హానికలుగుటకోర్వఁజాలక
వగచెదను. ప్రహ్లాదునిమాటను స్థిరీకరించుటకయి నరహరిరూపముతో సభాస్తంభము నందవత
రించినదినిజమేని నామాటలను నిజముచేయుము. (మహాద్యాపదిసంప్రాప్తే। స్మర్తవ్యోభగ
వాన్హరిః) అనువసిష్ఠోపదేశమును విశ్వసించియాపత్కాలమున గోవిందాయనినిన్నుపిలిచిన
ద్రౌపదికి నక్షయవలువలొసఁగి మానమునురక్షించినది నిజమేని నాపలుకులను నిజముచే
యుము. బాల్యమునందేవిరక్తిగలిగిమహర్షి వాక్యముచేనీస్వరూపమునెఱిఁగి నిన్నుపాసించిన
ధ్రువునికి సర్వోత్కృష్టపదవినిచ్చినది నిజముగునేని నాపలుకులను నిజముచేయుము. పాహి
పాహియని మొఱలిడినగజేంద్రునిని నాఁడురక్షించినది నిజముగునేని నేఁడునామాటనుకాపా
డుము. ఓపురుషోత్తమా! యిపుడునామాట యబద్ధముగునేని నీచరిత్రములన్నియు నబద్ధము
లగును. కాననాపలుకులనునిజముచేసినీసచ్చరిత్రమునకు రక్షచేయుము. అనితనమనంబున
ప్రార్థించెను. సర్వశక్తియుక్తుఁడయి భక్తవత్సలుఁడగు శ్రీపాండురంగని దివ్యసంకల్పముచే
బ్రాహ్మణుఁడుచెప్పినట్లు సర్వమునుసంపన్నమయియుండెను. రాజుపండరిపురముచేరి బ్రా
హ్మణుఁడుచెప్పినంతకన్న శతగుణాధిక్యముగు రంగనివైభవమునుజూచి యానందపరవశుఁ
డయి యచటసాన్నిధ్యముచేసియుండు నిత్యసూరులయొక్కయు, దేవతలయొక్కయు,
మహర్షులయొక్కయు గోష్ఠికివందనముచేసి చంద్రభాగయందుస్నానముచేసి గోపురద్వార
మునకువచ్చి మహాద్వారమున సాష్టాంగవందనము చేసియచటనేకదేవాంగనలతోఁగూడి
యనులేపనాదికైంకర్యములను జేయుచుండుతనకులదైవముగుదుర్గాదేవినిఁజూచియాదేవికి
ప్రణామములుచేయఁగా ఆదుర్గాదేవి రామరాజునుజూచి యోరాజా నీజన్మము నేఁడు
సఫలమయ్యెను. ఈబ్రాహ్మణునివ్యాజముచే శ్రీమత్పాండురంగనాథుఁడు నీయందుకరుణిం
చెను. ఈదేవదేవునిమహిమ విధి, శివ, సనకాదులకును వేదపురుషునికిని వాచామగోచర
మయియుండును. నీవులోపలప్రవేశించి పుండరీకవరదునినిదర్శింపుము. ముంజేతికంకణము
నకద్దమేల? సమస్తకల్యాణగుణగణములు మూర్తీకరించియుండు శ్రీరుక్మిణీకాంతునిదర్శన
మాత్రముచే అతనికల్యాణగుణములు ప్రకాశించును. నీకుమేలుకలుగుఁగాకయని యనుగ్ర
హించిన దుర్గాదేవి నియమ్మనమును జెందిలోపలప్రవేశించి బ్రాహ్మణునిచే తానువినినవియు,
విననివియునగు నచటివైభవంబులకద్భుతంబందుచు శ్రీపుండరీకవరదునినిదర్శించి స్తుతింప
నోరాడక హస్తకన్యస్తాంజలియై నిలుచుండి (పృథ్వీరేణురణుః పయాంసికణికాః ఫల్గుస్స్ఫు
లింగోలఘు। స్తేజోనిశ్వసనంమరుత్తనుతరం రంధ్రంసుసూక్ష్మంనభః। క్షుద్రారుద్రపితా
మహప్రభృతయః కీటాస్సమస్తాస్సురా। దృష్టేయత్రసతావకోవిజయతే భూమావధూతా

వధిః) ఏమహిమచూడఁబడినపుడు భూమిచిన్నయణువయి, యుదకములుచిన్నతుంపరలయి, తేజముచిన్నమిణుఁగురయి, వాయువుసన్ననియూర్పులయి, యాకాశముచిన్నరంధ్రమయి, బ్రహ్మరుద్రాదిసమస్తదేవతలు చిన్నపురుగులయియుండునోయట్టినీమహిమ యెల్లలేక వెలుఁగుచున్నది. అనివిన్నవించియో దేవాదిదేవా! నీమహిమను నేనెఱుఁగక యిదివఱకు నాయాయువును వ్యర్థముచేసితిని. ఇపుడీబ్రాహ్మణునివ్యాజముచే నన్ననుగ్రహించి నీసేవయొసఁగితివి. నిన్ను నాపట్టణంబున ప్రతిష్ఠించి యారాధింపవలయునని మనోరథించెద. భక్తాభీష్టఫలప్రదుఁడని బిరుదువహించియుండునీవు నామనోరథమును పూర్తిచేయవేని నీకల్యాణగుణములు భస్మాహుతియగునని న రాజుమాటలనువిని యోరాజా! నీమనోరథమును పూర్తిచేసెద. నేటిరాత్రికి నన్నునీయూరికిఁగొనిపొమ్ము. నీవేదైననక్రమముచేసిన నేనుమఱలిపండరిపురమును చేరుదును. అనియనుగ్రహింపఁగా రాజుధన్యోస్మియనిసంతసించి పండరినాథుఁడు నియమించినట్లారాత్రియాదేవదేవునిని భయభక్తులతోడతనయూరికిఁదెచ్చెను. మఱునాఁడుసూర్యోదయకాలమున నర్చకులును, అనేకభాగవతులును ఆలయమునప్రవేశించిచూడఁగా నచటభగవంతుఁడులేనందున నెల్లరును శోకార్తులైయేమియునుతోఁచక భూమిపయిఁబడియేడ్చుచుండిరి.

అప్పటిదురవస్థపగవారికైనను చూడనసహ్యమైయుండెను. అపుడుపండరిపురము చంద్రుఁడులేనిరాత్రివలెను, పురుషుఁడులేనిస్త్రీవలెను శూన్యమయియుండెను. అపుడు సాధుజనులుతమలోనిట్లనిచింతించిరి. మనవిఠ్ఠలనాథుఁడు నేనొకప్పుడును ఇచ్చోటువిడిచిపోనని పుండరీకునికయి చేసినప్రతిజ్ఞను మఱచితల్లిలేనిబిడ్డలవలె మనలనుపేక్షించి రామరాజును సంతోషింపించుటకయి విద్యానగరమునకు పోయెననితోఁచుచున్నది. పూర్వముగోకులమునందలి గోపాంగనలనుపేక్షించి మధురకు వేంచేసినట్లు ఇపుడుజలమునువిడిచినమత్స్యములవలె తనవిశ్లేషమున జీవింపలేని మనలనుపేక్షించి విద్యానగరమునకు వేంచేసెను. రామరాజురాజధానియందు ఆరాజుచే నారాధింపఁబడు రుక్మిణీకాంతునిని మఱలపండరిపురమునకు తెచ్చుట కెవరుసమర్థులగుదురు. అనిశోకించుచుండ భాగవతాగ్రగణ్యుఁడగుభానుదాసుఁడువారలనుజూచియో సాధువులారా! నేనుపోయిపండరినాథునిని తెచ్చెదను. లేదేని నచటప్రాణములువిడిచెదను. అనిచెప్పియప్పుడేబయలుదేరి విద్యానగరమునకువచ్చియొక వైష్ణవునియింటవసించి రాజగృహమునందుపండరినాథుఁడు వేంచేసియుండుస్థలమును, రాజు ఆపురుషోత్తము నారాధించుక్రమమును జక్కఁగవిచారించితెలిసికొని యతిథివేషముధరించి మధ్యాహ్నకాలమున రాజగృహమునఁబ్రవేశించితన్నితరులెఱుఁగకుండ నొకమూలదాఁగియుండియర్ధరాత్రమున పాండురంగనిసన్నిధికిపోయెను. అపుడు పుండరీకవరదుఁడు వేంచేసియుండుమందిరకవాటములు భగవత్సంకల్పముచే తెఱవఁబడెను. భానుదాసుఁడులోపల ప్రవేశించి గోపాలదేవునాలింగనముచేసికొని తనకన్నీటిచే నతనినభిషేకించుచు రుక్మిణీకాంతా! మాయందుకరుణలేక మమ్మునాదరించివచ్చితివి. మేముప్రకృతిపరవశ్యులగుటచే బుద్ధిపూర్వకముగను, అబుద్ధిపూర్వకముగను నీవిషయమునను, నీదాసులవిషయమునను అపచార[illegible] నేరముకలదు. రుక్మిణీసత్యభామలు నీకేమియపచారముచేసిరి. పుండరీకవరదుఁ

డని పేరువహించి యీమహాత్ముని నిమిత్తమయి పండరీపురమున నెలకొనియుండు నీవిషయమున పుండరీకుఁడేమియపచారముచేసెను. మాతప్పకయి వారలనెల్లను పేక్షింపవచ్చునా? ఇపుడు సామంతుఁడుండిననిన్ను తనవృద్ధుహానుపదిలముచేసి రామరాజునకు కాన్పింపకయుండును. నామదేవుఁడును, జనాబాయియు నిపుడుండిరేని వారలకీర్తనలను వినుటనుమాని విద్యానగరమునకువత్తువా? అట్టివారలిపుడు లేదని మమ్ము అనాథులను జేసి విచ్చలవిడిగవచ్చితివి. పండరిపురమున పెక్కుసాధుజనులు నీదివ్యమంగళవిగ్రహసౌందర్యమున మగ్నులయి నిన్నే ధారక, పోషక, భోగ్యములుగ స్వీకరించియుండ వారలను పేక్షించివచ్చుట నీకుధర్మమా? సకృత్ప్రపత్తిచేసి నేను నీవాఁడనని చెప్పినవానికి నేనభయమిచ్చి వానిని సర్వప్రకారములచే రక్షించెదనని నీవుచేసినయభయప్రదానమునకు మమ్ముమాత్రము వెలిచేయుట నీకే నీతియైయున్నది. (రామోద్విర్నాభిభాషతే) అను ప్రమాణమును మానిమిత్తముగ బొంకయ్యె. శేషభూతుఁడు తప్పచేసిన స్వామిశిక్షించును. స్వామితప్పచేసిన తగదనువారెవరు? అని భానుదాసుఁడు చెప్పఁగావిని పాండురంగనాథుఁడు మందస్మితముచేసి తనపీతాంబరముచేత తనికన్నీరుతుడిచి యోవత్సా! నీవుశోకింపకుము నేనీరాజును తృప్తిపఱచుటకయి యిచటికి వచ్చితిని. నాశరీరమిచటనుండినను నామనసుమీయందేలయించియున్నది. నేనుమీభక్తియనువలలోఁజిక్కియున్నాఁడను. ఇట్టినన్ను మీరు కొనిపోకయుపేక్షించితిరి. అనికన్నీరు విడుచుచు భానుదాసునినాలింగనముచేసికొని రామరాజుతనకుసమర్పించినయనర్ఘ్యరత్నహారమునతనిమెడనువైచి యోభానుదాసా! ప్రాతఃకాలమయ్యెను. ఇఁకను రాజువచ్చును. నీవుసదుపాయముచేసికొని రాజగృహమునుండి వెలుపటికిపొమ్ము. రేపటికినీకుదర్శనమిచ్చెదనని చెప్పెను. భానుదాసుఁడు నగరిపనివారలలోఁగలసి సదుపాయముచేసికొని రాజగృహమునువిడిచి వెలుపటికివచ్చి స్వస్థానమును జేరెను. రామరాజు ప్రాతఃకాలమున లేచిస్నానసంధ్యాద్యనుష్ఠానంబులనుదీర్చి భగవత్సన్నిధియందు ప్రవేశించి శ్రీరుక్మిణీకాంతుని సేవింపఁగా ఆస్వామికంఠమునందలిరత్నహారము లేకుండెను. రాజుకావలివారలపయిఁగోపించిశంక లేక రాజగృహమునప్రవేశించి భగవంతుని కంఠమునందుండిన రత్నహారమును ముచ్చిలిన చోరునిని మీరువెదకికనిపట్టితేరేని మీకుక్రూరదండనను విధింతుననియెను. వారలెందును వెదకుచునదియందు స్నానముచేయుచుండిన భానుదాసునికంఠమునందు హారమునుజూచి యితఁడేదొంగయనియతనినిబద్ధునిఁజేసి బహువిధములతర్జనభర్త్సనములుచేయుచు నీడ్చుకొనివచ్చి రాజునకెదుటనిలిపిరి. రాజుహారమునుదీసికొని యీచోరుని రాజమార్గముచెంత నాటియుండుశూలమునఁగ్రుచ్చుఁడని నియమించెను. వారలువల్లెయని భానుదాసునీడ్చుకొని పోవుచుండ ఆమహాత్ముఁడు భటులనుజూచి యోభాగ్యవంతులారా నేనుప్రాణహానికిశోకింపలేదు. ఈశరీరమును విడుచుటకుముందుగా నొకతూరి శ్రీపాండురంగనిని దర్శింపవలయుననియపేక్షించెదను అని ప్రార్థింపఁగా వారలలోనొకఁడు రాజసన్నిధికిఁబోయి భానుదాసుని ప్రార్థనను రాజునకెఱిఁగించిన అట్లుచేయుఁడని రాజునియమించెను. భటులుభానుదాసునిని పాండురంగనిసన్నిధికితెచ్చిరి. భానుదాసుఁడు పండరినాథునికి సాష్టాంగవందనముచేసి జగదీశా నీసన్నిధికేకాంతముగవచ్చిననామెడను రత్నహారమునువైచి నన్నుబయలుపఱిచి రాజదండనకులోఁబఱిచితివి. నిన్నుగొనిపోవవచ్చిననాకు మరణాంతదండనను విధించితివి. నీ

సొమ్మగు నేను నీకిష్టవినియోగార్హమయియుండుటన్యాయ్యము. ఇఁకను నావలెనిన్నుఁగొని పోవవచ్చువారలనెల్లనీరీతిని శిక్షించి నీవు రాజమందిరంబున సుఖివయియుండుము. నేనెన్ని జన్మములెత్తినను నీచరణారవిందములను విడువను. అనివిన్నవించుచుండ రాజభటులు నీవు భగవంతునినింత సేపు దర్శించినది చాలునని చెప్పి భానుదాసునీడ్చుకొనిపోయి శూలముచెంతనిలిపిరి. అపుడు భానుదాసుఁడు లక్ష్మీకాంతా! ఆకాశము విఱిగిపడినను, భూమితలక్రిందైనను, కులపర్వతములుచలించినను, సముద్రములింకినను, సూర్యచంద్రులు గతులుతప్పినను నేను నీభజనమునువిడువను. నాకు నీపాదపద్మములుతప్ప వేఱు విశ్రమస్థానములేదని చెప్పినంతట భగవత్సంకల్పముచే ఆశూలముబహుపర్ణ, పుష్ప, ఫల, శాఖలతోఁగూడిన గొప్ప వృక్షమయ్యెను. ఈయద్భుతమును భటులు చూచి రాజునకెఱిఁగించిరి. అప్పుడు రాజు ఆశ్చర్యగ్రస్తమానసుఁడయి యచటికివచ్చి యీయద్భుతమును జూచియనుతాపయుక్తుఁడయి భానుదాసునికిదండప్రణామంబుచేసి తనయుత్తమాంగముచే నతని పాదపద్మముల నలంకరించి మహాత్మా! నేనవివేకముచే తప్పుచేసితిని. ఈశ్వరునికినిగ్రహానుగ్రహములు రెండునుగలవు. తద్భక్తులకనుగ్రహము మాత్రముకలదు. అట్టిభక్తులలోనగ్రగణ్యుఁడవగు నీకు నాయందునిగ్రహబుద్ధి కలుగుటకవకాశములేదు. నీయట్టిసద్గుణరాశిని నాతప్పునుమన్నింపవలయునని నేను ప్రార్థించుట పరిహాసాస్పదమైయున్నది. సూర్యునియందు శైత్యమును, చంద్రునియందు ఔష్ణ్యమునుమృగ్యమగునట్లు భాగవతులయందు క్రోధగుణము మృగ్యమయియుండును. అయినను భాగవతాపచారాసహిష్ణువగు పండరినాథునికి నాయందునిగ్రహముకలుగునని వెఱచెదను. నాకయి నీవు పురుషోత్తముని ప్రార్థించి నీపురుషకారముచే నతనికోపమును జల్లార్చుము. అని ప్రార్థించి యతనిచేతినిఁ బట్టుకొని జగదీశునిసన్నిధికిపోయెను. రుక్మిణీపతి భానుదాసునినాలింగనముచేసికొని నీవు నాకునంతరంగభక్తుఁడవు. నావిశ్లేషమునుసహింపక మిగుల బాధపడితివి. పుండరీకునికినేను జేసినవాగ్దత్తముతప్పక పండరిపురమునకువచ్చెదను. నన్ను రథారూఢునింజేసికొనిపొమ్ము. అనిభగవంతుఁడు చెప్పఁగావిని రామరాజు ఓస్వామీ నన్ను విడిచిపోయెదవాయనియేడ్చెను. భగవంతుఁడతనిఁజూచి యోరాజా నీభక్తికిసంతసించి నీయింటకొంతకాలమువసించితిని. నీవుతగనికార్యమును జేసిననిచటనుండనని పూర్వమే నేనునీతోచెప్పియుంటినిగదా? నాకంతరంగుఁడగు భానుదాసునివిషయమున మిగులతప్పు చేసితివి. ఇఁకను నేనిచటవసింపను. నీవెడతెగక నన్ను స్మరించుచు, నానామమును జపించుచుండుము. నేనునిన్నుమఱువను. పోయివచ్చెదనని చెప్పి భానుదాసునికిసులభుఁడయి సూక్ష్మరూపియయ్యెను. అపుడు భానుదాసుఁడు భక్తసులభునిని తనపూజాపేటికయందుంచుకొని పండరిపురమునకు వచ్చుచుండెను.

భగవంతుఁడు భానుదాసునిఁజూచి పూర్వముయశోదచేనులూఖలమునందుఁగట్టఁబడి దామోదరుఁడను పేరువహించితిని. దధిభాండునిభాండమునందు దాఁగియుంటిని. సామంతునిమృద్గృహమునువసించితిని. ఇపుడు నీపూజాసంపుటమున నణఁగియున్నాఁడను. నేను నాయాత్మాత్మీయములను భాగవతులకునిష్టవినియోగముచేసియున్నాఁడను. అనిసల్లాపించుచుపద్మాలయమనెడి యూరికివచ్చినంతట భానుదాసుఁడు నదీతీరమున పరిశుద్ధస్థలమున

సంపుటమునుంచి పరిశుద్ధస్నానము చేసి నిత్యకృత్యంబులనెల్ల నెఱవేర్చివచ్చి చూడఁగా సం పుటమందునుండు సంపుటపు పైభాగమును కిరీటముగను, క్రిందిభాగమును పాదరక్షలుగను జేసి కొని స్థూలరూపియై నిలచియుండెను. భానుదాసుఁడు భగవంతునిఁ జూచి దేవదేవా! స్థూల రూపివైతివి నిన్ను నేనెట్లు వహింతునని భగవంతుఁడు తననిఁ జూచి నీవు త్వరితముగా పండరీపు రమునకుపోయి యచటి సాధువులనందఱను నిచ్చటికి బిలుచుకొని రమ్ము. అని నియమించిన భాను దాసుఁడు పండరీపురమునఁ బ్రవేశించి యర్చకులకును, దక్షిణ సాధుజనులకును భగవన్నియ మనము నెఱిఁగించిన వారానందరసాబ్ధి నోలాడి యెల్లరునుగూడి మంగళవాద్యములతోడ పద్మాలయమునకు వచ్చి భగవంతుని సేవించి మయిమఱచి స్తుతించువారును, నృత్యముచేయు వారును, భగవంతు నాలింగనము చేయువారునయి రుక్మిణీకాంతునిని రథారూఢునిం జేసికొ నివచ్చి పూర్వమువలె నాలయమునందుఁ బ్రతిష్ఠించి షోడశోపచారంబులను జేసి (జయతుజ యతు దేవో దేవకీనందనోఽయం। జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః। జయతు జయ తు మేఘశ్యామలః కోమలాంగో। జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః) అని మంగళాశా సనము చేసి భానుదాసునిఁ జూచి మహాత్మా నీవలనఁ గదా మేము జగదీశునిని మఱలఁ జూడఁ గంటిమని చెప్పి యతనివిషయమున నుపకారస్మృతి చేసిరి. ఇప్పుడును శ్రీమత్పండరీపురమున కార్తికమాసమున రథోత్సవమునాఁడు ఈవైభవ్యమనుకరింపఁబడుచున్నది. ఆయానంద మనుభవైకవేద్యమయి వాచామగోచరమయియున్నది.

భక్తిసులభాయనమః.

## నలువదినాల్గవయధ్యాయము.

భయరమభట్టుచరిత్రము.

ప్రతిష్ఠానయను పట్టణమున భయరమభట్టు అను బ్రాహ్మణుఁడు జ్యోతిషమునందును, వేదాంతమునందును, మహానిపుణుఁడయి యుండెను. అనేకులు విద్యార్థులయి వచ్చి యితని ననువర్తింతురు. ఇతని యుపదేశముచే పెక్కండ్రు ప్రబలవిద్వాంసులయిరి. ఇతఁడు పంచ కాలపరాయణుఁడై ప్రతిదినము గంగాస్నానముచేయుచు నిత్యనైమిత్తిక కర్మములను య థాక్రమముగ ననుష్ఠించుచు భోజనానంతరము శ్రీభాగవతపారాయణము చేయుచుండును. ఒకనాఁడు భయరమభట్టు భుజించుచుండఁగా పదార్థమున లవణము లేదని భార్యతోఁ జెప్పెను. ఆయువతి నవ్వుచు భర్తనుజూచి, నీకు వయస్సు అఱువదియేండ్లు కావచ్చెను. ఇప్పటికిని నీజి హ్వరుచులను గోరుచున్నది. ఇంతరుచి భగవద్విషయమునఁ గలిగినయెడ మదండనకు తప్పక ముక్తి కాంతచే వరింపఁబడుదువని భార్య చెప్పిన మాటలను విన్నతోడనే భయరమభట్టునకు బాహ్యాం తరము పరిపక్వముచేతనో,. లేక నిష్కామకమగు భగవత్కటాక్షముచేతనో జ్ఞానోదయమై వైరాగ్యయుక్తుఁడయి భుజించుటను మాని లేచి గంధాక్ష పూర్వకముగ చేతులు కాళ్లు కడుగు కొని తనభార్యను తన్ను ననుగ్రహించవచ్చిన యాచార్యరూపిణియగు భగవంతునిఁగఁ దలఁచి యా మెకు ప్రదక్షిణనమస్కారములు చేసి జగద్గురువగు శ్రీవాసుదేవమూర్తి నిరాపత్తైవచ్చి నా జ్ఞానోపదేశము చేసినందున నీవు నాకు ప్రథమగురుఁడవైతివి. కావున కామభోగములు

ప్పుడును శాంతముకాదు. ఆహుతులుచేయఁజేయనగ్ని వర్ధిల్లుచుండునట్లు కామమువర్ధిల్లుచుండును. ఈభూమియందుండు సకలధాన్యములును, స్వర్ణము మొదలగుశ్లాఘ్యపదార్థములును, గజాశ్వాదిపశువర్గమును, సుందరవతులగుస్త్రీలును, నొకనియాశకు చాలకయున్నవి. కాన నట్టియాశను పూర్తిచేయుటకు యత్నించుటయసాధ్యము. అట్లగుటచేనీకామమునునిగ్రహించుటమేలు. సకలభూతములయందును రాగద్వేషరూపమగు భావమునుంచక సమదృష్టి కలవాఁడగుపురుషునికి నెందును సుఖమేకలుగును. త్యజింపఁగూడనిదయి శరీరముకృశించినను కృశింపకవర్ధిల్లుచుండెడి యాశనువర్జింపనిబుద్ధిహీనులకు దుఃఖమేకలుగును. మనుజుఁడు వార్ధక్యముచే కృశించుతఱివాని వెంట్రుకలును, దంతములును రాలిపోవుచున్నవి. ప్రాణేచ్ఛయు, ద్రవ్యేచ్ఛయునను రెండుమాత్రమొకప్పుడునుకృశింపవు. ఇందుకుదృష్టాంతముగ అఱువదియేండ్లుభోగానుభవముచేసిననాకు ఆశకొంచెమైననుదక్కువపడక వృద్ధియగుచువచ్చెను. నేనింకమీఁదనీయాశయనుపిశాచమునువిడిచి మనస్సునుపరబ్రహ్మమునందు చెల్లించి ద్వంద్వదుఃఖములను, మమతనునిగ్రహించిమృగములతోడసంచరించుచుండెదను. అని చెప్పియప్పుడే యిల్లువిడిచిబయలుదేరివనమునందుప్రవేశించెను.

అపుడితనిబంధువులును, మిత్రులునుఇతని వెదకికనిపట్టిబహువిధములుగ నిర్బంధించి యింటికిపిలుచుకొనివచ్చునపుడు భయరమభట్టు ఇట్లనిచింతించెను. ఈబంధువులును,మిత్రులును నేనెచటికిఁబోయిననునన్ను విడువక నిర్బంధింతురనితోఁచుచున్నది. వీరందఱును నా విషయమున నసహ్యపడి తామేనన్నుత్యజింపఁదగినకార్యమును జేసిన నేనువీరలయందుఁ జిక్కకవానుదేవతరుచ్ఛాయనాశ్రయించిసుఖింతును. అని యోచించి యొకతురుష్కుని యొద్దకుఁబోయి నేనుమీమతమునందుప్రవేశించెదను. అందుకు నాకుచేయవలసిన సంస్కారములుచేసి మీలోఁగలుపుకొనవలయునని ప్రార్థించెను. ఆతురుష్కుఁడు సంతసించి తనమతానుసారప్రకార మతనికి సున్నతు మొదలగు సంస్కారములను జేసెను. దీనినిఁజూచినంతటసమస్త బంధుమిత్రులు వ్యసనాక్రాంతులయియితనినిబహువిధములుగ దూషించి ఘటప్రహారపూర్వకముగ ఇతనిసంబంధమునువిడిచిరి. భయరమభట్టుకొన్నాళ్లచటవసించి పకీరులనుజూచి నేనిపుడుతురుష్కుఁడనయితినా? అనియడిగినవారలు శాస్త్రవిధిననుసరించి నిన్నుతురుష్కునిఁజేసితిమనిరి. భయరమభట్టు నవ్వుచువారలను జూచినన్ను మీరుతురుష్కునిఁజేసినదినిజమయినయెడల నాచెవులయందు గుచ్చఁబడియుండు రంధ్రములుమానవలయును. అట్లుకాక యవియెప్పటియట్లుండుటచే మీరునాకుచేసిన మహమ్మదీయసంస్కారములు నిష్ప్రయోజనములయ్యెను. దృష్టికలవానినిగ్రుడ్డివాఁడనియు, నడచువానినికుంటివాఁడనియుఁజెప్పునట్లు హిందువులసంస్కారముగు కర్ణరంధ్రములతోఁగూడియుండు నన్నుతురుష్కుఁడని చెప్పుచున్నారు. అనిభయరమభట్టుచెప్పఁగావిని యాతురుష్కులులజ్జించి నిరుత్తరులయియుండిరి. పిదపభయరమభట్టు అచ్చోటువిడిచివచ్చి గంగాతీరముననుండు బ్రాహ్మణగోష్ఠికిసాష్టాంగవందనముచేసి జరిగినవృత్తాంతమును జెప్పి యోబ్రాహ్మణులారా నాకు శాస్త్రోక్తమగు ప్రాయశ్చిత్తమును జేసి యీయాత్మకునుజ్జీవనమును గల్పింపవలయునని ప్రార్థించెను. ఆబ్రాహ్మణులెల్లరు దీర్ఘముగనాలోచించి ధర్మశాస్త్రవిధిననుసరించి యితనికి

ప్రాయశ్చిత్తమును జేసిరి. పిదప భయరమభట్టు ఆబ్రాహ్మణులనుజూచి యోవిప్రులారా! నాకు సంశయముకలిగియున్నది. అదియేదియనిన మునుపు తురుష్కుఁడనయి సున్నతు మొదలగు సంస్కారములను జెందితిని. ఇపుడుమీరలుప్రాయశ్చిత్తముచే నన్నుబ్రాహ్మణునిఁ జేసితిమని చెప్పచున్నారు. మునుపుచేసిన సున్నతుమాటిక యెప్పటియట్లున్నది. అదిమాటి ననుగదా నన్నుబ్రాహ్మణునిఁగభావించుట న్యాయ్యముగును. కానసేను తురుష్కుఁడను గాను; బ్రాహ్మణుఁడనుగాను అనిచెప్పినవినియాబ్రాహ్మణులువీనికి ఈశ్వరుఁడేవచ్చి సమాధానముచెప్పవలయుననిచెప్పి మౌనముగనుండిరి.

భయరమభట్టులోకులు తనవిషయమునచేయునిందకు తనమనంబునఁజలింపక బహుదేశములయందు సంచరించుచు బడబానలమనునూరికివచ్చెను. అచటనాగనాథుఁడనునొక మహాత్ముఁడు భగవన్మందిరమునిర్మించుటకయి బెండుచేబండ్లుచేసియందుపర్వతాకారముల గుగొప్పఱాళ్లనెక్కించికోఁతులచే నీడ్పించుకొనివచ్చుచుండెను. ఈయద్భుతమును భయరమభట్టుచూచియీనాగనాథుఁడు పరమసిద్ధుఁడయియున్నాఁడు. ఇతనివలన నాసంశయము నివర్తికావచ్చుననితలఁచి యాలయములోపలప్రవేశించి నాగనాథునికెదురుగనిలిచి నేనెవ్వఁడను జెప్పము. నీసామర్థ్యమునుజూతమని ధైర్యముతోనడిగెను. అదివినిమహానుభావుఁడగునాగనాథుఁడు కోపగ్రస్తునివలె నటించి తనచేతనుండు బెత్తముతోనతనితలమీఁదఁగొట్టి కూలుమనిచెప్పెను. తోడనేభయరమభట్టుభూమిపైఁబడి ప్రాణములువిడిచెను. అపుడు నాగనాథుఁడు తనశిష్యులనుబిలిచియీప్రేతమునురోటిలోనునిచిదంచిముద్దచేసితెండనినియమించెను. వారలట్లుచేసి పిండాకృతియగుప్రేతమును ఆచార్యునికెదుటనునిచి వీరీమాంస పిండమునేమిచేయుదురనిచూచుచుండఁగా నాగనాథుఁడు పిడకలనుదెప్పించిపేర్చి యీపిండాకారశవమును దానియందునిచి పిడకలచేమూసి యగ్నినిక్షేపముచేసికాల్చి యాభస్మరాశిని ప్రోగుచేసికృపాదృష్టిచే కటాక్షించి దానిపై జలమును ప్రోక్షించినంతట భయరమభట్టుసజీవుఁడయి మునుపటికన్న నధికమగుతేజస్సుతోఁ గూడినశరీరముగలవాఁడయి లేచి వచ్చినాగనాథునికివందనముచేసి యంజలిహస్తుఁడయియతనికెదుటనిలుచుండెను. నాగనాథుఁడు భయరమభట్టునుజూచి యోరీమూఢా! యిపుడునీవెవ్వఁడవు. చెప్పమనియడిగెను. భయరమభట్టుతనశరీరమునందు తొలుత బ్రాహ్మణులచేచేయఁబడినసంస్కారములనుగాని, పిమ్మట తురుష్కులచేచేయఁబడినమహమ్మదీయ సంస్కారములనుగాని గానకప్రత్యుత్తరముచెప్ప నేరక మౌనముగనుండెను. అపుడు నాగనాథుఁడు అతనిశిరంబును తనకరంబులచేకరంబలంకరించి శ్రీతారకమంత్రమునుపదేశించియోరీ! నేనెవ్వఁడను. నీవుచెప్పము. చూతమనినన్నడిగితివి. అందుకుప్రత్యుత్తరముచెప్పెదవినుము. నీవుదేవతిర్యఙ్మనుష్యస్థావరములలోను, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలోను, బ్రహ్మచారిగృహస్థవానప్రస్థసన్న్యాసులలోను ఒక్కఁడవునుకావు. ఈసంజ్ఞలన్నియు శరీరగతములయియుండునే గాని యాత్మకులేవు. ఆత్మనిత్యమయి, యవికారమయి, జ్ఞానానందస్వరూపమయి, జ్ఞానగుణకమయి, పరమాత్మకుశేషమయి, యుండును. మునుపుబ్రాహ్మణులును, తురుష్కులునుజేసినసంస్కారములు నీశరీరమునకేకాని యాత్మకుకావు. కానసీసంస్కారములచే

నీస్వతంత్రాభయములేదు. అక్షరాంకర్బద్ధవాచ్యుఁడు ఆత్మయేకాని శరీరముకాదు. అట్లుండినను బ్రాహ్మణోహం, శూద్రోహం, కృశోహం, వృద్ధోహం, ఇత్యాదిరీతినిశరీరగతధర్మములను ఆత్మయందారోపించివ్యవహరించుట లోకమునందు సాముకద్దైయున్నది. అయిననువ్యవహారదశయందెట్లుపల్కుచున్నను బుద్ధిమంతులగువారలు నేమారకయాత్మస్వరూపమును సస్మరించుచుండవలయును. ఈయాత్మకు కర్మానుగుణముగ పుణ్యపాపములును, ఆసుఖదుఃఖములును గలుగుచునుండును. వివేకియగువాఁడు సద్గురువును ప్రార్థించి వారిచ్చుచే జ్ఞానదీపమును జెంది యజ్ఞానతిమిరమును పాఱఁదోలి తన్ను తానెఱింగి తనయాత్మభారమును భగవంతునిపాదకమలములయందర్పించియాభగవంతునికటాక్షముచే ప్రకృతిబంధవినిర్ముక్తుఁడయి పునరావృత్తిరహితమోక్షమును జెందును. నీవుభగవదాజ్ఞయగుశ్రుతి, స్మృతులనుల్లంఘింపక శాస్త్రోక్తమార్గంబున నడచుచు ననవరతము భగవన్నామస్మరణముచేయుచు నిరంతరభగవధ్యానపరుఁడవయి నీకరణకళేబరములను భగవత్కైంకర్యమున వినియోగించుచుండుము. ఆత్మయనెడుపథికుఁడు శరీరమనెడిరథమునారోహించియున్నాఁడు. ఈరథమునకు ఇంద్రియములుగుఱ్ఱములయి, మనసుపగ్గమయి, బుద్ధిసారథియైయుండును. బుద్ధిమంతుఁడు ఇంద్రియములనెడి గుఱ్ఱములనుజాగ్రత్తతోడశాస్త్రోక్తమార్గమున నడపించిన నిర్భయుఁడై మోక్షమును జెందును. సారథియగుబుద్ధిజాగ్రత్తతప్పి మనస్సనెడిపగ్గములను వదలవిడిచిననింద్రియములనెడి దుష్టాశ్వములు శరీరరథమును రాజమార్గమగు వేదాంతవీథిని విడిచిపెట్టివిషయవీథికీడ్చుకొనిపోవును. ఆమార్గము రథికుఁడగునాత్మను యమపట్టణమునఁ జేర్చును. కాన భగవంతుఁడు నాయందావేశించి నీకుచేసినహితోపదేశమును మఱువక జాగరూకుఁడవయి సాధుజనులతోసహవాసముచేయుచు ఆయుశ్శేషమునుగడపి బ్రహ్మానందమును జెందిసుఖింపుము. అనిహితోపదేశముచేసిన నాగనాథగురువచనములనువిని నిర్మలచిత్తుఁడయి యతనికి సాష్టాంగవందనముచేసి గురుపుంగవా! ధన్యుఁడనైతిని. కృతకృత్యుఁడనయితిని. ఇపుడు మృత్యువును ప్రియముగనతిథివలె నిరీక్షించుచున్నాఁడను. భవరోగవైద్యుఁడగుభగవంతుఁడు నీరూపమయివచ్చి నాకునీద్ధౌషధమునిచ్చెను. దానిని సేవించుటచే నాభవరోగముమాని నీకటాక్షముచే ముక్తుఁడనయితిని. శ్రీపాండురంగమూర్తిని అనేకభక్తులుపాసించుచున్నారు. వీనను అశ్చారూపియగుభగవంతునిని సహాయక్తికి నిడుకొని భుజించినాముదేవునికిని, భాగవతాపాధనమునకయిపుత్రునితలను ఛేదించినకపీరునకును, మహిషముతోటిచే నాలుగు వేదములను బలికించినజ్ఞానదేవునికిని, తనభృత్యుడయినపండరినాథునిదాఁచిపెట్టినసావుంతునికిని, మరియునిట్టివిచిత్రచరిత్రముల ననుష్ఠించిన భక్తినభాగవతులకును సదృశులౌదు ఉగలరా? ఈకాలమునస్పర్శవేదిచే నినుము బంగారమగునట్లు నాశరీరమును పుటముపెట్టి నన్ను పరిశుద్ధినిఁ జేసిన నీకుసదృశులెవరనిచెప్పవచ్చును. నిస్సమాభ్యధికుఁడగు శ్రీమత్పండరినాథుఁడు తనకుతానే సదృశుఁడగునట్లు నీకునీవేసదృశుఁడైయున్నాఁడవు. అనియాచార్యునిస్తుతించి యతనిపాదచ్ఛాయయయి కొన్నాళ్లుచట వసించి యాచార్యునియనుమతమును జెంది పండరీపురమునకువచ్చి శ్రీపాండురంగనిని దర్శించి సాధుగోష్ఠియందుండి బ్రహ్మానందమునునుభవించుచు శ్రీభాగవతముకండరి సంకీర్తనసత్కాలక్షేపములను [illegible]

భాషయందు ననుష్ఠానము నాదరించి యాచార్యుఁడు విధించిన పద్ధతులను తప్పక యాచరించు శ్రేష్ఠత్వమును గడపి భగవత్సాయుజ్యమును జెందెను.

భవభయహరాయనమః.

# నలువదియైదవ యధ్యాయము.

---

## ఏకనాథస్వామిచరిత్రము.

విద్యానగరమునుండి దేవాధిదేవుఁడగు శ్రీరుక్మిణీకాంతునిని పండరీపురమునకు దెచ్చి పూర్వమువలె బ్రతిష్ఠించి యఖిలలోకములకు సుజీవనమునుగల్పించి సాధుజనులను సంతోషింపించిన మహానుభావుఁడగు భానుదాసునికి చక్రపాణియను నొకపుత్రుఁడు కలిగెను. అతఁడు కల్యాణగుణగణరాశియై యనవరతము శ్రీహరిభజనము చేయుచుండెను. అతని పుత్రునికి సూర్యనారాయణుఁడని నామకరణము చేయఁబడియె. ఆ పుత్రునికి నుచితకాలమున చౌలో, పనయన, వేదాధ్యయన, శాస్త్రాభ్యాసములు క్రమముగ జరపఁబడియె. పిదప రుక్మిణి యను నొకకన్యకను నితనికి పాణిగ్రహణము చేయించిరి. వీరిరువురికిని మహానుభావుఁడయిన యేకనాథుఁడు పుత్రుఁడయి యవతరించెను. ఆయేకనాథునికి తల్లిదండ్రులు యథాకాలమున నుపనయన వివాహాదులను జేయించిరి. ఇతఁడు పూర్వజన్మవాసనచే నతిబాల్యము నందే సాధుజనులయందు విశ్వాసముగలవాఁడయి సాధువులగోష్ఠియందు వసించుచు శ్రీహరిభజనమున నత్యంతప్రీతిగలవాఁడయియుండెను. అపుడచట పరమజ్ఞానియై దత్తాత్రేయోపాసకుఁడగు జనార్దనపండితుఁడను నొకమహాత్ముఁడుండెను. ఏకనాథుఁడతని చెంతకుఁబోయి సాష్టాంగవందనము చేసి భయభక్తులతోడ బద్ధాంజలియై నిలుచుండఁగా జనార్దనపండితుఁడితనిఁజూచి నాయనా నీవెవ్వఁడవు? బాలుఁడవగు నీవు క్రీడాసక్తినివిడిచి తల్లిదండ్రుల నెడవాసి యిచటికేమి కారణంబుగవచ్చితివి. అనియడుగఁగా ఏకనాథుఁడిట్లనియె. ఓస్వామీ! ఇదివఱకు నేనెత్తిన జన్మములకు లెక్కలేదు. ఆజన్మములయందు నాకెందరోతల్లిదండ్రులయిరి. ఈశరీరమునుకనిపెంచిన తల్లిదండ్రులును, మునుపటి తల్లిదండ్రుల కోటిలోఁ జేరఁదగినవారే కాని వీరలయందువిశేషమేమియునుగానము. నిరుపాధిక జనకుఁడగు శ్రీమన్నారాయణుఁడు నాకును, నీకును, నెల్లలోకములకును తండ్రియైయున్నాఁడు. వానినిర్హేతుకకృపచే నాకుదుర్లభమగు మనుష్యశరీరము లభించెను. ఈజన్మమునందును ఆజగన్నాథుని సేవింపక యాహారనిద్రాభయమైథునములకు వశ్యుఁడనయి కాలమును వ్యర్థపుచ్చితినేని నేనుమరల ప్రాణుఁడనగుదును. సాధుగోష్ఠిని జేరి శాంతిసుఖమును ననుభవించుటకె యీమనుష్యజన్మమునకు ప్రయోజనము. అట్టిసుఖము ననుభవింపనీక కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి యరిషడ్వర్గము నన్ను బాధపెట్టుచున్నది. ఈశత్రువులను జయించినవాఁడుగాక శిష్యుఁడు ... బ్రహ్మానందసుఖమును జెందును. అట్టి ... (శ్రీశంకరీ సజ్జన సంగతిరేకా । భవతి భవార్ణవ తరణే నౌకా) అనురీతి ... సజ్జన ... 

చి సజ్జనాగ్రేసరులరగు దేవరవారిపాదపద్మములనాశ్రయించి యనవరతముకైంకర్యము చేయుచు కృతార్థుఁడనయ్యెదనని నిశ్చయించివచ్చితిని. శరణాగతరక్షణము సర్వేశ్వరునికిని, సాధులకును స్వభావగుణముకదా? అని విన్నవించినయీబాలునిముద్దుపలుకులకు జనార్దనపండితుఁడు మిగులనాశ్చర్యపడి నీవు కేవలబాలుఁడవైయున్నాఁడవు. నీవివేకము అద్వితీయము. నీమాటలు కర్ణామృతములైయున్నవి. ఇదిఅఘటితములను ఘటింపించుభగవంతుని ఘటనయనితోఁచుచున్నది. లోకులందఱు భగవద్విముఖులయి కామక్రోధాదియరిషడ్వర్గమునుపోషించుచుండ నీవీబాల్యమునందాయరిషడ్వర్గస్వభావమునెఱిఁగి యింద్రియసుఖమును ద్వేషించి బ్రహ్మానందసుఖము నపేక్షించితివి. హృషీకములుబాధింపవు. భయపడకుము. నీవుకోరినట్లే నాచెంతవసింపుము అనియనుగ్రహించెను. అపుడునారదసల్లాపముచే శ్రీవేదవ్యాసులకును, మహర్షిసల్లాపముచే ధ్రువునికినినెట్టి యానందముకలిగెనో యట్టియానందమునుజెంది యేకనాథుఁడుసంతోషించెను. అదిమొదలు (శరీరంవసువిజ్ఞానం। వాసఃకర్మగుణానసూన్। గుర్వర్థంధారయేద్యస్తు। సశిష్యోనేతరస్స్మృతః) అనురీతిని ఆత్మాత్మీయములను ఆగురునియధీనముచేసి గురుకులవాసముచేయుచుండెను. ఏకనాథుఁడు (గురుపాదాంబుజంధ్యాయేత్) అనురీతిని గురుపాదపద్మధ్యానముచేయుచు పరమపావనమగువారియుచ్ఛిష్టమునుభుజింపుచు వారిపాదచ్ఛాయయనఁదగి వర్తించుచుండెను. జనార్దనపండితుఁడేకనాథుని ధీశక్త్యాదిగుణగణంబులనుజూచి యెంతయుసంతోషించి యోవత్సా నీవనవరతము నాకుశుశ్రూషచేయుచు నన్నెడవాయకయున్నావు. నీజననీజనకప్రభృతులన్నవస్త్రములకులేక ఖిన్నులయియుందురు. తల్లిదండ్రులు కుందుచుండ నీవువారలచింతలేకయిచటనుండుట న్యాయ్యముకాదు. నేనునీకుకొంతద్రవ్యమిచ్చెదను. ఆద్రవ్యమునొకకుశలవర్తమానపత్రికతోడ నీతల్లిదండ్రులకుపంపి నీవునాయింటిలెక్కలనువ్రాయుచు జాగరూకుఁడవయియుండుమని నియమించెను. ఏకనాథుఁడు మహాభాగ్యుని యాచార్యుఁడు నియమించినట్లుచేయుచుండెను.

ఒకనాఁడు జనార్దనపండితుఁడేకనాథుని సామర్థ్యమునుబరీక్షింపవలయునని తలఁచి యతనిఁజూచినీవిదివఱకు వ్రాసినలెక్కలను మొత్తముచేసినాకుతెచ్చిచూపుమని నియమించెను. ఏకనాథుఁడువల్లెయని పగలంతయునాచార్యకైంకర్యమునందు జాగరూకుఁడయియుండి రాత్రియాచార్యుఁడు శయనించినపిదపదీపమునుంచుకొని లెక్కలను మొత్తము చేయునపుడు అర, పాతిక, పరక, వీసము, వ్యత్యాసముగనుండుటచే ఏకనాథుఁడు నిద్రాహారములనువర్జించియారాత్రియంతయును తదేకధ్యానముగ లెక్కలనుబరీక్షించుచుండెను. జనార్దనపండితుఁడు రాత్రిమూడవజామున మేల్కని యేకనాథునిని అతఁడువాడుకగాశయనించుస్థానమునందు గానక వెదకఁగానతఁడొకయేకాంతస్థలమునందుఁ గూర్చుండి దీపముపెట్టుకొని తదేకధ్యానముగ లెక్కలను బరీక్షించుచుండుటనుజూచి యతనికి తెలియక కొంతదూరమున నిలుచుండి చూచుచుండఁగా కొంతసేపయిన పిమ్మట ఏకనాథునిలెక్కసరిపడినందున నతఁడు సంతోషమును జెందితనయాచార్యుఁడు చెంతనిలుచుండినదిచూడఁగ చేయుచట్టిచటపటనవ్వుచు భళీయనిచెప్పెను. అదిచూచి జనార్దనపండితుఁడేకనాథుని

యెదురవచ్చి నీవేమియాశ్చర్యమునుగంటివి. భళీయనిచెప్పినవ్వుచు చేయితట్టుటకు కారణ మేమనియడిగిన నేకనాథుఁడుతలయెత్తిచూచి శీఘ్రముగలేచి యాచార్యునికివందనము చేసి తననవ్వునకు కారణమును విన్నవించెను. అదివిని జనార్దనపండితుఁడునవ్వి యోరీ ఏకనాథా! ఒక్కజాముగనేనునీచెంతవచ్చినిలుచుండునదియెఱుంగక పరకనై, విసమునకై, తదేకధ్యానముగ నీమనస్సును లెక్కయందులయింపఁజేసితివి. ఇట్టియచంచలనిష్ఠ నీకు భగవంతునియందుకలిగెనేని నీవుభగవత్సాయుజ్యమును జెందుటకు సంశయములేదు. ఇదియే నీవుకోరినపరమశాంతిసుఖమని హితోపదేశమును జేయఁగా ఏకనాథునికి తత్క్షణమున వైరాగ్యముగలిగి స్వామీ! దేవరవారికరుణచే నాకోరికసిద్ధించి నాజన్మముసఫలమయ్యెను. దేవరవారిహితోపదేశమనెడి ప్రదీపమనాదికాలముగ పెక్కుజన్మములయందు నన్నెడవాయకుండినయజ్ఞానతిమిరమును పాఱఁదోలెను. అనిచెప్పితాటియాకులనుగంటమును భూమిపైనునిచిగురుపుంగవా! లెక్కింపశక్యముకానినాసంచితప్రారబ్ధములు దేవరవారికటాక్షముచేరూపుమాసియున్నచోటుతెలియకపోయెను. ఇదివఱకు నరశరీరమునుధరించిపశువృత్తితోఁగూడియుంటిని. దేవరవారియుపదేశముచేనిపుడు నేనొకమనుజుఁడనయితిని. ఐనను నన్నువిశ్వసింపవలదు. ఈశరీరరథమునఁగట్టఁబడియుండు దుష్టేంద్రియాశ్వములు నాస్వాధీనముననిలువవు. ఇవి వేదాంతపథమునుదప్పించి విషయవీథియందుచరించి నన్నుయమపట్టణంబునఁజేర్చునని వెఱచెదను. నాకుదృఢమగుబుద్ధియనుపగ్గమునిచ్చి యాదుష్టాశ్వములయిచ్చకువచ్చిన గమనమునుదప్పించినన్నర్చిరాదిమార్గముననడపించి శ్రీవైకుంఠదివ్యనగరమునఁజేర్పవలసినభారము నీదియైయున్నది. నేను నీసన్నిధిని శరణాగతిచేసిననాఁడే యీయాత్మభారము నీచేవహింపఁబడినదయ్యెను. ఇపుడు నేనుమరలప్రార్థించుట యనావశ్యకము. అయిననునీతోడిసల్లాపమునాకుధారక, పోషక, భోగ్యరూపములయియుండుటచేమునుపటివిన్నపమునేమరలవిన్నవించుచున్నాఁడను. అనిచెప్పిన ఏకనాథునివాక్యములను వినిజనార్దనభట్టుమిగులసంతసించి యతనినాలింగనముచేసికొని యతనిచెవిని శ్రీతారకమంత్రమునుపదేశించెను. ఏకనాథుఁడు కృతార్థుఁడనయితినని యానందించియేమరకయాచార్యశుశ్రూషచేయుచుండెను.

ఇట్లుండ శ్రీజనార్దనపండితుఁడు ఏకనాథునినిశ్చయజ్ఞానమును, భయ, భక్తి, విశ్వాసములనుజూచి యితనిస్వభావముపమానరహితమయి యున్నది. ఇతఁడు భగవంతునియవతారముగనుండవచ్చునని తోఁచుచున్నది. ఇట్టివానికిశ్రీదత్తాత్రేయస్వామిదర్శనముచేయించుటయుచితమని తలఁచి యేకనాథునిఁజూచి నీకుఅస్మదాచార్యుఁడయి, జగద్గురువగుశ్రీదత్తాత్రేయస్వామి దర్శనముచేయించెదను. ఆమహాత్ముఁడు హేయమగువేషమునుధరించివచ్చును. దానిఁజూచి నీమనంబున సంశయింపకుము. నేనతనితోఁగలసిమాటలాడుచుండునపుడు నీవతనిపాదములనుగట్టిగపట్టుకొనియతనిని ధ్యానింపుము. అతనికి నీయందు కృపకలిగితనయుచ్ఛిష్టమునిచ్చునేని తోడనేస్వీకరింపుము అనిచెప్పఁగా ఏకనాథుఁడు గురువునవలోకించియో స్వామీ దేవరవారిపాదకమలములకన్నమించినగొప్పపదార్థము వేఱొకటి నేనెఱుఁగననిచెప్పెను. అదివినిజనార్దనపండితుఁడోయేకనాథా? నాయుపాసనాదైవముగు దత్తాత్రేయునికినానియమనముచే భక్తిచేయుము. అతనికృపకు పాత్రుఁడవయితి

మిగులసంతోషించితిని. అని చెప్పి యేకనాథునిఁ బిలుచుకొని యదిరికిఁ బోయి స్వాచార్యుని ని ధ్యానించుచుండఁగా అనసూయాపత్యుఁడగు దత్తాత్రేయభగవంతుఁడు తురుష్కవేషధారియయి మంగలసాక్షాత్కారమయ్యెను. జనార్దనపండితుఁడు తనగురువును ఏకనాథునికిఁ జూపి యదిగో చూడుము. మన్నాథుఁడు తురుష్కవేషధరుఁడయి యశ్వమునారోహించి వచ్చుచున్నాఁడని చెప్పుచుండఁగా దత్తాత్రేయస్వామి జనార్దనపండితుని కెదురవచ్చి గుఱ్ఱమునవరోహించెను. అప్పుడు జనార్దనపండితుఁడు గురువునకు సాష్టాంగవందనము చేసియతని తోడనే శాంతముగఁ గూర్చుండి మాట్లాడుచుండెను. ఏకనాథుఁడు ఇతఁ డెవ్వఁడోయని సంశయించుచు దూరమున నిలుచుండి చూచుచుండెను. ఇట్లుండ దత్తాత్రేయస్వామి నన్నాఁకలి బాధించుచున్నదని తన శిష్యునితో చెప్పెను. జనార్దనపండితుఁడు తన యోగబలముచే షడ్రసోపేతమగు నన్నము నప్పుడే తెప్పించి స్వర్ణపాత్రమున నునిచి యాచార్యుని కెదుట నుంచెను. అపుడు గురుశిష్యులిరువురును సహపఙ్క్తిభోజనము చేయుచుండ దత్తాత్రేయస్వామి జనార్దనపండితునిఁ జూచి నిన్ను వెంబడించి వచ్చిన నీశిష్యుఁడును సహపఙ్క్తి కర్హుఁడని తలఁచితి వేని నతనిఁ బిలువుమని నియమించెను. ఈమాటను విని యేకనాథుఁ డిదియేమి విపరీతము. ప్రత్యక్షముగ తురుష్కునితోడ నే నెట్లు భుజింతునని చెప్పుచు దూరముగ తొలఁగిపోయెను. దత్తాత్రేయస్వామి యదృశ్యుఁడయ్యెను.

అపుడు ఏకనాథుఁడు వచ్చి జనార్దనపండితునకు సాష్టాంగవందనము చేసి యో స్వామీ యిపుడిచటికి వచ్చిన తురుష్కుఁ డెవఁడు. దేవరవా రతనికి సాష్టాంగవందనము చేసి యతనితోడ భుజించుటకు కారణ మేమని యడిగిన జనార్దనపండితుఁడు తన శిష్యుఁడయిన యేకనాథునిఁ జూచి యితఁ డత్రిమహర్షిపుత్త్రుఁడగు దత్తాత్రేయస్వామి. పూర్వ మే నీతో నేను జెప్పియు నీవు విశ్వసింపకపోతివి. ఇతని సేవ పరమయోగులకును దుర్లభమయినది. మనభాగ్యవశముచే ఈమహాత్ముని దర్శనము నీకు సిద్ధించియు, నీవు కల్మషచిత్తుఁడవయి యతని కటాక్షమునకు లక్ష్యముగాకపోయితివి. కల్పవృక్షము వృక్షసామాన్యముగను, కామధేనువును ధేనుసామాన్యముగను తలఁచువారివలె నామహాత్ముని మనుష్యసామాన్యునిఁగఁ దలఁచితివి. అష్టాంగయోగములును, అణిమాద్యష్టసిద్ధులును సిద్ధించినను ఈమహాత్ముని దర్శనము సిద్ధించుట దుర్లభము. అట్టి దివ్యమూర్తిమాహాత్మ్యము నెఱుఁగక యతని వేషమును జూచి తురుష్కుఁడని గ్రహించితివి. అంతరవేషము గునై రాగ్యమే యాత్మకు ముఖ్యస్వరూపమగును గాని బాహ్యవేష మెట్టిదైనను అది ప్రయోజనకారి కాదనునట్టి పరమధర్మమును దత్తాత్రేయాదిపరమయోగులు లోకుల కనుగ్రహించి చూపుదురు. నీవీతత్త్వము నెఱుఁగక మోసపోతివి. ఐనను కొదవలేదు. ఇఁకనైనను సావధానముతో కూడియుండుమని చెప్పిన విని యేకనాథుఁ డాచార్యున వలోకించి గురుపుంగవా! దేవరవారి పాదపద్మముల నాశ్రయించిన నాకు మఱియొకరితో పనియేమి? నేను త్రికరణశుద్ధి తోడ దేవరవారిని ఆశ్రయించినది యథార్థమయిన సర్వజ్ఞుఁడగు దత్తాత్రేయస్వామి నాయందు ప్రసన్నుఁడగును గాక. వృక్షమూలమున నీరు పోసిన కొమ్మ ఫలమిచ్చునట్లు దేవరవారి ననువర్తించు నాయందు దత్తాత్రేయస్వామికి సంతోషము కలుగుననుటకు సందేహము లేదు అని విన్నవించిన శిష్యుని మాటలకు సంతసించి యతఁడు వెంబడింప జనార్దనపండితుఁడు స్వగృహము చేరెను.

మఱియొకనాఁడు జనార్దనపండితుఁడు ఏకనాథునిని వెంటఁబెట్టుకొని యడవికివచ్చి విజనస్థలంబుననుండి దత్తాత్రేయస్వామిని ధ్యానింపఁగా ఆమహాత్ముఁడొకఫకీరువేషమునుధరించుకొనివచ్చెను. కామధేనువుశ్వానరూపమునుధరించియామహానుభావుని వెంబడించివచ్చెను. జనార్దనపండితుఁడీరూపమునుజూచిచిత్తమునకలంకములేక సాష్టాంగవందనముచేసియతనితోడఁగూర్చుండి సంభాషణముచేయుచుండెను. అపుడుదత్తాత్రేయస్వామి తనశిక్యముననుండినరొట్టెనెత్తికొని తనతోడవచ్చిన శ్వానముపాలనుతనకమండలువునపిదికి యారొట్టెనుద్రుంచి యాపాలలోనద్దిభుజించుచుండెను అపుడేకనాథునికి చిత్తకాలుష్యముమానకయుండుటచేనతఁడుదూరముగనిలుచుండి చూచుచుండెను. దత్తాత్రేయస్వామిజనార్దనపండితునిఁజూచి నిన్ను వెంబడించివచ్చినవాఁడు నీకంతరంగశిష్యుఁడు. కానవానినిచటకిఁబిలువుమని నియమించెను. అపుడుజనార్దనపండితుఁడు తనచేతితోసయిగచేసి యేకనాథునిని రప్పించి దత్తాత్రేయస్వామిభుక్తశేషముగుమహాప్రసాదమును అతనికిచ్చి, స్వాచార్యుని పాదకమలంబులఁబడవైచి యీయాత్మను జక్కఁగఁగటాక్షింపవలయునని ప్రార్థించి యతనిచరిత్రమునంతయు విన్నవించెను. అదివినిదత్తాత్రేయస్వామి సంతసించిజనార్దనపండితునిఁజూచియీయేకనాథుఁడు వేదవ్యాసమహర్షిప్రణీతమయి, సకలవేదసారమయి, శ్రీశుకమహర్షి చేపరీక్షిన్మహారాజునకుపదేశింపఁబడిన శ్రీమద్భాగవతపురాణమును మహారాష్ట్రభాషయందురచియించును. ఆగ్రంథము లోకమునందుమిగులప్రఖ్యాతివహించును. మఱియునితఁడుపరమభక్తియుక్తుఁడయి పెక్కుహరికీర్తనంబులఁ జెప్పి భగవద్విముఖులగుచేతనులకాభిముఖ్యమును గలుగఁజేయుననియనుగ్రహింపఁగా జనార్దనపండితుఁడు సంతోషించియేకనాథునిఁజూచియిపుడైనను నేను జెప్పినది నిజమనితోఁచుచున్నదా. అస్మత్స్వామిభుక్తశేషము పరమపావనమని స్వీకరించితివా లేక వారివేషమునుజూచిశంకించి యాప్రసాదమును పాఱవైచితివా? అనియడుగఁగా నేకనాథుఁడు నిజగురువునవలోకించి మహాత్మా నేను మందభాగ్యుఁడనుకాన నీపరమాచార్యుని ప్రభావమునెఱుఁగక యితనివేషమునుజూచి చిత్తమునకలుషించి నాచేతికందినమహాప్రసాదమును స్వీకరింపక పాఱవైచితినని భయపడుచు చెప్పెను. జనార్దనపండితుఁడు కొంతచింతించి తనచేతనుండిన తాంబూలమును దత్తాత్రేయస్వామికిచ్చెను. వారుదానినిస్వీకరించుచుండఁగావారినోటనుండికొంత తమ్మయెత్తియేకనాథునినోటవేసెను. పరమపావనమయినపరమాచార్యులయుచ్ఛిష్టమితనినోటపడినంతటనితనికి చిత్తకాలుష్యముమాని సర్వప్రపంచము భగవత్స్వరూపముగఁదోఁచెను. వెంటనే దత్తాత్రేయమూర్తి యదృశ్యుఁడయ్యెను. జనార్దనపండితుఁడేకనాథునితోడ స్వగృహమును జేరెను. ఏకనాథుఁడఖండజ్ఞానయుక్తుఁడయి చేతనాచేతనములగుసర్వపదార్థములు భగవత్స్వరూపమనియు, చిదచిద్రూపమగు సర్వప్రపంచమూభగవంతుని శరీరమనియు, అతఁడే సర్వమునందును శరీరియైయున్నాఁడనియు భావించుచునన్యమునెఱుఁగక యాచార్యునికి పాదచ్ఛాయయనఁదగి వర్తించుచుండెను.

జనార్దనపండితుఁడొకనాఁడు ఏకనాథునియధ్యవసాయమును జూచియిట్టిమహాత్ముఁడు నాకుపరిచర్యచేయుటయుచితముగాదనియోచించి యితనిఁజూచి యోయేకనా

ధానీవు పైట్న పురమునకుఁ బోయి నీతల్లిదండ్రులకు వందనముచేసి గృహంబున వసించి దేవాతిథి పితృపూజలను శ్రద్ధతోఁ జేయుచు పంచకాలపరాయణుండవయి యనవరతము భగవంతుని భజించుచు లోకులకు భగవద్భక్తిని గలుగఁ జేయుచునుండుము. నీవిట్లు చేయుట నాకు పరము సమ్మతము. సచ్ఛిష్యుని కాచార్య నియమనమలంఘనీయము గదా? అని నియమించిన ఏక నాథుఁడాచార్యునికి వందనము చేసి గురు నాథా నీవిశ్లేషము నెట్లు సహింతును. ఐనను నీయాజ్ఞను శిరసావహించి నీవు నియమించినట్లు చేసెదనని విన్నవించి యాచార్యనియమనము చెలది పైట్న పురమునకు వచ్చి తల్లిదండ్రులకు వందనముచేసి కుశలప్రశ్నముచే నెల్లరను సంతోషింపించి తన యాచార్యుఁడాజ్ఞాపించిన రీతిని గృహమునందు వసించి తనయింట సాన్నిధ్యము చేసియుండు శ్రీపాండురంగమూర్తిని భక్తితోడ నారాధించుచు నెడతెగక హరికీర్తనము చేయుచు నతిథుల నారాధించుచు తచ్ఛేషమును స్వీకరించుచు భోజనానంతరము పురాణశ్రవణము చేయుచు కాలము గడపుచుండెను. ఇతని జ్ఞానానుష్ఠానములను జూచి సాధుజనులానందించుచుండిరి. +

ఒకనాఁడేకనాథస్వామి స్వప్నమునందు శ్రీపాండురంగఁడు ప్రత్యక్షమయి యేకనాథా వాల్మీకిప్రోక్తముగు రామాయణమును మహారాష్ట్రభాషయందు రచింపుము. దానిని బఠించి మందప్రజ్ఞులు జీవింతురు. అని నియమించి యదృశ్యుఁడయ్యెను. తోడనే యేకనాథస్వామి మేల్కని స్వప్నమును విశ్వసించి సుముహూర్తమునందిష్టదేవతాప్రార్థనాపూర్వకముగ భావార్థరామాయణమను పేరు పెట్టి గ్రంథము వ్రాయుటకు ప్రారంభించెను. ప్రక్కయింటి బ్రాహ్మణుఁడసూయాగ్రస్తుఁడయి యితఁడు సంస్కృతగ్రంథమును మహారాష్ట్రమున వ్రాయుట కెట్లు సమర్థుఁడగును. ఒకవేళ శక్తికలిగి వ్రాసినను లోకమున దీని నెవరు గౌరవింతురని చెప్పచుండెను. ఏకనాథస్వామి స్వప్నమున జానకీరమణుఁడు ప్రసన్నుఁడయి యేకనాథా నిద్రించుట కార్యము కాదు. నీవాక్కులచే శ్రీరామాయణసారముగు నానందరసమనుభవింప వచ్చితినని చెప్పి యతని చెంత తాటియాకులను, గంటమును నిచ్చి యదృశ్యుఁడయ్యెను. ఏకనాథ స్వామి మేల్కని శ్రీరామచంద్రుని కృపకు సంతోషించి శ్రీరామాయణమును వ్రాయుచుండెను. ఇట్లు వ్రాయుచు సుందరకాండమునందాంజనేయుఁడు సీతాన్వేషణమునకయి మహేంద్ర పర్వతముననుండి లంకకు లంఘించెనని వ్రాయునపుడు శ్రీరామచంద్రచరణారవింద సేవా ధురీణుఁడగు నాంజనేయుఁడప్పుడు పరిపూర్ణముగ ఏకనాథుని యందావేశించియుండుటచే శరీరము పరవశమయి యాకాశమునకెగసి ప్రక్కయింటి ముంగిటఁబడెను. అపుడాయింటి బ్రాహ్మణుఁడీశబ్దమును విని భయపడుచు ముంగిటవచ్చి చూడఁగా ఏకనాథస్వామి మూర్ఛాక్రాంతుఁడై పడియుండెను. అతని శరీరమును శోధించునపుడతని చేతులయందు పత్రములును లేఖినియునుండెను. ఆపత్రములను తీసి చదివి చూడఁగా ఆంజనేయుఁడు మహేంద్ర పర్వతమునుండి లంకకు లంఘించెనని వ్రాయఁబడియుండెను. ఆబ్రాహ్మణుఁడది చూచి యాశ్చర్యపడి నే నీమహాత్ముని ప్రభావము నెఱుఁగక దూషించుచుంటిని. ఇతఁడు మూర్తీకరించిన భగవంతుఁడనుటకు సంశయము లేదని నిశ్చయించి శైత్యోపచారములచే నేకనాథస్వామి మూర్ఛను మాన్పి యతని గృహంబునకుఁ దోడ్కొనిపోయి కూర్చుండఁబెట్టి యతని పాదపద్మములకు వందనంబాచరించి స్వగృహముచేరెను.

మఱియొకనాఁడొక బ్రాహ్మణుఁడు ఏకనాథస్వామివలన నుపదేశమును బొందవలయునని తలఁచి యతనిసన్నిధికివచ్చి తనకోరికనతనికెఱుకచేసి మహాత్మా నీయుపదేశముచే నేను కృతార్థుఁడనయ్యెదనని విన్నవించెను. అపుడేకనాథస్వామి (సంవత్సరంతదర్థంవా। మాసత్రయమథాపివా। పరీక్ష్యవివిధోపాయైః। కృపయానిస్పృహోవదేత్) అనఁగా సంవత్సరమయినను, ఆఱునెలలయినను లేక మూఁడునెలలయినను బహువిధోపాయములచే శిష్యునిని చక్కఁగ పరీక్షించి నిస్పృహుఁడయి కృపతో నాచార్యుఁడు శిష్యునికి మంత్రోపదేశముచేయవలయునను వాక్యమును స్మరించి వీనినిబరీక్షింపకయే నేనెట్లుపదేశింపవచ్చును. ఖ్యాతిని, లాభమును, పూజలను బొందఁగోరి శిష్యునికుపదేశించిన యాచార్యునికనర్థము సంభవించును. (శిష్యపాపంగురోరపి) అనురీతిని శిష్యునిపాపమాచార్యునిఁ జెందును. కాన నాచార్యుఁడు తన్నాశ్రయించిన శిష్యునిని బహువిధములచే పరీక్షించి (సద్బుద్ధిస్సాధుసేవీసముచితచరితస్తత్వబోధాభిలాషీ। శుశ్రూషుస్త్యక్తమానః ప్రణిపతనపరః ప్రశ్నకాలప్రతీక్షః। శాంతోదాంతోనసూయుశ్శరణముపగతశ్శాస్త్రవిశ్వాసశాలీ। శిష్యఃప్రాప్తః పరీక్షాంకృతవిదభిమతంతత్వతశ్శిక్షణీయః) అనురీతిని సద్బుద్ధియై, సాధుసేవియై, మంచినడతకలవాఁడయి, తత్వబోధాభిలాషియై, శుశ్రూషాపరుఁడయి, త్యక్తమానియై, ప్రణామపరుఁడయి, ప్రశ్నకాలమును బ్రతీక్షించువాఁడయి, శాంతుఁడయి, దాంతుఁడయి, యసూయారహితుఁడై శరణాగతుఁడయి, శాస్త్రవిశ్వాసశాలియై యుండువానిని శిష్యునిఁగనంగీకరింపఁదగును. శిష్యవిత్తాపహారకులగు గురువులును, గుణహీనులగు శిష్యులును పరస్పరమనర్థపడుదురనుటకు సంశయములేదని తనలోఁ చింతించి యాబ్రాహ్మణునిఁ జూచి రేపు నేను శ్రీపాండురంగనిని పూజించుకాలమున నీవురమ్మని చెప్పి పంపి వెంటనే తనయింటనుండువారలను బిలిచి రేపు భగవదారాధనకాలమునందు దేనికయినను నేను మిమ్మెవరినైన బిలిచిన మీరది విననివారివలె దూరస్థులరయి యుండుఁడని నియమించి యట్లు మఱునాఁడు భగవదారాధనమునకుపక్రమించినతోడనే ప్రక్కయింటి బ్రాహ్మణుఁడువచ్చి యతనిచెంత నెమ్మదిగఁ గూర్చుండి యుండెను. అపుడేకనాథస్వామి ఎవరచ్చట, ఎవ్వరచ్చటయని గొంతెత్తిపిలిచి పిలిచి కోపించి యిదియేమి విపరీతము. నాయింటనుండువారందఱును స్వకార్యములయందు జాగరూకులై స్వామికార్యమునందు అశ్రద్ధధానులైయుండునట్లు తోఁచుచున్నది. ప్రతిదినము తెచ్చువారు నేఁడేల భగవంతునభిషేకించుటకు నభిషేకతీర్థము తెచ్చియుంచరు. ఎవరయినను శీఘ్రముగఁబోయి తీర్థమును దేవలయునని పలుమాఱు పిలిచియు సంకేతముప్రకారముగ నెక్కరును బలుకరైరి. ఏకనాథస్వామి యెవరును సమయమునకక్కఱకు రాలేదు. నేనేపోయి యభిషేకతీర్థమును దెచ్చుకొనియెదనని చెప్పుచు పాత్రమును దీసికొనిపోయి తీర్థము తెచ్చి భగవంతునికభిషేకముచేసి యారాధనము ముగించినపిదప నతిథిపూజచేసి తచ్ఛేషమును స్వీకరించి పరిశుద్ధస్థలమునఁ గూర్చుండి తనమనంబున నిట్లని వితర్కించెను. ఈప్రక్కయింటి బ్రాహ్మణునిని శిష్యునిఁగ స్వీకరించి, నేనెట్లుపదేశింపవచ్చును. అభిషేకార్థము జలము నెవరైనను దెచ్చి యిండని నేను పలుమాఱు పలుకుచుండుటను నాయందఁ గూర్చుండి వినుచుండియు నితఁడు నేను తెచ్చియిచ్చెదనని చెప్పకయూరకుండెను. నన్నాచార్యునిఁగ వరింపవచ్చి పూజార్థము నాకొకచెంబుజలము తెచ్చియిచ్చుటకు భక్తితోఁ బూనుకొననివాఁడు ఆత్మీయులనెట్లు భగవం

తునికర్పించును. కావున వీఁడుపదేశమున కర్హుఁడుకాఁడని నిశ్చయించి యిపుడుపదేశమునకు కాలముచితముయియుండలేదు. మఱియొకప్పుడు చూచుకొందమనిచెప్పి వానిని యింటికిపంపెను. ఏకనాధస్వామి శ్రీపాండురంగనినియమనప్రకారము రామాయణమును వ్రాసిముగించి శ్రీదత్తాత్రేయస్వామియనుగ్రహమున శ్రీభాగవతమునుమహారాష్ట్రమునరచించి యనవరత భగవద్గుణానుభవముచే పరమానందభరితుఁడయి కాలక్షేపముచేయుచుండెను.

శ్రీమద్దత్తాత్రేయమహాగురవేనమః.

## నలువదియాఱవయధ్యాయము.

---

ఏకనాధస్వామియింట పండరినాధుఁడు పరిచారకుఁడయియుండినచరిత్రము.

ఏకనాధస్వామి జగన్నివాసునిని సర్వోపచారములతోడఁ బూజించుచు నతిథులను భగవత్స్వరూపులనుగభావించి భక్తితోడనారాధించుచునుండుకాలమున శ్రీరుక్మిణీకాంతుఁ డేకనాధస్వామిభక్తియనెడివలనుజిక్కి యొకబ్రాహ్మణవేషమునుధరించివచ్చి పైటనపురమునప్రవేశించి యేకనాధస్వామిగృహమెద్దియని యాపట్టణవాసులనడుగుచు వచ్చి యాయింటప్రవేశించియేకనాధస్వామికి సాష్టాంగవందనముచేసియోమహాత్మా నేనుబ్రాహ్మణుఁడను. ఒంటివాఁడను. నాకెవ్వరునుదిక్కులేదు. నీవుభక్తితోడచేయునతిథిపూజావైభవమును వినినీవేగతియనివచ్చితిని. నీవనుమతిచేసితివేని నీయింటపరిచారకుఁడనయియుండెదను. నేను వేతనమున పేక్షించువాఁడనుకాను. అన్నవస్త్రములిచ్చినన్ను నీవానిఁగనభిమానించినఁజాలును. అనినవినియేకనాధస్వామి యావిప్రునిఁజూచి నీపేరేమి? నీయూరెయ్యది? అని యడిగినదేవకీనందనుఁడు ఓయీసాధుజనాగ్రేసరా ఏకాకియగునాకు నాయదియనియభిమానింపఁదగినస్థలములేదు. నేనెందును సంచరించుచుందును. నాకుబంధువులులేరు. సాధుజనులేబంధువులనినమ్మియున్నాను. నాపేరుశ్రీకంఠియాకృష్ణుఁడు. నేనంతటనుసంచరించి చూచితిని. ఇచ్చోటు నాకురమించియున్నది. అనినవినియేకనాధస్వామి మంచిది. నీకెంతకాలమిచ్చట వసించుటకిష్టమోయంతవఱకు సుఖివయి యిచటనుండుము. సమస్తప్రపంచము శ్రియఃపతియధీనము. కాననీయిల్లును, ఇంటియందలిపదార్థములును, ఈశ్వరసంతానమగునాకును, నీకును అనుభవయోగ్యములయియున్నవి. కాన నాయనుమతినిఁజెంది నాయింటవసింపవలయునసుభావమునువిడిచి యథేష్టముగ నీయింటవసింపుము. అతిథిపూజావిషయమున నాకుసహాయుఁడవై యుండుము. అనిచెప్పిన నేకనాధస్వామికిఁగలగంభీరభావమునకు భగవంతుఁడెంతయు సంతోషించి యితరులకవకాశమీయక యతనియింటికార్యములనన్నింటినితానేనిర్వహించుచువచ్చెను. అపుడింద్రాదిదేవతలును, సనకాదియోగులును ఈయద్భుతమునుజూచి యాహాయీయాశ్చర్యమునేమనికొనియాడవచ్చును. బ్రహ్మాదులకారాధ్యుఁడయి సర్వభూతహృత్పద్మవర్తియగు భగవంతుఁడేకనాథునియింట పరిచారకుఁడయియున్నాఁడు. ఎవనియానందము వేదపురుషునికగోచరమైయున్నదో యట్టి జగదీశుఁడేకనాధుఁడుచేయునట్టి యతిథిపూజకానందించుచు నతనికిసహాయుఁడయియు

న్నాఁడు. శ్రీమహాలక్ష్మియొక్క కోమలకరస్పర్శమునకోర్వని దివ్యమంగళవిగ్రహ విశిష్టుఁడి ప్పుడేకనాథునియింట చందనమునూఱుట మొదలగు కార్యములను జేయుచున్నాఁడు. అష్టాంగయోగములచే సాధింపఁబడని సర్వేశ్వరుఁడేకనాథునియింటనను లేపనాది. కృత్యములను జేయుచున్నాఁడు. సమస్తదేవతలను పరిచారకులనుగ నేలు దేవాధిదేవుఁడేకనాథునియింట పాత్రశుద్ధిచేయుచున్నాఁడు. ముక్తిదాయకుఁడగు ముకుందుఁడేకనాథునియింటి యతిథుల కన్నమువడ్డించుచున్నాఁడు. పరమపవిత్రుఁడగులోకేశుఁడేకనాథునియింటనతిథులుభుజించినయుచ్ఛిష్టమునుబరిహరించి స్థలశుద్ధిచేయుచున్నాఁడు. క్షీరాబ్ధినిమథించి దేవతలకమృతమునిచ్చినయిందిరేశుఁడేకనాథునియింటపాకముచేయుచున్నాఁడు. సంకల్పమాత్రముచే బ్రహ్మాండసృష్టిచేసినశ్రీకృష్ణుఁడు ఏకనాథునియింట గుడ్డలను గుంజుచున్నాఁడు. సూర్యచంద్రులను నేత్రద్వయముగఁగలవాఁడు ఏకనాథునియింట దీపములను వెలిఁగించుచున్నాఁడు. ఏమియాశ్చర్యము. ఎట్టిభాగ్యము. ఈయేకనాథునిప్రభావము పరమయోగులవాఙ్మనస్సులకగోచరముయియున్నదని పెక్కువిధంబుల సన్నుతించుచుండిరి. శ్రీకంఠియాకృష్ణుఁడుజాగరూకుఁడయి (అహంసర్వంకరిష్యామి) అనురీతిని ఏకనాథస్వామియింటిసమస్తకార్యములనుతానొక్కఁడేనిర్వహించుచుండెను. ఇట్లుండఏకనాథస్వామితండ్రికశ్రాద్ధదినమువచ్చెను. అప్పుడేకనాథస్వామి శ్రాద్ధమునకు బ్రాహ్మణులనువరించిశ్రీకంఠియాకృష్ణునిఁజూచి నేఁడు శ్రాద్ధదినముగానున్నది. (శ్రద్ధయాదీయతేశ్రాద్ధం) అనిశాస్త్రముచెప్పుటచే మనముశ్రాద్ధమును శ్రద్ధతోడపరిపాలింపవలయును. శ్రాద్ధమునకువలసినపదార్థములనన్నింటిని సేకరించి బహువిధములగు భక్ష్యములతోడ పాకముచేయుమని చెప్పి స్నానముచేసివచ్చి మిద్దెమీఁదవస్త్రమునాఱవేయుచుండఁగా నతనితోఁటపనివాఁడగుమాలవానిఁజూచి వానిభార్య నేఁడు మనయజమానునియింటశ్రాద్ధము. కాన ననేకబ్రాహ్మణులు భుజింపవత్తురు. పాకశాలయందుండివాయువశముచే పచింపఁబడుభక్ష్యములదివ్యపరిమళము వెలువడి మనమనంబులనాకర్షించుచున్నది. బ్రాహ్మణభోజనానంతరమెంగిటాకులయందలిభక్ష్యములు మనకువిశేషముగ లభించుననిసంతోషించుచుచెప్పఁగావిని మాలవాఁడు తనభార్యనుజూచియోసీపిచ్చిదానా ఏలవ్యర్థముగమనోరథించెదవు? నేఁడుశ్రాద్ధదినముకాన నెంగిటాకులనువారు మనకంటికగపడనీకభూమియందు పూడ్చివేయుదురు. ఏలయందనిమ్రానిపండ్లకఱ్ఱుచూచెదవని చెప్పెను. వస్త్రములునారవేయుచుండిన యేకనాథస్వామియీమాటలనువిని తనఛందానువర్తియగు తనభార్యనుబిలిచియోవనితా మనతోఁటపనిచేయుమాలవాండ్రు పాకశాలయందుపాకము చేయఁబడుచుండు భక్ష్యముల వాసనలనుగ్రహించి యాసపడుచున్నారు. ఈశ్వరవిభూతినితృప్తిపఱుచుట మనకు పరమధర్మముగదా? సర్వస్వరూపియగుభగవంతునిని పితృరూపముగనారాధింపవలయుననిమనము మనోరథించుచుండ భగవంతుఁడుచండాలరూపధరుఁడై వచ్చి మనపూజనంగీకరింపమనోరథించెడినివాని. సంకల్పమునను వర్తించుటవిడిచి మనకు వేఱుసంకల్పమేల. భగవంతునిసంతోషింపించుటమనకు ముఖ్యధర్మముయియున్నది. అతఁడే రూపమునుధరిగ్రహించి ననుమనకదివిచారింపఁబనిలేదనిచెప్పిన భర్తృవచనములనువిని యాపరమపతివ్రత మత్ప్రాణనాథా నీపలుకులుచితములయియున్నవి. నీయిష్టమేనాకునిష్టము. పాకశాలయందు పాకముచేయఁబడినపదార్థములు విశేషముగనున్నవి. కాన మనతోఁట

మాలవాండ్రను వారలబంధుమిత్రులతోడఁదృప్తిపఱచుట శాగైయున్నది. ఇపుడుపాకము చేసియుండువస్తువులను వారలకువినియోగించి పిదపగృహమునుశుద్ధిచేసి శ్రాద్ధమునకుకావలసిన కార్యములను జేయుదమని భార్యచెప్పిననామాటలువిని మిగులసంతోషించి యేకనాథస్వామి చండాలవాటికయందలి మాలవాండ్రనెల్లరప్పించి వీథిలోపఙ్క్తిగఁగూర్చుండఁబెట్టి శ్రాద్ధమునకయిచేసినసమస్తపదార్థములను ఆకులయందువడ్డించి భగవత్స్వరూపులగుచేతనులారా శ్రీగోవిందస్మరణముతోడభుజింపుఁడనిచెప్పెను. అప్పుడువారలుభుజించి తృప్తులయియేకనాథస్వామిని పెక్కువిధములస్తుతించుచు తమయిండ్లకుఁబోయిరి. ఆయూరిబ్రాహ్మణులు గుమిగూడి యిదియేమివిపరీతము. ఈయేకనాథుఁడు తనతండ్రిశ్రాద్ధమని బ్రాహ్మణులనువరించి శ్రాద్ధమునకయి పాకముచేసినవస్తువులను చండాలురకు వినియోగించెను. కాననేఁడుమొదలువీనియింట బ్రాహ్మణులెవరును భుజింపఁగూడదని తమలోనిశ్చయముచేసికొని యేకనాథస్వామియింటికివచ్చి యానుశీలునిఁజూచి యోరీయేకనాథా నీవుపితృదినమున బ్రాహ్మణపూజనుపేక్షించి చండాలపూజచేసితివి. వైదికమార్గమునతిక్రమించి భ్రష్టుఁడవైతివి. అనికఠినాక్షరములుగ పలుకఁగావిని యేకనాథస్వామి యంజలిహస్తుఁడై యోవిప్రులారా నావిన్నపము నాలకింపుఁడు. బహుజన్మార్జితసుకృతవారాశికి అగస్త్యుఁడనఁదగు క్రోధమును సాధుజనులు కొనియాడఁదగదు. నాయందుతప్పులేదు. శ్రాద్ధమునకయిచేసిన పదార్థములవాసనను బట్టియీపంచములు వానిపైనాసపడిరి. వారలపేక్షించినవస్తువులను వారలకే వినియోగించి మఱలస్థలశుద్ధిచేసి శ్రాద్ధమునకైపాకముచేయఁబడుచున్నది. మీరలునాయందనుగ్రహముచేసి శ్రాద్ధమును నెఱవేర్పవలయునని ప్రార్థించెను. అపుడుబ్రాహ్మణులాగ్రహగ్రస్తులయి పురోడాశమును శ్వానమునకిచ్చినట్లు శ్రాద్ధార్హమగునన్నమును పంచములకిచ్చిననిన్ను జాతిభ్రష్టునిఁజేసితిమని చెప్పుచుతమయిండ్లకుఁబోయిరి.

ఏకనాథస్వామి శ్రాద్ధమునెట్లునిర్వహింతునని చింతించుచుండ శ్రీకంఠియాకృష్ణుఁడతనిఁజూచి యోదేవా నీవేలశోకించెదవు. శాంతచిత్తులుకాని యీబ్రాహ్మణులను నీవేలబతిమాలెదవు. వారలురారేని శ్రాద్ధమునెఱవేరదని శోకించెదవు. నీకారాధ్యుఁడగు శ్రీగోపాలమూర్తి నీపితరులనురప్పించిశ్రాద్ధమును పూర్తిచేయును. నీవుచింతనువిడిచి చేతులుకాళ్లు కడుగుకొని యాచమనముచేసి మీఁదికార్యములకుయత్నింపుము. అనినశ్రీకంఠియాకృష్ణునిమాటలనువిని యేకనాథస్వామిశ్రాద్ధముచేయ యత్నించెను.

భగవన్నియమనముచే ఏకనాథస్వామిపితరులు నిజరూపములతోడవచ్చి నిలిచిరి. ఏకనాథస్వామి వారలకు ప్రదక్షిణనమస్కారములుచేసి వస్త్ర, కుసుమ, చందన, ధూప, దీపాదులచే వారినిపూజించెను. పితరులుకూర్చుండిభుజించి తాంబూలాదులనంగీకరించిరి. ఏకనాథస్వామి వారలకుసాష్టాంగవందనముచేసి స్తుతించుచుండెను. ఆయూరిబ్రాహ్మణులీయద్భుతమునువిని యేకనాథస్వామియింటికివచ్చి సాక్షాత్కరించినపితరులనుజూచి యాశ్చర్యపడిరి. తోడనేపితరులదృశ్యులయిరి. అపుడాబ్రాహ్మణులు తమలోనిట్లనిచెప్పుకొనిరి. ఏకనాథుఁడు మహానుభావుఁడు. ఇతనికి శ్రీకృష్ణుఁడు సహాయుఁడయియున్నాఁడు. కాననితనిపితరులు సాక్షాత్కరించి భుజించిపోయిరి. ఇట్టివానిని నిగ్రహించుట మనకవమాన

కరమయియున్నది. మనమితనికిప్రాయశ్చిత్తమునువిధించి యితనినెప్పటియట్లు జాతియందుఁజేర్చుకొనుటయుంచిదనినిశ్చయించి మఱునాఁడుదయమున బ్రాహ్మణులందఱు నేకనాథస్వామియింటికివచ్చి వాకిటనిలుచుండి యతనినాహ్వానముచేసిరి. ఏకనాథస్వామి వెలుపలికి వచ్చి బ్రాహ్మణగోష్ఠికి వందనముచేసి నన్నేలజాతిభ్రష్టునిఁగఁ జేసితిరనియడిగెను. బ్రాహ్మణులతనింజూచియీదోషము అబుద్ధిపూర్వకముగసిద్ధించెను. నీవుప్రాయశ్చిత్తముచేపరిశుద్ధుఁడవుకావలయుననిన ఏకనాథస్వామి వారలనుజూచి నాకుతల్లియుఁదండ్రియు సర్వమును శ్రీకృష్ణుఁడయియున్నాఁడు. నేనేమిప్రాయశ్చిత్తము ననుష్ఠింతును. మీకిష్టమగునేని మీరునియమించినట్లుచేసెదననెను. బ్రాహ్మణులు ఏకనాథస్వామిని గంగాతీరమునకు పిలుచుకొనిపోయి సంకల్పముచేయించి మంత్రపూర్వకముగ స్నానముచేయించి ప్రాయశ్చిత్తముజరపించుచుండఁగా త్ర్యంబకక్షేత్రమునుండి యొకబ్రాహ్మణుఁడువచ్చి యోవిప్రులారా ఏకనాథస్వామియెవరనియడిగెను. వారలాబ్రాహ్మణుని జూచియేకనాథునితో నీకేమిపనియనియడిగిరి. అతఁడు వారలనుజూచి బ్రాహ్మణులారా యిదిగోచూడుఁడు. నేను కుష్ఠరోగముతోబహుబాధలనుభవించి రోగశాంతికయి పార్వతీరమణునుపాసించితిని. ఆదేవుఁడు నాయందుఁగరుణించి పైఠ్ణపురమునందు ఏకనాథుఁడనునొకవిష్ణుభక్తాగ్రేసరుఁడున్నాఁడు. ఆవైష్ణవోత్తముఁడు పితృశ్రాద్ధదినమునందనేకచండాలుర నన్నప్రదానముచేతృప్తులనుజేసెను. అతఁడు చండాలురనుబుద్ధిచేయక వారలనుభగవత్స్వరూపులనుగభావించి యారాధించెనుగాన నాయారాధనము భగవంతునికత్యంతము తృప్తికరమయ్యెను. పూర్వము భక్తవిలోచనమునుస్థానమునుండి ఋషిపత్నులయన్నమునంగీకరించినగోపాలచూడామణి యీపంచములయందావేశించి యేకనాథునిపూజనంగీకరించెను. కాననీతదీయారాధనము అసదృశమై మాదృశులకు కీర్తనీయమైయున్నది. ఆతదీయారాధనయందు ఒకస్త్రీశిశువుభుజించిన సుకృతముననేకాంశమును ఏకనాథునిచేఁజెందితివేనినీవ్యాధినివర్తియగుటయెకాక నీవుపునరావృత్తిరహితభగవత్సాయుజ్యమును జెందుదువని కైలాసపతి నియమించినందున నేనేకనాథస్వామిని వెదకుచువచ్చితినని చెప్పి యాభాగవతోత్తమునికిసాష్టాంగవందనముచేసి తనవృత్తాంతమునువిన్నవించిన నేకనాథస్వామిసంతోషించి యాబ్రాహ్మణునిఁజూచి నేనునిష్కాముఁడను. తదీయారాధనమేసాక్షాత్ఫలమని భాగవతులనారాధించుచున్నాను. ఈయారాధనమునకు మరియొకఫలమున పేక్షింపలేదు. నీవుశివాజ్ఞచేవచ్చితివికాన నీవుకోరినదానినిచ్చెద. నీకు భగవంతుఁడుమేలుచేయుఁగాయనిచెప్పి తానుచేసిన తదీయారాధనముననొకస్త్రీశిశువుభుజించినసుకృతముననేకాంశమునతనికుదకపూర్వకముగ దత్తముచేసెను. తోడనేయతనివ్యాధినివర్తియయి దివ్యశరీరముతోఁగూడినవాఁడయ్యెను. ఈ యతిశయమునుజూచి బ్రాహ్మణులు లజ్జావిశిష్టులయి యేకనాథస్వామికి వందనముచేసి మహాత్మా నీవుసాక్షాద్భగవదవతారమని తెలిసితిమి. మేము దురభిమానముచే నీవిషయమున్ననపచారపడితిమి. లోకపావనుఁడగునీకుమాయవివేకముచేప్రాయశ్చిత్తమునువిధించితిమి. మాతప్పునుసైఁచి మాయందనుగ్రహముచేయవలయునని ప్రార్థించిరి. ఏకనాథస్వామి యాబ్రాహ్మణులనందఱిని తనయింటికిఁబిలుచుకొనిపోయి వారలకుషడ్రసోపేతాన్నమునిడి చందన, కుసుమ, తాంబూలములనిచ్చి సత్కరించి వారలనువారివారియిండ్లకుపంపెను.

ఇట్లుండ ద్వారకాపురమున నొకబ్రాహ్మణుఁడు శ్రీరుక్మిణీకాంతునిదర్శనము నపేక్షించివైరాగ్యశీలుఁడై తపస్సుచేయుచుండెను. అపుడు శ్రీరాధారుక్మిణులతనిస్వప్నమున సాక్షాత్కరించి యోయిబ్రాహ్మణుఁడా నీవుశ్రీకృష్ణదర్శనకాంక్షతో నిచటికి వచ్చి తపస్సుచేయుచున్నాఁడవు. అతఁడిపుడిచటలేఁడు. ఆభక్తవత్సలుఁడుపైఠణపురవాసియగు నేకనాథుఁడనుపరమభక్తునియొక్క భక్తివలనుజిక్కి శ్రీకంఠియాకృష్ణుఁడనునామముతోఁడ బ్రాహ్మణవేషమునుధరించి పండ్రెండుసంవత్సరములుగ నతనియింట పరిచారకకృత్యముసు జేయుచున్నాఁడు. నీవచటికిఁబోయి యాదేవదేవునిదర్శించి యేకనాథునకైపండ్రెండుసంవత్సరములుగమమ్ము నెడవాసియుండుటన్యాయ్యముకాదనివిన్నవించిమాహృదయేశునిచటికిఁ దోడితెమ్మనిచెప్పియదృశ్యలయిరి. బ్రాహ్మణుఁడు మేల్కనిస్వప్నమునుమననముచేసి యేకనాథస్వామిభక్తిని, భక్తవత్సలునికతనియందు కలిగియుండువాత్సల్యమునకునుఆశ్చర్యపడి తోడనే బయలుదేరి పైఠణపురముచేరి యేకనాథస్వామియింటఁ బ్రవేశించెను. ఏకనాథస్వామియాబ్రాహ్మణునికివందనముచేసియర్ఘ్యపాద్యంబులనిచ్చియాసనంబునఁగూర్చుండఁబెట్టి యోతపోనిధీయెందుండివచ్చెదవు. ఏతీర్థంబులయందుఁగ్రుంకితివి. ఇఁకనెచటికిఁబోవనుద్దేశించియున్నవాఁడవు. నేఁడిచటవసించినాపూజనంగీకరింపవలయునని ప్రార్థించెను. భగవంతుఁడతిథిరూపియయి గృహస్థులపూజలనంగీకరించి వారలనురక్షించుచున్నాఁడు. సాక్షాద్భగవత్స్వరూపియగు నిన్ను నేనారాధించి కృతార్థుఁడనయ్యెదననిన ఏకనాథస్వామినిఁజూచియాబ్రాహ్మణుఁడిట్లనియె. ఓసాధుజనాగ్రేసరా నీయింటపరిచారకుఁడయియుండు శ్రీకంఠియాకృష్ణునిఁజూడవలయునని కోరి నేనుద్వారకాపురమునుండివచ్చితిని. అతఁడెచటనున్నాఁడనియడిగిన ఏకనాథస్వామి యోవిప్రోత్తమా శ్రీకంఠియాకృష్ణుఁడుతీర్థము తెచ్చుటకై గంగకు పోయియున్నాఁడు. అతఁడిపుడువచ్చుననిచెప్పెను. ఇంతలోశ్రీకంఠియాకృష్ణుఁడు తీర్థపుకావడిని తనభుజమునవహించుకొనిరాఁగా ఏకనాథస్వామియితఁడే శ్రీకంఠియాకృష్ణుఁడని ద్వారకనుండివచ్చినబ్రాహ్మణునకుచూపెను. ఆబ్రాహ్మణుఁడుతోడనే లేచియానందాశ్రుపూరితలోచనుఁడై శ్రీకంఠియాకృష్ణునికిసాష్టాంగవందనముచేసితనయుత్తమాంగముచేనతనిపాదపద్మములనలంకరించి లేచి నిలుచుండినిటలతటఘటితాంజలియయి (లోచనాభ్యాంపిబన్నివ) అనురీతినితనలోచనములతో అతనిదివ్యమూర్తినిదర్శించి యిట్లని విన్నవించెను. అఖిలలోకశరణ్యా? రుక్మిణీమనోహరా? సత్యభామాహృదయేశ్వరా? రాధాపతే? నేను నీదర్శనమున పేక్షించి ద్వారకయందు తపస్సుచేయుచుండఁగా నీవు ఈయేకనాథునిభక్తివలనుఁజిక్కి శ్రీరాధారుక్మిణులను పేక్షించి యిచటపరిచారకుఁడై యున్నావనివిని యిచటికివచ్చితిని. ఇదియేమివేషము. శంఖచక్రములనెచటదాఁచిపెట్టితివి. శ్రీవత్సకౌస్తుభంబులనేలమఱుఁగుచేసితివి. ఏకనాథునియింటిపరిచారకమున కింద్రాదిదేవతలను నియమింపఁగూడదా. మహిషియుచ్ఛిష్టమున పేక్షించుకాముకునివలె నీపరిచారకకృత్యమునునీవేచేయవలయునని కామించితివికాఁబోలు. ఇచ్ఛామాత్రముచే ననంతాండములను సృజించునీవు స్మరించినమాత్రమున గంగసాన్నిధ్యముచేయదా. ఇందుకయికావడియొకటిమోసికొనిపోయి తీర్థమును తేవలయునా. అఖిలజగదుదయరక్షాప్రళయములు నీసంకల్పాధీనములయియుండ నేకనాథునియింటిపరిచారకకృత్యములను శరీరప్రయాసపడిచేయుటవింతయయియున్నది.

నిన్నాశ్రయించినపరమయోగులకు అనంతశరీరపరిగ్రహము లీలయయియుండ నీవేకనాథుని కైశ్రీరాధారుక్మిణులనెడవాసివచ్చితివి. అచటనుండినట్లుమఱియొకశరీరమునుబరిగ్రహించి యిచటవర్తించుటనీకసాధ్యమా? నీయాశ్రితవాత్సల్యము నిట్లంతయు ప్రకటనముచేయుచున్నాఁడవు. సద్యోజాతమగుదూడయందలిప్రేమాంధతచే పూర్వవత్సములను, తనకుగ్రాసమునిచ్చుపోషకులను, గొమ్ములతోఁజిమ్ము ధేనువువలె నవీనాశ్రితులయందలి వాత్సల్యాతిశయముచే నిత్యానపాయినియగుశ్రీమహాలక్ష్మినుపేక్షించునీకల్యాణగుణమును ఏకనాథుని వ్యాజముచే సువ్యక్తముచేసితివి. నీయనుమతిలేక రావణునిమీఁదికిలంఘించి వానినిపరిభవించివచ్చినసుగ్రీవమహారాజునుజూచి (త్వయికించిత్సమాపన్నే । కింకార్యంసీతయామయా) నీకుకొంతయాపదకలిగిన సీతతోనాకేమికార్యమనిచెప్పితివిగదా. ఆవాక్యమనుభవసిద్ధమగునట్లు నీయంతరంగభక్తుఁడగునేకనాథునివిషయమున శ్రీరాధారుక్మిణులనుపేక్షించి యిచటికివచ్చితివని బ్రాహ్మణుఁడువిన్నవించుటనువిని నిరుత్తరుఁడయి, స్మయమానముఖాంబుజుఁడయి, దయమానదృగంచలుఁడయి శిరఃకంపముచేయుచు శ్రీరుక్మిణీకాంతుఁడు తనభుజముననున్నతీర్థపుకావడినిక్రిందనునిచి దేవతాగృహమునఁబ్రవేశించి యదృశ్యుఁడయ్యెను. ఈబ్రాహ్మణుఁడతనివెంబడించి శ్రీకృష్ణపరమాత్మను దేవగృహమునఁగానక తలనుమోదుకొనుచు భూమిపైఁబడిపొరలుచు పెద్దస్వరముతో నేడ్చుచు రాధాపతే! నన్నుజూచినమాత్రమున నేలయదృశ్యుఁడవైతివి. నేనేమితప్పుచేసితిని. భగవద్విముఖుఁడనగునన్ను పెక్కుజన్మములయందు వెంబడించి నాయందొకింతయాభిముఖ్యమునుగానక వేసరితివి. ఇపుడు ఆకించిన్యా, నన్యగతిత్వములతోఁగూడి నిన్ను వెదకివచ్చిననన్ను పేక్షించి యదృశ్యుఁడవయితివి. ఏకనాథుఁడుమాత్రము నీకేమిలంచమిచ్చెను. పండ్రెండుసంవత్సరములుగ నతనియింటిపరిచారకుఁడవయియుండిననీవు ఒక్కముహూర్తమయిననునాకు సేవయొసఁగఁగూడదా! నీనీతిమిగులననీతియైయున్నదని ప్రలాపించుచుండఁగా ఏకనాథస్వామి యేమియుఁదోఁచక యిదియేమియాశ్చర్యము. ఓవిప్రోత్తమా? శోకమునువిడువుము. ఈజగదీశుఁడు పండ్రెండుసంవత్సరములుగ నాయింటవసించియు నేనితనినెఱుఁగకపోయితిని. తపోధనుఁడవగునీవు ఈలోకేశునెఱిఁగివచ్చి దర్శించి కృతార్థుఁడవయితివనిచెప్పి యతనికి దుఃఖోపశమనంబుచేసి యాబ్రాహ్మణునికి వందనంబాచరించి యోబ్రాహ్మణోత్తమా! నేనెఱుఁగక యీమాధవునిచే పనులుచేయించితిని. నాభాగ్యహీనతకేమనివగతును. అనిచెప్పుచునవశుఁడయిభూమిపయిఁబడి భక్తవత్సలా? లక్ష్మీకాంతుఁడవగునీవు నాయింటకింకరుఁడవయియుంటివి. నేనునిన్నెఱుఁగక మోసపోతినని యేడ్చుచుండ నేకనాథస్వామిభార్య యీవృత్తాంతమునువిని దుఃఖాక్రాంతయై ద్వారకాపతే! పెక్కుదినములుగ పరిచారకవేషమునుధరించి మాయింటిపనులనన్నింటిని జేయుచుంటివి. నీసౌకుమార్యమునెఱుఁగక నిన్నుకష్టకార్యములయందు నియోగించితిమి. లోకమాతయగుశ్రీమహాలక్ష్మిపరిచర్యకుసంతసించునీవు మాయింటికివచ్చునతిథులకు పరిచర్యచేసి మేము భుజించినపిదపనందఱిశేషమగునన్నమును నీకునీవే వడ్డించుకొని భుజించుచుంటివి. నానాథుఁడుకట్టివిడిచినవస్త్రములను మహాప్రసాదమనిధరించితివి. మద్భర్తయుచ్ఛిష్టమును పరమపావనమని భుజించితివి. నానాథునిపాదోదకమును మహాతీర్థమని స్వీకరించితివి. నీయాశ్రితవాత్సల్యమునునిట్లంతయుప్రకటించితివి. మేమునిన్నెట్లుమఱచితిమి.

కంటికిదృశ్యములగుసమస్తపదార్థములును నీరూపములుగఁజూచుచున్నాము. నీవుమాతప్పుల న్నియును క్షమించి మమ్ము రక్షింపుము. అనిశోకించుచుండు దంపతులను బ్రాహ్మణుఁడూరడించియేకనాథునిఁజూచినీభాగ్యము నేనేమనివర్ణింతును. బ్రహ్మాదులకగోచరుఁడగులక్ష్మీకాంతుఁడు నీకుదృగ్గోచరుఁడయినీకింకరుఁడయ్యెను. కాననీవఖిలలోకములందుమాననీయుఁడవైతివి. నీహృదయాలయవర్తియగుమాధవుఁడు నిన్నెట్లువిశ్లేషించును? నాయందనుగ్రహము చేయుము. నీవ్యాజముచే నేనవ్యక్తుఁడగుభగవంతునిని కన్నులారఁగంటిని. పోయివచ్చెదనని చెప్పియతనియనుమతినిఁజెంది ద్వారకకుపోయెను. భగవంతుఁడు తనయింటపరిచారకుఁడయి చేసినచేతలననవరతము స్మరించుచు ఏకనాథస్వామి నిరంతరభగవధ్యానపరుఁడయి యుండెను.

ఒకనాఁడు జ్ఞానదేవుఁడేకనాథస్వామిస్వప్నమున సాక్షాత్కరించి యోభాగవతాగ్రణీ! నీవుఅళకాపురికివచ్చి నాసమాధిని తెఱచి నన్నుదర్శింపుము. ఒకయశ్వత్థవృక్షము వేరునాసమాధికిసమీపముగా పెఱిగివచ్చుచున్నది. అందుచేనాకుబాధకలదు. నీవావృక్షమును సదుపాయముచేసమూలముగపెల్లగించి దూరముగప్రతిష్ఠింపుమనినియమించియంతర్ధానుఁడయ్యెను. ఏకనాథస్వామిమేల్కని సాక్షాద్భగవదవతారముగుజ్ఞానదేవుఁడు అపదార్థముగు నన్నొకపదార్థముగభావించి తనకైంకర్యమునకు నన్నునియమించెనుగానధన్యుఁడనయితినని సంతోషించుచునలకాపురికివచ్చి సిద్ధేశ్వరమూర్తిని దర్శించి జ్ఞానేశ్వరునిసమాధిచెంతకువచ్చి యాసమాధికిప్రదక్షిణనమస్కారములుచేసి శిల్పులనురప్పించి సమాధినిదెఱపించి యోగాసనాసీనుఁడయియుండు జ్ఞానదేవునిదర్శించి సాష్టాంగవందనముచేసి యానందభరితుఁడయి స్తుతించి సమాధికిబాధకరమయియుండునశ్వత్థమూలమునుజూచి యావృక్షమునుపక్వముగపెల్లగించి మఱియొకచోటస్థాపించి యెప్పటియట్లుసమాధినిఁగట్టుటకు కూలీలను న్నమురప్పించి పనికిప్రారంభింపఁగాపనివాండ్రకు కావలసిన భోజనపదార్థములాయలకాపురియందుదొరకకపోయెను. అపుడాశ్రితరక్షణదక్షుఁడగు శ్రీపండరినాథుఁడొకవర్తకుని వేషముధరించి బియ్యము, పప్పు, నెయ్యి, మొదలగుసమస్తపదార్థములనువిస్తారముగఁదెచ్చి సమాధిసమీపముననంగడియుంచుకొని సమాధికట్టుచుండుపనివాండ్రనుజూచి మీకువలసిన వస్తువులనుయథేష్టముగఁగొనిపొండు. సమాధిపనినెఱవేర్చి మీయూరికిపోవునపుడు నాకు పదార్థములమూల్యమునిప్పించవచ్చును. నేనును ఏకనాథస్వామితోడ యాత్రచేయుటకపేక్షించెదనని చెప్పి వారుకోరినవస్తువులను సమృద్ధిగనిచ్చుచుండెను. ఏకనాథస్వామి శ్రీపండరినాథుఁడీరూపమయివచ్చి మనలనురక్షించుచున్నాఁడనియానందించుచు సమాధికెదుటహరిభజనముచేయుచుండెను. సమాధిపనినెఱవేర్చియందఱును పైఠ్ణపురమునకుబయలుదేరునపుడుఈవర్తకుఁడు నేనును మిమ్ము వెంబడించివచ్చెదనని తనసరకులనెల్లనొకశకటముననుంచుకొనివీరలతోడవచ్చుచు మార్గమధ్యముననదృశ్యుఁడయ్యెను. ఈయాశ్చర్యమును ఏకనాథస్వామిమొదలగువారు చూచి భోజనపదార్థములు దుర్లభమగునలకాపురికివచ్చి యిన్నాళ్లు మనతోడవసించి మనకువలసినవస్తువులనవ్వారిగనిచ్చి మనచే పదార్థమూల్యమును జెందక యదృశ్యుఁడయినవాఁడు శ్రీమత్పండరినాథుఁడని నిశ్చయించి యానందనిర్భరులై

స్తుతించుచు పైఠణ్పురముచేరిరి. ఏకనాథస్వామియనవరతము తనకాచార్యుఁడగు జనార్దనపండితునిస్మరించుచు జగమంతయుశ్రీజనార్దనునిరూపముగభావించుచు శ్రీజనార్దనభక్తుల నారాధించుచు లోకులకెల్లశ్రీజనార్దనభక్తినిగలుగఁజేసిశ్రీజనార్దనసాయుజ్యమును బొందెను.

భక్తజనవిధేయాయనమః.

## నలువదియేడవయధ్యాయము.

సమర్థరామదాసుచరిత్రము.

గంగాతీరముననుండు జాంబూనగరమున శ్రీరామోపాసకుఁడగు నొకబ్రాహ్మణుఁడు పరమభాగవతుఁడయి, మహాచతురుఁడయి, సుజ్ఞానియైయుండెను. పరమపతివ్రతయగు నితనిభార్యనిజభర్తకు ననువ్రతయయియుండెను. ఈదంపతులహోరాత్రము శ్రీరామభజనముచేయుచు కాలముగడపుచుండిరి. వీరలుభూతదయపశ్చాత్తాపముతోఁగూడి (ఆత్మవత్సర్వభూతాని) అనురీతినిసర్వాత్మలను ఆత్మసదృశములుగభావించుచు, భక్తితోడనతిథుల నారాధించుచు, చైత్రశుద్ధనవమిమొదలుపండ్రెండు దినములదాఁక శ్రీరామోత్సవమునత్యంతవిభవముతోడజరపించుచు, ఆయుత్సవకాలమునందు దూరదేశవాసులగుపరమసాధువుల ననేకులనురప్పించి పూజించుచు, కాలమునుగడపుచుండనొకనాటిరాత్రి వీరలస్వప్నమునందు శ్రీరామచంద్రుఁడు సాక్షాత్కరించి నాకంతరంగభక్తుఁడగు నాంజనేయుఁడు మీకుపుత్రుఁడయియవతరించి మహాజ్ఞానవంతుఁడయి యనవరతము నాభజనయందే యాసక్తికలవాఁడయియుండునని యనుగ్రహించియంతర్ధానుఁడయ్యెను. తోడనేయాదంపతులు మేల్కని తమస్వప్నవృత్తాంతమును పరస్పరముచెప్పుకొని యానందించుచుండిరి. అదిమొదలాబ్రాహ్మణుని పత్నిగర్భముధరించి పదియవమాసమున శ్రీరామచంద్రకటాక్షాంకితుఁడై యాంజనేయాంశసహితుఁడగుసుపుత్రునిఁగనెను. శ్రీజానకీపతియనుగ్రహముచే నిట్లుగలిగిన శిశువునకుపండ్రెండవదినమున రామదాసుఁడని నామకరణముచేసిరి. పిదపయథాకాలమున నతనికి చౌలోపనయన వేదాధ్యయనంబులఁజేయించి తొమ్మిదవయేటవివాహము చేయనుద్యుక్తులై దేవాతిథిబ్రాహ్మణులను జక్కఁగాపూజించి వివాహమంటపమును శృంగారించి దంపతులనలంకరించి సుముహూర్తంబున పాణిగ్రహణమహోత్సవమునకుయత్నించిరి. ఈరామదాసుఁడు లోకచింతమాని సర్వప్రపంచమును శ్రీరామచంద్ర స్వరూపముగభావించుచు ననవరతము శ్రీరామధ్యానపరవశుఁడయియుండుటను బట్టివివాహవిషయముయిచేయఁబడుచుండు యత్నములెవ్వియుతానెఱుఁగక జడునిభంగియుండెను. తన్నలంకరించి వివాహమంటపమునకుఁ దోడ్కొనివచ్చి జననీజనకులు, బంధువులుమొదలగు వారందఱునుగూడి వివాహకృత్యములను జరపుచుండుటను ఇతఁడుకొంచెమైనను మనమున పాటింపక శ్రీరామచంద్రధ్యానపరుఁడయియుండెను. ఈనిష్ఠ, సౌవీరమహారాజుకాళికాదేవిని గూర్చిచిరకాలముతపముచేసి తనసంకల్పసిద్ధికై యాదేవికినరబలియీయఁగోరియుండులకై తనసేవకుని ప్రేరింప నతఁడంతటను వెదకిబలికిఁదగిననరునిఁగానక యరణ్యముఖమగుబ్రహ్మను

భవనిష్ఠుఁడయి యున్మత్తప్రాయుఁడై సంచరించుచుండిన జడభరతునిఁ బట్టుకొనిపోయి యలంకరించి కాళికాదేవి యగ్రభాగమున నిలిపిన పుడా జడభరతుఁడేమియు నెఱుఁగక పరబ్రహ్మధ్యాననిష్ఠుఁడయియుండిన నిష్ఠకు సదృశుఁడయియుండెను. వివాహమంటపమున యథాక్రమముగ జరపవలసిన కార్యముల నెల్లను జరపి మాంగల్యధారణ సమయమున సావధానమనిరి. అపుడు రామదాసుఁడిది యేమని యించుక చింతించియచటి వృత్తాంతము నెఱిఁగి తల్లిదండ్రులు మొదలగు బంధువులఁ జూచి యాహా యెంత విపరీతము చేసితిరి. సంసారసముద్రమును దాఁటుటకు నెవరికిని సాధ్యము కాదు. సముద్రమును చేతులతో నీఁదినను ఈఁదవచ్చును గాని మహాసముద్రమగు సంసారము నీఁదుట కెట్లు సాధ్యమగును. అది సముద్రము. ఇది మహాసముద్రము. ఆ సముద్రము అగాధమగు జలమును, గాలిచే నెగరఁగొట్టఁబడిన యలలును, సుళ్లను, మొసళ్లను గలిగి భయంకరమయి యుండును. ఈ సంసారమహాసముద్రము ఆశయను జలముతోడను, మన్మథుఁడను గాలిచే నెగరఁగొట్టఁబడిన మోహముల నెడియలల వరుసలతోడను, భార్యయను సుడితోడను, పుత్రసోదరుల నెడి మొసళ్లగుంపులతోడను గూడి మహాభయంకరమయి యుండును. ఆపదయందు రక్షించువారు గదా బంధువులగుదురు. శ్రీరామచంద్రధ్యానము చేయుచు బ్రహ్మానందసుఖము ననుభవించుచుండు నన్ను నిర్దయులై భీకరమగు సంసారసముద్రమునందుఁ ద్రోయ యత్నించితిరి. నిరపరాధినగు నాకు నిట్టి క్రూరదండనను జేయ నేల యుద్యుక్తులరయితిరి. మిమ్ము నాజ్ఞానరత్నము నపహరింపవచ్చిన పగటి ద్రిమ్మరులనుగా భావించెదను. మీ సహవాసమింతటితోఁ జాలును. నేను పోయివచ్చెదను. నా జీవితేశుఁడగు శ్రీరామభద్రుఁడు మీకు మేలు చేయుఁగాక యని చెప్పి రామబాణమువలె మహావేగముతోడ నడవికిఁ బరుగెత్తిపోయెను. తల్లిదండ్రులు వెంబడించి యెంతగా ప్రార్థించి పిలిచినను వారల ప్రార్థన కొడంబడక యథేచ్ఛగఁ బోయెను. ఇతని తల్లిదండ్రులు ఇతని పరుగువట్టుటకును, ఇతనికి సమాధానము చెప్పి యింటికిఁ దోడ్కొనివచ్చుటకును అశక్తులయి తమ స్వప్నంబున భగవంతుఁ డానతిచ్చిన దివ్యసూక్తిని స్మరించి మనమిఁకను ఈ బాలుని నిర్బంధించుట న్యాయము కాదు. ఆంజనేయుఁడు మనకు పుత్రుఁడగునని భగవంతుఁ డనుగ్రహించెను గదా. ఆ సత్యసంకల్పుమెట్లు తప్పును. సుగ్రీవాంగదనలనీలసుషేణజాంబవదాదులుండ వారలను విడిచి యంతఃపురకార్యమునకు విరక్తాగ్రేసరుఁడగు నంజనాపుత్రుఁడే తగినవాఁడనియు, నితరము నెఱుఁగక శ్రీరామధ్యానమునే ధారక, పోషక, భోగ్యములుగఁ గలిగియుండు వాయునందనుఁడొక్కఁడే శ్రీరామభక్తి సహాయుఁడయి, స్వామికార్యము నిర్వహింపఁగలవాఁడనియు, తనలో నిశ్చయించుటచేఁ గదా శ్రీరామభద్రుఁడు భద్రముద్రికనీ మారుతిచేతి కిచ్చిపంపెను. మఱియు నీ శ్రీరామదూత రావణాంతఃపురమున మదిరాపానపరవశలయి యొకరినొకరు కౌఁగిలించుకొని తమ తమ యుదరంబులు, తొడలు, నాభిమూలంబులు, కక్షమూలంబులు, స్తనంబులు బయల్పడ శరీరంబులు మఱచి నిద్రించుచుండు వనితాజనంబుల నవలోకించి పరదారమర్మనిరీక్షణ భయంబు సంగలఁగి యక్కటా బ్రహ్మచారినగు నేను అన్యపురంధ్రుల గాత్ర, మర్మంబులను జూచి ధర్మవిహీనుఁడనయితిని. అని దుఃఖించి సుదతిని సుదతులలోపల వెదకక మృగకులంబులోన వెదకుదురే. అట్లుగాన నేనిక్కాంతలను మదనవికృతమానసుఁడనయి చూచిన పాపుఁడను గాను. ఇంతియ కాదు. పుణ్యశ్లోకుండగు శ్రీరామచంద్రుని పంపున వచ్చిన నా [illegible]ఖం

జేయగుననితనలో నూరడిల్లె. అట్టిపుణ్యశ్లోకుఁడు శ్రీరామానుగ్రహముచేమనకు పుత్రుఁడయ్యెను. ఇట్టిపరమవిరక్తినిధిని మనము నిర్బంధించుట న్యాయముకాదనితమలోనిశ్చయించి స్వగృహముఁజేరి శ్రీరామచంద్రధ్యానముచేయుచు కాలముగడపుచుండిరి. రామదాసుఁడరణ్యమధ్యంబునఁగూర్చుండి తనలోనిట్లని చింతించెను. నేనిఁకను సంసారులవలను జిక్కకజాగరూకుఁడనయి, నిరంతరరామధ్యానపరుఁడనయి, కృతార్థుఁడనయ్యెదను. మిథిలానగరంబున వసించుచుండినపింగళయను గణికారత్నము ద్రవ్యమునందలికాంక్షచే తనభర్తనువిడిచి యధికముగధనమిచ్చు విటకానింజేకొని మందిరంబునకుంగొనిపోయి యారాత్రియంతయునిదురలేక నానావిధముల జారపురుషుని సంతోషింపించుచు వానివెంట తిరిగి తిరిగియలసి తుదకు ఆత్మకుసుఖముకలుగఁజేయువాఁడే భర్తయని నిశ్చయించి అక్కటాధనార్జనాపేక్షచేనేటిరాత్రియంతయు జారునిని నానావిధములనుపచరించుచు వెంటఁదిరుగుచుభావించుచుంటిని. ఇట్లుశ్రీమన్నారాయణునిఁ జింతించిన పరమపదంబుఁజేరవచ్చునని విచారించి నిజశయనాది భోగ్యపదార్థంబులను వర్జించి వడిగవాసుదేవచరణారవిందవందనాభిలాషియయి దేహము మెఱుపువలె నస్థిరమని చింతించి పరమతత్వంబునందు చిత్తంబు నిలిపి ముక్తురాలయ్యెనని శ్రీకృష్ణుఁడుద్ధవుని కుపదేశించెనుగదా? కాననేనుసంగరహితుఁడనయితైలధారవలె నవిచ్ఛిన్నముగు రామభక్తితోఁగూడి కృతార్థుఁడనయ్యెదనని చింతించి పరమవైరాగ్యశీలుఁడయి యాహారాదులను వర్జించి పద్మాసనాసీనుఁడయి శ్రీరామచంద్రధ్యానముచేయుచుశ్రీరామచంద్రా! కోసలేంద్రా! కరుణాసాగరా! రాక్షసభీకరా! కంజనేత్రా! కమనీయగాత్రా! నేను ఈయరణ్యమధ్యమునందేకాకినయి నీదర్శనము నపేక్షించుచున్నాఁడను. శృంగిబేరపురమున గుహునికి సేవయొసంగి యనుగ్రహించినట్లునాకు ప్రత్యక్షమయి నన్ను రక్షింపుమని ప్రార్థించుచుండ రాక్షసాంతకుఁడగునంజనానందనుఁడు ఘోరరూపముతోడ తనకభిముఖుఁడయివచ్చుటనుజూచి రామదాసుఁడు లేచి వందనముచేసి శ్రీరామభక్తాగ్రేసరా నీఘోరరూపమునుజూచి నేను వెఱవను. కామక్రోధాద్యరిషడ్వర్గమునకు వెఱచునన్ను కృపాదృష్టింజూడుము. నాబంధువులందఱు నన్నుసంసారసముద్రమునఁ ద్రోయయత్నించుచుండ నేనాదొంగలచేతికి తప్పి యీవిజనస్థలంబునకు వచ్చితిని. శరీరస్థులగు కామాదిభీకరశత్రువులునాజ్ఞానరత్నమునపహరించుటకయి పొంచిపొంచి మంచిసమయమును వేచియున్నారు. పూర్వము రావణ, కుంభకర్ణ, విభీషణులతోఁగూడి జలధిపరివేష్టితమైనలంకయందుండిన సీతమ్మవలెనేనును ఇపుడురాజస, తామస, సాత్విక గుణములతోఁగూడి యహంకార మమకారరూపముగు ఘోరసముద్రముచే పరివేష్టింపఁబడియుండుశరీరనగరంబునందువసించుచున్నాను. సీతకుభద్రముద్రికనొసఁగినట్లునాకుశ్రీతారకమంత్రము నొసఁగుము. లంకయందలి యశోకవనమును నిర్మూలముచేసినట్లు నాయవిద్యావనమునిర్మూలనముచేయుము. అచటలంకనుదహించినట్లు ఇచట అన్యశేషత్వమును దహింపుము. జానకిశోకమును రామునకెఱిఁగించినట్లు నాశోకమును శ్రీరామచంద్రునకెఱిఁగింపుము. లంకకుశ్రీరాముని నీతోడితెచ్చినట్లు శ్రీరామభద్రునినిచటికిఁదోడితెమ్ము. కుంభకర్ణరావణులను [illegible]చే నిగ్రహింపించినట్లు నాయందలిరాజసతామస గుణంబులనాథ[illegible]చే నిగ్ర[illegible]. దాశరథిచేవిభీషణునిలంకయందు సుస్థిరునిఁజేయించినట్లుఆదేవుని[illegible]ను

గ్రహముచే నాయందు సాత్త్వికమును స్థిరపఱుపవలయును.. రావణవధానంతరము సీత నాందోళికయందుంచి తెచ్చినట్లు ఈ ప్రాకృతశరీరవియోగానంతరము నన్ను ప్రణవరథారూఢునిం జేసికొనిపోవలయు. మైథిలి యగ్నిప్రవేశముచే లోకనిందను బాపుకొన్నట్లు నేను విరజాస్నానముచే సూక్ష్మశరీరవాసనారేణువులం బాపుకొనవలయు. అగ్ని తన చేతులచే సీతను శ్రీరాము సన్నిధిని విడిచినట్లు నేను అమానవకరస్పర్శముచే పంచోపనిషన్మయ దివ్యశరీరపరిగ్రహము చేసి శ్రీవైకుంఠమును జెందవలయు. శ్రీజానకి రామునితోడ పుష్పకారోహణము చేసినట్లు నేను భగవంతునితోడ శేషపర్యంకము నారోహింపవలయు. పెక్కుమాటలేల. ఓమారుతీ నీకటాక్షముచేతనే నాకిన్నియు లభింపవలయునని మనోరథించెదను. భక్తక్రీతుండగు శ్రీరామచంద్రుండు నీకు పరమాంతరంగుండు. కాన నా మనోరథమును పూర్తిచేయుట నీకు సుకరమై యుండునని ప్రార్థించిన శ్రీరామభక్తనిక్షేపముగు నాంజనేయుండు మందస్మితము చేసి రామదాసునిం జూచి నీవు శోకింపకుము. నావలె నీవును రామదాసుండవైతివి. భగవంతుండంతశ్శుద్ధిలేని వేషధారులకు దూరస్థుండై యుండునే గాని నీయట్టి వైరాగ్యశీలునకు సమీపస్థుండై యుండును. నాయందా జానకీపతి చేసిన యనుగ్రహమును నీయందును జేయును. నీవు కోరినట్లా సీతామనోహరుండు నేవయొసంగును. అని చెప్పి యదృశ్యుండయ్యెను.

రామదాసుండాయరణ్యమధ్యమున శ్రీరామభజనసేయుచు నిర్భయుండయి వసించి పగటిపూట సమీపగ్రామములకు పోయి భిక్షాన్నమును దెచ్చుకొని భుజించుచు (మన ఏవ మనుష్యాణాం । కారణం బంధమోక్షయోః । బంధాయ విషయాసంగీ । ముక్తినిర్విషయం మనః) మనుష్యులకు మనస్సే బంధమోక్షములకు కారణమైయుండును. మనస్సు విషయములతోం గూడిన బంధహేతువగును. ఆమనస్సు నిర్విషయమైన ముక్తిహేతువగును. అని నిశ్చయించి మనస్సు విషయముగ నిన్నూఱుశ్లోకములు రచించెను. ఆశ్లోకములయర్థము నెఱింగి మననము చేయువారు వైరాగ్యశీలులగుదురు. రామదాసుండడవియందలి మృగములతోడ వర్తించుచు (అశ్వత్థమేనం సువిరూఢమూలమసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా) అనురీతి నిదృఢమగు వేళ్లతోం గూడిన సంసారవృక్షమును విరక్తియను నాయుధముచే తెగంగొట్టి శ్రీరామనామామృతపానము చేయుచు పరమానందభరితుండయియుండెను.

ఇట్లుండ రామదాసుని చెంతకాంజనేయుండు వచ్చి యో రామదాసా? శ్రీమత్పండరిపురమునం దాషాఢశుద్ధైకాదశి మహోత్సవము సమీపించుచున్నది. నీవచటికి పోయితివేని శ్రీరామచంద్రుని దర్శనమగునని చెప్పి పండరిమార్గమును జూపి యదృశ్యుండయ్యెను. రామదాసుండు పండరిపురము చేరి సాధుజనులు చేయు భగవన్నామసంకీర్తనకోలాహలమునకానందించుచు, చంద్రభాగయందు స్నానముచేసి మహాద్వారమున వందనముచేసి యాంజనేయునికి నమస్కరించి లోపల ప్రవేశించి పుండరీకవరదుని సేవింపంగా నతండు కటిహస్తుండై, సమచరణుండయి, యిటికఱాతిపయి నిలుచుండెను. అప్పుడు రామదాసుండు అసంతుష్టుండయి భగవంతునిం జూచి యోస్వామీ? ఏల ధనుర్బాణములను విడిచిపెట్టితివి. హస్తములనేల నడుమున నుంచుకొనియున్నాండవు. సరయూనది యిచట లేదు. వానరవీరులెచటికి పోయిరి. ఆంజనేయుండు మాత్రమే మహాద్వారము చెంతనున్నాండు. ఏకపత్నీవ్రతుండవగు

నీవు సీతనువిడిచిబహుపత్నులనేలయుపేక్షించితివి. నీవిశ్లేషమునుసహింపక యడవికినిన్ను వెంబడించివచ్చినలక్ష్మణుఁడిపుడు నిన్నెట్లువిశ్లేషించెను. రావణాపహృతయయిలంకయం దేకాక్షిమొదలగురాక్షసస్త్రీల కావలియందుండినకాలమున (మాసాదూర్ధ్వం నజీవిష్యే) అనురీతిని ఒకమాసమునకులోపలనాజీవితేశునిఁజూడనేని నేనుజీవించియుండనని యాంజనేయునితోఁజెప్పిపంపిన సీతాదేవి విరోధులులేనియీకాలమున నిన్నువిడిచి యెచటికిపోయెను. నీవేల యీరూపమునుబరిగ్రహించితివి. మందభాగ్యుఁడనగునాకు సేవయొసంగనిష్టములేకయీవికృతరూపమును ధరించితివికాఁబోలు. కోదండదీక్షాగురూ? అఖిలజగద్గురూ! మద్గురూ? నీవింతయుపేక్షించిననేనెందుఁజొత్తును. నామొఱయెవరాలింతురు. శ్రీరామరూపములోనుండినయెడల శరణాగతుఁడనగునారక్షణభారము నీకుదుస్త్యజమయియుండునని జారచోరశిఖామణియగు శ్రీకృష్ణునిరూపమును బరిగ్రహించితివికాఁబోలు. ఆంజనేయునిచే నీచటసాన్నిధ్యముచేసియున్నావని విని వేగముగవచ్చితిని. ఇంతలో నేయేభక్తుఁడు నిన్నీరూపముగధ్యానించి నీరూపమును మార్చెను. నాకట్టిదృఢభక్తికలిగియుండిన నాప్రార్థనకయినీ కృష్ణరూపము తనంతటశ్రీరామరూపమగును. అట్టిపరమభక్తినిష్ఠ నాయందులేకపోయినను నీ గుణపూర్తినిస్మరించి నన్ననుగ్రహింపుము. బిడ్డకాఁకలిమందమయి నంతట ఆబిడ్డనిగన్నతల్లి పాలిండ్లప్పుడప్పుడుచేఁపుచుండక రిక్తములగునా నాభక్తిమందమైనను నీవాత్సల్యమేల శుష్కించెను. భక్తవత్సలా? కరుణింపుము. నన్నుగనిపెంచిన జననీజనకులను, బంధువర్గమునువిడిచి (త్వమేవమాతాచపితాత్వమేవ। త్వమేవబంధుశ్చగురుస్త్వమేవ। త్వమేవవిద్యాద్రవిణంత్వమేవ। త్వమేవసర్వంమమదేవదేవ) అని నిన్నే సర్వముగనమ్మివచ్చితిని. నమ్మినవానినిన ట్టేటఁద్రోయుటనీతికాదు. వసిష్ఠశిష్యుఁడవగునీకు ఈగుణముతగదు. ఇక్ష్వాకువంశమునఁబుట్టినవారు సర్వమునుపేక్షించి తమసుగుణములను రక్షింపఁజూతురు. నీతండ్రియగు దశరథుఁడు అసత్యమునకోర్వకకదానిన్నడవికిఁబనిచి నీవిశ్లేషదుఃఖముచేమృతుఁడయ్యెను. అట్టివానికిఁబుట్టిమహాయశస్సునుచేఁబట్టియిపుడేలనిందకొడిగట్టెదవు. విభీషణునికిలంకాధిపత్యమునిచ్చినకాలమున నీయాప్తసచివులు నిన్నుఁజూచిరావణుఁడుజీవించియుండవిభీషణుని లంకాధిపునిఁగఁజేయుటన్యాయముకాదు. ఇప్పుడు రావణుఁడు శరణాగతుఁడయిన నేమిచేయుదువనివిన్నవింపఁగా అంతమంచికాలమువచ్చిరావణుఁడుశరణాగతుఁడయ్యేనేని అతనికినాయయోధ్యనిచ్చెదనని చెప్పితివికదా? అట్టినీవుశరణాగతుఁడనగు నన్నుపేక్షించుటన్యాయమా? ఇపుడిచటవసిష్ఠుఁడుండిననీకీయధర్మముతగదనిచెప్పి నిన్నుశిక్షింపింతును. అయోధ్యయందుండిన నిట్టినిర్బంధములు కలుగుననుభయముచే పండరిపురమునకువచ్చితివనితలఁచెదను. అట్లుకాకుండిన నన్నేల యయోధ్యకురప్పింపక యిచటికిరప్పించితివి. నేనెంతబతిమాలినను నీమనస్సుకరఁగలేదు. మానంసర్వార్థసాధకమనియున్నాఁడవు. నేనెందునుసంచరించినీయనీతిని ప్రకటనముచేయుదునుసుమీ. అనివిన్నవించిన భగవంతునికి సంతోషమున్మస్తకమయి కిరీటకుండలాదిదివ్యాభరణభూషితుఁడయి, ధనుష్పాణియై, తూణీరయుగధరుఁడయి శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతుఁడయి, సుగ్రీవాదివానరవీరపరివేష్టితుఁడయి, సేవయొసంగెను. అపుడు రామదాసుఁడు ఆనందపరవశుఁడయి (ఆపదామపహర్తారం। దాతారంసర్వసంపదాం। లోకాభిరామంశ్రీరామం। భూయోభూ

యోనమామ్యహం ॥ రామాయ రామభద్రాయ । రామచంద్రాయ వేధసే । రఘునాథాయనాథాయ । సీతాయాఃపతయేనమః॥నమఃకోదండహస్తాయ। సంధీకృతశరాయచ । దండితాఖిలదైత్యాయ । రామాయాపన్నివారిణే ॥ ఆర్తానామార్తిహంతారం ! భీతానాంభీతినాశనం । ద్విషతాంకాలదండంశ్రీ । రామచంద్రంనమామ్యహం॥) అనిస్తుతించియనంతవందనములుచేసి మన్నాథాయిన్నిదినములుగ నీరూపమునుగానక యుపవసించిన నానేత్రములకు పూర్ణాహారమునను గ్రహించితివనినభగవంతుఁడుమందహాసముచేసీరామదాసా? నేనునాథురూపరహితుఁడను. నానిజస్వరూపమును సాక్షాత్కరింపలేక దేవతలు మొదలగువారునన్ను దివ్యరూపవిశిష్టునిఁగధ్యానించుచున్నారు. నీవిపుడుదర్శించినరీతినినన్నీ రామరూపముతోడ ననవరతముధ్యానింపుము. సమస్తచేతనాచేతనములను నారూపముగభావింపుము. నీయుపదేశముచే లోకులకునాయందుభక్తినిఁగలుగఁజేయుము. అనిచెప్పియతనిశిరంబును తనకరంబుచే కరంబలంకరించి మునుపటియట్లు శ్రీపాండురంగరూపమునుబరిగ్రహించెను. రామదాసుఁడుపాండురంగనిని పెక్కువిధంబులస్తుతించి యానందభరితుఁడయి నృత్యకీర్తనంబులఁజేసి యుత్సవాంతమున భగవన్నియమనముఁజెంది స్వస్థానమునకుమఱలెను.

రామదాసుఁడుపండరిపురమువిడిచి బయలుదేరినిజాశ్రమమునకువచ్చుచుండు నపుడుమార్గమధ్యమున నుండెడి జేసూరియనుపట్టణమునకువచ్చెను. ఆనగరమునసన్నిధిచేసియుండుపార్వతీరమణుఁడు రామదాసునిసాంగత్యమునపేక్షించి యీరామదాసుఁడు శ్రీరామరూపముతప్ప తక్కినరూపముల నాదరింపఁడు. శ్రీపాండురంగమూర్తి యితనికై శ్రీరామరూపధరుఁడయి సేవయొసంగెను. ఇట్టివాఁడునానిలయంబున కెట్లువచ్చును. (సుదూరమపిగంతవ్యం।యత్రభాగవతాస్థితాః) అనుప్రమాణమును గౌరవించి నేనేయీభాగవతుని యొద్దకుఁబోయెదననినిశ్చయించి యాదేశమునేలుశివాజిరాజువేషమునుధరించి యశ్వారూఢుఁడయివచ్చి రామదాసునిఁజూచినంతట గుఱ్ఱమునువిడిచినడచివచ్చి రామదాసునికి వందనముచేసి యో భాగవతాగ్రణీ? నేఁడుసుదినము. నీదర్శనమాకస్మికముగ లభించెను. అనిచెప్పియతనినాలింగనముచేసికొని యోమహాత్మా యిఁకమీఁదనీవుపండరిపురమునకుపోవునపుడును, మరలవచ్చునపుడును నాకిచట సేవయొసంగవలయునని ప్రార్థించెదను. శ్రీరామభక్తినిష్ఠులు నాకుప్రాణసహాయులై యుందురు. నన్నుమఱువకుము. నేనుపోయివచ్చెదనని చెప్పి యదృశ్యుఁడయ్యెను. రామదాసుఁడాశ్చర్యపడి యిపుడువచ్చినవాఁడుతారకమంత్రోపాసకుఁడగు శంకరమూర్తియనినిశ్చయించి సంతోషించి యచటనుండుకొండపై నాన్నిధ్యముచేసియుండుగంగాధరునినిదర్శించి ముఖమంటపముననిలుచుండిశ్రీరామచంద్రుని భజించి చంద్రశేఖరునియనుమతిపడసికొండదిగిపోవుచుండఁగా శివాజిరాజీవృత్తాంతమును వినివేగముగవచ్చి రామదాసునిశరణుఁజెంది యతనికృపకుపాత్రుఁడయి యతనిచే శ్రీతారకమంత్రోపదేశమును జెంది ధన్యుఁడయ్యెను. రామదాసుఁడు ఈరీతినసేకాత్ములననుగ్రహించినిజాశ్రమమునవసించి యీశ్వరవిభూతియగు చేతనాచేతనములయందు సమభావము చేసియానందించుచు సుబోధమనుగ్రంథమునురచించెను. ఆగ్రంథమును శ్రద్ధతోఁజదువువారలకు జ్ఞానవైరాగ్యములభివృద్ధియయి భేదజ్ఞానతిమిరమునశించును. మఱియునాగ్రంథ

మును బఠించువారు జీవన్ముక్తులగుదురు. రామదాసుఁడు బ్రహ్మాద్యైశ్వర్యములను తృణీకరించి సర్వమును భగవత్స్వరూపముగఁ జూచుచు బ్రహ్మానందము ననుభవించుచు ననవరతము రామస్మరణ చేయుచు ప్రతిసంవత్సరము ఆషాఢశుద్ధైకాదశి నాఁడు శ్రీపాండురంగని దర్శించుచు తనయుపదేశానుష్ఠానములచే పెక్కండ్రఁ దనవలెఁ జేయుచు ఆయుశ్శేషమును గడపి దేహావసానకాలమున శ్రీరామచంద్రసాయుజ్యమును జెందెను.

ఆంజనేయవరదాయ నమః.

## నలువదియొనిమిదవ యధ్యాయము.

### తుకారాంస్వామిచరిత్రము.

అలకాపురికి పశ్చిమమున నుండు దేవనగరమున తుకారాంస్వామి వర్తకము చేసి జీవించుచుండెను. ఇతనికిద్దఱు భార్యలు కలరు. పెద్దభార్యయందిద్దఱు పుత్రులు కలిగిరి. తుకారాంస్వామి వర్తకము చేయుచుండియు తులాధారునివలె నిర్మలచిత్తుఁడయి జలగవలె సంసారమునఁ అంటక యనవరతము శ్రీపాండురంగధ్యానము చేయుచుండెను. ఇతఁడాయూరిలో సన్నిధి చేసియుండు శ్రీపాండురంగనాథునిని భక్తితోడ నారాధించుచుండెను. ఇట్లుండ మహాక్షామము సంభవించినందున నాహారము దొరకుట దుర్లభమై జనులు శాకములను భక్షించుచు కాలముగడపుచుండిరి. ఇట్టి సమయమున నితని జ్యేష్ఠభార్య శరీరవియోగమును జెందెను. ఆమె పుత్రులిరువురును తండ్రిని దూషించుచు నిల్లువిడిచి స్వేచ్ఛగ పోయిరి. తుకారాంస్వామి యెందుకును చలింపక భగవద్ధ్యానము చేయుచు భగవత్సన్నిధిని నృత్యకీర్తనంబులను చేయుచు నానందభరితుఁడయియుండెను. (గిరయో వర్షధారాభి । ర్హన్యమానా న విష్యథుః। అభిభూయమానా వ్యసనై । ర్యథాధోక్షజచేతసః) అనఁగా నధోక్షజునియందు లయించిన మనస్సుగలవారు వ్యసనపరంపరలచే నెట్లు చలింపకుందురో యట్లు పర్వతములు వర్షపరంపరలచే చలింపకయున్నవి అనునర్థము తుకారాంస్వామి విషయమున ప్రత్యక్షసిద్ధమయ్యెను.

పూర్వము నామదేవుఁడు పండరినాథుని సేవించి యానందభరితుఁడై యో దేవాధిదేవా? నీయనంతకల్యాణగుణముల నెన్ని విధముల వర్ణించినను నాకు తృప్తికలుగకయున్నది. నీగుణానుభవము చేయను జేయను అభినవమయి తోఁచుచున్నది. సత్యలోకమున నుండు శ్రీరామాయణప్రక్రియఁగా శతకోటివృత్తములచే నిన్ను స్తుతింపవలయునని మనోరథించెదను. ఈమనోరథమును నీవు పూర్తిచేయవలయునని పలుమాఱు ప్రార్థింపఁగా శ్రీపాండురంగమూర్తి మందహాసముతోడ నతనిఁ జూచి యో నామదేవా? మనుష్యశరీరము మిగుల నస్థిరమైనదని నీవెఱుఁగుదువుగదా? అట్లుండ శతకోటివృత్తములచే నన్ను స్తుతింపవలయునని నీకుఁ గలిగిన మనోరథమెట్లు సాధ్యమగును. పురుషునికి నూఱువత్సరములు పరమాయువై యున్నది. అందు సగము నిద్రచే వ్యర్థమగుచున్నది. పెఱసగమునందు క్రీడలచేతను, విషయానుభవము చేతను, రోగపీడచేతను కొంత కాలము వ్యర్థమగుచున్నది. మిగిలిన కాలమును నిజమనినమ్ముట

కష్టమయియున్నది. బాల్యమందో, మంచిప్రాయమందో, లేక ముదిమియందో, యూరనో, యడవినో, యుదకమధ్యముననో మరణముసిద్ధించును. ఇట్టిశరీరమునునమ్మి నూఱుకోట్ల వృత్తములనుబాడెదనని యెట్లుసంకల్పముచేయఁగలవు. 'అని రుక్మిణీకాంతుఁడడిగిన నామదేవుఁడు భగవంతునికివందనముచేసి నాదేహమును, నాశక్తినినమ్మి నేనిట్టిసంకల్పమును జేసినవాఁడనుగాను. ఆశ్రితులసంకల్పమును నెఱవేర్చుట నీకుబిరుదయియున్నదిగదా. మహాభారతయుద్ధమునందొకప్పుడు నేనాయుధమును తాకనని ప్రతిజ్ఞచేసి పరమభాగవతుఁడగు శ్రీభీష్ముని ప్రతిజ్ఞను నెఱవేర్చుటకయి నీప్రతిజ్ఞను పేక్షించి యాయుధమునుతాకినది యెల్లరునెఱిఁగినవిషయమేగదా. మరియు నేనునాభక్తులహృత్పద్మమునవసించివారివారిమనోరథములనెల్ల నెఱవేర్చెదననుబిరుదువహించియుండువాఁడవగుటచే నీభక్తుఁడనగు నేను నీబలమును నమ్మి నేనిట్టిమనోరథముగలవాఁడనయితిని. నీవుసర్వశక్తుఁడవయియుండ నీకుపరతంత్రుఁడనైననాకుమనోరథంబేలకొనసాగదు. అనివిన్నవింపఁగా శ్రీపాండురంగఁడుసంతోషించినామదేవా? నీమనోరథమును నెఱవేర్చెదనని చెప్పి సరస్వతీదేవినిస్మరించెను. ఆదేవి భగవంతునితలంపునెఱిఁగివచ్చి పుండరీకవరదునికి వందనముచేసి దేవాధిదేవా? నన్నుస్మరించిన కారణమేమనియడిగెను. రుక్మిణీకాంతుఁడు సరస్వతినిఁజూచి నీవునామదేవునివాక్కునందుండియతఁడుమనోరథించినట్లుశతకోటివృత్తములనతనిచేఁజెప్పింపుమనినియమించిన శారదాదేవిస్వామీ? దేవరవారివైభవమునుస్తుతించుటకు విధి, శివ, సనకాదులకలవిగాకయున్నది. వేదపురుషుఁడు నీయానందమును నిశ్చయింపఁబూని మనుష్యానందమునునిశ్చయించి బ్రహ్మానందపర్యంతము చెప్పుచుపోయి పరబ్రహ్మానందమునామునన్నునకప్రాప్యమయియున్నదని చెప్పితిరిగెను. అట్టినీప్రభావమును గీర్తించుటకు నాకెట్లుసాధ్యమగును. అయినను దేవరవారియాజ్ఞను శిరసావహించి నామదేవునివాక్కునందుండి శతకోటివృత్తములను జెప్పి దేవరవారినినుతించెదను. అట్లుచెప్పఁబడువృత్తములనుపడివడిగవ్రాయుటకుఁదగినలేఖినీవైఖరిగలలేఖరియొకఁడునాకుకావలయుననివిన్నవింపఁగానపుడు దేవాధిదేవుఁడగు పండరినాథుఁడు పత్రములనులేఖినినిజేతనెత్తుకొని తానేయాపనికిఁదగినవాఁడనితలఁచివ్రాయఁబూనుకొనెను. ఇట్లువ్రాయుచుండ నామదేవుఁడు తొంబదినాలుగుకోట్ల నలువదిలక్షలవృత్తములనుచెప్పెను. ఇంతలో నామదేవునికిపాంచభౌతికశరీరసంబధముసహ్యమయితోఁచి నిత్యవిభూతినిఁజెందవలయునని త్వరకలిగినందున భగవంతుఁడు నామదేవునాలింగనముచేసికొని యోవత్సా శోకింపకుము. నీకుఈవిభూతియందలివాసముసహ్యమై తోఁచినందున నీవుకోరినట్లు నిత్యవిభూతికిఁబొమ్ము. కొంతకాలమునకుపిదప నీవుమఱల మనుష్యలోకమునకువచ్చి తుకారాంఅనునామమునువహించి నాయందతిశయించిన భక్తితోఁగూడి యిపుడుకొఱఁతపడిన యయిదుకోట్లయఱువదిలక్షలవృత్తములనుబాడి నీసంకల్పమును నెఱవేర్చి నాకానందమునుగలుగఁజేయుము. అనినియమింపఁగా నామదేవుఁడుసంతసించి నిత్యవిభూతికిపోయెను. ఇపుడునామదేవునిసంకల్పమున కొఱఁతవడినవృత్తములను పూర్తిచేయఁదలఁచి శ్రీపాండురంగఁడునామదేవునితోడ తుకారాంస్వామిస్వప్నమున సాక్షాత్కరించి మునుపటివృత్తాంతము నతనికెఱుకచేసి యోయీతుకారాం! నీవితరవ్యాపారములనువిడిచి నాయాజ్ఞనుశిరసావహించి నామదేవునిసంకల్పమునుపూర్తిచేయుము. నేనునీకుసహా

యుండనయి యుండెదను. అనినియమించి యదృశ్యుఁడయ్యెను. తుకారాంస్వామి మేల్కని స్వప్నవృత్తాంతమును మననముచేసి యానందభరితుఁడయి యితరవ్యాపారముల నెల్ల వర్జించి యనవరతము శ్రీపాండురంగనిని లోకోత్తరములగు వృత్తములచేఁ బాడుచుండెను. ఈవృత్తములనువిని సాధుజనులు పరమానందమును జెందిరి. అసూయాగ్రస్తులగు కొందఱు దుష్టచిత్తులు తుకారాంస్వామిని పరిహాసము చేయుచుండిరి. మహానుభావుఁడగు తుకారాంస్వామి తనవిషయమయి సాధుజనులు చేయు స్తుతినివిని వీరేలభగవంతుని స్తుతింపవలసిన నోటితో అపదార్థమగు నన్ను స్తుతించెదరని యసహ్యపడుచు దుష్టులు తనవిషయమయి చేయు నిందనువిని వారలనుజూచి యోభాగ్యవంతులారా! సముద్రమును చేతితో నీఁదఁబూనుకొనునట్లు నాదోషరాశిని వర్ణింపఁబూనుకొంటిరి. సర్వజ్ఞుఁడయి, సర్వశక్తుఁడగు సర్వేశ్వరునికి లెక్కింపశక్యముకాని నాదోషరాశి మీకెట్లు లెక్కింపసాధ్యమగును. అయిననునన్ను పరిశుద్ధునిఁ జేయవలయుననువాత్సల్యముచే మీరిట్టియఘటితకృత్యమునకుఁ బూనుకొన్నందులకై కృతజ్ఞుఁడనయి మీకువందనం బాచరించెదనని చెప్పుచుండెను.

ఆషాఢమాసమున పండరిపురమునకుఁ బోయి శ్రీపాండురంగని యుత్సవమును సేవించుచు నిరపేక్షుఁడయి, మునియై, శాంతుఁడయి, నిర్వైరియయి, సమదర్శియయి, మితాహారనిద్రలతోఁగూడి యనవరతము శ్రీపాండురంగని కల్యాణగుణములను దివ్యవృత్తములచే పాడుచుండును. వికసించిన పుష్పములయందలి సౌరభము వాయువశమున లోకమునందు వ్యాపించునట్లు పరమభాగవతుల ప్రసంగవశమున తుకారాంస్వామి కల్యాణగుణములు జగమంతయు వ్యాపించెను. ఆదేశము నేలు శివాజిమహారాజు తుకారాంస్వామి వైభవమును విని యామహాత్మునిని దర్శించి పోవలయునని యపేక్షించి తాను రాజధానిని విడచివచ్చుట తనశత్రువులెఱుఁగకుండునట్లు ప్రచ్ఛన్నవేషధారియయి, యేకాకియయి బయలుదేరి యొకతట్టయందు వరాలను బోసి తీసికొనివచ్చి తుకారాంస్వామి మందిరమునందు ప్రవేశించి వారికెదుర వరాలచే నిండింపఁబడిన తట్టనునిచి సాష్టాంగముగ వందనంబు చేసెను. ఆస్వర్ణరాశిని జూచినంతట తుకారాంస్వామికి శరీరమునందు కంపము కలిగి రాజునుజూచి దీనినేల యిచ్చుటకి కొనివచ్చితివి. నిరపేక్షుఁడనగు నాకు శ్రీమత్పండరినాథుని చరణారవిందయుగళముతప్ప మఱియొక పదార్థమునపేక్ష లేదు. పురుషుని దేహయాత్ర కర్మాధీనమైయున్నది. కర్మసాక్షియగు భగవంతుఁడు హృత్పుండరీకమునవసించి చేతనులకు కర్మానుగుణముగ ఫలప్రదానము చేయుచున్నాఁడు. ఆభగవంతునికి పుడేమికొఱఁతకలిగెనని తలఁచి నాకీద్రవ్యమొసంగవచ్చితివి. మహారణ్యమధ్యమునందీఁగలు గూర్చిన తేనె నానామానవుల పాలగునట్లు లోభరతులు పరులకిడక తామనుభవింపక లోకులకన్నుమూసి చేర్చిన ద్రవ్యము తుట్టతుదకు తనకుగాక తనవారికిగాక పరులపాలగుచున్నది. దీర్ఘాంగముతోఁగూడి సంచరింపశక్తిలేని గొప్పకొండచిలువ తానుండినచోట అశనమును జెంది బ్రతుకుచున్నది. ఇట్లుండ నీవిచ్చుధనమునకయి నాకర్మము మాఱునని తలఁచితివా? ధనవంతులు రోగపీడితులయి యాహారము సహింపకుండుటయు, నిరుపేదలు పరులయభిమానముచే పరమాన్నంబుఁ గుడుచుటయు, మనము కనియుండుఁగదా. నాకురక్షకుఁడగు శ్రీవాసుదేవునికి దారిద్ర్యము కలిగినప్పుడు నేను నీద్రవ్య

ముపరిగ్రహించెదను. ఆదేవుఁడశక్తుఁడగునపుడు నేను నీరక్షణమునకులోఁబడియెదను. మఱి యొకవిశేషముచెప్పెదనువినుము. ఒకతపస్వివరమసాధువయి తపస్సుచేయుచుండఁగా నతనితపంబునకు విఘ్నంబాచరింప యత్నించి యింద్రుఁడొకపాంథుని వేషంబుధరించియా తపోధనునిఁజూచి యోతపోనిధీ! నేనొకకార్యమునకయి యొకచోటికిఁబోయివచ్చెదను. నాఖడ్గమునునీసన్నిధినునిచిపోయెదను. మఱలవచ్చి నాయాయుధమును దీసికొనిపోయెద నని చెప్పి యతనియనుమతిని జెంది తనఖడ్గమునచటనునిచిపోయెను. ఆతపస్వి ఆయాయు ధమునెచటనైననునిచిన దానికేమి యవద్యముకలుగునోయని శంకించియనవరతము ఆ ఖడ్గమును తనచేతధరించి తిరుగుచుండెను. ఇట్లుండతపమునందలిచింతవిడిచి యాయుధ సహవాసముచేక్రూరస్వభావుఁడయి జీవహింసచేయుచు కాలముగడపి యాతపస్వినరక ముఁ జెందెనని సీతరామునికిచెప్పినట్లు శ్రీరామాయణంబునఁ జెప్పఁబడియున్నది. ఈద్రవ్య మునేనంగీకరించితినేని మొదటనాదియనిమమకారముకలుగును. గృహనిర్మాణమునకుపునా దివలె ఆమమకారము అహంకారమును మున్నిడుకొనియుండును. నేననుభావముకలిగిన పిదపఁగదానాదియనుభావముకలుగవలయును. ఈయహంకారమమకారములనెడి చం డాలుర సహవాసముచే నాహృదయాలయము చండాలవాటికయయి భగవంతునిసాన్ని ధ్యమునకు అయోగ్యమగును. నేనెందుసంచరించినను, నామనస్సు ఇంటనుండుద్రవ్య మునేధ్యానించుచుండును. ఈద్రవ్యము శబ్దాదివిషయములకు ధారకమయినరకమునుపోషిం చును. విషయాసక్తునికి కృత్యాకృత్యవివేకము శూన్యమయి, శాస్త్రవశ్యతతప్పిపోవును. భగవదాజ్ఞయగు శాస్త్రమునుల్లంఘించుటచే తప్పకనరకముసిద్ధించును. ఈద్రవ్యమునుసద్వి షయమునవినియోగించిన నిట్టియనర్థములేల కలుగుననియందువేమో అడుగును త్రొక్క నేల? అడుగుగడుగనేల? అనర్థమగునర్థమును ఆర్జించి జాగరూకుఁడయి దుష్పథమునకుఁ దప్పి సత్పాత్రమునద్రవ్యమువినియోగింపవచ్చునని తలఁచుటయు మేలుకాదు. మహాత్ములు మర్మజ్ఞులయి సర్వానర్థమూలమగు నర్థమును దూరముగఁబరిహరించి వైరాగ్యమునేగొప్ప ధనముగభావింతురు. నీధనమునునీవేకొనిపొమ్ము. ఇదియనాకుగొప్పయుపకారము. నన్ను సంతోషింపింపవలయునని నీకిష్టముండిన ఈయర్థమును దీనులకిచ్చినాతోఁగూడి భగవంతు నినిభజింపుము. నీవాదేవదేవునిస్తుతించిన ఆస్తుతి నాకర్ణములయందమృతప్రవాహమైప్రవే శించి నాకుపరిపూర్ణానందమును గలుగఁజేయును. ఈవిషమునిచ్చి నన్నునరకమునఁద్రోయ కుము. అనిచెప్పియాద్రవ్యమును పేటించి భగవంతునిని భజించుచుండెను. ఆదినముహరివా సరమయియుండినందున శివాజిమహారాజు తుక్కారాంస్వామిచేయు హరికీర్తనమునువిను చుండెను. ఇట్లువినితనివిఁజెందక దేశపరిపాలనకృత్యమును మఱచి రెండుమాసములచటనే యుండెను. ఈశివాజిరాజునకు విరోధియయినయవరంగిపాచ్ఛా శివాజిరాజునుబట్టుకొన వలయునని సమయము వేచియుండి తనచారులవలన శివాజిరాజువృత్తాంతమునెఱిఁగి యత నినిపట్టుకొనిరండని రెండువేలయశ్వారోహకులనుబంపెను. వారలువచ్చి తుక్కారాంస్వా మియింటినిచుట్టుకొనిరి. వారలలోనలుగురు లోపలప్రవేశించి శివాజియెచటనున్నాఁడని యడిగిరి. అపుడుశివాజిరాజేమియుచేయనేరక వ్యసనాక్రాంతుఁడయియుండెను. అచ టనుండినసాధువులచే తుక్కారాంస్వామి జరగినవృత్తాంతమునెఱిఁగి మీరందఱును భయ

మునువిడిచి భగవంతునిని స్తుతించుచు భగవత్కీర్తనలనువినుచుండుఁడు. శ్రీపండరినాథుఁడు మనకురక్షకుఁడై యుండమన కెట్టాపదకలుగును. ఒకవేళయీతురుష్కులు మనలను సంహరింతురేమోయని శోకింపకుఁడు. వారట్లుచేసిన మనమీకర్మశరీరములగు కారాగృహములయందుండి విముక్తులై బ్రహ్మానందసుఖమున ననుభవింపవచ్చును. ఎన్నాళ్లు బ్రతికినను మరణ మొకనాటికి సిద్ధింపకతప్పదు. కానన ట్టిమరణమునకు భయపడిమీరేలవగచెదరు. ఈతురుష్కులు నేఁడే మనయందఱిశరీరములను ఛేదించిన మన భాగ్యమున కంతములేదు. అని చెప్పెను. అచటిసాధువులు శివాజిరాజచ్చటలేఁడని రాజభటులకు చెప్పిరి. వారలునమ్మకదూసినకత్తులతో తుకారాంస్వామిగృహమునఁ బ్రవేశించిరి. తుకారాంస్వామి పండరినాథుని ధ్యానించి దేవాధిదేవా! నీకీర్తనానందమునకు విరోధముగ నిప్పుడిదియేమిలీలయని కొనియాడెదవని విన్నవించెను. శ్రీమత్పాండురంగమూర్తి మీ రెప్పటియట్లు సంకీర్తనానందము ననుభవించుచుండుఁడు. తక్కినకార్యమును నేను నిర్వహించెదనని తుకారాంస్వామితోఁ జెప్పి తాను శివాజిమహారాజువేషమునుధరించి వెలుపటవచ్చి యొకగుఱ్ఱము నెక్కి చేతబల్లెమునుబట్టుకొని రణశూరునివలెపోవుచుండెను. తుకారాంస్వామి చెంతనుండిన సాధువులకును, శివాజిరాజునకును వెలుపట జరగువృత్తాంతము తెలియకుండెను. ఇంటినిముట్టడించుకొనియుండిన రెండువేల యశ్వారోహకులు ఇతఁడే శివాజిరాజు[illegible]ముపట్టుకొనవచ్చిన మనలఁజూచి పాఱిపోవుచున్నాఁడని యతనిని వెంబడించి బొబ్బలిడుచుపోవుచుండిరి. రాజువేషమును ధరించిన భగవంతుఁడు కొంతదూరము వేగముగఁబోవుచు నొక్కొకచోట వారలకు తానులోఁబడునట్లభినయించుచు నిట్లువారలనలయించి యరణ్యమధ్యమునకు నెలయించి తానదృశ్యుఁడయ్యెను. ఇట్లుండ వచ్చిన గుఱ్ఱపురౌతులు ఇదియేమి జగజ్జాలముగనున్నది. ఇంతదూరముతఱుముకొనివచ్చియు శివాజిరాజు మనకులోఁబడఁడయ్యెను. మన ప్రయాసమంతయునువ్యర్థమయ్యెననిచింతాక్రాంతులయి మఱలివచ్చుచుండిరి. ఆనాటిరాత్రిమూఁడవజామున చంద్రుఁడస్తమించి కారుచీఁకట్లునలుగడలదట్టముగ కమ్మినందున దారితెలియక గుఱ్ఱములు నడవలేక యడవియందలి పెద్దవృక్షములనుజూచి బెదరిచెదరితమమీఁదిరౌతులను గ్రిందఁబడఁద్రోసి యథేచ్ఛగఁబరుగెత్తిపోయెను. ఈరౌతులలో కొందఱు చెట్టు, పుట్ట, మిట్ట, పల్లములెఱుఁగకపరువులిడి ముండ్లపొదలలోఁబడిరి. కొందఱు గోతులయందుఁబడిరి. ఆహారములేనందున కొందఱు నడచుటకశక్తులయిరి. నిద్రాపరవశులయి కొందఱు దారితప్పి యున్మత్తులవలె సంచరించుచుండిరి. ఇట్లు ఆసేనదురవస్థనుజెంది యొకఁడుపోయినదారిని మఱియొకఁడుపోకయందఱును ఆయరణ్యమునందే నశించిరి. పండరినాథుఁడు తుకారాంస్వామియొద్దకువచ్చి వచ్చిన యాపదను దూరముగతొలఁగఁద్రోచితిని. మీరలుభగవత్కీర్తనలఁ జేయుచు నానందింపుఁడని చెప్పి యదృశ్యుఁడయ్యెను. అపుడందఱును జయజయధ్వనులుచేసిరి. సూర్యోదయమయినంతట భజననునిలిపి యొకరినొకరు ఆలింగనముచేసికొని సంతోషచిత్తులయిరి. ఆయూరివారు శివాజిరాజునుజూచి యితఁడెట్లు తరుష్కులచేతికిఁజిక్కకతప్పెనని యాశ్చర్యపడితుకారాంస్వామికయి శ్రీపాండురంగనాథుఁడు మనలనురక్షించెనని యొకరితోనొకరుచెప్పుకొనుచు స్వస్థానములకుఁబోయిరి.

తొలుత శివాజిరాజీయవచ్చిన ధనమును తుకారాంస్వామి యంగీకరింపనందున మఱియొకనాఁడు కొంత ధాన్యమునైన వారివిషయమున వినియోగింపవలయునని తలఁచి యొకబీదవర్తకుని వేషముధరించి యొకయెద్దుమీఁద బియ్యపుమూట వేసికొని తుకారాంస్వామియింటికి వచ్చి యామహాత్మునికి వందనముచేసి యోభాగవతాగ్రగణ్యా! నేను బియ్యపువ్యాపారము చేయుచుండువాఁడను. ఇటీవల నావ్యాపారమునందీ బియ్యము దైవానుగ్రహముచే నాకు లాభముగ సిద్ధించెను. కాన నాపైఁ గరుణించి దీనిని దేవరవారంగీకరించి నన్ను ధన్యునిఁ జేయవలయునని పలువిధముల ప్రార్థించెను. సర్వజ్ఞుఁడగు తుకారాంస్వామి నిజము నెఱిఁగి రాజుప్రార్థనను నిగ్రహింపలేక మౌనముగనుండెను. రాజు ఆమహాత్ముని నియమనముఁ జెంది స్వస్థానమునకుఁ బోయెను. తుకారాంస్వామి తనభార్యను బిలిచి నిన్నరాత్రి శివాజిరాజువచ్చి యొకమూట బియ్యమునిచ్చి పోయెను. అందుమనకొకనాటి యాహారమునకు మాత్రము వలసినంత ధాన్యము నెత్తుకొని తక్కిన ధాన్యమును దీనజనుల కిమ్మని నియమించెను. ఆమె కామాట సమ్మతము కానందున ధాన్యమునంతయుఁ గైకొనయత్నించెను. తుకారాంస్వామి తనభార్యభావము నెఱిఁగి లేచివచ్చి తనయింటికొకనాటికి వలసినంత బియ్యము నామెకిచ్చి శేషించిన బియ్యమును దీనజనులకిచ్చెను. అప్పుడు రాజసేవకులు చూచుచుండి యీవృత్తాంతమును రాజునకెఱిఁగించెను. రాజు తుకారాంస్వామి వైరాగ్యమునకు మిగుల నాశ్చర్యపడెను.

మఱియొకనాఁడు తుకారాంస్వామి భగవత్సన్నిధికిఁ బోయి యానందపరవశుఁడై భజనము చేయుచుండెను. ఆయూరిలో గాజులవ్యాపారము చేయుచుండువాఁడొకఁడు భక్తితో ప్రతిదినము తుకారాంస్వామి భజనచేయుచోటికి వచ్చి నామసంకీర్తనము వినుచుండును. ఇట్లు వినుచుండ నొకదినము తనశిశువు మాంద్యముచే మిగుల బాధపడుచుండుటను లక్ష్యముచేయక యెప్పటివలె భగవన్నామసంకీర్తనశ్రవణాసక్తిచే నతఁడు ఇల్లువిడిచి బయలుదేరెను. అపుడు వానిభార్య భర్తకడ్డంబుగ వచ్చి మనబిడ్డ మాంద్యముచే బాధపడుచుండఁగా నీవు భజనకుఁ బోవుట న్యాయముకాదు. అచటనుండు సాధువులలో నెవరినైన మనకు సహాయులనుగాఁ బిలుచుకొని వచ్చి శిశువున కారోగ్యము కలుగుటకుఁదగిన ప్రయత్నము చేయుమని చెప్పెను. అతఁడామాటను చెవులనిడక తుకారాంస్వామి భజనచేయుచోటికి వచ్చెను. తోడనే యాశిశువు ప్రాణములను విడిచెను. అపుడాశిశువునుగన్న తల్లి దుఃఖాక్రాంతయై యాశవము నెత్తుకొని భగవత్కీర్తన జరగుచుండుచోటికి వచ్చి తుకారాంస్వామిని జూచి యోయీభాగవతుఁడా! నీవుమాకుటుంబమును నాశముచేయుచున్నాఁడవు. నాపురుషునికేమేమో బోధించితివి. అతఁడు నీవలలోఁజిక్కియిట్టి యాపద్దశయందు ఇంచుకయైనను శంకలేక యీశిశువునుపేక్షించి నీయొద్దకు వచ్చెను. నాభర్త నాయింటనుండిన నీశిశువునకు మరణము కలుగకయుండును. అని చెప్పి యాశవమును తుకారాంస్వామి కెదుటఁబడ వైచి యేడ్చుచుండెను. కీర్తనమును వినుచుండిన జనులు ఓసీపిచ్చిదానా! శవము నేలనిచటికిఁదెచ్చితివి. ఈబిడ్డను బ్రతికించుటకు తుకారాంస్వామియొద్ద నమృతమున్నదాయని చెప్పఁగా విని తుకారాంస్వామి వారలనుజూచి యోభాగవతులారా! శ్రీహరినామామృతమునకన్న హ్యా

దయంగమమగు నమృతము మఱియొకటిగలదా? దీనిమహిమ నెఱుఁగక మీకుఁదోఁచినట్లు పల్కెదరు. మీరందఱును ఏకకాలమున శ్రీవిఠ్ఠలనాథుని నామము నొక్కక్షణమునుడువుఁడని చెప్పినతోడనే సంతోషించి వారందఱు సముద్రఘోషమువలె భగవన్నామములను చెప్పుచు ఘోషించిరి. అప్పుడాశిశువునకు ప్రాణమువచ్చి లేచికూర్చుండెను. ఈయద్భుతమునుజూచి యెల్లరు నానందపరవశులయిరి. శిశువుతల్లి యాశిశువునెత్తికొనివచ్చి తుకారాంస్వామి పాదపద్మములయందుఁ బడవైచి మహాత్మా! నీప్రభావము నెఱుఁగక మనసుపోయినట్లుమాటలాడితిని. ఆతప్పునుమన్నింపవలయునని ప్రార్థించియపరాధక్షమాపణముచేసికొనెను. అచటనుండిన వారందఱు ఈమహానుభావుని ప్రభావము సర్వజ్ఞుఁడగు శ్రీపాండురంగనికే తెలియునుగాని యజ్ఞులమగుమన మెఱుఁగుటకు శక్తులముగామని చెప్పిరి. దేవతలు పుష్పవర్షము వర్షించిరి. గంధర్వులు గానముచేసిరి. ఈయద్భుతమునుజూచి ప్రజలు పరమానందభరితులైరి.

బాలప్రాణప్రదాయకాయనమః,

## నలువదితొమ్మిదవయధ్యాయము.

---

### తుకారాంస్వామిభార్యసర్వస్వదానముచేయుచరిత్రము.

తుకారాంస్వామి పరమవైరాగ్యనిధియయి, సంసారమునువిడిచి, వనమునందును, శ్రీపాండురంగనిసన్నిధానమునందును, వసించుచు బ్రహ్మనిష్ఠుఁడయి, బ్రహ్మానందమనుభవించుచు నెడతెగక భగవంతునిఁగీర్తించుచునుండినందున నతనిభార్య దుఃఖాక్రాంతయయి యొకనాఁడు జలముతెచ్చుటకుపోవుచు శ్రీపాండురంగనిసన్నిధికభిముఖుఁడైవచ్చుచుండు నిజభర్తనవలోకించి యతనికడ్డమువచ్చి హా! మత్ప్రాణనాథా? నీవు దాదాపురెండుమాసములుగ నన్నెడవాసి యరణ్యమునవసించిన నేనెట్లుజీవింతును. నన్నురక్షించువారెవరు. నీకంచుకయయిననునాయందు జ్ఞాపకములేక యహోరాత్రమునృత్యకీర్తనంబులచే శ్రీపురుషోత్తముని సంతోషింపించుచున్నాఁడవు. నీవిట్లుండిన నీకుటుంబము నెవరుపోషింతురు. అని దుఃఖింపఁగా తుకారాంస్వామి తనభార్యను బహువిధములనూరడించి నాతల్లిదండ్రులు నిన్నురక్షింతురని చెప్పిన ఆపొలఁతి యోనాథా! పరలోకమునవసించు నీతల్లిదండ్రులు నన్నెట్లురక్షింతురనిన తుకారాంస్వామియిట్లనియె. ఓసుదతీ! నాతల్లిదండ్రులు జననమరణములులేనివారు. పరలోకగతులయినవారలు నాశరీరమునకు తల్లిదండ్రులేకాని జ్ఞానానందస్వరూపియయి, జ్ఞానగుణకుఁడై, యీశ్వరునికి శేషభూతుఁడయియుండు నాకు తల్లిదండ్రులుకారు. నేనునీచేఁజూడఁబడుశరీరముకాదు. శరీరాంతర్గతుఁడగు జీవాత్మనైయున్నాను. (అంతవంతఇమేదేహా। నిత్యస్యోక్తాశ్శరీరిణః) అనురీతిని ఈశరీరము అంతముతోఁగూడియుండును. శరీరాంతర్వర్తియగు నేను నిత్యుఁడనయియున్నాను. (నజాయతే మ్రియతేవాకదాచిన్నాయంభూత్వా భవితావానభూయః। అజోనిత్యశ్శాశ్వతోఽయంపురాణోనహన్యతేహన్యమానేశరీరే) అనురీతిని నేను పుట్టువాఁడనుగాను. చచ్చువాఁడనుగాను.

స్థిరరూపుఁడను. అనాదియైనవాఁడను. ఈదేహమునశించునేగాని నాకొకప్పుడును నాశము లేదు. ఇట్టి నాకు కర్మానుగుణముగ కలిగినజన్మములకు లెక్కలేదు. ఆదేహములనుగనిన తల్లి దండ్రులకును లెక్కలేదు. అట్లు ఈశరీరమును గన్న తల్లిదండ్రులను పూర్వజన్మములయందలి తల్లిదండ్రుల గణనలోఁ జేరఁదగినవారయియున్నారు. ఇఁకను నానిజ జననీ జనకులస్వరూపమును జెప్పెదను వినుము. జ్ఞాన, శక్తి, బలైశ్వర్య, వీర్య, తేజస్సులనుషడ్గుణైశ్వర్యముతోఁ గూడినవాఁడయి సర్వాత్మలకీశ్వరుఁడయి యఖిలజగత్సృష్టిస్థితి, సంహారకర్తయయి చేతనులవలె పరతంత్రుఁడు కాక స్వతంత్రుఁడయి, యఖిలమునకు నాధారమయి, తనకుమఱి యొకయాధారములేనివాఁడై, పరమయోగులవాఙ్మానసములకు నగోచరుఁడయి, యవ్యక్తుఁడయి, నామరూపరహితుఁడగు తన్నుపాసించుటయసాధ్యముకాన తన్నుపాసించునిజ భక్తులకయి నామరూపములను బరిగ్రహించినవాఁడయి సకలచేతనులహృదయమున సన్నివిష్టుఁడయి, కర్మసాక్షియయి, కర్మఫలప్రదుఁడయి, ముక్తిదాయకుఁడయి, యఖిలలోక శరణ్యుఁడయి, యఖిలజగజ్జనకుఁడయియుండు సర్వేశ్వరుఁడు నాకుతండ్రియైయున్నాఁడు. నిత్యానపాయినియై, యఖిలాత్మలకు పురుషకారభూతయయి, కారుణ్యరూపిణియయి, జగజ్జననియయి, శ్రీపద్మనాభునివక్షఃస్థలంబున విహరించుచుండునిందిరాదేవి నాతల్లియయి యున్నది. నాకుమాత్రమేకాదు. ఈదివ్యదంపతులు సర్వాత్మలకును, నిరుపాధికజననీజనకులయియున్నారు. నేనువారలనెఱిఁగి యాశ్రయించియున్నాను. నీవువారలనెఱుఁగకున్నావు. కానమనతల్లిదండ్రులని చెప్పక మొదలనే నాతల్లిదండ్రులని చెప్పితిని. నీవును నావలె వారలనెఱిఁగి యుపాసించితివేని నీకెందునుకొఱఁతలేదని చెప్పినవిని యామందగమనహృదయేశ్వరా? నీవునాతోడగృహంబునవసించి భగవంతునినిధ్యానించుచుండుము. నీవులేనందున గృహముశూన్యమయినట్లున్నది. నీయుపదేశముచే శ్రీమత్పాండురంగనాధుఁడే మనకుతండ్రి యనియు, శ్రీరుక్మిణీదేవియే తల్లియనియు నెఱిఁగితిని. నేఁడుమొదలు నేనును నీతోడహరి భజనముచే నెడననివిన్నవించిన తుకారాంస్వామి సంతసించి యోవనితా నీపలుకులు బాగైయున్నవి. నీవునాతోడ ననవరతము శ్రీపాండురంగనిని భజించుచు కర్మాధీనముగు దేహయాత్రకై చింతపడకుందువేని నేనుగృహంబునకువచ్చినీతోడవసించెదను. నాయభిప్రాయముఅంగీకారముగునేని నేనుపదేశించుపథ్యమున నుండెదనని ప్రతిజ్ఞచేయుమని చెప్పినభర్త మాటలకుసమ్మతించి యతఁడుకోరినట్లు ప్రతిజ్ఞచేసికొని యతనినిగృహంబునకుఁదోడ్కొని వచ్చి యతనితోఁగలసిహరిభజనము నేయుచుండెను.

ఒకయేకాదశినాఁడు తుకారాంస్వామి హరికీర్తనముచేయుచుండి తనభార్యను జూచి యామె కుతొమ్మిదిశ్లోకములనుపదేశించెను. ఆశ్లోకములయర్థమేమనఁగా ఎనుబది నాలుగులక్షలజీవరాసులయందు మనుష్యదేహము మిగులనుత్తమమైయుండును. అందుహరి స్మరణచేయువారిభాగ్యమేభాగ్యము. పారమార్థికచింతలేనివారు కుటుంబభారమును వహించి జననమరణప్రవాహమునఁబడియమవశ్యులయి బాధపడుదురు. కానజ్ఞానవృద్ధులు మానాభిమానములనువిడిచి బాహ్యేంద్రియవ్యాపారమును వర్జించి శుభాశుభశబ్దంబులను సమముగ వినుచులోష్టకాంచనంబుల సమముగఁజూచుచు, మాధుర్యకటుపదార్థంబులను సమముగ

భుజించుచు దుర్గంధసుగంధంబులను సమముగనాఘ్రాణించుచు చంచలమగుమనస్సును దృఢముచేసి యాత్మేశ్వరుఁడగు శ్రీకృష్ణపరమాత్మయందు తమమనంబులనులయింపఁజేయుదురు. నేనును అట్టివాఁడనయియున్నాఁడను. ఓబాలికామణీ? నాతండ్రియగు శ్రీపాండురంగఁడు మహాచోరుఁడయియున్నాఁడు. ఆచోరునికగపడక తప్పించుకొందమనిన నతఁడులేనిచోటులేదు. ఎందువెదకినను వాఁడుతప్ప మనకు గత్యంతరములేదు. అట్టిదొంగకు ప్రీతికరముగ నొకకార్యము నీవుచేసితివేని యదినాకును ప్రియకరముయియుండును. అందుచేమనము పరమసుఖమును జెంది దేహావసానమున ప్రణవరథారూఢులమయి శ్రీవైకుంఠదివ్యలోకమును జెంది వాసుదేవమూర్తిసామీప్యమునవసించి యీశ్వరానందమునకు సదృశమగునిత్యానందమును జెందుదుము. జననమరణదుఃఖములులేక సనకాదులవలెనానందింతుము. అందుకుపాయమెద్దియనిన వినుము. మనయింటనుండు మమకారయోగ్యములగు సర్వపదార్థములను దీనజనులకిచ్చి సంసారమెట్లు నిర్వహింతునను చింతనువిడిచి సర్వము శ్రీమత్పాండురంగఁడేనిర్వహించుచున్నాఁడనినిశ్చయించి యాచోరునిపరీక్షకు కొంచెమైననుచలింపక దృఢముగనిలిచి బిడ్డలకయిదుఃఖింపక వీరలు మనబిడ్డలుకారనితలఁచుచు కందమూలాదులచేనాఁకలినీ, నదీజలములచే దాహమునుదీర్చుకొనుచు కుప్పయందుపడియుండు ప్రాతపేలికలచేలమునుధరించుచు, పరితృప్తులమయియుంటిమేని అప్పుడాభగవంతునికి మనమీఁదసంతోషము కలుగును. కానమనమిరువురము యోగీశ్వరులకు దుర్లభమగుపదవినిఁజెందిసుఖింపవచ్చును. కాఁబట్టి నీవు దృఢమగుమనస్సుతోఁగూడి సర్వస్వమునుదీనులకుచూఱయిచ్చి శ్రీపాండురంగనిని ధ్యానించుచుండుము. అనియుపదేశించినంతట ఆయతివభర్తృనియమానుసారముగ తనయింటనుండిన సర్వస్వమును దీనజనులకు చూఱయిచ్చినాఁడంతయు స్వస్థచిత్తయయియుండెను, ఒకవస్త్రముమాత్రమే మిగిలియుండెను. మఱునాఁడుద్వాదశిపారణకునింటనొకపదార్థమును లేక యాస్త్రీ నేనేమిచేయుదునని చింతాక్రాంతయయి యుండఁగా శ్రీరుక్మిణీదేవి యొకనీచస్త్రీవేషమునుధరించి తుకారాంస్వామిచెంతకువచ్చి యోమహాత్మా? నీయింటనుండిన సర్వస్వమును దీనజనులకు యథేష్టముగానిచ్చితివి. కాన నాకునెద్దియేనియొకవస్తువునిమ్మని వేడిన తుకారాంస్వామియిల్లంతయుశోధించి యొక పదార్థమునుగానక పెరటితోఁటయందారఁగట్టియుండినచీరనువిప్పి యానీచస్త్రీకిచ్చెను. అదిచూచినజనులందఱు తుకారాంస్వామి, సంసారమునుసమూలముగఛేదించెననిచెప్పి యాశ్చర్యపడుచుండిరి.

వారలనుజూచి తుకారాంస్వామిభార్య భాగ్యవంతులరగునో సోదరులారా? వినుఁడు. నాభర్తయిల్లువిడిచి రెండుమాసములుగ అరణ్యమునందువాసముచేయుచుండెను. నేనింటశిశువులనుంచుకొనికష్టపడుచు పురుషునివెదకుచుండనితఁడు మొన్నటిదినముదేవాలయమునకువచ్చుచుండఁగాచూచి మంచిమాటలుచెప్పి నేనును నీతోడ హరికీర్తనముచేసెదనని సమాధానముచెప్పి నీవింటనుండినఁజాలునని ప్రార్థించి తోడ్కొనివచ్చితిని. నిన్నయేకాదశికాననుపవసించి హరికీర్తనముచేసి నన్నుపిలిచి నాకు బహువిధములుగనుపదేశించెను. తోడనే నాకువైరాగ్యముకలిగి యితనిపలుకులు నిజమనినమ్మి యింటనుండినసర్వస్వమును

దీనులకిచ్చి శ్రీపాండురంగనినిస్మరించుచుంటిని. నాకొక్కచీరమాత్రమే శేషించెను. ఆచీ
రను సయితము నా పెనిమిటి నేఁడుదయమున నొకనీచస్త్రీకి దత్తముచేసి దేవాలయమునకు
పోయెను. ఇచట నాఁకలిచేమూర్ఛనుజెందియుండుశిశువులఁజూచి నేనెట్లు సహింతును. నేనే
మిచేయుదును. నాగతియిట్లయ్యెను. రెండుమూఁడుమాఱులుస్మరించినమాత్రమున సర్వమును
త్యజించునట్టియధ్యవసాయమును నాకుఁగలుగఁజేసిన శ్రీపాండురంగనిపాదకమలయుగ్మము
మిగులవంచనకారియయియున్నది. యోగీశ్వరులు, మహాత్ములు, దేవతలు మొదలగునెల్లరును
అతనిపాదపద్మములనుజూచినంతట మయిమఱచిచొక్కెదరు. నాభర్తయహోరాత్రమా
చొక్కుతోఁగూడియున్నాఁడు. నేను రెండుమాఱులుస్మరించినమాత్రముననే నాబుద్ధికిసహి
తముభ్రమకలిగి మోసపోయితిని. ఒకగుండుఱాతిచేనిట్టి పాదములనునలఁగఁగొట్టిన నందఱును
సుఖపడుదురు. సాధుజనులుతమభార్యాపుత్రులనువిడనాడిలజ్జవిడిచి యున్మత్తులవలెవెలిఁ
దిరుగకుందురు. అనిచెప్పియొకపెద్దగుండుఱాతినెత్తుకొని దేవాలయమునందు ప్రవేశింపఁగా
మత్స్యరూపియై ప్రళయోదధియందుసంచరించునపుడును, కూర్మరూపియై మందరపర్వతము
నువహించునపుడును, వరాహరూపియై ప్రళయజలధినిమగ్నమగుభూమినుద్ధరించినపుడును,
నృసింహరూపియయి హిరణ్యకశిపునితోఁ బోరాడినపుడును, వామనరూపియయి బలిని
యాచింపఁబోయినపుడును, పరశురామమూర్తియయి పితృహంతలగుక్షత్రియులనెదిరించి
నపుడును, శ్రీరామరూపియయి రావణునితోఁబెనఁగినపుడును, బలరామరూపియై ప్రలం
బునిచే వినువీధిఁగొనిపోఁబడినపుడును, శ్రీకృష్ణరూపియై కాళియునిచే బంధింపఁబడినపు
డును, కలంగకుండిన గంభీరస్వభావముగలవాఁడు పెద్దపాషాణమును తనరెండుచేతులతో
నెత్తుకొని విఠ్ఠలాధీశునిపాదములనునలఁగఁగొట్టవలయునను పూనికతోవచ్చు సుదతినిజూచి
నంతనే నెంతయుఁగలఁగి శరీరము కంపింపభయపడుచుండెను. అదిచూచి రుక్మిణీదేవియో
ప్రాణనాథా? నీశరీరకంపమునకుఁగారణమేమి? తుకారాం భార్యకువెఱతువేని ఆలయ
మునువిడిచి కొంతతడవు వెలుపలసంచరించి మరలరమ్ము. అనినవినిరుక్మిణీకాంతుఁడు ఓవై
దర్భీ? నేనాలయమునువిడిచి వెలుపలపోయిన మనకంతరంగుఁడగు తుకారాంస్వామి
ప్రాణమునువిడుచును. మధుబిందుగ్రహణమునకయి కమలమునఁబ్రవేశించి సూర్యాస్తమ
యసమయమునముకుళించిన పద్మమునఁజిక్కి బయలువడనేరని భృంగమువలెనేను నాభక్తుని
హృత్పద్మంబునఁజిక్కి వెలువడనేరక భక్తపరాధీనుఁడనై యున్నాఁడను. అదిగోచూడుము.
తుకారాం తనభార్యకు మంచిమాటలుచెప్పియూఱడించుచున్నాఁడు. తనప్రార్థనను తన
భార్యయంగీకరింపదేని యామెతెచ్చినఱాతిని తనకాలిపయివ్రేయించుకొని నాకపాయము
లేక తొలఁగింపవలయునని తనమనంబుననిశ్చయించి తనభార్యకు పెక్కుచందాల హితవచ
నంబులను జెప్పుచున్నాఁడు. ఒకవేళయామందగమన తానుదెచ్చినఱాతిని తుకారాం
పాదములపయివేసిన కోమలతాండవముచేయునతనిపాదములకు అవద్యముకలుగునుగదా
యనిశోకించెదను. అనిచెప్పినలోకనాథునిమాటలనువిని శ్రీరుక్మిణీదేవి గర్భగృహమునుసమీ
పించివచ్చుచుండ తుకారాంభార్యను లోపలికిచేరఁబిలుచుకొని తుకారాం లోపల
ప్రవేశించుటకు మునుపు తలుపునుమూసికొనెను. తుకారాంస్వామి వెలుపలనిలిచి, రావ
ణుఁడు భక్తిచే సాధించుటకన్న విరోధముచేసాధించుటసులభమనిసనత్కుమారునిచే నుప

దేశమును జెంది యదిమొదలు భగవంతునినిద్వేషించియతనిచే మరణమును జెంది పావనుఁడయ్యెనని శ్రీరామాయణోత్తరకాండంబునవినఁబడుచున్నదిగదా. ఆయర్థము నేఁడుమద్గృహిణివిషయమున ప్రత్యక్షసిద్ధమయ్యెను. ఈయబలకుసిద్ధించినభాగ్యమునాకు సిద్ధింపదయ్యెనుగదా యనిశోకించుచుండెను. గర్భగృహమునందు ప్రవేశించినపిదప భగవంతునిపాదములను నలఁగఁగొట్టుటకుయత్నించిన తుకా౯రాంస్వామిభార్యచేతిని శ్రీరుక్మిణీదేవి గట్టిగపట్టుకొని ధ్యోమందయానా! దేవాధిదేవుఁడగుపాండురంగఁడేమి యపరాధముచేసెను. అనియడిగిన ఆయతివరుక్మిణీదేవినిఁజూచియోజననీ! జారచోరశిఖామణియగునీగోపికాచిత్తచోరునిపాదములను రెండుమాఱులుస్మరించినంతటసర్వస్వమునుదీనులకుమాఱయియ్యవలయుననుబుద్ధినాకుకలిగెను. కాననిట్టిపాదములను ఈఱాతిచే నలఁగఁగొట్టి లోకమునకు క్షేమమునుగలుగఁజేసెదను. అనిచెప్పిన రుక్మిణీదేవియాచంద్రవదననూరడించి నీకువలసినదంతయు నేనిచ్చెదఁగొనిపొమ్ము. నీవెందులకునుజింతింపకుమనిచెప్పియొకదివ్యాంబరమునుగట్టనిచ్చి యమూల్యరత్నాభరణంబులచేనలంకరించి యామెయొడినిండవరాలనుబోసి సంతోషమునుగలుగఁజేసెను. అవనిత పరమానందభరితయై శ్రీరుక్మిణీదేవికిని, శ్రీమత్పాండురంగనికిని వందనంబులాచరించి వారలయనుమతిని జెంది తనగృహంబునకుఁబోయెను.

అఖిలార్థప్రదాయనమః.

## ఏఁబదియవయధ్యాయము.

తుకా౯రాంస్వామి శ్రీపండరినాథునికి విన్నపపత్రికపంపు చరిత్రము,

తుకా౯రాంస్వామి తనభార్యనుజూచి మిగులఖేదమును జెంది యోలలనా! యేమికార్యముచేసితివి. నీవు విశ్వాసముకొంచెమైనను లేక భగవద్విషయమునందపచారపడితివి. కానమనకు సిద్ధింపఁదగిన పూర్ణఫలము అల్పమయ్యెను. పక్వమగుటకుముందుపైరునుగోసిన ధాన్యమెట్లు సంసారికిసిద్ధించును. పిదికినతోడనేపాలుద్రాగిన వెన్నయెట్లులభించును. సూర్యునివిడిచి ఖద్యోతమునాశ్రయించువారివలె పరమవైష్ణవసాయుజ్యమును పేక్షించి తుచ్ఛమయి యనర్థావహమగునర్థమున పేక్షించితివి. నీయవివేకమునే నేమనికొనియాడుదును. అనిచెప్పిన భర్తమాటలనువిని నంతట ఆయతివ మమకారమును విడిచి వైరాగ్యము తలయెత్తి శ్రీరుక్మిణీదేవి తనకిచ్చిన పదార్థములనన్నింటిని దీనజనులకిచ్చి నిర్మలమగుమనస్సుతోడ శ్రీపాండురంగనినిధ్యానించుచుండెను.

ఇట్లుండ తుకా౯రాంస్వామిమహిమయపారమయియామహాత్మునిర్మలయశస్సు లోకమంతయు వ్యాపించెను. కొందఱుబ్రాహ్మణులు తుకా౯రాంస్వామితోడ రుక్మిణీకాంతుఁడు కూర్చుండిసహపఙ్క్తిభోజనముచేయుచున్నాఁడని లోకులు వాడుకొనియెదరు. అదియెట్లుసాధ్యమగునని తమలోననుకొనుచుండిరి. ఈవార్తనునించవటియను గ్రామమునను మద్గుణపత్యుపాసకుఁడగునొకబ్రాహ్మణుఁడు వినియనూయాక్రాంతుఁడయి నేనుగణపత్యుపాసకుఁడగు బ్రాహ్మణుఁడను. వేదాధికారముగలవాఁడను. సకలశాస్త్రపారంగతుఁడను

బహుమంత్రములు నాకు స్వాధీనములయి యున్నవి. గణపతిని నానావిధోపచారములతోడ నారాధించుచున్నాను. ఇట్లుండియు నిదివఱకు గణనాథుఁడు నాకు ప్రసన్నుఁడుగాక యున్నాఁడు. ఈతుకారాం శూద్రుఁడు వేదమునకనధికారి. వీఁడు చక్రపాణిని సాన్నిధ్యము చేసికొని యాదేవాధిదేవునితోడ సహపఙ్క్తిభోజనము చేయుచున్నాఁడనిన నెట్లు నమ్మవచ్చును. అయినను వానినిటకు రప్పించి పరీక్షించి చూచెదనని తలఁచుచుండఁగా సర్వజ్ఞుఁడగు తుకారాంస్వామి యీబ్రాహ్మణుని యభిప్రాయము నెఱిఁగి తానే సించపటికి వచ్చి యాబ్రాహ్మణుని యింట ప్రవేశించి యతనికి వందనము చేసెను. ఆవిప్రుఁడు మిగుల సంతోషించి యోతుకారాం! నేనిన్నుఁ జూడవలయునని యపేక్షించి స్మరించుచుండఁగా భగవంతుఁడు నిన్నిటకుఁ దోడి తెచ్చినందులకయి మిగుల నానందించుచున్నాఁడనని చెప్పి కుశలప్రశ్నము చేసెను. మధ్యాహ్నమయినంతట నాబ్రాహ్మణుఁడు తాను భుజించుచోట తుకారాంస్వామికిని నొకయాకు వేసెను. అపుడు తుకారాంస్వామి యోవిప్రోత్తమా! నాయాకు ప్రక్కన మఱియొకయాకును వేయవలయును. నేను భుజించునపుడు శ్రీపాండురంగఁడును భోజనము సకువచ్చును. నీయాకు ప్రక్కన మఱియొకయాకు వేసి నీచేను పాసింపఁబడు గణపతిని రప్పించి భుజింపింపుము. అని చెప్పిన తుకారాంస్వామి మాటలను విని బ్రాహ్మణుఁడాశ్చర్యపడి దేవగృహమునఁ బ్రవేశించి గణపతిని పెక్కువిధంబుల స్తుతించి భుజింపరమ్మని ప్రార్థించియు గణపతి ప్రసన్నుఁడు కాఁడయ్యె. అపుడా బ్రాహ్మణుఁడు లజ్జించి నేను శాస్త్రమార్గము ననుసరించి గణపతిను పాసించుచున్నాను. ఈదేవుఁడు నాకు ప్రసన్నుఁడు కాక యున్నాఁడు. గజేంద్రుఁడు ఏశాస్త్రమార్గము నవలంబించి భగవంతునిని ప్రసన్నునిఁ జేసికొనెను. కుడిచేతికిని నెడమచేతికినిఁగల భేదము నెఱుఁగని గొల్లభామలు శ్రీకృష్ణునెట్లు సాన్నిధ్యము చేసికొనిరి. బ్రహ్మాదులకలభ్యమగు శ్రీకృష్ణపరమాత్మదర్శనము వ్రేపల్లెగొల్లవారి కెట్లు సులభమయ్యెను. భగవంతుఁడు భక్తికి సాధ్యుఁడగునట్లు యజ్ఞ, దాన, తపములకు సాధ్యుఁడు కాఁడు. అని తనలోఁ జింతించుచు తుకారాంస్వామి చెంతకు వచ్చి యోభాగవతాగ్రణీ! అర్చారూపమును పరిగ్రహించియుండు భగవంతుఁడు మనతోడ నెట్లు భుజించును. మనము నైవేద్యము చేసియున్నన్నమును భగవంతుఁడు కటాక్షించి దాసులనాలుకలయందుండి రసమును గ్రహించునని శాస్త్రము చెప్పుచున్నది. అనిన విని తుకారాంస్వామి యోబ్రాహ్మణోత్తమా! నీకుపాస్యుఁడగు గణపతి సముద్రమునఁ బడిన యొకభక్తునిని రక్షింపఁబోయెను. క్షణములో వలవచ్చును. కాన నీవిపుడు పోయి యీదేవునిఁ బిలుచుకొని రమ్మని చెప్పెను. ఆబ్రాహ్మణుఁడాశ్చర్యపడుచు దేవగృహమునఁ బ్రవేశించి చూడఁగా సచేలస్నానము చేసిన వానివలె గణపతిశరీరమును, వస్త్రమును నీటిచేఁ దడిసియుండెను. ఆవస్త్రమును పిండి నీటిని పరీక్షింపఁగా నదిసముద్రజలమై యుండెను. గణపతికి ధౌతవస్త్రమును సమర్పించి తుకారాంస్వామి చెంతకు వచ్చి నీవు చెప్పినదంతయు నిజమయి యుండెను. బహుదూరమున జరగిన వృత్తాంతమును నీ వెట్లెఱిఁగితివని బ్రాహ్మణుఁడడిగిన తుకారాంస్వామి వినీతుఁడయి దేవరవంటి సాధుజనుల యాశీర్వాదబలముచే నామనస్సునకు స్ఫురించినదానిని విన్నవించితినని చెప్పెను. అచటనుండిన బ్రాహ్మణులందఱును విస్మయమును జెంది శ్రీపాండురంగఁడితనికి ప్రసన్నుఁడయి యుండుటచే సకలదేవతలు నితనికి ప్రసన్నులయి యుందురు. కల్పవృక్షము నాశ్రయించినవారికిస

ర్వార్థములుకరస్థములయియుండునట్లాశ్రితకల్పతరువగు శ్రీమత్పాండురంగని నాశ్రయించిన నీమహాత్మ్యనికసాధ్యమెద్దియును లేదనిచెప్పచుండిరి. అప్పుడు తుకా్కరాంస్వామి గణపత్యుపాసకునిఁజూచి యాలస్యముచేయక గణపతినిరప్పింపుము. శ్రీపాండురంగడిప్పుడు వచ్చును. మనమందఱముఁగూర్చుండి భుజింతమని చెప్పెను. అదివినియచటిబ్రాహ్మణులుతుకా్కరాంస్వామినిజూచి నీవుపాండురంగనిని రప్పించునట్లుగణపతినిసహితమురప్పించుమని చెప్పిరి. తుకా్కరాంస్వామిస్మరించినంతట శ్రీపాండురంగఁడుప్రత్యక్షమయ్యెను. పిదపతుకా్కరాంస్వామి గణపతికగ్రభాగంబుననిలిచి యంజలిహస్తుఁడై గజాననా! శ్రీపండరినాథుఁడు వచ్చియున్నాఁడు. నీవును వచ్చిమాతోఁడ భుజించిపోవలయునని విన్నవించెను. అదివినిమూషికవాహనుఁడు సాక్షాత్కరించి పండరినాథునికివందనముచేసి యిరువురుఁగూర్చుండిరి. తుకా్కరాంస్వామి తప్పతక్కినవారలకన్నులకుగణేశవాసుదేవులు అగపడకుండిరి. ఆకుల యందువడ్డింపఁబడినపదార్థములదృశ్యమయ్యె. మీఁదమీఁదవడ్డించుచుండిన యాపదార్థము లదృశ్యమగుచువచ్చెను. తుకా్కరాంస్వామితోఁడ బ్రాహ్మణులందఱును గూర్చుండిభుజించిరి. భోజనానంతరము అందఱును చేతులుకాళ్లు గడుగుకొని శుద్ధాచమనముచేసిరి. వాసుదేవవిఘ్నేశ్వరులు తుకా్కరాంస్వామిచే చందనకుసుమతాంబూలంబులనంగీకరించి యంతర్థానులయిరి. తుకా్కరాంస్వామి యారాత్రియచట హరికీర్తనముచేయుచుండి నించవటిబ్రాహ్మణులనియమనముచెంది విఘ్నేశ్వరుని స్తుతించి వందనముచేసి దేవనగరమునకువచ్చుచుండెను.

మార్గమున నొకతోఁటవాఁడు తుకా్కరాంస్వామికి సాష్టాంగవందనముచేసి చెఱకుపాలిచ్చి యుపచరించికొన్ని చెఱకులనొకకట్టగఁగట్టి యోస్వామీ! దీనినింటికిఁగొనిపోయి బిడ్డలకిండని ప్రార్థించెను. తుకా్కరాంస్వామి యాచెఱకులనంగీకరించి భగవత్కీర్తన చేయుచు నానందభరితుఁడయి వీధియందువచ్చునప్పుడా యూరిశిశువులుచూచి మాకుచెఱకు కావలయునని యడిగిరి. తుకా్కరాంస్వామియాబిడ్డలను శ్రీవాసుదేవమూర్తులనుగా భావించి చెఱకునుబుచ్చుకొనుము దామోదరా! చెఱకునంగీకరింపుము కేశవా! చెఱకునుస్వీకరింపుము గోవిందా! చెఱకునుభుజింపుముకంసారీ! చెఱకునుగైకొమ్ము దేవా! అని చెప్పచుచెఱకులనెల్ల నాబిడ్డలకిచ్చుచు నింటికి వచ్చునప్పుడు తనచేతనొక్కచెఱకుమిగిలియుండెను. దానినితనభార్యచేతికిచ్చెను. ఆయువతివీధినినిలుచుండి తనభర్తయూరిబిడ్డలకు చెఱకులనిచ్చుచువచ్చినదిచూచుచుండి తనభర్తనవలోకించి భాగ్యవంతుఁడగుతోఁటవాఁడిచ్చిన చెఱుకులనన్నింటినింటికితేక యూరియందుండు నీతండ్రులకు పంచియిచ్చితివి. ఈ చెఱకునేమనినాచేతికీయవచ్చితివి. అనిచెప్పచు ఆచెఱకుతోనతని తలమీఁదఁగొట్టెను. అప్పుడాచెఱకు రెండుతునుకలయియందొకటియామెచేతనుండెను. మఱియొకటిభూమిపయిఁబడెను. అదిచూచిపరమశాంతనిధియగు తుకా్కరాంస్వామినవ్వుచునోవనితా! యీచెఱకును నిష్పక్షపాతముగ భాగించితివి. నీచేతనుండుచెఱకును నీవుగైకొనుము. క్రిందపడినస్భాగమును బిడ్డలకిచ్చెదనని చెప్పిన నాయువతివీధిపరమశాంతి కాశ్చర్యపడి యితఁడు ప్రపంచాతీతుఁడు. పరమశాంతమూర్తి. అహంకారమమకారములితనియందు వెదకినను

లేవు. దీపముగృహాధికారికిని, చోరునికిని సమమయియుండునట్లు ఈమహాత్ముఁడు సుఖదుఃఖములయందును, లోష్ఠకాంచనములయందును, ప్రియాప్రియములయందును, నిందాస్తుతులయందును, మానావమానములయందును, శత్రుమిత్రులయందును, సముఁడయియున్నాఁడు. ఇట్టిమహాత్మునిని నేను వ్యర్థముగనుపద్రవించుట న్యాయ్యముకాదనిచెప్పి శాంతచిత్తయయిమానముగనుండెను. ఇతనికల్యాణగుణగణములత్యద్భుతములయి వాచామగోచరములయియుపమానరహితములయియుండెను.

తుకారాంస్వామి ప్రతిసంవత్సరము ఆషాఢశుద్ధైకాదశికి పండరిపురమునకు పోయివచ్చుచుండును. ఒకసంవత్సరమితనిశరీరమునజ్వరముకలిగియందుచేనితఁడుమిగుల బాధపడుచు, బలహీనుఁడయినడచుటకు శక్తిలేకయుండెను. ఈసంవత్సరము శ్రీపండరిపురయాత్రకు విఘ్నము కలిగెనని మిగులశోకించుచు నొకపత్రికయందు శుభమస్తు. శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడై, యనంతకల్యాణగుణపరిపూర్ణుఁడై, పండరిపురమున భక్తజనపరిత్రాణముకొఱకు వేంచేసియుండు విఠ్ఠలనాథుని పాదపద్మముల కనంతనమస్కారములుచేసి చేయువిన్నపమేమనఁగా ఓదేవాధిదేవా! రుక్మిణీపతే! నేనునీకన్యముగు దైవమునుగాని నీసంకీర్తనకన్న నన్యముగువార్తలనుగానియెఱుఁగను. అనన్యగతికుఁడను. శరణాగతవత్సలా! ఈసంవత్సరము దేవరవారిమహోత్సవము దర్శనముచేయఁగోరిన నాకు విఘ్నముగనాశరీరమున నొకవ్యాధికలిగి యందుచే బాధపడుచు నడచివచ్చుటకు శక్తిలేకయున్నాఁడనుగాన యీవిన్నపమునువ్రాసితిని. నీప్రభావము వేదశాస్త్రములకగోచరము. నేనునుపామరుఁడను. నిన్నేమనివర్ణింతును. అనవరతము నీసేవచేయుచుండు నిత్యానపాయినియగు శ్రీరుక్మిణీదేవి నీప్రభావమునెఱుఁగకున్నయది. బ్రహ్మరుద్రాదులకును, మహర్షులకును, పరమయోగిజనులకును దుర్లభములగుదేవరవారిపాదపద్మములు నీయంతరంగభక్తులకు సులభములగుచున్నవి. సర్వవ్యాపకుఁడవయి, సర్వజ్ఞమూర్తివగు నీకుదాసభూతునికష్టములుతెలియకయున్నవి. ఓగోవిందా! ఓముకుందా! ఓయనంతా! ఏభక్తునినిరక్షించుచునన్నుమఱచితివి. నేనేమయిననపేక్షింతునని నీవువెఱచెదవా? ఓహృషీకేశా! ఓజగదీశా! మత్ప్రాణేశా! నాకునీనిజపదంబునుశీఘ్రముగనిమ్ము. కన్నతల్లియుపేక్షించినబిడ్డలు తమకోరికలనెవరితోఁజెప్పుకొందురు? నాకొఱఁతనెవరెఱుఁగఁగలరు? ఓపాండురంగా! హృదయేశా! భుజంగశయానా? ఏలకరుణలేకనన్ను నిరాకరించితివి. ఓకేశవా! ఓవాసుదేవా! దేవాదిదేవా! నేనునీకేమియుభారమును గలుగఁజేయలేదు. నీనామసంస్మరణమే నాకునిక్షేపము. ఇదియనాకుచాలుననునిశ్చయముతోడఁగూడియుండియు పుత్రుఁడనగునేనుతండ్రివగునిన్నుఁజ్ఞాడనపేక్షించెదను. గోపికారమణా! గోవర్ధనోద్ధరణా! గోపాలబాలా! నీకాశ్రితులనేకులున్నారనినన్నుమఱచితివా? లక్ష్మీనాథా! దీననాథా! నాప్రాణనాథా! నీదాసునినొకనిబంపినాయోగక్షేమములనువిచారించుటనీకుభారమైతోఁచిన నొకపత్రికనైనను వ్రాసిపంపుటచే నీకురాఁగలనష్టమేమి? నారాయణా! శాంతమూర్తీ! పెక్కుబిడ్డలఁగనిబహుభాగ్యముతోఁగూడియుండు నీవు నీభాగ్యమును నీబిడ్డలకీయక మఱియెవరికిచ్చెదవు. నీబిడ్డఁడనగునేను ఆఁకలిచేనేడ్చుచుండ నన్నుసమాధానము పఱుపవేని నిజముగ నీగౌరవమునకు

హానికలుగునని యెఱిఁగియుండుము. నేనునిన్నుఁ దలఁచుకొని యేడ్పుశబ్దమునీచెవికినారసమై సోఁకలేదా? భక్తవత్సలా! భక్తపరాధీనా! భక్తజనపారిజాతా! నీవిఁకనుపరాఙ్ముఖుఁడవై యుందువేని సాధుజనులతోఁ జెప్పివారలచే నీవు చెందుభక్తియను వేతనమును నేఁడు మొదలు కొనినిలిపివేయుదును. జగత్కర్తయయి, సర్వశక్తుఁడయి, యనంతకల్యాణగుణగణనిధివై, యుండునీగర్భమునందు జనించిన నేను ఇట్లుకష్టపడుట నీకపకీర్తికరమయి, లజ్జాకరమైయుం డలేదా? రుక్మిణీకాంతా! యేల నావలననిష్ఠురవాక్యములను గలుగఁజేయుచున్నావు. శీఘ్ర ముగఁగృపచేయుము. ఇఁకనుక్షణమాత్రమయిననుసహింపను. సర్వలోకశరణ్యా! శరణాగ తులను పేక్షించుటయందు నీకు సదృశులగువారినికనివిని యెఱుఁగను. పాపబలముచే ఈభవ సాగరంబునఁబడి కష్టమననుభవించుచున్నాఁడనని సమాధానముచేసికొనుటకును అవ కాశములేకయున్నది. శార్ఙ్గధరా! నీదివ్యనామములలో నొక్కొకటియు భవసాగరము నింకఁజేయునని వేదశాస్త్రములు మొఱవెట్టుచుండుటయబద్ధమా? నేను నీదివ్యనామము లను అహోరాత్రమును స్మరించుచుండలేదా? నీవు నాకుప్రత్యుత్తరము పంపువఱకు నేను నీకభిముఖుఁడనయి దండవత్ప్రణామముచేసి లేవకభూమిపైఁబడియుందును. అను మొదలగు సంగతులను ఇరువదినాలుగువృత్తములను గావ్రాసి యాత్రార్థముపండరిపురమునకుఁబోవు సాధుజనులచేతికిచ్చి మద్దేవతలారా! యీవిన్నపపుపత్రికను నావందనములతోడ దేవాధిదే వునిచేతికిచ్చియతనిఁజూచి మోమోడకతుకారాం ఏమియక్రమముచేసెను. అతనియందు నీకేలకృపలేకపోయెను. అతనియందేదుర్గుణముచూచియుపేక్షించితివి. హృషీకేశా! నీవుబిడ్డ లనుగనినవాఁడవు. నీమనస్సుఇనుమా. నీకిష్టమైనట్లుచేయుము. తుకారాంమనస్సునొ చ్చినిన్నుశపించిన నతనిశాపముఫలించును. నీవు సుఖివయియుండుము. నీనామముమాత్రమే యతనికిచాలును అనివిఠ్ఠలనాధునితో విన్నవింపుఁడనిన వారలట్లుచేసెదమనిచెప్పి బయ లుదేరి పండరిపురమునకుఁబోయిరి.

స్తుతిప్రియాయనమః.

## ఏఁబదియొకటవయధ్యాయము.

### శ్రీపండరినాధుఁడు గరుడారూఢుఁడయితుకారాంస్వామికి సేవయొసఁగినచరిత్రము.

ఉత్సవార్థము పండరిపురమునకువచ్చినభాగవతులు చంద్రభాగయందుస్నానముచేసి పుండరీకునిసేవించి, మహాద్వారమునసమస్కరించి ధ్వజస్తంభముచెంత శ్రీవిఠ్ఠలనాధునికభి ముఖులయినిలుచుండి, తుకారాంవ్రాసితమచేతికిచ్చినవిజ్ఞాపనపత్రికను విఠ్ఠలరాయనియ నుమతిమీఁదవిప్పి అందువ్రాయఁబడియుండినయిరువదినాలుగువృత్తములనుచదివి వినుపిం చిరి. శ్రీపాండురంగఁడదివిని మిగులఖేదించి శ్రీరుక్మిణీదేవినిఁజూచి యిట్లనియె. ఓసఖీ! నాకంతరంగుఁడగుతుకారాం వ్రాసిపంపినయుత్తరమునందలి వృత్తాంతములనువిని నంతట నామనసువశముకాకయున్నది. నాపుత్రుఁడునావిశ్లేషమునుసహింపలేనివాఁడై యుచ్చట

దుఃఖించుచుండ నిచ్చటియుత్సవవైభవము నామనసున కెట్లు రుచించును. నేను దేవనగర మునకుఁబోయి నాప్రాణపదంబగు తుకారామునిఁజూచి వానిని సమాధానపఱుచువఱకు నాకునిద్రాహారములు రుచింపవు. తుకారాం వ్రాసినవృత్తములు నామనస్సు నపహరించుకొని దేవుపట్టణమునకుపోయెను. నామనస్సు నన్ను విడిచిపోయినందున నాకింద్రియముల పాటవముతప్పియున్నది. ఇచటివైభవములెవ్వియు నాదృష్టికిగోచరములుకావు. ఇచటిభాగవతులకోలాహలశబ్దము నావీనులకువినరాదు. ఇచటనాకుఁజేయఁబడునైవేద్యాన్నరసమును నాజిహ్వగ్రహింపలేదు. నీకరస్పర్శమును నాశరీరముగ్రహింపదయ్యె. పరమభక్తులునన్నర్చించుదివ్యతులసిగంధమును నాఘ్రాణముగ్రహింపదయ్యె. ఓయతివా! నేనేమిచేయుదు. ఇచటనుత్సవార్థము లెక్కలేనిసాధుజనులు వచ్చియున్నారు. వీరలను పేక్షించిపోవుటయు యుక్తము గాదు. అనిజడునివలె పల్కుచున్న ప్రాణనాథునవలోకించి వైదర్భియిట్లనియె. ఓదేవాధిదేవా! దీనికయియింతచింతయేల? గరుడునిఁబంపి తుకారాముని రప్పింపుము. అనిచెప్పిన శ్రీరుక్మిణీదేవివచనంబులకుసంతోషించి పక్షిరాజునుబిలిచియోవైనతేయా! నీవిప్పుడే దేవునగరమునకుపోయి తుకారామునిఁజూచి కుశలప్రశ్నముచేసి నాయాశీర్వచనము చెప్పి యాత్రపోవువారిద్వారా నీవుపంపినజాబువలన నీశరీరస్థితినిపండరినాథుఁడెఱిఁగిమిగులఖేదమును జెంది నిన్నుజూడవలయునను నభిలాషతోఁగూడియున్నాఁడనిచెప్పియతనిని నీవీఁపుమీఁదనుంచుకొని వడిగరమ్మని యొకపత్రికయందు శ్రీపాండురంగనాథుఁడు ఆయుష్మంతుఁడగుతుకారామునకు జ్ఞానభక్తివైరాగ్యములు దినదినప్రవర్ధమానముగునట్లు మంగళాశాసనముచేసి వ్రాయుశ్రీముఖమేమనఁగా - ఇటీవలనీవువ్రాసిపంపిన యిరువదినాలుగువృత్తములనువినినంతట నాకు మిగులఖేదముకలిగెను. ఇచటనుత్సవార్థము పెక్కువేలసాధుజనులువచ్చియుండుటచే నేనిప్పుడే నీయొద్దకువచ్చుటకువీలుపడలేదు. (నజీవేయంక్షణమపి) అనురీతిని నిన్నుజూడకక్షణమాత్రమైనను నేనుజీవించియుండఁజాలను. కాననానియమునముచే నీవుగరుడునిమూపునఁగూర్చుండి శీఘ్రముగపండరిపురమునకు వచ్చి నీదర్శనముచే నానేత్రములకు నానందమొసంగుము. నీమృదువచనంబులచే నావీనులకు విందుఁజేయుము. నీయాలింగనముచే నాశరీరమునకుసుఖమునొసఁగుము. నీతోడియాలాపనముచే నాజిహ్వకునమృతమొసఁగుము. నీశిరంబుమూర్కొనుటచే నాఘ్రాణమునకు నింపుసంపాదింపుము. ఇవిమొదలగువృత్తాంతములనువ్రాసి దానినిగరుడుని చేతికిచ్చిన వేదస్వరూపియగువిహగేశ్వరుఁడాజాబును శిరసావహించి దేవునగరమునకుఁబోయి తుకారాంస్వామి కెదుట నిలిచెను. వాడినపయిరు వర్షించినంతట తలయెత్తునట్లు తుకారాంస్వామి శ్రీవైనతేయునిఁజూచినంతట మనస్సుననుత్సాహమును, శరీరమున బలమునుగలిగిలేచి సాష్టాంగముగ నమస్కరించి యంజలిహస్తుఁడయినిలుచుండి యోస్వామీ! నాజీవితేశుఁడగుశ్రీరుక్మిణీకాంతుఁడు సుఖియయియున్నాఁడా? అతనికంతరంగులగుసాధుజనులు ఆపుండరీకవరదుని ననవరతము సేవించుచునానందించుచున్నారా! నేనాజగదీశునివిశ్లేషమును సహింపఁజాలక యహోరాత్రముదుఃఖించుచున్నాను. నాకెన్నఁడు మత్ప్రాణనాథునిదర్శనము లభించును. అనినవినిగరుడుఁడు ఓభాగవతాగ్రణీ! నీవిచట శ్రీరుక్మిణీపతిదర్శనలాలసుఁడవై తద్విశ్లేషమునుసహింపక దుఃఖించుచున్నాఁడవు. (వ్యసనేతుమనుష్యాణాం । భృశంభవతిదుఃఖితః)

అనురీతిని నీదర్శనమునుగోరుచునీవిశ్లేషమునుసహింపకున్నాఁడు నీదుఃఖమునకన్న నధికముగుదుఃఖము ననుభవించుచున్నాఁడు. అతనిదుఃఖము మాదృశులకు వాచామగోచరమయియున్నది.నిన్నిప్పుడే నామూఁపునవహించుకొనిరమ్మని నా నాథుఁడునియమించెను.అతఁడు నీకిచ్చిన పత్రికయిద్ధియని యాశ్రీముఖమునతని చేతికిచ్చెను. తుకారాంస్వామి వందనముచేసి యాజాబునందుకొని నేత్రములయందొత్తుకొని శిరసావహించి పిదపదానినివిప్పిచదువుకొని యానందబాష్పములను విడుచుచు కమలమిత్రునిఁగన్న కమలమువలెను, పున్నమనాఁటిచంద్రునిఁగన్న మహాసముద్రమువలెను, ఆంజనేయదత్త శ్రీరామనామాంగుళీయకమును గనిన సీతవలెను పరమానందమును జెంది గరుడునిముఖముగ శ్రీవాసుదేవసందేశమును విని సంతోషభరితుఁడయియోగరుత్మానుఁడా! నిన్నుఁజూచినంతట నాసకలసంతాపములు చల్లారెను. వేదస్వరూపివగు నిన్నువర్ణించుటకెవరికిఁదరమగును. పురాణపురుషుఁడగు పురుషోత్తమునిని నీవిఁపునవహించుకొని పరమయోగుల హృదయవీథిని సంచరింతువు. శ్రీనివాసునిపాదపద్మములు నీకరంబులకాభరణంబులయియుండును. ఇట్టినీగౌరవమును నేనేమనికొనియాడుదును. నీవాభగవంతునియగ్రభాగమున మణిముకురమనఁదగి భాగవతులకు పురుషకారభూతుఁడవయి వసించుచుందువు. ఇతరులకజేయుఁడగు దేవేంద్రునిని జయించి యతని స్వాధీనముననున్నయమృతమును సర్పములకిచ్చి వినతదాస్యముమాన్పిన మహానుభావుఁడవు. నీవుభగవంతునికి దాసుఁడవై, సఖుఁడవై,వాహనమవై,యాసనమవయి,ధ్వజమవయి, వితానమవయి, వ్యజనమవై, యున్నాఁడవు. (దాసస్సఖావాహనమాసనంధ్వజో। యస్తేవితానంవ్యజనంత్రయీమయః) అని నీగౌరవమును అభిజ్ఞులువేనోళ్లఁగొనియాడుచున్నారు. మందమతినగునేను నిన్నేమని నుతింతును. నీదాసుఁడనగునేను నిన్నెట్లారాధింతును. నాయార్తిని నీనాథునకు విన్నవించి యతని నిటకుఁదోడితెచ్చి నామనోరథము పూర్తిచేయుము. అనివిన్నవించినవిని గరుత్మంతుఁడు సంతసించి యోసాధుజనాగ్రేసరా! శోకింపకుము. ఆశ్రితరక్షాదీక్షితుఁడగు పండరినాథునిదిగోతోడితెచ్చెదనని యూరడించి పండరిపురముచేరి పుండరీకవరదునికి వందనముచేసి తుకారాంస్వామిప్రార్థనను విన్నవించి మన్నాథా! జలమునువిడిచినమత్స్యమువలె నీసంశ్లేషమునుజలములేక తుకారాం త్రుళ్లితత్తళించుచున్నాఁడు. శీఘ్రముగనతనికి సేవయొసంగవేనియతనియొడలఁ బ్రాణములుండవు అనిచెప్పెను. ఈవృత్తాంతమును శ్రీరుక్మిణీదేవి వినియోనాథా! యిచటనుత్సవార్థము లెక్కలేని భాగవతులు వచ్చియున్నారు. నీవిపుడు బయలుదేరిపోయినయెడల చంద్రుఁడులేనిపున్నమవలె నీయూరుమంగళహీనమయియుండును. కాననుత్సవము నెఱవేరినతోడనే దేవుపట్టణమునకు పోవచ్చునని చెప్పెను. అపుడు భగవద్దర్శనార్థమయి శేకమమ్మదు, గణేశనాథుఁడు, నింబరాజు మొదలగు భాగవతులనేకులు వచ్చి ధ్వజస్తంభముచెంత సాష్టాంగవందనముచేసి యానందభరితులయి నృత్యకీర్తనంబులను చేయుచుండిరి.

అపుడు పండరినాథుఁడు శ్రీరుక్మిణీదేవినిఁజూచి యానింబరాజునకు నీవుప్రత్యక్షమయియనుగ్రహింపుమని చెప్పెను. ఈనింబరాజెవఁడనఁగా ఉత్తరదేశమున దేవంతపట్టణమున గొప్పయుద్యోగముచేయుచు కుటుంబియయి యుండినవాఁడు. ఇతఁడువైరాగ్యశీలుఁ

## राग कालिंगडा।

प्रीतम नूपुर मति न उतारो। इनकी धुनि सुनि पार परोसिन कहा करेगी हमारो॥ भले करो जग चर्चा मेरी तुम निज प्रण नहिं टारो। नारायण जे शरण चरणकी तिन्हें न कीजे न्यारो॥१९३॥

## राग भैरव।

भोर भयो जागो मनमोहन टेरत राधे प्राणपियारी। बोलत तमचर मुखर सुहावन निशि तम विगत भई उजियारी॥ दधि मथि माखन तुमपै ल्याई मिश्रित मिश्री मधुर सुधारी। ललितादिक सखियां सब ठाढीं मेवा पान लिये जल झारी॥ सुन प्रियवानी सुखरस सानी नयन कमल खोले गिरिधारी। दरश परश नयनन फल पायो वारि अपनपौ भई सुखारी॥ आदि सनातन राधे मोहन विलसत हुलसत संग सुकुमारी। दंपति लीला सुखद सुशीला गावत दीन मगन बलिहारी॥ १९४॥

## राग रामकली।

लटकत आवत कुंज भवनते। ढुर ढुर परत राधिका ऊपर जाग्रत शिथिल रवनते॥ चौंक परत कबहूं मारग लिच चलत सुगंध पवनते। भर उसांस राधा वियोग भय सकुचे दिवस रवन ते॥ आलस मिस न्यारे न होत हैं नेकहूं प्यारी तनते। रसिक टरो जिन दशा श्यामकी कबहू मेरे मनते॥ १९५॥

## राग कान्हरा।

प्रीतिकि रीति रँगीलोइ जानै। यद्यपि सकल लोक चूडामणि दीन अपनपौ मानै॥ यमुना पुलिन निकुंज भवनमें मान मानिनी ठानै। निकट नवीन कोटि कामिनि कुल धीरज मनहि न आनै॥ नश्वर नेह चपल मधुकर ज्यों आन आनसे बानै॥ जय श्री हित हरिवंश चतुर सोइ लालहिं छांड मेंड पहिचानै १९६॥

భూషణంబులనుసంగవలయునను మనోరథంబుతోడ పండరినాథుఁడొక బ్రాహ్మణరూపంబుపరిగ్రహించి కంఠమునదులసీహారమును, శిరమునకుల్లాయియును, శరీరమునకాషాయవస్త్రకంచుకములను ధరియించి చంద్రభాగతీరమునకు వచ్చితానుధరించియుండు తులసీహారమును, కుల్లాయియు, కాషాయవస్త్రమును, కాషాయకంచుకమును నింబరాజుచెంతనునిచి యతనిఁజూచి యోమహాత్మా! నేనుస్నానముచేసివచ్చెదను. నీవుకొంతసేపు ఈవస్తువులనుజూచుకొనియుండుము. ఇచటబహుజనులు గుమిగూడియుండుటచే నేను వచ్చువఱకు నీవీవస్తువులను కాపాడవలయునని చెప్పి స్నానముచేయువానివలె నీట దిగియదృశ్యుఁడయ్యెను. నింబరాజుచాలాసేపుకాచియుండి స్నానమునకుఁబోయినవిప్రుఁడుమఱి రాఁడయ్యె. నేనేమిచేయుదునని చింతించుచునచటనుండిన సాధుజనులతోఁ జెప్పఁగా వారలాశ్చర్యపడి యోనింబరాజా! వచ్చినవాఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. శ్రీరుక్మిణీకాంతుఁడు. ఆరూపమునుపరిగ్రహించివచ్చి నీకీవస్తువులనిచ్చియదృశ్యుఁడయ్యెను. కాన వీనిని నీవుధరింపుమని చెప్పిరి. నింబరాజుసంతోషించి సాధుగోష్ఠికి వందనంబాచరించి యాకాషాయవస్త్రములను ధరించెను. అపుడచటనుండిన సాధువులందఱా భాగవతోత్తముని జూచి నింబరాజా! మాకెల్లరకు మిగులదాహముకలిగియున్నది. నీవీసికతాతలమున నిలుచుండి భగవంతునిని గీర్తించితివేని యాయమృతప్రవాహము మావీనులం బ్రవేశించి మాతాపమును చల్లార్చి మాకు పరితృప్తినిగలుగఁజేయునని చెప్పిరి. నింబరాజు శ్రీరుక్మిణీపతినిస్మరించుచు సికతాతలముననిలుచుండి యానందపరవశుఁడయి మయిమఱచి భగవంతునిఁగీర్తించుచుండెను. ఈకీర్తనామృతముఁ గ్రోల నిచ్ఛయించి ముప్పదిమూడుకోట్లదేవతలును, నలుబదియెనిమిదివేలమహర్షులును, యక్ష, కిన్నరాదులును ఆకాశమార్గముననుండి యానందపరవశులయి వినుచుండిరి. ఈకీర్తనలనువినుటచే భూమ్యంతరిక్షంబులందుండు వారెల్లరుమయిమఱచి పరవశులైయుండిరి. పురుషోత్తముఁడును, పురాణపురుషుఁడునగు పుండరీకవరదునికి ఈపరమభక్తునికీర్తనముచే సంతోషమున్మస్తకమయి యొకశిశురూపమునుబరిగ్రహించి చేతనొకతాళవృంతమును బట్టుకొని నింబరాజుభుజమునఁగూర్చుండియతనిముఖమునఁ జెమటపోయకుండ తిన్నఁగ విసరుచుండెను. భక్తవత్సలుఁడై, పతితపావనుఁడై, పరమదయాకరుఁడై, పరమయోగిజనహృత్పద్మవాసియయి, బ్రహ్మాదిసకలాత్మలకంతరాత్మయైన శ్రీరుక్మిణీకాంతుఁడు నింబరాజుభుజమునఁగూర్చుండియతనికి శ్రమపరిహారముగవిసరుచుండు నతిశయమునేమని చెప్పవచ్చును? అపుడందఱును శ్రవణానందమును జెంది యానందరసాబ్ధిమగ్నులయియుండిరి. రాత్రి నాలుగుజాములునుగడచి సూర్యోదయమయ్యును అందఱును దేహముమీఁదస్మరణలేక చొక్కియుండిరి. ఒకవర్తకుఁడుస్నానముచేయుటకయి చంద్రభాగకువచ్చి నింబరాజుభుజమునందత్యద్భుతమగులావణ్యముతోఁగూడి దివ్యమంగళవిగ్రహవిశిష్టుఁడయియతనికి విసరుచుండు బాలునిదర్శించి యాశ్చర్యపడి సమీపమునకు వచ్చినింబరాజు నాలింగనముచేసికొని యాబాలునిఁజూడఁగా నతఁడదృశ్యుఁడయ్యెను. అపుడావర్తకుఁడేడ్చుచు గద్గదకంఠుఁడయి దేవాధిదేవా! రుక్మిణీదేవిశుశ్రూషకు సంతసించునీవు నీభక్తునికి శ్రమపరిహారముగ విసరుచుండి నేనుసమీపమునకువచ్చినంతనేలయదృశ్యుఁడవయితివి? అనిచెప్పుచుండఁగా నచటనుండినవారందఱునాశ్చర్యపడి యావర్తకునిమాటలకనుగుణముగ నింబరాజుభుజమున కొన్ని

నిదర్శనములుచూచి యానందపరవశులయి స్తుతిప్రణామంబులను జేసిరి. కీర్తన చాలింపఁబడియె. అందఱును స్నానమునకుఁబోయిరి. ఉత్సవము పూర్తియయినంతట భాగవతులందఱు భగవన్నియమనమును జెందిస్వస్థానములకుఁబోయిరి. పండరినాథుఁడు శ్రీరుక్మిణీదేవినిఁజూచి భాగవతులందఱు స్వస్థానములకుఁబోయినందున పండరీపురముకళారహితుఁడగు చంద్రునివలెనున్నది. నాకిపుడిచటివాసము రుచింపలేదు. దేవునగరమునకుఁబోయి తుకారామునకు దర్శనమిచ్చివత్తము రమ్మని చెప్పియాదేవితోడ గరుడారూఢుఁడయి దేవునగరమునకు పోఁగా వైష్ణవశిఖామణియగు తుకారాంస్వామి మేఘమును నిరీక్షించు చాతకమువలె పండరినాథుని రాకను నిరీక్షించుచుండి యపుడు తనకు కలిగిన శుభసూచకములనుజూచి నాతల్లిదండ్రులగు శ్రీరుక్మిణీవాసుదేవులను నేనెపుడు దర్శింతునని చింతించుచుండ పండరినాథుఁడు శ్రీరుక్మిణీసమేతుఁడయి గరుడవాహనారూఢుఁడయి సేవయొసంగెను. తుకారాంస్వామి యానందపరవశుఁడయి పున్నమచంద్రునిఁజూచిన సముద్రమువలె జయవిజయీభవయని ఘోషించుచు శరీరము పూరించి యెదుర్కొనిపోయి సాష్టాంగవందనంబాచరించి యంజలిహస్తుఁడయి నిలుచుండి (ఓంనమఃపరమార్థార్థ। స్థూలసూక్ష్మక్షరాక్షర। వ్యక్తావ్యక్తకలాతీత। సకలేశనిరంజన॥ గుణాంజనగుణాధార। నిర్గుణాత్మన్గుణస్థిత। మూర్తామూర్తమహామూర్తే। సూక్ష్మమూర్తేస్ఫుటాస్ఫుట॥ కరాళరూపసౌమ్యాత్మ। న్విద్యావిద్యామయాచ్యుత। సదసద్రూపసద్భావ। సదసద్భావభావన॥ నిత్యానిత్యప్రపంచాత్మ। నిష్ప్రపంచామలాశ్రిత। ఏకానేకనమస్తుభ్యం। వాసుదేవాదికారణ॥ యస్స్థూలసూక్ష్మప్రకటప్రకాశో। యస్సర్వభూతో నచసర్వభూతః। విశ్వంయతశ్చైతదవిశ్వహేతో। నమోస్తుతస్మై పురుషోత్తమాయ) అనిస్తుతించి మఱలవందనముచేసి శ్రీరుక్మిణీకాంతుని పాదంబులఁబట్టుకొనిశరణాగతుఁడై యుండెను.

శ్రీగరుడారూఢాయనమః.

## ఏఁబదిరెండవయధ్యాయము.

---

తుకారాంస్వామి నిజశరీరముతోడ పరమపదమునకుఁబోయిన చరిత్రము.

శ్రీపాండురంగఁడు సంతోషించి తుకారాంస్వామినిజూచి నీకువలసినవరమడుగుమిచ్చెదననిన ఆవైరాగ్యశీలుఁడు భగవంతునిఁజూచి పురుషోత్తమా? నీపాదపద్మములయందెడతెగనిభక్తి కలుగునట్లనుగ్రహించితివిగాన నేను కృతార్థుఁడనయితిని. సకలజగత్కారణభూతుఁడవగు నీయందెవనికి నచంచలభక్తికలుగునో యట్టివానికి సర్వోత్తమమగు మోక్షము కరతలామలకమయియుండును. అట్టివానికి ధర్మార్థకామములతోపనియేమి! నీయనంతకల్యాణగుణగణములను సదా వర్ణించుచు నీదాసజనులతోడఁగూడియుండుట నాకత్యంతప్రియమయియున్నది. నేనుమిథ్యాచారశీలుఁడనుగాక వైరాగ్యాభ్యంతరవేషములతోఁగూడి నీకును నీయంతరంగభక్తులకును అంగీకారమగునట్లను గ్రహింపుము. చిదచిద్రూపమగు సర్వప్రపంచమును నీస్వరూపముగఁజూచుచు నీవిభూతియగు చేతనాచేతనములయందు

రాగద్వేషములు లేక పరులలాభనష్టములను సుఖదుఃఖములను నాయదిగఁ దలఁచుచు నీచుల లోనే నేయగ్రగణ్యుఁడనని భావించుచు నుండఁదగిన దృఢాధ్యవసాయమును నాకొసంగుము. భక్తవత్సలా! పరదోషములును స్వగుణములును నాబుద్ధికి గోచరింపకుండునట్లు కృపచేయుము. అని విన్నవించిన భగవంతుఁడు సంతసించి మందహాసముతోడ నతనిఁ జూచి నీకోరినవరంబు నిచ్చితినని చెప్పి గరుత్మంతునిఁ జూచి వైనతేయా! యీతుకారాంయొక్క మంచినడువడియు, వైరాగ్యమును, అద్వితీయమైయున్నదని చెప్పిన గరుత్మంతుఁడు వినీతుఁడయి చక్రపాణీ? యితఁడుద్ధవాంశజుఁడగు నామదేవుని యపరావతారమగుటచే ఈమూర్తి నీస్వరూపమయియున్నది. ఇంతకధికముగ నేనేమియుఁ జెప్పలేనని విన్నవించెను.

అపుడు పండరినాథుఁడు తుకారామునిఁ జూచి యోవత్సా? నాకుమిగుల నాఁకలియైయున్నది. నీయింట నేదైన పర్యుషితముండిన నాకుఁ దెచ్చిపెట్టుమని చెప్పెను. తుకారాంస్వామి పరిశుద్ధోదకమును దెచ్చి శ్రీరుక్మిణీవాసుదేవుల కాళ్లుగడిగి వారల కాసనంబిచ్చి కూర్చుండఁబెట్టి తనయింటనుండిన ప్రాతరొట్టెను దెచ్చి భగవంతుని కెదుట స్థలశుద్ధిచేసి యొక యాకున నారొట్టెనునిచి పానీయమును దెచ్చియుంచెను. ఆరొట్టె రెండుమూడుదినములకు మునుపు కాల్పఁబడినది కాన నెండి నిస్సారమయి మిగుల కఠినమయియుండెను. శ్రీభవానీశులును, బ్రహ్మాదిదేవతలును, ప్రార్థించియిచ్చు దివ్యామృతము నంగీకరింపని భగవంతుఁడు ఈభాగవతోత్తముని పరమభక్తికి సంతోషించి యతఁడిచ్చిన యెండురొట్టెను పరమప్రేమతోడ భుజించెను. (పత్రంపుష్పంఫలంతోయం। యోమేభక్త్యాప్రయచ్ఛతి। తదహంభక్త్యుపహృత। మశ్నామిప్రయతాత్మనః) అనఁగా నెవఁడు భక్తితో నాకు పత్రమునయినను, పుష్పమునైనను, ఫలమునయినను, ఉదకమునయినను, సమర్పించుచున్నాఁడో యట్టివానిచే భక్తిపూర్వకముగ సమర్పింపఁబడిన యాపదార్థమును నేను స్వీకరించుచున్నాఁడను. అని భగవద్గీతయందు చెప్పఁబడియుండెడి యర్థమును తుకారాంస్వామివిషయమున ననుష్ఠించిచూపెను. ద్రౌపది బ్రాహ్మణసమారాధనానంతరము కడిగియుంచఁబడిన పాత్రమున నంటియుండిన శాకలవముచే శ్రీకృష్ణునికి తృప్తికలుగఁజేసెను. వేంకటాచలముననుండిన పరమభాగవతుఁడగు నొకకుమ్మరవాఁడు మంటిపుష్పమునర్పించి శ్రీనివాసునిసంతోషింపించెను. గురుశుశ్రూషాపరయగు శబరి తనయెంగిటిఫలములచే శ్రీరామునికి నానందమును గలుగఁజేసెను. అతిథిపూజాపరుఁడగు రంతిదేవుఁడతిథియగు చండాలునిని భగవత్స్వరూపునిఁగ భావించి తనపాత్రమునందలి తీర్థమిచ్చి సర్వశరీరకుఁడగు భగవంతునికి మోదమునుత్పాదించెను. ఇపుడు తుకారాంస్వామి యెండినరొట్టెనిచ్చి భగవంతునికిష్టసిద్ధినిఁ గలుగఁజేసె. ద్రౌపది దూర్వాసభయముచే శోకించినందున శ్రీకృష్ణుఁడు శాకలవమునంగీకరించి పాండవులవగపును మాన్పెను. వేంకటాద్రివాసియగు భక్తుఁడు తనభక్తిచే నర్పించిన పుష్పమును శ్రీనివాసుఁ డంగీకరించెను. శబరి ఆచార్యునియమనమును శిరసావహించి తన్ముఖోల్లాసమునకై చేసిన ఫలదానమును శ్రీరాముఁ డంగీకరించెను. రంతిదేవుఁడు, తృష్ణాతురుఁడయి జలమునర్థించిన చండాలునిని భగవత్స్వరూపునిఁగ భావించి పవిత్రుం జేసె. తుకారాం స్వామియింటికి భగవంతుఁడు తానెవచ్చి నీయింటఁగల ప్రాతరొట్టెవెద్దయైన నాకొసంగుమని యడిగి యారా

త్తాగ్రణియిచ్చినరొట్టెనుస్వీకరించి పరమానందమును జెందెను. కాన ద్రౌపదిమొదలగునలు గురియారాధనమునకన్న తుకారాంస్వామి చేసినయారాధనమత్యంత శ్లాఘనీయమైయున్నది. శ్రీపాండురంగఁడిట్లు భుజించి తాంబూలమునుస్వీకరించి తుకారాంస్వామినిఁజూచి నీవిచ్చినరొట్టెను భుజించి నేను మిగుల తృప్తినిఁ జెందితిని. విదురునింటనన్నమునుభుజించిన నాఁడు నాకెంతతృప్తికలిగెనో నేఁడంతతృప్తికలిగెను. నేను నాయాత్మీయంబులనీయధీనముచేసియున్నాఁడను. నీవునన్నుస్మరించునప్పుడు వడిగవచ్చెదను. పోయివచ్చెదనని చెప్పి యతనివందనములనంగీకరించి శ్రీరుక్మిణీదేవితోడ గరుడునినారోహించి పండరిపురమునకు పోయెను.

పిదప ఆళందియనుగ్రామమునవసించు బ్రాహ్మణుఁడొకఁడు తాను గొప్పవిద్వాంసుఁడు కావలయునని కోరియలకాపురమునకు పోయిజ్ఞానదేవునుపాసించుచుండెను. జ్ఞానదేవుఁడా బ్రాహ్మణుని స్వప్నమున సాక్షాత్కరించి నీవు తుకారాంయొద్దకుఁబొమ్ము. అతని యనుగ్రహముచే నీకోరికసిద్ధించునని చెప్పియదృశ్యుఁడయ్యెను. ఆబ్రాహ్మణుఁడు దేవునగరమునకు వచ్చి తుకారాంస్వామిని దర్శించి తనస్వప్నవృత్తాంతమునతనికి విన్నవించెను. ఇదివిని తుకారాంస్వామియాశ్చర్యపడి జ్ఞానసింధువగుజ్ఞానేశ్వరులు మహిషముచే సకలవేదంబులనుచ్చరింపించిరి. వ్యాఘ్రారూఢుఁడయివచ్చు సారంగదేవునెదుర్కొనఁదలఁచితానారోహించియుండిన జీర్ణకుడ్యంబునడపించిరి. అట్టిలోకపూజ్యుఁడు ఈబ్రాహ్మణుని నాయొద్దకుఁబంపినది మిగులవింతయయియున్నది. మంత్రబలముచే తృణము బ్రహ్మాస్త్రమగునట్లు నేనామహాత్ముని యనుగ్రహబలిమిచే ఈబ్రాహ్మణుని మనోరథముపూర్తిచేసెదనని చెప్పి పదునొకండువృత్తముల నొకపత్రమున వ్రాసి యాపత్రము నొకటెంకాయతోడ బ్రాహ్మణుని చేతికిచ్చి విప్రోత్తమా! యీవృత్తములను పఠింపుము. ఈనారికేళమును ఇతరులకీయక నీవే భుజింపుము. నీకిష్టసిద్ధియగునని చెప్పెను. ఆబ్రాహ్మణుఁడు భాగ్యహీనుఁడు కాన తుకారాంస్వామివాక్యమును విశ్వసింపక యానారికేళమును భుజించుటచేతను, మహారాష్ట్రభాషయందు వ్రాయఁబడినవృత్తములను పఠించుటచేతను నాకెట్లు పాండిత్యము సిద్ధించునని చెప్పి యతఁడనుగ్రహించియిచ్చినవాని నతనికెదుటనుంచి తనయూరికి పోయెను. వీనికి ప్రాప్తిలేదని తుకారాంస్వామియూరకయుండెను. ఇట్లుండ శివాజిరాజు తనయాస్థానమునసుండు పౌరాణికుఁడగు బ్రాహ్మణుని పుత్రుఁడు నిరక్షరకుక్షియయి, సభకనర్హుఁడైయుండెను. అట్టివాఁడు తుకారాంస్వామి వైభవమును విని వారియొద్దకువచ్చి యామహాత్మునికెదుట బద్ధాంజలియై, వినీతుఁడయినిలుచుండెను. సర్వజ్ఞుఁడగుతుకారాంస్వామి యతనిమనోరథము నెఱిఁగి ఆళందిబ్రాహ్మణుఁడు తనకు వలదని యుపేక్షించిపోయినవస్తువుల నీబ్రాహ్మణునికిచ్చెను. ఆబ్రాహ్మణుఁడు మహాప్రసాదమని పుచ్చుకొని తుకారాంస్వామి చూచుచుండ ఆనారికేళమును భుజించియతఁడు రచించినపదునొకండువృత్తములను జదివి మననముచేసి తుకారాంస్వామియనుమతిని జెంది తనయూరికిఁబోయెను. ఒకనాఁడు రాజసభయందు పురాణపఠనము జరుగుచుండఁగా ఈబ్రాహ్మణుఁ డచటికిపోయి వినుచుండి యచటివిద్వాంసులకందఱికిని స్ఫురింపకుండినగొప్పయర్థమును తానుపన్యసించెను. ఇదిచూచి యందఱు

నాశ్చర్యపడి నిరక్షరకుక్షియగువీనికీయంత ప్రతిభాపాండిత్యప్రభావ మెట్లుకలిగెనని తమలో శంకించుచుదీనికిఁ గారణమేమనఁగా ఆబ్రాహ్మణుఁడు తుకారాంస్వామియనుగ్రహముచే నాకుఁగలిగెనని చెప్పెను. పురాణముచెప్పుచుండిన విద్వాంసుఁడీబ్రాహ్మణుని బిలిచి తనచేతిపుస్తకమునితని చేతికిచ్చి నీవుచదివియర్థముచెప్పుమనఁగా అతఁడట్లుచేసెను. అపుడా సభయందుండిన విద్వాంసులెల్లరు నిట్టియుపన్యాసమిదివఱకెందును వినియెఱుంగమనియు, వీనివిద్యాసామర్థ్యమద్వితీయమయియున్నదనియు చెప్పి యిందునకుమూలకారణముగు తుకారాంస్వామి వైభవమును వేవిధములఁ గీర్తించిరి. అపుడు నించపటినుండి రాజసభకు వచ్చియుండిన కొందఱుశాస్త్రులు తుకారాంస్వామిని జూడవలయుననునపేక్షతో అతనిఁదోడ్కొనిరమ్మని యొకమనుష్యునిఁబంపిరి. ఆతఁడు దేవునగరమునకుఁబోయి తుకారాంస్వామికి వందనముచేసి యతఁడనేక సాధుజనులతోఁగూడి చేయుచుండిన హరికీర్తనమును వినియచటనుండువారలవలె తానునుమయిమఱచి యానందపరవశుఁడయికీర్తనముఁ జొక్కి తానువచ్చిన కార్యమును తుకారాంస్వామికి విన్నవింపకుండెను. అచటనుండిన జనులాబాలవృద్ధముగ భగవన్నామసంకీర్తనామృతమునుఁగ్రోలి లోకమును మఱచి చిత్రప్రతిమలయట్లుండిరి. దివటీపట్టువాఁడుసయితమిట్టియవస్థనుజెంది తనచేతిదివటీని పైకెత్తఁగాపందిటనిప్పుతగిలి యదికాలుచుండెను. కీర్తనమునువినుచు నానందపరవశులైయుండిన యచటివారెల్లరుదీనినెఱుఁగకుండిరి. ఇట్లుండ గోదావరీతీరవాసియు, జ్ఞానవైరాగ్యభూషణుఁడునగు శేకుమహ్మదనుమూదిగవాఁడు, హరికీర్తనముచేయుచుండు నపుడు దేవుపట్టణమున తుకారాంస్వామి హరిభజనచేయుచుండుచోట పందిటికినిప్పుతగిలియదికాలుచున్నదని యెఱిఁగి తనచేతులనొకదానితోనొకటి ఱాచుకొనుచుండెను. అపుడచటనుండిన సాధుజనులు నీవున్నట్లుండి చేతులనుఱాచుకొనుటకు కారణమేమనియడుగఁగా అతఁడు ఓసాధువులారా! దేవునగరమునందు తుకారాంస్వామి హరినామసంకీర్తనముచేయుచోట చిన్నలును, పెద్దలునుగూడి వినివిని చొక్కి మయిమఱచి పరవశులయియుండ నిపుడే దివటీనిప్పుదగిలి పందిలికాలుచుండ దానినినాచేతులతో ఱాచిఱాచిచల్లార్చితినని చెప్పెను. అదివిని యెల్లరునాశ్చర్యపడి తోడనే దేవునగరమునకొకసేవకునినిబంపి యచటపందిలికిఁదగిలిననిప్పునుజల్లార్చియుండుటను వానివలనవిని విస్మితచిత్తులయి శేకుమహ్మదునుజూచి దేవునగరమునకలిగినయగ్నిభయమును నీవెట్లెఱిఁగితివి. ఆయగ్నిని నీవుచల్లార్పవలసినపనియేమి? సర్వజ్ఞుఁడయి సర్వశక్తుఁడగు శ్రీపండరినాథుఁడు తుకారాంస్వామికిఁగలిగిన యాపదనెఱిఁగియతనిని రక్షింపలేఁడాయనియడిగిన శేకుమహ్మదు ఆసాధుజనులనుజూచి మీయనుగ్రహబలముచే నేను దేవునగరమందలివృత్తాంతము నెఱిఁగితిని. శ్రీపాండురంగనాథుఁడు తుకారాంస్వామికీర్తనమునువినుచు తన్నుఁదామఱచి తద్గతచిత్తుఁడయియుండుటచేనతనిసర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వములిపుడు ప్రయోజనకరములుకాకపోయినవి. అనిచెప్పెనదివినియచటివారెల్లరుబ్రహ్మానందమును జెంది సాధుజనులప్రభావమును సాధుజనులే యెఱుంగుదురని చెప్పి శేకుమహ్మదునకు సాష్టాంగవందనముచేసి యతనివైభవమును వేవిధంబుల స్తుతించుచుండిరి.

ఇట్లుండ శివాజీరాజునాస్థానమున నుండిన నించపటివాసులగు బ్రాహ్మణులు తుకారాంస్వామినిబిలువఁబోయిన మనుష్యుఁడు రాఁడయ్యెనని మఱియొకమనుష్యునిఁబంపిరి. వాఁ

డును దేవునగరమునకుఁబోయి మొదటఁబోయినమనుష్యుని సాయుజ్యావస్థను జెంది మఱలి రాఁడయ్యెను. సించపటిబ్రాహ్మణులు మఱియొకనిఁబంపిరి. వీనిగతియును మునుపటివారియట్టిదే యయ్యెను. తుకారాంస్వామిగోష్ఠి పునరావృత్తిరహితమగునిత్యవిభూతికి సదృశమయి యుండెను. నిత్యవిభూతికిఁబోవువారు భగవంతుని పరమసామ్యమును జెందునట్లు తుకారాంస్వామి గోష్ఠికివచ్చిన శ్రీపాండురంగఁడచ్చటి భాగవతులపరమసామ్యమును జెందెను. సించపటిబ్రాహ్మణులు తమచే పంపఁబడినమనుష్యులు ఇద్దరును మఱలిరానందునకు కారణము నెఱుఁగక తమలోనిట్లని చెప్పుకొనిరి. మనము పంపినమనుష్యులు తుకారాంస్వామి కీర్తనమునకుఁజొక్కి తాము పోయినకార్యమును మఱచి యుందురనితోఁచుచున్నది. ఇఁక నెందఱినిబంపినను వారలును మునుపటి వారలయట్లేయగుదురనుటకు కొంచెమైనను సంశయములేదు. కాన మనమే పోయి సంశయనివృత్తిచేసికొందమని నిశ్చయించి బయలుదేరిరి. సర్వజ్ఞుఁడగు తుకారాంస్వామి దీనినెఱిఁగి గోష్ఠితోడఁగదలివచ్చుచు సించపటిబ్రాహ్మణులను దారిలో నెదుర్కొని బ్రాహ్మణగోష్ఠికి వందనముచేసి యోమిత్రులారా! నాజీవితేశుఁడగు లక్ష్మీకాంతుఁడు (దైవాధీనంజగత్సర్వం । మంత్రాధీనంతుదైవతం । తన్మంత్రంబ్రాహ్మణాధీనం। బ్రాహ్మణోమమదేవతా) అనఁగా జగమంతయు దైవాధీనమయియుండును. ఆదైవము మంత్రమునకధీనమయియుండును. ఆమంత్రము తన్మననముచేయు బ్రహ్మనిష్ఠుని యధీనమయియుండును. కావున నట్టిబ్రహ్మనిష్ఠుఁడు నాకు దేవతయైయుండునని చెప్పెను. అందుచే బ్రహ్మనిష్ఠులరగు మీరు మద్దేవతలగుచున్నారు. ఇట్టిమీరు నాపైఁగరుణించి పదార్థము కాని నన్నొకపదార్థముగ భావించి సేవయొసంగితిరి. కాననేను సర్వవిధముల మీయనుగ్రహముచే కృతార్థుఁడనైతినని విన్నవించెను. సించపటి బ్రాహ్మణులతని సవినయాలాపములకు నెంతయు సంతసించి యతని నాలింగనముచేసికొని యోమహాత్మా! నీదర్శనమును గోరి మేము వచ్చుచుండఁగా శ్రీపాండురంగఁడు నిన్నిచటికిఁదెచ్చి మామనోరథమును పూర్తిచేసెను. మాకుఁగలిగిన సందేహమును నీవు నివర్తిచేయవలయునని ప్రార్థించుచున్నాము. అత్యంతము క్రూరమగు నీకలికాలమున నీవనేకయద్భుతములను జూపుచున్నాఁడవు. మేము నీవైభవమును విని యాశ్చర్యపడి నీవెవ్వఁడవోయని శంకించెదము. సామాన్యమనుష్యునకింతయోగ్యత కలిగియుండదని తలఁచెదము. నీవు మాసంశయమును విచ్ఛేదముచేయవలయునని చెప్పిన విని తుకారాంస్వామియొకకత్తినెత్తి తనతొడనుగోసిచూపెను. అందురక్తమాంసములులేక మిగులధావళ్యమగు దూదికి సదృశమగు పదార్థము చర్మావృతమయి యుండునట్లు వారలకగపడెను. అప్పుడా బ్రాహ్మణులాశ్చర్యపడి పాంచభౌతికమగు మనుష్యశరీరము రక్తమాంసాదులతోఁగూడి హేయమయియుండును. నీశరీరము పంచోపనిషన్మయమని తోఁచుచున్నది. కాన రక్తమాంసాదులులేక నీశరీరాంతర్గతపదార్థమత్యంతధావళ్యమయి, మిగుల పరిశుద్ధమయి, యతిమనోహరమయియున్నది. ఇట్టినిన్ను మాయవివేకముచే మనుష్యసామాన్యునిఁగఁదలఁచితిమి. అనిచెప్పి తుకారాంస్వామికి సాష్టాంగవందనముచేసిరి. తుకారాంస్వామి యాబ్రాహ్మణులకు దండవత్ప్రణామంబుచేసి నాప్రాణనాథుఁడగు శ్రీరుక్మిణీకాంతునికి వందనీయులరగు మీరు నాకువందనముచేయుట న్యాయముకాదు. నాయందలి కామక్రోధాదిదుర్గుణంబులు నశించి నేను పరమవైష్ణవలక్షణమగు వైరాగ్యాద్యాత్మగుణము

లతోఁగూడియుండునట్లనుగ్రహింపుఁడని ప్రార్థించిన ఆబ్రాహ్మణులితనిఁజూచి యోవిష్ణుభక్తాగ్రగణ్యా! విష్ణుభక్తుఁడు బ్రాహ్మణునికన్న నధికుఁడగును. విష్ణుభక్తివిరహితుఁడుయతియైన నుశ్వపచాధముఁడగును. (యఃపశ్యతిశుభాచారం। వైష్ణవంవీతకల్మషం। యస్మిన్కస్మిన్కులేజాతం ప్రణమేద్దండవద్భువి) అనఁగా సదాచారవంతుఁడయి యీశ్వరవ్యాప్తిని సదానుసంధానము చేయుటచే వైష్ణవుఁడనఁబడుచు, కల్మషరహితుఁడయి యుండువాఁడే జాతియందుఁబుట్టినవాఁడయినను వానికి దండవత్ప్రణామము చేయవలయునని భగవంతుఁడు నియమించియున్నాఁడుగదా. భక్తిపూర్వకముగ మేము వందనము చేయకపోయినను శాస్త్రపరిచయము చేసియున్నవారముగుటచే ప్రమాణపరతంత్రులమయి మీకు వందనము చేసితిమి. మఱియు మేముచేయు ప్రార్థనను మీరవశ్యముంగీకరించి మావాసస్థానముగునీంచవటికి వచ్చి యచటకొంతకాలము వసించి హరికీర్తనము చేయుచు మమ్ముఁ గృతార్థులను జేయవలయునని ప్రార్థించిరి. అప్పుడు తుకారాంస్వామి మీరుకోరినట్లు చేసెదనని సమ్మతించి వారలను వెంబడించి పోవుచుండ మార్గమధ్యమున లోహనగరవాసులు వచ్చి తుకారాంస్వామికివందనము చేసి తమయూరిలో కొంతకాలము వసింపవలయునని ప్రార్థించి పిలుచుకొనిపోయిరి. తుకారాంస్వామి యచటవసించి హరికీర్తనము చేయుచుండెను. ఆయూరివారు తుకారాంస్వామియందు మిగుల భక్తిచేయుచుండిరి. ఇట్లుండ నొకవిద్వాంసుఁడు తనశిష్యులతోడనాయూరికివచ్చెను. అపుడాయూరివారు సూర్యోదయమయ్యును లేవక నిద్రించుచుండిరి. దీనికికారణమేమని విద్వాంసుఁడు విచారింపఁగా వారలతనిఁజూచి తుకారాంస్వామియనుమహాత్ముఁడొకమాసముగ నీయూరిలో వాసము చేయుచు శ్రీహరికీర్తనము చేయుచున్నాఁడు. మేము రేయియంతయు ఆకీర్తనానందము ననుభవించుచుండినందున మమ్మిపుడు నిద్రబాధించుచున్నదని చెప్పిరి. అది విని విద్వాంసుఁడు పరమవైరాగ్యనిధియగు తుకారాంస్వామికీర్తనానందము ననుభవించువీరలకు నావిషయమున ప్రీతికలుగుట దుర్లభము. ఇపుడీయూరిలో నాకేమియు ప్రయోజనము సిద్ధింపదు. నేను మఱియొకయూరికి పోయెదనని తనలోనిశ్చయించి బయలుదేరిపోవుచుండెను. ఈవృత్తాంతమును విని తుకారాంస్వామి వచ్చి యావిద్వాంసునినిమిక్కిలి గౌరవించి యీయూరికివచ్చిన నీవిచ్చటఁగొన్నాళ్లునిలువక బయలుదేరిపోవుటకు కారణమేమి? నీవెందుండి యెందుకయి యిచటికివచ్చితివని యడిగిన, ఆవిద్వాంసుఁడిట్లనియె. నేను పండరిపురమున వసించువాఁడను. నాకుమారునికి వివాహము చేయనుద్దేశించి ద్రవ్యార్థినయి వచ్చితిని. జ్ఞానవైరాగ్యనిధివగునీకీర్తనామృతమును గ్రోలువారికి కేవలదేహపోషణపరుఁడనగు నాయందు ప్రీతిగలుగదని తలఁచి మఱియొకయూరికిపోవుచున్నాఁడనననిన విని తుకారాంస్వామి యావిద్వాంసునిని వెంటఁబెట్టుకొని వచ్చి యతనిచే కొంతభగవత్కీర్తన చేయించి యాయూరివారలనుజూచి యితఁడు మహానుభావుఁడు. పండరిక్షేత్రవాసియగుటచే నితనిని సాక్షాత్పండరినాథునిఁగ భావించి భక్తిచేయుఁడు. ఇతఁడుతన కుమారునికి వివాహము చేయనుద్దేశించి ద్రవ్యార్థియయి మీయొద్దకు వచ్చెను. మీభాగ్యము మంచిది. ఇట్టిమహాత్మునికి సహాయము చేసిన శ్రీపాండురంగఁడు సంతోషించును. మీరందఱును మీకలిమికిఁదగినట్లు. మూడుతరగతులయి మొదటితరగతివారిలో నొక్కొక్కఁడు మూఁడేసిరూకలును, రెండవతరగతివారిలో నొక్కొకఁడు రెండేసిరూకలును, మూఁడవతరగతివారి

లోనొకొక్కఁడొక్కొక్కరూకయును, ఈమూఁడుతరగతులయందుఁజేరనిబీదలు యథాశక్తి కించిత్కారమును దెచ్చియొకమొత్తముగఁజేర్చియావిద్వాంసునకిండు. ఇందుచే శ్రీపండరినాథుఁడు మిగులసంతోషించునని చెప్పినవిని వారలు తుకారాంస్వామి నియమనమును శిరసావహించి యాసాధుజనాగ్రేసరునిఁజూచి యోస్వామీ! దేవరవారినాశ్రయించిన విద్వాంసునికి మనోరథమును మేమేపూర్తిచేసెదము. ఇతఁడు యాచకమునకయి మఱియొకచోటికిపోనేలయని విన్నవించియందఱునొకచోటగుమిగూడి తమకలిమికొలఁది మూఁడు తరగతులుగవిభజనమై మొదటితరగతివారు మూఁడేసిరౌప్యములును, రెండవతరగతివారు రెండేసిరౌప్యములును, మూఁడవతరగతివారొక్కొక రౌప్యమును, ఈతరగతులయందుఁ జేరనిబీదలు యథాశక్తి కించిత్కారము నిచ్చునట్లు తమలోనిశ్చయించుకొని యొకపత్రికలో లెక్కవ్రాసిద్రవ్యమును జేర్చి తెచ్చి తుకారాంస్వామియెదుటనిలిచి యోస్వామీ! యీద్రవ్యమును దేవరవారిచేతులతో నీవిద్వాంసునికిండని ప్రార్థించిరి. కొందఱు దుష్టులుమనముద్రవ్యము నిచ్చువారమయియుండ తుకారాంస్వామి తనచేతులతోనీద్రవ్యమును విద్వాంసునికిచ్చి ప్రతిష్ఠవహించుట న్యాయముకాదని తమలోననుకొనిరి. సర్వజ్ఞుఁడగు తుకారాంస్వామి యీకుటిలచిత్తులతలంపునెఱిఁగి వారలనుజూచి యీయూరివారందఱును యథాశక్తికించిత్కారమిచ్చిరాయనియడిగెను. అందుకువారిట్లనిరి. ఓమహానుభావా! అందఱునిచ్చిరి. ఒకఁడుమాత్రమీయలేదు. వాఁడు గుడ్డలవ్యాపారముచే దేహయాత్ర గడపుకొనుచున్నాఁడు. మిగులదుష్టుఁడు. అతనికి లేశమయినను భగవద్భక్తిలేదు. అనవరతము భాగవతులను దూషించుటయే వానికి కాలక్షేపమయియుండును. వాఁడొకఁడు తప్పఁదక్కిన వారందఱును యథాశక్తిద్రవ్యమునిచ్చిరని చెప్పఁగావిని తుకారాంస్వామి మీలో కొందఱు వానియొద్దకుపోయి నాప్రార్థనగచెప్పి యతనిశక్తికిఁదగిన కించిత్కారమునిమ్మనియడిగి తీసికొనిరండని నియమింపఁగా వారలుమంచిదనివానియింటికిపోయి వానికెదుట నిలిచిరి. వాఁడువీరలతోమాటలాడక స్వకార్యముమీఁదనే దృష్టిగానుండెను. అపుడు వీరలకవమానమయి యీదుష్టునియొద్దకుమనమురాఁదగదు. అయినను తుకారాంస్వామి నియమనమును మీనికెఱిఁగింతమని తమలోననుకొని వానిఁజూచి మహానుభావుఁడగుతుకారాంస్వామి నియమనమును వానికెఱిఁగించిరి. వాఁడదివిని నంతట కోపగించుకొనియాతుకారాం అహోరాత్రముకప్పవలెనఱచుటనుజూచి మీరు భ్రాంతులరయిస్వకార్యములను మఱచి యతనివెంటఁదిరుగుచున్నారు. నేను మీవలె పిచ్చివాఁడనుగాను. నేను కష్టపడిసంపాదించిన ద్రవ్యమునఒక్కకాసునయినను మఱియొకనికీయను. మీరువచ్చినదారిచూచుకొనిపొండని చెప్పెను. అపుడు బుద్ధిశాలినియగువానిభార్యతనభర్తనుజూచి ధర్మమునకయివచ్చినవారిమీఁద కోపగింపకుము. నా స్త్రీశబ్దముచెప్పక యేదియైననిచ్చిపంపుట మంచిది. అట్లిచ్చిపంపుటకిష్టములేదేని నిష్ఠురములాడక మంచిమాటలుచెప్పిపంపుము. (చత్వారోవిత్తదాయాదాః। ధర్మభూపాగ్నితస్కరాః। జ్యేష్ఠభ్రాత్రపమానేన। త్రయఃకుర్వంతిసోదరాః) అనఁగాద్రవ్యమునుపంచుకొనుటకు నలుగురుదాయాదులయియున్నారు. అందుమొదటివాఁడుధర్మము, రెండవవాఁడురాజు, మూఁడవవాఁడగ్ని, నాలుగవవాఁడుచోరుఁడు. ఈదాయాదులు పురుషునిచే సంపాదింపఁబడినద్రవ్యమునుపంచుకొనువారయియున్నారు. ఇందుమొదటివాఁడగుధర్మమును

పేక్షించిన జ్యేష్ఠభ్రాతకువచ్చినయవమానమును సహింపక కోపగ్రస్తులయి తక్కినమువ్వురు వీనిద్రవ్యమును నాశముచేయుదురు. కాన బుద్ధిమంతులు ధర్మమునకధికభాగము నిత్తురు. ఇందుచే తక్కినజ్ఞాతులు ముగ్గురును సంతోషించి తమభాగమునుగోరకుందురు. లోభియగు వాఁడు ధర్మమునుచేయక తాననుభవింపక పూడ్చిపెట్టు ద్రవ్యము పరులపాలగును. ఆద్రవ్యమునకయివీనిచేఁ జేయఁబడిన పాపముమాత్రము వీఁడేలోకమునకుపోయినను వీనినివిడువక వెంబడించివచ్చును. నరకానుభవముచేయునపుడు వీఁడుచేర్చిపెట్టినద్రవ్యమును ఆద్రవ్యమునను భవించువారును వీనినిరక్షింపఁజాలరు. కాన బుద్ధిమంతులు అనర్థావహమగునర్థమునుగౌరవింపరు. (జాతస్యహిధ్రువోమృత్యుః) అనురీతిని పుట్టినవానికి మరణముతప్పదు. ఇప్పుడోలేకయెప్పుడో మరణముకాచియున్నది. తోళ్లనుగొఱుకు కుక్కలకు ఘృతమురోచకమయియుండును. మనుజుఁడు మరణమును జెంది వానిశరీరము శ్మశానమునకుఁగొంపోవఁబడునపుడు వాఁడుసంపాదించినద్రవ్యమున నొకటిరెండుకాసులనయినను వానిశవముతోడ పాడెయందుంచరు. బంధువులందఱు శ్మశానపర్యంతము వెంబడించి శవమునగ్నికాహారము చేసిమఱలివత్తురు. ఇదియంతయు నెఱిఁగియుండియు లుబ్ధులగువారు పాపబలముచే ధర్మమునుద్వేషించుచున్నారు. తుక్కారాంస్వామిమహానుభావుఁడు. అతనినొక్కతూరిస్మరించిన మాత్రాన మనపాపములన్నియు నశించును. అట్టిమహాత్ముఁడు నీపూర్వజన్మసుకృత విశేషముచే నిన్నొకపదార్థముగభావించి నీయొద్దకువీరలనుబంపెను. నీకమృతముచేఁదయియున్నది నేనేమిచేయుదునని కన్నీరువిడిచిశోకించెను. దానినంతయువిని యోసీ! యేమివదరుచున్నదానవు. వీరలకుఁబట్టినపిచ్చి నీకునుబట్టెఁగాఁబోలు. ఎవరేమిచెప్పినను నేనొకగవ్వనయిన నీయను. గృహస్థుఁడు తనభార్యనుద్వేషించినయెడ వానికిసుఖములేదు. కాననీతోపోరాడుటకు నేనుశంకించెదను. నీకంతయిష్టమయిన నీయొద్దనుండెడియోటిచెంబునువీరికిమ్మనిచెప్పిన ఆయువతిసంతసించియిందుకయినననుమతించితివిగదా. మనమందఱముసుకృతార్థులమయితిమనిచెప్పుచు ఆయోటిచెంబునుదెచ్చి. యోభాగ్యవంతులారా! కృపానిధియగు తుక్కారాంస్వామియీయోటిచెంబును స్వర్ణపాత్రముగా నంగీకరింపవలయుననివారల చేతికిచ్చి తుక్కారాంస్వామివేంచేసియుండు దిక్కునుద్దేశించి వందనముచేసెను. వారలాచెంబుతీసికొనివచ్చి తుక్కారాంస్వామిచేతికిచ్చిరి. వారిచేయితగిలినంతట అదిలోకోత్తరమగుస్వర్ణపాత్రమయియుండెను. తుక్కారాంస్వామి వారలనుజూచి మీరావర్తకుఁడు పరమలుబ్ధుఁడనిచెప్పితిరి. అట్టివాఁడెట్లు స్వర్ణపాత్రమునిచ్చెననిన అదిచూచివారలాశ్చర్యపడియాచెంబునుబరీక్షింపఁగా అదిపదివన్నెబంగారుచెంబయియుండెను. అపుడు వారలందఱును తుక్కారాంస్వామినిఁజూచియోస్వామీ! వాఁడుపరమలుబ్ధుఁడనుటసత్యము. ఒక్కగవ్వనయిన నీయనని చెప్పెను. పరమపతివ్రతయగు వానిభార్య వానినిబహువిధములఁ బ్రార్థించెను. వాఁడుకోపాతురుఁడు. కానభార్యమనసును సంకటపఱుపఁగూడదని యోచించి నాచేతితో నేనేమియునీయను. నీకంతయిష్టమగునేని నీయొద్దనుండెడియోటిచెంబు వీరలకిచ్చిపంపుమనిచెప్పెను. అపుడాసాధ్వియీచెంబునుమాచేతికిచ్చి దీనిని కృపానిధియగు. తుక్కారాంస్వామి పెద్దచేసిస్వర్ణపాత్రముగా భావించియంగీకరింపవలయునని చెప్పి [illegible] పరవారువేంచేసియుండు దిక్కునకభిముఖరాలై వందనముచేసెను. ఆపతివ్రతప్రార్థన [illegible]

యామెకోరినట్లంగీకరించితిరి. సాక్షాత్పండరినాథుఁడు దేవరవారిరూపముగవచ్చియుండఁగా అఘటితములు ఘటించుట యొకవింత కాదనివిన్నవించిరి. తుకారాంస్వామి యావిద్వాంసునిఁ గూర్చుండఁబెట్టిచందన, పుష్ప, తాంబూల, వస్త్రంబులనిచ్చి స్వర్ణపాత్రమును, అయూరివారిచ్చిన ద్రవ్యమును అతనిచేతికిచ్చియుపచరించియోవిద్వాంసుఁడా! పండరిపురమునుండివచ్చిననీవు మాపాలిపండరినాథుఁడవైయున్నాఁడవనిచెప్పియతనికానందమునుగలుగఁజేసి పండరిపురమునకుఁబంపెను. పిదపతానాయూరివారియనుమతినిఁ జెందినంచవటికిఁబోయి భగవత్కీర్తనముచేయుచు నచటఁగొన్నాళ్లువసించి యచ్చటిబ్రాహ్మణులనుసంతోషింపించి యచ్చోటు విడిచి బయలుదేరి దేవునగరమునకువచ్చెను.

ఒకనాటిరాత్రి తుకారాంస్వామికి స్వప్నమయినవిభవమెట్టిదనఁగా—ఈమహానుభావుఁడింద్రాణినదికి స్నానమునకు పోయినపుడు పండరినాథుఁడొకబ్రాహ్మణునిరూపముధరించి యతనికెదుటవచ్చినిలిచెను. తోడనే తుకారాంస్వామి స్నానముచేసి ధౌతవస్త్రమును ధరించియాబ్రాహ్మణునికివందనముచేసియోస్వామీ! నాపూర్వజన్మసుకృతపరిపాకముచే శ్రీపండరినాథుఁడు నీరూపముగావచ్చి నేఁడునాకతిథియయ్యె. కాననాయందుకృపయుంచి నాయింటికివిజయంచేసి భుజించి నన్ను ధన్యునిఁజేయవలయునని ప్రార్థింప అదివినియాబ్రాహ్మణుఁడు అయ్యా! నేనుమంచిభోక్తను. కాననాకుపూటకుపావుసేరునేయిపోయుదువేని నీయింటభుజించెదనని చెప్పెను. అందుకుతుకారాంస్వామిసంతసించియావిప్రునినితనయింటికిఁ బిలుచుకొనివచ్చి తనభార్యనుజూచి యోయతివా! శ్రీపండరినాథుఁడీబ్రాహ్మణునిరూపముధరించి మనయింటికతిథియయి విజయంచేసెను. ఇతనికిమనయింటఁగలయన్నమునునిచిపావుసేరునేయి పోయుమనిచెప్పెను. అపుడాయువతి యాబ్రాహ్మణుఁడెచటినుండివచ్చెను. కాలుసేరునేయినేనెచటికిపోయి తెత్తుననిచెప్పఁగావినియాబ్రాహ్మణుఁడదృశ్యుఁడయ్యెను. ఇట్లు స్వప్నముకని తుకారాంస్వామి మేల్కనిస్వప్నమునుజింతించి నాప్రాణనాథుఁడగు పండరినాథుఁడు కోరినపదార్థమును సమర్పింపక భాగ్యహీనుఁడనయితినని శోకించి భగవంతునిఁగీర్తించుచు ఆదేవుఁడు తనకుస్వప్నమునసాక్షాత్కరించిన మాఘశుక్లదశమితోఁగూడినగురువారమును పలుమాఱుస్మరించుచుండెను.

కొందఱసూయాపరులగుబ్రాహ్మణులు ఈతుకారాంస్వామి రచించు గ్రంథము భక్తిమార్గమునకనుకూలమై, కర్మమార్గమునునాశముచేయుచున్నది. కాననీగ్రంథములకట్టలనుతీసికొనిపోయి నీటవరదలోవేయుదమని నిశ్చయించి యాగ్రంథములనన్నింటినిమొకకట్టగఁగట్టికొనిపోయి నీళ్లలోవేసివచ్చి తుకారాంస్వామినిజూచి నీవు రచించిన గ్రంథములను నీళ్లలోవేసితిమి. అదిపదుమూడుదినములు నీళ్లలోతడియకతేలుచుండిన నీవువ్రాసినదభగవంతునికి సమ్మతియనినమ్మెదమనిచెప్పిపోయిరి. అదివిని తుకారాంస్వామి ఖేదమునుజెంది పండరినాథా! నీనియమనమును శిరసావహించి నామదేవునిసంకల్పమునకొఱఁతపడినవృత్తములనువ్రాసితిని. దానినీబ్రాహ్మణులు నీళ్లలోవేసిరి. నాయందావేశించి నిన్నునీవేస్తుతించుకొంటివి. నీవుచెప్పినవృత్తములను నీవేకాపాడుమని చెప్పి భగవన్నామస్మరణముచేయుచుండెను. అపుడు పండరినాథుఁడొకబాలుఁడయి వచ్చితుకారాంస్వామిని జూ

చి నీకు చింతతోపని లేదని చెప్పి యదృశ్యుఁడయి నీటియందు పాఱవేయఁబడిన గ్రంథములను తడియకుండునట్లు కాపాడుచుండెను. పదుమూడుదినములయిన పిదప నా బ్రాహ్మణులు పోయి చూడఁగా తాము నీటవేసిన పుస్తకములు తడియక నీటిపై తేలుచుండెను. అదిచూచి వారలాశ్చర్యపడి విష్ణుభక్తుని విషయమున నపచారపడితిమని యనుతపించి యా గ్రంథములను దెచ్చి తుక్కారాంస్వామికెదుర నుంచి యపరాధక్షాపణము చేసికొనిరి. అపుడు తుక్కారాంస్వామి యానందభరితుఁడయి స్తోత్రము చేయుచు శ్రీపాండురంగని సన్నిధికిఁబోయి శ్రీరుక్మిణీకాంతు నాలింగనము చేసికొని తనమనస్సును భగవంతునియందు లయింపించి పుండరీకవరదుని కటాక్షముచే నిజశరీరముతోడ శ్రీవైకుంఠమునకుఁబోయెను. ఈ మహానుభావుని మహిమను వర్ణించుటకు శ్రీపాండురంగఁడు తప్ప నితరులకు సాధ్యము కాదు. తుక్కారాంస్వామి శ్రీవైకుంఠమును జెందియు ననేకభక్తులకు స్వప్నమున సాక్షాత్కరించి యుపదేశించుచుండెను.

మోక్షప్రదాయనమః.

## ఏఁబదిమూడవయధ్యాయము.

### బోసలబావాచరిత్రము.

శ్రీపండరిపురమునకు సమీపమున పాల్గాటుపట్టణమున నొకకాఁపువాఁడు మిగుల సాధువై భగవద్భక్తుఁడై యుండెను. వానికి మాణుకోశిబోసలయనునది పట్టుపేరయి యుండెను. వానిభార్య పేరు మమతాబాయి. ఈమె మహాపతివ్రతగాన భర్తృశుశ్రూషయందేమరక సంసారము చేయుచుండెను. వీరలకు ఏఠూజియను నొక పుత్రుఁడు కలిగెను. వీఁడు బాల్యము నుండియే మహావిరక్తుఁడయి దేనిని పాటింపక యుండెను. వీనిభార్య పేరు భాగీరథీబాయి. ఈ నలువురును సంసారమునందుండియు పరమవైరాగ్యశీలులయి పరమభక్తియుక్తులయి శ్రీపండరినాథుని ననవరతము ధ్యానించుచు దీనులను బోషించుచు యాచకుల నభీష్టపదార్థప్రదానముల చే సంతోషింపించుచు ప్రతిపక్షమునందును ఏకాదశికి పండరిపురమునకుఁబోయి పుండరీకవరదునిని దర్శించి నాఁడంతయు నుపవసించి ద్వాదశిదినమున నపరిమితముగ భోజనముచే నతిథులను, దీనులను సంతోషింపించి విఠ్ఠలనాథునికి ఆనందముగలుగఁజేయుచునుండిరి. బహుకాలమిట్లు జరగుచుండఁగా ఆదేశమునందు అనావృష్టిచే క్షామము సంభవించెను. అందుచే జనులందఱును అన్నమునకు లేక బాధపడుచుండిరి. వీరలుపడు బాధలను జూచి బోసల అనుతాపయుక్తుఁడయి తనభార్యనవలోకించి యోసఖీ! వినుము. ఈ కాటకముతొలఁగి దేశమునకు నెమ్మదిగలుగువఱకు ఆఁకలియని వచ్చినవారికి రాత్రియైనను, పగలైనను విరామము లేక విసుగక భూతదయగలిగి నాస్తిశబ్దము నీనోట రానీయక యన్నము పెట్టుచుండుము. ఎండిన చెట్లునకు నీళ్లుపోయుటయు, ఆఁకలిగొన్నవారికి నన్నమిడుటయు, వస్త్రము లేక చలిచే పీడింపఁబడువారికి వస్త్రమిచ్చుటయు, రోగార్తులకు నుపచారము చేయుటయు, బీదలకు ఇల్లుకట్టియిచ్చుటయు, నట్టివారికి వివాహము చేయించుటయు, బీదలైనవారిశిశువులకు విద్య నేర్పుటయు, నహంకారమమకారగ్రస్తులకు వైరాగ్యమును గల్పించుటయు, క్రోధయుక్త

లకు శాంతినికల్పించుటయు, అసత్యవాదులకు సత్యము గఱపుటయు, భగవద్విముఖులకు భగవద్భక్తినిగలుగఁజేయుటయు ననునివి భగవంతునికి ముఖ్యారాధనములయి యుండును. ఇవిలేకచేయుజప, తప, యజ్ఞాదులును, ఆలయ, తటాక, వన, ప్రతిష్ఠలును మోక్షసాధకములుకానేరవు. రసములలోలవణమును, అవయవములలోశిరమును, ఇంద్రియములలో నేత్రములును, నెట్లుప్రధానమోయట్లు ఆత్మగుణములలో ఆనృశంస్యముప్రధానమయియుండును. (ఆనృశంస్యంపరోధర్మః) అనిశాస్త్రముచెప్పుచున్నది. కాఁబట్టియీకాలమున క్షుధాతురులగు సర్వజనులను నీబిడ్డలయట్లు భావించి యాదరింపుమని చెప్పిన ఆమెభర్తృశాసనమును శిరసావహించి మిగులజాగరూకురాలయి దీనజనులను అన్నపానాదులచేతృప్తిపఱుచుచువచ్చెను. ఈవృత్తాంతమునువిని పెక్కుదేశములయందుండు దీనజనులు బోసలయింటికివచ్చుచుండిరి. ఎందఱువచ్చినను మమతాబాయియించుకైనను చలింపక కనికరించివారలనాదరించుచుండెను. ఇట్లుండియువారేకాదశినాఁడుపండరిపురమునకుపోవుటనుగాని, అచటద్వాదశినాఁడుతదీయారాధనముచేయించుటనుగానివిడువకుండిరి. ఇట్లు జరగుచుండఁగాకొన్నాళ్లలో తనకుఁగలద్రవ్యమంతయు నెలవయినందున బోసలతనయింట నుండినయాభరణములుమొదలగువానినివిక్రయించిదీనులకువినియోగించెను. అంతకుమీఁద పసువులు, గుఱ్ఱములుమొదలగువానినివిక్రయించి బీదలకన్నమిడెను. ఇట్లుతనసర్వస్వమును దీనజనులకువినియోగించి కొన్నాళ్లలో బోసల దరిద్రుఁడయ్యెను. ఇట్టికాలమునబోసల చలింపక ధైర్యమును, ఉత్సాహమునవలంబించికూలిపనిచేయుచు నందువలననార్జించినద్రవ్యమును బీదలకును, తనకుటుంబమునకును ఉపయోగపఱుచుచు ననవరతము శ్రీపాండురంగనినిధ్యానించుచునానందపరవశుఁడయియుండెను.

ఒకయేకాదశినాఁడు పండరిపురమునకుపోవయత్నించి తనచేతద్రవ్యములేనందున నరణ్యమునకుపోయియెండినపుల్లలనేఱితెచ్చి వానినిమూఁడుదుడ్లకమ్మి పండరిపురమునకు పోయిచంద్రభాగయందుస్నానముచేసిసంకల్పముచెప్పిన బ్రాహ్మణునికొకదుడ్డుదక్షిణయిచ్చి యొకదుడ్డునకుఅరఁటిపండ్లును, ఖర్జూరఫలములును, గంధపొడినిదీసికొనిభగవత్సన్నిధినిప్రవేశించిరుక్మిణీకాంతునిదర్శించితానుకొనివచ్చినవస్తువులను భగవంతునికిసమర్పించి యుపవసించిధ్వజస్తంభముచెంతఁగూర్చుండి రాత్రినాలుగుజాములునుహరికీర్తనముచేయుచుజాగరవ్రతమునసుష్ఠించి మఱునాఁడుదయమునస్నానానుష్ఠానంబులను దీర్చికొనితనచేతనుండిన యొకదుడ్డునకు అరపడిపిండికొని చంద్రభాగతీరమునఁ గూర్చుండి తనలోతానీట్లనిచింతించెను. నేను ఈపిండినేయతిథికిత్తును. ఏయతిథిపుచ్చుకొనును. ఈయూరిలో భాగ్యవంతులనేకులు బ్రాహ్మణభోజనమువ్వారిగచేయించుచున్నారు. అనేకులుదీనులనురసవంతమగు నన్నముచేతృప్తిపఱుచుచున్నారు. ఇట్లుండవానినన్నింటినివిడిచిపెట్టి యీపిండినిభుజించుటకెవఁడువచ్చును. ఒక్కయతిథికయినను పుణ్యకాలమునందు ఆహారమునిడకనేనెట్లుభుజింతును. నేను భుజించుటముఖ్యముకాదు. అతిథిరూపియగుభగవంతునారాధింపనిదినము దుర్దినమేకానిసుదినముకాదు. అతిథులకిడకతానుమాత్రము భుజించువానికరంబులు దుఃఖకరంబులేకానిసుఖకరంబులుకావు. అనిచింతించుచుండఁగా దేవాధిదేవుఁడగు లక్ష్మీకాం

తుఁడు ఒకబీదబాపనివేషమునుబూని జీర్ణవస్త్రమునుధరించి చలిచేవడవడవడఁకుచు, బోసలయొద్దకువచ్చి యతనివందనములనంగీకరించి, యతనినాశీర్వదించి, యోసజ్జనాగ్రేసరా! నీవుబహుదినములుగ ప్రతియేకాదశియీయూరికివచ్చి ద్వాదశినాఁడనేకులను భోజనముచే తృప్తిపఱుచుచునుందువు. నేనును ప్రతిద్వాదశినీయన్నమునుభుజించిసంతోషించుచుందును. ఈయూరిలో భాగ్యవంతులనేకులు వేలకొలఁది బ్రాహ్మణులకు సమారాధనముచేయుచున్నారు. బీలక్షంతులచటికిపోయెదరు. నేను బలహీనుఁడనుగాన నచటికి పోవుటకుశక్తిలేక నీయొద్దకు వచ్చితిని. నాయాఁకలి కేమయిననిమ్మనియడిగిన బ్రాహ్మణునిమాటలకు బోసలమిగులసంతోషించి నాప్రాణేశుఁడగు శ్రీపండరినాథుఁడే నాకొఱఁతనుదీర్చుటకయి యీరూపమునుధరించి విజయంచేసెననియానందించుచు ఆబ్రాహ్మణునిజూచి యోవిప్రోత్తమా! నాయొద్ద కొంతపిండియున్నది. అందుఁజేర్చుటకు నాయొద్ద నుప్పుసయితములేదు. నేనేమిచేయుదునని చెప్పినవిని వైకుంఠాధిపతి నీచేతనుండెడిపదార్థమునిచ్చియిప్పటినాబడలికను దీర్పుము. (క్షుధాతురాణాంనరుచిర్నపక్వం) అనువాక్యమును నీవు వినియెఱుంగవేయనిచెప్పినవిని బోసలయీపిండినెవరుభుజింతురని నేనుచింతించుచుండ క్షుధాతురుఁడగు నీబ్రాహ్మణుఁడు నాభాగ్యవిశేషముచేనతిథియైవచ్చెను. ఇట్లు ఘటింపించిన శ్రీపాండురంగనాథుని కృపను నేనేమనికొనియాడుదునని చెప్పుచు తనయొద్దనుండినపిండిని ఆబ్రాహ్మణునికొంగునఁబోసెను. ఆబ్రాహ్మణుఁడాపిండిని తనజీర్ణవస్త్రమునందు ముడివేసికొని బోసలనుజూచి యోభక్తాగ్రణీ! నేనుమిగులబీదవాఁడను. నాకన్నియొకచోటులేదు. ఈయాలయమునను కమూలపాకముచేసికొనవచ్చునని యత్నించిన గుడియధికారులు నన్నచటఁజేరనీక వెళ్లఁగొట్టుదురు. కాన నేనిచటనే రొట్టెలనుగాల్చిభుజించెదను. నీవడవిపిడకలనేఱితెచ్చి యిమ్మనిచెప్పిన బోసలసంతసించి వడివడిగ నడవికిఁబోయి యెండినపిడకలనేఱితెచ్చి యాబ్రాహ్మణునికిచ్చెను. ఇంతలో నాబ్రాహ్మణుఁడొకక్రొత్తపెంకుసంపాదించి స్నానముచేసి తేమవస్త్రమును పిండికట్టుకొని నిప్పురాజవెట్టి పాకమునకుయత్నించెను. యాగభోక్తయగు దేవాధిదేవుఁడు బోసలయిచ్చినపిండిని పాకముచేయుటకు యత్నింపఁగా శ్రీరుక్మిణీదేవియొకవృద్ధబ్రాహ్మణసుమంగలివేషమును ధరించి చేతనొకకోలనూనుకొని యిసుకదిబ్బమీఁదరొట్టెలుకాల్చుటకుయత్నించుచుండు నిజనాథునియొద్దకువచ్చి యతనిఁజూచినీవిచటనొంటిగవచ్చి పాకముచేసిభుజింపయత్నించుచున్నాఁడవు. పిండినాచేతికిచ్చిన నేనురొట్టెలుకాల్చెదనని చెప్పి స్నానముచేసివచ్చి రొట్టెలుకాల్చుటకుఁగూర్చుండెను. బోసలయిది చూచి పిండికొంచెమయియున్నది. వీరిరువురియాఁకలియిదియెట్లుమాన్పునని చింతించుచుండెను. జగజ్జననియగు శ్రీరుక్మిణీదేవి యాపిండినిస్పర్శించినంతటనే యదియధికమయ్యెను. ఆయిందిరాదేవి విస్తారముగ రొట్టెలనుగాల్చిపేర్చియుంచి నిజభర్తనవలోకించి యోప్రాణనాథా! మనమిరువురమునీరొట్టెలనుబోసలతోడ భుజింపవచ్చునని చెప్పెను. బోసలవారలనుజూచి మద్దేవతలారా! మీరుభుజించిమీభుక్తశేషమును నాకొసంగవలయునని ప్రార్థించెను. అతన్నిప్రార్థననంగీకరించి యాదివ్యదంపతులు కూర్చుండి భుజించుచుండిరి. అప్పుడఖిలదేవతలాకసమునుండి యీయద్భుతమునుజూచుచుండిరి. శ్రీరుక్మిణీవాసుదేవులు భుజించిపరితృప్తులయి తమభుక్తశేషమును బోసలకిచ్చి యదృశ్యులయిరి. భగవద్భుక్తశేషమును

ప్రసాదము నిరవధికముయియుండెను. బోసలయాశ్చర్యపడి సాక్షాత్పండరినాథుఁడు శ్రీరుక్మిణీసమేతుఁడయివచ్చి యిట్లుచేసెనని నిశ్చయించి యాప్రసాదమును తాను స్వీకరించి భగవత్సన్నిధిని ప్రవేశించి చక్రపాణిని సేవించి యోభక్తవత్సలా! నేఁడు నేయి, చక్కెరలేక యుత్తరొట్టెలను భుజించి సంతోషించితివా! ఈక్షేత్రమునందనేకులు షడ్రసోపేతాన్నముతోడ సమారాధనము చేయుచుండ దాని నుపేక్షించి యీదీనునియందు కృపచేసితివిగదా? నీయాశ్రితవాత్సల్యము నేనేమనికొనియాడుదును. అనివిన్నవించిన నందనందనుఁడెంతయు నానందించి యోవైష్ణవాగ్రేసరా! అనేకులు సమారాధనము చేయుచుండినను నేనచటికిఁబోయిన వారలు నాకన్నమిడరు. వారలకు నాయందు భక్తిలేదు. డంభమునకయి పాటుపడుచున్నారు. రేపటికామర్మమును నీకు విశదపఱిచెదనని చెప్పెను.

మఱునాఁడు వర్తకుఁడొకఁడు వేయింటికి సమారాధనమునకు యత్నించి చంద్రభాగతీరమున నిసుకదిబ్బమీఁద పందిలివేసి తెరలుకట్టి బ్రాహ్మణులను గూర్చుండఁబెట్టెను. అపుడు పండరినాథుఁడొకవృద్ధబ్రాహ్మణుఁడయి జీర్ణవస్త్రమును ధరించి చేతనొకకోలనూనుకొని బోసలనుజూచి నీవు దూరమున నిలుచుండుమని నియమించి పందిటిలోప్రవేశించి నాకు మిగుల నాఁకలియయియున్నది. అన్నముకావలయునని ప్రార్థింపఁగా నచటి కార్యాధ్యక్షులీబ్రాహ్మణునిఁజూచి నీకిచట నన్నము దొరకదు. సంకల్పించిన ప్రకారము లెక్కకు సరిగా బ్రాహ్మణులు ముందే పరింపఁబడియున్నారని చెప్పినవిని లక్ష్మీకాంతుఁడు వారలనుజూచి వేవురు బ్రాహ్మణులు భుజించుచోట నాబోటివృద్ధున కొకనికన్నము నిర్వహించుట కష్టమా? నేను బడలికతో నడవఁజాలకున్నాఁడను. నాకు మూర్ఛవచ్చుచున్నదని చెప్పుచు కూర్చుండెను. అపుడావర్తకుఁడు కోపగించుకొని యీబ్రాహ్మణుఁడోగాత్యము చేయుచున్నాఁడు, వీని కిడ్డమిచ్చిన పెక్కండ్రు వీనివలె వచ్చి మనల నిర్బంధింతురు. కానవీని నెత్తుకొనిపోయి పందిలికి వెలుపల విడిచి రండని చెప్పఁగా సేవకులు వచ్చి యాబ్రాహ్మణు నెత్తుకొనిపోయి దూరము గవిడిచి పెట్టిరి. ఆపందలియందుఁ గూర్చుండియుండిన బ్రాహ్మణులాపోశనము చేయుసమయమున అచింతితముగ నొకసుడిగాలి గట్టిగఁగొట్టుటచే పందిలి యాకాశమున కెగిరిపోయెను. భోజనపదార్థములయందంతయు నిసుకనిండియుండెను. అచటనుండినవారెల్లరు చేతులువిదిలించుకొని తమప్రాణములు తప్పినఁజాలునని పరుగెత్తిపోయిరి. దీనినంతయు భగవంతుఁడు బోసలకు చూపి వీరలభావము మంచిది కానందున నేనచటికిపోక భావశుద్ధిగల నీయొద్దకు వచ్చితిని. దుర్యోధనునియన్నము నుపేక్షించి (విదురాన్నాని బుభుజే। శుచీని గుణవంతిచ) అని విదురునియన్నమును శ్లాఘించి భుజించితిననుటను నీవు వినియెఱుంగవే. ఋషిపత్నులు భక్తితోనిడినయన్నమును భుజించినదియు, శబరిభావమునకు సంతసించి యాసుశీలయిచ్చిన యెంగిలిపండ్ల నారగించినదియు నెవ్వరెఱుంగరు. నేను దరిద్రుఁడను కాను. నీభక్తికి సంతసించి శ్రీరుక్మిణితోడ వచ్చి నీవిచ్చినపిండి యారగించితిని. (హరిర్యస్యగృహేభుక్తే। త్రభుక్తే జగత్రయం) అనురీతిని నేను సంతోషముతోడ నీయన్నమును భుజించుటచే సర్వలోకములును తృప్తిచెందెను. ద్రౌపదియిచ్చిన శాకములను భుజించి పదివేలశిష్యులతోడ వచ్చిన దూర్వాసునిని పరితృప్తుం జేసితినని నీవువినియుందువుగదా? కాననిన్నిదినములవలె యొక్కం

ద్రకన్న మోసఁగనయితినని శోకింపకుము. నీవు నాకిచ్చినపిండిచే సర్వలోకులును సంతృప్తులయిరని ముమ్మాఱు సత్యము చేసి వచించెదనని చెప్పిన భగవంతుని మాటలు విని సంతసించి పలుదెఱఁగుల స్తుతించి వందనముచేసి దేవదేవుని యనుమతినిఁ జెంది తన యూరికిఁ బోయెను.

ఇట్లు బోసల తన యూరికిఁ బోవుచుండ మార్గమధ్యమున నాఁకలిచే అత్యంతము బాధపడుటనెఱిఁగి పండరినాథుఁడు మార్గమధ్యమున ఫలవృక్షములతోఁ గూడిన యొక తోఁటను, బావిని నిర్మించి తానొక తోఁటవాఁడయి పత్నీసహితముగ నచట సాన్నిధ్యము చేసియుండెను. బోసలయానందముతోడ భగవంతునిఁ గీర్తించుచు క్షుద్బాధ నోర్చుకొని యాతోఁటలోఁ ప్రవేశింపక దారినిబట్టి వచ్చుచుండెను. అపుడు శ్రీరుక్మిణీదేవి యొడినిండ ఫలములను గట్టుకొని యొకగంపయందు రొట్టెలనునుచుకొని వచ్చి బోసలనుజూచి నీవు పండరిపురమునకు పోయి వచ్చుచున్నాఁడవు. నీయాఁకలిదీర్చి నిన్నాదరించుటకయి నేనును నాభర్తయును ఫలములను, రొట్టెలను జాగ్రత్తచేసి యుంచుకొని నిన్ను ప్రతీక్షించుచున్నాము. నీవీతోఁటలోపల వచ్చి క్షుద్దాహములను శమనము చేసికొని పోవలయునని యుపచారముతోడఁ బిలువఁగా బోసల సంతోషించి తోఁటలోపల ప్రవేశించి చెట్టునీడను గూర్చుండి మందమారుతముచే మార్గాయాసమును బోఁగొట్టుకొని తన కాదంపతులిచ్చిన ఫలములను, రొట్టెలను, దివ్యతీర్థమును స్వీకరించెను. తోడనే యాదంపతులు అదృశ్యులయిరి. వృక్షములతోఁ గూడిన తోఁటయు, బావియు నదృశ్యములయి బయలయియుండెను. బోసలయాశ్చర్యపడి యిది నాతల్లిదండ్రులగు శ్రీరుక్మిణీవాసుదేవుల లీలయని నిశ్చయించి వారల వాత్సల్యాదిగుణగణంబులను గీర్తించుచు తన యూరికిఁ బోయెను.

ఇట్లుండ నొకనాఁడు బోసల జొన్నచేనునకు కావలియుండునపుడు భగవంతునిఁ గీర్తించుచు, ధ్యానించుచునుండఁగా పక్షులు వచ్చి చేనిలోని ధాన్యమును యథేష్టముగ భుజించుచుండెను. దీనులగు బాటసారులకు బోసల కంకులను విఱిచి యిచ్చుచుండెను. ఇట్టి సమయమున నతని భార్యయగు మముతాబాయి యాహారమును దెచ్చి తన భర్తను భుజింపించి యోనాథా! నీవిట్లు జొన్నకంకులను విఱిచి బాటసారులకిచ్చుచుండిన దొరతనమువారికి పన్ను నేవిధమున చెల్లింపవచ్చును. మనమేమి భుజింపవచ్చును. ఇఁకమీఁదనైనను అట్లు చేయక చేనిని జాగ్రత్తగలిగి కాచియుండుము. నీవిఁక కంకులను విఱిచి బాటసారులకిచ్చిన శ్రీవిఠ్ఠలనాథుని మీఁద నీ కానయున్నదని చెప్పి యింటికిఁ బోయెను. బోసలయానందముతోడ భగవంతునిఁ గీర్తించుచుండెను. అపుడు పండరియాత్ర చేయు బాటసారులు బోసలను జూచి మమ్ము నాఁకలి మిక్కిలి బాధించుచున్నది. నాలుగు కంకులనిచ్చిన నాఁకలితీఱ భుజించి పోయెదమని చెప్పిరి. అపుడు బోసల తనభార్య పండరినాథుని మీఁద తన కానయుంచినదితలఁచి కంకులను తన చేతితో స్పృశింపక యోభాగ్యవంతులారా! మీకు వలసినన్ని కంకులను విఱుచుకొని తినిపొండని చెప్పుచుండెను. ఇది విని దారినిఁ బోవువారెల్లరును యథేష్టముగ కంకులను విఱుచుకొని పోవుచుండిరి. ఒకక్షణములోపల జొన్నచేనంతయు శూన్యమయ్యెను. ఈవృత్తాంతమును ఆయూరివారు విని యితఁడు పరమోదారుఁడు. వైరాగ్యశీలుఁడు. ఇట్టివాని సంసారమును పండరినాథుఁడు బాగుగ రక్షింపవలయును. దొరతనమువారికితఁడేమి సమాధానము చెప్పునో తెలియదని తమలో మాటలాడుకొనుచుండిరి. దీనినంతయు విని యితని పుత్రుఁడయిన యేశూజీ వచ్చి యేమియు

చెప్పక దుఃఖించుచు కూర్చుండెను. అది చూచి బోసల యో వత్సా! నీవు శోకింపకుము. మనుజుఁడులో భరతుఁడయి పరులకిడక, తాననుభుజింపక, తనద్రవ్యమును భూమిలోపల పాతిపెట్టును. కడపట ఆద్రవ్యము అడవిలో నీఁగలు చేర్చిన తేనెవలె పరులపాలగును. తాను జీవించియుండుతఱిని భగవచ్ఛరీరభూతులగు దీనజనుల నారాధించుట భగవంతున కాహ్లాదకరమైయుండునని నీవెఱుంగవేయని తండ్రి చెప్పిన మాటలను వినినంతట చింతను విడిచి సంతోషించుచు తండ్రి నింటికి పిలుచుకొని వచ్చి యచట జరగిన వృత్తాంతమును తనతల్లికి చెప్పెను. మమతాబాయి పుత్రుని మాటలను విని సంతోషించి నెమ్మదిగలిగియుండెను.

ఇట్లుండ దొరతనమువారు పన్నురూకల నడుగవచ్చిరి. ఆయూరిలో నుండిన కొందఱు దుష్టులు రాజభటులను జూచి బోసల యీయవలసిన పన్నును ముందుగఁ దీసికొనివచ్చితిరేని మేము వెనుకనిచ్చెదమని చెప్పిరి. వారలు వచ్చి బోసల యింటివాకిటఁ గూర్చుండి యీయేఁడు నీవు రాచఱికమువారికి చెల్లింపవలసిన యేడువరాలను ఇప్పుడే చెల్లింపవలయునని యడిగిరి. అపుడు బోసల తనయొద్ద మూఁడువరహాలుండినందున తక్కిన నాలుగువరహాలను అప్పు తీసియీయవలయునని నిశ్చయించి యాయూరిలో మిగుల ద్రవ్యవంతురాలయి కృపణశిరోమణియై యుండిన నాగాబాయి యను విధవయొద్దకుఁ బోయి రాజభటుల నిర్బంధమును జెప్పి నాకు నాలుగు వరాలప్పిచ్చిన నేను త్వరగా వడ్డితోడ నీకు చెల్లించెదనని యడిగెను. ఆయువతి రేపుదయమున వచ్చిన నిచ్చెదనని చెప్పి బోసల నింటికి పంపి తాను భూమిలో పూడ్చియుంచిన ద్రవ్యమునుండి నాలుగువరహాల నెత్తి వెలుపట నుంచుకొనియుండఁగా కొందఱు దుష్టులు వచ్చి యో తల్లీ! మామాట వినుము. నీవు దాఁచిపెట్టిన ధనమును దారపోయు నట్లున్నది. ఋణము సంపన్నులకీయవలయునే గాని నిరుపేదలకీయరాదు. నీవు బోసలకేమో ఋణమీయఁదలఁచియున్నట్లు వింటిమి. అది సరే. అతఁడు దరిద్రుఁడు. పుచ్చుకొన్న ఋణమును జెల్లింపఁజాలఁడు. అతనికి పట్టువిడుపులు తెలియవు. తగులుకొని యిగిలింపకుము. నీయిష్టము. భద్రము. పోయివచ్చెదము. బోసల తాను సంసారమున నంటక విరక్తుఁడయి తిరుగుచున్నాఁడు. కాన నతనికిచ్చు ద్రవ్యము మఱల నీచేతికి రాదని బోధించిరి. మఱునాఁడుదయమున బోసల వచ్చి యడుగఁగా నాగాబాయి నాకీయవలసిన బాకీదారులు ఇపుడు బాకీయీయనందున నీకప్పిచ్చుటకు సాధ్యపడదని చెప్పెను. అపుడు బోసల యేమియును చేయుటకు తోఁచక కొంచెము చింతించి వీరాళాగ్రామమున నుండు వర్తకుని నడిగి యప్పు తీసికొని వచ్చెదనని తనభార్యాపుత్రులతో చెప్పి భగవంతునిఁ గీర్తించుచు నాయూరికిఁ బోవుచుండెను. ఇచట దుష్టులు బోసల పలాయనమయ్యెననియల్లరిచేసిరి. రాజభటులు పన్ను చెల్లించుపర్యంతము ఇంటనుండు వారు వెలుపటఁ బోఁగూడదని నిర్బంధించిరి. అపుడు పండరినాథుఁ డాయూరి వెట్టివాని వేషమును ధరించి యధికారస్థానమునకుఁ బోయి బోసల చెల్లింపవలసిన యేడువరాలను చెల్లించి రసీదు తీసికొని వచ్చి యుతని యింటివాకిట నుండు రాజభటులయొద్ద నిచ్చెను. వారలా రసీదును చదివి చూచుకొని సంతసించి పోయిరి. అప్పుడా యూరివారు బోసలకెట్లు వరాలు దొరకెనని యాశ్చర్యపడిరి. వీరాళా గ్రామమునకు పోయిన బోసల వర్తకుని నడిగి నాలుగు వరాలప్పు పుచ్చుకొని మఱునాఁడు తన యూరికి రాఁగా రాజభటులు బోసలను జూచి నీవు పంపిన యేడువరాలను వెట్టివాఁ డధికార

స్థానమునఁ జెల్లించి మాకు రసీదును దెచ్చియిచ్చెనని చెప్పిరి. అదివిని బోసల యాశ్చర్యపడుచు తనయింటికివచ్చి తనభార్యాపుత్రులనుజూచి మీరు వరాలెక్కడ సంపాదించి యధికారస్థానమునకు పంపితిరని యడిగెను. వారలతనిఁజూచి నీవు వీరాళాగ్రామమునకుఁ బోయిన పిదప పన్ను చెల్లింపక యింటిలోపలివారు వెలుపల పోఁగూడదని రాజభటులు నిర్బంధించిరి. మేము జలము మొదలగునవి తెచ్చుకొనుటకు సాధ్యపడక కష్టపడుచుంటిమి. ఇంతలో వెట్టివాఁడు రసీదు తెచ్చియిచ్చినందున రాజభటులు బయలుదేరిపోయిరి. వరాలు నీవే పంపియుందువని మేము తలఁచితిమనిరి. అపుడు బోసల వెట్టివానిని రప్పించి నీవధికారస్థానమునఁ జెల్లించిన వరాలెక్కడివని యడిగెను. అదివిని యావెట్టివాఁడు అయ్యా నక్కయెక్కడ, నాగలోకమెక్కడ? ఒకపూటగంజికి గతిలేని నేను ఏడువరాలను చెల్లించితిననిన నెవరు నమ్ముదురు. నేనేమియు నెఱుఁగనని చెప్పెను. అపుడు బోసల యిది పండరినాథుని లీలయని నిశ్చయించి భక్తవత్సలా! దీనదయాళో! ఆపత్సఖా! నానిమిత్తమయి నీవేల కష్టపడియెదవు. అఖిలలోకనాయకుఁడవగు నీకు ఈనీచవేషమును ధరింపఁదగునా? బ్రహ్మరుద్రాదిదేవతలు నీకు దాసభూతులయియుండ నీవేల దాసవేషమును ధరించితివని చెప్పి కన్నీరు మున్నీరుగ వగచుచుండ పండరినాథుఁడు ప్రత్యక్షమయ్యెను. బోసల భగవంతునికి సాష్టాంగవందనముచేసి (నమోనమోవాఙ్మనసాతిభూమయే। నమోనమోవాఙ్మనసైకభూమయే। నమోనమోనంతమహావిభూతయే। నమోనమోనంతదయైకసింధవే ॥ నధర్మనిష్ఠోస్మి నచాత్మవేదీ। నభక్తిమాఁస్త్వచ్చరణారవిందే। అకించనోనన్యగతిశ్శరణ్య। త్వత్పాదమూలంశరణంప్రపద్యే॥) అని విన్నవించి పండరినాథా! వెట్టివాఁడవైన నీకు వరాలెక్కడివని యడిగెను. అదివిని పండరినాథుఁడు మందస్మితముచేసి నాతండ్రీ! నీవు వీరాళాగ్రామమునకుఁ బోయినపుడు నీవు పలాయనమయితివని కొందఱు దుష్టులల్లరిచేసిరి. రాజభటులు నీభార్యాపుత్రులను మిగుల నిర్బంధముచేసిరి. నేనపుడు నాగాబాయి నిక్షేపమునుండి నాలుగు వరహాలెత్తుకొనివచ్చి నీయింటనుండిన మూడువరహాలతోఁ జేర్చి యధికారస్థానమునందు చెల్లించితినని చెప్పెను. అదివిని బోసల అనాథబంధో! నీవేల కృపణశిరోమణియగు నాగాబాయి వరాలను దెచ్చితివి. ఈసంగతి వినిన నామెప్రాణమప్పుడే పోవును. వీరాళాగ్రామమునందలి పత్రకుని నడిగి నాలుగువరాలు తెచ్చితిని. ఈవరాల నామెకిచ్చెదననిన జగన్నివాసుఁడిట్లనియె. నీవట్లు చేయకుము. నాయనుమతినిమీఱి నాగాబాయికి వరాలనిచ్చితివేని ఆయువతి దాఁచిపెట్టిన నిక్షేపమంతయు మాయమయిపోవునట్లు చేయుదును. నాభక్తుఁడవగు నీకప్పిచ్చెదనని చెప్పి తప్పిపోయినందున కిది యపరాధమని చెప్పి బోసలను కృపాదృష్టిచే కటాక్షించి యదృశ్యుఁడయ్యెను. అపుడు బోసలయిల్లంతయు ధనధాన్యములచే నిండియుండెను. ఇతని చేనియందు ధాన్యము సమృద్ధియై యుండెను. దీనినిఁజూచి భగవంతునికి బోసలయందుఁగలిగియుండు వాత్సల్యమున కందఱు నమందానందమును జెందిరి. బోసల భగవంతుని కృపనుగొనియాడుచు నతనికటాక్షముచే తనకులబ్ధమయిన ధనధాన్యములను మునుపటివలె దీనజనులకు వినియోగించుచువచ్చెను.

సర్వసంపత్ప్రదాత్రేనమః.

## ఏఁబదినాలుగవయధ్యాయము.

### బోసలహరికీర్తనముచేయుకాలమున శ్రీపండరినాథుఁడు, సర్పదష్టుఁడయిమృతుఁడైన వానిని, బ్రదికించుచరిత్రము.

బోసలబావా తనకు భగవత్కటాక్షలబ్ధముగుసంపదను మఱల దీనులకేవినియోగిం చెను. చేనిలో సమృద్ధిగనుండినకంకులను విఱిచి సాధుజనులకిచ్చెను. ఆజొన్నపయిరు మఱలనంకురించియపరిమితముగ ఫలమునిచ్చెను. దీనిఁజూచినజనులాశ్చర్యపడి సాధుజను లప్రభావమత్యద్భుతమయియున్నది. మరియు జగన్నివాసుఁడు నిరపేక్షులగుసాధువులకు ప్రసన్నుఁడయి వారలయోగక్షేమములను తానువహించుచున్నాఁడనిభాగవతవైభవమును గొనియాడుచుండిరి.

రాధామణమనుపట్టణమునకు సమీపగ్రామమునందు మొతకమకరుఁడనునొకకాఁపు వాఁడుబోసలబావాకుసమీపబంధువయియుండెను. వానితమ్ములిరువురహంకారగ్రస్తులై దు రాచారశీలులయియుండిరి. ఆమొతకమకరునిపొలముబోసలపొలమునకుప్రక్కనుండెను. ఆచేనికి ఆశియనునొకస్త్రీకావలియుండెను. ఆయబల బోసలప్రభావము వినియానంద మునుజెంది పూర్వజన్మసుకృతవిశేషముచే బోసలయందుభక్తిగలిగియతనిశరణుఁజెంది యోస్వామీ! నేననాదికాలముగ భవరోగముచేపీడింపఁబడుచున్నదానను. నాకౌషధము నిచ్చి తగినపథ్యమును జెప్పి నావ్యాధినిమాన్పి నాకుమోక్షారోగ్యమును గలుగఁజేయవలయు నని ప్రార్థించెను. అదివిని బోసలయోయతివా! నీకిట్టియనుతాపముకలిగినందులకు సం తోషించెదను. నీయజమానునియనుమతిని జెంది ప్రతియేకాదశి పండరిపురమునకుఁబోయి శ్రీపుండరీకవరదునిదర్శింపుము. ప్రతిదినము నీవు నీయజమానుఁడు నియమించినకృత్యము లను నెఱవేర్చి రాత్రికాలములయందువచ్చి నేనుజేయుభగవద్భజనమును శ్రవణముచేయు చుండుము. ఏకార్యముచేయుచుండినను నోటిచే భగవన్నామమునుచ్చరింపుచు,మనసుచే భగవంతునిస్మరించుచుండుమనియుపదేశించెను. ఆస్త్రీ బోసలనియమించినట్లు చేయుచుం డెను. బోసలయొక్క భక్తిపారవశ్యమును రాళోరాసగ్రామమువారువినివచ్చి బోసలను దర్శించియదిమొదలు ప్రతిదినమువచ్చియతఁడుచేయుభజనమునువినుచుండిరి. ఒకనాఁడా యూరివారు పదుగురుకూడికీర్తనమును వినుటకయి వచ్చుచుండఁగా మార్గమధ్యమునవార లలోనొకఁడు సర్పదష్టుఁడయి మృతుఁడయ్యెను. తక్కినవారుకీర్తనమునువినుట యందలి రాగాతిశయముచే ఆప్రేతమునొకగుడ్డతోమూసికొనిపోయి భజనముజరగుచోట దానిని ఒకప్రక్కఁగూర్చుండఁబెట్టి తామునుగూర్చుండి వినుచుండిరి. ఈరహస్యమెవ్వరికిని తెలి యదు. బోసల హరికీర్తనముచేయుచుండి యచటవచ్చియుండినవారలనుజూచి యోజ నులారా! నిద్రింపక భగవత్కీర్తనము వినుఁడు. అందఱును భక్తితోభగవన్నామమునుచ్చ రించుచు చేతులఁదాళమువేయుచు, నృత్యముచేయుఁడనిచెప్పెను. చెప్పినపుడెల్ల వీరు అందఱునట్లుచేయుచువచ్చిరి. ప్రేతముమాత్రమూరకకూర్చుండియుండుటనుజూచి బోసల నిద్రాపరవశుఁడగు మనుజుఁడనితలఁచి సమీపంబునవచ్చి యోభాగ్యవంతుఁడా! ఈగోష్ఠి

యందందటును నేను జెప్పినట్లు శ్రీరామనామస్మరణముచేయుచు, నృత్యముచేయుచుండఁగా నీవుమాత్రమేలయూరకకూర్చుండి నిద్రించుచున్నాఁడవు. మనము భగవద్విషయమున కరణ కళేబరములనువినియోగించి కృతార్థులముగుటకయి మనకీశ్వరుఁడు దుర్లభముగుమానుష దేహమునిచ్చెను. క్షణభంగురమగునీశరీరమునునమ్మి కాలయాపనముచేయుట న్యాయ్యము కాదు. తక్కినవారివలెనే నీవునులేచి నృత్యముచేయుము. నీవాక్కుచే భగవన్నామమును చ్చరింపుము. అనిచెప్పచుండఁగా మృతుఁడైనయాపురుషుఁడు పండరినాథునికృపచే ప్రే తత్వమువానిలేచి శ్రీరామనామస్మరణముచేయుచు, నృత్యముచేయసాగెను. సర్వదష్టమగు మృతశరీరమును గూఢముగఁదెచ్చినవారాశ్చర్యపడి బోసలకు వందనముచేసి నిజమునువిన్న వించిరి. అదివిని బోసలయానందపరవశుఁడయియిదిశ్రీపండరినాథునిలీలయని చెప్పి భగవం తునికల్యాణగుణంబులనువర్ణించుచుండెను.

ఇట్లుండ ఆశియను కావలిదానియజమానుఁడు పరలోకగతుఁడయ్యెను. వానిభార్య పుట్టినిల్లుచేరెను. వానిసోదరులు తమస్థితిని భాగించుకొనుటకు యత్నించి ఆశియనుదాని సను విక్రయింపఁబూనుకొనిరి. దీనినెఱిఁగి ఆశిదుఃఖించి బోసలయొద్దకువచ్చి యోస్వా మీ! దేవరవారిదర్శనమునకును, కీర్తనశ్రవణమునకును, విరోధముగ నాయజమానులు నన్న న్యులకు విక్రయింపఁదలఁచియున్నారు. దూరదేశమునుండివచ్చినవర్తకులు నాకయినాయ జమానులుకోరినవెలయిచ్చి నన్నుఁగొనిపోవుటకునుద్యుక్తులయియున్నారనియేడ్చుచుఁజె ప్పెను. ఆమాటలనువిని బోసలయనుతపించి శోకింపకుము. నీవెచటనుండినను పరమాత్మకు శేషమయియుండుదానవు. సర్వగతుఁడగునాపరమాత్మునినివిడిచి నీవెచటికిఁబోఁగలవు. కావనీదుఃఖమునువిడిచి యాభగవంతునిధ్యానించుచుండుము. అనినవిని ఆశియిట్లనియె. దేవరవారివాక్యము సత్యమయియున్నది. నేనందుకయిశోకింపలేదు. దేవరవారివిశ్లేషమును సహింపలేక శోకించెదనని చెప్పి యతనిభార్యయగుమమతాదేవియొద్దకుఁబోయి యోతల్లీ! నాయజమానులు నన్నువిక్రయింపఁబూనుకొనియున్నారు. నీభర్తవిశ్లేషము నాకుఁమిగుల దుస్సహమయియున్నది. నాయజమానులుకోరినవెలయిచ్చి నన్నుకొనునట్లు నీభర్తకుపురు షకారముచేయవలయునని ప్రార్థించి శోకించుచుండెను. మమతాబాయికరుణకలిగి ఆశికి ధైర్యముచెప్పిపంపి తనభర్తనుజూచి ప్రాణనాథా! శరణాగతరక్షణము ధర్మములలో గొప్పధర్మము. కావమనచేసినైననమ్మి ఆశికయి దానియజమానులుకోరువెలయిచ్చి యా యువతిదాస్యమును విడిపింపవలయుననిచెప్పెను. అదివిని బోసల సమ్మతించి ఆశియజ మానులయొద్దకుఁబోయి యీఆశికయి మీరుకోరినవెలను నేనిచ్చెదను. దీనినిమీదాస్యము నుండివిడిపింపుఁడనిచెప్పెను. ఆదుష్టచిత్తులు కోపగించుకొని నీవధికముగావెలయిచ్చినను మేమంగీకరింపము. తక్కువవెలకయిననితరులకేయమ్ముదుమనిచెప్పిరి. బోసల యేమియు చెప్పకతనయింటికివచ్చుచు ఆశియేడ్చుటనుజూచి నీవుశోకింపకుము. నాజీవితేశుఁడగుపండ రినాథునిప్రార్థించి నిన్నుదప్పించెదననిచెప్పి తనయూరికిఁబోయి యావృత్తాంతమునుతన భార్యకెఱిఁగించెను.

పిదప ఆశియజమానులు ఆశిని దానిపుత్రికతోడనిరువదిరెండువరాలకు మారవేశము నుండివచ్చినవర్తకులకు విక్రయించి వారలకు విక్రయపత్రమును వ్రాసియిచ్చి వారలిచే వరాలను జెందిరి. అపుడు పండరినాథుఁడొకబ్రాహ్మణుఁడయివచ్చి ఆశినిఁజూచి బోసలనిన్ను పిలుచుకొనిరమ్మని నన్నుపంపెనని చెప్పెను. అపుడాశిపుత్రిక శరీరమునువిడిచి పరమపదమును జెందెను. విప్రవేషధారియగుపండరినాథుఁడును, ఆశియును, అదృశ్యులయిరి. అపుడు వర్తకులు వ్యసనాక్రాంతులయి ఆశియజమానులనుజూచి మీరుమాకువిక్రయపత్రమును వ్రాసియిచ్చి మాచే వరాలనుబుచ్చుకొంటిరి. కానమాకు ఆశినప్పగింపుఁడు. అట్లుచేయరేని మావరాలనుమాకిండనివాదించుచు మాటలవెంబడిని జగడముచేసిరి. అపుడాశియజమానులు వర్తకులనుజూచి మేము విక్రయపత్రమువ్రాసియిచ్చి మీవలన వరాలనుగొన్నపుడే ఆశి మీకుసొంతకత్తెయయ్యెను. ఇఁకనుదానితోఁజేరినలాభనష్టములు మాకు నిమిత్తములేదు. ఇపుడాశినిమాయముచేసికొనిపోయిన బ్రాహ్మణుఁడు తానుబోసలచే పంపఁబడినట్లు చెప్పెను. కానమీరచటికిఁబోయి బోసలతోపోరాడుఁడని చెప్పిరి. మధ్యస్థులగుగ్రామస్థులు వినియిది న్యాయముయియున్నది. బోసల ఆశితోనీవుశోకింపకుము. పండరినాథునితోఁజెప్పి నిన్ను రప్పించుకొనియెదనని చెప్పిపోయెను. కానమీరుబోసలయొద్దకుఁబోవుట యుచితమని చెప్పిరి. అదివిని వర్తకులు బోసలకును మాకును ఏమిసంబంధము. పత్రమువ్రాసియిచ్చి మాచే వరాలనుగొన్నవీరే మాకుసమాధానము చెప్పవలయునని కలహించుచుండిరి.

ఇదియిట్లుండ పాల్గాటుపట్టణమునసుండిన మాలవాఁడొకఁడు బోసలయొద్దకువచ్చి నాకుపదేశముచేసి నన్ననుగ్రహింపవలయునని బహుదినములుగఁబ్రార్థించుచుండెను. బోసల వానివిషయముసశంకించి శ్రీపండరినాథునినిధ్యానించి సాక్షాత్కరించినయాదేవనాయకునికి వందనముచేసి యోస్వామీ! ఒకపంచముఁడు తనకుపదేశముచేయవలయుననినన్ను మిగులనిర్బంధించుచున్నాఁడు. వీఁడుపదేశమును జెందుటకనధికారియని నేను శంకించుచున్నాఁడను. నాకీసందియమునుమాన్పి నీకిష్టముగునట్లు నియమింపవలయునని ప్రార్థించెను. భగవంతుఁడు బోసలనుజూచి (ఇదంతేనాతపస్కాయ। నాభక్తాయకదాచన। నచాశుశ్రూషవేవాచ్యం। నచమాంయోఽభ్యసూయతి॥) అనఁగా తపోనిష్ఠలేనివానికిని, భక్తిహీనునికిని, శుశ్రూషచేయనివానికిని, అసూయాపరునికిని ఉపదేశింపఁగూడదని భగవద్గీతయందుఁజెప్పియున్నానుగదా. వీఁడుపదేశమునకనర్హుఁడు. నీవిపుడు నేనాజ్ఞాపించునట్లు చేయుము. అందుచే వీని చిత్తవృత్తి బయలుపడును. నీవాపంచమునిని రప్పించి చేనిలోనుండుసొకక్షుద్రదేవతకు పూజచేయవలయునని నటించియొకకోడెను వీనిచేతికిచ్చి దీనిఁజంపి దీనిమాంసమునుదెచ్చియిమ్ము. ఈరహస్యమును బయలుపఱుపకుమని చెప్పిపంపి వాఁడుతెచ్చియిచ్చుమాంసమునుతీసికొని పాకముచేయించి చేనిలోనిక్షుద్రదేవతను పూజించిమాంసభక్ష్యులగుకొందఱిని రప్పించి భుజింపింపుము. నీశాసనమునకు వెఱచి యీరహస్యమును బయలుపఱుపకుండెనేని వానికుపదేశింపుము. హింసచేసెదవనియు, క్షుద్రదేవతనారాధించెదవనియు, శోకింపకుము. నాకు ముఖోల్లాసకరముగ నానియమమునకుచేఁజేయుకార్యములెల్ల నాయారాధనములయియుండును. నేనేయాక్షుద్రదేవతారూపమైయుండి నీయారాధనము

నంగీకరించెదను. నానామరూపములకంతములేదు. కాన నీవెట్టినామరూపములతోనైనను నన్నారాధింపవచ్చును.. నాయనుమతిచే నీవుచేయుహింస హింసకాదు. జీవహింసచేయఁ గూడదని విధించినశాస్త్రము యాగములకయి పశువులను హింసింపవచ్చునని చెప్పుచున్న దిగదా. కానవిశేషవిధి సామాన్యవిధికి బాధకముకాదు. (అశ్వాలంబంగవాలంబం।సన్న్యాస్య సంపలపైతృకం। దేవరేణసుతోత్పత్తిః।కలౌపంచవివర్జయేత్) అనురీతిని హింసాపూర్వకములగు యాగములుమొదలగునవి కలియుగమునందు నిషేధింపఁబడియున్నవని చింతింపకుము. శాస్త్రము నాశాసనమైయున్నది. నాయాజ్ఞననువర్తించుటచే శాస్త్రాతిక్రమణదోషము సిద్ధింపదు. ఇంతయుపన్యాసమేల. శరీరపోషణభారము శరీరియధీనమైయుండునట్లు నాకుశరీరమగునీయొక్క రక్షణభారము శరీరియగునాస్వాధీనమైయున్నది. కత్తిచేసమిథలను ఛేదించినను, పశువునుఛేదించినను, గుణదోషములు కర్తనుజెందునేగాని కత్తినిఁజెందవు. అట్లు సర్వప్రకారములచే నాకుపరతంత్రుఁడవైయుండునీవు నాశాసనముచేచేయుకార్యముల వలన నీవుయమువశ్యుఁడవుకానేరవు. నాయనుగ్రహముచేపశువునకుప్రాణభయమును, నీకు శాస్త్రాతిక్రమణదోషమును గలుగదనిచెప్పియదృశ్యుఁడయ్యెను. బోసల ఆపంచమునిరప్పించి యోరీ! నాచేనియందుండునొకదేవతకు పూజచేయవలసియున్నది. గోశాలలోనుండెడి యెఱ్ఱనికోడెను బట్టుకొనిపోయిఛేదించిదానిమాంసమును నాకుఁదెచ్చియిచ్చిపొమ్ము. ఈరహస్యమును బయలుపఱుపకుము. అనినియమించెను. ఆమాలవాఁడు కోడెనుబట్టుకొనిపోయి ఛేదించిదానితలను, కాళ్లనుదాఁచిపెట్టి తక్కినమాంసమునుదెచ్చి బోసలకిచ్చెను. బోసల తగినవారినిఁగొని పాకముచేయించి యన్నము, రొట్టెలుమొదలగువానితోడ ఆమాంసమునుజేర్చి చేనిలోనిదేవతకు నైవేద్యముచేసి మాంసభుక్కులగుకొందఱిని రప్పించిభుజింపించెను. వారలు పూర్ణముగ భుజించి తమలోనిట్లనిచెప్పుకొనిరి. ఈబోసల పొలములోని దేవతకు మేకనుబలియిచ్చినది యాశ్చర్యమైయున్నది. ఇందుచే వీఁడువైరాగ్యశీలుఁడుకాఁడనియు, వేషధారియనియు, వ్యక్తమగుచున్నదనిచెప్పుచు తమతమయిండ్లకుఁబోయిరి. బోసల మాంసశేషమునుపంచమునికిచ్చి రహస్యమును బయలుపఱుపవలదని పలుమాఱుచెప్పి పండరినాథునిని ధ్యానించుచుండెను.

మఱునాఁడుదయమున ఆపంచముఁడొకకాఁపువానియింటికిఁబోయి వీథిలోనిలువక నిర్భయముగ లోపలప్రవేశించెను. ఆయింటియజమానుఁడు కోపగించుకొనియోరీ! చండాలా! నీవేలభయములేకయింటిలోపల ప్రవేశించితివనెను. ఆపంచముఁడు యజమానునిఁ జూచి మీకును నాకును భేదమేమి. మీరును మావలె గోమాంసమును భుజించువారలేగదాయని నవిని యజమానుఁడుమిగుల కోపించి నీవులోపలప్రవేశించినది కాక నోటికివచ్చినట్లు వదరుచున్నావు. వెలుపటపొమ్మనిచెప్పెను. అదివిని మాలవాఁడు అయ్యా! నిజముచెప్పెదనువినుము. నిన్నమీరందఱును బోసలపొలమున భుజించినది గోమాంసము. అతఁడొకకోడెనునాచేతికిచ్చి చంపితెమ్మని యామాంసమును మీకు వండిపెట్టెను. దానితలను, కాళ్లను, దాఁచిపెట్టియున్నాఁడనిచెప్పి యింటింటికిపోయి యిట్లుచెప్పుచువచ్చెను. అందఱు నొక్కచో గుమిగూడి మనమెల్లరము భ్రష్టులమైతిమి. బోసల హరిభక్తుఁడని పేరుపెట్టుకొని దాంభిక ప్ర

మాదముచేసెను. చక్కఁగ పరీక్షించిమాలవానిమాటలు నిజముగునేని బోసలను ఆచేనిలోనే చంపి మనము ప్రాయశ్చిత్తముచేసికొందమని తమలో నిశ్చయించి మాలవానిఁజూచి నీవు చెప్పినదినిజమేని ఆనవాలిమ్మనియడిగిరి. చండాలుఁడువారలనుజూచి యయ్యలారా! మీకునాపై సందేహమేల. బోసలపశువులలో నెత్తినికోడెకొట్టములోలేకుండుటనుజూచుకొండు. ఆకోడె నాచేచంపఁబడియెను. దానిమాంసమును మీరందఱు నిన్న భుజించితిరి. దానితలను కాళ్లను, దాఁచిపెట్టియున్నాను. అనిచెప్పఁగావిని వారలాగ్రహగ్రస్తులై బోసలయొద్దకుఁ బోయి యతనినిబహువిధములుగ దూషించి యోరీ నీచుఁడా! నీవుపరమదుష్టుఁడవు. హరిభక్తుఁడని వేషమువేసికొని యూరిని చెఱిచితివి. నిజమును జెప్పుము. ధ్యానముచేయుటచాలును. నీయట్టిభ్రష్టునికి పండరినాథుఁడెట్లు ప్రసన్నుఁడగును. గోమాంసమునిడిమమ్మందఱిని భ్రష్టులంజేసితివి. మహాపాపివగునిన్ను జంపి మేముప్రాయశ్చిత్తముచేసికొనియెదమని చెప్పుచుండఁగా బోసలయేమియుననక శ్రీపండరినాథునిని ధ్యానించుచుండెను. కొందఱు మాలవానిఁ బిలుచుకొని వాఁడు కోడెతలను,కాళ్లను, దాఁచిపెట్టినచోటికిపోయిచూడఁగాపండరినాథునిసంకల్పముచేనవిమేకతలయు, కాళ్లునుగా అయియుండెను. మాలవాఁడేమియుతోఁచక దిగ్భ్రమమును జెందెను. వానితోఁగూడపోయిచూచివచ్చినవారలు ఓరీనీచుఁడా! లేనిదానిని కల్పించియెంతప్రమాదముచేసితివని చెప్పి యాతలను, కాళ్లను, దెచ్చియందఱికెదుటనునిచిరి. అపుడందఱును చక్కఁగసంశయనివృత్తిచేసికొనవలయునని గోవాటమునకుపోయిచూడఁగా నెత్తినికోడెకొట్టమునఁగట్టఁబడియుండెను. అపుడందఱును అనుతాపయుక్తులయిబోసలకువందనముచేసి యోమహాత్మా! ఆనుపూర్వముగవిషయమునువిచారింపక నిన్నవమానించితిమి. అగ్నికుష్ణమును, నీళ్లకు శైత్యమును, స్వభావముగునట్లు నీబోటిభాగవతోత్తములకు శాంతమునైజగుణమయియున్నది. అయినను భాగవతావమానమును సహింపని శ్రీపాండురంగనికిమాయందు నిగ్రహము కలుగునని వెఱచెదము. నీపురుషకారముచే ఆభగవంతుఁడు మాకనుగ్రహముచేయునుగాకయని విన్నవించి యింతప్రమాదమునకుహేతుభూతుఁడగు మాలవానిఁజంపవలయునని చెప్పఁగా బోసల వారలనుజూచి యిదిశ్రీపాండురంగనిలీలయైయున్నది. నాకయియీపంచముని నిరక్షింపుఁడని ప్రార్థించెను. అపుడందఱును ఇతనిపరమశాంతికాశ్చర్యపడి పెక్కువిధంబులస్తుతించుచు తమతమగృహంబులకుఁబోయిరి. పంచముఁడు లజ్జించి యదిమొదలు బోసలకెదురరాకయుండెను. ఒకసంవత్సరముకాలమునవర్షము లేకప్రజలుమిగులకష్టపడుచుండిరి. అట్లుండ కార్తికమాసమున నొకవర్షముకురిసెను. అపుడు బోసల కొంతధాన్యముప్పుచ్చుకొని చేనిలోచల్లెను. నాఁటిదినము పండరిపురమునకు యాత్రపోవువారు బోసలనుజూచి నేఁడుమాకు భోజనమునకులేదు. మాయాఁకలినిదీర్పుమనిన నిల్లంతయుశోధించి చూడఁగా కొంతపుచ్చినజొన్నలుండెను. అదిచూచిదీనినెట్లు సాధువులకిత్తునని చింతించి తనకుమారుఁడగు నేమాజినిపిలిచి యోరీనాయనా! మహాత్ములగుసాధువులకు పుచ్చినజొన్నలీయఁగూడదు. నేఁడుపొలమునఁజల్లినధాన్యమును ప్రోగుచేసి జల్లెడతో జల్లించితెచ్చి దానిని జక్కఁజేసి సాధువులకిచ్చియీపుచ్చినధాన్యమును పొలములోఁజల్లుమనినియమింపఁగా ఏమాజి తండ్రిచెప్పినట్లుచేసెను. ఆపుచ్చినధాన్యము పండరినాథునికృపచేనంకురించి చక్కఁగపెరిగెను. ఆయూరిప్రజలాశ్చర్యపడి పొలమునకు

వచ్చిచూడఁగా విస్తారముగ సొరకాయలు కాచియుండెను. ఒకకాయనుగొట్టిచూడఁగా నదిగోధుమబియ్యముచేనిండింపఁబడియుండెను. దానినిజూచి యద్భుతంబంది యాదేశము నేలుతురుష్కునికెఱిఁగించిరి. వాఁడు బోసలను రప్పించి పుచ్చినజొన్నలంకురించి సొర కాయలుకాచుటకును, ఆసొరకాయలుగోధుమబియ్యముచే నిండింపఁబడియుండుటకును కారణమేమనియడిగెను. అదివిని రాజునుజూచి బోసల నాకేమియునుదెలియదు. ఇదిపండ రినాథునిలీలయని చెప్పెను. అపుడాతురుష్కరాజు ఈబోసల యింద్రజాలమునందుసమ ర్థుఁడు. వీనినిభ్రష్టునిఁజేసెదననితలఁచి తనకుజాత్యుచితముగునాహారమునురప్పించి బోసల కెదుటనునిచిదీనిని భుజింపుమనినిర్బంధించెను. అపుడాపదార్థమంతయు పండరినాథునికృ పచేతులసియయియుండెను. దీనిఁజూచి రాజు విస్మయమునుజెంది బోసలకు వందనముచేసి నీకువలసినపదార్థముకొనుమిచ్చెదననెను. బోసలయతనిఁజూచి కామధేనువునాశ్రయిం చినవానికికొఱఁతలేనట్లు శ్రీరామనామజపశీలుఁడనగు నాకేమియును గొఱఁతలేదనిచెప్పి తనయింటికిఁబోయి శ్రీపాండురంగనినిగీర్తించుచు నానందభరితుఁడయియుండెను.ఆయూ రు బోసలనివాససంబంధముచే పండరిపురమువలె ప్రకాశించుచుండెను.

సతాంగతయేనమః.

## ఏఁబదియైదవయధ్యాయము.

---

గణేశనాథునిచరిత్రము.

పాల్గాటువాయ్‌సమీపమున ఉజ్జనినగరమున గణేశనాథుఁడను వైష్ణవోత్తముఁడనవర తము హరికీర్తనముచేయుచునానందముచే మైమఱచి నృత్యముచేయుచు, నిరపేక్షుఁడయి వైరాగ్యయుక్తుఁడయి (యథాదీపోనివాతస్థో । నేంగతేసోపమాస్మృతా । యోగినోయత చిత్తస్య । యుంజతోయోగమాత్మనః॥) అనురీతిని గాలిలేనిచోటనుండు దీపమువలెమనోని గ్రహముకలిగి యోగయుక్తుఁడయి యరణ్యమున వసించుచు కౌపీనమాత్రధారియయి కంద మూలములనాహారముగఁగొనుచు,అనికేతనుఁడయి కాలమునుగడపుచుండెను. ఈమహాను భావుఁడు పండరిపురమునకువచ్చి భగవంతునిఁగీర్తించుచుండఁగా ఆదేశమేలుశివాజిమహా రాజు గణేశనాథునిప్రభావమును విని యానందపరవశుఁడయి పండరిపురమునకువచ్చి గణే శనాథునినిదర్శించియతఁడుచేయుహరికీర్తనమునువినుచుండెను.

ఈరాజు తాను శయనించుటకయి శ్లాఘ్యమగునొకక్రొత్తమంచముచేయించియుండె ను. ఆమంచమునుతానువాడకభాగవతోత్తముఁడగుగణేశనాథునికి ప్రథమమునవినియోగింప వలయుననిమనోరథించియతనికి సాష్టాంగవందనంబుచేసి తనయింటికిరావలయునని ప్రా ర్థించెను. గణేశనాథుఁడు పరమసాధువగుశివాజిరాజుప్రార్థనను నిగ్రహింపనేరక యారాజు ను వెంబడించిపోయతనియింటికిపోయెను. అట్లుపోవునపుడొకపుటికలోగులకరాళ్లను సయి తమ్మతీనికొనిపోయెను. రాజదిచూచియివియేలయనియడిగిన శ్రీరామనామములనెంచుటకని సమాధానముచెప్పెను. శివాజిరాజు గణేశనాథునినొకపల్లకిలోనుంచుకొని తనయింటికిఁ

గొనిపోయి యతని పాదములను గడిగి యాతీర్థమును స్వీకరించి ప్రోక్షించుకొని గంధపుష్పాదులచే పాదపూజచేసి భుజింపించి పగలంతయు నతఁడుచేయు సంకీర్తనములను వినుచుండి రాత్రియయినంతట తాను నూతనముగ చేయించిన మంచమునందు శయనింపవలయునని ప్రార్థించెను. గణేశనాథుఁడట్లుచేసెదనని చెప్పి రాజును బంపి యామంచముమీఁద తాను దెచ్చిన గులకరాళ్లను పఱపి యందుపైఁ గూర్చుండి భగవంతునిట్లని స్తుతించెను. ఓపుండరీకాక్షా! శంఖచక్రగదాదిదివ్యాయుధధరా! నీకు దండము సమర్పించెదను. పూర్వము కరణకళేబరములు లేక మూలప్రకృతియందు లీనమయియుండిన నాకు దయామానసుఁడవయి కరణకళేబరంబులను సంగితివి. అట్టినీవు నన్నిపుడు రక్షింపవలయును. ఓజనార్దనా! నీకటాక్షముచే రక్షింపఁబడు నేను నీకు శరీరమయియున్నాఁడను. నేనుమాత్రముకాదు. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును, మహదహంకారతన్మాత్రలును, ప్రకృతియు, జీవుఁడును, నీశరీరములయి యున్నవి. క్షేత్రజ్ఞస్వరూపివయి, పరమాత్మవయి, సమస్తజగద్వ్యాపకుఁడవయియుండు నీకు నమస్కరించెదను. అవ్యక్తమగు సూక్ష్మప్రకృతియు, వ్యక్తమగు ప్రపంచమును, కాలమును, స్వరూపముగఁ గలిగియుండు నీకు నమస్కరించెద. బ్రహ్మ, విష్ణు, రుద్ర, స్వరూపివై, సర్వభూతములకు సృష్టి,స్థితి,సంహారకర్తవయి, కల్పాంతకాలమున సకలభూతములను గ్రహించి మూఁడులోకములను ప్రళయార్ణవమగ్నములగునట్లుచేసి, శేషపర్యంకమున శయనించి పరమయోగులకు ధ్యానగమ్యుఁడవయియుండు గోవిందుఁడవు నీవేకదా? పరాత్పరుఁడవయి దివ్యుఁడవయియుండు నీనిజస్వరూపము నెవరెఱుఁగుదురు. నీవు జగద్రక్షణమునకయి లీలార్థముగ పరిగ్రహించిన మత్స్య, కూర్మ, వరాహా, దిరూపములనేగదా దేవతలారాధించెదరు. మోక్షమునపేక్షించు ముముక్షులు పరబ్రహ్మమవగు నిన్నారాధించి ముక్తులయి పరమానందమును జెందుచున్నారు. సమస్తమునకు నాధారమవయి యాధేయమవయి ధారకుఁడవయి ప్రకాశకుఁడవైయుండుటచే శ్రీవాసుదేవుఁడను దివ్యనామము గల నిన్నారాధింపక యెవఁడు ముక్తిని జెందసమర్థుఁడగును. మనసుచే గ్రహింపఁబడు సుఖాదులును, నేత్రాదీంద్రియములచే గ్రహింపఁబడు రూపాదులును, బుద్ధిచే పరిచ్ఛేదింపఁబడు ప్రమాణాంతరములును, ఇవియన్నియు నీస్వరూపములయియున్నవి. ఓదేవదేవా! నీయందు జనించి నిన్నాశ్రయించి నీకు శరీరభూతుఁడనయి నీయందు స్థితినిఁ జెంది నీవ్యాప్తినను సంధించుచుండుటచే నేను వైష్ణవుఁడనఁబడుచున్నాఁడను. సకలజ్ఞానస్వరూపియగువాఁడా! నీకు జయము కలుగుఁగాక. అవ్యయా! నీకు మంగళమగుఁగాక. స్థూలప్రపంచరూపా! నీవు జయింతువుగాక. అవ్యయా! నీకు మంగళమగుఁగాక. అనంతా! జయజయ! వ్యక్తభూతాదిస్వరూపా! అవ్యక్తరూపా! జయజయ. మహాప్రభావా! ఉత్కృష్టములకును, నికృష్టములకును, ఆత్మయయినవాఁడా! జయజయ. విశ్వాత్మకా! జయజయ. యజ్ఞపతే! జయజయ. యజ్ఞములును వషట్కారమును నీవే. ప్రణవమును, త్రేతాగ్నులును నీవే. చతుర్వేదములును నీవే. వేదాంగములును నీవే. యజ్ఞకర్తయు, యజ్ఞభోక్తయు, యజ్ఞఫలప్రదాతయు నీవే. ఓపురుషోత్తమా! సూర్యచంద్రాగ్రహములును, అశ్విన్యాదినక్షత్రములును, తక్కినతారకాగణములును, మూర్తములయి ద్రవ్యములును, అమూర్తములును, దృశ్యములును, అదృశ్యములును, మఱియు నాచే చెప్పఁబడినవియును, చెప్పఁబడనివియునగు సమస్తమును నీవే. పరమేశ్వరా! ఇట్లెన్నిటికిఁ

ఆత్మభూతుఁడవయిననీకు వందనముచేసెద. మఱిమఱియనంతవందనములు చేసెదనని యిట్లారాత్రియంతయును గణేశనాథుఁడు భగవంతునిస్తుతించుచు నానందపరవశుఁడయియుండెను. ప్రాతఃకాలమున రాజువచ్చి సాష్టాంగవందనముచేసి యోస్వామీ! మంచముపయి గులకఱాళ్లనుపఱిపి వానిమీఁదఁగూర్చుండుటకు కారణమేమనియడిగెను. అపుడా భాగవతాగ్రణి రాజునుజూచి శరీరమునకు సుఖమునుగలుగఁజేసిన నింద్రియములు విషయసుఖమున పేక్షించును. విషయములు విషమునకంటె క్రూరములు. విషమునుభుజించుటచేశరీరమునకుమాత్రము హానికలుగును. విషయములనుస్మరించిన మాత్రముననే ఆత్మకు నరకముప్రాప్తమగును. కానబుద్ధిమంతులు శరీరమునకు సుఖమునుగలుగఁజేయరు. మఱియు పురుషుఁడు సుఖమననుభవించునపుడు భగవంతునిని స్మరింపక విషయసుఖమున తనివిలేక కామాతురుఁడయి కాలమును గడపుచుండును. అట్టివానియాయుష్కాలమును ఉదయాస్తమయములనెడివ్యాజముచే సూర్యుఁడు వంచించికొనిపోవును. వీఁడదియెఱుఁగక పెక్కేండ్లుజీవించియుండునని తలఁచుచు నంగనాపుత్రగృహారామవిత్తాది సంసారసుఖము ననుభవించుచు వర్తించును. కాలమునెఱిఁగి దండధరకింకరులు వచ్చివీనిని కాలపాశములచేఁగట్టికొనిపోవునపుడు భగవంతునినిస్మరింపక విషయసుఖములవెంటఁదగిలి పాపరతుఁడనయితినని దుఃఖించును. ఇట్లుదుఃఖించుచు యమపట్టణమును జేరినపిదప పాపానుగుణముగు పెక్కునరకములననుభవించును. ఓరాజా! పాపులు బాధింపఁబడునరకస్థానములనేకములుగలవు. వానినిఁజెప్పెదను వినుము. రౌరవము, సూకరము, రోధము, తాలము, విశసనము, మహాజ్వాలము. తప్తకుంభము, లవణము, విలోహితము, రుధిరాంభము, వైతరణి, క్రిమిశము, క్రిమిభోజనము, అసిపత్రవనము, కృష్ణము, లాలాభక్షము, పూయవహము, వహ్నిజ్వాల, అధశ్శిరము, సందంశము, కృష్ణసూత్రము, తమస్సు, అవీచి, శ్వభోజనము, అప్రతిష్ఠము, ఇవిమొదలగుననేకక్రూరనరకములు యమునియధికారమునకులోఁబడియుండును. రురు అనుమృగములచేబాధింపఁబడు నరకస్థానము రౌరవమనఁబడును. పందులచేఁ బీడింపఁబడునరకస్థలము సూకరమనఁబడును. చలనములేకనిలువఁబడు నరకస్థలము రోధమనఁబడును. తాటిమ్రానిపైనుండి త్రోయఁబడి దానిమట్టలచే కోయఁబడునరకస్థలముతాలమనఁబడును. అంపముచే కోయఁబడుస్థలము విశసనమనఁబడును. మండుచుండునిప్పునఁద్రోయఁబడుస్థలము మహాజ్వాలమనఁబడును. కాచినసూనెకుండయందు వేయఁబడుస్థలము తప్తకుంభమనఁబడును. శరీరమంతయునుగోసి యాగాయములయందు కాల్చినయుప్పునంటించుస్థలము లవణమనఁబడును. నెత్తుటిని పానముచేయించుస్థలము విలోహితమనఁబడును. కాచినరక్తమునవేయుస్థలము రుధిరాంభమనఁబడును. దాఁటుటకసాధ్యముగురక్తనదీప్రవాహము వైతరణియనఁబడును. పురుగులు శరీరమునందుద్వారములుచేయుస్థలము క్రిమిశమనఁబడును. పురుగులను భక్షించుస్థలము క్రిమిభోజనమనఁబడును. దట్టముగుమండ్లమీఁదనడపించుస్థలము కృష్ణమనియు, కార్ష్ణాయసమనియుఁ జెప్పఁబడును. సహింపఁగూడని చలితోఁగూడినస్థలము దారుణమనఁబడును. సందంశమనునాయుధముచే నాలుకలను పెఱికివేయుస్థలము సందంశమనఁబడును. శస్త్రములనేయాకులుఁగలిగియుండు వృక్షసమూహము అసిపత్రవన

మునఁబడును. మిగులదుర్గంధమయి యసహ్యముగుస్థలము పూయవహమునఁబడును. కాలి వ్రేలికొనకడారమునుదగిలించి దేహమునొకముద్దగఁజేర్చికట్టి యాయుధములచే బాధించుస్థలము కృష్ణసూత్రమునఁబడును. ఈనరకములననుభవించు పాపులను జెప్పెదనువినుము. తప్పుసాక్ష్యముచెప్పువాఁడు, పక్షపాతముచే వ్యవహారమున నన్యాయముపల్కువాఁడు, అబద్ధమాడువాఁడు వీరు రౌరవమును జెందుదురు. శిశుహత్యచేయువాఁడు, పట్టణమును జెఱుచువాఁడు, గోవులనుజంపువాఁడు, ప్రాణులకుశ్వాసబంధనము చేయువాఁడు వీరు రోధమును జెందుదురు. మద్యపానముచేయువారును, బ్రహ్మహత్యచేయువారును, స్వర్ణమునపహరించువారును, వీరలతోఁజేరినవారును సూకరమును జెందుదురు. రాజునుజంపినవాఁడును, వైశ్యునిఁజంపినవాఁడును, గురుభార్యను జెందినవాఁడును, సోదరినిఁ జెందినవాఁడును, రాజభటులనుజంపినవాఁడునువీరుతప్తకుంభమును జెందుదురు. భార్యనువిక్రయించువాఁడును, సత్పురుషులను గావలియందుంచినవాఁడును, వైదికయోగ్యములగుగుఱ్ఱములను అమ్ము వాఁడును, తన్నునమ్మి కాచియుండువారి నుపేక్షించువాఁడును, శరణాగతులనుగొట్టితఱుముపాఁడునువీరుతప్తలోహమును జెందుదురు. కోడలు, కొమార్త మొదలగువారలఁ జెందువాఁడును, గురువునవమానించువాఁడును, కోపించిపరులను దిట్టువాఁడునువీరుమహాజ్వాలమును జెందుదురు. వేదదూషణచేయువాఁడును, వేదవిక్రయముచేయువాఁడును, పరస్త్రీలను జెందువాఁడునువీరులవణమనునరకమును జెందుదురు. దొంగిలించువాఁడును, లోకమర్యాదను జెఱుచువాఁడును విలోమమును జెందుదురు. దేవదూషణచేయువాఁడును, బ్రాహ్మణదూషణచేయువాఁడును, ఉత్తమవస్తువులను దూషించువాఁడును, పరులకుకీడుచేయువాఁడును, శూన్యముంచువాఁడును క్రిమిశమును, క్రిమిభక్షణమును జెందుదురు. పితరులను, అతిథులను, విడిచిముందుగా భుజించువారును, వేటకాఁడు మొదలగువారికి ఆయుధములను జేసియిచ్చువారును, లాలాభక్షమును జెందుదురు. క్రూరములగుబాణములు, కత్తులు మొదలగునాయుధములను అయోగ్యులకుఁ జేసియిచ్చువారు విశసనమును జెందుదురు. అయోగ్యులవలన దానమును జెందువారును, వైదికకర్మములకనర్హుఁడగువానికి వానిని జేయించువారును, జ్యోతిశ్శాస్త్రముచక్కఁగా నెఱుఁగక ఫలముచెప్పువారును అథోముఖమును జెందుదురు. సాహసముచేయువాఁడును, మంచిపదార్థమును పరులుచూచుచుండ వారలకీయక తానొక్కఁడే భుజించువాఁడును, పిల్లి, కోడి, మేక, కుక్క, పంది, పక్షులువీని నెప్పుడును మిగులనుపలాలనముచేయువాఁడునువీరు పూయవహమును జెందుదురు. నాటకమాడిజీవించు బ్రాహ్మణుఁడును, మల్లయుద్ధముచేసి జీవించువాఁడును, గాలము మొదలగువానిచే మత్స్యములనుబట్టువాఁడును, కుండకుఁడు, గోళకుఁడు మొదలగువారియన్నమును భుజించువాఁడును, విషముపెట్టువాఁడును, కొండెముచెప్పువాఁడును, భార్యనుపరులకుఁగూర్చియిచ్చి జీవించువాఁడును, అపర్వకాలములయందు ద్రవ్యాశచే పర్వకార్యంబులను జేయించువాఁడును, ఇండ్లనుగాల్చువాఁడును, స్నేహితునిచెఱుచువాఁడును, పక్షులను జంపువారికి పక్షులను విక్రయించువాఁడును, ఊరికయియాగముచేయువాఁడును, యాగమునసోమలతను విక్రయించువాఁడునువీరురుధిరాంధమును జెందుదురు. యాగమును జెఱుచువాఁడు, ఊరిని జెఱుచువాఁడు మొదలగువారు వైతరణిని జెందుదురు. ధనయౌవనాదులచే గర్వమును జెంది

గ్రామములయొక్క యెల్లనుమార్చువాఁడును, శుద్ధిలేనివాఁడును, మోసముచేసి జీవించువాఁడును కృష్ణమును జెందుదురు. వైదికోపయోగములేక వ్యర్థముగ పలాశాదివృక్షములను ఛేదించువాఁడు, మేకలనువిక్రయించువాఁడు, మృగములనుజంపువాఁడు వీరు మొదలగువారు అగ్నిజ్వాలను జెందుదురు. కాల్పఁగూడని భాండములు మొదలగువానియందగ్నినుంచువారు ఆనరకమునే చెందుదురు. వ్రతలోపముచేయువాఁడు, ఆశ్రమధర్మములనువిడిచినవాఁడువీరు సంధంశమున బాధపడుదురు. బ్రహ్మచారియైయుండి రేతోవిసర్జనము చేయువాఁడును, పుత్రులచేఁజదివింపఁబడువాఁడును శ్వభోజనమును జెందుదురు. మద్యమాంసాదిశాస్త్రదుష్టములగు పదార్థములను గుడుచువారు మల, మూత్ర, క్రిమి, భోజనమును జేయుదురు. ఏకాదశినాఁడు భుజించువారుపంచమహాపాతకములఫలమును జెందుదురు. తమతమవర్ణాశ్రమములకు విరోధముగనడచువారును, మనోవాక్కాయములచే పాతకములను జేయువారును, వారివారిపాపమునకుఁదగిననరకమును జెందుదురు. ఇట్లనేకవిధములగు పాపములను జేయువారు యాతనలను జెందునరకములు పెక్కువేలున్నవి. నరకముననుండుప్రాణులు తలక్రిందుగనుండి స్వర్గముననుండు దేవతలనుజూచి దుఃఖపడుచుందురు. దేవతలు తలక్రిందుగనవస్థపడుచుండు నారకులనుజూచి మిగులభయపడుచుందురు. పాపులు నరకానుభవముచేసినపిదపక్రమముగస్థావరములయి, పురుగులయి, జలచరములయి, పక్షులయి, మృగములయి, మనుష్యులయి, మనుష్యులయందు ధర్మశీలులయి, దేవతలయి, కడపటముముక్షువులగుదురు. వీరలలోమునుపటివారిలో వెనుకటివారు వేయింటనొకభాగమయిమునుపటి జన్మములయందుండి క్రమముగనుత్తమజన్మమును జెందువారుమోక్షమును జెందువఱకు సంసారచక్రంబున భ్రమించుచుందురు. ఓరాజా! క్రిందఁజెప్పఁబడిననరకములన్నియు నింద్రియములచేతనే జీవించుచున్నవి. జితేంద్రియుఁడగువానికి నరకభయములేదు. శరీరమునకు సుఖమునుగలుగఁజేసిన నింద్రియములు బలిష్ఠములయివిషయవీథియందు సంచరించును. కాననింద్రియనిగ్రహమునుగోరువాఁడు శరీరసుఖమునపేక్షింపక మితాహారనిద్రలతోఁగూడి మితభాషియైనిర్జనస్థలమునవసించుచు సాధుజనసంగతి నపేక్షించుచు నిరంతరభగవద్గుణానుభవకీర్తనములచే కాలమును గడపవలయును. నాయనుష్ఠానక్రమంబును జెప్పెదను వినుము. కోరికలులేకదిగంబరుఁడనయి పిశాచంబుచందంబుననుండుచు నేకాంతభావంబువిష్ణునియందుఁజేర్చి చేతనాచేతనంబులు ఈశ్వరశరీరంబులుగాభావించుచు విరక్తినొంది విజనస్థలంబున వర్తింతును. నీవుభగవత్పరుఁడవుగాన పరమహంసధర్మమును నీకుపదేశించితిని. నీవువివేకివయి సత్పథంబునవర్తింతువేని భగవదనుగ్రహముచెంది పునరావృత్తిరహితమోక్షమును జెందుదువు. నీకు మేలుగల్గుగనుగాక. నేనుబోయివచ్చెదనని చెప్పియడవికిఁబోయెను.

అపుడు సమీపగ్రామములయందుండుజనులనేకులు వచ్చి యితనినాశ్రయించియితనిచేనుపదేశమును జెంది తమశిరంబులనితనికరస్పర్శముకలిగినంతట పరమవైరాగ్యశీలులై గృహాదులనువిడిచి యరణ్యమునవసించుచునాచార్యపాదచ్ఛాయయందఁదగి గురుకులవాసముచేయుచునవరతము భగవన్నామస్మరణముచేయుచుండిరి. ఇట్లు పరమవైరాగ్యశీలులగుమున్నూటయిరువదిగురుశిష్యులొకసంవత్సరము లోపల గణేశనాథుని నాశ్రయించిరి. దీనిఁ

జూచి లోకులాశ్చర్యపడి గణేశనాథునివైభవమును పెక్కువిధంబులస్తుతించుచుండిరి. కొందఱు దుష్టులు గణేశనాథునియొద్దకుఁబోయి నీవింద్రజాలమునందు సమర్థుఁడవు. అనేకులు సర్వసంగపరిత్యాగముచేసికొని యెల్లప్పుడు నీవెంటఁదిరుగునట్లుచేసికొంటివి. ఇందుచే నీవు యోగ్యుఁడవనిమాకునమ్మికకలుగఁజాలదు. నీవుజంగమములనువశీకరించియుపదేశించునట్లు స్థావరములనువశీకరించియుపదేశించితివేనినీయోగ్యతను మేము నమ్ముదుము. ఇదిగోనీకెదుట నుండువృక్షరాజమునకుపదేశింపుము. చూతమని చెప్పిరి. అపుడాగణేశనాథుఁడు తనచేతులతో నావృక్షమునుస్పర్శించి దానికితారకమంత్రమునుపదేశించి యాదుష్టులుతెచ్చినయాహారయోగ్యమగుపదార్థములను అవృక్షరాజముమీఁదనుంచఁగా ఆపదార్థములనాచెట్టు తానులోఁగొనితనయందగపడుచుండినమిట్టపల్లములు మఱుఁగుపడునట్లుపుష్టిగలిగిసమమైయుండెను. ఈయతిశయములనుజూచియాదుష్టులానందపరవశులయి తమదుస్స్వభావములనువిడిచి గణేశనాథునిని పెక్కువిధంబులస్తుతించిరి.

మఱియొకనాఁడు గణేశనాథుఁడరణ్యమునందుభగవత్కీర్తనముచేయుచుండఁగా బహుజనులువచ్చి కీర్తనమునువినుచుపరమానందభరితులయియుండిరి. కొందఱుబ్రాహ్మణులు గణేశనాథునిఁజూచి మేమగ్రజాతివారము. మేమితరులవందనంబులనంగీకరించి యాశీర్వదించి వారలకుపదేశింపనర్హులమైయున్నారము. అన్యులకువందనముచేయుటయు, నన్యుల యుపదేశమ్మునువినుటయు మాకనర్హములయియుండును. కాననిన్ను గౌరవించుటయు, నీవు చేయుకీర్తనములనువినుటయు మాకనుచితమనిచెప్పిరి. అదివిని గణేశనాథుఁడు వారలను జూచి మీరట్లుచెప్పుటన్యాయ్యముకాదు. పురుషుఁడు బ్రహ్మజ్ఞానముచే బ్రాహ్మణుఁడగుచున్నాఁడు (విష్ణుభక్తివిహీనస్తు।యతిశ్చశ్వపచాధమః) అనురీతినివిష్ణుభక్తిలేనివాఁడుయతియైననుశ్వపచాధముఁడగును. బ్రాహ్మణకులమునఁబుట్టి భగవద్విముఖులగువారికన్న భగవత్కథాశ్రవణకుతూహలులగుసాధుజనులపాదస్పర్శమును జెందినఱాళ్లుశ్రేష్ఠములగునని చెప్పెను. గణేశనాథుఁడట్లుచెప్పినంతట నచటనుండినఱాళ్లొకటితోనొకటి మోదుకొనియాకసమునకెగిరెను. ఈయద్భుతమునుజూచియాబ్రాహ్మణులాశ్చర్యపడియితఁడు సాక్షాద్భగవదంశసంభూతుఁడని తమలో నిశ్చయించియతనికి వందనములుచేసి యపరాధక్షాపణముచేసికొని యతనివలనశ్రీతారకమంత్రోపదేశమును జెంది ధన్యులయిరి. ఇట్లుజ్జనిపట్టణసమీపముననుండు సారసమను నూరియందుజరిగినయీయద్భుతచరిత్రము శ్రీమత్పండరినాథునినియమనముచే ప్రతిసంవత్సరమనుకరింపఁబడుచున్నది. ఇప్పుడును సాధుజనులచటికిఁబోయియాయుత్సవమును దర్శించుచున్నారు. (యంయంస్పృశతిపాణిభ్యాం। యంయంపశ్యతిచక్షుషా। స్థావరాణ్యపిముచ్యంతే) అనఁగాపరమభాగవతుఁడు దేనిదేనిని తనచేతితో స్పర్శించునో, దేనిదేనిని తనకంటితో కటాక్షించునో, యదిస్థావరమయిననుజీవించుననునర్థముగణేశనాథునియందు ప్రత్యక్షసిద్ధమయ్యెను.

జ్ఞానగమ్యాయనమః

## కేశవస్వామిచరిత్రము.

సోజీవిభయకరతమియను నూరిలో కేశవస్వామియను పరమభాగవతుఁడనవరతము భగవంతునిఁగీర్తించుచు, ధ్యానించుచు, నానందముచే మైమఱచి నృత్యముచేయుచు తీర్థయాత్రాపరుఁడయియుండెను. ఇతఁడొకయేకాదశినాఁడు విజయపురమున హరికీర్తనముచేయుచుండఁగాననేకులువచ్చియాకీర్తనమును శ్రవణానందముగ వినుచుండిరి. అపుడు కేశవస్వామి తనశిష్యులలోనొకబ్రాహ్మణునిఁజూచి నేఁడు హరివాసరము. కాన సాధువులందఱుపవసించియున్నారు. నీవంగడికిపోయి విశేషముగ శొంఠిని, బెల్లమునుదీసికొనివచ్చియారెంటినొకటిగఁజేర్చి మర్దించి తెమ్ము. దానిని భగవంతునికి నివేదించి శ్రీహరినామసంకీర్తనశ్రవణముచేయుచుండుసాధువులకు వినియోగించిన వారలు దానినిస్వీకరించి తమకుగలిగినతాపమునుమాన్పుకొనుదురనినియమింపఁగా నాబ్రాహ్మణుఁడంగడివీధికిపోయెను. అపుడు రాత్రిపండ్రెండుగడియలైనందున నంగళ్లన్నియుమూయఁబడియుండెను. ఒకవర్తకుఁడుమాత్రము కేశవస్వామిభజనముచేయుచోటికి రావలయునని తలఁచుచునుపవాసాయాసముచే మయిమఱచి కూర్చుండునట్లు నిద్రించుచుండెను. ఈబ్రాహ్మణుఁడావర్తకునిని జేయితట్టి లేపి కేశవస్వామినియమనము నెఱిగింపఁగా వాఁడంగడిలోపలప్రవేశించి దీపములేనందున శొంఠిసంచియనితలఁచి వసనాభిసంచిలో చేతినునిచి వసనాభినియథేష్టముగనెత్తిబెల్లముతోఁజేర్చియిచ్చి నాకుమారుఁడు సంతపేటకుపోయినందున నేనువచ్చి కేశవస్వామిచేయు హరికీర్తనమునువినుటకు సాధ్యపడకపోయెనని చెప్పెను. ఆబ్రాహ్మణుఁడు వర్తకుఁడిచ్చిన వస్తువులను రోటిలోనునిచి దంచిమెదిపిముద్దగఁజేసి కేశవస్వామికెదుటఁదెచ్చి యుంచెను. అపుడు భక్తవత్సలుఁడగుపండరినాథుఁడావిషమునుతానుగ్రహించెను. కేశవస్వామికీర్తనముముగిసినపిదప ఆశొంఠిబెల్లమునుతనకారాధ్యుఁడగువిఠ్ఠలనాథునికి నివేదించి యచటనుండినసాధువులకందఱికిని గచ్చకాయప్రమాణముగ వినియోగముచేసెను. అప్పుడందఱును దానినంగీకరించి మహాప్రసాదమని స్వీకరించి తమతమయిండ్లకుఁబోయిరి. వర్తకుఁడు వసనాభినిచ్చుటయు దానిని కేశవస్వామి భగవంతునికి నివేదించి భాగవతులకు వినియోగించుటయు నేవారికిని దెలియదు. మఱునాఁడుదయమున నావర్తకుఁడంగడిలోప్రవేశించి వసనాభిసంచినివిప్పియుండుటనుజూచి యోహో నిన్నటిరాత్రి నేనెంతప్రమాదముచేసితిని. నిద్రాపరవశుఁడనయియవివేకముచే శొంఠియనివసనాభిని సాధువులకిచ్చితిని. ఇందుచే ననేకభాగవతులకు శరీరవియోగముకలిగియుండును. నేనేమిచేయుదును. ఇపుడెట్టిప్రాయశ్చిత్తము ననుష్ఠించి నేనుశుద్ధుఁడను గాఁగలను. భక్తవత్సలుఁడగు శ్రీమత్పండరినాథుఁడాపద్రక్షకుఁడని బిరుదువహించి యిట్టికాలమున నుపేక్షించునా? కేశవస్వామిప్రభావముచే నావిషమమృతమైయుండవచ్చునని పెక్కువిధంబులుగఁజింతించి రాత్రి హరికీర్తనమువినుచుండిన కొందఱుభాగవతులయిండ్లకుఁబోయి చూడఁగా వారలందఱును తమశరీరములయందు, వసనాభితో మెదిపి యిచ్చిన శొంఠిని నర్ధరాత్రమున సేవించుటవలనఁ గలుగవలసినవికారము కొంచెమైనను లేక యెప్పటియట్లుసుఖముండిరి. అదిచూచి వర్తకుఁడాశ్చర్యపడి కేశవస్వామిసన్నిధికి వచ్చుచుండెను. అచట కేశవస్వామి స్నానాద్యనుష్ఠానంబులనుదీర్చికొని తన కారాధ్యుఁడగు శ్రీ

పండరినాథుని నారాధింపనుపక్రమించి దేవగృహంబున బ్రవేశించి పుండరీకవరదుని సేవించి స్వర్ణమయముయియుండిన యాభగవంతునిదివ్యమంగళవిగ్రహము నల్లనయియుండుటను జూచియిందునకుఁగారణ మేమని తనచెంతనుండినభాగవతులతోడ నాలోచించుచుండఁగా వర్తకుఁడు వచ్చి కేశవస్వామికిసాష్టాంగవందనముచేసి స్వామీ! రాత్రినిద్రాపరవశుఁడనయి గొప్పయపరాధమును జేసితినని విన్నవించి నన్నురక్షింపవలయునని ప్రార్థించెను. అదివిని కేశవస్వామి శ్రీవిఠ్ఠలనాథునికి వందనముచేసి మస్తకన్యస్తాంజలియై భగవంతునినిట్లనిస్తుతించెను. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులును, తన్మాత్రలును, మనసును, తక్కిన యింద్రియములును, మహదహంకారములును, మూలప్రకృతియు, నెవనిరూపములయియున్నవో యట్టి సర్వేశ్వరునికి దండములుసమర్పించెద. శుద్ధస్వభావుఁడయి, సూక్ష్మరూపియయి, జ్ఞానముచేనెందునువ్యాపించి, ప్రకృతికంటెపరుఁడయినపురుషుఁడెవనిరూపమైయుండునో యట్టి సుగుణాకరుఁడగుపురుషోత్తమునికి వందనముచేసెద. పృథివ్యాదిభూతములును, గంధాదిగుణములును, బుద్ధ్యాదులును, ప్రకృతియు, సంసారియగుజీవుఁడును, అగువీరలకంటెపరుఁడగుముక్తపురుషుఁడెవనిరూపమయియుండునోయట్టిజగత్పతికి నమస్కరించెద. పరమేశ్వరా! బ్రహ్మలక్షణయుక్తుఁడవయి, యఖిలజగత్పతివయి, శుద్ధుఁడవయిన నీస్వరూపమునకు వందనముచేసెద. సర్వాత్మకా! సమస్తశక్తియుక్తమగు బృహత్తత్వముచేతను, జగదాకారముచేతను, మహాప్రమాణమయియుండుటచేతను, బ్రహ్మమను నామధేయముగలిగి వికారరహితమయి యోగిచింత్యమయి ప్రకాశించు నీస్వరూపమునకు వందనముచేసెద. నీవుసహస్రశిరములును, సహస్రపాదములును, సహస్రనేత్రములును గలవాఁడవయి, పురుషుఁడవయి, సర్వమునువ్యాపించి, భూమియనిచెప్పఁబడుచరాచరమయప్రపంచమునకంటె పదింతలధికముగ నతిశయించియున్నాఁడవు. భూతభవిష్యద్వస్తుజాతములునీవే. పురుషోత్తమా! విరాట్టనిచెప్పఁబడు నవ్యక్తశరీరకుఁడగునరిరుద్ధుఁడును, స్వరాట్టనిచెప్పఁబడు కేవలాత్మప్రాప్తికాముఁడును, సమ్రాట్టనిచెప్పఁబడుభగవత్ప్రాప్తికాముఁడును, అధిపురుషుఁడనిచెప్పఁబడుబ్రహ్మదేవుఁడునునీయందుఁగలిగిరి. సమష్టిదేహముగలహిరణ్యగర్భుఁడనునాపురుషుఁడు పృథివికి అధోభాగమునందును, పార్శ్వదేశములందును, ఊర్ధ్వదేశమునందును వ్యాపించియున్నాఁడు. నీయందు సర్వప్రపంచముకలిగెను. నీయందెకలుగఁబోవుచున్నది. ఇట్లునీచేసృజింపఁబడిననీరూపమగుహిరణ్యగర్భునియుదరముననఖిలప్రపంచమునణఁగియుండుటచే నన్నియునీయందున్నవని వేఱుగాచెప్పవలయునా. సర్వహుతమగుయాగమును, పృషదాజ్యమును, హవిస్సును, గ్రామ్యములనియు, ఆరణ్యములనియు రెండువిధములగుపశువులును, ఋగ్యజుస్సామములును, ఛందములును, అశ్వములును, అజాదులును, ఒంటిపంటివరుసగల జంతుజాతములును, మృగములును, నీయందుఁగలిగెను. నీవదనమున బ్రాహ్మణులును, భుజములయందుక్షత్రియులును, తొడలయందువైశ్యులును, పాదములయందు శూద్రులును, నేత్రములయందుసూర్యుఁడును, మనస్సునచంద్రుఁడును, ప్రాణమునవాయువును, ముఖమునన్గ్నియు, నాభియందంతరిక్షమును, శిరమునస్వర్గమును, కర్ణములయందు దిక్కులును, పాదములయందుభూమియుకలిగెను. అతివిస్తీర్ణమగువటవృక్షము అతిస్వల్పమగు బీజమునన్ణఁగియుండునట్లు మహత్తగునీప్రపంచమంతయు ప్రళయకాలమునన్నాదికారణభూతుఁడ

మగునీయందణఁగియుండును. వటవృక్షము మఱలబీజమునుండికలిగి శాఖోపశాఖలుగవిస్తార మగునట్లు సృష్టికాలమున బ్రపంచమంతయును నీయందుండికలిగివిస్తీర్ణమయ్యెను. జగన్నాయకా! పొరలొకదానిమీఁదనొకటిమూసికొనియేకాకారమయి తోఁచులేఁత యరఁటి చెట్టు పెద్దదయివేఱుకాకయుండునట్లు సూక్ష్మచిదచిత్తులతోఁగూడి కారణరూపమగునీకన్న స్థూలచిదచిద్రూపమయి కార్యమగునీప్రపంచము వేఱుగాకయున్నది. శుద్ధసంతోషకరమై, నిత్యమై, యనవరతము ఏకరూపమయియుండుజ్ఞానవిశేషము నీయందేయున్నది. సంతోషదుఃఖములనుగలుగఁజేయునదియు, కేవలదుఃఖమునుగలుగఁజేయునదియునగుజ్ఞానములు నీయందులేవు. ఏలయనిన నీవుప్రాకృతములగుసత్వాదిగుణములతోఁగలియక యప్రాకృతశుద్ధసత్వమయుఁడవయియున్నాఁడవుగదా. ప్రపంచమునకంటె వేఱైయేకాత్మయైసర్వభూతశరీరకుఁడవయి వెలుఁగొందునీకు వందనముచేసెద. ప్రపంచమున శ్రేష్ఠులగుబ్రహ్మాదుల స్వరూపివయి,సర్వభూతాంతర్యామివైననీకు నమస్కరించెద. సూక్ష్మప్రకృతియు,స్థూలప్రకృతియు, పురుషుఁడును, విరాట్, స్వరాట్, సమ్రాట్, అనువారలును మఱియునన్నియు నీవేయగుచున్నాఁడవుగదా? మఱియు నందఱియొక్కయంతఃకరణములయందు అక్షయజ్ఞానమయుఁడవయిప్రకాశించుచున్నాఁడవు. నీవాకాశమునందుశబ్దమవయి,పురుషునియందు పౌరుషమవయి,సూర్యునియందు తేజమువై ఇట్లు ఆయాపదార్థములయందు దానిదానిసారాంశమవయియున్నాఁడవు. నీయందుసర్వమునున్నది. కానసర్వాత్మకుఁడవగునీకు వందనముచేసెద. ఇట్లు నీవన్నిటికిని కారణమవయియన్నిటిని వ్యాపించియన్నిటిలోపలనువసించెదవు. కాఁబట్టినీవేనామనోరథమునంతయునెఱుఁగుదువు. అందుచేనేనువిన్నవింపఁదగినదేదియులేదనిప్రార్థించిన కేశవస్వామినిజూచి శ్రీమత్పండరినాథుఁడు నీవిపుడువిన్నవించినదంతయు నిజమయియున్నది. నీమనోరథమును నీవాక్కులచేవినఁగోరెద. లంకణముండినశిశువునకు వ్యాధిమానెను. అన్నమిడుఁడనివైద్యుఁడుచెప్పినను తల్లిదండ్రులుసంతసింపరు. శిశువు అమ్మానన్నాఁకలిబాధించుచున్నది. అన్నముకావలయుననియడిగిన జననీజనకులానందమును జెందియాశిశువునకుతోడనే యన్నమిడుదురు. అట్లునేనుసర్వజ్ఞుఁడనైనను నీవాక్కులచే నీమనోరథమునువిని యానందింపవలయుననిమనోరథించితిననియనుగ్రహించినభగవంతునికి మఱలవందనముచేసి కేశవస్వామి యిట్లనివిన్నవించెను. ఓజగదీశా! నేనునిందాస్తుతులను సమముగభావించియున్నాఁడను. కాన నాకయిచింతలేదు. రాత్రివసనాభిని స్వీకరించినయనేకసాధుజనులు శరీరవియోగమును జెందిరేని నీదివ్యనామమైభవమునకును, నీప్రసాదప్రభావమునకునుమిగులనపకీర్తికలిగియుండును. దుర్బుద్ధులదుష్టాలాపములువిని నేనును నీయంతరంగభక్తులును ఎట్లుసహింతుము. వసనాభివిషమును నీవు లోఁగొని యట్టికొఱఁతకలుగక మమ్మందఱిని రక్షించితివి. ఈరక్షరక్షకాదు. తెలిసియు, తెలియకయు, అకృత్యకరణ, కృత్యాకరణ, భగవదపచార, భాగవతాపచారా, సహ్యాపచారంబులననాదికాలముగఁజేసియున్నారము. మాతప్పులు సర్వజ్ఞుఁడవగునీకును లెక్కింపఁదరముకాకయుండును. ఇట్టిమాదోషంబులను భోగ్యముగఁగొనిమారక్షణభారమును నీవే వహింపవలయుననిప్రార్థించెదము. అగ్నితనయందుంచఁబడిన సమస్తపదార్థములనుశుద్ధిచేయునేగాని ఆపదార్థములయందలియశుద్ధిచే తానశుద్ధముకానేరదు. అట్లుండ భక్తరక్షణమునకై వసనాభి

యందలిదోషమునుబోఁగొట్టిననీశరీరమున వసనాభిదోషము వ్యాపించుట న్యాయ్యముకాదు. చంటిబిడ్డలకయి యాపథసేవచేయుతల్లివలె నిన్నే చింతించుచు తమయాత్మభారములను నీయందర్పించి నిర్భరులయియుండుపరమభాగవతులయోగక్షేమమును నీవేవహించివారల యాత్మయాత్రను, దేహయాత్రను నీవే నిర్వహించుచుండుటను లోకులకు చూపుటకయి వసనాభిదోషమునుగ్రహించి నీభక్తులనుకాపాడినయద్భుతమును నీశరీరవైవర్ణ్యముచే ప్రకటించితివికాఁబోలు. ఇఁకను మాయందనుగ్రహించి యీవికృతవేషమునువిడిచి మునుపటి యట్లుసేవయొసఁగవలయునని మేమందఱమును వేడుచున్నారమనివిన్నవింపఁగా భగవంతుఁడు మిగుల సంతోషించి తనశరీరవైవర్ణ్యమునుమ్మాని మునుపటివలె సేవయొసఁగెను. అది చూచియందఱునాశ్చర్యపడి జయ జయ శబ్దములుచేసి పుండరీకవరదునిని పెక్కువిధంబుల స్తుతించి కేశవస్వామివైభవమును వేనోళ్లఁగొనియాడిరి. అవర్తకుఁడు పరమవైరాగ్యశీలుఁడయి కేశవస్వామికి అంతేవాసియయియుండెను.

విషహారాయనమః.

గోమాబాయిచరిత్రము.

గోమాబాయియనునొకవిధవస్త్రీ శమదమాదిసద్గుణాన్వితయయి, నిరంతరముభగవధ్ధ్యానముచేయుచుండును. ఈమె నిరుపేదయై మిగులజీర్ణమగునొకవస్త్రమునుధరించిభిక్షమెత్తుకొనిజీవించుచుకాలముగడపుచుండెను. ఈస్త్రీ శ్రీమత్పండరిపురముననుత్సవమును సేవించుటకయివచ్చి భీమనదియందు ప్రవాహమధికమయియుండినందున తన్ను ఆగట్టునఁ జేర్పవలయునని యోడవానిని మిగులప్రార్థించెను. ఆమెయెంతప్రార్థించినను కాసీయక యోడలోనిన్నెక్కించుకొనననియోడవాఁడు చెప్పెను. ఆయువతి వానినిజూచి నాయనా ! నేను పండరినాథునిసేవనపేక్షించి బహుదూరమునుండివచ్చితిని. నేనుకాసువీసముచేతలేనిదానను. కాఁబట్టినాయొద్దనుండుపిండిలో నీకుఁగొంతయిచ్చెదను. (గోవిందేతియదాక్రందత్ । కష్ణామాందూరవాసినం । ఋణంప్రవృద్ధఇవమే । హృదయాన్నాపసర్పతి) అనఁగా గోవిందాయనిదూరవాసియగునన్నుద్రౌపదిపిలిచినది ప్రవృద్ధఋణమయి నాహృదయమున నాఁటియున్నదని పూర్వము వాసుదేవుఁడుచెప్పెనుగదా. ఆభగవంతుఁడిపుడు భక్తులకయి పండరిపురమున సాన్నిధ్యముచేసియున్నాఁడు. నేనెంతగవేడినను ఈయూరిలోనుండునీకు కనికరములేకపోవుట వింతయయియున్నది. పూర్వజన్మమున కఠినహృదయనై పరోపకారముచేయకుంటినిగాన నాప్రార్థనకు నీమనస్సుకరఁగకున్నదని చెప్పఁగా వినియాయోడవాఁడుతల్లీ! వట్టిమాటలతో ప్రయోజనములేదు. పిండినాకేల. ఇతరులవలెకాసిచ్చిననోడలోనెక్కించుకొని యాగట్టునఁజేర్చెదనని చెప్పియోడను తోసికొనిపోయెను. రాత్రియయినంతట గోమాబాయి యీగట్టుననొంటరిగనుండి పండరినాథునినిస్మరించియిట్లనిస్తుతించెను. సకలశబ్దజాతములెవనియందు స్థితిని జెందియున్నవో యట్టిసకలలోకసృష్టిసంహారకర్తయగుపరమపురుషునికివందనముచేసెద. సూర్యచంద్రాదిజ్యోతిర్గణములను బ్రకాశింపఁజేసెడియప్రాకృతతేజోమయుఁడును, ఉపమానరహితుఁడును, సూక్ష్మరూపియు, కాలదేశపరిచ్ఛేదములేనివాఁడును, చరాచరాత్మకమగు జగత్తునకుఁగారణభూ

తుఁడునునగు శ్రీవిష్ణుదేవునకు నమస్కరించెద. ఎవనికి పగలు మొదటిరూపమై, రాత్రి రెండవరూపమయి, సంధ్యమూడవరూపమయియుండునోయట్టి కాలరూపియగు పరమేశ్వరునకు దండములు సమర్పించెద. ఎవఁడమృతమయియనుదినంబును దేవతలచేతను, పితృదేవతలచేతను భుజింపఁబడుచున్నాఁడో, యోషధులద్వారా సమస్తప్రాణులకు జీవనమయియున్నాఁడో యట్టిచంద్రరూపియగుభగవంతునికి ప్రణామములు చేసెద. ఎవఁడు వేడిమియగు తనకిరణములచే నంధకారమును బోఁగొట్టి యాకాశమును బ్రకాశింపించుచు తాపమునకును, శైత్యమునకును, జలమునకును, కారణమైయుండునో యట్టిసూర్యాత్మకుఁడగుభగవంతునికి నమస్కరించెద. ఎవఁడు కఠినరూపియయి, యీలోకమునంతయు భరించుచు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల కాశ్రయమయియుండునో యట్టిభూమ్యాత్మకుఁడగుభగవంతునికి వందనము చేసెద. ఎవఁడు శుక్లశోణితములయి లోకమునకుఁ గారణమగు జలరూపమైయున్నాఁడో యట్టిభక్తరక్షకుని స్వరూపమునకు వందనములు చేసెద. ఎవఁడు సకలదేవతలకునుముఖమయియుండి హవ్యమును, పితృదేవతలకు ముఖమయియుండి కవ్యమును భుజించుచున్నాఁడో యట్టియగ్నిస్వరూపియగు పరమాత్మకు నమస్కరించెద. ఎవఁడు ప్రాణాపానాదిరూపమయి శరీరములయందుండి యనవరతము శ్వాసము విడుచుట మొదలగు కార్యములను జేయించున్నాఁడో యట్టివాయ్వాత్మకుఁడగు పరంధామునకు వందనము చేసెద. ఎవఁడు సకలభూతములకు నవకాశమునిచ్చుచు ననంతమూర్తియయి, శుద్ధమయియుండు నాకాశరూపియయియున్నాఁడో యట్టిస్వామికి ప్రణామములు చేసెద. ఎవఁడు సకలేంద్రియములకు నాశ్రయుఁడయి శబ్దాదివిషయాత్మకుఁడయియుండునో యట్టిజగత్కర్తయగు శ్రీకృష్ణునికి నమస్కరించెద. ఎవఁడు క్షరమును, అక్షరమునగు నింద్రియస్వరూపియయి, శబ్దాదివిషయములను గ్రహించుచు, జ్ఞానమున కాధారమయియుండునో యట్టిప్రణతార్తిహరునికి దండములు సమర్పించెద. ఇంద్రియములచే గ్రహింపఁబడు శబ్దాదివిషయములను, ఆత్మ యెఱుఁగుటకు సాధనమయియుండు మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అని చెప్పఁబడు నంతఃకరణస్వరూపమగు సర్వేశ్వరునికి వందనము చేసెద. అనంతుఁడగునెవనియందు సకలప్రపంచమున్నదో, యెవనియందుండి కలిగెనో, యెవనియందు లయించెనో, యట్టిప్రకృతిస్వరూపునికి నమస్కరించెద. ఎవఁడు ప్రాకృతమగు సత్వాదిగుణములు లేక శుద్ధుఁడయియుండియు ప్రకృతిసంబంధమగు సత్వాదిగుణములుగలవానివలె భ్రాంతిచే నగపడుచున్నాఁడో యట్టిజీవాత్మరూపియగు పురుషోత్తమునకు వందనము చేసెద. జ్ఞానము సంకోచించుటయు, వికాసమగుటయు ననువికారములు లేనివాఁడును, జన్మరహితుఁడును, శుద్ధుఁడును, ప్రకృతిగుణసంబంధము లేనివాఁడును, ప్రకృతిపురుషులకంటె మిగుల గౌరవముగలవాఁడును నయియుండు ముక్తాత్మస్వరూపియగు శ్రీవిష్ణుదేవునికి నమస్కరించెద. దీర్ఘమును, హ్రస్వమును, స్థూలమును, సూక్ష్మమును, రక్తమును, నీలమును, స్నేహమును, ఛాయయును, దేహమును, అవయవములును, మధ్యావకాశమును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములును, నేత్రశ్రోత్రాదులును, వాక్పాణిపాదాదులును, అంతఃకరణమును, నామగోత్రములును, అన్నపానాదులచేఁగలుగు సుఖమును, తనకన్యమగు వేఱొక తేజస్సును, తనకొక కారణమును, భయ, భ్రమ, నిద్ర, జరా, మరణాదులును, సంచారమును లేనిదై దేనిచేతను మూయఁబడనిదై

యమృతమయమై యాద్యంతరహితమై, పరమేశ్వరత్వాదిసకలకల్యాణగుణయుక్తమై, సకలాశ్రయమై, తనకొకయాశ్రయములేనిదయి, వాఙ్మనసులకగోచరమై, కంటికగపడనిదయి యిట్లుసర్వప్రకారములచేతనువిలక్షణమై పరమప్రాప్యమైయుండుశ్రీవిష్ణుభగవంతునిస్వరూపమునకు దండములుసమర్పించెదనని స్తుతించి శ్రీరుక్మిణీపతే! గ్రాహగ్రస్తుఁడగుగజేంద్రునిని రక్షించితివి. స్తంభమునవతరించిప్రహ్లాదునిఁగాచితివి. వస్త్రములనిచ్చిద్రౌపదిమానమును గాపాడితివి. అంబరీషునిరక్షింపఁజక్రమునుబంపితివి. అర్జునునికయియాయుధమునంటితివి. ఇట్లెనీవునన్నేలయుపేక్షించితివి. నన్నీభీమనదినిదాటించి నీసేవయొసంగవేని భవార్ణవమునుదాఁటించి నిత్యసేవయొసంగుదువని నీభక్తులునిన్నెట్లువిశ్వసింతురని చెప్పుచుండఁగా పండరినాథుఁడొకయోడవానివేషముధరించి యోడనుదోసికొనివచ్చి గోమాబాయిఁగని జూచి యోతల్లీ! నీవేలయిచటనొంటరిగవసించి శోకించుచున్నదానవు. నీకాగట్టునకు పోవలయుననుపేక్షకలదేని యీయోడలోఁగూర్చుండి రమ్మనిచెప్పినవిని గోమాబాయి యాయోడవానినిఁజూచి యోభాగ్యరాశీ! నేనునిరుపేదరాలను. నీకిచ్చుటకు నాయొద్దకాసులేదు. నాయొద్దనుండుపిండిలోనీకుగొంతయిచ్చెదను. నన్నాగట్టునవిడుపుమని చెప్పెను. అప్పుడు లక్ష్మీకాంతుఁడు మందహాసముచేసియిట్లనియె. నన్నుగన్నతల్లీ! నేను నిరపేక్షుఁడను. ఒకరిచ్చుకాసును బరిగ్రహించువాఁడనుగాను. పండరిపురమునవసించుచు విఠ్ఠలనాథునిసేవార్థమువచ్చుబీదలనక్కడితోడ ఆవలిగట్టునఁజేర్చుచుందును. నాయోడలోఁగూర్చుండి నామనోరథమునునెఱవేర్చువారు నాకు పరమోదారులయియుందురని చెప్పఁగా వినిగోమాబాయిసంతోషించి యోపుణ్యవంతుఁడా! యిప్పుడురాత్రిజామయ్యెను. ప్రవాహమధికమయియున్నది. ఈచింపిగుడ్డతప్ప వేఱువస్త్రములేదు. ఇదియును తడిసిపోయెనేని వృద్ధురాలనగునేను చలిబాధకెట్లుసహింతునని చెప్పినవిని యాయోడవాఁడో జననీ; నీవు భయపడకుము. నీవునాభుజమునఁగూర్చుండుము. నీకాళ్లకుజలముతగులకుండనిన్నువహించుకొనిపోయియాగట్టునఁజేర్చెదను. నన్నునీపుత్రునిఁగనభిమానించి శంకలేక నాభుజమునఁగూర్చుండుమని చెప్పి గోమాబాయిని తనభుజమున వహించుకొని యోడతోసికొనిపోయి యాగట్టునతడిలేనిమిట్టభూమిపై విడిచి యోతల్లీ! నీవస్త్రముతడియలేదుగదా. నీవుసంతోషముగపండరినాథునిసేవింపుము. నన్నుమఱువకుండుమని చెప్పిన గోమాబాయిసంతోషించి యోనాయనా! శ్రీమత్పండరినాథుఁడు నీరూపముగావచ్చి యనాథనగునన్నీగట్టునఁజేర్చెను. నీవునిరపేక్షుఁడవయినను నాప్రార్థనకయి నేనిచ్చుపిండినంగీకరింపుము. మహాత్ములు శరణాగతులప్రార్థనలనుల్లంఘింపరని విన్నవించిన ఆపురుషోత్తముఁడు ఓతల్లీ! రేపటికిద్వాదశి. కాననీయొద్దనుండుపిండినొకయతిథికిమ్ము. అందుచేనేనుమిగులతృప్తిని జెందుదును. నిన్నునదినిదాఁటించినట్లు నన్నునమ్మినవారినిభవార్ణవమునుదాఁటింతును. భాగవతపాదరజమునుగోరుచుండునాకు భాగవతాగ్రగణ్యవగునీపాదస్పర్శము సిద్ధించెను. నేనుమిగులధన్యుఁడనయితిని. నన్నునీవుమఱువకుండునట్లు నేను నిన్నుమఱువకుందును. నన్నునీవనవరతముధ్యానముచేయునట్లు నేనునునిన్నెడతెగకధ్యానించుచుందునని చెప్పియోడతోడ నదృశ్యుఁడయ్యెను.

గోమాబాయి పుండరీకవరదుని యాశ్రితవాత్సల్యమును గొనియాడుచు గోపురద్వారమున వందనము చేసి యారాత్రి భగవద్ధ్యానము చేయుచు జాగరవ్రతము ననుష్ఠించి ప్రాతఃకాలమునందు చంద్రభాగలో స్నానము చేసి చీరనార వేసికట్టుకొని తిలకమును ధరించి భగవన్మంత్రమును జపించి సన్నిధిలోపల ప్రవేశించి పుండరీకవరదునిని దర్శించి చంద్రభాగతీరమునకు వచ్చి యతిథిని నిరీక్షించుచుండెను. ఆయూరిలో పెక్కండ్రు భాగవతులు బ్రాహ్మణులను, దీనులను ఇష్టాన్నములచే సంతుష్టులం జేయుచుండినందున గోమాబాయి పిండి నంగీకరింపను కరును గోరిరారైరి. అపుడు గోమాబాయి పండరినాథా! అవ్యక్తుఁడవగు నీవు అతిథిరూపుఁడవయి చేతనులు చేయు పూజల నంగీకరించి వారలను రక్షించుచున్నాఁడవు. ఇట్టినీవు నన్ను పేక్షించిన నేనేమి చేయుదునని దుఃఖించుచుండ పండరినాథుఁడొక వృద్ధబ్రాహ్మణవేషమును ధరించి గోమాబాయి యొద్దకు వచ్చి యోతల్లీ! నేను మిగుల బీదవాఁడను. నన్నెవరు నాదరించువారు లేరు. నన్నాఁకలి మిగుల బాధించుచున్నది. నాకొక రొట్టె కాల్చియిచ్చితివేని నేను మిగుల నానందింతును. భక్తిపురస్సరముగ బలిచక్రవర్తి యిచ్చిన దానమునకు శ్రీవామనమూర్తి సంతోషించినట్లు నేను నీవిచ్చు రొట్టెను భుజించి యెంతయు నానందింతుననినతని గోమాబాయి సంతోషించి యడవి పిడకలనేఱి తెచ్చి శీఘ్రముగ నొకరొట్టె కాల్చియిచ్చెను. భగవంతుఁడు నన్నెవరిట్లాదరింతురని చెప్పి యారొట్టెను పరిగ్రహించి కూర్చుండి భుజింపఁబోవునపుడు శ్రీరుక్మిణీదేవి యొకవృద్ధసుమంగలియయి వచ్చి ప్రాణనాథా! నీవు నన్నింటరిగ విడిచి వచ్చి యిచట రొట్టెలను భుజించుచున్నాఁడవు. నన్ను విడిచి నీవు మాత్రము భుజించుటకు నీకెట్లు రొట్టెలు రుచించెనని చెప్పఁగా విని భగవంతుఁడు మందస్మితము చేసి గోమాబాయిని జూచి యోతల్లీ! యీసుమంగలికి నొకరొట్టె కాల్చియిమ్ము. సౌభాగ్యమునకంతము లేదని చెప్పిన గోమాబాయి సంతోషించి తనచేత మిగిలియుండిన పిండి నొకరొట్టెగఁ గాల్చి శ్రీరుక్మిణీదేవికిచ్చెను. ఆదివ్యదంపతులు రొట్టెలను భుజించి తృప్తులయి గోమాబాయిని జూచి నీయారాధనముచే మేము పరితృప్తులమయితిమని చెప్పి యామెయిచ్చిన తులసీదళములను స్వీకరించి పూర్వము శబరిననుగ్రహించినట్లు గోమాబాయిననుగ్రహించి యదృశ్యులయిరి.

ప్రణతార్తిహరాయ నమః.

లద్దిబ్సాహెబుచరిత్రము.

లద్దిబ్సాహెబు, అనుతురుష్కుఁడు పరమభాగవతుఁడయి, పరమవైరాగ్యశీలుఁడై, శమదమాన్వితుఁడయి, యనవరతము శ్రీహరినామస్మరణము చేయుచునుండెను. ప్రతిదినము ప్రాతఃకాలమున లేచి స్నానము చేసి భగవన్మంత్రమును జపించి శ్రీభగవద్గీతాపారాయణము చేసి భగవంతునారాధించి యతిథులను భగవత్స్వరూపులనుగా భావించి భక్తిచేసి భోజనాదులచే వారలను సంతుష్టులంగావించి పిదప భగవద్భాగవతశేషముగు నన్నమును తాను భుజించును. తనశక్తి కొలఁది ధర్మకార్యంబులను జేయుచుండును. ఇట్లు నియమములతోఁ గూడి లద్దిబ్సాహెబు భగవత్కీర్తనము చేయుచోటి కనేకులు వచ్చి శ్రవణానందముగ వినుచుందురు. ఒక తురుష్కుఁడితని యనుష్ఠానమును జూచి వీఁడు బొత్తి భ్రష్టుఁడయి యన్యమతము నవలంబించె

ననియసూయపడుచు నాదేశమునేలుపాచ్ఛాయొద్దకుఁబోయి యీవృత్తాంతమును జెప్పఁ
గావిని యాప్రభువుకోపగించి కొందఱుభటులనుబిలిచి మీరులద్దిబ్సాహేబునింటప్రవేశించి
వానిసర్వస్వమునుగొల్లగొనియాజాతిభ్రష్టుని నాయొద్దకుఁబట్టుకొనిరండని నియమించెను.
ఆభటులు రాజాజ్ఞనుశిరసావహించి లద్దిబ్సాహేబు శ్రీరామభజనముచేయుచోటికిఁబో
యి యతనిముఖముచూచి నంతట వారికి భక్తి విరక్తులుగలిగియతఁడుచేయుకీర్తనమును
వినుచుండిరి. పాచ్ఛాతనభటులుతిరిగిరానందున మరికొందఱుభటులనుబంపెను. ఇట్లెంత
ఱినిబంపిననందఱును మునుపటివారియట్లగుచుండిరి. అందుచే పాచ్ఛాకు కోపమధికమయి
తానేబయలుదేరి లద్దిబ్సాహేబునింటికివచ్చెను. అపుడాభాగవతోత్తముఁడు బృందావన
సమీపమునఁగూర్చుండి భాగవతముచదువుచుండెను. అప్పుడనేకులతనిచుట్టును గూర్చుండి
వినుచుండిరి. ఆయిల్లంతయు గోమయముచే శుద్ధిచేయఁబడి రంగవల్లులచే నలంకరింపఁబడి
యుండెను. గోడలయందు శ్రీకృష్ణలీల లతిమనోహరముగ వ్రాయఁబడియుండెను. ఆస్థ
లము భూలోకవైకుంఠమనఁదగియుండెను. దీనినంతయునుజూడఁగా పాచ్ఛాకు ఆహుతులు
చేయఁబడినయగ్నివలె కోపముప్రజ్వలించి యీదుష్టుఁడు మనకందఱికినపకీర్తి కలుగఁజే
యుటకై మనకులంబునఁబుట్టెను. ఈజాతిభ్రష్టునికి క్రూరదండనవిధింపవలయునని తనలో
నిశ్చయించెను. పిదపనచటవ్రాయఁబడియుండు చిత్రములనుజూడఁగా శ్రీరాధాదేవి శ్రీ
కృష్ణునికి తాంబూలము మడిచియిచ్చునట్లొకచోట వ్రాయఁబడియుండెను. పాచ్ఛాయది
చూచి యిదియేమియని లద్దిబ్సాహేబునడిగెను. అపుడు లద్దిబ్సాహేబు శ్రీకృష్ణపరమా
త్మకు శ్రీరాధాదేవి తాంబూలముమడిచియిచ్చుచున్నదనిచెప్పెను. అదివిని పాచ్ఛా అట్ల
యిన శ్రీకృష్ణుఁడేల ఆతాంబూలమంగీకరింపలేదని యడిగెను. స్వామికిష్టమయినప్పుడంగీ
కరించునని లద్దిబ్సాహేబుచెప్పియాచిత్రరూపుఁడగు భగవంతునికి వందనములుచేసి యి
ట్లనిస్తుతించెను. స్వామీ! వేదములకగోచరుఁడగువాఁడా! బ్రహ్మవిషయమగువివేకముచేఁ
గలుగుజ్ఞానమును,శబ్దబ్రహ్మవిషయమగునాగమముచేఁగలుగుజ్ఞానమును అయినపరమనియు,
అపరమనియునుజెప్పఁబడురెండువిద్యలును నీవే!ఉపనిషత్తులయందుఁజెప్పఁబడినవియయి
రూపయుక్తమును, రూపరహితమునైయుండు బ్రహ్మద్వయమగు ప్రకృతిపురుషులు నీరూప
ములయియున్నారు. సూక్ష్మములకును, స్థూలములకును ఆత్మయగువాఁడా! సర్వస్వ
రూపివగువాఁడా! సర్వజ్ఞుఁడగువాఁడా! ఋగ్యజుస్సామాథర్వణములును, శిక్ష, కల్పము,
నిరుక్తము, ఛందము, జ్యోతిషము, వ్యాకరణము అనఁబడువేదాంగములును, ఇతిహాస,
పురాణములును, మీమాంస, తర్క, ధర్మశాస్త్రములునునీవే. ఓయధోక్షజా! ఆదిమూల
మగువాఁడా! జీవాత్మపరమాత్మలును, స్థూలసూక్ష్మశరీరములును, అవ్యక్తమునునగువీని
గుఱించి విచారణచేయువేదాంతవాక్యము నీకంటె భిన్నమయినదికాదు. ఇంద్రియగోచ
రముకానిదియు, నుపమానరహితమయినదియు, నచింత్యమయినదియు, దేవాదినామము
లును, శుక్లాదివర్ణములును, కరచరణాద్యవయవములును లేనిదియు, క్లేశకర్మాదులులేనిది
యు నగుముక్తస్వరూపము నీవే. పరమస్వరూపమనఁబడునదియు నీవే. ఓస్వామీ! నీవు
చెవులులేకయేవినుచున్నాఁడవు. కన్నులులేకయే చూచుచున్నాఁడవు. కాళ్లులేకయే పరు
గెత్తుచున్నాఁడవు. చేతులులేకయేగ్రహించుచున్నాఁడవు. రూపములేకయేనీకిష్టమగుననేక

రూపములను ధరించుచున్నాఁడవు. ఎవరికి నెఱుఁగఁగూడనివాఁడవయి యన్నియు నెఱుఁగు చున్నాఁడవు. ఓపరమాత్మా! అణువునకు నణువయి చూచుటకు సాధ్యముకాని స్వరూపముకల నిన్నుఁ జూచువానికి అజ్ఞానము నివర్తియగుచున్నది. ఇట్టియుపాసకునిబుద్ధి నీయుత్కృష్ట రూపమునుదప్ప మఱియొకటిని గ్రహింపదు. నీవేయన్నిటికిని నాధారభూతుఁడవు. నీవేసర్వ లోకరక్షకుఁడవు. సర్వభూతములు నీయందణఁగియున్నవి. కలిగినవియు, కలుఁగఁగలవియు నెవియో, యణువునకు నణువయియుండునదియెదియో ప్రకృతికంటె నధికుఁడగు పురుషుఁ డెవఁడోయివియన్నియు నీవాకఁడవేకాని వేఱు కాదు. ఎవఁడొక్కఁడయియుండియు నా లుగువిధములయి లోకమునకు తేజస్సును, ఐశ్వర్యమును ఇచ్చుచున్నాఁడో యట్టియగ్ని భగవంతుఁడునీవే. సర్వదిక్కులయందును నేత్రములుకలవాఁడవయి యంతములేని స్వరూ పముకల భగవంతుఁడా! నీవుత్రివిక్రమావతారముచేసి మూడులోకములయందునునీదివ్యచర ణముంచితివి. అగ్ని యొక్కటియైయుండియు రూపములేక యనేకవస్తువులనాశ్రయించి యనేకరూపములయి ప్రకాశించునట్లు నీవుసర్వవ్యాపకముగు నేకరూపివయి యుండియు సకలస్వరూపములనాశ్రయించి వానినిమక్కువతోడ వర్ధింపించుచున్నాఁడవు. ప్రకృతిసం బంధములేనిదయి యుపమానరహితమయి యొక్కటయి జ్ఞానైకవేద్యముగునీయుత్కృష్ట స్వరూపమును జ్ఞానులేచూచుచున్నారు. ఓపరమాత్మా! త్రికాలములయందలి పదార్థముల యందు నీకన్యమయినదియెద్దియును లేదు. కారణకార్యరూపములయి సమష్టివ్యష్టియని చె ప్పఁబడునవ్యక్తమును, వ్యక్తమునునగుస్వరూపము కలవాఁడవునీవే. మఱియు సకలవ్యూహ ములకును కారణమవయి సమష్టియని చెప్పఁబడు శ్రీవాసుదేవమూర్తియయి, కార్య మయి, వ్యష్టియని చెప్పఁబడు సంకర్షణానిరుద్ధప్రద్యుమ్నమూర్తివయియున్నాఁడవు. నీవన్ని యు నెఱిఁగినవాఁడవు. అన్నిటినిగలవాఁడవు. అన్నిటినినిర్వహింపఁదగిన సత్యజ్ఞానబలాతిశ యగౌరవయుక్తుఁడవు. ఇదియును గాక నీవు వృద్ధిక్షయములు లేనివాఁడవు. ఒకరికినిలోఁబడ కస్వతంత్రుఁడవయియుండువాఁడవు. ఆద్యంతశూన్యుఁడవయి సకలమును స్వవశముచేసి కొనియున్నాఁడవు. మఱియు నీవుకార్పణ్యము, ఆలస్యము, భయము, క్రోధము, కామము, మొదలగుదుర్గుణములు లేకయున్నాఁడవు. ఓస్వామీ! నీవు దోషరహితుఁడవయి నీకృపతప్ప మఱియొకదానిచేఁ జెందఁగూడనివాఁడవయి యాధారరహితుఁడవయి నిత్యుఁడవయి నిరం కుశముగునుత్సాహముతోఁగూడినవాఁడవయి యున్నాఁడవు. మఱియు సకలమునకీశ్వరుఁ డవయి ముఖ్యాధారమవయి తేజస్సులకు తేజస్సైయున్నాఁడవు. ప్రకృతిమొదలగు నావ రణములచేతను, కర్మములచేతను మూయఁబడనివాఁడా! మఱియొకయుపాయము లేనివారి చే భావింపఁబడఁదగినవాఁడా! త్రిపాద్విభూతియందు వేంచేసియుండువాఁడా! శ్రీపురుషో త్తమా! నీకు దండముసమర్పించెద. శ్రియఃపతీ! నీవనేకవిధములుగఁ జేయునవతారములన్ని యు ధర్మసంస్థాపనార్థము స్వేచ్ఛచేఁగలిగినవేగాని నరకానుభవముచేయువారలకు వలె దుఃఖానుభవమునకయి కాదు. స్వర్గమునందుండు వారికివలె సుఖానుభవమునకును గాదు. భూమియందుండువారివలె సుఖదుఃఖానుభవమునకును గాదు. ధర్మాధర్మములచేఁగలిగినవి యుఁగావనిస్తుతించి మఱల భగవంతునుద్దేశించి నీయవతారములు సాధుపరిత్రాణ, దుష్కృ తవినాశ, ధర్మసంస్థాపనములకయి చేయఁబడినవియని నీవే భగవద్గీతయందుఁ జెప్పియు

న్నాఁడవుగదా. అట్టినీలీలలను ఈపాచ్ఛాపరిహాసముచేయుచున్నాఁడు. వీఁడునీభక్తుఁడనగునన్నును నాచేఁజేయఁబడు నీవిషయమగుకీర్తనమును వినుచుండుసాధువులను పరిభవింపఁబూనుకొనియున్నాఁడు. నాకయి నేను వగవలేదు. సాధువులకయివగచెదను. ఈసమయమున నీయతిమానుషచేష్టితమునుజూపి నీదివ్యప్రభావమును వ్యక్తముచేయుము. గజేంద్రునిరక్షించినదియు, ధ్రువునికిసర్వోత్కృష్టపదవినిచ్చినదియు, ద్రౌపదికివస్త్రప్రదానముచేసినదియు, ప్రహ్లాదునికయిసభాస్తంభమున నవతరించినదియు నిజముగనేనియిపుడు నీయతిమానుషచేష్టితమునుజూపవలయు. అట్లుచేయవేని నీదివ్యచరిత్రములసబద్ధమని యీపాచ్ఛా దురుక్తులాడునదివిని లోకులందఱును నాస్తికులగుదురు. నీవిషయమగునిందను విని నేనెట్లుసహింతునని విన్నవింపఁగా చిత్రరూపముయియుండిన పండరినాథుఁడు పాచ్ఛా మొదలగునందఱునుజూచుచుండనోరుతెఱచి రాధమడిచియిచ్చుతాంబూలమును స్వీకరించెను. రాధచేతనుండినతాంబూలమదృశ్యమయ్యెను. అపుడచటనుండినభాగవతులందఱు మైమఱచినృత్యముచేయుచు శ్రీపండరినాథునిఁగీర్తించి మహానుభావుఁడయిన యీలద్దిబ్సాహేబు శ్రీపాండురంగనియవతారమనికొనియాడిరి. పాచ్ఛా అత్యాశ్చర్యమును జెంది భాగవతాగ్రగణ్యుఁడగు లద్దిబ్సాహేబునకు సాష్టాంగవందనముచేసి మహాత్మా! నీప్రభావమునెఱుఁగక యపచారపడితిని. శ్రీకృష్ణపరమాత్మ నీకత్యంతము విధేయుఁడయియున్నాఁడు. భాగవతోత్తములగు కబీర్దాసులు మొదలగువారిప్రభావమును, వారికిభగవంతుఁడు వశవర్తియయియుండినవైభవమును, భగవంతుఁడవతారములుచేసెననుకథలును కల్పనలని పరిహాసముచేయుచుంటిని. ఇపుడు నీయనుగ్రహముచే అన్నియు నిజములనియెఱిఁగితిని. శ్రీమత్పండరినాథుఁడు నీకు విధేయుఁడై యుండ నీకసాధ్యమెద్దియును లేదు. చిత్రరూపియగుశ్రీకృష్ణుఁడు రాధయిచ్చుతాంబూలమును స్వీకరించినది వింతకాదు. నీవుకోరితివేనియిచట వ్రాయఁబడియుండు భగవద్భాగవతచిత్రరూపములన్నియు మూర్తీకరించుననుటకు సందియములేదు. భగవంతునియవతారములవలె నీయవతారమును లోకోజ్జీవనార్థము చేయఁబడినదని యెఱింగితిని. భవార్ణవమగ్నుఁడనగునాకు నీయభిమానమనెడినావనొసఁగియుద్ధరింపుము. భాగవతాభిమానముచే మనుష్యపశుపక్షులు పరమపదమును జెందుననుప్రమాణము నావిషయమున ననుభవసిద్ధమగునట్లుచేయవలయునని ప్రార్థింపఁగా లద్దిబ్సాహేబు ఓరాజా! లోకమునందలిరాజులు అజ్ఞానముచేనంధులయి హేయమై త్యాజ్యమగుశరీరమున విశేషాభిమానమునుంచిరి. వారలీభూమినాకెట్లు వశమగును. నాపుత్రునికెట్లువశమగును. నాకులమువారికెట్లు వశముయియుండును. దీనికిఁదగినయుపాయమును జేయవలయునను చింతతోఁగూడినవారయిఁగతించిరి. ఇపుడుండు రాజులును మునుపటిరాజులును వారికి మునుపటివారును, ఇఁకఁగలుగఁగలరాజులును, వారిని వెంబడించి రాఁగలవారును ఇట్టివారలేయగుదురు. భూదేవి యీరాజులనుజూచి బుద్ధిమంతులగురాజులకేలయిట్టి యజ్ఞానముగలిగియున్నది. నీటిబుగ్గవ సమమగుశరీరస్థితిని శాశ్వతమని తలఁచుచున్నారు. మొదట తమ్ము జయించి పిదపక్రమముగమంత్రులను, సేవకులను, లోకులను, జయించియంతకుమీఁద శత్రువులను జయింపవలయునని తలఁచుచున్నారు. ఇట్లు శత్రువులను జయించుటచే సముద్రపరివేష్టితమగుభూమినంతయుస్వాధీనము చేసికొనవచ్చునను పేరాసను జెందియత్నించుచున్నారేగాని ప్రు

త్యువు సమీపించియున్నదని యెఱుఁగకయున్నారు. మంచిది. వారలు తలఁచునట్లు సముద్ర పరివేష్టితభూమండలము వారలకు స్వాధీనమయినను దీనికి మొదటికారణమగు నాత్మజయమునకిదియొక ప్రయోజనమగునా? కానేరదు. మోక్షముగదా ఆత్మజయమునకు ప్రయోజనమగును. ఓహో! యిట్లు తలఁచి పాటుపడిన తాతతండ్రి మొదలగువారందఱు తమతోడ దీసికొనిపోనేరక విడిచిపోయినననన్ను వారలబిడ్డలు స్వాధీనముచేసికొనవలయునని తలఁచుచున్నారుగదా. ఇదియేమి మూఢస్వభావము. అహంకారయుక్తులగునీరాజులలో పితృపుత్రులకును, అన్నదమ్ములకును నానిమిత్తము మోహముచే యుద్ధము కలుగుచున్నది గదా. ఈ భూమియంతయు నాది. నావంశమువారికిది శాశ్వతము అనుహీనబుద్ధి సకలరాజులకును, తమకుమునుపటివారిమరణమునకు పిదపఁగలిగియేయున్నది. ఇదియాశ్చర్యము. ఇట్టిమమతను జెంది నన్ను దీసికొని పోనేరక విడిచి మరణమును జెందినయొకనిఁజూచియు పిదపకలుగువారిచిత్తమునను నిట్టిమమతయెట్లు కలుగుచున్నది. తమదూతలముఖముగ నన్యరాజులకు ఈభూమి నాది. నీవు దీనిని విడిచిపొమ్మని చెప్పిపంపు రాజులను జూడఁగా నాకు మిగులనవ్వు కలుగుచున్నదని భూదేవి చెప్పెనని జనకచక్రవర్తికి అసితమహాముని చెప్పెను. మహాబలవంతులయి మహావీర్యవంతులయి యపరిమితైశ్వర్యవంతులయియుండిన యిక్ష్వాకు, జన్హు, మాంధాత, సగరుఁడు, రఘు, యయాతి, నహుషుఁడు మొదలగువారు కాలబలముచే నేమియు లేక మరణమును జెంది కథలయందు చెప్పఁబడఁదగినవారయి యుండుటనుజూచియు వివేకియగువాఁడెవఁడు భార్యా, పుత్ర, గృహ, క్షేత్రాదులయందు మమతనుంచును. మహాబలముగల భుజములతోఁగూడియుండియనేక సంవత్సరములు తపముచేసి గొప్పఫలములను జెంది యాగాదులఁజేసి మిగులఁగీర్తివంతులయియుండినవారును కాలబలముచే కాలధర్మమునొంది కథలయందే చెప్పఁబడినవారైరి. పృథుచక్రవర్తి సమస్తశత్రువులను జయించి సకలలోకములకు రాకపోకలను జేయుచుండెనుగదా? అట్టివాఁడును నిప్పనఁబడినదూదివలె కాలచక్రమునకు లోఁబడి యొకనిమిషమునఁ జచ్చిపోయెను. ఎవఁడు సమస్తశత్రువులను నాశముచేసి సమస్తద్వీపములను స్వాధీనముచేసికొని గౌరవముతోడ భూమినేలెనో యట్టి కార్తవీర్యార్జునుఁడు కథలయందుఁ జెప్పఁబడునవుడిట్టివాఁడొకఁడుండెనా యనుసందేహమునకుఁగదా యాస్పదమగుచున్నది. సమస్తదిక్కులయందును శ్లాఘింపఁబడుసంపదయు, కీర్తిప్రతాపములునుగల రావణుఁడు మొదలగువారిశరీరములు కాల్పఁబడి శేషించిన బూడిదయు యము నిదృష్టిచే లోకమున లేకపోయెనుగదా. ఛీ-ఛీ-ఏమిసంపదలు? మాంధాతయని పేరువహించిన చక్రవర్తియు కథకేలక్ష్యమయియుండుటనుజూచి యెట్టిబుద్ధిహీనుఁడును మమతను జెందఁడు. మహామహిమయుక్తులయి మును పు భూమినేలిన రాజులు చెందినగతిని నిప్పటి రాజులును, ఇఁకను రాఁగలరాజులును చెందుదురు. దీనినెఱిఁగి బుద్ధిశాలియగుమనుజుఁడు తనయందు మమతను వర్జింపవలయును. ఇట్లుండ పుత్ర, దార, గృహ, క్షేత్రా, దులయందు మమతకూడదని వేఱుగఁ జెప్పవలసినది లేదు. ఓరాజా! నీవు నేను జేసినహితోపదేశమును నీమనంబున నూని నీయాత్మభారమును భగవదధీనముచేసి నిర్భరుఁడవయియుంటివేని నీకు మోక్షము కరతలామలకమయియుండునని లద్దిబ్ సాహేబు చేసినహితోపదేశమును విని వైరాగ్యశీలుఁడయి యతనియనుగ్రహమును జెంది పాంచాలస్వస్థానమునకుఁ బోయెను.

శ్రీరాధాపతయేనమః.

---

## ఏఁబదియాఱవయధ్యాయము.

### సంతోబాచరిత్రము.

సంతోబాయను భాగవతుఁడధికైశ్వర్యవంతుఁడయియుండెను. రాజితనికి కొంతభూమియిచ్చియుండెను. ఇతఁడు భగవద్భక్తితోఁగూడియుండెను. ఒకప్పుడు హరిభజనముజరుగుచోట తుకారాంస్వామిపాడినకీర్తనలను విని నంతట నితనికి వైరాగ్యము జనించి తనలోనిట్లని చింతించెను. ఎన్నాళ్లుజీవించినను మరణముతప్పదు. భోగంబులు శాశ్వతములుకావు. మనుష్యశరీరముమిగులదుర్లభమయినది. ఇట్టిశరీరమును జెంది కాలమును వ్యర్థముగఁబోఁగొట్టుట న్యాయ్యముగాదు. (నందంత్యుదిత ఆదిత్యే। నందంత్యస్తమితేరవౌ। ఆత్మనోనావబుధ్యంతే। మనుష్యాజీవితక్షయం) అనఁగా సూర్యుఁడుదయించిన ద్రవ్యార్జనముచేయవచ్చుననియు, సూర్యుఁడస్తమించిన విషయానుభవముచేయవచ్చుననియుమనుజులానందించెదరేకాని యుదయాస్తమయములచే నాయుష్కాలమువ్యయమగుచున్నదని యొకరైననుగమనించుటలేదు. మహానుభావుఁడగుతుకారాంస్వామిపాడినకీర్తనములు నాకువిరక్తిబీజముఁ య్యెను. నేనికను పుత్రదారగృహక్షేత్రాది సర్వసంగపరిత్యాగముచేసి విజనస్థలంబునవసించి కందమూలంబులనాహారంబుగఁగొని భగవధ్యానముచేయుచు శ్రీపాండురంగని పాదపద్మములయందు న్యస్తభరుఁడనయి కాలమునుగడపెదనని నిశ్చయించి తనచెంతనుండిన దాసజనంబులనుజూచి నేనిదివఱకు యజమానుఁడననియు,మీరుదాసులరనియుఁదలఁచియుంటిని. తుకారాంస్వామియుపదేశముచే సర్వాత్మలును భగవద్దాసులని తెలిసికొంటిని. నేనిదివఱకు మీచేఁబనులుగొనినతప్పును మన్నించి మీరు యథేచ్ఛగపొండని చెప్పి తనస్థితినంతయును దీనజనులకిచ్చియొకజీర్ణవస్త్రమును ధరించుకొనిలజ్జవిడిచి శ్రీరామనామస్మరణముచేయుచు, నృత్యముచేయుచు భీమనదితోడమఱియొకనదిసంగమించుస్థలమునకుఁబోయియానదులమధ్య ప్రదేశమున వాసముచేయుచునానందపరవశుఁడయి శ్రీపుండరీకవరదునిని ధ్యానించుచుండెను.

దీనిఁజూచినవారందఱును సంతోబావైరాగ్యమునకు మిగులనాశ్చర్యపడిరి. సంతోబాయిల్లువిడిచి యడవికిఁబోవునపుడతనితల్లియడ్డమువచ్చి యడవికిపోవలదనియెంతగప్రార్థించినను అతఁడు వినకపోయెనుగాన వ్యసనమును జెంది యెవ్విధమునయినను దనపుత్రునినింటికిరప్పింపవలయునని చింతించి తనకోడలినిబిలిచి నీవు నీభర్తయొద్దకుఁబోయి యతని నెవ్విధముననయినను ప్రార్థించియింటికిఁబిలుచుకొనిరమ్మని నియమించి యొకపల్లకిలోఁగూర్చుండఁబెట్టిపంపెను. ఆయువతి తనభర్తయొద్దకువచ్చియతనికి ప్రదక్షిణనమస్కారములుచేసి నిలుచుండఁగా సంతోబా తనభార్యనవలోకించి యోనారీ! నీవేలయిచటికి వచ్చితివి. ఇంటికిపొమ్మని చెప్పి మౌనముగ భగవధ్యానముచేయుచుండెను. ఆయువతి వివేకవంతురాలుకాన కొంతసేపూరకుండిసమయమెఱిఁగి భర్తకు వందనముచేసి యోప్రాణనాథా! (నస్త్రీస్వాతంత్ర్యమర్హతి) అనువాక్యము నీవెఱుంగనిదికాదు. పుష్పమునువిడిచి పరిమళమును, సూర్యునివిడిచి తత్ప్రభయును వేఱుకానిచందమున నేను నీకనన్యనయియుందును.

ఇట్టినన్ను. ఇంటికిపొమ్మనిచెప్పుట నీకుధర్మముకాదు. మత్స్యముజలమునువిడిచి జీవింప నేరనట్లు నిన్నువిడిచినేనుజీవింపనేరను. పురుషునివిడిచి యతనిమైనీడవేఱుస్థలమున నెట్లు నిలుచును. అనివిన్నవించిన భార్యమాటలను విని సంతోబా మందస్మితముచేసి యోవనితా! తుకారాంస్వామియుపదేశముచే నాకువైరాగ్యము సిద్ధించెను. లోకులు తాపత్రయదుఃఖ మునను భవించుచుండియు దుఃఖములయందు సుఖభ్రాంతిని జెందియున్నారు. ఆతాపత్రయ స్వభావమునుచెప్పెదనువినుము. ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అని తాపము మూడువిధములు. అందు ఆధ్యాత్మికమనఁగా తనయాత్మను, దేహమునుననుసరించికలుగు దుఃఖము. అదిశారీరమనియు, మానసమనియు ద్వివిధము. శరీరసంబంధమగుతాపము బహు విధములయియుండును. అందుఁగొన్నిటినిఁ జెప్పెదను. తలనొప్పి, పీనస, జ్వరము, గుల్మ ము, నెత్తురుబేది, సోబె, శ్వాసము, వాంతి, కంటినొప్పి, అతిసారము, కుష్ఠము, వాయు రోగము, ఇట్లనేకవిధములయియుండును. ఇఁకనుమానసమును జెప్పెదనువినుము. కామము, క్రోధము, భయము, ద్వేషము, లోభము, మోహము, దుఃఖము, అసూయ, యవమానము మొదలగునవియనంతములయియుండును. ఆధిభౌతికమనఁగా జంతువులవలనఁగలుగునది. మృగ, పక్షి, మనుష్య, పిశాచ, సర్ప, రాక్షసాదులచేఁగలుగునవి కాన నవియు బహువిధ ములయియుండును. ఆధిదైవికమనఁగా దైవముచేఁగలుగునవి. చలి, గాలి, ఉమ్మదము, వర్షము, పిడుగు, మొదలగువానిచేఁగలుగును. కాననిదియుబహువిధములయియుండును. ఈతాపములుమూడును గర్భముచేతను, జన్మముచేతను, మరణముచేతను, వార్ధక్యముచేతను నరకముచేతను గలుగఁజేయఁబడి పెక్కువేలవిధములయియుండును. వానిని వివరించెదను వినుము. జంతువు మిగులసూక్ష్మమగు శరీరముకలదయియనేకమలములతోఁగూడినగర్భము నందొకవిధమగుతోలుచే మూయఁబడి మిగులవంపఁబడినవీఁపుయొక్కయు, కంఠముయొ క్కయు నెముకలనుగలదయి తల్లిభుజించునట్టి పులుసు, చేఁదు, కారము, ఉప్పుమొదలగురస ములసారము శరీరముమీఁదసోఁకుటచే మిగులవేదనను జెంది తనశరీరమును గదలింపశక్తి లేక మలమూత్రములనెడియడుసులోఁబడియుండి దుఃఖమునేయనుభవించుచు శ్వాసమును విడువలేక జ్ఞానముమాత్రముగలిగి గతించినపెక్కుజన్మంబులను స్మరించి మహావ్యసనమును జెంది కర్మబద్ధమయియుండును. పిదపజన్మించునపుడు బ్రహ్మదేవునిచే ప్రేరితమగునొక మారుతముచే నెముకలునలిగిపోవునట్లు పీడింపఁబడిమలమూత్రములచేతను, శుక్లశోణితముల చేతను పూయఁబడినముఖముకలిగిమిగులబలిష్ఠమగు ప్రసూతివాయువుచే తలక్రిందుగ త్రిప్పఁబడి మిగులకష్టముతోడ తల్లిగర్భమునుండి వెలుపటవచ్చును. జనించినపిదప వెలుపలి గాలి దేహముమీఁద స్పర్శించినంతట పెద్దమూర్ఛను జెంది మును పుండినజ్ఞానమునుబోఁగొట్టు కొని గర్భమునుండి పడునపుడు ముండ్లచే గ్రుచ్చఁబడునట్లును, అంపములచేఁగోయఁబడు నట్లును బాధను జెంది దుర్గంధమయి వ్రణసదృశమగుయోనిద్వారమునుండి పురుగువలె భూమియందుఁబడును. పిదప తాను గాగీఱుకొనుటకును, పొరలుటకును శక్తిలేక స్నానా హారాదులకు పరులయిచ్ఛానుగుణముగఁ జెందుచు మఱియుమూత్రాదులచే నశుద్ధమగుపడక యందుఁబడియుండి చీమలు, దోమలు, నల్లులు మొదలగుజంతువులు తన్నుగఱచు నపుడు వానిని నిగ్రహింపలేక యేడ్చుచునశక్తుఁడైయుండును. ఇట్లుజన్మదుఃఖములను, పిదపఁగలుగు

దుఃఖములను ఆధిభౌతికాదిదుఃఖములను అత్యంతశైశవావస్థయందుఁ జెందుచున్నది. పిదప పెఱిగి యౌవనమును జెందినప్పుడు మనుష్యుఁడజ్ఞానాంధకారముచేఁ గప్పఁబడియున్నాఁడు. కాన మూఢుఁడయి నేనెవఁడు? ఎచటనుండి వచ్చితిని? ఎచటికిఁ బోఁగలవాఁడను? నాకేమిఫలము? నే నేకట్టుచే కట్టఁబడి యున్నాఁడను? కారణ మెది? కారణము కానిదెది? చేయఁదగినదెది? చేయఁగూడనిదెది? చెప్పఁదగినదెది? చెప్పఁగూడనిదెది? ఏది ధర్మము? ఏది అధర్మము? ఎచట నున్నాను? ఎట్లున్నాను? ఏది గుణవంతమయినది? ఏది దోషయుక్తమయియునది? అని యొకటి నయిన నెఱుఁగలేనివాఁడయి యున్నాఁడు. ఇట్లు మృగములవలె మూఢుఁడయి యాహారమైథునముల నే ముఖ్యముగఁ గొని యజ్ఞానముచేఁ గలుగు బహుదుఃఖముల ననుభవించుచున్నాఁడు. అజ్ఞానము తమోగుణవికారమై యుండును. అందుచే మనుజుఁడు చెడ్డకార్యములను జేయునట్లు పొసఁగుచున్నది. అందువలన వైదికకర్మములు నడవకున్నవి. కర్మలోపముచే నరకము కలుగుచున్నది. కావున నజ్ఞానికిహపరములయందు దుఃఖమధికమగుచున్నది. ఇట్లు యౌవనమును దాఁటి వార్ధక్యము వచ్చినప్పుడు శరీరము కృశించి, యంగసంధులు వదలి, పండ్లాడి యూడి వెండ్రుకలు నరసి నరములు ప్రకాశించి కొంచెము దూరమున నుండు వానిని గ్రహింపలేక నల్లగ్రుడ్లు లోపలికి పోయి నాసికాద్వారమునుండి వెండ్రుకలు రాలుచుండ శరీరము నవణఁకు గలిగి యెముకలు బయలుపడి వెన్నెముక వంగి దీపనము మందమై యాహారము సూక్ష్మమై వ్యాపారములు కొంచెమై నడచుటయు, లేచుటయు, పవ్వళించుటయు కష్టసాధ్యమయి చెవులు వినక కన్నులు తెలియక నోటినుండి జొల్లు కాఱుచుండ తపించుచుండును. ఇట్లు సకలేంద్రియంబులు స్వాధీనములయి మరణము సమీపించియుండునప్పుడు మునుపు తాననుభవించిన వానిని తలఁచుకొని మనను శిథిలమైయొకమాట చెప్పుటకు మిగులఁ గష్టపడుచు దీర్ఘశ్వాసము గలుగుటచే మిగుల నాయాసమును, నిద్రారాహిత్యమును జెంది లేచుటకును, గూర్చుండుటకును, పరుల సహాయము కావలసియుండుటచే సేవకులు, బిడ్డలు, భార్యలు మొదలగు వారిచే నవమానింపఁబడుచు నొకశుద్ధియు లేక భుజించుటకును, నడచుటకును తన మనస్సునం దెల్లప్పుడును అత్యాశగలవాఁడయి తనపనివాండ్రు పరిహాసము చేయుచుండ, బంధువుల సహ్యము పడుచుండ తన యౌవనానుభవమును, పూర్వజన్మానుభవమువలె స్మరించి మనస్తాపముతోడ పెద్ద యూపిరి విడుచుచుండును. ఇట్లు వార్ధక్యదుఃఖముల ననుభవించి మరణమును జెందును. ఆమరణదశయందు సంభవించు దుఃఖములను వినుము. కరచరణకంఠముల సంధులు వీడి మిగుల వణఁకుచు స్వాధీనము తప్పి కొంతసేపు వివేకమును, గొంతసేపు మైకమును జెందుచు ఈపదార్థము లెట్లగునోయని బిడ్డలు, స్త్రీలు, ఇండ్లు, పశువులు, ధనము, ధాన్యము, మొదలగువానియందలి మమతచే చలించుచుండ అంపములవలెనతిక్రూరములయి యమశరసదృశములగు మహావ్యాధులచే ప్రాణము పెల్లగిలఁగా కన్నులు చుట్టుచుండఁగా కాళ్లను చేతులను విదుర్చుచు నాలుకయు, పెదవియు, శోషించి యుద్ధానవాయువు లేచి దుఃఖపఱుపఁగా కంఠస్వరమణఁపఁబడి గుఱుగుఱు శబ్దము చేయుచు నధికమగు తాపమును, క్షుత్తును, దాహమును, జెంది యమకింకరులచే పీడింపఁబడి బహుప్రయాసతోడ దేహమును విడిచి బయలుపడును. తోడనే యాతనాదేహమును జెందును. ఇప్పుడు చెప్పఁబడిన దుఃఖములును మఱియు బహువిధములగు దుఃఖములును మరణకాలమునందు సంభవించును. చచ్చిన పిదప

మనుజులు నరకమునఁబడునవస్థలనువినుము. యమకింకరులు మొదటపాశములచేఁ గట్టిగఁ గట్టిపీడించుటయు, వెనుకదండములచే ప్రహరించుటయు, నుగ్రుఁడగుయమునిఁ జూచుటయు, కష్టముగు దారినడచుటయు, దుఃఖములననుభవించుటయు, వెనుక వేడియగునిసుక, యగ్నియంత్రము, ఖడ్గాద్యాయుధములు వీనిచే నానరకమునఁ జెందుబాధలుమిగులక్రూరమై యుండును. అంకుశములచేఁగోయఁబడియు, మూసయందువేసి కాచఁబడియు, గొడ్డళ్లచే చీల్పఁబడియు, భూమియందు పూడ్పఁబడియు, శూలములయందు గ్రుచ్చఁబడియు, పులినోట వేయఁబడియు, గ్రద్దలచే పెఱుకఁబడియు, క్రూరమృగములచేకఱవఁబడియు, నూనెకుండలయందుంచి కాఁచఁబడియు, లవణపంకమున పొరలింపఁబడియు నున్నతప్రదేశములనుండి త్రోయఁబడియు, యంత్రములయందెక్కించి విసరివేయఁబడియు నిట్లుపాపఫలముగ మనుష్యులు నరకముననుభవించుదుఃఖములు లెక్కించిచెప్పుటకు సాధ్యముకాదు. దుఃఖపరంపర నరకమున మాత్రముకాదు. స్వర్గమునందునుగలదు. ఎట్లనిన స్వర్గానుభవము చేయుచుండునపుడు పుణ్యము క్షయించి యికను మనముత్రోయఁబడఁబోయెదమను తలంపుచే భయముగలుగునపుడు మనసునకు మహాదుఃఖము కలుగును. ఇట్లు నరకాదులననుభవించి మఱలగర్భమునఁబ్రవేశించి పుట్టుచున్నాఁడు. ఈరీతిని పుట్టుచు, చచ్చుచు, గతాగతము చేయుచున్నాఁడు. మఱియు పుట్టినతోడనయినను, బాల్యమందయినను, యౌవనమందయినను మధ్యవయస్సునందయినను, వార్ధక్యమునందయినను మరణమునకు సిద్ధుఁడయి యున్నాఁడు. జీవించియుండునపుడు నానావిధములగుదుఃఖములచే పరివేష్టింపఁబడి దూదిచేచుట్టఁబడియుండు బీజములవలెనున్నాఁడు. మఱియు ద్రవ్యార్జనమునందును, దానిరక్షణమందును, తద్వినాశమునందును, తనయిష్టులకుఁ గష్టములు వచ్చునపుడును మనుజులకనేకదుఃఖములుగలుగుచున్నవి. ఏయేపదార్థము పురుషులకు సుఖరూపమయియున్నదో యదియేదుఃఖమనెడివృక్షమునకు బీజమయియున్నది. కళత్ర, పుత్ర, మిత్ర, ధన, గృహ, క్షేత్రా, దులవలన పురుషునికెంతదుఃఖముకలుగుచున్నదో యంతసుఖముకలుగదు. ఇట్లు సంసారదుఃఖమనునెండచే తపింపఁబడుమనుజులకు మోక్షమనెడివృక్షము నీడతప్ప మఱియెందును సుఖముగలుగదు. కాన గర్భజన్మవార్ధక్యాదులయందు మనుజులకుఁగలుగు తాపత్రయమునకౌషధమేదియనిన మఱియొకసుఖముననతిశయముతోఁచకుండునట్టి మహాసుఖరూపమయి, దుఃఖసంబంధలేశములేనిదయి, నిత్యమయి, యుండు భగవత్ప్రాప్తియే యనినాయభిప్రాయము. కాన వివేకియగుమనుజుఁడు హేయగుణరహితుఁడయి, సకలసద్గుణవంతుఁడగు భగవంతునిఁజెందుటకు యత్నముచేయవలయును. ఓవనితా! తుకారాంస్వామికీర్తనలను వినుటచే నాకిట్టియధ్యవసాయముగలిగెను. వస్త్రాభరణాదిసంపదలయందిచ్ఛకలనీకును, అడవియందువసించి మనుజులు త్యజించిన జీర్ణవస్త్రములను ధరించి కందమూలములచేతను, ఉంఛవృత్తిచేతను, ఆఁకలినిబోఁగొట్టుకొనిభగవధ్యానముచేయుచు కాలమునుగడపునాకును, సహవాసమెట్లుపొసఁగును? కాన నీవు శీఘ్రముగ నింటికిఁబోయి నాతల్లికి శుశ్రూష చేయుచుండుము. నాతోడవసింపవలయునని గోరుదువేని నీవును వైరాగ్యశీలవయి యుండవలయునని చెప్పెను.

ఇట్లు సంతోబాచెప్పినమాటలను వినినంతట నతనిభార్యకు పరమవైరాగ్యమంకురించి తనవెంటవచ్చినమనుష్యులను పల్లకితోడనింటికిఁబంపి తాను ధరించియుండినయనర్ఘ్యాభరణంబులనెలిచి యడవిలోపాఱవేసియొకజీర్ణవస్త్రమును ధరించుకొనిభర్తకు శుశ్రూష చేయుచు నతనితోడ శ్రీరామ భజనముచేయుచుండెను. సంతోబా క్షుద్బాధను జెంది తన భార్యనుజూచి నన్నాఁకలి బాధించుచున్నది. సామోమాల్ని అనుసమీపగ్రామమునమన దేహబంధువులు వసించుచున్నారు. నీవు లజ్జవిడిచి యచటికిఁబోయి భిక్షమెత్తుకొనిరమ్ము. అర రొట్టెకధికముగనెవరైననిచ్చిన పరిగ్రహింపకుము. మనబంధువులసవ్యాముగుపలుకులు పలికినను నీవు మానముగనుండుమని చెప్పి పంపెను. ఆపతివ్రత భర్తృనియమనమును శిరసావహించి యాయూరికిఁబోయి యొకయింటివాకిట నిలిచి శ్రీహరే! కృష్ణా! యనిపలుకును. ఇంతలోనాయింటివారు భిక్షమిడినతీసికొనును. లేనియెడల మఱియొకయింటివాకిటికి పోవును. ఇట్లుచేయుచుండనాయూరివారలు ఈమెపాతివ్రత్యమునకును, వైరాగ్యమునకును, ఆశ్చర్యపడి యీమెను వెంబడించిపోవుచుండిరి. ఈసుదతి శ్రీహరే! కృష్ణా! గోవిందా! మాధవా! ముకుందా! మురారే! కైటభారే! జగన్నివాసా! పురుషోత్తమా! వాసుదేవా! నారాయణా! అచ్యుతా! అనంతా! పుండరీకాక్షా! పురాణపురుషా! అనిభగవన్నామములనుచ్చరించుచు వీధినిఁబోవుచు తనయాఁడుబిడ్డయింటివాకిట నిలిచి శ్రీహరే! కృష్ణా! యనిపలికెను. సంతోబాయొక్క జ్యేష్ఠసహోదరి వీధికివచ్చి తమ్మునిభార్యనాలింగనముచేసికొని కన్నీరు విడుచుచు నిదియేమియాశ్చర్యము. నీభోగభాగ్యములను విడిచి యిట్టివైరాగ్యమును జెందినది యీశ్వరునికి సహించెనా? ఒకనాఁడైనను నడచియెఱుఁగని నీవు పాషాణములతోఁగూడి కఠినముగుభూమియందెట్లు నడవనేర్చితివి.పరపురుషులఁజూచి యెఱుఁగనినీవు లజ్జవిడిచిగ్రామవీధులయందెట్లుసంచరించెదవనియేడ్వఁగా సంతోబాభార్య మానముగనుండెను. అపుడు సంతోబాసహోదరియింటిలోపలికిపోయి నేయి, చక్కెరవీనితోడ రొట్టెలనుదెచ్చియీమెకొంగునవేయవచ్చెను. ఈమె నాపురుషుఁడు కోపగించును. ఈపదార్థములనేనంగీకరింపనని చెప్పెను. ఈమెయెంతచెప్పిననువినక సంతోబాసహోదరి తానుదెచ్చిన పదార్థములను బలాత్కారముగ నీమెకొంగున ముడివేసిపోయెను. ఈపతివ్రత భర్తయొద్దకు వచ్చి తానుదెచ్చినపదార్థములనతనియెదుటనునిచి జరగినవృత్తాంతమును విన్నవించెను. సంతోబా తనభార్యతెచ్చిన భిక్షమునంగీకరించి తనసహోదరిపంపిననేయి, చక్కెరవీనితోఁగూడిన రొట్టెలను మఱలనామెకిచ్చిరమ్మని భార్యకు నియమింపఁగా ఆసాధ్వియట్లుచేసితిరిగివచ్చునపుడచింతితముగ వర్షముగురిసినదియందు పూర్ణప్రవాహము వచ్చెను. అపుడీయబల శ్రీమత్పండరినాథా! పుండరీకవరదా! శ్రీరుక్మిణీపతే! యనిస్మరించుచు నేనెట్లు నాభర్తసన్నిధికిఁబోదునని చింతించుచుండ భక్తవత్సలుఁడగు పండరినాథుఁడొకయాఁతకానివేషముధరించి యీమెకెదుటనిలిచి యోతల్లీ! శోకింపకుము. నీసహోదరుఁడను. నిన్నిప్పుడె నీభర్తయొద్దఁజేర్చెదను. నాభుజమునఁగూర్చుండుమని చెప్పి యాయువతిని తనమూఁపునవహించుకొనినదినిదాఁటి యావలిగట్టున విడిచిపెట్టియోజననీ! అదిగో నీపురుషుఁడున్నాఁడు. అతనియొద్దకుపొమ్మని చెప్పియదృశ్యుఁడయ్యెను. ఆకాంతామణి పురుషునియొద్దకువచ్చి జరగినవృత్తాంతమును విన్నవింపఁగా నతఁడమందానందమును జెంది యోవనితా! నీభాగ్య

మేభాగ్యము. నీకు పండరినాథుఁడు దర్శనమిచ్చెనని చెప్పి శ్రీరుక్మిణీపతే! నామీఁదనీకేలకృప లేదు. నన్నేలయిట్లుశోధించెదవు? నీవు నాకు దర్శనమిచ్చుపర్యంతము నేను భుజింపనని చెప్పి పద్మాసనాసీనుఁడయి భగవద్ధ్యానముచేయుచుండెను. మఱునాఁడొకవర్తకుని స్వప్నమున పండరినాథుఁడువచ్చి యోరీ! నీపుణ్యవశముచే నీకునాదర్శనమిచ్చితిని. శీఘ్రముగదివ్య భక్ష్యములతోడ షడ్రసోపేతాన్నమును దీసికొనిపోయి నాకంతరంగభక్తుఁడగుసంతోబాకు పెట్టుమని నియమించియదృశ్యుఁడయ్యెను. వర్తకుఁడు మేల్కాని స్వప్నమును జింతించి పరమానందభరితుఁడయి భగవన్నియమనానుసారముగ దివ్యాన్నమునుగొనిపోయి సంతోబాకు వందనముచేసిభగవన్నియమనము నెఱిఁగించి భుజింపవలయునని ప్రార్థించెను. సంతోబా ఆవర్తకునిఁజూచి నీకు దర్శనమిచ్చినపండరినాథుఁడు నాకును దర్శనమిచ్చెనేని నేనుభుజించెదను. అదివఱకుభుజింపనని చెప్పెను. ఆవర్తకుఁడు తానుదెచ్చినపదార్థములనుతానే కొనిపోయెను. సంతోబా వైరాగ్యమునుజూచి పండరినాథునికి కృపగలిగి శ్రీరుక్మిణీసమేతుఁడయియతనికి దర్శన మిచ్చెను. అపుడు సంతోబా భగవంతునికి ప్రదక్షిణనమస్కారములుచేసి యిట్లని స్తుతించెను. ఓస్వామీ! నీనిజస్వరూపము వాచామగోచరమయినది. భూమియు, జలమును, అగ్నియు, వాయువును, ఆకాశమును నీవే. బుద్ధిమొదలగు చతుర్విధమగునంతఃకరణములును, ప్రకృతియు, ప్రకృతికంటె శ్రేష్ఠుఁడగు పురుషుఁడునైయున్నాఁడవు. అదెట్లనిన బ్రహ్మాది తృణపర్యంతమగు రూపవంతములును,రూ[illegible]రహితములునయి కాలదేశభేదములతోఁగూడియుండెడియీప్రపంచమంతయు నీశరీరమయియున్నది. ఆదియందు నీనాభికమలమునందుండి సృష్టినిమిత్తముయికలిగిన నీబ్రహ్మస్వరూపమునకు దండముసమర్పించెదను. ఇంద్రుఁడు, సూర్యుఁడు, రుద్రుఁడు, వసువులు, అశ్వినులు, మరుత్తులు, చంద్రుఁడు అనుభేదములతోఁగూడియుండెడు నీదేవస్వరూపమునకు దండముసమర్పించెదను. డంభమతిశయించి వివేకము స్వల్పమయియోర్పును, మనోనిగ్రహమును లేని నీయసురస్వరూపమునకు వందనముచేసెదను. మందవివేకముగునేరూపమునందు నాడులకు అధికముగ జ్ఞానసంచారములేకయున్నదో యట్టిశబ్దాదివిషయరుచితోఁగూడిననీయక్షస్వరూపమునకు ప్రణామముచేసెదను. మిగులక్రూరమయి, భయంకరమయి, మాయామయమయి, నల్లనయియుండు నీరాక్షసస్వరూపమునకు వందనముచేసెదను. స్వర్గముచేరఁదగిన పుణ్యాత్మునికి పుణ్యఫలమునుగలుగఁజేయునీధర్మస్వరూపమునకు దండము సమర్పించెద. సంతోషమధికమయి, సంగశూన్యమై, యెందును సంచరించుశక్తికలదియయి, సిద్ధార్థమైయుండు నీ సిద్ధస్వరూపమునకు వందనముచేసెదను. అసూయాప్రసవభూమియయి, క్రూరమయి, ఉపభోగసమర్థమై రెండునాలుకలతోఁగూడియుండు నీనాగస్వరూపమునకు నమస్కరించెదను. గోప్యజ్ఞానముకలదయి, శాంతమయి, రాగద్వేషాదిదోషరహితమగుఋషిరూపమయియుండు నీవ్యాపకస్వరూపమునకు నమస్కరించెద. కల్పాంతమునందు ఏస్వరూపము నిరంకుశముగా సకలభూతములను భక్షించుచున్నదోయట్టి నీకాలస్వరూపమునకు నమస్కరించెద. ఏస్వరూపముకట్టకడపట దేవాదిసకలమును భక్షించి సంతసించి యానందనృత్యము చేయునోయట్టి నీరుద్రస్వరూపమునకు పలుమాఱు వందనముచేసెద. రజోగుణప్రవృత్తిచే కర్మములను జేయుస్వభావముగల నీనరస్వరూపమునకు బహుభక్తితోడనమస్కరించెదను. రెండు

గొరినెలలతోఁగూడినవితొమ్మిదియు, ఒంటిగొరినెతోఁగూడినవియాఱును, పంచనఖములతోఁగూడినవి పదుమూడును, కాఁగానిరువదియెనిమిదివిధములయి శాస్త్రమార్గమునతిక్రమించి నడచు స్వభావముతోఁగూడియుండు పశురూపమగు నీతామసస్వరూపమునకు భయభక్తులతో నమస్కరించెదను. యాగములకన్నిటికినంగమయి, లోకముయొక్క ప్రయోజనమునకు సాధకమయి, తరు, లతా, వృక్ష, గుల్మ, తృణ, పర్వతములనెడియాఱువిధములుగల నీముఖ్యస్వరూపమునకునమస్కరించెద. దేవతిర్యఙ్మనుష్యాదులకును, ఆకాశశబ్దాదిసమష్టిమునకును ప్రథమకారణమగు నీసర్వస్వరూపమును సేవించెదను. ప్రధానము, బుద్ధిమొదలగు రూపములతోఁగూడినసమస్తమునకన్న వేఱై శ్లాఘ్యమై యద్వితీయమయి, కారణమగు ప్రధానమునకును గారణమయియుండు నీపురుషస్వరూపమునకు నమస్కరించెద. తెలుపుమొదలగునవియు, నిడుపుమొదలగునవియు, స్థౌల్యముమొదలగునవియులేక విశేషణరహితమయి, శుద్ధమగు బద్ధస్వరూపమునకంటె శుద్ధమయి, మహాయోగులజ్ఞానమునకువిషయమయియుండు నీముక్తపురుషస్వరూపమునకు వందనముచేసెద. ఏదినాశరీరమునందును అన్యులశరీరమునందును సకలమునందును నాశరహితమయి,యేకరూపమయి, యుండునో దేనికంటెనన్యమగుపదార్థము మఱియొకటిలేదో యట్టినీపరబ్రహ్మస్వరూపమునకు ప్రణామముచేసెద. చేతనాచేతనాత్మకమగు నీసకలప్రపంచమును పరమపదముననుండు సకలాత్మలును అవికారియై, నిత్యుఁడయి, యుండెడియెవనిస్వరూపమయియున్నదో యట్టిసకలనిత్యకారణమయి, సర్వస్వామియయి, సర్వశక్తుఁడయి యుండు శ్రీవాసుదేవునినిశరణుఁజెందెదననిస్తుతింపఁగా భగవంతుఁడానందించి సంతోబానుకృపాదృష్టిచే కటాక్షించి నేననవరతము నీచెంతవసించెదనని యనుగ్రహించియంతర్ధానుఁడయ్యెను. పిమ్మట సంతోబా తనభార్యతోడ నాయరణ్యమున వసించుచు శ్రీరామభజనముచేయుచు భిక్షాన్నమును భుజించుచు సుఖముగ కాలక్షేపముచేయుచుండెను.

ఒకబ్రాహ్మణుఁడు తనభార్యతోడ ప్రతిదినము కలహించుచుండును. అట్లు కలహము కలుగునపుడెల్ల నతఁడు తనభార్యతోడ ఓసీ! నీవు నాయిష్టముచొప్పుననడవవేని సంతోబావలెనేనును వైరాగ్యశీలుఁడనయి సంసారమునువిడిచిపెట్టియడవికిపోవుదునని చెప్పచుండును. ఆయువతితనపెనిమిటిమాటలకు మిగుల భయపడి వాఁడేమిచెప్పినను దానికంతయు లోఁబడుచుండును. ఆస్త్రీవ్యసనాక్రాంతయయియొకనాఁడు భిక్షకైతనయింటివాకిటికి వచ్చిన సంతోబానుజూచి యామహాత్మునికి వందనముచేసియోస్వామీ! నాభర్త మిగుల ముష్కరుఁడయి న్యాయములేక స్వల్పవిషయములకెల్ల ప్రతిదినము నాతోడ కలహించుచు నీవునాయిష్టప్రకారమునడవవేని సంతోబావలె నేనును వైరాగ్యశీలుఁడనయిసంసారమును విడిచి యరణ్యమునకుఁబోవుదునని చెప్పి బెదరించుచున్నాఁడు. నీవతనికి హితమునుపదేశించి శాంతచిత్తునిఁగాఁజేసి నాకుటుంబమును రక్షింపవలయునని ప్రార్థించెను. అదివినిసంతోబా నవ్వుచు నామెనుజూచి నీవుశోకింపకుము. ఇఁకమీఁద నీపురుషుఁడట్లు చెప్పునేని నీకిష్టమగునట్లు చేయవచ్చునని చెప్పుము అనిబోధించి యథేచ్ఛగఁబోయెను. ఆమఱునాఁడామె భర్తయెప్పటియట్లుకలహించి యోవనితా! నీవు నాకిష్టమగునట్లు నడవవేని నేనువైరాగ్య

శీలుఁడనయి సంతోబావలె నడవికి పోయెదనని చెప్పెను. అపుడా స్త్రీయో ప్రాణనాథా! నీవు న్యాయములేని రచ్చపెట్టుకొనుచున్నాఁడవు. నీకిష్టముగునట్లు నడచుటకు నాకు సాధ్యపడదు. సంతోబావలె వైరాగ్యశీలుఁడవయి యడవికిఁ బోవలయునని నీవిచ్ఛయింతువేని యట్లుచేయవచ్చునని చెప్పఁగా వినియా బ్రాహ్మణుఁడు తనమనంబున నిట్లని వితర్కించెను. నేనిన్నిదినములుగ నా భార్యతో న్యాయములేని రచ్చపెట్టుకొని నోటితో బెదరించుచు నామనోరథములను నెఱవేర్చుకొనుచు వచ్చితిని. ఇపుడీ స్త్రీ నీకిష్టముగునట్లు చేయుమని చెప్పుచున్నది. నా నోటిమాటలచే నేను చెడితిని. ఇఁక నేనేమి చేయుదును. అడవికిఁబోయి యొక్కపూటయయిన నే నెట్లు నిర్వహింతును. నేనిన్నాళ్లు చెప్పుచు వచ్చినట్లిపుడు చేయనేని నా బంధుమిత్రులు నన్ను పరిహసింతురు. ఇఁక నన్నెవరును లక్ష్యముచేయరు. మానహీనముగు బ్రదుకుకన్న మరణము మేలుగదా? నేనిపుడడవికిఁ బోయెదను. ఆవలనా నొసటి వ్రాలచొప్పున నేమి జరగినను దానిననుభవించెదనని తనలో నిశ్చయించి యొక చెంబును, వస్త్రములను మాత్రమెత్తుకొని సంతోబాయొద్దకుఁ బోయి యతనికి వందనముచేసి యోస్వామీ? నేను నిస్సారమగు సంసారమును త్యజించి నీసహవాసమును గోరి వచ్చితిని. నన్ననుగ్రహింపవలయునని చెప్పఁగా సంతోబా మందస్మితముచేసి యోయయ్యా! నీవైరాగ్యమునకు సంతసించితిని. నీవపేక్షించినట్లు నాయొద్ద వసింపుమని చెప్పి యతని చేతికొక సొరకాయపాత్రమునిచ్చి నీవు నదికిఁబోయి స్నానముచేసిరమ్ము. అచట చోరభయము కలదుగాన నీ చెంబును, వస్త్రములనిచటనునిచి పొమ్మని చెప్పఁగా ఆ బ్రాహ్మణుఁడు తన చెంబును, వస్త్రములనచటనునిచి నదికిపోయి స్నానముచేసి నిత్యకర్మములననుష్ఠించుచుండఁగా ఆఁకలి యధికమయినందున సహింపనివాఁడయి కష్టపడుచుండెను. ఇచట సంతోబా అతని చెంబును, వస్త్రములనెత్తి ముండ్లపొదలలోఁ బాఱవైచెను. బ్రాహ్మణుఁడు వచ్చి యాఁకలి, చలి వీని బాధలకోర్వనివాఁడయి సంతోబానుజూచి నన్నాఁకలి మిగుల బాధించుచున్నదని చెప్పఁగా నతఁడొక వెఱ్ఱి పుచ్చకాయనిచ్చి నీవుదీనిని భుజింపుమని చెప్పెను. ఆ బ్రాహ్మణుఁడు దానిఁదీసికొని నోటనుంచఁగా నది నములుటకునైతము మిగులచేఁదై యుండెను. అపుడా విప్రుఁడు శోకించుచు నయ్యో నేనింటనే యుండియేమియు సంపాదింపకపోయినను నా భార్యను బెదరించి ప్రతిదినము మూడుపూటలు షడ్రసోపేతముగను పూర్ణముగను భుజింతును. ఇట్టి సుఖజీవినగు నాకు నేఁడిట్టి కష్టము నాదురహంకారముచే సంభవించెను. ఈ చేఁదయిన వెఱ్ఱిపుచ్చకాయ నేనెట్లు భుజింపవచ్చునని శోకించుచు సంతోభానుజూచి యోస్వామీ! ఈ వెఱ్ఱిపుచ్చకాయ మిగుల చేఁదయియున్నది. దీనిని నేనెట్లు భుజింతును? ఇఁక నొక నిమిషమాహారములేకుండిన నా శరీరమునందు ప్రాణములు నిలువవు. నేనేమిచేయుదునని చెప్పఁగా సంతోబా నవ్వుచు నతనిఁజూచి యోవిప్రా! వైరాగ్యశీలునకు రుచియిట్టిదని తెలియదు. నీకట్టి వైరాగ్యము కలుగకుండఁగా నీవేల సంసారమును విడిచి యడవికి వచ్చితివని యడుగఁగా ఆపాఱుఁడు తన చరిత్రమునంతయును ఆనుపూర్వముగ విన్నవించి కన్నీరు విడిచి శోకించెను. అపుడు సంతోబా నవ్వుచు నీవు శోకింపకుము. నీవెప్పటియట్లింటికి పోయి నీ భార్యతోఁ గలహింపక సుఖముగా కాపురము చేయుము. ఇఁక మీఁద సంతోబావలె వైరాగ్యశీలుఁడనయి యడవికిఁ బోయెదనని నీ భార్యను బెదరింపకయూ మెతో కలహింపకయుండుట నిజమని నాకు ప్రతిజ్ఞ చేసియిమ్ము. నేను నిన్ను వెంటఁబెట్టుకొని

పోయి నీకును, నీభార్యకును సంధిచేసి నిన్నింటవిడిచిపెట్టి వచ్చెదనని చెప్పెను. అందుకా విప్రుఁడు సమ్మతించియింకను నేనట్లుచేయనని యతనిపాదములంటి ప్రతిజ్ఞ చేసెను. సంతోబా ఆబ్రాహ్మణునినతనియింటికి వెంటఁబెట్టుకొనిపోయి యతనిభార్యయొద్ద విడిచి దంపతులకు హితోపదేశముచేసి స్వస్థానమునకు వచ్చెను. అదిమొదలాదంపతులన్యోన్యమనురాగయుక్తులయి సుఖముగ జీవించుచుండిరి.

పండరిపురమునందాషాఢశుద్ధైకాదశియుత్సవమునకై పెక్కువేలభక్తులు భగవత్కీర్తనంబును, నానందతాండవమును జేయుచువచ్చిరి. అప్పుడు భీమనదియు, మఱియొకనదియు సంతోబా వసించుస్థలమునకు సమీపమున నొకటితో నొకటి గలియుచుండునుగాన సమీపగ్రామమగునరసింహాపురము చెంత ప్రవాహమధికమయియుండెను. యాత్రార్థము వచ్చిన భాగవతులు రేపటికాషాఢశుద్ధైకాదశి. కాఁబట్టి నదీప్రవాహమధికమయియున్నది. నదిని దాఁటి మనము పండరిపురమునకుఁబోవుటకు సాధ్యపడదు. మనమేమిచేయవచ్చునని శోకించుచుండిరి. సంతోబా ఆభాగవతులనుజూచి మీరు శోకింపకుఁడు. శ్రీపండరినాథునికృపచే మిమ్మందఱను నేనావలిగట్టునఁ జేర్చెదను. మీమనోరథము వ్యర్థముకాక రేపటికి పండరినాథునిని దర్శింపవచ్చును. శంకింపక నన్ను వెంబడించిరండు. నిజభక్తులనుభవార్ణవమువలననుండి దాఁటింపఁగలసర్వేశ్వరుఁడీయేటని దాఁటింపలేఁడా? శ్రీకృష్ణావతారకాలమున జరాసంధాదిదుష్టులవలన భయములేక నిజబంధువులను రక్షించుటకయి శ్రీద్వారకానగరమును నిర్మింప విశ్వకర్మనునియోగించి నాకు స్థలముకావలయును. నీవుకొంతతొలఁగిపొమ్మని సముద్రునికి నియమించినంతట నతఁడాదేవాధిదేవునాజ్ఞను శిరసా వహించి దొలఁగిపోలేదా? వసుదేవుఁడు శ్రీకృష్ణునెత్తుకొని గోకులమునకు పోవునపుడు పూర్ణప్రవాహముగలదయియుండినయమునానదియావసుదేవునికి తెరువిచ్చి మోఁకాళ్లకొలఁదిదైయుండలేదా? ఆప్రణతార్తిహరుఁడేగదా యాశ్రితసంరక్షణార్థమై పండరిపురమున వేంచేసియున్నాఁడు. జనరక్షణమునకయి త్రిపాద్విభూతినివిడిచి యీకర్మభూమికి వచ్చినవాఁడు తనయందాభిముఖ్యముతోఁగూడి తన్ను సేవింపవచ్చునిజభక్తులకు సేవయొసంగకుండునా? బిడ్డమాంద్యముచే నన్నమడుగలేదని శోకించుతల్లిదండ్రులు క్షుధాతురుఁడయి యన్నమునడుగు బాలునికాహారమీయక యుపేక్షింతురా? మనయధ్యవసాయము కలంకరహితమైయుండునేని నందనందనుఁడు మనకార్యమునందు జాగరూకుఁడయియుండునని చెప్పియేటిలోదిగెను. భాగవతులందఱును సంతోబావచనములను విశ్వసించి యతనిని వెంబడించి భీమనదిలోదిగిరి. అప్పుడోడచే దాఁటుటకును సాధ్యపడక పూర్ణప్రవాహమైయుండినభీమనదివారలకు దారియిచ్చి మోఁకాలిబంటిలోఁతయి యుండెను. పూర్వము శ్రీరామభద్రునిని వెంబడించి సరయూనదియందు దిగిన కోసలవాసులగు జనులవలె భాగవతులందఱు పుండరీకవరదునిఁగీర్తించుచు సంతోబా నదిలోదిగినడవ నతనివెంబడించిదిగి కోలాహలముతో నావలిగట్టుచేరియతనికి ప్రదక్షిణనమస్కారములుచేసి యోమహాత్మా ! నీవుసాక్షాత్పండరినాథునియవతారమవని స్తుతించి సుఖముగ విఠ్ఠలనాథునిసన్నిధికిఁబోయిచేరిరి. వెనుకవచ్చినవారలకు దాఁటఁగూడక భీమనది పూర్ణప్రవాహముకలదయియుండెను. వారలచటనుండిన వారివలన తమకుముందు

వచ్చిన భాగవతులబృందమును సంతోబా బిలుచుకొనిపోయి యావలిగట్టుచేర్చిన వృత్తాంతమును విని పరమభాగవతకులాలంకారుఁడగు సంతోబాను స్మరించుచు పుండరీకవరదునినుతించుచు నేటిలోదిగి మునుపటివారివలె క్షేమముగనావలిగట్టుచేరిరి. వెనుకవచ్చువారెల్లరీపద్ధతి నవలంబించి భీమనదిని సుకరముగదాఁటి పండరిపురము చేరుచుండిరి. శ్రీవిఠ్ఠలనాథుఁడు సంతోబాకయి కూర్మరూపమును ధరించి భీమనదియందు మోఁకాళ్లలోఁతునకులోపలసాన్నిధ్యముచేసియుండెను. సంతోబాయీరహస్యమునెఱిఁగి శ్రీకూర్మరూపియగుపండరినాథునిని పెక్కువిధంబులస్తుతించుచు తనవాసస్థానమునకుఁబోయెను.

శ్రీకూర్మరూపాయనమః.

---

నీళోబాచరిత్రము.

నీళోబాయనుభాగవతోత్తముఁడు శమదమాదిగుణాన్వితుఁడయి, పరమవైరాగ్యశీలుఁడయి యుండెను. ఒకనాఁడతనిస్వప్నమున తుక్కారాంస్వామి ప్రత్యక్షమయి హితోపదేశముచేసి శ్రీతారకమంత్రమునను గ్రహించియదృశ్యుఁడయ్యెను. అదిమొదలు నీళోబా అనవరతము హరికీర్తనముచేయుచు నహంకారమమకారములను సమూలముగ త్యజించిసాధువులనారాధించుచు, దీనులనుబోషించుచుసర్వమును భగవత్స్వరూపముగ భావించుచు సంసారమునందుండియు నెందునుతగులువడక జనకచక్రవర్తివలె పరిశుద్ధహృదయుఁడై కాలమునుగడపుచుండెను. ఇతఁడు తనకొమార్తకు వివాహముచేయవలయునని యత్నించి ముహూర్తము నిశ్చయముచేసి బంధువులందఱను పిలుపింపఁగా వారును వచ్చిచేరిరి. తానుమిగుల దరిద్రుఁడుకాన వివాహమునకుఁగావలసినపదార్థములను కొద్దిగనేకరించెను. అతనిభార్య భర్తనుజూచి బంధువులనేకులు వచ్చియున్నారు. మఱియు వివాహార్థమనేకులువత్తురు. నీవుసంగ్రహించినవస్తువులు మిగులకొద్దిగానున్నవి. వచ్చినవారలనెల్ల నెట్లాదరింపవచ్చును. బంధువులుమొదలగువారు, వివాహమునకయి యందఱినిరప్పించివచ్చినవారికన్నము పెట్టకపోయిరని బహువిధములుగ, దూషింతురు. ఇందులకేమిచేయవచ్చునని చెప్పి శోకింపఁగా నీళోబా తనభార్యనుజూచి రేయోయబలా! నీవేలశోకించెదవు? సర్వాత్మలును ఈశ్వరకుటుంబమయియున్నది. బహుకుటుంబియగు పండరినాథుఁడు సర్వజ్ఞుఁడై సర్వశక్తుఁడైయున్నాఁడు. మనయాత్మభారమును వహించియుండు శ్రీపండరినాథుఁడే సర్వమును నిర్వహించుచున్నాఁడు. చేతనుఁడు అచిద్వ్యావృత్తివేషమగు స్వప్రయత్నముతోఁగూడియున్నాఁడే కాని వీనియత్నముకొంచెమైనను కార్యకరముకాదు. ద్రవ్యాపేక్షచే మిగులప్రయాసపడి బహుయత్నములుచేయువారు నష్టమునుజెందుటయు, ఏయత్నమును జేయనివారికచింతితముగ నిక్షేపము లభించుటయు, వైద్యునుపాసించి యౌషధసేవచేయువానికి వ్యాధివర్ధిల్లుటయు, శరీరమునుపేక్షించి యపథ్యముచేయువానికారోగ్యము కలుగుటయు మఱియు ననేకములగునిట్టి విచిత్రములను మనము కనివినియున్నారముగదా? పురుషునిదేహయాత్ర కర్మాధీనమయియున్నది. అనఁగా కర్మసాక్షియగునీశ్వరుఁడు చేతనకర్మానుగుణముగఫలము నిచ్చుచున్నాఁడు. ఆత్మయాత్రయీశ్వరాధీనమయియున్నది. కర్మాధీనమగు దేహయాత్రయందు తనకన్వయముకలదని తలఁచువాఁడు నాస్తికుఁడగును. ఈశ్వరాధీనమగునాత్మయా

త్రయందు తనకన్వయముకలదని తలఁచువాఁడు భగవద్ద్రవ్యమగు నాత్మనపహరించినవాఁడగును. (కింతేననకృతంపాపం । చోరేణాత్మాపహారిణా) అనురీతిని ఆత్మాపహారముచేయు చోరునిచే సమస్తపాపములు చేయఁబడినవియగును. ఈధర్మసూక్ష్మము నెఱిఁగి యాత్మీయములను భగవంతునికర్పించి నిర్భరుఁడయి, కరణకళేబరంబులను భగవద్విషయంబున వినియోగించుచు, జాగరూకుఁడయి వర్తించువానికి మోక్షము కరతలామలకమయియుండును. మన కార్యమున మనకన్వయముకలిగియుండుపర్యంతము మనలనీశ్వరుఁడుపేక్షించును. మనయత్నమును, సవాసనముగవిడిచి చాతకనిష్ఠను జెందితిమేని యట్టిమనవిషయమున శ్రీపండరినాథుఁడు కపోతనిష్ఠను జెందును. చాతకము మేఘజలము నేధారకముగ గొనియుండునట్లు మనము భగవత్కటాక్షమే ధారకమనియుండవలయు. కపోతము తన యొద్దకువచ్చిన బోయవానిని రక్షించి వానికి తనశరీరమునిచ్చినట్లు భగవంతుఁడు స్వాశ్రితులనురక్షించియాశ్రితపరతంత్రుఁడయియుండును. (ప్రపన్నశ్చాతకోయద్వత్ । ప్రపత్తవ్యః కపోతవత్) అనిశాస్త్రముచెప్పుచున్నది. ద్రౌపతితన్ను భగవంతుఁడు రక్షింపవలయునను నధ్యవసాయముతోడ గోవిందునిశరణుజెందియు మహాసభయందు మానహానికలుగునని శంకించి తనచేతితోవస్త్రమును బట్టుకొనియుండుపర్యంతము భగవంతుఁడనుగ్రహింపక యామె లజ్జవిడిచి వస్త్రమునుబట్టుకొనియుండు చేతులనువిడిచినపిదప భగవదనుగ్రహముచేనక్షయవస్త్రములుకలిగెను. రావణుఁడొకనాటియుద్ధమున రామునిచేఁజక్కఁగమర్దింపఁబడి తనసైన్యమును, ధనుర్బాణాదిసాధనములను బోఁగొట్టుకొని విఱిగినవింటని దురభిమానముచే పట్టుకొనియుండుపర్యంతము రాముఁడతనిపై బాణములు వేయుచుండి (చచాలచాపంచము మోచవీరః) అనురీతిని శ్రీరామునిబాణములకు చలించి యావింటినివిడిచిపెట్టినపిదప రణధర్మవేదియగు రాముఁడు రావణా! నీవెంతయు నాబాణములచేఁ గొట్టఁబడిడస్సితివి. నిరాయుధుఁడవగునిన్ను నేనేమియు చేయను. నీవింటికిపోయి యలసటఁదీర్చుకొని బలములను గూర్చుకొని రేపు యుద్ధమునకురమ్మని చెప్పి పంపెను. కాన పురుషుఁడు లజ్జాప్రయత్నంబులనువిడిచి తనయాత్మభారమును భగవంతునికర్పించువఱకు వీనిరక్షణమున భగవంతుఁడుపేక్షించియుండును. భగవదుపేక్షచే స్వకృతపుణ్యపాపకర్మానుగుణముగ స్వర్గనరకములకు పోవుచు మఱల గర్భమునప్రవేశించి జన్మించుచు గతాగతములను జేయుచుండును. గాలికి

మయి యాకసమున నెగయుచుండుపదార్థముమీఁదనొకరాయినుంచిన నదియెగురక నిలుచునట్లు చేతనుఁడు తనయాత్మభారమును భగవంతునికర్పించి పరతంత్రుఁడయియుండెనేని యాభగవత్పారతంత్ర్యమను పాషాణము కర్మమనువాయువశముచే నిలుకడలేక సంచరించుచుండునాత్మకు భగవచ్చరణారవిందములయందు అచంచలస్థితిని గలుగఁజేయును. (పారతంత్ర్యంపరేపుంసి । ప్రాప్యనిర్గతబంధనః । స్వాతంత్ర్యమతులంప్రాప్య । మోదతేదివిదేవవత్) అనఁగా పరమపురునియందు పారతంత్ర్యమును జెందినవాఁడు భగవత్కటాక్షముచే బంధవిముక్తుఁడయి పరమపదమును జెందియద్వితీయమగుస్వాతంత్ర్యముతోఁగూడి భగవంతుని ఆనందసామ్యమును జెందును. ఇట్టిపారతంత్ర్యముతోఁగూడియుండు శరణాగతనిష్ఠుని దేహయాత్రభారమును, ఆత్మయాత్రభారమును భగవంతుఁడు తానేవహించియున్నాఁడనుటకు సందేహములేదు. ఉద్ధవునియంశముచే దేవునగరమున నవతరించిన తుకారాం

స్వామి నాస్వప్నమున సాక్షాత్కరించి నాకీపరమార్థము నుపదేశించెను. ఓయతివా! నీవుశోక మునువిడిచి పండరినాథునిలీలలను జూచుచుండుము. (గోపురధారీవకుటుంబధారీ) అనురీతిని గోపురధారియగుబొమ్మకు గోపురభారవహనమున నెంతయన్వయముగలదో యంతయన్వయమేతన్నుకుటుంబధారియని తలంచియుండువానికిని కుటుంబభారవహనమునందుఁగలిగి యున్నది. గోపురధారియగుబొమ్మ విఱిగి నేలఁగూలినంతట గోపురమునకపాయముకలదా? అట్లునేను కుటుంబనిర్వాహకుఁడనని యభిమానించియుండువాఁడు మృతుఁడయినను ఆకుటుంబమునకవద్యములేదు. కానభగవత్కుటుంబమగు మనము బహుకుటుంబియగు నీశ్వరునికి పరతంత్రులమయి వానిననిశము ధ్యానించుచుండుట మనకుస్వరూపమయియున్నది. దీనికన్యముగునడువడి వ్యభిచారమగును. అట్టివ్యభిచారులుయమువశ్యులగుదురు. ఓయతివా! నీవును నావలెతుకారాంస్వామియందాచార్యప్రతిపత్తిచేసి భగవన్యస్తభరవయియుండు వేని నన్నుసుగమించి పునరావృత్తిరహిత మోక్షమును జెందుదువని చెప్పిన భర్తృవచనముల కానందించి పుండరీకరదునిని ధ్యానించుచుండెను.

ఇట్లుండ శ్రీపండరినాథుఁడొకబ్రాహ్మణరూపముధరించి తనవస్త్రముకొంగున బియ్యము, పప్పు మొదలగుపదార్థములను కొద్దిగఁగట్టుకొనివచ్చి నీళోబానుజూచి నేనుదరిద్రుఁడను. ఆఁకలిచే బాధింపఁబడుచున్నాను. నేనుకొంగునముడివేసితెచ్చినపదార్థములను తీసికొని నాకన్నముపెట్టుమనియడిగెను. దానికినీళోబానవ్వుచు ఓయీవిప్రా! పెండ్లియింట నీకొకనికన్నములేకపోయెనా? నీవుయథేష్టముగ భుజించిపొమ్ము. నీవుతెచ్చినవస్తువులు నాకు వలదనిచెప్పెను. అదివిని బ్రాహ్మణుఁడో సజ్జనాగ్రేసరా! (అసంతుష్టోద్విజోనష్టః) అను రీతినిఅసంతుష్టుఁడగుబ్రాహ్మణుఁడు నశించును. నేనన్నార్థిని. నీవునాయాఁకలినిదీర్తువేని తృప్తుఁడనగుదును. నాకొంగుననుండువస్తువులతో పిమ్మట నాకేమిపనియున్నది. నీవీపదార్థములనంగీకరింపవేని నేనునీయింట భుజింపనని చెప్పఁగావిని నీళోబా తనభార్యనుబిలిచియీవిప్రుఁడు తెచ్చినపదార్థములనుదీసికొని యతనికి షడ్రసోపేతమగునన్నము పెట్టుమని నియమించెను. అందుకావిప్రుఁడు సంతసించి తనకొంగుననున్నవస్తువులను నీళోబాభార్యచేతికిచ్చియోతల్లీ! వివాహమునకయి నీభర్తనేకరించినపదార్థములతో ఈవస్తువులనుగలుపుమని చెప్పెను. ఆయువతియట్లుచేసియతనికి షడ్రసోపేతమగునన్నమునిడియతనియాఁకలినిమాన్పి పరితుష్టునింజేసెను. ఆబ్రాహ్మణుఁడు నాటిరాత్రియచటవసించి మఱునాఁడుదయమున నీళోబానుజూచి నీయింటివివాహమునకు నన్ను స్వయంపాకిగానుంచుకొనుము. నేనెందఱకయినన తిశీఘ్రముగ బహుభక్ష్యములతోడ పాకముచేసి వడ్డింపఁగలను. వేఱొకనిసాహాయ్యములేకయే కనుగలిగి సమస్తకార్యములను నేనొక్కఁడనే నిర్వహింతును. మీకేచింతయులేకుండునట్లు వివాహభారమునంతయు నేనేవహింతునని చెప్పఁగావిని నీళోబాసంతసించి యట్లుచేయుమని సమ్మతించెను. ఆబ్రాహ్మణుఁడు బహుభక్ష్యములతోడషడ్రసోపేతముగనన్నము పాకముచేసి వివాహమునకు వచ్చినవారికెల్లవడ్డించుచు తక్కినవివాహకార్యములనుసహితము తానే నిర్వహించుచువచ్చెను. ఆయింటనుండినపదార్థము లెంతనెలవుచేసినను కొఱఁతపడక పూర్వమువలెనుండెను. వివాహముపూర్తియగుపర్యంతము నీళోబాకేకార్యమునకును కుఱితయొకనియపేక్షలేకయుండెను. ఈయద్భుతమునుజూచి నీళో

బా నీవెవఁడవనియాబ్రాహ్మణునినడిగెను. అందుకాబ్రాహ్మణుఁడు నేనొంటివాఁడను. నాకనియొకచోటులేదు. నాయందుప్రీతిచేయువారలయందు నేనుప్రీతిచేయుచు వారలసేవకుఁడనయియుందును. నాపేరు శ్రీకృష్ణశాస్త్రి. నీవునాయందుప్రీతిచేసితివి. కాననేనునీయందత్యంతానురాగముతోఁగూడి యిచ్చటికార్యములనన్నింటిని నేనేనిర్వహించితిని. నాయందుబద్ధానురాగుఁడవయియుండునీకార్యములను నాకార్యములుగాభావించితినని చెప్పి నీళోబానుమున్నిడుకొనియమూల్యవస్త్రాదులచే పెండ్లికి వచ్చినబంధువులనుసంతోషింపించి కొంతదూరము వారలను వెంబడించి పోయి దారివిడిచి నీళోబాతోఁడనతనియింటప్రవేశించెను. అపుడునీళోబాయీబ్రాహ్మణుఁడు కేవలముమనుష్యుఁడనినేను నమ్మలేదు. ఇతఁడుకొంగునముడివేసితెచ్చినవస్తువులనింటిలోనుండినవస్తువులతోఁజేర్చినంతట నెంత సెలవుచేసినను అవికొంచెఁతపడకయభివృద్ధియగుచువచ్చెను. ఇతఁడహోరాత్రము విరామములేక కష్టపడినదియు, వివాహకార్యములనన్నింటిని తానొక్కఁడే నిర్వహించినదియు, నితనిశరీరమునఁగొంతయయినవాయాసములేకయుండినదియు, బంధువులకమూల్యములగువస్త్రాదులనిచ్చినదియు, మొదలుగాఁగలయితనికృత్యములతిమానుషములయియున్నవని తనలోచింతించి వివాహాంతమునందీమహానుభావునికి నూతనవస్త్రములిచ్చి గౌరవింపవలయునని తలఁచుచుండఁగా ఆబ్రాహ్మణుఁడదృశ్యుఁడయ్యెను. నీళోబాయెందు వెదకియునతనిఁగానకయిదియంతయు శ్రీపండరినాథునిలీలయని నిశ్చయించి పరమానందభరితుఁడయి (కేశవాయనమస్తేస్తు। నమోనారాయణాయచ। మాధవాయనమస్తుభ్యం। గోవిందాయనమోనమః॥ ఓమ్నమోవిష్ణవేదేవ। మధుసూదనతేనమః। త్రివిక్రమనమస్తుభ్యం। నమస్తేవామనాయచ॥ శ్రీధరాయనమస్తుభ్యం।హృషీకేశనమోస్తుతే। నమస్తేపద్మనాభాయ। నమోదామోదరాయచ॥ మత్స్యకూర్మవరాహాహి। హంసాశ్వశిరసేనమః। నమోస్తుజామదగ్న్యాయ। దత్తాయకపిలాయచ॥ వేదవ్యాసాయబుద్ధాయ। నరసింహాయతేనమః। రామలక్ష్మణశత్రుఘ్నభరతాత్మన్నమోస్తుతే॥ కృష్ణాయబలభద్రాయ। నమస్సాంబాయకల్కినే) అని బహువిధంబుల భగవంతునిస్తుతించి శ్రీపండరినాథా! నాకయి నీవేల పరిచారకవేషమును ధరించితివి. నీవునాసంసారభారమునువహించుటకన్న నన్నుసంసారవిముక్తునిఁజేసితివేని నీకాత్మలాభమును నాకీశ్వరలాభమునుసిద్ధించుననివిన్నవించి యాహారాదులు రుచింపక యారాత్రినిద్రించుచుండనితనిస్వప్నమున విఠ్ఠలనాథుఁడు సాక్షాత్కరించి యోవత్సా! నీవుశోకింపకుము. నేననవరతము నీచెంత వసించెదను. సూర్యసన్నిధిని చీఁకటి తలచూపనట్లు నాసన్నిధిని సంసారతిమిరము తలచూపదు. భయపడకుమని చెప్పియదృశ్యుఁడయ్యెను. ఇవుడును భీమనగరమున ఫాల్గునమాసశుక్లపక్షమునందీయద్భుతచరిత్రానుకారము మహోత్సవముగఁగొనియాడఁబడుచున్నది.

సత్యాంగతయేనమః.

## ఉద్ధవచిద్ఘనునిచరిత్రము.

ఉద్ధవచిద్ఘనుఁడనునతఁడు పరమభాగవతుఁడయి పరమభక్తియుక్తుఁడయి యనవరతమానందభరితుఁడయి భగవత్కీర్తనముచేయుచు తీర్థయాత్రాపరుఁడయి దేశాటనము

చేయుచుండును. ఇతఁడొకనాఁడొకయూరికిఁ బోఁగా నాయూరివారితనిజ్ఞానభక్తివైరాగ్యములకద్భుతమందియితఁడుచేయుభగవత్కీర్తనమును కర్ణామృతముగననుభవించియాయూరిలోకొన్నాళ్లు వాసముచేయవలయునని మిగులఁబ్రార్థించిరి. అపుడామహాత్ముఁడు వారలనుజూచి యోసాధులారా! నేటికి మూఁడవనాఁడు శ్రీరామజయంతివచ్చుచున్నది. నేనాయుత్సవమునకై ద్వారకకుఁబోవనపేక్షించియున్నానని చెప్పెను. అపుడు వారలుద్ధవచిద్ఘనునికి వందనముచేసియోభాగవతాగ్రగణ్యా! సర్వగతుఁడగు సర్వేశ్వరునిని అజ్ఞులుగాన లేరు. దేవరవంటిజ్ఞానపరిపూర్ణులకు భగవంతుఁడెందును సాక్షాత్కారమయియుండును గదా! కాననజ్ఞులగుమాబోటివారలుజ్జీవించుటకయి యిచటకొన్నాళ్లువేంచేసియుండిమాకు జ్ఞానోపదేశముచేయవలయునని ప్రార్థించెదము. శ్రీరామజయంతియుత్సవము నిచట విశేషముగఁగొనియాడవచ్చునని విన్నవింపఁగా వారలప్రార్థననంగీకరించియాయూరిలో నిలిచెను. ఆయూరిలోనుండినసాధువులందఱును జేరియొకరమ్యప్రదేశమునందు విశాలముగుపందిలివేసి యరఁటిప్రాకులు, తోరణములు, వితానములు, ధ్వజములు, చెఱకులు, నానావిధపుష్పములు, మొదలగువానిచేనలంకరించి స్థలశుద్ధిచేసి రంగవల్లులచేతను, పంచవర్ణములచేతను, భూమినంతయును శృంగారించిరి. అపుడుద్ధవచిద్ఘనుఁడు సంతోషచిత్తుఁడయి యాపందిలియందు శ్రీరామభద్రుని ప్రతిష్ఠించి బహువిధములుగనలంకరించియుత్సవమునకు ప్రారంభించెను. శ్రీరామోత్సవాంతమువఱకు ప్రతిదినము వాద్యఘోషములును, భక్తులుభగవంతునిఁ గీర్తించుఘోషములును సముద్రఘోషమునను కరించియుండెను. బ్రాహ్మణులును, దీనులును, యథేష్టముగ నన్నపానాదులచేనారాధింపఁబడుచుండిరి. అపుడు ఆదేశమునకొకతురుష్కుఁడు ప్రభువయియుండెనుగాన నాయూరిలోతురుష్కులధికముగ వాసముచేయుచుండిరి. వారలావిభవమునుజూచి యసూయపడి సహింపనివారయి రెండువేలతురుష్కులొకటియయివచ్చి యుత్సవమంటపముమీఁద పాషాణములను శల్యములు మొదలగునపరిశుద్ధపదార్థములను ప్రయోగించియంతంబోకలోపలప్రవేశించి యచటనుండినమంగళపదార్థములనెల్ల నేలపాలుచేసి పందిలిని బెఱికి పాఱవైచి సాధువులనదలించి వెళ్లఁగొట్టిరి. అపుడుద్ధవచిద్ఘనుఁడు వ్యసనాక్రాంతుఁడయి సాధుజనసంరక్షణబిరుదాంకుఁడగు భగవంతునిట్లనిస్తుతించెను. ఓస్వామీ! స్వభావమయి, యుత్కృష్టమయి, యుపమానరహితమయి, యుండునణిమాద్యష్టగుణములతోఁగూడిన యైశ్వర్యముగలనిన్ను నేనెట్లుస్తుతింతును. నీవుప్రకృతికంటెనధికుఁడగునాత్మస్వరూపివయి యాత్మలలోనధికుఁడగు ముక్తస్వరూపివయి యున్నాఁడవు. ఇంద్రియాదులకంటెనధికమగుప్రధానము నీయందుండికలిగెను. ఇట్టిబద్ధ, ముక్త, ప్రధానములకంటెనధికుఁడని చెప్పఁబడువాఁడునీవేగాన నేనునిన్నెట్లుస్తుతింపసమర్థుఁడనగుదును. ఎవనియందుండి బ్రహ్మ, రుద్రుఁడు, ఇంద్రుఁడు, చంద్రుఁడు, మరుత్తులు, అశ్వినులు, వసువులు, ఆదిత్యులు, మొదలగువారుకలిగిరోయట్టినిన్ను నేనెట్లు స్తుతింతును. స్వేచ్ఛచే దివ్యశరీరమును బరిగ్రహించినయెవనియొక్క యేకావయవమునందలి సూక్ష్మాంశమయి యీసకలలోకములున్నవో యట్టినిన్ను నేనెట్లుస్తుతింతును, మూర్తమయి, యమూర్తమయియుండు రూపముగలయెవనిపరమాత్మ స్వరూపమును బ్రహ్మాదిదేవతలెఱుఁగకున్నారో యట్టివాని నేనెట్లుస్తుతింతును? ఎవనినిపద్మగర్భాదిదేవతలు నందనవనము మొద

లగువానియందుండు దివ్యపుష్పగంధాదులచే నారాధింతురో యట్టివానినే నెట్లారాధింతును? యోగులందఱును సకలేంద్రియములను విషయవిముఖములుగఁ జేసి ధ్యానయోగముచే నెవనినర్చించుచున్నారో యట్టివానిని నెట్లర్చింతును? సనకాదిపరమయోగులెవనిస్వరూపమును ధ్యానముచే తమహృదయములయందు నిలిపి యహింస మొదలగు పుష్పములచేనర్చించుచున్నారో యట్టివానిని నేనెట్లర్చింతును? ఓదేవేశ్వరా! అత్యల్పుఁడనగు నేను సర్వోత్కృష్టుఁడవగు నిన్నర్చించుటకును, స్తుతించుటకును, సేవించుటకును, సామర్థ్యములేని వాఁడనయియున్నాఁడను. అయినను నీవు కేవలకృపచే నన్ననుగ్రహింపవలయునని భగవంతుని స్తుతించుచుండెను. అపుడు శ్రీరామభక్తాగ్రేసరుఁడగు నాంజనేయుఁడు భాగవతావమానమును సహింపక యాతురుష్కులమసీదుయొద్దకువచ్చి తనతోఁకను బెంచి యామసీదునకుఁ జుట్టిదానినిక్రిందద్రోయుటకు యత్నించెను. అపుడా యూరిలోనితురుష్కులు వేలకొలఁదిగ వచ్చి యతివిస్తారమగు మసీదులోఁగూర్చుండియుండిరి. అపుడాతురుష్కులలోనగ్రగణ్యుఁడయియుండిన యతఁడు మిక్కిలిబుద్ధిశాలి. కావున మారుతియుత్సాహము నెఱిఁగి యతనికివందనముచేసి యోస్వామీ! యిట్లుచేయుటకుఁ గారణమేమని యడిగిన వాతాత్మజుఁడాబుద్ధిశాలినిఁజూచి నిరపరాధులగు శ్రీరామదాసులవిషయమున కావలయునని యపరాధముచేసినవారిని శిక్షింపఁబూనుకొంటినని చెప్పెను. అందుకతఁడు భయపడితోడనే మసీదులోపలప్రవేశించి మారుతిపూనికను వారలకెఱుఁగించి మీరందఱుచటికయినను పాఱిపొండని చెప్పెను. అదివిని వారలు వీనికి పిచ్చిపట్టెనని పరిహాసముచేసి నవ్వుచుండిరి. ఇంతలో నాంజనేయుఁడు తనతోఁకచేఁజుట్టి యామసీదునీడ్చి నేలపాలుచేసెను. ఆమసీదువిఱిగి మీఁదపడినందున లోపలనుండినతురుష్కులందఱు మృతులైరి. ఈవృత్తాంతమును చారులవలనవిని దేశాధిపతియగు పాచ్ఛామిగులభయపడియుద్ధవచిద్ఘనునియొద్దకువచ్చి సాష్టాంగవందనముచేసి యోభాగవతోత్తమా! నిరపరాధివగు నీకపరాధముచేసిన తురుష్కులు మృతులైరి. వారలు నీవిషయమున నపరాధమును జేయఁదలఁచినది నేనెఱుఁగను. ఎఱిఁగియుండునేని వారికి హితముచెప్పివారించియుందును. కాననన్ను అనుగ్రహింపవలయునని ప్రార్థించెను. అపుడుద్ధవచిద్ఘనుఁడాతురుష్కప్రభువునుజూచి యోరాజా! ప్రజలు చేయుపాపమున రాజునకు భాగముగలదు. కాన రాజు జాగరూకుఁడై దుష్టులను శిక్షించుచు, సాధువులనరసి రక్షించుచుండవలయు. (పరిత్రాణాయ సాధూనాం। వినాశాయచదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ। సంభవామియుగేయుగే॥) అనఁగా సాధువులనురక్షించుటకును, దుష్టులనుశిక్షించుటకును, ధర్మమునుస్థాపించుటకును. నేను ప్రతియుగమునవతరించుచున్నానని భగవంతుఁడుచెప్పెను. (నావిష్ణుఃపృథివీపతిః) అనురీతిని రాష్ట్రాధిపతివిష్ణ్వంశముతోఁగూడినవాఁడు. కాన నీవు నీరాష్ట్రమునందలి దుష్టులను శిక్షింపక యుపేక్షించిన, నాదోషము నిన్నుఁజెందును. మనుజుఁడు తనచేఁజేయఁబడిన పుణ్యపాపములను, స్వర్గనరకములయందనుభవించి కర్మశేషముతోడ భూమియందు జనించి, పూర్వకర్మానుగుణమగు ఫలమునను భవించును. ఆకర్మపరిపాకము నెక్కింత చెప్పెదను వినుము. స్వామిద్రవ్యమునపహరించువాఁడెలుకయయి, పందియయి, పిదపకుక్కయయి, పుట్టును. పరదారగమనముచేసినవాఁడు శవములను భుజించునక్క, గ్రద్ద, మొదలగుజంతువయి పుట్టి, కడపటక్రిమి

యయి పుట్టును. తనకొమార్తె నొకనికిచ్చెదనని చెప్పియట్లుచేయక మఱియొకనికిచ్చువాఁడు పురుగయి పుట్టును. పితృకార్యమును జేయక భుజించువాఁడు కాకమయి పుట్టును. అన్న నుదిట్టినవాఁడు క్రౌంచపక్షియయి పుట్టును. బ్రాహ్మణస్త్రీనిఁ జెందినశూద్రుఁడు నరకపు గుంటయందు పుర్రుపయియుండును. ధనవాంఛచే నిరాయుధునిఁ జంపినవాఁడు గాడిద మొదలగుపెక్కుతిర్యగ్జననంబులనుబొంది తోడ్తోడ శస్త్రములచే మరణదశను జెందును. అన్నము, పెరుగు, పాలు, నేయి, భక్ష్యములు మొదలగుపదార్థములను దొంగిలించినవాఁడు ఈఁగ మొదలగుజంతువయి పుట్టును. ఫలములనుదొంగిలించినవాఁడు వానరమయి పుట్టును. ఇనుమునుదొంగిలించినవాఁడు వాయసమయి పుట్టును. వెండి నపహరించినవాఁడు గువ్వ యయి పుట్టును. బంగారు దొంగిలించినవాఁడు అల్పక్రిమియయి పుట్టును. వస్త్రమును ద్రుచ్చిలినవాఁడు కుందేలయి పుట్టును. ఒకఁడు తన్ను నమ్మి తనవశముచేసినసొమ్ము నప హరించువాఁడు చేఁప మొదలగునీచజంతువులయి పుట్టును. పరిమళవస్తువుల నపహరించిన వాఁడు చుంచుజన్మమునొందును. ఇట్లనేకపదార్థములనపహరించువారలకు బహువిధజన్మ ములు కలుగును. మునుజన్మమునపరులనిర్బంధమునకయి పరోపకారముచేసినవారు ఈ జన్మమునధనవంతులయ్యును మంచియన్నవస్త్రములననుభవింపకుందురు. పూర్వజన్మమున పాత్రజనులనుతామేపిలిచి ద్రవ్యాన్నవస్త్రాదులచేనాదరించినవారు ఈ పుట్టువున శ్రమపడక ద్రవ్యమును జెందుగురు. తొలిజన్మమునందడిగినయర్థులకు దాఁచకయిచ్చినవారు యత్నము చేధనమును జెందుదురు. మునుపటిజన్మమున యాచకులనలయించియేమియు నీయనిలోభులు ద్రవ్యలాభమునకయి ప్రయత్నపడియు ద్రవ్యమునుబోఁగొట్టుకొందురు. యౌవనమున దాన ముచేయక వార్ధక్యమున దానముచేసినవారు మఱుజన్మమున ముసలితనమున ద్రవ్యమును జెందుదురు. రోగమతిశయించి చచ్చునపుడు దానముచేసినవారు వెనుకటిజన్మమునధన వంతులయ్యును రోగపీడితులై భోగులుకాకయుందురు. మాంసభోజనమును వర్జించినవారు వెనుకటిజన్మమునందధికసౌందర్యవంతులైయుందురు. అంగహీనులనుబరిహసించినవారు వెను కటిపుట్టువున రూపహీనులయియుందురు. నిజభార్యైకరతులగువారు మఱియొకజన్మమున సౌభాగ్యవంతులైయుందురు. భార్యనుబోషింపనివారు మఱుజన్మమున సౌభాగ్యహీనులయి యుందురు. వినికిగలిగియు దానముచేయనివారు వెనుకటిపుట్టువునజ్ఞానవిజ్ఞానవంతులయ్యును పేదలైయుందురు. ప్రజ్ఞాహీనులయ్యును దీనులను రక్షించినవారు మఱియొకజన్మమున బుద్ధి హీనులయ్యును శ్రీమంతులయియుందురు. ఆచార్యభక్తిగలవారు మఱుజన్మమున విద్యావం తులయి శ్రోత్రియులై మేధావులయియుందురు. తొల్లి విద్యాగర్వముచే సభలయందుశిష్టు లనుభంగపఱిచిన వారిపుడు తమపాండిత్యమునితరులకు ప్రకటింపవలయునని వేడుకకలిగి విద్యాభ్యాసముచేసియు విద్యను జెందకయుందురు. పరిశుద్ధహృదయులయి సత్పాత్రమున దానముచేయుచు సత్యవంతులయి, కృపావంతులయియుండినవారీజన్మమున నాలుబిడ్డల తోడ ధనవంతులయి బహుభోగములననుభవించుచునారోగ్యవంతులయియుందురు. మును జన్మమున నాస్తికులయి క్రోధలోభయుక్తులయి పరపీడచేసినవారాలుబిడ్డలతోడ దారిద్ర్య మున ననుభవించుచు రోగపీడితులయియుందురు. యౌవనగర్వముచే కామాంధులయి పరకాం తల కెదుటసంచరించువారు మఱియొకజన్మమునందంధులగుదురు. శిష్టులనుకష్టవచనంబులచే

నెప్పించినవారు మఱియొకభవమున చెవులనెప్పితోఁగూడియుందురు. మునుజన్మమున విషమునుంచినవారిపుడు కడుపునెప్పితోఁగూడియుందురు. అన్యస్త్రీని, కన్యకను, ఆఁడు మృగములను కామాతురులై చెందువారు మఱుజన్మమున మర్మముననుపాధిగలిగి బాధపడుదురు. తొలిజన్మమున నిరపరాధులను బంధించి బాధపెట్టినవారు శరీరమున వాతబంధముచే పీడింపఁబడుదురు. సాధువులను కాలుసేతులువిఱిచి బాధించినవారు వెనుకటిజన్మమునకుంటివారగుదురు. మునుజన్మమునందశుచియగు పాదములతో దేవాలయమునందు ప్రవేశించిన వారును, తప్పులేకపరులను తన్నినవారును పాదరోగమును జెందిబాధపడుదురు. పూర్వము నిర్దయులయి వినోదార్థము జంతువులనలయించి చంపినవారు జ్వరము, గుల్మము, అతిసారము, రాచపుండు, మహోదరము, వాతపిత్తకఫరోగములు మొదలగువానిచే బాధింపఁబడుదురు. వర్తకముచేసి మంచిపదార్థములలో చెడ్డవస్తువులనుగలిపియు, తూనికలో మోసముచేసియు, ధనముసంపాదించినవారు మఱుజన్మమున గూనివారలుగను, మిగులగుజ్జువారలునుగాపుట్టుదురు. మునుపు సాధుజనులను మోసముచేసి వారలద్రవ్యమునపహరించినవారిపుడు పిచ్చివారగుదురు. పూర్వము పితృకార్యములను దూషించినవారును శిశువులను, జంపినవారును, ఇపుడు బిడ్డలులేనివారగుదురు. పూర్వజన్మమున వృషభమును బీజము పట్టినలిపినవారును, పరులకామసుఖమును జెఱిచినవారును భర్తనువంచించిధనముచేర్చిన స్త్రీలును మదముచే మఱియొకస్త్రీయొక్క భర్తనుస్వాధీనముచేసికొనినవనితయు ఈజన్మమున నపుంసకులగుదురు. గర్వముచే శిష్టులను పరిభవించినవారు ఈజన్మమున పరులకుదాసులయి, హేయమగుపనులు చేయుచుందురు. మునుజన్మమునగర్వితులయి, పరులనుతప్పులేక తిట్టికొట్టినవారు ఈజన్మమునపరులకు దాసులయియదల్పులచేతను, తిట్టులచేతను, దెబ్బలచేతను, పరిభవింపఁబడుదురు. తొల్లిభోగపరులయి, మాన్యజనులకవసరమీయనివారు ధనికుల గృహద్వారములయందు ద్వారపాలకులు తమ్ముఁబట్టిత్రోయుచుండ దైన్యమును జెంది దుఃఖపడుచుందురు. నిరపరాధికిక్రూరదండనను విధించినవారు మఱుజన్మమున రాజదండనను జెందుదురు. కరుణలేక పెక్కుప్రాణులనుజంపినవారు వెనుకటిజన్మమున బంధుజనసహితముగ నేకకాలమునఁదెగటారుదురు. ఓరాజా! పాపులయనుభవమును సంగ్రహముగఁజెప్పితిని. దేశమేలువాఁడు జాగరూకుఁడయి తనరాష్ట్రమునందలిప్రజలను సన్మార్గమునఁబ్రవర్తింపఁజేయవలయును. అట్లుచేయక యుపేక్షించురాజు ప్రజలపాపమున భాగమును జెంది నరకమును జెందును. పూర్వము రాజ్యమేలినవారు తమపుత్రులయిన నధర్మపరులగుదురేని వారలనుశిక్షించుచువచ్చిరి. ఇపుడు నీప్రభుత్వమునకులోఁబడినప్రజలుచేసిన మహాపరాధముచే నీవునరకమును జెందుటకు పాత్రుఁడవయియున్నాఁడవు. అయినను నీవనుతాపయుక్తుఁడవయినందున నిన్నురక్షింపవలయునని నాజీవితేశుఁడగు శ్రీరామభద్రునిని ప్రార్థించెదను. నీవిదిమొదలునీరాష్ట్రమునందలిప్రజలను కుమార్గంబునఁబ్రవర్తింపనీక శిక్షించుచు శాస్త్రవిశ్వాసములేక నాస్తికులగువారిని రాష్ట్రమునకు వెలుపలఁదఱిమి తక్కిన వారలను రక్షించుచు, జాగరూకుఁడవయియుండుమని చెప్పఁగా ఆప్రభువుద్ధవచిద్ఘనునికి ప్రదక్షిణనమస్కారంబులుచేసి నీవు నియమించినట్లు చేసెదనని విన్నవించియతనియనుగ్రహమును జెంది తురుష్కులభయముచే పలాయనమయినభాగవతులను రక్షించి యాదరించి

యెప్పటియట్లు శ్రీరామజయంతియుత్సవమును జరపవలయునని ప్రార్థించివలసినవస్తువుల నెల్లనపరిమితముగరప్పించియిచ్చెను. అపుడుద్ధవచిద్ఘనునిచే ప్రార్థింపఁబడి యాంజనేయుఁడు ప్రసన్నుఁడయి యోభాగవతోత్తమా! నీకయి ఈతురుష్కప్రభువునకును, వీని రాష్ట్రమునకును, కీడుచేయక మన్నించితినని చెప్పియదృశ్యుఁడయ్యెను. ఉద్ధవచిద్ఘనుఁడుత్సవమును పూర్తిచేసి యాయూరిలోకొన్నాళ్లు వసించియచటివారలకు భగవద్భక్తిని గలుగఁజేసియథేచ్ఛగయాత్రచేయుచుండెను.

శ్రీరామభద్రాయనమః.

---

## ఏఁబదియేడవయధ్యాయము.

### వీసోబావర్తకునిచరిత్రము.

పండరిక్షేత్రమునవాసముచేయుచుండిన వీసోబావర్తకుఁడుభగవంతునికిప్రియభక్తుఁడై యుండెను. ఇతనిభార్య భర్తకనువ్రతయయి మహాపతివ్రతయై యరుంధతియో, యనసూయయో, నాళాయనియో, సావిత్రియోయనిలోకులచేకొనియాడఁబడుచుండెను. ఈదంపతులకు నలువురును పుత్రులు కలిగియుండిరి. వీరలుపుండరీకునివలె తల్లిదండ్రులనే లక్ష్మీమాధవులని యధ్యవసించి భక్తిచేయుచుండిరి. వీసోబావర్తకుఁడు రంతిదేవను దర్శనులవలె నతిథులను హరిరూపులనుగాభావించి భక్తితోడనారాధించుచుండును. ఇతఁడు కర్మానుష్ఠానమున జనకచక్రవర్తికెని జ్ఞాననిష్ఠయందు భరతయోగికిని, భక్తియందు ప్రహ్లాదునికెని, ప్రపత్తియోగమున వసిష్ఠ, యాజ్ఞవల్క్య, శక్తి, హారీత, శుక, పరాశర, గార్గ్య, వ్యాస, శౌనకాదులకును, భగవన్నామసంకీర్తనమున తుంబురు, నారదాదులకును సాటియయియుండెను. ఇతఁడు సంసారముననుండియు (మిథిలాయాంప్రదీప్తాయాంనమే కించిత్ప్రదహ్యతి) అనినజనకచక్రవర్తివలెను, వారణాసియందుండిన తులాధారునివలెను, ఎందుననంటక నిస్పృహుఁడయియుండెను. (నిస్పృహస్యతృణంజగత్) అనురీతినిపరమవైరాగ్యశీలుఁడు జగత్తును తృణముగ భావించుచుండెను. మఱియు (ఆత్మవత్సర్వభూతాని। పరద్రవ్యాణిలోష్ఠవత్। మాతృవత్పరదారాన్చ। యఃపశ్యతిసపశ్యతి) అనురీతిని సమస్తభూతములనుతనవలెను, పరద్రవ్యమును మంటిగడ్డకుసమముగను, పరదారలను తల్లికిసమముగను, భావించుచు చేతనాచేతనరూపమగు సమస్తప్రపంచమును భగవత్స్వరూపముగా చూచుచుండెను.

సర్వభూతదయ, క్షాంతి, అనసూయ, శౌచము, అనాయాసము, మంగళము, అకార్పణ్యము, అస్పృహ అనునివిభగవద్భక్తునికి ముఖ్యలక్షణములయియుండును. (అబంధౌబంధువర్గేవా। మిత్రేద్వేష్టరివాతథా। ఆపన్నేరక్షితవ్యంతు। దయైషాసంప్రకీర్తితా) అనఁగా అబంధువును బంధువును శత్రునిని, మిత్రునిని సమముగభావించి వారలకాపత్తు కలిగినపుడురక్షించుట దయయనఁబడును. (బాహ్యేవాభ్యంతరేవాపి। దుఃఖఉత్పాదితే పరైః। నప్రకుప్యంతినోహంతి। సాక్షమాపరికీర్తితా) అనఁగా తనశరీరమునకయినను, మనసునకయినను పరులచే దుఃఖముకలుగఁజేయఁబడినపుడు వారలనుగోపగింపకయు,

బాధింపకయునుండుట క్షాంతియనఁబడును. (నగుణాన్ గుణినోహంతి। స్తౌతిమందగుణానపి। నాన్యదోషేషురమతే। సానసూయా ప్రకీ_ర్తితా) అనఁగాగుణవంతులగుణములను మిథ్య యనిచెప్పకయు, అల్పగుణముతోఁగూడినవారయినను అట్టివారలస్తుతించుచు, పరులదోషములనువిని సంతోషింపకయునుండుట అనసూయయనఁబడును. (అభక్ష్యపరిహారశ్చ। సంసర్గశ్చాప్యనిందితైః। స్వధర్మేచవ్యవస్థానం। శౌచమేతదుదాహృతం) అనఁగా శాస్త్రదుష్టములగు మద్యమాంసలశునగ్రంజనాదులగునభక్ష్యములను భుజింపక పరిహరించుటయు, అనిందితులగువారితో సహవాసముచేయుటయు, తమతమజాత్యాశ్రమధర్మములయందు నిలుకడను జెందియుండుటయు, శౌచమనఁబడును. (శరీరంపీడ్యతేయేన। సుశుభేనాపికర్మణా। అత్యంతంతన్నకర్తవ్యం। అనాయాసస్సఉచ్యతే) అనఁగా అవర్జనీయములగు నిత్యనైమిత్తికములు తప్పఁదక్కిన కార్యములు మిగులమంచివైనను వానిచేశరీరమునకుపీడ కలుగునేని యట్టివానినవశ్యము మానుట అనాయాసమనఁబడును. (ప్రశస్తాచరణంనిత్యం। అప్రశస్తవివర్జితం। ఏతద్ధిమంగళంప్రోక్తం। ఋషిభిస్తత్వదర్శిభిః) అనఁగాశాస్త్రవిహితములను నిర్బంధముగననుష్ఠించుటయు, శాస్త్రనిషిద్ధములనుసవాసనగ విడుచుటయు మంగళమనితత్వవిదులగుఋషులచే చెప్పఁబడియె. (స్తోకాదపిప్రదాతవ్యం। అదీనానాంతరాత్మనా। అహన్యహనియత్కించి। దకార్పణ్యస్సఉచ్యతే) అనఁగాబీదయైనను దైన్యమును జెందని మనసుతోడ ప్రతిదినము యథాశక్తి దీనులకు కించిత్కరించుచుండుట అకార్పణ్యమనఁబడును. (యథోత్పన్నైస్తుసంతోషః। కర్తవ్యస్స్వగతైర్ధనైః। పరార్థాన్ నాభిలాషేత। సాస్పృహాపరికీ_ర్తితా) అనఁగా కర్మానుగుణముగ తనకులభించినదానినిగొని సంతోషించుటయు, పరద్రవ్యమునపేక్షింపకుండుటయు అస్పృహయనిచెప్పఁబడును. ఈయెనిమిదిగుణములును వీసోబావ_ర్తకునియందుసాన్నిధ్యముచేసియుండెను.

ఒకప్పుడా దేశమున మహాక్షామము కలిగి యాహారమునకులేక ప్రజలుమిగులకష్టపడుచుండిరి. వీసోబావ_ర్తకుఁడు (వ్యసనేషుమనుష్యాణాం। భృశంభవతిదుఃఖితః) అనునీశ్వరస్వభావమువలె దీనజనులదుఃఖమునకు తానధికముగదుఃఖించి యట్టివారలనుపిలిచి శ్రీపాండురంగనిమూ_ర్తివిశేషములగు మిమ్ము నేనారాధించెద. మీరుచింతింపకుఁడని చెప్పి తనయొద్దనుండిన ద్రవ్యమునువారలకుపయోగించుచువచ్చెను. ఈవృత్తాంతమునువిని బహుదూరముననుండిన దీనజనులపరిమితముగ వచ్చుచుండిరి. దరిద్రునికెందఱు బిడ్డలుకలిగినను అందొకశిశువునయినను పేక్షింపక తానాఁకలికోర్చియయిన బిడ్డలనందఱిని రక్షించునట్లు వీసోబావ_ర్తకుఁడు చలింపక తనయొద్దకువచ్చువారినెల్ల నాదరించుచుండెను. ఇట్లుచేయుచుండ కొన్నాళ్లలో తనయొద్దనుండిన ద్రవ్యమంతయు వ్యయమయినందున ఆభరణములను; ఇంటనుండినలోహపాత్రములను విక్రయించి దీనులనారాధించుచువచ్చెను. ఈసజ్జనాగ్రేసరుని నడువడినిజూచి యాయూరిలోనుండిన వ_ర్తకులు పశ్చాత్తాపమును జెంది నీవిట్లుద్రవ్యమును వ్యయించుట న్యాయముకాదని వీసోబాకు చెప్పిరి. ఎందఱెన్ని చెప్పినను వినక వీసోబామొప్పటియట్లు దీనజనపోషణమున నేమఱకయుండెను. అప్పుడందఱును ఈవీసోబా మూర్ఖుఁడయియున్నాఁడని చెప్పి మౌనముగనుండిరి. కొందఱుబుద్ధిమంతులు పండరినాథుని యందు

స్తభరుఁడగు వీసోబాకు ప్రపంచధర్మమెట్లురుచించునని చెప్పిరి. మఱికొందఱు తత్త్వవేత్తలు
సూత్రధారిబొమ్మలనాడించునట్లు శ్రీమత్పండరినాథుఁడీమహానుభావు నిట్లాడించుచున్నాఁ
చెప్పిరి. కొన్నాళ్లలో సర్వమునువ్యయించి వీసోబాయన్నవస్త్రములకులేక మిగుల
ద్రుఁడయ్యెను. ఇతనికప్పిచ్చియుండిన కాశీపట్టణముననుండు నొకతురుష్కుఁడు వీసో
మిగులదరిద్రుఁడయ్యెననివిని తోడనేబయలుదేరివచ్చి తనద్రవ్యమును వడ్డితోఁ జెల్లింప
యుననని నిర్బంధించెను. అదివిని వీసోబా ఆతురుష్కునిఁజూచి యయ్యా! నాచేత
వ్యములేదు. కర్మానుగుణముగ నాకులభించియుండిన ద్రవ్యమునంతయునతిథిరూపియగు
గవంతునికి వినియోగించితిని. అయినను నీఋణమును నేనుదీర్పవలసినది యవశ్యకర్త
మయియున్నది. ఋణమును దీర్పకశరీరమునువిడిచిన వాడెంతపుణ్యరాశియయినను
రమముముక్షువయినను, వీనికిలోకాంతరమున గతిలేదు. ఋణమునుదీర్చినపిదపనే తనపు
్యముచే సాధింపఁబడినయుత్తమలోకములను పురుషుఁడు చెందును. ఋణము మోక్షము
కును విరోధియయియుండును. ఎంతవారయినను ఋణమునకయి మఱియొకజన్మమెత్తి
ఋణవిముక్తులయి పరిశుద్ధులుకావలయును. (యోగక్షేమంవహామ్యహం) అనురీతిని ఈశ్వ
ుఁడు పరమవైరాగ్యశీలుఁడగు వానియోగక్షేమమును తాను వహించియుండును గాననట్టి
పురుషుఁడు ఋణస్థుఁడయియుండునేని వానిరక్షణభారము వహించియుండెడి యీశ్వరుఁ
ేవాని ఋణమును తాను తీర్చుననుటయనుభవసిద్ధమయి శాస్త్రసమ్మతమయి యున్నది.
కబ్రాహ్మణుఁడు పాదరక్షలుకుట్టించుకొని దానిమూల్యమును మాదిగవానికీయక లోకాంత
మునకుపోఁగా మరణముచెందినయామాదిగవాఁడచటికిపోయి తన ఋణమునకై యతని
ాడలో పాదరక్షప్రమాణముగు చర్మమునుగోసి యీయవలయునని నిర్బంధింపఁగా నా
బ్రాహ్మణునిచే కావేరీతీరమున ప్రతిష్ఠింపఁబడియారాధింపఁబడినయశ్వత్థము బ్రహ్మచా
వేషమునుధరించుకొనిపోయి తనతొడయందుండి పాదరక్షాకృతిగచర్మముకోసిమాదిగవాని
చ్చి బ్రాహ్మణునిని ఋణవిముక్తునిఁజేసెనని తులాకావేరీమాహాత్మ్యమునఁ జెప్పఁబడియు
్నది. నృసింహోపాసకుఁడగు నొకభక్తునికయి శ్రీనృసింహస్వామికి ద్రవ్యముచెల్లించునట్లు
ప్రార్థనచేసికొన్న వారలస్వప్నమున నృసింహుఁడు సాక్షాత్కరించి మీరు నాకు చెల్లింపవల
న ద్రవ్యమును నాయుపాసకుని ఋణస్థులకు చెల్లింపుఁడని నియమించినచరిత్రము సుప్ర
ద్ధమయియున్నది. మఱియునిట్టివిచిత్రచరిత్రములనేకములు పురాణములయందు వినఁబ
ుచున్నవి. నేను శ్రీపండరినాథునిచరణారవిందములయందు న్యస్తభరుఁడనయియున్నాఁ
ను. కాననాభక్తవత్సలుఁడేవిధముననయినను నాఋణమును నివర్తింపించును. నీవునా
మాటనువిశ్వసించి నీయూరికిపొమ్ము. శ్రీవిఠ్ఠలనాథునికృపచే నెనిమిదిదినములలో నీయప్పను
తోడ నీయొద్దకుపంపెదనని చెప్పఁగా విని తురుష్కుఁడు నీవుసత్యవ్రతుఁడవని నే
ఁగుదును. అయినను మిగులదారిద్ర్యమును జెందియుండెడి యీస్థితియందు నీమాటలను
టకు నాకుధైర్యములేదు. ఇచటనుండుధనికులగువర్తకులనుగొనిచెప్పింతువేని నేనునా
రికిఁబోయెదనని చెప్పఁగావిని వీసోబా ధనవంతులగు వర్తకులను, తురుష్కునికిధైర్యము
ఁడని ప్రార్థించెను. శ్రీమంతులగువర్తకులు తురుష్కునిఁజూచి యయ్యా సూర్యచం
ులగతితప్పినను వీసోబామాటతప్పదు. ఇతఁడుభగవధ్ధ్యానముచేతన్నుమఱచియుండినను

ఇతనిపూనికను ఆశ్రితవత్సలుఁడగుశ్రీపండరినాథుఁడు నెఱవేర్చుననుట మాకు ప్రత్యక్షసిద్ధము. అనిచెప్పఁగావిని తురుష్కుఁడు ధైర్యమును జెంది తనయూరికిఁబోయెను.

అంత రామపురమునవాసముచేయుచుండిన బాబాయనునొకసిద్ధపురుషుఁడు శ్రీమత్పండరిపురమునకువచ్చెను. అతఁడువీసోబాచరిత్రమునువినియతనియధ్యవసాయము నెఱుఁగవలయునని జీర్ణమయిమిగులమాసినవస్త్రమునుధరించి శరీరముననడుమపూసికొని చేతనొకపెంకునెత్తుకొని వీసోబాయింటివాకిటవచ్చినిలిచి నాయాఁకలికన్నముకావలయునని యడిగెను. ఆశబ్దమును వినినంతట వీసోబా వెలుపటవచ్చియతనికి సాష్టాంగవందనముచేసి లోపలపిలుచుకొనిపోయిఁయాసనమునఁగూర్చుండఁబెట్టి యుష్ణతీర్థముచేస్నానముచేయించి యతనివస్త్రమునుతికియారవేసియిచ్చితనకుఁగలకొలఁదియన్నమునిడి తృప్తిపఱిచిమఱల వందనముచేసి శ్రీపుండరీకవరదుఁడు నేఁడీరూపముగావచ్చినన్ననుగ్రహించెనని సంతోషించెను. ఆసిద్ధపురుషుఁడు వీసోబాయొక్క యధ్యవసాయమునకు మిగులనాశ్చర్యపడియాసాధుజనాగ్రేసరునితనచెంతఁగూర్చుండఁబెట్టుకొని యోమహాత్మా! (సంసారవిషవృక్షస్య। ద్వేఫలేహ్యమృతోపమే। కదాచిత్కేశవేభక్తిః। తద్భక్తైర్వాసమాగమం) అనఁగా సంసారమనువిషవృక్షమునమృతోపమములగు ఫలములు రెండుగలవు. కాదాచిత్కముగనైనను కేశవునిభక్తిచేయుటయొకఫలము; తద్భక్తులసమాగమముమఱియొకఫలము. ఇందు రెండవది మిగులదుర్లభమైనది. నాభాగ్యవిశేషముచే నేఁడట్టి ఫలము లభించెను. వైష్ణవోత్తముఁడవగు నీవిషయమున యథాశక్తి కించిత్కారంపవలయుననిమనోరథించెదను. నీవు నిరపేక్షుఁడవని నేనెఱుంగుదును. ఇట్టినీకులోకమునందలి యైశ్వర్యములు సంతోషమునుగలుగఁజేయఁజాలవు. సామాన్యధనమునకన్న జ్ఞానధనముగొప్పది. అందుఆత్మజ్ఞానమునకన్ననీశ్వరజ్ఞానముశ్రేష్ఠమైనది. ఈశ్వరప్రభావము నెఱుఁగుటకన్న తదీయులప్రభావము నెఱుంగట యుత్తమోత్తమమైయుండును. సర్వోత్కృష్టమగుశ్రీవైష్ణవప్రభావమును నాయెఱుకకొలఁదివిన్నవించిపూర్వమిక్ష్వాకునకు జపఫలములనిచ్చి కౌశికుఁడును, కౌశికునకు యాగఫలమునర్పించి యిక్ష్వాకుఁడునుసంతసించినట్లు నేనానందమును గాంచెదను. అవధరింపుము. సప్తద్వీపములును, పాతాళాద్యధోలోకములును, ఊర్ధ్వలోకములును చేరినయీబ్రహ్మాండములోపల సూక్ష్మములును, సూక్ష్మములకన్న సూక్ష్మములును, స్థూలములును, స్థూలములకన్నస్థూలములుననగు ననేకప్రాణులువాసముచేయుచున్నవి. అతివిస్తారమగు బ్రహ్మాండమునందుఅంగుశమున నెనిమిదింటనొకభాగమైనను ప్రాణులచేనిండింపఁబడకయుండదు. ఈప్రాణులన్నియు కర్మవశముచేనిచటఁబుట్టి దేహాంతమున యమునికి వశ్యులై వానిచేనియమింపఁబడిన యాతనలననుభవించియాయనుభవాంతమున దేవాదియోనులందుఁబుట్టుచున్నారు. ఇట్లాత్మలు సంసృతిచక్రస్థులయిచుట్టుచున్నారనుటశాస్త్రసిద్ధమగువిషయము. ఇట్టిసంసారమునవైష్ణవులుమాత్రము యమవశ్యతను జెందకపరమవైష్ణవసాయుజ్యమును జెందుదురు. ఒకకాలమున పాశహస్తుఁడయి ప్రాణులనుదెచ్చుటకు బయలుదేరిన తనభటునిఁజూచి యమధర్మరాజు వానిచెవిని రహస్యముగనిట్లనిచెప్పెను. ఓభటుఁడా! శ్రీమధుసూదనప్రపన్నులను నీవుస్వ

ర్పింపకవిడిచిపెట్టుము. నేను తక్కినవారలకుప్రభుఁడనేకాని వైష్ణవులకు ప్రభువనుగాను. సకలదేవతలచే నారాధింపఁబడు సర్వేశ్వరునిచే నేను యమ నామమును జెందిసకలప్రాణుల పాపపుణ్యములను బరిశీలించునట్లు నియమింపఁబడియున్నాఁడను. అట్లగుటచే నేనా శ్రీహరికి వశ్యుఁడనే కాని స్వతంత్రుఁడను కాను. నాయధికారమున నేను దప్పితినేని నన్నా విష్ణువు దండించును. కటక, మకుట, కుండలాద్యనేకాభరణంబులయందు కారణమగు స్వర్ణ మొకటియై వ్యాపించియుండునట్లు సుర, నర, పశ్వాదిసకలకార్యవర్గములయందా శ్రీహరియొక్కఁడే వ్యాపించియున్నాఁడు. కానవాఁడే సర్వేశ్వరుఁడగుచున్నాఁడు. గాలిచే నెగరఁగొట్టఁబడిన భూరేణువులా వాయువణఁగినపుడు మరల భూమియందే లయించునట్లు భగవత్సంకల్పముచే కలిగినగుణవైషమ్యముచే నుత్పన్నములగు సురనరాదులా గుణవైషమ్యమణఁగినపుడు భగవంతునియందే లయింతురు. ఓభటుఁడా! వినుము సకలదేవతలచే నర్చింపఁబడు పాదపద్మములుగల శ్రీహరి నేమనుష్యుఁడు నిరుపాధికముగ సేవించుచుండునో, సకలపాపబంధవిముక్తుఁడగు నామనుజుని నీవు చూచునపుడాజ్యాహుతిచేయఁబడి జ్వలించుచుండు నగ్నిని జూచినట్లు చూచి దూరమున విడిచిపొమ్మని యమధర్మరాజు నియమింపఁగా నాకింకరుఁడు తనప్రభువును జూచి స్వామీ! ఆశ్రీవిష్ణుభక్తుఁడిట్టివాఁడని నేనెఱిఁగినడుచుకొనుటకై యా పురుషునిలక్షణములను దెలుపవలయునని యడుగఁగా యముఁడిట్లని చెప్పనారంభించెను. ఓభటుఁడా! వినుము. ఎవఁడు తనవర్ణాశ్రమధర్మములను భగవదాజ్ఞాకైంకర్యమని యధ్యవసించి తన్నిష్ఠుఁడై యుండునో, తనమిత్రునియందును, శత్రువునందును పక్షపాతములేకసమబుద్ధిగలవాఁడయి పరద్రవ్యాపహారముచేయక జీవహింసచేయక యుండునో, మిగుల పరిశుద్ధహృదయముగలయీ పురుషునిని విష్ణుభక్తునిఁగా తెలిసికొనుము. పరిశుద్ధజ్ఞానముగల యెవనిచిత్తము కలిసంబంధమగు రాగద్వేషాదిమలములచే మలినమును జెందక సదా శ్రీమన్నారాయణునికివాసస్థానమయి ప్రకాశించునో యామనుష్యునిని శ్రీజనార్దనుని పరమభక్తుఁడని తెలిసికొనుము. భక్తులహృదయకమలమున స్ఫటికమయమగు పర్వతమువలె నిర్మలుఁడై వేంచేసియుండు శ్రీవిష్ణువెక్కడ. మాత్సర్యాదిదోషము లెక్కడ. చల్లనిచంద్రకిరణములువ్యాపించియుండుచోటనగ్నియొక్కఁ కాంతి తలచూపదుగదా? ఎవనిహృదయమున శ్రీవాసుదేవుఁడు సన్నిధిచేసియుండునో యాపురుషుఁడు నిర్మలబుద్ధియై, మాత్సర్యాదిదోషరహితుఁడయి, పరమశాంతుఁడయి, సదాచారశీలుఁడయి, సకలప్రాణులకును మిత్రుఁడుయి, మధురముగను మితముగను మాటలాడువాఁడయి, గర్వమును వంచనయు లేనివాఁడయి ప్రకాశించును. ఆయనాదియగు భగవంతుఁ డెవనిహృదయమున వసించునో యాపురుషుఁడు లోకులకందఱికిని శాంతుఁడయి, ప్రసన్నముఖముతోఁగూడినవాఁడయి యగపడును. అదెట్లనిన 'లేఁతయయిన సాలవృక్షము తాను వసించుభూమియొక్క సారమును తన తలచే చూపుటదీనికి సదృశమయియుండును. అవ్యయుఁడయి యనాదియయిన భగవంతుఁడు శంఖచక్రాద్యాయుధసమేతుఁడయి యొకనిహృదయమున వసించునేని యాపురుషుని పాపమంతయు పాపవినాశనుఁడగు నాభగవంతునిచే నాశముచేయఁబడును. సూర్యుఁడుండుచోటనంధకారము తలచూపదుగదా. యమ నియమాదులచే పాపములను బోఁగొట్టుకొన్నవారయి శ్రీయచ్యుతునియందు లయించిన చిత్తముగలవారయి మదమాత్సర్యాదిదోషము నశించినవారయి

యుండు పురుషులనుజూతువేని నీవు మిగులదూరముగఁదొలఁగిపొమ్ము. ఏపురుషుఁడెవరును లేనియేకాంతస్థలమున పరద్రవ్యముగుస్వర్ణరాశి జ్వలించుచుండుటను జూచునపుడాప దార్థమును తృణముగఁదలఁచి స్పర్శింపకుండునో, మఱియు సర్వేశ్వరుఁడొకఁడు తప్ప వేఱొకపదార్థమును మనసుచే స్మరింపకుండునో, యట్టివానిని శ్రీవిష్ణుభక్తునిఁగా తెలిసికొనుము. ఇఁకను శ్రీవిష్ణుభక్తివిహీనుఁడగుపాపియొక్కలక్షణములను జెప్పెదనువినుము. ఎవఁడు ఎవ్విధంబుగనైనను పరద్రవ్యమునపహరించుచు, జీవహింసచేయుచు, కఠినముగమాటలాడు చు, వ్యర్థముగుమదమును జెంది చిత్తకాలుష్యముతోఁగూడియుండునో యట్టివాని హృదయ మున అనంతుఁడు వాసముచేయఁడు. ఎవఁడు మంచిబుద్ధిలేనివాఁడయి, పరులసంపదకు నసూయపడుచు, సత్పురుషులను దూషించుచు, భగవంతునారాధింపక, భాగవతవిషయ మున ద్రవ్యమును వినియోగింపకయుండునో యాయధముని మనస్సున శ్రీజనార్దనుఁడు వాసముచేయఁడు. ఎవఁడు బంధు, మిత్ర, కళత్ర, పుత్ర, జననీ, జనక, ప్రభృతులయందు వంచ నతోఁగూడినవాఁడయి, ద్రవ్యమునేగొప్పగఁదలఁచి పేరాసతోఁగూడియుండునో యాయ ధముఁడు శ్రీవిష్ణుభక్తుఁడు కాఁడని తెలిసికొనుము. ఎవఁడయోగ్యముగుతలంపును, అయో గ్యకార్యములయందాసక్తియు, అయోగ్యసహవాసముచేఁగలిగినయద్వితీయముగుమహిమ నుగలిగి, సదా పాపకర్మంబులను జేయుచు కాలమునుగడపుచుండునో యామనుష్యమృగ మును శ్రీవిష్ణుభక్తుఁడు కాఁడని తెలిసికొనుము. పరమపురుషుఁడును, పరమేశ్వరుఁడునగు శ్రీవాసుదేవుఁడొక్కఁడే తాను సకలప్రపంచమునగు శరీరమును కలవాఁడయియుండు నని శ్రీయనంతునియందెవరికి సర్వవ్యాపకత్వబుద్ధి స్థిరమయియుండునో యట్టిమహాపురుషు లనుజూచితివేని దూరముగాతొలఁగిపొమ్ము. కమలనయనా! వాసుదేవా! విష్ణో! ధరణిధరా! అచ్యుతా! శంఖచక్రపాణి! నీవు దాసభూతులగుమాకు శరణముకావలయునని యెవరు చెప్పు చుందురో యట్టిమహాపరిశుద్ధపురుషులను నీవు దృష్టించి చూడక దూరముగపాఱిపొమ్ము. వికారనాశాది రహితుఁడయి, సత్యజ్ఞానానందమయుఁడయి, ప్రకాశించు భగవంతుఁడెవని హృదయకమలమున వాసముచేయుచుండునో యామహాపురుషునికటాక్షము ప్రసరించు స్థలములయందెల్ల నీవుపోఁజనదు. నేనును పోఁగూడదు. మించిపోదుమేని యాభగవంతునిచక్ర ముయొక్క తేజోవిశేషముచే తూలాయమానమగుదుము. ఆమహాపురుషుఁడు శ్రీవైకుంఠ దివ్యలోకమునకు పోఁదగినవాఁడని సూర్యపుత్రుఁడగుయమధర్మరాజు తనభటునికి నియ మించి శ్రీవైష్ణవప్రభావమును ప్రకటనముచేసెను. ఈసంసారమహాసముద్రమున మగ్నులయి యుండుప్రాణులకు శ్రీమన్నారాయణుఁడు తప్ప వేఱొకయుజ్జీవనోపాయములేదు. ఎవఁడు భగవంతునియందాత్మసమర్పణముచేసియున్నాఁడో వానివిషయమున యమకింకరులయి నను, కాలదండమయినను, కాలపాశమయినను, యాతనాస్థానములైనను, ఏదియును- జేయనేరవు. పరమరహస్యమగు భాగవతధర్మమును ఆచార్యోపదిష్టమార్గముగ నీకు విన్నవిం చితిని. ఇందుచే నీకు నేనజ్ఞాతజ్ఞాపనముచేసినవాఁడను గాను. నీవిషయమున కించిత్కరింప వలయునని మనోరథించితిని గాన నాకాచార్యకృపాలబ్ధమగు జ్ఞానధనమున నతివిలక్షణ మగుభాగమును నీకే సమర్పించితిని. నన్ను మఱువకుండుము. పోయివచ్చెదనని చెప్పి వీసో బానియమునమును జెంది యథేచ్ఛగపోయెను. పిదప వీసోబా తానువర్తకునికి గడువుచెప్పిన

దినములలో నేటిక్కాఱుదినములు గడచిపోయెనని తనమనంబున కొంత క్లేశపడెను. అప్పుడు పరమకృపానిధియగు శ్రీపండరీనాథుఁడు తండ్రిఋణమును పుత్రుఁడు పనిబూనితీర్చునట్లు నన్నుగన్నతండ్రియగు శ్రీభక్తుని ఋణమును నేను దీర్చెదను. నాస్వరూపమునయినను చెఱచుకొని స్వభక్తులమాటను గాపాడుటనాకు ముఖ్యవ్రతమయియున్నది. ఆయుధమును తాఁకనని ప్రతిజ్ఞ చేసిన నేను నాభక్తుఁడగు భీష్ముని ప్రతిజ్ఞను గాపాడుటకయి భారతరణమున చక్రమునంటితినని తనలోననుకొని వీసోబా తురుష్కునికియ్యవలసిన యేడువందలవరాలను వడ్డితోడనొకసంచిలో కట్టి శిరసావహించుకొని వీసోబాయొక్క పరిచారకుని వేషమును ధరించి తురుష్కునియొద్దకుఁబోయి అయ్యా నేను వీసోబాయొక్క పరిచారకుఁడను. నాయజమానుఁడు నీకు చెల్లింపవలసిన యేడువందలవరాలను నాచేతికిచ్చి పంపెను. నీవు లెక్కను పరిష్కరించి యీద్రవ్యమునంగీకరించి నాయజమానుఁడు నీకు వ్రాసియిచ్చిన యప్పుపత్రమును నాచేతికిమ్మని చెప్పఁగావిని తురుష్కుఁడు సంతసించి వీసోబాసత్యమునుగొనియాడి నలుగురువర్తకులను జేర్చుకొని వడ్డితోడ లెక్కను పరిష్కరించి పరిచారకుఁడు తెచ్చిన ద్రవ్యమును దీసికొని వీసోబా తనకువ్రాసియిచ్చిన యప్పుపత్రమున నాకు చేరవలసినయేడువందల వరాలు వడ్డితోడ చెల్లింపఁబడెనని వ్రాసి చేవ్రాలుచేసి పరిచారకునిచేతికిచ్చెను. పరిచారకవేషధారియగు పండరినాథుఁడాపత్రమును దీసికొనివచ్చి వీసోబా ప్రతిదినము పారాయణముచేయు గీతాగ్రంథమున నునిచి యదృశ్యుఁడయ్యెను. మఱునాఁడు వీసోబా స్నానానుష్ఠానంబులను నెఱవేర్చి పారాయణమునకయి భగవద్గీతాపుస్తకమును విప్పఁగానందు తాను తురుష్కునికి వ్రాసియిచ్చినయప్పుపత్రముండెను. ఆపత్రమును జూడఁగా నందు నాకు చేరవలసిన ద్రవ్యము వడ్డితోడ నీపరిచారకుఁడు చెల్లించెనని తురుష్కుని చేవ్రాలతోడ వ్రాయఁబడియుండెను. ఇదిచూచి వీసోబా యాశ్చర్యపడి శ్రీపండరినాథుని సన్నిధికివచ్చి యతని యగ్రభాగమున నిలిచి యానందబాష్పములను విడుచుచు నిట్లని స్తుతించెను.

శ్రీపుండరీకాక్షా! దాసులకభయమిచ్చువాఁడా! నిత్యమగు దివ్యశరీరముకలవాఁడా! సర్వమునకు నంతర్యామియగువాఁడా! సకలభూతములను శరీరముగఁగలవాఁడా! సకలభూతములకు కర్తయయినవాఁడా! నీకు దండము సమర్పించెద. మనస్సు, బుద్ధి, ఇంద్రియములు అనువీనికి కర్తయయినవాఁడా! సమస్తకల్యాణగుణములచే పరిపూర్ణుఁడయి త్రిగుణాతీతుఁడగువాఁడా! శీతోష్ణాది బాధలు లేనివాఁడా! శుద్ధసత్త్వమయముగువాఁడా! తెలుపు మొదలగు వర్ణములును, నిడుపు మొదలగు పరిమాణములును నగు సకలవిధకల్పనలు లేనివాఁడా! ఉత్పత్తి మొదలగు వికారములచే స్పర్శింపఁబడనివాఁడా! స్వప్నము మొదలగు నవస్థలు లేనివాఁడా! నీకు దండము సమర్పించెద. అచ్యుతా! సంధ్య, రాత్రి, పగలు, భూమి, ఆకాశము, గాలి, జలము, అగ్ని, మనస్సు, బుద్ధి, భూతాదులు ఇవియన్నియు నీస్వరూపములయియున్నవి. ఓస్వామీ! లోకకర్తలగు చతుర్ముఖాదులకధిపతివగు నీవే బ్రహ్మాదినామములు గల నీదివ్యశరీరములనుగొని సృష్టిస్థితిసంహారములను జేయుచున్నాఁడవు. ఇంతియకాదు. దేవతలు, అసురులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు, పన్నగులు, కూశ్మాండములు, పిశాచములు, గంధర్వులు, మనుష్యులు, మృగములు, పక్షులు, సరీసృపములు, వృక్షములు, గుల్మ

ములు, లతలు, తృణములు మొదలగునవియు స్థూలములయి మధ్యమములయి సూక్ష్మత లయి సూక్ష్మములకంటె సూక్ష్మములయి బహువిధములయియుండురూపములతోను ఇ యన్నియు నీశరీరములయియున్నవి. పరమార్థము నెఱుఁగనీక భ్రమింపించుమాయ నీయ నమయియున్నది. ఇందుచే మూఢుఁడగువాఁడు అనాత్మను ఆత్మయనితలఁచిబంధింపఁబడు చున్నాఁడు. ఓస్వామి! అపదార్థమునందు పదార్థజ్ఞానమును, నేను, నాది యనునహంకా ర, మమకారములును సంసారమునకు తల్లియగు నీమాయయొక్క కార్యములై యున్నవి ఎవరు స్వధర్మమున సుస్థిరులయి నిన్నారాధించెదరో యట్టివారలు మాత్రము మోక్షప్రాప్తి యీమాయను దాఁటుటకు సమర్థులయియున్నారు. బ్రహ్మాదిదేవతలును మనుష్యాదులును నీమాయయనెడి పెద్దనుడిచే కల్పింపఁబడిన మోహాంధకారముచే కప్పఁబడియున్నారు లోకులు నిన్నారాధించి పలువిధములగుకోరికలను గోరుచున్నారేకాని తమకు సం వించియుండు సంసారముయొక్క నాశమును కోరకుండుట నీమాయాప్రభావమయియున్న ఇందుకు దృష్టాంతముచూడుము. నేను ఋణనివృత్తిని గోరితినే గాని సంసారనివృత్తినిగో నయితిని. ఇదిమాయావిలాసమే కాని వేఱు కాదు. ఒకఁడు కల్పవృక్షమును జెంది కాపీ మును యాచించునేని యదియాచించువానిదోషమే కాని కల్పవృక్షముయొక్క దోషమ కాదు. సకలలోకములనుమాయచే మోహింపించువాఁడా! అవ్యయా! సర్వేశ్వరా! జ్ఞా ముపలెతోఁచునట్టియీయజ్ఞానమును నీవు నాశముచేయవలయును. ఓభగవంతుఁడా! శ్రీపాం చజన్య, సుదర్శన, కౌమోదకీ, శార్ఙ్గ, నందక, హస్తుఁడవగు నీకు దండము సమర్పించెద. సర్వో త్తమా! స్థూలములు చిహ్నములతోఁగూడిన నీయొక్క స్థూలరూపమును జూచుచున్నాఁడనే గా నీసూక్ష్మరూపమును జూడనేర్చినవాఁడను గానయితిని. నావిషయమున ననుగ్రహింపుము స్తుతించి దేవాధిదేవా! నాఋణమునుదీర్చుటకయి నీవేల కష్టపడితివనియడుగఁగా శ్రీపండ నాథుఁడు ప్రసన్నుఁడయి యోవత్సా! నాభక్తులసంకటమును నివారించుట నాకు కృత మయియున్నది. నాకనవరతమిదియ కార్యమయియుండును. ఇందుకేగదా పుండరీకాగ్ర గ్రహావ్యాజముచే నేనీపంఢరీపురమున సన్నిధిచేసియున్నాఁడను. తురుష్కునికి ద్రవ్యమ చెల్లింపఁబడినందున నీవు ఋణవిముక్తుఁడవయితివి. నిన్నును, నీకు సుహృత్తులగువారిని విర దాఁటించుపర్యంతము నేను ఋణస్థుఁడనై యున్నాను. నేను భక్తిక్రీతుఁడనని వినిమెఱు గవే. నీభక్తినంగీకరించిననేను నీవిషయమునపడినఋణము నాకు తీర్పఁగూడనిదయియు న్నది. నిన్నును నీసుహృత్తులను విరజదాటించినపిదపను నాఋణముతీఱదు, నేనుయా దాత్మభావి నాదాసులకు దాసుఁడనయి యుందునని చెప్పఁగా విని పీపాజీ యానం దపరవశుఁడయ్యెను. సకలసాధువులును ఈవృత్తాంతమును విని శ్రీపండరినాథునిని పె ష్క ర్షంబులస్తుతియించి పీపాజీకు అంతేవాసులయియుండి యతనియభిమానముచే పరమ వైష్ణవసాయుజ్యమును జెందిరి.

సంకటహరణాయ నమః.